

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

**http://dwarkadheeshvastu.com**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక

## విష్ణు పర్వము

## భవిష్యపర్వము

ఓం నమో భగవతే వాసుదేవాయ నమః

# శ్రీ హరివంశ పురాణము

## శ్రీహరి వంశ మాహాత్మ్యము

## మొదటి అధ్యాయము

### గో వ్రతము

వినే విధానము :-

బ్రాహ్మణుడు నిత్యకృత్యములను తీర్చుకొని పురాణము చదువువానికి నమస్కరించి హరివంశ మాహాత్మ్యాన్ని వినాలి. బ్రాహ్మణులను ముందుంచుకొని అందరినీ పిలిచి పురాణము వినిపించాలి. వినువాడు శాస్త్రుడు సత్యమునే మాట్లాడే వాడుగా ఉండాలి. బ్రాహ్మణుడు పుత్రసంతానము కోరువాడైతే అర్థాన్ని తలుచు కుంటూ పురాణాన్ని చదవాలి. అందరి హృదయాలలో ఉండే నారాయణమూర్తికి నమస్కారం చేసి మహాభారతానికీ అర్జునునికీ/వారి లీలను ప్రకటించు సరస్వతీ దేవికీ మహర్షి వేదవేసుడికీ కూడ నమస్కరించాలి. ఆ వేదవ్యాసుని ముఖ పద్మము నుంచే వెలువడిన అమృతంలాంటి పురాణ వాఙ్మయాన్ని సమస్త జగత్తూ అను భవించుచున్నది. అజ్ఞానమనే చీకటిని తొలగించి జ్ఞానమనే నేత్రాన్ని తెరిపించే గురుదేవునికి నమస్కారము. అఖండమైన ప్రపంచాన్ని అంతనూ వ్యాపించిన

పరమాత్మ స్వరూపుడైన భగవంతుని చూపించిన గురుదేవునకు నమస్కారము. జనమేజయుడు వైశంపాయనుని ఇలా అడిగాడు.

ఓ మహాత్మా! పూర్వము మహాభారతమును వినే పద్ధతిని తెలిపియున్నావు. ఇప్పుడు హరివంశము వినే విధానాన్ని విశేషంగా నాకు తెలియజేయుము.

అప్పుడు వైశంపాయనుడిలా చెప్పాడు!

బ్రహ్మవిష్ణు మహేశ్వరుల స్వరూపమే హరివంశం. ఇది శబ్దరూపమైనది. శబ్ద బ్రహ్మస్వరూపమును బాగుగా గుర్తించినవాడు పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు. ఓ రాజోత్తమా! హరివంశ పురాణాన్ని వింటే శరీర వాఙ్మనస్సులతో చేసిన పాపాలు సూర్యోదయముచే చీకటిలాగా నశించిపోతాయి. విష్ణు భక్తుడైన వాడు పద్దెనిమిది పురాణాలను విన్న ఫలితాల్ని పొందుతాడు. స్త్రీలు పురుషులూ కూడ ఈ పురాణమును వినుట వలన శ్రీ వైకుంఠమును పొంద గలుగుతారు. జంబూద్వీపములోని మానవులు కలియుగంలో ఈ పురాణాన్ని వినేవారు తక్కువమంది.

ఓ రాజా! సత్యం చెపుతున్నాను పుత్రసంతానము కోరు స్త్రీలు శ్రీమహావిష్ణువు కీర్తిని వెల్లడించే ఈ పురాణాన్ని తప్పక వినాలి. పిల్లలను చంపేవాడు సంతానం కలవాడైనా ఆ సంతానం జీవించదు. ఇటువంటివాడు తప్పక హరి వంశమును విని తీరాలి. గురు చంద్ర అగ్నిసూర్యులకు ఎదురుగా మూత్రముగాని రేతస్సును గాని విడిచేవాడు వచ్చే జన్మలో నపుంసకుడవుతాడు. పువ్వులను, పండ్లనూ పాడు చేయునట్టిది. పిల్లలను చంపేదీ/అయిన స్త్రీ. పండ్లను కోయునది పిల్లలకు తల్లి దండ్రులను దూరం చేసేదీ/ఇతర స్త్రీకి గర్భం పోగొట్టేదీ, ఇటువంటి స్త్రీలతో సంబంధం గలదీ.

ఇలాంటి స్త్రీ ఐదు దోషాలు కలది అవుతుంది. 1. సమర్తాడక పోవుట, 2. పుట్టిన పిల్లలు చనిపోవుట, 3. ఒకే బిడ్డ గలది అవటం, 4. ఆడపిల్ల మాత్రమే కలుగుట, 5. గర్భము నిలవకపోవుట. ఈ దోషాలనన్నింటినీ నివారించటానికి నేనున్నానని హరి వంశం గర్జిస్తోంది. నన్ను శ్రద్ధగా వింటే అన్ని దోషాలూ నశిస్తాయని హరి వంశం చెపుతోంది. బంగారాన్ని, నేలని, తన స్థానాన్ని దానం చేసి హరి వంశాన్ని పదిమార్లు విన్నవాడు మగతనాన్ని సంపాదించుకో గలుగుతాడు. మరియు రజస్వల కానిది పదిమార్లు| పిల్లలు బ్రతకనిది ఏడుమార్లు, గర్భం నిలవనిది ఐదుమార్లు |ఒకే సంతానం కలది మూడుమార్లు ఆడపిల్లను మాత్రమే కన్నది.

ఒకమారు హరి వంశాన్ని వింటే ఆ దోషాలు నశిస్తాయి. దోషాలన్నీ నశించాలంటే బ్రతికున్నంత కాలం హరి వంశం వింటూ ఉండాలి. ఇటువంటి స్త్రీ మరుజన్మలో ఏ దోషాలూ లేనిదవుతుంది.

హరి వంశమును అర్థం చేసుకుంటూ చదవటం ఉత్తమం. అర్థం మీద దృష్టి లేకుండా చదవటం మధ్యరకం. అర్థదృష్టి లేకపోయినా పరిశుద్ధంగా చదవటం ఉత్తమంతో సమానమవుతుంది. ఈ లక్షణాలు వినటానికి కూడా వర్తిస్తాయి. ఈ పురాణాన్ని తొమ్మిది రోజులో చదవటం పూర్తిచేస్తే ఉత్తమము. 21 రోజుల్లో పూర్తి చేస్తే మధ్యమం, 31 రోజుల్లో పూర్తి చేయుట అధమము. ఈ మూడు పద్ధతులలో సుఖమైన పద్ధతి నవలంబించాలి. కలియుగంలో చాలా రోజులు వ్రతమాచరిస్తే ఫలితముంటుంది. కనుక నారాయణ స్వరూపుడైన వ్యాసమహర్షి దానినే బోధించాడు. తొమ్మిది రోజులు వినుట, 21 రోజులు వినుట కోరిన ఫలితాన్ని యిస్తాయని గర్జించి చెపుతున్నాయి. 31 రోజులు చేసే యజ్ఞం గొౌద్రాలితనాన్ని నశింపచేస్తుంది. రాజా! హరివంశం వినుట ప్రారంభించే యెడల ముందు భార్యాభర్తలు గోవ్రతం చేయాలి. వ్రతం చివర స్త్రీ పురుషులకు భోజనము పెట్టాలి. ఈ వ్రతానికి ప్రారంభంలో చేయవలసిన పనులను చెపుతున్నాను విను!

ప్రారంభించిన మొదలు ఒకనెల రోజులు వ్రతం చెయ్యాలి. చవితినాడు స్త్రీ ప్రొద్దునే లేచి గోవ్రతాన్ని సంతోషంతో అన్నపానాలను విడిచి నియమంగా చేయాలి. ప్రొద్దుట నుండి సాయంకాలం వరకూ ఈ శుభమైన వ్రతాన్ని చేయాలి. మేతకు వెళ్ళిన పశువులు ఇంటికి వచ్చేవరకూ అన్నం తినుట, మంచినీళ్ళు త్రాగుట చేయ రాదు. ఆవు ద్వారం వద్దకు వచ్చినపుడు దూడతోపాటు దానికి పూజ చేయాలి. తరువాత ఎక్కువ గడ్డిని దానికి ఆహారంగా ఇచ్చి తాను కూడ అన్నము తినాలి. ఈ విధంగా ఏ మాసంలోనైనా శుక్లపక్ష చవితినాడు స్త్రీ ఈ వ్రతాన్ని ప్రారంభించాలి. ఆ వ్రతాన్ని నెలదాకా కొనసాగించాలి. ఓ జనమేజయ మహారాజా! ఈ విధంగా స్త్రీ పురుషులకు ఈ వ్రతం చెప్పబడింది. ఈ విధంగా ఒకనెల వరకూ వ్రతం చేసినవాడు తప్పక ఉత్తముడైన పుత్రుని పొందుతాడు.

ఇది శ్రీమత్పద్మపురాణంలోని హరి వంశం మహాత్మ్యమును పురాణాన్ని వినే పద్ధతి మొదలగు విషయములను బోధించునట్టి

శ్రీహరి వంశములోని ఇది మొదటి అధ్యాయము

☆ ☆ ☆

# రెండవ అధ్యాయము

## వ్రతవిధానం- దాని ఫలము

తరువాత వైశంపాయనుడు తొమ్మిది రోజులు చేయు వ్రతమును ఈ విధముగా చెప్పాడు.

ఈ తొమ్మిది రోజుల వ్రతము సాధారణంగా చాలామంది సహాయం ఉంటేనే సాధ్యమౌతుంది. మొదటి జ్యోతిషపండితుని పిలిచి వ్రతానికి ముహూర్తమడిగి ఒక వివాహానికి కావలసినంత ధనాన్ని సమకూర్చుకొని భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక, మార్గశిర, ఆషాఢ, శ్రావణమాసములలో ఏదో ఒకదాని యందు వ్రతాన్ని ప్రారంభిస్తే కర్తయిష్టము ఫలిస్తుంది. పనియందు ఉత్సాహము కలవారిని సహాయంగా పెట్టుకోవాలి. ఇక్కడ కథ వినిపించబడుతుంది, సకుటుంబముగా అందరూ రావలసింది అని ప్రతిదేశానికి ప్రయత్న పూర్వకంగా వార్త పంపాలి. వేర్వేరు దేశాలలో ఉన్న విరక్తులైన విష్ణుభక్తులు నామ సంకీర్తన మందాసక్తి కలవారు. ఈ పురాణ శ్రవణ కార్యక్రమంలో పాల్గొనవలసినదిగా ఆహ్వానం పంపదగి యున్నారు. ఆహ్వానపత్ర మీవిధంగా వ్రాయాలి.

"సాధారణంగా సాధ్యంగాని సత్పురుషుల సమావేశం తొమ్మిదిరోజు లిక్కడ జరుగుతుంది. వచ్చేవారందరికీ నివాసస్థానములున్నాయి. పురాణకథ పవిత్రస్థలం లోనూ, వనంలోనూ లేక ఇంటిలోనైనా జరుగుతుంది." కథ వినిపించే స్థలం విశాల ప్రదేశామై ఉండాలి. ఆ స్థలాన్ని ఊడ్చి నీళ్ళుచల్లి, అలికి ముగ్గులు పెట్టి అలంకరించాలి. ఇంటిలో సమానులన్నిటినీ ఒక మూల సర్దిపెట్టాలి. కథ వినిపించటానికి ఒక ఎత్తైన మండపం తయారుచేయించాలి. ఆ మండపం అరటి స్తంభాలతో అలంకరించాలి.

పండ్లు, పువ్వులు, ఆకులతోనూ చాందినీతో ప్రకాశింప చేయాలి. తోరణము లతో ప్రకాశించు జండాలు కట్టాలి. పైన ఏడులోకాలు, క్రింద ఏడులోకాలు కల్పించాలి. వాటిలో వైరాగ్యం గల బ్రాహ్మణులను కూర్చొనబెట్టాలి. వారికి ఉత్తమ మైన ఆసనాలు ఏర్పరచాలి. పురాణము చెప్పు వానికి కూడ దివ్యమైన ఆసనం ఏర్పరచాలి. పురాణం చెప్పే వ్యక్తి ఉత్తరముఖంగాను, వినువారు తూర్పు ముఖం గానూ ఉండాలి. పురాణం చెప్పే వ్యక్తి ఉదాహరణములతో చెప్పటంలో నేర్పరియై

ధైర్యం గలవాడు, దయగలవాడుగా ఉండాలి. వేదము యొక్క, వేదాంతము యొక్క తత్త్వం తెలిసిన బ్రహ్మవాదులైన గురువులు ఉపదేశిస్తే వెంటనే ఫలిస్తుంది.

అలాకాక సామాన్యమానవులు నీతివేత్తలు గురువులై ఉపదేశిస్తే ఎలా ఫలం సిద్ధిస్తుంది? అనేక మతధర్మాలతో భ్రమపడినవారు, దొంగలు, నాస్తికవాదము చేసేవాళ్ళు ధర్మశాస్త్రము పురాణము చెప్పుటకు పనికిరారు. వారు పండితులైనా విడువదగినవారే. పురాణము చెప్పువాడి ప్రక్కన అతనికి సమానుడైన వాడిని కూర్చొనబెట్టాలి. అతడు పండితుడై సందేహాలను పోగొట్టగలిగి జనానికి విషయాన్ని బోధించ గలవాడై ఉండాలి.

ప్రతదినానికి ముందు రోజున పురాణవక్త క్షౌరం చేయించుకోవాలి. పురాణం చెప్పేవాడికి వినేవారికీ తారాబలం చంద్రబలం కుదరాలి. పురాణం వినేవాడు సూర్యోదయ సమయానికి కాలకృత్యములు తీర్చుకొని స్నానం చేయాలి. ప్రతి దినము సంధ్యావందనము మొదలగునవి కొంచెంగా చేసి చేతులు కాళ్ళు కడు క్కొని స్వస్తి వాచనముతో ఆవుపేడతో అలికిన ప్రదేశంలో సర్వతో భద్రమండలాన్ని తయారుచేసి తన శక్తి కొలది పూజించాలి. కథకు ఆటంకం కలుగకుండుటకు గణపతిని పూజించాలి. తరువాత భార్యాపుత్రులతో కూడిన శ్రీకృష్ణుని ఉంచాలి. విఘ్నాలు లేకుండుటకు కోరిక సిద్ధించటానికీ రుక్మిణీ ప్రద్యుమ్నాదులతో కూడిన శ్రీకృష్ణ పరమాత్మను పూజించాలి.

తరువాత సంకల్పం చెప్పి ఈ గోత్రము, ఈ ప్రవర, ఈ పేరుగల నాకు ఆయా జన్మలలో చేసిన మహాపాపములు నశించి సంతాన ప్రతిబంధకాలు తొలగాలి. ఈ జన్మలో సంతానం కలుగుటకూ ఆ సంతానం నూరు సంవత్సరాలు జీవించుటకు, నాకు అన్ని సుఖాలు సమకూడుటకు శరీరశుద్ధి కొరకు అధికమైన విష్ణుభక్తిచేత శ్రీ వైకుంఠమును పొంది భగవంతునితో సమానరూపాన్ని పొంద టానికీ శ్రీమత్ హరివంశ పురాణమును మేమిద్దరమూ చేస్తాము అని సంకల్పం చెప్పి, పురాణము చెప్పవలసినదిగా పండితుణ్ణి కోరాలి.

శాస్త్రపండితుడైన పౌరాణికుని - పురాణం చెప్పే వ్యక్తిని పూజించి బంగారు కుండలాలను, బంగారపు ఉంగరాన్ని, తలపాగను, తెల్లని వస్త్రాన్ని, కండువాను, పదహారు చిన్నాల బంగారమును, పుష్పములను, తాంబూలాన్ని, పోకచెక్కలను,

అక్షతలను పట్టుకొని ఈవేళ ఈ గోత్రము ఈ ప్రవర గల బ్రాహ్మణుని హరివంశం వినిపించవలసినదిగా దంపతులం మేము కోరుతున్నాము అని చెప్పాలి. పౌరాణికుడు కోరబడ్డానని చెప్పాలి. పౌరాణికుని కుడిచేతికి రక్షాబంధనం కట్టాలి. వినేవారు కూడ బ్రాహ్మణునిచేత రక్షాబంధనం కట్టించుకోవాలి. చందనము మొదలైన షోడశోపచారాలతో బంగారు అలంకారాలతో పోకచెక్కలను, పండ్లతో పురాణానికి పూజ చేయాలి. ఉత్తములైన బ్రాహ్మణులను పూజించి హరివంశమును వినటం కోరిన ఫలాన్ని యిస్తుంది. కనుక యధావిధిగా వెనుక చెప్పిన ప్రకారం ఈ పురాణమును వినవలెను. తరువాత వినువారందరూ వ్యాసుడికి నమస్కారం చేయాలి. ఆసమయంలో యజమాని ఇలా చెప్పాలి.

అన్ని శాస్త్రాలు తెలిసి బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపుడైన సత్యవతీ పుత్రుడగు ఓ వ్యాసభగవానుడా! నీకు నమస్కరిస్తున్నాను. ఇలా నమస్కరించి అందమైన పవిత్ర దర్భాసనం మీద కూర్చొని ప్రతిరోజూ ఉల్లాసంతో ప్రశాంతమైన మనస్సు కలిగి పురాణం వినాలి. పురాణం చెప్పే పండితుడు పిల్లవాడైనా, పడుచువాడైనా, ముసలివాడైనా దరిద్రుడుగాని బలహీనుడుకాని ఐనా అతనిని భక్తితో పూజించాలి. అతనిని తక్కువగా చూడకూడదు. ఎందుకనగా అతని నోటినుండి వెలువడే వాక్కు సమస్త ప్రాణులకు కామధేనువు. పుట్టుకచేత, గుణ సంపద చేత గొప్పవారి కంటే కూడ పురాణము చెప్పువాడు గొప్పవాడు కోట్లకొలది జన్మలను పొంది కష్టాలపాలయ్యేవారికి పుణ్యమైన భగవత్కథను వినిపించే ఆతని కంటే గొప్ప వాడెవడున్నాడు? పురాణము చెప్పు పండితుడు, పరిశుద్ధుడు ఇంద్రియ నిగ్రహము కలవాడు శాన్తుడు అసూయలేనివాడు, సజ్జనుడు, దయాశాలి వక్త అయి వుండి భగవత్కథను వినిపించాలి.

వ్యాసాసనముపై కూర్చొన్న పౌరాణికుడు పురాణము పూర్తి అయ్యేవరకూ మధ్యలో ఎవరికీ నమస్కారం చేయకూడదు. పొగరుబోతులు చెడునడవడి కలవారు ఇతరులను జయించాలని కోరువారు, కుటిలమైన ప్రవర్తన కలవారు, పురాణకథ వినకుండునట్లు చేయాలి. పండితుడు పవిత్రమైన నదియొడ్డున పురాణకథను చెప్పాలి. మంచిగ్రామంలో సజ్జనులు గల క్షేత్రంలోనూ దేవాలయ మందును పురాణమును వినిపించాలి. యోగ్యుడైన వానివలన విన్న పురాణకథ

సత్ఫలితాన్ని ఇస్తుంది. ఈ లోకమందు పరలోకంలోనూ పుణ్యాన్ని పుత్రసంతానాన్ని మహాపాప నాశనమును హరివంశ పురాణము కలుగజేస్తుంది. సంతానము మొదలగు పనులు సిద్ధించడానికి ఇంద్రియనిగ్రహము గలవారు ఈ పురాణకథను ఏర్పరచాలి. పాపములను నశింపచేసే ఈ పురాణమును శ్రద్ధగా వినాలి.

ఇది పద్మపురాణములోని హరివంశ మాహాత్మ్యమందలి పురాణమును వినే పద్ధతిని తెలియచేయు శ్రీహరివంశములోని ఇది రెండవ అధ్యాయము

☆☆☆

# మూడవ అధ్యాయము

## వినే పద్ధతి- దాని ఫలం

తరువాత వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

రాజా! విద్వాంసులు జపంకంటే పురాణమును వినటం గొప్పదని చెప్పారు. మొదట పితృదేవతలను తృప్తిపరచి తన పరిశుద్ధతకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. చక్కని మండపము తయారుచేసి దానిలో శ్రీకృష్ణుని స్థాపించాలి. తరువాత మంత్రముతో శ్రీకృష్ణుని పూజించాలి. పూజ చివరిలో ప్రదక్షిణాలు నమస్కారాలు స్తోత్రము చేయాలి. ఓ దయానిధీ! సంసార సముద్రంలో మునిగి దీనుడనైనట్టియు కర్మమనే మొసలిచే పట్టుకొనబడిన నన్ను సంసారసముద్రం నుంచి బయటకు తీసుకురమ్ము. అని ప్రార్థించాలి. తరువాత శ్రీహరివంశ పురాణానికి పూజచేయాలి. నిర్మలమైన మనస్సుతో స్తోత్రం చేయాలి. ఓ ప్రభూ! పుత్రసంతానము కొరకు నిన్ను శరణుజొచ్చాను. ఓ కేశవా! నీవు నాకోరికను ఏ విఘ్నమూ లేకుండ సఫలం చేయి. నేను నీ సేవకుడను. ఈ విధంగా ప్రార్థించి పౌరాణికుడికి వస్త్రములను, అలంకారములను సమర్పించి పూజ చేసిన తర్వాత అతనిని ఇలా స్తోత్రం చేయాలి.

శ్రీవ్యాస స్వరూపుడవైన మహానుభావా! నీవు పురాణము తెలియచెప్పుటలో సమర్థుడవు. అన్ని శాస్త్రములలోని విశేషములు తెలిసినవాడవు. ఈ పవిత్రమైన హరివంశకథను వినిపించి నా అజ్ఞానాన్ని తొలగించుము. తరువాత వక్త ఎదుట నియమాన్ని స్వీకరించి తొమ్మిది రోజులు శక్తి కొలది నియమాలను పాలిస్తాను. అని కథ మధ్యలో ఏ విఘ్నమూ రాకుండుటకు ఐదుగురు బ్రాహ్మణులను నియమించుకొని వారిచేత ద్వాదశాక్షర మంత్రజపం సంతానగోపాల మంత్రజపం, మహారుద్ర మంత్రజపం, పార్థివపూజ గణపతి మంత్రజపం చేయించాలి.

పిమ్మట అక్కడకు వచ్చిన బ్రాహ్మణులకు, వైష్ణవులకు, నామసంకీర్తనపరులకు, ఇతరులకు నమస్కారం చేసి పూజచేసి వారి అనుమతితో వినువారి ఆసనముపై కూర్చోవాలి. ఇల్లు ధనము సంపద మొదలగువాటిపై దృష్టి లేకుండా శుద్ధమైన మనస్సుతో కథయందే మనస్సును లగ్నం చేసినవారు గొప్ప ఫలితాన్ని పొందుతారు. కథవినే భార్యాభర్తలు పరిశుద్ధమైన మనస్సు గలవారై భక్తితో కథను వినవలెను. అన్ని ధర్మాలలోనూ శ్రద్ధయే తల్లివలె మేలు చేసేది. ఈ లోకంలో పరలోకంలోనూ శ్రద్ధయే కార్యసిద్ధిని కలుగజేస్తుంది. శ్రద్ధతో కొలిస్తే రాయి కూడ ఫలితాన్ని యిస్తుంది. భక్తితో పూజిస్తే మూర్ఖుడైనా జ్ఞానాన్నిచ్చే గురువౌతాడు. శ్రద్ధతో యంత్ర జపం చేస్తే వెంటనే ఫలితం కనిపిస్తుంది. శ్రద్ధతో పూజిస్తే దేవుడు నీచుడికి కూడ వరమిస్తాడు.

శ్రద్ధ లేకుండా చేసిన పూజ, దానం, యజ్ఞం, తపస్సు, వ్రతము మంకెన చెట్టుపూవు వలె నిష్ఫలములు. అన్ని విషయాలలోనూ సందేహించువాడు శ్రద్ధలేనివాడు, విలకడ లేనివాడు. పరమార్థం నుండి జారి సంసారము నుండి విడువబడడు. మంత్రం, తీర్థం, బ్రాహ్మణుడు, దేవుడు, జ్యోతిషుకుడు, మందు, గురువు మన భావమునుబట్టి ఫలమిస్తారు. కనుక ప్రపంచము భావమే ప్రధానంగా గలది. పుణ్యాపాపాల విషయం కూడ ఇట్టిదే. కనుక రాజా! అన్నివిధాల శ్రద్ధాభక్తులు కలిగిఉండాలి. వక్త అయిన పండితుడు సూర్యోదయము మొదలుగకొని మూడున్నర జాములు మధురగంభీర కంఠస్వరంతో కథను వినిపించాలి. మధ్యాహ్నము రెండు గడియల పాటు విరామము ఇవ్వాలి. తరువాత విష్ణుభక్తులు కథనసరించి నామ సంకీర్తన చేయాలి. ఈవిధంగా కథను వినినవాడు అన్ని కోరికలు తీరినవాడగును.

ఇది పద్మపురాణములో హరివంశ మహాత్మ్యమున వినవలసిన పద్ధతిని
తెలియచేయునట్టి శ్రీహరివంశములోని ఇది మూడవ అధ్యాయము

☆☆☆

# నాల్గవ అధ్యాయము

## వ్రత నియమాలు, విఘ్నము కలిగించిన స్త్రీకి నరకం

వైశంపాయనుడు మళ్ళీ ఈ విధంగా చెప్పాడు.

రాజా! తొమ్మిదిరోజులు వ్రతం చేసేవారికి నియమాలు చెపుతున్నాను విను. ఈ వ్రతం చేసేవాడు ఒకపూటే భోజనం చేయాలి. నేలపైనే పడుకొని నిద్రపోవాలి.

పురాణం పూర్తి అయ్యేవరకు బ్రహ్మచర్యంలో ఉండాలి. ఈ వ్రతంలో పాయసం కాని, నేయి మాత్రమే కలిపిన అన్నాన్ని కాని భోజనం చేయాలి. కథ వినే సమయంలో మలమూత్ర విసర్జన అవసరం లేకుండటకు తేలికైన ఆహారం తినాలి. ఇందువలన ఒకమారే భోజనం చేయడం మంచిది. శక్తి ఉంటే ఉపవాసం చేయవచ్చు లేదా నేతినో, పాలనో త్రాగి సుఖంగా వినవచ్చు. ఇలా ఆహారనియమం పాటించలేకపోతే ఫలహారమో, ఒకపూట భోజనమో చేసి వినవలెను.

ఈ కథను వినువాడు ఎల్లప్పుడు పవిత్రుడై ఏకాగ్ర మనస్సుతో వినటానికి కూర్చోవాలి. కథ వినే స్త్రీ, పిల్లలతోసహా స్నానము మొదలైన పనులు పూర్తి చేసుకొని మొదట శ్రీకృష్ణభగవానుని పూజ చేయాలి. తరువాత పురాణం వినాలి. ఏదైనా ఇష్టమైన ఫలితాన్ని కోరేవారు శ్రద్ధతో పుష్ప ధూప ఫలములను సమర్పించి మంచి నైవేద్యం ద్వారా గురువుకు పూజ చేయాలి. కథను విన్న తరువాత సాయంకాలం వరకు శుచిగా ఉండి బ్రహ్మచర్యాది నియమాలను పాటించాలి. బంధువులతో కూడ సాయంకాలమందు గురువును సంతోషపెట్టి రాత్రి సుఖంగా నిద్రించాలి. పాపాలు పోవటానికి నియమాలు తప్పక పాటించాలి.

ఎల్లప్పుడు విష్ణువును తలుచుకుంటూ నియమాలను పాటించాలి. పరిశుద్ధమైన మనస్సుతో ఆకులో భోజనం చేయాలి. కథ వినటం పూర్తి అయిన తరువాత నిత్యము భోజనం చేయాలి. పప్పు, తేనె, నూనె, వేడిఅన్నము, దుష్టభావంతో కూడిన పదార్థము చాలాసేపటి క్రింద వండినది, విడువదగిన వస్తువులు. మరియు వంకాయ, కొడిసెపండు, మిక్కిలి వేడిఅన్నము, చిన్న సెనగలు తూర్పారపట్టిన ధాన్యం, మాంసము విడిచిపెట్టాలి. మరియు నీరుల్లి, వెల్లుల్లి, ఇంగువ, ముల్లంగి, తెల్లఉల్లి, మెట్ట తామరదుంప, బూడిద గుమ్మడి, వ్రతంలో ఉన్నవాడు తినరాదు. కామ క్రోధ మదమానమత్సర లోభ దంభ మోహములనే దుర్గుణాలకు దూరంగా ఉండాలి.

వేదమును, వైష్ణవులను, బ్రాహ్మణులను, గురువును, గోసేవ చేసేవారిని, స్త్రీని, రాజును, గొప్పవారిని నిందించకూడదు. కథావ్రతంలో ఉన్నవాడు వెలపల ఉన్న స్త్రీ, చండాల, పాపాత్ములతో, గాయత్రి చేయనివాడు, బ్రాహ్మణద్రోహి, వేదమును నమ్మనివాడు, ఇట్టివారితో మాట్లాడకూడదు. ఈ వ్రతం చేసేవాడు సత్యము, పవిత్రత, దయ, మౌనము, సరళస్వభావము, వినయము, వీటిని పరిపాలించాలి. తన మనస్సును ఉదారముగా మంచుకొనవలెను.

పురాణం వినేవాళ్ళు శ్రద్ధాభక్తులు కలవారై ఇతర పనులపై ఆసక్తిని విడిచి మౌనమును పాటించి పరిశుద్ధులై స్థిమితమైన మనస్సు కలిగియున్నచో పుణ్యమును పొందుతారు. భక్తి లేకుండా ఈ పుణ్యకథను వినే అజ్ఞానులు పుణ్య ఫలం లేనివారై ప్రతిజన్మలోనూ దుఃఖాన్ని పొందుతారు. తాంబూలము మొదలగు వాటితో పురాణాన్ని పూజించి కథ వినేవాళ్ళు దరిద్రులుగాని, పాపాత్ములుగాని కారు. కథ చెప్పుచుండగా మరొక చోటకు వెళ్ళేవాళ్ళు సంపదను భార్యను కోల్పోతారు. పవిత్రమైన ఈ కథను తలగుడ్డతో వినేవాళ్ళు బెగ్గరుపక్షులుగా పుడతారు. తాంబూలం నములుతూ కథను వినేవాళ్ళు నరకంలో తన మలమును తినవలసిన వారౌతారు. అతని నోరు రజస్వల యోనివంటిదవుతుంది. ఎత్తైన ఆసనముపై కూర్చొని వినేవాళ్ళు చాలకాలము నరకము ననుభవించి కాకులై పుడతారు. వీరాసన శయ్యాసనములపైనుండి వినేవాళ్ళు మద్దిచెట్లుగా పుడతారు. నమస్కారం చేయకుండా వినేవాళ్ళు విషవృక్షాలవుతారు. పడుకొని వినేవాళ్ళు కొండచిలువగా జన్మిస్తారు. వక్రబుద్ధియై వక్తతో సమానంగా ఎత్తైన ఆసనంమీద కూర్చొని వినేవాడు గురుభార్యను పొందిన పాపముతో నరకాన్ని అనుభవిస్తాడు. పురాణం చెప్పే వానినిగాని, పురాణకథనుగాని నిందించేవారు వందమార్లు కుక్కగా పుడతారు.

కథ జరుగుతుండగా చెడుసమాధానం చెప్పినవాళ్ళు గాడిదలవుతారు. తరువాత తొండలవుతారు. ఎప్పుడూ పుణ్యకథను విననివారు ఘోరనరకములను అనుభవించి అడివికుక్కలవుతారు. కథ జరుగుతుండగా ఆటంకం కలిగించేవాళ్ళు కోటిసంవత్సరాలు నరకమనుభవించి ఊరకుక్కలుగా పుడతారు. మధ్యలో ఎవరితోనూ మాట్లాడకూడదు. మాట్లాడితే నరకం ప్రాప్తిస్తుంది. కథ జరుగుతుండగా పిల్లలను ముద్దాడకూడదు. పరిహాసపు మాటలు మాట్లాడరాదు. స్త్రీతో మాట్లాడ రాదు. కథ ఆగిపోయే పని చేయరాదు. కథను ఆపించితే బ్రహ్మహత్య సమానమైన పాపం పొందుతారు. కథ మధ్యలో ఇతర సంభాషణ చేయరాదు. అలాచేస్తే నరకం ప్రాప్తిస్తుంది. ఈ విషయంలో ఒక కథ చెపుతా విను!

పూర్వము జనస్థానంలో వేదపండితుడైన బ్రాహ్మణుడుండేవాడు. అతడు ధర్మశాస్త్రమందు నేర్పరి, సదాచార పరాయణుడును. అతడు గంగాస్నానంచేసి మధ్యాహ్నకార్యము పూర్తిచేసి దేవతార్చన ముగించి పురాణకథను వినుచున్నాడు. అతని భార్య మిక్కిలి చెడ్డది. కఠినురాలు. దెబ్బలాటపై ఆసక్తికలది. దొంగిలించి

ధనం సంపాదించేది. పెరుగు, పాలు, పంచదార, నేయి, వెన్న తెచ్చుకొని ఎవరూ లేనిచోట కూర్చొని తినేది. భర్తకి కేవలం అన్నం మాత్రమే పెట్టేది. చెడుపట్టుదల గలది. చెడ్డమనస్సు గలది. భర్తను ఎప్పుడూ నిందించేది. చాలపాపాలు చేసేది. ఇతరుల ఇళ్ళలో కూర్చొనేది. మంచిమాట మాట్లాడేదికాదు. శత్రువులకు క్షేమం కలుగచేసేది. కటువుగా మాట్లాడేది. అతిథులతో విరోధం పెట్టుకొనేది. ధర్మము నశింపచేసేది. సజ్జనుడు, గుణవంతుడు అయిన తనభర్త పురాణం వినేటప్పుడు అక్కడకు వెళ్ళి అతనిని నిందించేది.

నీవు సన్యాసిలాగా ఇక్కడ కథ వింటున్నావు. నీవిక్కడకు వచ్చి వ్యాసుడవై పోయావు. ఏ ఉద్యోగం లేనివాడా! ప్రతిరోజూ పిల్లలు తిండికి నన్ను బాధిస్తున్నారు. వాళ్ళ ఆహారానికి నేను ఏమి చేయగలను? ఇంట్లో కొంచం అన్నంగాని, గుడ్డగాని, డబ్బుగానిలేదు. నేనేంచెయ్యను? ఎక్కడకు వెళ్ళను? పాపాత్ముడైన బ్రహ్మ ఎలావ్రాశాడో? నాభర్త మూర్ఖుడు, సోమరి, దరిద్రుడు, కఠినుడు, ప్రేమలేనివాడు. పురాణకథ మీద ఆసక్తితో కూర్చున్నాడు. దుర్మార్గుడైన బ్రహ్మ నాకిటువంటి భర్తనిచ్చాడు. లోకంలో నేనొక్కతినే దౌర్భాగ్యురాలిని, దరిద్రుని యింటికి వచ్చాను. కడుపునిండా అన్నం ఎపుడు తిన్నానో! ఉద్యోగంచేసే భర్తలుగల స్త్రీలు సౌభాగ్య వతులు. ఆ భర్తలు ధనధాన్యములు మంచి అభివృద్ధిగలవారుగా శోభిస్తున్నారు. వాళ్ళు భార్యమాట వినేవాళ్ళు. పిల్లల పోషణలో ఆసక్తికలవాళ్ళు.

స్త్రీలకు సంతోషం కలిగిస్తూ నిత్యమూ ఇంట్లో ఉంటారు. మంచిఆహారమును తిని బలవంతులుగాను, భార్య ఆజ్ఞను శిరసావహించువారుగా ఉంటారు. వారికి కావలసిన పనిచేస్తారు. వాళ్ళు బుద్ధిమంతులు. ఇతడు మూర్ఖుడు, మందబుద్ధి, ఇంటివిషయం పట్టించుకోడు. ఇవేళ ఇంట్లో నూనె, కట్టెపుల్లలు, ఉప్పు, కూరలేవు. ధాన్యం కొంచమైనాలేదు. ఏంచేయను? నాభర్త ఇటువంటివాడు అని ధాన్యం మొదలైనవి ఇంట్లో ఉన్నప్పటికీ అసత్యం మాట్లాడుతూ తనభర్త కథ వినుచుండగా కఠినురాలైన ఆమె నిత్యమూ కథ వినకుండా చేసేది. కొంతకాలానికి ఆమె మరణించింది. యమదూతలామెను బంధించి యముని యింటికి తీసుకు పోయారు. అప్పుడు యముని ఆజ్ఞప్రకారము చిరకాలము నరకంలో పడవేయ బడింది. తరువాత ఆమె రాక్షసియై నీరులేని భయంకరమైన అరణ్యంలో ఆకలి దప్పులతో అలమటిస్తూ ఉన్నది. అందువలన భార్యగాని, భర్తగాని కథకు విఘ్నం కలిగించరాదు.

కథ వినుటకు విఘ్నం కలిగించేవాళ్ళు చాప, తుమ్మెద, దున్నపోతు, హంస, కొంగ, పిల్లి, కాకి, తోడేలు, గ్రద్ద, జలగ, బీటిచ్చిన కుండ, నీరు, శిల, నదివంటి వారగుటచేత ఈ పేర్లను పొందుతారు. దరిద్రుడు, క్షయరోగం గలవాడు, ఇతర ఏ రోగమైన కలవాడు భాగ్యహీనుడు పాపపు పనులు చేయువాడు, సంతానం లేనివాడు, మోక్షము కోరువాడు, ఈ హరివంశ కథను వినవలెను. మాచకమ్మ, ఒకే బిడ్డగలది, గొడ్రాలు, చనిపోయిన భర్త గలది, గర్భస్రావమైనది ఐన స్త్రీ ప్రయత్న పూర్వకంగా హరివంశ కథను విని తీరాలి. కథను వింటే మంచి కుమారుడు కలుగుతాడు. రాజా! వ్యాసుని మాట ఇది. శ్రీహరి కథను వింటే అన్ని కోరికలను తీర్చుకోవచ్చును.

ఇది పద్మపురాణమందలి హరివంశ మహాత్మ్యంలో కథను విను పద్ధతిని చెప్పే
శ్రీహరివంశములోని ఇది నాల్గవ అధ్యాయము

☆☆☆

# ఐదవ అధ్యాయము

## తొమ్మిది రోజుల పారాయణ - ఉద్యాపనం

తరువాత వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

ఇలా వ్రతం చేసి ఉద్యాపనము ఆచరించాలి. ఫలితము కోరు భక్తులు ఈ వ్రతముయొక్క ఉద్యాపనం కృష్ణాష్టమీ వ్రతోద్యాపనంలాగా చేయాలి. వ్రతం చేసినవారు డబ్బులేనివారైతే వారు ఉద్యాపనం చేయనక్కరలేదు. వారు కథను వినుటచేతనే పవిత్రులైన విష్ణుభక్తులౌతారు. ఇలా తొమ్మిది రోజుల యజ్ఞం పూర్తి యైన తరువాత విన్నవారు హరివంశపురాణ పుస్తకానికి, కథ చెప్పినవాడికి భక్తితో పూజ చేయాలి. ప్రసాదము, తులసిమాలలు, విన్నవారికి సమర్పించాలి. తరువాత మద్దెలతాళములతో అందమైన సంకీర్తనం చేయాలి. జయశబ్ద, నమస్కార శబ్దములు పలికి శంఖం పూరించాలి. బ్రాహ్మణులకు, యాచకులకు ధనము భోజనము పెట్టాలి. కథ విన్న తరువాత లక్ష్మీదేవితో కూడిన శ్రీహరియొక్క బంగారుమూర్తిని దానం చేయాలి. బిచ్చగాళ్ళకు వస్త్రమియ్యాలి. యథార్థము తెలిసిన మునులు ఈ విధానమును చెప్పినారు.

వ్రతమంతా పూర్తి అయిన తరువాత ఒక శుభమైన రోజున పట్టువస్త్రం ధరించాలి. బాగా అలంకరించుకొని, పురాణపుస్తకాన్ని గంధము, పుష్పమాలలతో

పూజించి పిండివంటలతో కూడిన భోజనమును నివేదన చేయాలి. బంగారం మొదలైన విలువ గల వస్తువులను దానం చేయాలి. పుణ్యమైన ఈ హరివంశ కథను వినిపించినవారు కోటి కల్పముల కాలము బ్రహ్మలోకంలో ఉంటారు. పురాణం చెప్పినవారికి ఆసనాలను కంబళ్ళను, చర్మాలను, వస్త్రాలను, మంచాలను, బల్లలను ఇచ్చేవాళ్ళు స్వర్గలోకము చేరి ఇష్టమైన భోగాలను అనుభవించి బ్రలోకము మొదలైన స్థానములందుండి ఆనందిస్తారు.

పురాణమునుకప్పుటకు వస్త్రం ఇచ్చేవాళ్ళు జ్ఞానవంతులవుతారు. మహా పాపములు, ఉపపాపములు చేసినవాళ్ళు పురాణం వినటం చేతనే పరమపదాన్ని పొందుతారు. హరివంశాన్ని వ్రాసి పురాణం చెప్పేవాడికి ఇస్తే భూదానం చేసిన ఫలితం కలుగుతుంది. హరివంశాన్ని పూర్తిగా వింటే రాజసూయాయాగము • అశ్వమేధయాగము చేసిన ఫలం ప్రాప్తిస్తుంది. అన్నివిధాలైన దానాలు చేసిన ఫలితం కలుగుతుంది. రాజసూయ అశ్వమేధయాగాలు ఆయా యుగాల్లో ఇచ్చే ఫలాన్ని కలియుగంలో హరివంశం వినుట చేతనే సమకూరుతుంది. శ్రద్ధ కలిగి ఆస్తికుడైన వాడు ఇంద్రియనిగ్రహం కలవాడై హరివంశాన్ని ప్రారంభిస్తే పాపాలు ఒణికి పోతాయి. విఘ్నాలు మండిపోతాయి.

హరివంశము మొదలుపెట్టి పూర్తి చేసినవాడు తాకితే చూచినప్పటికీ విష్ణు మూర్తిని చూచినఫలం కలుగుతుంది. హరివంశం విన్నవాడికి మూడు జన్మల పాపాలు నశిస్తాయి. కోరినఫలం ప్రాప్తిస్తుంది. హరివంశ కథను వినాలని కోరిక కలిగితే వాడు మహాపుణ్యాత్ముడని గ్రహించాలి. అన్ని పురాణాలు వేదాలు ధర్మ శాస్త్రాలు హరివంశపురాణంతో ముడిబడినట్లుగా వ్యాసమహర్షి రచించాడు. పౌరాణికుడు పాపాత్ములకు వేదములను పురాణ ధర్మశాస్త్రాలను నిందించేవారికి వినిపించకూడదు. పురాణం విని సంతోషించిన మనస్సుతో పౌరాణికుని పూజించాలి.

అక్షరాలను స్పష్టంగా పలికేవాడు మంచి జన్మవిద్యాసంస్కారాలు కలవాడు. కోపం లేనివాడు, వాదోపవాదాలు చేయనివాడగు వక్తకు పూజ చేయాలి. అతని వివాహానికి గ్రామదానం, కుండలాలు, తలపాగ, పుష్పమాల, చెప్పులు, గొడుగులు ఇవ్వాలి. గుఱ్ఱమును, ఏనుగును, వాహనాలుగా ఇవ్వాలి. పట్టుబట్టలు, మణులతో తయారైన ఆసనం ఇయ్యాలి. కుటుంబంతో కూడిన వానిని అలంకారాలతో అలంకరించి మంచి వస్త్రాలు ధరింపచేసి అతనిని వ్యాసమహర్షిగా భావించి

నమస్కరించాలి. అతడు సంతోషిస్తే దేవతలందరూ సంతోషిస్తారు. హరివంశము యొక్క ఫలితాన్ని కోరేవాళ్ళు డబ్బుకు కక్కుర్తిపడేవాళ్ళు కాకూడదు. బంగారు అలంకారాలు కల చక్కని ఆవును, దోడతో కూడ దానం చేయాలి. పౌరాణికుడు సంతోషిస్తే దేవతలు సంతోషిస్తారు. వాళ్ళు సంతోషిస్తే అనుకొన్న పని నెరవేరుతుంది.

హరి వంశమును పూర్తిగా విని పౌరాణికుని పూజిస్తే మానవుడు దేవఋషి పితృఋణాల నుండి విముక్తుడౌతాడు. అతని పితృదేవత నాశరహితములై లోకాలను పొంది సంతోషిస్తారు. హరి వంశ ప్రారంభంలోను, సమాప్తిలోనూ మానవుడు పాపాములు నశించి పితృదేవతలతోపాటు సంతోషిస్తాడు. ఇలా వ్రతం జరిపినట్లైతే మానవుడు సంతానమును పొందుతాడు. ధనము, ఆరోగ్యము, ఆయుస్సు, సౌభాగ్యము, గుణసపత్తిని, గౌరవమును పొందుతాడు ఇందులో సంశయము లేదు.

ఇది పద్మపురాణమందలి హరివంశ మాహాత్మ్యంలో పురాణం వినే పద్ధతిని చెప్పే
శ్రీ హరివంశములోని ఐదవ అధ్యాయము

☆☆☆

# అరవ అధ్యాయము

## పురాణ ప్రారంభానికి తగిన సమయం

జనమేజయుడు ఇలా అడిగాడు.

ఓ మునీశ్వరా! హరి వంశ కథవ్రత ఎలా ప్రారంభించాలి? పూజ ఎలా చెయ్యాలి? వ్యాసుని ఎలా విడిచిపెట్టాలి? మంచి ఫలితం ఎలా కలుగుతుంది? ఈ విషయాలనన్నింటినీ వివరంగ తెలియజేయుము. అప్పుడు వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

రాజా! గొడ్రాలు ఏవిధంగా తప్పక సంతానాన్ని పొందుతుందో చెప్పుతున్నాను విను!

వైశాఖమాసంలో, మాఘమాసంలో లేక ఆశ్వయుజమాసం లేదా మరొక శుభమైన నెలలో శుక్లపక్షం-పూర్ణ, భద్ర, జయ అనే తిథుల్లో - గురు, శుక్ర, బుధ వారములలో ఒక వారంనాడు- శ్రవణ, హస్త, పుష్యమి, మూల, పునర్వసు, ధనిష్ఠ, మృగశిర, రేవతి, అశ్వని నక్షత్రాలలో ఒక దానియందు సౌభాగ్యము మొదలైన శుభమైన యోగమునందు 'విష్టి' అనే దోషం లేని కరణమునందు, వినేవాడికి

చంద్ర బలం ఉన్న సమయంలో ప్రొద్దునగాని, మధ్యహ్నముగాని పురాణం చెప్పే విద్వాంసుడైన వక్త హరివంశ కథను ప్రారంభించాలి. మొదట గణపతి పూజ చెయ్యాలి. తరువాత కలశానికి గంధము, అగరువత్తులు, కర్పూరం, పండ్లు, తులసీదళాలు, మారేడుదళాలు, కొబ్బరికాయలు తెచ్చి పూజ చేయాలి. ఓ రాజా! పాటలు, నాట్యాలు ఏర్పరచి గొప్ప ఉత్సవం చెయ్యాలి. తరువాత పురాణపూజలో దానం చేసే పద్ధతిని చెపుతాను విను!

పురాణానికి పద్దెనిమిది వందల రూపాయలు దక్షిణ యివ్వాలి. లేకపోతే పన్నెండు వందలు. అంత కూడ ఇవ్వలేకపోతే ఆరువందల రూపాయలు ఇవ్వాలి. ఇవి వరుసగా ఉత్తమ, మధ్యమ, అధమదానాలు. తరువాత పట్టువస్త్రాలతో భార్యా భర్తలిరువురూ వ్యాసుడికి పూజ చేయాలి. అందమైన కుండలాలు ధరింపచేయాలి. కిరీటము, భుజకీర్తులు మొదలగు ఆభరణాలు అలంకరించాలి. దూడతో కూడిన చూడి ఆవులను దానం చేయాలి. గుర్రము మొదలైన వాహనములను, సేవకులను కూడ ఇవ్వాలి. ఆసనాన్ని ధూపదీప పాత్రలను, తలగడతోపాటు పరుపును, పాత్రలను, నేతిని, నూనెను సంవత్సరానికి సరిపడగా ఇయ్యాలి. వీటినన్నింటినీ వ్యాసాసనం మీద కూర్చున్న బ్రాహ్మణునకు ఇవ్వాలి. పురాణం చెప్పే వక్త ఆశీస్సును పొంది ప్రదక్షిణం చెయ్యాలి.

పురాణం వినటం పూర్తియైన తరువాత రుద్రజపం చేసిన బ్రాహ్మణుడికి వస్త్రాలు, ఉంగరం, కొత్తకంబళ్ళు, రాగిచెంబు ఇయ్యాలి. ప్రతి బ్రాహ్మణుడికీ ఎక్కువగా దక్షిణ ఇవ్వాలి. తరువాత స్నానం చేసిన గురువును, పురోహితుని వస్త్రములు మొదలైన వాటితో అలంకరించి దక్షిణలతో సంతోషపెట్టాలి. తరువాత ఇతర బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి పూజించాలి. శాంతి కొరకు హోమము కూడ చెయ్యాలి. ప్రతి శ్లోకం చదువుతూ కాని పదపవంతు శ్లోకాలను చదువుతూ కాని హోమం చెయ్యాలి. పాయసం, తేనె, నేయి, నువ్వులతో కలిపిన అన్నం హోమం చేసే వస్తువులుగా ఉండాలి. గాయత్రీ మంత్రంతోనైనా హోమం చేయవచ్చును. ఎందువల్లనంటే ఈ పురాణమంతా గాయత్రీమయమే కనుక. హోమం చేసే శక్తి లేకపోతే ఆ ఫలం సమకూరటానికి బంగారం దానం చెయ్యాలి.

ఈ కార్యక్రమంలో ఎక్కువ తక్కువలు దోషాలు లేకుండా చేయటానికి విష్ణు సహస్రనామం చదవాలి. ఇరవై నాలుగు దంపతులకు ఆదరంతో భోజనం పెట్టాలి. తరువాత గంధము, పూలమాలలు బ్రాహ్మణులకు అలంకరించి బంగారం

రత్నాలు మొదలైన వాటితో సంతోషపెట్టాలి. వాళ్ళు భోజనం చేసిన తరువాత పురాణం చదివే విద్వాంసుని అతని భార్యను భోజనం చేయించి, వస్త్రములు, అలంకారములనూ ఇచ్చి సంతోషపెట్టాలి. బ్రాహ్మణులు సంతోషిస్తే దేవతలు ప్రసన్నులవుతారు. పౌరాణికుడు సంతోషిస్తే విన్న వారికి శుభం సంతోషం చేకూరుతుంది. వ్రతం సంపూర్ణం కావటానికి బంగారాన్ని ఆవును ఇవ్వాలి. బంగారు సింహాసనం చేయించి దానిమీద వ్రాసిన పురాణాన్ని పెట్టి పూజించి గురువునకు ఇస్తే సంసారబంధాలనుండి విడువబడతాడు. ఈపురాణం అన్ని కోరికలనూ తీర్చేది.

ఈ విధంగా పురాణం పూర్తిచేస్తే వ్రతం చేసినవాడి భార్య ఒకనెలకు గర్భవతి అవుతుంది. వెనుక చెప్పిన విధంగా భక్తితో పూజ చేసిన స్త్రీ సూర్యునితో సమాన మైన తేజస్సు గల కుమారుని ప్రసవిస్తుంది. అట్లే గొడ్రాలు గర్భం ధరిస్తుంది. బ్రాహ్మణుని రత్నాని దొంగిలించినవాడు సంతానం లేనివాడవుతాడు. వాడు శుద్ధి కోసం మహా రుద్రజపం మొదలైనవి చేయాలి. ఇలా వైశంపాయనుడు చెప్పిన తరువాత జనమేజయ మహారాజు శుద్ధమైన మనస్సుతో హరి వంశాన్ని విని భక్తితో వ్యాసుని పూజించి అధికములైన దానాలు చేసి వ్యాసుని ఆశీస్సులు పొంది సంతోషముతో భార్యతో కూడినవాడై సుఖాలను అనుభవించాడు. హరి వంశాన్ని వినటం వలన వెనుకటి జన్మలోని పాపం నశించి అతని భార్య గర్భవతి వెంటనే కాగలదు. గొడ్రాలు గర్భం ధరించే పవిత్ర విధానాన్ని ఈ విధంగా వ్యాసమహర్షి చెప్పాడు.

ఈ వ్రతం చేసినవాడు తనకూ పూర్వము పది తరాలవారిని, తరువాత పదితరాల వారినీ మంచి లోకాలకు వెళ్ళునట్లు చేస్తాడు. ఈ హరివంశమును వినుటచే సమస్త పాపాలు నశిస్తాయి. పుత్రులు లేనివాడు పుత్రులను, ధనం లేనివాడు ధనాన్ని పొందుతాడు. నరమేధ అశ్వమేధయాగాల ఫలితాన్ని పొందుతాడు. బ్రాహ్మణుని చంపినవాడు. గర్భం పోగొట్టినవాడు గోవును చంపినవాడు, త్రాగుబోతు, గురువు భార్యను పొందినవాడు. ఒక్కమారు ఈ పురాణాన్ని వినటం చేత పవిత్రుడవుతాడు. గొప్పదైన ఈ శ్రీకృష్ణ మాహాత్మ్యాన్ని నేను నీకు వినిపించాను. ఈ పురాణం చదివినా విన్నా గొప్ప ఫలితాన్ని పొందుతారు.

ఇది శ్రీపద్మ పురాణంలో హరివంశ మాహాత్మ్యమందలి పారాయణ శ్రవణవిధి విధానవిధులను చెప్పిన శ్రీ హరివంశములోని ఇది అరవ అధ్యాయము హరివంశ మాహాత్మ్యము సమాప్తం.

☆☆☆

# సంతాన గోపాల స్తోత్రము

ఓం నమోభగవతే వాసుదేవాయ

శ్లో॥ శ్రీ శంకమలపత్రాక్షం దేవకీనందనం హరిం
సుతసంప్రాప్తయే కృష్ణం నమామి మధుసూదనమ్॥ 1
నమామ్యహం వాసుదేవం సుతసంప్రాప్తయేహరిమ్
యశోదాంకగతంబాలం గోపాలం నంద నందనమ్॥ 2
గోపాలం డింభకం వందే కమలాపతి మచ్యుతమ్
పుత్రసంప్రాప్తయే కృష్ణం నమామి యదుపుంగవమ్॥ 3
పుత్రకామేష్టి ఫలదం కంజాక్షం కమలాపతిమ్
దేవకీనందనం వందే సుతసంప్రాప్తయే మమ॥ 4
పద్మాపతే పద్మనేత్ర పద్మనాభ జనార్దన
దేహిమే తనయం శ్రీశ! వాసుదేవ జగత్పతే॥ 5
యశోదాంకగతం బాలం గోవిందం మునివందితమ్
అస్మాకం పుత్రలాభాయ నమామి శ్రీశమచ్యుతమ్॥ 6
శ్రీపతే దేవదేవేశ దీనార్తిహరణా! చ్యుత!
గోవింద! మే సుతం దేహి నమామి త్వాం జనార్దన॥ 7
భక్తకామద గోవింద! భక్తం రక్షశుభప్రద
దేహిమే తనయం కృష్ణ రుక్మిణీవల్లభ ప్రభో॥ 8
రుక్మిణీనాథ! సర్వేశ! దేహిమే తనయం సదా
భక్తమందార పద్మాక్ష త్వామహం శరణంగతః 9
దేవకీసుత! గోవింద వాసుదేవ జగత్పతే 10
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 11
వాసుదేవ జగద్వంద్య! శ్రీపతే పురుషోత్తమ
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 12
కంజాక్ష కమలానాథ! వరకారుణికోత్తమ
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 13
లక్ష్మీపతే పద్మనాభ! ముకుంద మునివందిత
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః 14

కార్యకారణరూపాయ వాసుదేవాయ తే సదా
నమామి పుత్రలాభార్థం సుఖదాయ బుధాయతే॥ 15
రాజీవనేత్ర శ్రీరామ! రావణారే హరేకవే
తుభ్యం నమామి దేవేశ తనయం దేహిమే హరే॥ 16
అస్మాకం పుత్రలాభాయ భజామి త్వాం జగత్పతే
దేహిమే తనయం కృష్ణ వాసుదేవ రమాపతే॥ 17
శ్రీమానినీమానచోర! గోపీవస్త్రాపహారక
దేహిమే తనయం కృష్ణ వాసుదేవ జగత్పతే॥ 18
అస్మాకం పుత్రసంప్రాప్తిం కురుష్వ యదునందన
రమాపతే వాసుదేవ ముకుంద మునివందిత॥ 19
వాసుదేవ సుతం దేహి తనయం దేహి మాధవ
పుత్రమ్మే దేహి శ్రీకృష్ణ వత్సం దేహి మహాప్రభో॥ 20
డింభకం దేహి శ్రీకృష్ణ! ఆత్మజం దేహి రాఘవ
భక్తమందారమే దేహి తనయం నందనందన॥ 21
నందనం దేహి మే కృష్ణ! వాసుదేవ జగత్పతే
కమలానాథ! గోవింద ముకుంద మునివందిత॥ 22
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
సుతం దేహి శ్రియం దేహి శ్రియం పుత్రం ప్రదేహిమే॥ 23
యశోదాస్త న్యపానజ్ఞం పిబన్తం యదునందనమ్
వందేహం పుత్రలాభార్థం కపిలాక్షం హరిం సదా॥ 24
నందనందన దేవేశ! నందనం దేహిమే ప్రభో
రమాపతే వాసుదేవ శ్రియం పుత్రం జగత్పతే॥ 25
పుత్రం శ్రియం శ్రియం పుత్రం పుత్రం మే దేహి మాధవ
అస్మాకం దీనవాక్యానాం అవధారయ శ్రీపతే॥ 26
గోపాలడింభ! గోవింద! వాసుదేవ రమాపతే
అస్మాకం డింభకం దేహి శ్రియం దేహి జగత్పదే॥ 27
మద్వాంఛిత ఫలం దేహి దేవకీనందనాచ్యుత
మమ పుత్రార్థితం ధన్యం కురుష్వ యదునందన॥ 28

యాచేహం త్వాం శ్రియంపుత్రం దేహిమే పుత్రసంపదమ్
భక్తచింతామణేరామ! కల్పవృక్ష మహాప్రభో॥ 29
ఆత్మజం నందనం పుత్రం కుమారం డింభకం సుతమ్
అర్భకం తనయం దేహి సదా మే రఘునందన॥ 30
వందే సంతానగోపాలం మాధవం భక్తకామదమ్
అస్మాకం పుత్ర సంప్రాప్త్యై సదా గోవింద మచ్యుతమ్॥ 31
ఓంకారయుక్తం గోపాలం శ్రీయుక్తం యదునందనమ్
క్లీంయుక్తం దేవకీపుత్రం నమామి యదునందనమ్॥ 32
వాసుదేవ ముకుందేశ! గోవింద మాధవాచ్యుత
దేహిమే తనయం కృష్ణ రమానాథ మహాప్రభో॥ 33
రాజీవనేత్ర గోవింద కపిలాక్ష హరేప్రభో
సమస్తకామ్యవరద! దేహిమే తనయం సదా॥ 34
అబ్జపద్మనిభం పద్మబృందరూప జగత్పతే
దేహిమే వర సత్పుత్రం రమానాయక మాధవ॥ 35
నందగోపాల ధరాపాల! గోవింద యదునందన
దేహిమే తనయం కృష్ణ! రుక్మిణీవల్లభ ప్రభో॥ 36
దాసమందార గోవింద ముకుంద మాధవాచ్యుత
గోపాల పుండరీకాక్ష దేహిమే తనయం శ్రియమ్॥ 37
యదునాయక! పద్మేశ! నందగోపవధూసుత
దేహిమే తనయం శ్రీధర ప్రాణనాయక॥ 38
అస్మాకం వాంఛితం దేహి దేహి పుత్రం రమాపతే
భగవన్ కృష్ణ సర్వేశ వాసుదేవ జగత్పతే॥ 39
రమాహృదయ సంభార సత్యభామా మనఃప్రియ
దేహిమే తనయం కృష్ణ రుక్మిణీవల్లభ ప్రభో॥ 40
చంద్రసూర్యాక్ష గోవింద పుండరీకాక్ష మాధవ
అస్మాకం భాగ్యసత్పుత్రం దేహి దేవజగత్పతే॥ 41
కారుణ్యరూప పద్మాక్ష పద్మనాభ సమర్చిత
దేహిమే తనయం కృష్ణ దేవకీనందనందన॥ 42

దేవకీసుత శ్రీనాథ వాసుదేవ జగత్పతే
సమస్తకామఫలద! దేహిమే తనయం సదా॥ 43
భక్తమందార గంభీర! శంకరాచ్యుత మాధవ
దేహిమే తనయం గోపబాల వత్సల శ్రీపతే॥ 44
శ్రీపతే వాసుదేవేశ దేవకీప్రియనందన
భక్తమందార! మేదేహి తనయం జగతాం ప్రభో॥ 45
జగన్నాథ! రమానాథ! భూమినాథ దయానిధే
వాసుదేవేశ సర్వేశ దేహిమే తనయం ప్రభో॥ 46
శ్రీనాథ కమలపత్రాక్ష వాసుదేవ జగత్పతే
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 47
దాసమందార గోవింద భక్తచింతామణే ప్రభో
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 48
శ్రీనాథ కమలపత్రాక్ష గోవింద మధుసూదన
మత్పుత్ర ఫలసిద్ధ్యర్థం భజామి త్వాం జనార్దన॥ 49
గోవింద పుండరీకాక్ష రమానాథ మహాప్రభో
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 50
స్తన్యం పిబన్తం జననీముఖాంబుజం
విలోక్య మందస్మిత ముజ్జ్వలాంగం
స్పృశన్తమన్య స్తనమంగులీభి ర్వందే
యశోదాంకగతం ముకుందమ్॥ 51
యాచేహం పుత్రసంతానం భవన్తం పద్మలోచన
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 52
అస్మాకం పుత్రసంపత్తే శ్చింతయామి జగత్పతే
శీఘ్రం మేదేహి దాతవ్యం భవతా మునివందిత॥ 53
వాసుదేవ జగన్నాథ! శ్రీపతే పురుషోత్తమ
కురుమాం దత్తపుత్రంచ కృష్ణ దేవేంద్రపూజిత॥ 54
కురుమాం పుత్రదత్తంచ యశోదాప్రియనందన
మహ్యంచ పుత్రసంతానం దాతవ్యం భవతాహరే॥ 55

వాసుదేవ జగన్నాథ గోవింద దేవకీసుత
దేహిమే తనయం రామ! కౌసల్యాప్రియనందన॥ 56
పద్మపత్రాక్ష గోవింద విష్ణో వామన! మాధవ!
దేహిమే తనయం సీతాప్రాణనాయక రాఘవ॥ 57
కంజాక్ష కృష్ణ దేవేంద్రమండిత మునివందిత
లక్ష్మణాగ్రజ శ్రీరామ దేహిమే తనయం సదా॥ 58
దేహిమే తనయం రామ దశరథ ప్రియనందన
సీతానాయక కంజాక్ష! ముచుకుంద వరప్రద॥ 59
విభీషణస్య యాలంకా ప్రదత్తా భవతాపురా
అస్మాకం తత్ప్రకారేణ తనయం దేహి మాధవ॥ 60
భవదీయ పదాంభోజే చిన్తయామి నిరన్తరమ్
దేహిమే తనయం సీతాప్రాణవల్లభ రాఘవ॥ 61
రామ మత్కామ్యవరద! పుత్రోత్పత్తి ఫలప్రద
దేహిమే తనయం శ్రీశ! కమలాసనవందిత॥ 62
రామ రాఘవ! సీతేశ! లక్ష్మణానుజ దేహిమే
భాగ్యవత్పుత్ర సంతానం దశరథాత్మజ శ్రీపతే॥ 63
దేవకీగర్భ సంజాత! యశోదాప్రియనందన
దేహిమే తనయం రామకృష్ణ గోపాల మాధవ॥ 64
కృష్ణ మాధవ గోవింద! వామనాచ్యుత శంకర
దేహిమే తనయం శ్రీశ! గోపబాలక నాయక॥ 65
గోపబాల మహాధన్య! గోవిందాచ్యుత మాధవ
దేహిమే తనయం కృష్ణ! వాసుదేవ జగత్పతే॥ 66
దిశతు దిశతు పుత్రం దేవకీనందనోయం
దిశతు దిశతు మహ్యాం భాగ్యవత్పుత్ర లాభమ్
దిశతు దిశతు శ్రీశో రాఘవో రామచంద్రో
దిశతు దిశతుపుత్రం వంశవిస్తారహేతోః॥ 67
దీయతాం వాసుదేవేన తనయో మత్ప్రియ స్సుతః
కుమారోనందన స్సీతానాయకేన సదా మమ॥ 68

రామ రాఘవ గోవింద! దేవకీ సుత మాధవ
దేహిమే తనయం శ్రీశ! గోపబాలక నాయక!॥ 69
వంశ విస్తారకం పుత్రం దేహిమే మధుసూదన।
సుతం దేహి సుతం దేహి త్వామహం శరణం గతః॥ 70
మమాభీష్ట సుతం దేహి కంసారే మాధవాచ్యుత
సుతం దేహి సుతం దేహి త్వామహం-శరణంగతః॥ 71
చంద్రార్క కల్పపర్యంతం తనయం దేహి మాధవ
సుతం దేహి సుతందేహి త్వామహం శరణంగతః॥ 72
విద్యావంతం బుద్ధిమంతం శ్రీమంతం తనయం సదా।
దేహిమే తనయం కృష్ణ దేవకీనందన ప్రభో॥ 73
నమామి త్వాం పద్మనేత్ర! సుతలాభాయ కామదమ్।
ముకుందం పుండరీకాక్షం గోవిందం మధుసూదనమ్॥ 74
భగవన్ కృష్ణ గోవింద! సర్వకామఫలప్రద।
దేహిమే తనయం స్వామిన్ త్వామహం శరణంగతః॥ 75
స్వామిస్త్వం భగవన్రామ! కృష్ణ మాధవ కామద।
దేహిమే తనయం స్వామిన్ త్వామహం శరణంగతః॥ 76
తనయం దేహి గోవింద కంజాక్ష కమలాపతే।
సుతం దేహి సుతం దేహి త్వామహం శరణంగతః॥ 77
పద్మాపతే పద్మనేత్ర! ప్రద్యుమ్న జనకప్రభో।
సుతం దేహి సుతందేహి త్వామహం శరణంగతః॥ 78
శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గపాణే రమాపతే।
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః 79
నారాయణ రమానాథ రాజీవదళలోచన!
సుతం మేదేహి దేవేశ పద్మపద్మానువందిత॥ 80
రామ రాఘవ గోవింద దేవకీనందన ప్రభో
రుక్మిణీనాథ సర్వేశ నారదాది సురార్చిత॥ 81
దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే
దేహిమే తనయం శ్రీశ గోపబాలకనాయక॥ 82

మునివందిత గోవింద రుక్మిణీవల్లభ ప్రభో
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః 83
గోపికార్జిత పంకేజ మరందాసక్తమానస
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 84
రమాహృదయ పంకేజలోల మాధవకామద
మమాభీష్టసుతం దేహి త్వామహం శరణంగతః॥ 85
వాసుదేవ రమానాథ దాసానాం మంగళప్రద
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 86
కళ్యాణప్రద గోవింద మురారే మునివందిత
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 87
పుత్రప్రద ముకుందేశ రుక్మిణీవల్లభ ప్రభో
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 88
పుండరీకాక్ష గోవింద వాసుదేవ జగత్పతే
దేహిమే తనయం కృష్ణ వాసుదేవ జగత్పతే॥ 89
దయానిధే వాసుదేవ ముకుంద మునివందిత
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 90
పుత్రసంపత్ప్రదాతారం గోవిందం దేవపూజితమ్
వందామహే సదాకృష్ణం పుత్రలాభప్రదాయినమ్॥ 91
కారుణ్యనిధయే గోపీవల్లభాయ మురారయే
నమస్తే పుత్రలాభార్థం దేహిమే తనయం విభో॥ 92
నమస్తస్మై రమేశాయ రుక్మిణీవల్లభాయతే
దేహిమే తనయం శ్రీశ! గోపబాలకనాయక॥ 93
నమస్తే వాసుదేవాయ నిత్యశ్రీకాముకాయచ
పుత్రదాయచ సర్పేంద్రశాయినే రంగశాయినే॥ 94
రంగశాయిన్ రమానాథ మంగళప్రద మాధవ
దేహిమే తనయం శ్రీశ గోపబాలకనాయక॥ 95
దాసస్యమే సుతం దేహి దీనమందార రాఘవ 96

సుతం దేహి సుతం దేహి పుత్రం దేహి రమాపతే 97
యశోదాతనయాభీష్ట పుత్రదానరత స్సదా
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 98
మదిష్టదేవ గోవింద వాసుదేవ జనార్దన
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥ 99
నీతిమాన్ ధనవాన్ పుత్రో విద్యావాంశ్చ ప్రజాయతే
భగవంస్త్వ త్కృపాయాశ్చ వాసుదేవేన్ద్ర పూజిత॥ 100
యఃపఠేత్ పుత్రశతకం సోపి సత్పుత్రవాన్ భవేత్
శ్రీవాసుదేవ కథితం స్తోత్రరత్నం సుఖాయచ॥ 101
జపకాలే పఠేన్నిత్యం పుత్రలాభం ధనం శ్రియమ్
ఐశ్వర్యం రాజసంపన్నం సద్యోయాతి న సంశయః॥ 102

శ్రీ సంతానగోపాల స్తోత్రము సంపూర్ణము.

## శ్రీ సంతాన గోపాల మంత్ర జప విధానము

ఈక్రింది వాక్యాలు చదివి వినియోగం చేయాలి.

అస్యశ్రీ సంతానగోపాలమంత్రస్య శ్రీనారదఋషిః, అనుష్టుప్ ఛన్దః, శ్రీకృష్ణో దేవతా, గ్లాంబీజం, నమః శక్తిః, పుత్రార్థే జపే వినియోగః॥

### అంగన్యాసము

'దేవకీసుతగోవింద' హృదయాయనమః. కుడిచేతితో హృదయాన్ని తాకాలి. 'వాసుదేవజగత్పతే' శిరసేస్వాహా అని, శిరస్సును చేతితో తాకాలి. 'దేహిమే తనయం కృష్ణ' శిఖాయైవషట్ అని చేతితో శిఖను తాకాలి. 'త్వామహం శరణంగతః కవచాయ హుమ్' అని రెండు బుజాలను తాకాలి. 'ఓం అస్త్రాయఫట్' అని ఎడమచేతిలో కుడి అరచేతిని వేయాలి. తరువాత ఈ శ్లోకాలతో ధ్యానం చేయాలి.

శ్లో॥ వైకుంఠాదాగతం కృష్ణం రథస్థం కరుణానిధిమ్
కిరీటి సారథిం పుత్రమానయంతం పరాత్పరమ్
ఆదాయతం జలస్థంచ గురవే వైదికాయచ
అర్పయన్తం మహాభాగం ధ్యాయేత్ పుత్రార్థమచ్యుతమ్॥

దయాశాలియైన పరమాత్మ వైకుంఠంనుండి వచ్చి శ్రీకృష్ణుడుగా అవతరించి అర్జునునకు సారధియై నీటియందున్న గురుపుత్రుని తెచ్చి యిచ్చినవాడని ధ్యానము.

**మూలమంత్రము** ఓం శ్రీం హ్రీం క్లీం గ్లాం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే
**దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥**

ఇది సంపూర్ణ మంత్రము ఈ మంత్రాన్ని మూడులక్షలు జపం చెయ్యాలి.

**ఈ మంత్రం యొక్క భావార్థము:-**

సచ్చిదానంద స్వరూపుడు, ఐశ్వర్యవంతుడు, శక్తిమంతుడు, కోరికలు తీర్చువాడు, సౌభాగ్య స్వరూపుడు ఐన దేవకీ పుత్రా! గోవిందా! వాసుదేవా! జగత్పతీ! శ్రీకృష్ణా! నేను నిన్ను శరణు వేడుచున్నాను. నీవు నాకు పుత్రదానం చేయుము.

## మరొక విధమైన సంతాన గోపాలమన్త్రం

**వినియోగము :-** అస్యశ్రీ సంతానగోపాల మంత్రస్య బ్రహ్మాఋషిః గాయత్రీ ఛన్దః, శ్రీకృష్ణో దేవతా, క్లీం బీజం, నమఃశక్తిః పుత్రార్థే జపే వినియోగః

**అంగన్యాసము :-** గ్లాం హృదయాయనమః, క్లీం శిరసేస్వాహా, హ్రీం శిఖాయైవషట్ శ్రీం కవచయహుం ఓం అస్త్రాయ ఫట్.

**ధ్యానమ్ :-** శంఖచక్ర గదా పద్మం దధానం సూతికాగృహే।
అంకేచక్రగదా పద్మం దేవక్యాః కృష్ణంవందేవిముక్తయే॥

**మూలమంత్రము :-** "ఓం నమో భగవతే జగదాత్మసూతయే నమః"

సమస్త ప్రపంచము సంతానముగా గల భగవంతుడైన శ్రీకృష్ణునకు నమస్కారము అని ఈ మంత్రము యొక్క తాత్పర్యము.

ఈ మంత్రము కూడా మూడు లక్షలు జపం చేయాలి.

సనత్కుమారుడు చెప్పిన సంతానగోపాల మంత్రము వినియోగము:-

ఓం అస్యశ్రీ సంతానగోపాల మంత్రస్య నారదఋషిః, అనుష్టుప్ ఛన్దః, శ్రీకృష్ణోదేవతా, గ్లాం బీజం నమః శక్తిః, పుత్రార్థే జపే వినియోగః.

**అంగన్యాసము:-**

'దేవకీసుత గోవింద' హృదయాయనమః 'వాసుదేవ జగత్పతే' శిరసే స్వాహా, 'దేహిమే తనయంకృష్ణ' శిఖాయై వషట్, 'త్వామహం శరణంగతః' కవచాయహుం,

దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే, దేహిమే తనయం కృష్ణ త్వామహంశరణం గతః॥ అస్త్రాయఫట్

**ధ్యానమ్:-**

**శంఖచక్రగదాపద్మం ధారయన్తం జనార్దనమ్।**
**అంకేశయానం దేవక్యాః సూతికామందిరే శుభే॥**
**ఏవం రూపం సదా కృష్ణం సుతార్థం భావయేత్ సదా॥**

ఉత్తమ బుద్ధిమంతుడైన సాధకుడు పుత్రప్రాప్తికి ఎల్లప్పుడూ ఈ రూపం గల శ్రీకృష్ణుని ధ్యానించాలి. శుభమయమైన పురిటింటిలో శంఖచక్రగదా పద్మములను ధరించి దేవకి ఒడిలో ఉన్న పరమాత్మ అని.

సంపూర్ణ మంత్రము ఇది

**ఓం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే**
**దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః॥**

ఇది కూడ మూడు లక్షలు జపం చేయాలి.

## హరివంశం తొమ్మిది రోజుల్లో పారాయణ చేసే పద్ధతి

మొదటిరోజున యదువంశవర్ణన కథ వరకు అనగా మొదటి నుండి 35 అధ్యాయాలు, రెండవరోజున ధేనుకవధ కథ అంటే విష్ణుపర్వం 14వ అధ్యాయం చివర వరకు, మూడవ రోజున జరాసందపరాజయం అంటే విష్ణుపర్వంలో 44 అధ్యాయాలు, నాల్గవరోజున పారిజాతాపహరణం అంటే విష్ణుపర్వంలో 77 అధ్యాయాలు, ఐదవరోజున శంబరాసురసేన ఓడిపోవటం విష్ణుపర్వంలో 107 అధ్యాయం, ఆరవరోజున జనమేజయ వంశవర్ణనం భవిష్యపర్వం రెండవ అధ్యాయం, ఏడవరోజున దైత్యసేన విస్తారము భవిష్యపర్వం 50వ అధ్యాయం, ఎనిమిదవ రోజున ఘంటాకర్ణుడి సమాధి భవిష్యపర్వం 81వ అధ్యాయంతో తొమ్మిద రోజున గ్రంథము చివర వరకు భవిష్యపర్వం 136వ అధ్యాయం చివర వరకు.

హరివంశ మాహాత్మ్యం సమాప్తం

☆☆☆

### హరివంశ పురాణంలో మొదటిదైన

# హరివంశ పర్వము

## మొదటి అధ్యాయము

### ఆదిసృష్టి వర్ణనము

పరమాత్మ ఐన నారాయణునకు అతని అంశయే ఐన పురుషశ్రేష్ఠుడగు నరునకు సరస్వతీదేవికీ నమస్కారం చేసి మహాభారత గ్రంధాన్ని చదవాలి. పుణ్యాము, పవిత్రము పాపాలను పోగొట్టేది మంగళకరము చెప్ప శక్యముగాని మహిమ గలదియైన వ్యాసమహర్షి పెదవుల నుండి వెలువడిన భారతాన్ని విన్నవాడికి పుష్కరమనే తీర్థములో స్నానం చేయనవసరం లేదు. తన ముఖపద్మం నుండి జాలువారిన పురాణ వాఙ్మయమనే అమృతాన్ని సమస్త ప్రపంచమూ త్రాగుచున్న పరశారమహర్షి పుత్రుడు. సత్యవతీదేవి హృదయానికి ఆనందం కలుగచేసే వ్యాసమహర్షి అందరి కంటే గొప్పవాడు. అనేక విషయములు తెలిసిన వేద విద్వాంసుడగు బ్రాహ్మణునికి బంగారు కొమ్ములు గల నూరు గోవుల దానం చేసినవాడు, పుణ్యమైన భారతకథను వినువాడు సమానమైన ఫలితాన్ని పొందుతారు.

నూరు అశ్వమేధయాగాలు చేసి నాలుగు వేలమందికి భోజనం పెట్టినవాడు, ఇంద్రపదవి కోసం నూరు యజ్ఞాలు చేసినవాడు, వీరిద్దరికంటే శ్రీహరివంశ పురాణాన్ని దానం చేసినవాడు అంతులేని పుణ్యాన్ని పొందుతాడు. వ్యాసవాల్మీకుల వాఙ్మయాన్ని చదివినవాడు వంద అశ్వమేధయాగాలు చేసిన ఫలితాన్ని వాజపేయ రాజసూయయాగాలు చేసి ఏనుగును, రథమును దానం చేసిన పుణ్యాన్ని పొందుతాడు. హరివంశమును వ్రాయించినవాడు తుమ్మెద తామరపూవును వలె విష్ణుమూర్తి పాదపద్మాన్ని విడువజాలడు. వేదవ్యాస మహర్షి బ్రహ్మకంటే గొప్పవాడు గొప్పయోగము, ఐశ్వర్యము కలవాడు. నారాయణుని అంశతో జన్మించినవాడు శుకుడనే పుత్రుడు కలవాడు. వేదమునకు నిధియైనవాడు అతనికి తలవంచి నమస్కరిస్తున్నాను.

మొట్టమొదటి పురుషుడు, బీజస్థానీయుడు, నాశరహితుడు బ్రహ్మ స్వరూపుడు వ్యక్త అవ్యక్త స్వరూపుడు మిక్కిలి పూర్వుడు. సూత్రాత్మ స్వరూపుడు,

విరాట్స్వ రూపుడు, ఇంద్రియాలను ప్రవర్తింప చేసేవాడు, అన్ని పాపాలను పోగొట్టువాడు ఏ దోషమూ లేనివాడైన పరమాత్మకు నమస్కారము చేసి పురాణ విషయం ప్రారంభిస్తున్నాను. నైమిషారణ్యంలోకులపతియైన శౌనకమహర్షి సూతుని ఈ విధంగా అడిగాడు.

ఓ మహర్షీ! భరతవంశరాజుల యొక్క గొప్ప చరిత్ర పూర్వం చెప్పావు. దేవతల యొక్క, రాక్షసుల యొక్క, సిద్ధులు మొదలైన వారి యొక్క మిక్కిలి ఆశ్చర్యకరమైన పనులను, పరాక్రమములను, ధర్మనిశ్చయములను, విచిత్రము లైన కథలను చెప్పినావు. కౌరవుల జన్మవృత్తాంతాన్ని చెప్పావు. వృష్ణి, అంధక వంశముల వారి వృత్తాంతాన్ని చెప్పలేదు. దానిని ఇపుడు చెప్పవలసిందిగా కోరు తున్నాను. అదివిని సూతుడిలా అన్నాడు.

వ్యాసమహర్షి శిష్యుడైన వైశంపాయనుడు జనమేజయుడికి నీవడిగిన విషయం పూర్వం చెప్పాడు. ఆ వృష్ణివంశీయుల వృత్తాంతాన్ని ప్రారంభంనుంచీ నీకు చెపుతాను. జనమేజయుడు వైశంపాయనుని ఇలా అడిగాడు. నీవు చెప్పిన మహాభారతాన్ని విపులంగా విన్నాను. వృష్ణి అంధ వంశములందలి మహారథుల ఘనకార్యాలను నీవు చెప్పిన వాటిని విన్నా నాకు తృప్తి కలుగలేదు. వృష్ణి వంశము వారు, పాండవులు ఒకే రాశిగా నాకు అనిపిస్తోంది. నీవు నేర్పరివి. వాళ్ళ వంశాన్ని ప్రత్యక్షంగా చూచినవాడివి. ఓ తపోధనా! వారి వంశాన్ని విస్తరంగా చెప్పు. ఎవరిని ఎవరిని నేను కోరుతానో వారిని గూర్చి నీవు పూర్తిగా చెప్పుము. అది విని వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

రాజా! పాపములను పోగొట్టే దివ్యము, పుణ్యమైన కథను చెపుతా విను. ఈ కథను విని గుర్తుంచుకొన్నవాడు వృద్ధిచెందిన వంశం కలవాడై స్వర్గలోకంలో పూజింపబడతాడు. మహారాజా! నారాయణుని వలన జన్మించిన బ్రహ్మ గొప్ప తేజశ్శాలి. అతడు సమస్త ప్రాణులను సృష్టించాడు. మహత్తత్వము నుండి అహం కారం, దాని నుండి పంచభూతాలు పుట్టాయి. ఇది మొదటి సృష్టిగా చెప్పబడుతూ ఉంది. ఇప్పుడు నేను విస్తరంగా నా బుద్ధిననుసరించి ఆ సృష్టి విషయం చెపుతా, దాని వలన కీర్తి వృద్ధి చెందుతుంది. ఈ సృష్టి విషయాన్ని చెప్పినవాళ్ళు, విన్నవాళ్ళు ధనికులు, పేరుప్రతిష్ఠలు కలవాళ్ళు అవుతారు. శత్రువులు నశిస్తారు. చివరకు స్వర్గం ప్రాప్తిస్తుంది. ఆయుస్సు వృద్ధి పొందుతుంది. కాబట్టి విని తెలుసుకొనటానికి సమర్థులైన మీకు వృష్ణివంశమును, నాలుగు విధాలైన ప్రాణుల సృష్టిని చెపుతాను.

భగవంతుడు మొట్టమొదట నీటిని సృష్టించాడు. తరువాత ఆ నీటిలో వీర్యమును ఉంచాడు. నీటికి 'నారము' అని కూడ పేరుంది. నీరు మానవులకు జన్మస్థానము, భగవంతుడు నివసించే ప్రదేశము. కనుక భగవంతుడు నారాయణుడని పిలవబడుతున్నాడు. భగవంతుడు నీటిలో ఉంచిన వీర్యము బంగారు గ్రుడ్డుగా తయారైంది. ఆగ్రుడ్డి నుండి బ్రహ్మ పుట్టాడు. అక్కడనే బ్రహ్మ చాలకాలము ఉండి ఆగ్రుడ్డును రెండు ముక్కలు చేశాడు. వాటిలో ఒక ముక్కతో భూమిని, రెండవ ముక్కతో స్వర్గాన్ని నిర్మించాడు. ఆ రెండు ముక్కల మధ్య భాగంతో ఆకాశాన్ని సృష్టించాడు.

భూమిని నీటిమీద నిలబెట్టాడు. మరియు సూర్యుని, పదిదిక్కులను సృష్టించాడు. మరియు కాలమును, మనస్సును, వాక్కును, కామక్రోధములను, అనురాగాన్ని సృష్టించాడు. తరువాత బ్రహ్మ తనమనస్సునుండి మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అనే సప్తఋషులను సృష్టించాడు. ఈ సప్తఋషులు కర్మమార్గమును గొప్పదానినిగా తలచారు. తరువాత బ్రహ్మ కోపమూర్తి అయిన రుద్రుని పుట్టించాడు. వీరికంటే పూర్వమే సనత్కుమారుని సృష్టించాడు. వీరందరూ సంతానమును కనుట అనే పనిలో నిమగ్నులైయ్యారు. సనత్కుమారుడు మొదలైనవాళ్ళు బ్రహ్మచారులయ్యారు.

సప్తర్షులు, రుద్రుడు సంతాన సమృద్ధిగల వంశాలకు జన్మనిచ్చారు. వీరిలో యక్షులు, సూర్యుడు మొదలైన దేవతలు, కశ్యపుడు మొదలైన మహర్షులు కూడా ఉన్నారు. తరువాత వాళ్ళు మెరుపులు, పిడుగులు, మేఘాలు, ఇంద్రధనుస్సు, పక్షులు, పర్జన్యుడు వీటిని సృష్టించారు. యజ్ఞాల కొరకు వారు ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలను సృష్టించారు. సాధ్యులనే వాళ్ళు ఈ వేదమంత్రాల ద్వారా దేవతల సంతోషం కొరకు యజ్ఞాలు చేశారని విన్నాను. తరువాత బ్రహ్మ తన ముఖం నుండి దేవతలను, రొమ్ము నుండి పితృదేవతలను, లింగమునుండి మనుష్యుల్ని, పదుము నుండి రాక్షసులని సృష్టించి సాధ్యులనే పురాతన దేవతలను పుట్టించాడు. వీళ్ళుకాక అనేకములైన పెద్ద ప్రాణులు, చిన్న ప్రాణులు బ్రహ్మ అవయవాల నుండి పుట్టారు. అప్పుడు వారు వసిష్ఠుడనే పేరు గల ప్రజాపతిని సృష్టించారు.

ఈ విధంగా మనస్సుచే ఎక్కువ సృష్టి చేసినా ప్రజలు వృద్ధిచెందలేదని బ్రహ్మ అప్పుడు తన శరీరాన్ని రెండుముక్కలు చేశాడు. ఒకముక్క పురుషుడు, రెండవముక్క స్త్రీగాచేసి అనేకవిధాలైన ప్రజాసృష్టి చేశాడు. ఆ స్త్రీపురుషులు

భూమ్యాకాశాలను వ్యాపించి ఉన్నారు. విష్ణువు విరాట్పురుషుణ్ణి సృష్టించాడు. విరాట్‌పురుషుడు మనువును సృష్టించాడు. వారే మన్వంతరక్రమాన్ని నడిపించారు. రెండవది ఆపవ మన్వంతరంగా చెప్పబడుతోంది. ఆపవునివల్ల కలిగిన స్త్రీ అయోనిజ (తల్లిగర్భం నుంచి పుట్టినది కాదు) తరువాత నారాయణుడు ఆ మనువు ద్వారా యోనిజ ప్రజాసృష్టిని చేయించాడు. ఈ ఆదిసృష్టిని తెలుసు కొన్నవాడు కోరిన దానిని పొందుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
ఆదిసృష్టి వర్ణనము అను మొదటి అధ్యాయము

☆☆☆

# రెండవ అధ్యాయము

## స్వాయంభువమను వంశము- దక్షజన్మ

తరువాత వైశంపాయనుడిలా చెప్పాడు.

ఈ విధంగా ప్రజాసృష్టి కాగా ఆపవుడు ప్రజాపతి పురుషుడయ్యాడు. అతడు అయోనిజ అయిన శతరూపను భార్యగా చేసుకున్నాడు. ఆపవుని మహిమచేత శతరూప పదివేల సంవత్సరాలు తపస్సు చేసి సంతానం కొరకు భర్త వద్దకు వెళ్ళింది. అతడే స్వాయంభువమనువు. అతని మన్వంతరకాలము డెబ్బైఒక్క యుగాలు. ఆమనువు వలన శతరూప వీరుడనే పేరుగల కుమారుని కన్నది. ఆ వీరుడనే వానికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని ఇద్దరు పుత్రులు, కామ్య అనే పుత్రిక పుట్టారు. కామ్య ప్రియవ్రతుని భర్తగాపొంది సమ్రాట్, కుక్షి, విరాట్, ప్రభు అను నలుగురు పుత్రులను కన్నది. ప్రజాపతియైన అత్రి, ఉత్తానపాదుని తనకు వారసునిగా చేసుకున్నాడు.

ఉత్తానపాదుడు సూనృత యను స్త్రీయందు నలుగురు పుత్రులను కన్నాడు. ధర్ముడను వాని బిడ్డ సూనృత ఆమె అశ్వమేధయాగము ద్వారా జన్మించింది. ఆమెయే ధ్రువుని తల్లి. ఉత్తానపాదుడు సూనృతయందు ధ్రువుడు, కీర్తిమంతుడు, శివుడు, శాంతుడు, అయస్పతి, అను పుత్రులను కన్నాడు. ధ్రువుడు మూడువేల దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. అతని కోరిక గొప్ప కీర్తిని పొందాలని బ్రహ్మ సంతోషించి సాటిలేని లేని స్థానాన్ని ఇచ్చాడు. ధ్రువుడికి బ్రహ్మ ఇచ్చిన స్థానం నక్షత్రములకు ముందుంటుంది. శుక్రాచార్యులు అతని మహిమను

కొనియాడాడు. ధ్రువుడికి శ్లిష్టి, భవ్యుడు, శంభు అనే కుమారులు కలిగారు. శ్లిష్టికి, సుచ్ఛాయ అనే స్త్రీయందు, రిపు, రిపుంజయ, పుణ్యా, వృకల, వృకతేజసుడను పుత్రులు జన్మించారు.

రిపువు భార్య బృహస్పతి యను స్త్రీ దేవతల తేజస్సుతో కూడిన చాక్షుషుడను కుమారుని కన్నది. చాక్షుషుడు పుష్కరిణి అనే స్త్రీ యందు, ఊరువు, పూరువు, శతద్యుమ్నుడు, తపస్వి, సత్యవంతుడు, కవి, అగ్నిష్టుల్, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, అభిమన్యు అను పదిమంది పుత్రులు కలిగారు. ఊరువు అనువాడు అగ్నికుమార్తె యందు అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, గయుడు, అంగిరసుడను ఆరుగురు కుమారులను కన్నాడు. అంగుడు, యముని కుమార్తె అయిన సునీథ వలన ఒక కుమారుని కన్నాడు. అతని పేరు వేనుడు. వేనుడి అపచారం వలన కోపించిన మహర్షులు అతని కుడిచేతిని మధించారు. (తరచారు) అతని భుజం నుండి 'పృథు'వనువాడు పుట్టాడు. అతనిని చూచి ఋషులు సంతోషించారు.

ఇతడు ప్రజల్ని చక్కగా పరిపాలిస్తాడు. గొప్ప కీర్తిగడిస్తాడు. అని పలికారు! అట్లే అతడు ధనుస్సును, ఖడ్గాన్ని, కవచాన్ని ధరించి పరాక్రమంచేత ప్రకాశిస్తూ భూమిని పరిపాలించాడు. రాజసూయయాగం చేసిన రాజులలో అతడు మొదటివాడు. అతని యజ్ఞం ద్వారానే సూతమాగధులను స్తోత్ర పాఠకులు పుట్టారు. అతని వలన గోరూపము ధరించిన భూమి అనేక సస్యాలను పండించింది. పృథు మహారాజుకు ఇద్దరు ధర్మాత్ములైన కుమారులు కలిగారు. ఒకడు 'అంతనుడు', రెండవవాడు పాలితుడు. అంతర్ధానుడు శిఖండిని వలన హవిర్ధానుడనే వానిని కన్నాడు. హవిర్ధానుడు అగ్ని కుమార్తెయైన ధిషణ యందు ప్రాచీనబర్హి, శుక్ల, గయ, కృష్ణ, వ్రజ, ఆజిన, అను ఆరుగురు పుత్రులను కన్నాడు.

మహారాజా! ప్రాచీనబర్హితన తండ్రికంటే గొప్పశక్తి కలవాడు. అతని పరిపాలనలో ప్రజలు మిక్కిలి అభివృద్ధి పొందారు. ప్రాచీనబర్హికి సముద్రకన్య 'సువర్ణ'తో వివాహం జరిగింది. అతనికి పదిమంది కుమారులు వారు ప్రచేతులను వారు. వారందరూ ధనుర్వేదంలో గొప్ప ప్రజ్ఞావంతులు. వారు సముద్రము మీద పడుకొని పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. అప్పుడు రాజ్యపాలన చేసేవాళ్ళు లేక భూమి అడివిగా తయారైంది. మరియు ప్రజలు నశించారు. గాలులు వీచలేదు. ఆకాశం చెట్లతో ఆవరింపబడింది. పదివేల సంవత్సరాలు ప్రజలు కదలికలేని

వారయ్యారు. అదివిని ప్రచేతులందరూ తమ ముఖాల నుండి గాలిని, అగ్నిని సృష్టించారు. ఆవాయువు అడవిలోని చెట్లను ఎండింప చేసింది. అగ్నివాటిని కాల్చి వేసింది.

ఈ విధంగా చెట్లన్నీ నశించాయి. చెట్ల వినాశాన్ని చూచి కొన్ని చెట్లు మాత్రం మిగిలి ఉండగా ఔషధులకధిపతియైన చంద్రుడు ఆ ప్రజాపతుల వద్దకు వచ్చి ఓ రాజులారా! కోపాన్ని విడిచిపెట్టండి. భూమి చెట్లు లేనిదైంది. అగ్నివాయువు తమ పనులు చాలించారు. రత్నంలాంటి మారిష అనే ఈ కన్య వెన్నెల గర్భంలో రక్షించ బడిఉంది. మీకు ఈమె భార్య అగుగాక ఈమె చంద్రవంశాన్ని వృద్ధి చేస్తుంది. సగం మీ తేజస్సు, సగం నా తేజస్సు కలిసి ఈమెకు దక్షుడనే ప్రజాపతి పుడతాడు. మీ తేజస్సుచేత తగలబడిన ఈ భూమిమండలాన్ని మళ్ళీ వృద్ధి పరుస్తుంది. అని చెప్పాడు. అంతట చంద్రుని మాట చొప్పున ప్రచేతులందరు మారిషను భార్యగా స్వీకరించారు.

తరువాత వారు మారిష యందు మానసికంగా గర్భం ధరింపచేశారు. పది మంది మారిషుల వలన మారిషకు మహాతేజశ్శాలియైన దక్షప్రజాపతి పుట్టాడు. దక్షప్రజాపతి చంద్రవంశంతో చంద్రవంశాన్ని అభివృద్ధి పరిచే పుత్రులను కన్నాడు. చలనం లేని పదార్థాలను, రెండు కాళ్ళు, నాలుగు కాళ్ళు గల ప్రాణులను సృష్టించాడు. దక్షుడు మరల మనస్సుతో ఆడపిల్లలను కూడ కన్నాడు. పదిమంది పిల్లల్ని ధర్మునికి, కశ్యపుడికి పదముగ్గుర్ని, మిగిలిన వాళ్ళను చంద్రునికి భార్యలను చేశాడు. చంద్రునికిచ్చిన కన్యలు నక్షత్రములనే పేరు గలవారు. ఆ స్త్రీలకు దేవతలు, పక్షులు, సర్పాలు, గోవులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, గంధర్వులు, అప్సరసలు, ఇతర జాతులవారు కూడ పుట్టారు.

అది మొదలుకొని రాజా! ప్రజలు స్త్రీ పురుష సంగమం వల్ల కలిగినారు. పూర్వులు కోరిక వల్ల చూపువల్ల తాకుటవలన సృష్టించారు. అపుడు జనమే జయుడు ఇలా అడిగాడు. దేవతలు, రాక్షసులు, గంధర్వులు, సర్పాలు, దక్షునిచే సృష్టించ బడినట్లు చెప్పావు కదా! దక్షుడు బ్రహ్మ బొటనవ్రేలి నుండి పుట్టాడని చెప్పావు. ఎడమ బొటనవ్రేలి నుండి అతని భార్య పుట్టిందన్నావు. ఆ దక్షుడు మళ్ళీ ప్రచేతులకు పుత్రుడెట్లయ్యాడు? ఇది నాకు కలిగిన సందేహము. దీనిని బాగుగా చెప్పమని కోరుతున్నాను. ఈ దక్షప్రజాపతి చంద్రునికి కూతురు బిడ్డడు

కదా! మళ్ళీ మామగారెలా అయ్యాడు? వైశంపాయనుడు ఇలా సమాధానం చెప్పాడు.

ప్రపంచంలో ప్రాణులు పుట్టుట చచ్చుట ఎప్పుడూ జరుగుతూ ఉంటుంది. ఋషులు, విద్వాంసులు, జ్ఞానులు, వారికి తెలియనిది ఉండదు. దక్షుడు మొదలైన రాజులు ప్రతియుగమందు పుడుతూ ఉంటారు. మరల మరణిస్తూ ఉంటారు. విద్వాంసునకీవిషయం తెలియనిది కాదు. రాజా! పూర్వము ప్రజలలో వయస్సును బట్టి పెద్ద చిన్న అనే తేడా ఉండేది కాదు. తపోబలాన్ని బట్టే పెద్ద చిన్న అనే తేడా ఉండేది. చలనం కలిగినట్టి లేనట్టి యీ దక్షుని సృష్టి విషయాన్ని తెలుసుకొన్నవాడు సంతానవంతుడై చివరకు స్వర్గలోకమును పొందుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశ పర్వములో
స్వాయంభువమను వంశము- దక్షజన్మ అను రెండవ అధ్యాయము

☆☆☆

# మూడవ అధ్యాయము

## దక్షప్రజాపతి వలన మరుత్తులు పుట్టుట

తరువాత జనమేజయుడిలా అడిగాడు.

దేవతలు, రాక్షసులు, గంధర్వులు, సర్పాలు ఎలా పుట్టాయో వివరంగా తెలియజేయుము. వైశంపాయనడిలా చెప్పాడు.

పూర్వము బ్రహ్మ ప్రజలను సృష్టించమని దక్షునకు ఆజ్ఞ-ఈయగా అతడెలా సృష్టించాడో చెప్పుతా విను!

మొదట దక్షుడు మనస్సంకల్పంతోనే ఋషులను, దేవతలను, గంధర్వులను, రాక్షసులను, యక్షభూత పిశాచాలను, పశుపక్షులను, సర్పాలను సృష్టించాడు. మన స్సంకల్పం వల్ల ప్రజలు వృద్ధి చెందకపోతుంటే ఆలోచించి స్త్రీ పురుష సంయోగం ద్వారా ప్రజలను సృష్టింపదలచినవాడై వీరణ ప్రజాపతి పుత్రికయైన అసిక్ని అను దానిని పెండ్లి చేసుకున్నాడు. దక్షుని వలన అసిక్నికి ఐదువేల పుత్రులు కలిగారు. వారు ప్రజలను వృద్ధి చేయదలచుచుండగా నారదుడు వారికి వైరాగ్యమును ఉపదేశించి వారితోపాటు తాను కూడ శపింపబడ్డాడు. అప్పుడు బ్రహ్మ మరీచి మొదలగు ఋషులతో కలిసి దక్షుడి దగ్గరకు వెళ్ళాడు. నారదునికి మరల జన్మ కలుగునట్లు చేయమని ప్రార్థించారు.

అప్పుడు దక్షుడు ఆ మహర్షులతో ఆలోచించి నేనొక కన్యాదానం చేస్తాను. ఆమె వలన నారదుడు మళ్ళీ పుడతాడు అని చెప్పాడు. జనమేజయుడు, మహర్షి నారదుడు దక్షుని కుమారులను ఎందుకు నశింపచేశాడు? ఈ విషయం బాగా తెలుసుకో గోరుతున్నాను అని అడిగాడు. వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! దక్షుని కుమారులైన హర్యశ్వులనువారు ప్రజలు వృద్ధిచెందాలని కోరుతూ నారదుడి దగ్గరకు వచ్చారు. అప్పుడు నారదుడు ఓరీ! మీరు మిక్కిలి మూర్ఖులు. ఎందుచేతనంటే భూమికి పైన, మధ్య, క్రిందభాగముల విస్తారము, పరిమాణము మీకు తెలియదు. మీరు ప్రజలనెలా సృష్టి చేయగలరు? అని ప్రశ్నించాడు. ఆమాటను విని హర్యశ్వగణం అన్నిదిక్కులకు పోయారు. వారక్కడ వాయువులేక శ్వాస ఆడనివారైనారు. సముద్రంలో పడిన నదులులాగ వారు తిరిగి రాలేదు. హర్యశ్వగణం అలా నశించిపోగా దక్షుడు వైరిణియందే వేయి పుత్రుల్ని కన్నాడు. వారిపేరు శబలాశ్వులు. వారు ప్రజలను సృష్టించటానికి ఇష్టపడు చుండగా నారదుడు వెనుక చెప్పినట్లే వీళ్ళకుకూడా చెప్పాడు. వాళ్ళు నారదమహర్షి బాగా చెప్పాడని తమ సోదరుల మార్గాన్ని తెలుసుకొనుటకు వెళ్ళాలని నిశ్చ యించారు. భూమియొక్క ప్రమాణం తెలుసుకొని సుఖంగా ప్రజలను సృష్టిద్దామని వెనుకటి మార్గాన్నే అన్నిదిక్కులకు వెళ్ళారు. మళ్ళీ తిరిగిరాలేదు.

శబలాశ్వులు నశించిన పిమ్మట దక్షుడు కోపించి నారదుని నశించి గర్భ వాసాన్ని పొందుతావని శపించాడు. తరువాత దక్షుడు వైరిణియందు అరవైమంది కన్యలను సృష్టించాడు. ఆకన్యలను కశ్యపుడు సోముడు(చంద్రుడు) ధర్ముడు, ఇతర ఋషులు వివాహం చేసుకొన్నారు. ఆ కన్యలను పదిమందిని ధర్ముడికి, పదముగ్గురిని కశ్యపునకు, చంద్రుడికి ఇరవైఏడుగురిని, అరిష్టనేమికి నలుగురిని, భృగుమహర్షి కుమారునికి ఇద్దరిని, అంగిరసునికి ఇద్దరిని, కృశాశ్వనికి ఇద్దరిని వివాహం చేశాడు దక్షుడు. వాళ్ళపేర్లు చెపుతా విను.

అరుంధతి, వసుద్యామి, లంబా, భాను, మరుత్వతి, సంకల్ప, ముహూర్త, సాధ్య, విశ్వ, యామీపుత్రిక. ఈపదిమంది ధర్ముని భార్యలు. వారి సంతానం పేర్లు చెపుతాను విను. విశ్వ విశ్వేదేవులను, సాధ్య సాగణాన్ని, మరుత్వ మరుత్వంతు లను, భాను భానుగణాన్ని, ముహూర్త ముహూర్తగణాన్ని, లంబఘోషుని, యామీ పుత్రిక నాగవీధి, వృషలంబ అనువారిని కన్నారు. ప్రచేతుని పుత్రుడైన దక్షుడు చంద్రునికిచ్చిన స్త్రీలందరూ నక్షత్రముల పేర్లతో పిలువబడుతున్నారు. వీళ్ళుకాక

మిగిలిన తేజస్సుకల దేవతలు ఎనిమిదిమంది వసువులని చెప్పబడు తున్నారు. వాళ్ళు ఆపుడు, ధ్రువుడ, సోముడు, ధరుడు, అనలుడు, అనిలుడు, ప్రత్యూషుడు, ప్రభాతుడు అనువారు. ఆపుని కొడుకులు వైతండ్యుడు, శ్రముడు, శాంతుడు, ముని అనువాళ్ళు.

ధ్రువుని కుమారుడు లోకాన్ని నాశనంచేసే కాలుడు. చర్చ అనువాడు చంద్రుని కొడుకు. ధరుని కుమారులు ద్రవిణుడు, హుతహవ్యవహుడనువారు. మనోహర కొడుకులు శిశిరుడు, ప్రాణుడు, రమణుడు. అనిలునకు భార్య శివ మనోజవుడను వానిని కన్నది. అవిజ్ఞాతగతి అనువాడు కూడ అనిలుని కొడుకే. రెల్లువనమందు నివసించే కుమారుడు అగ్నికుమారుడు. శాఖ, విశాఖ, నైగమేయులు కార్తికేయుని (కుమారస్వామి)కి తమ్ముళ్ళు. స్కన్ద, సనత్కుమారులు అగ్నిదేవుని నాల్గవఅంశతో పుట్టారు. ప్రత్యూషపుత్రుడు దేవలుడు. ఇతనికి తపస్వి, క్షమావంతుడు ఇద్దరు కొడుకులు.

బృహస్పతి సోదరి బ్రహ్మచారిణి అనేది విరక్తురాలై భూమిచుట్టూ తిరిగింది. ఆమె ఎనిమిదవ వసువైన ప్రభాసుని భార్య. ఆమె కుమారుడు విశ్వకర్మ. అతడు దేవతల శిల్పి. అనేకవిధాలైన అలంకారాలు తయారుచేయగలవాడు. అతడే దేవతలకు విమానాలు నిర్మించాడు. అతని శిల్పమే మనుష్యులకు కూడ ఒరవడి. సురభి కశ్యపునివలన పదకొండు మంది రుద్రులను కన్నది. విశ్వరూపుడు త్వష్ట కొడుకు. హరుడు, బహురూపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంబుడు, కపర్ది, రైవతుడు, మృగవ్యాధుడు, సర్పుడు, కపాలి ఈ పదకొండుగురు రుద్రులు. అమితమైన తేజస్సు గలవారు రుద్రులు. మొత్తం నూరుగురు కశ్యపుని భార్యలు. అదితి, దితి, దనువు, అరిష్ట, సురస, ఖశసురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇర, కద్రువ, ముని అనువారు. వారి సంతానాన్ని చెపుతా విను.

వెనుకటి చాక్షుష మన్వంతరంలో 'తుషితు' లను పన్నెండుగురు ముఖ్య దేవతలు వైవస్వత మన్వంతరంలో ఒకరితో మరొకరు 'చాక్షుష మన్వంతరం వచ్చింది. జీవులందరి కళ్యాణానికి అందరం కలిసి అదితి గర్భంలో ప్రవేశించి జన్మిద్దాం. ఇలా అయితే మనకు మేలు జరుగుతుంది. అని మాట్లాడుకొని దేవత లందరు వైవస్వత మన్వంతరంలో కశ్యపునికి ఔరసపుత్రులై అదితికి జన్మించారు.

ఇంద్రుడు విష్ణువు అర్యముడు, ధాత, త్వష్ట, పూష, వివస్వంతుడు, సవిత, మిత్రుడు, వరుణుడు, అంశుడు, భగుడు, అనువారు పన్నెండుగురు సూర్యులు, ఆదిత్యులనే పేరు గలవారు. చంద్రునికి తన భార్యలయందు చాలామంది సంతానం కలిగారు.

అరిష్టనేమి సంతతి పదహారుమంది బహ్మపుత్రుడనే జ్ఞాని వజ్ర, మేఘ, ఇంద్రధనుస్, విద్యుత్ అనే నలుగురు పుత్రులను కన్నాడు. బ్రహ్మర్షులచే గౌరవింప బడిన ఋక్కులు అన్నియు ప్రత్యంగిర యొక్క కుమారులు. కృశాశ్వునకు పుట్టిన పుత్రులందరూ దేవశాస్త్రులనే పేరుతో ప్రసిద్ధి చెందారు. వేయి యుగాల తరువాత వారు దేవతలై పుడతారు. దేవగణములు మొత్తము 33గ్గురు రౌమజులని పేరు గలవాళ్ళు. వీరికి గూడా పుట్టుక చావులున్నాయి. సూర్యుడికి ఉదయము, అస్తమించుట ఉన్నట్లే దేవగణములు జనన మరణములు కలిగిఉన్నారు. వీళ్ళు ప్రతియుగంలోనూ జన్మిస్తారు. కశ్యపుని వలన దితికి ఇద్దరు పుత్రులు. హిణ్యాక శిపుడు, హిరణ్యాక్షుడు జన్మించారు. సింహిక అనే కన్య కూడ పుట్టింది. ఆమె విప్రచిత్తికి భార్య. మహాబలవంతుడైన ఆమె కొడుకులు సైంహికేయులని పిలువ బడతారు. వారు పదివేలమంది. వాళ్ళ కొడుకులు మనుమలు వందల వేలకొలది ఉన్నారు. వాళ్ళకు పుట్టినవాళ్ళు లెక్కకందనివాళ్ళు.

హిరణ్యకశిపునకు నలుగురు పరాక్రమవంతులైన పుత్రులు. వారు అనుహ్లాదుడు, హ్లాదుడు, ప్రహ్లాదుడు అనువారు. సంహ్లాదుడును. వారిలో హ్లాదుని పుత్రుడు హ్రాదుడు. సంహ్లాదుని పుత్రులు సుందుని సుందుడు అనువారు. అనుహ్లాదుని కొడుకులు ఆయువు, శిబి, కాలుడు అని ముగ్గురు. ప్రహ్లాదుడికి ఒక్కడే పుత్రుడు విరోచనుడనేవాడు. విరోచనుని కుమారుడు బలిచక్రవర్తి. బలి కుమారుడు బాణుడు, ధృతరాష్ట్రుడు, చంద్రుడు, చంద్రమసుడు, ఇంద్ర తాపనుడు, కుంభనాభుడు, గర్దబాక్షుడు, కుక్షి మొదలగు నూరుగురు పుత్రులు పుట్టారు. బాణుడు వీరందరిలో మిక్కిలి బలశాలి. పెద్దవాడు శివునికి ప్రియమైనవాడు కూడ.

పూర్వము బాణుడు శివుని ప్రసన్నుని చేసుకొని శివునకు ప్రక్కనే విహరిస్తూ ఉండేటట్లు వరం పొందాడు. బాణుడికి లోహితి అనే భార్యయందు ఇంద్రదమ నుడనే పుత్రుడు కలిగాడు. ఈ విధంగా హిరణ్యకశిపునకు ఒక లక్ష రాక్షసులు, హిరణ్యాక్షుడికి మహా బలవంతులు విద్వాంసులైన కుమారులైదుగురు కలిగారు.

ఘుర్జరుడు, శకుని, భూతసంపానుడు. మహానాభుడు, కాలనాభుడు అని వాళ్ళపేర్లు. దనువను స్త్రీ కుమారులు నూర్గురు. వాళ్ళు తీవ్రమైన పరాక్రమము గలవాళ్ళు. వాళ్ళలో ముఖ్యులైనవాళ్ళను చెపుతాను విను.!

దివమూర్ధుడు, శకుని, శంకుశిరుడు, శంకుకర్ణుడు, విరాధుడు, గవేష్టి, దుందుభి, అయోముఖుడు, శంబరుడు, కపిలుడు, వామనుడు, మరీచి, మఘన, ఇర, శంకుశిరుడు, వృకుడు, వక్షోభణుడు, కేతువు, కేతువీర్యుడు, శతహ్రదుడు, ఇంజిత్, సత్యజిత్తు, వజ్రనాభుడు, మహానాభుడు, విక్రాంతుడు, కాలనాభుడు, ఏకచక్రుడు, మహాబాహువు, తారకుడు, వైశ్వానరుడు, పులోముడు, విద్రావణుడు, మహాసురుడు, స్వర్భానువు, వృషపర్వుడు, తుహంతుడు, సూక్ష్ముడు, అతి చంద్రుడు, ఊర్ణనాభుడు, మహగిరి, అసిలోముడు, కేశి, శరుడు, బలకుడు, మదుడు, గగనమూర్ధుడు, కుంభనాశుడు, ప్రమరుడు, విరూపాక్షుడు, సుదధుడు, హరుడు, అహరుడు, హిరణ్యకశిపుడు, శతమన్యు, శంబరుడు, శరభుడు, శలభుడు, విప్రచిత్తి వీరు దనువను స్త్రీ పుత్రులు. వీళ్ళలో విప్రచిత్తి తక్కినవాళ్ళ కంటే గొప్పవాడు, మిక్కిలి బలవంతుడును. వీళ్ళ పుత్రపౌత్రులతో వృద్ధి చెందిన రాక్షసవంశము. అందరినీ లెక్కపెట్టి చెప్పుట అసంభవము.

స్వర్భాను కుమార్తె ప్రభ. ఉపదానవి, హయశిర, శచి, వార్షపర్వణి(శర్మిష్ఠ) వీరందరు పులోమ పుత్రికలు. పులోమ కాలిక వీరిద్దరు వైశ్వానరుని కుమార్తెలు. వీరిద్దరు గొప్పశక్తి కలవాళ్ళు. కశ్యపుడికి వీళ్ళు భార్యలయ్యారు. పులోమ, కాలిక అనువారి వల్ల కశ్యపుడు అరవైవేలమందిని కన్నాడు. ఈ రాక్షసులు మిక్కిలి బలవంతులు దేవతలకు కూడ చంప శక్యం కానివాళ్ళు. హిరణ్యపురంలో ఉండే వాళ్ళు. అర్జునుని చేతిలో వీరందరూ మరణించారు.

ప్రభ అనే స్త్రీకి నహుశుడు, శచికి సృంజయుడు, శర్మిష్ఠకు పూరువు జన్మించారు. ఉపదావనికి దుష్యంతుడు పుట్టాడు. విప్రచిత్తికి సింహిక యందు పదముగ్గురు కుమారులు కలిగారు. వీళ్ళు రాక్షసులతో కలిపి మహా పరాక్రమ వంతులయ్యారు. వంశ, శల్య, నభ, వాతాపి, నముచి, ఇల్వల, బాస్వమ, అంజిక, నరక, కాలనాభ, శుక పోతరణ, వజ్రనాభ, దానవులు పదముగ్గురిలో రాహు అందరి కంటే పెద్దవాడు. ఇతడే గ్రహణానికి కారకుడు, మూక తుహుండులిద్దరు హ్లాదుని పుత్రులు. సుందుడికి తాటయందు మారీచుడు పుట్టాడు. శివ మాణసుర కల్ప రాక్షసుల పుత్ర పౌత్రుల లెక్కించి చెప్పటం కఠినమైన విషయము.

సంహ్లాదుని వంశంలో వాకవచగణము పుట్టింది. వాళ్ళు గొప్ప తపస్సు చేసిన వాళ్ళు. వాళ్ళ పుత్రులసంఖ్య మూడు కోట్లు. వాళ్ళు మణి అనే పట్టణంలో ఉండే వాళ్ళు. వాళ్ళు బ్రహ్మ నుండి వరాలు పొంది చంపశక్యం కానివాళ్ళు అయ్యారు. వాళ్ళను కూడ అర్జునుడే సంహరించాడు. తామ్రకు ఆరుగురు పుత్రికలు. వాళ్ళు కాకి, శ్యేని, భాసి, సుగ్రీవి, శుచి, గృధ్రిక అనువారు. కాకికి కాకులును, ఉలూకి గుడ్లగూబలును, శ్యేనికి గ్రద్దలు పుట్టినాయి. శుచికి జలచర పక్షులు, సుగ్రీవికి ఒంటెలు, గాడిదలు మొదలైనవి పుట్టాయి. వీటన్నింటి ద్వారా తామ్రవంశం వృద్ధి చెందింది. వినత కుమారులు, అరుణుడు, గరుడుడు, గరుడుడు పక్షులలో శ్రేష్టుడయ్యాడు.

సురసకు వెయ్యిసర్పాలు పుట్టాయి. అవి ఎల్లప్పుడు గరుడునికి అధీనములై ఉండేవి. వీరిలో శేషుడు, వాసుకి, తక్షకుడు, ఐరావతుడు, మహాపద్మడు, కంబలుడు, అశ్వతరుడు, ఐలాపుత్రుడు, శంఖకర్కోటకులు, ధనంజయ, మహా నీల, మహాకర్ణ, ధృతరాష్ట్ర బలాహక, కుమార పుష్పదంష్ట్ర, దుర్ముఖ, సుముఖ, శంఖ శంఖపాల, కపిల, వామన, నహుష, శంఖరోమ, మణి, మొదలైనవారు. వీరి పుత్ర మనుమలు గరుడునిచే చంపబడ్డారు. నేలపై నడుచునట్టివి, నీటిలో నడుచునట్టి పక్షులు అన్నీ పృధ్వి అనుదాని సంతతి. సురభి ఎద్దులను, దున్నపోతు లను ఆవులను కన్నది. ఇర చెట్లు తీగలు, గడ్డిలోని రకాలను అన్నిటినీ కన్నది. ఖశ అనే స్త్రీ యక్షులను రాక్షసులను మునులను అప్సరసలను కన్నది. అరిష్ట బలవంతులైన గంధర్వులను కన్నది.

ఈ విధంగా కశ్యపుని యొక్క కదులునట్టి కదలనట్టి సంతతిని వర్ణించి చెప్పాను. వారి పుత్రులు మనుమలు వందల వేలకొలదిగా ఉన్నారు. ఇది స్వారోచిష మన్వంతరమందలి సృష్టి. వైవస్వత మన్వంతరంలో వరుణుడు ఒక గొప్ప యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞంలో హోమం చేసేవాడుగా ఉన్న బ్రహ్మద్వారా ఏర్పడిన సృష్టికార్యము వివరించి చెపుతాను.

ఈ వైవస్వత మన్వంతరంలో బ్రహ్మ సప్తర్షులను గంధర్వులు మొదలగు వాళ్ళనూ సృష్టికార్యంలో ఆజ్ఞాపించాడు. తరువాత దేవతలకు రాక్షసులకూ విరోధ మేర్పడి రాక్షసులు నశించారు. పుత్రనాశనమునకు దుఃఖిస్తూ దితి భర్తయైన కశ్యపు నకు సంతోషం కలిగించింది. అతడు వరం కోరుకోమన్నాడు. ఇంద్రుని చంపుటకు సమర్థుడైన పుత్రుడు కావాలని కోరింది. వంద సంవత్సరాలు గర్భం ధరించి

ఉండ గలిగితే నీవు కోరినట్లే జరుగుతుందని భర్త వరమిచ్చాడు. రాజా! పరి శుద్ధురాలై ఉండి ఆమె గర్భం ధరించింది. కశ్యపుడిలా చెప్పి తపస్సు చేసుకొనుటకు వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు ఆ గర్భాన్ని వ్యర్థం చేయటానికి ఎప్పుడు అవకాశం దొరుకుతుందా అని వేచి చూస్తున్నాడు. కొంచం తక్కువగా వంద సంవత్సరాలైన సమయంలో ఇంద్రుడికి అవకాశం దొరికింది. కాళ్ళు కడుక్కోనకుండా దితి పడుకుంది. ఆమె నిద్ర పోతుండగా ఆమె గర్భంలో ప్రవేశించాడు. గర్భంలో పిండాన్ని తన వజ్రా యుధంతో కోసి ఏడు ముక్కలు చేశాడు. కోస్తుండగా శిశువు ఏడుపు ప్రారం భించాడు. ఇంద్రుడు మాటిమాటి అతని ఏడ్పును అడ్డగించినా మరల మరల ఏడుస్తూనే ఉన్నాడు. ఇందుకు ఇంద్రునికి క్రోపం వచ్చింది. ఒక్కొక్క ముక్కను మళ్ళీ ఏడేసి ముక్కలు చేశాడు. ఇంద్రుడు మరుత్తులనే దేవతలైన ఆ నలభై తొమ్మిది తనకు సహాయంగా చేసుకున్నాడు. ఈవిధంగా ప్రాణిసృష్టి వృద్ధి చెందింది.

అప్పుడు విష్ణువు దేవతలలో ఒకణ్ణి సేనాపతిగా చేశాడు. ఒక్కొక్క దేవతను ప్రాణులకు రాజుగా చేశాడు. పృథు మహారాజు ఈ రాజులలో ప్రధానుడు. విష్ణువే ప్రధానుడు. వీరుడు, కృష్ణుడు, జయశీలుడు, ప్రజాపతి, మేఘము, సూర్యుడు అవ్యక్త పురుషుడు అయి ఉన్నాడు. ఈ ప్రజాసృష్టి విషయాన్ని నలభై తొమ్మిది వాయువుల పుట్టుక విన్నవాడు చదివినవాడు పరలోక భయం లేనివాడవుతాడు. అతడు మరల భూమిపై పుట్టవలసిన అవసరముండదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
దక్షప్రజాపతి వలన మరుత్తులు పుట్టుట అను మూడవ అధ్యాయం

☆ ☆ ☆

# నాల్గవ అధ్యాయము

## పృథుచరిత్ర- దిక్పాల ప్రతిష్ఠ

మరల వైశంపాయనుడిలా చెప్పాడు.

బ్రహ్మదేవుడు వేనుడి కుమారుడైన పృథువును రాజుగా పట్టాభిషేకం చేశాడు. తరువాత ఎవరెవరికి ఏఏ పని వప్పచెప్పినదీ చెపుతాను విను.

బ్రాహ్మణులకు, తీగెలకు, నక్షత్రాలకు, గ్రహాలకు, యజ్ఞాలకు తపస్సులకునూ చంద్రుని రాజుగా చేశాడు. బృహస్పతిని సమస్త ప్రపంచానికీ అధిపతిగా చేశాడు. భృగు వంశమందు పుట్టినవారందరికీ శుక్రాచార్యుని, ఆదిత్యులందరికీ విష్ణువును, వసువులకు పావకుని (అగ్నిని) ప్రజాపతులకు దక్షుని, మరుత్తులకు ఇంద్రుని, రాక్షసులకు ప్రహ్లాదుణ్ణి, పితృదేవతలకు యముణ్ణి, మాతృకలకు, వ్రతాలకు మంత్రాలకు గోవులను, యక్షులకు రాక్షసులకు సాధ్యులకు అధిపతిగా విష్ణువును, వ్యవస్థ ఏర్పరచాడు. రుద్రులకు శివుణ్ణి అధిపతిగాను, విప్రచిత్తిని రాక్షసులకు సమస్త భూత పిశాచాలకు, శివుణ్ణి పర్వతాలకు హిమవంతుని, నదులకు సముద్రుణ్ణి, అన్ని వాసనలకు వాయువులకు, శరీరములేని ప్రాణులకు, శబ్దమునకు ఆకాశానికి వాయువును రాజుగా బ్రహ్మ కల్పించాడు, గంధర్వులకు చిత్రరథుణ్ణి రాజు చేశాడు. సర్పాలకు వాసుకుని సర్పాతకు తక్షకుని ఏనుగులకు ఐరావతమును రాజుగా చేశాడు. గుర్రాలకు ఉచ్చైశ్రవమును, పక్షులకు గరుడుని, జంతువులకు పెద్దపులిని, ఆవులకు, ఎద్దులకు ఆబోతును, వనస్పతులకు (పువ్వులు లేకుండా కాయలు కాసే చెట్లకు) జువ్విచెట్టును, సముద్రాలకు, నదులకు, మేఘాలకు, ఆదిత్యులకును, పర్జన్యుని అధిపతిగా చేశాడు.

కోరలు గల ప్రాణులకు శేషుని రాజుగాను, సర్పాలకు తక్షకుణ్ణి, గంధర్వులకు, అప్సరసలకు మన్మధుని, ఋతు, మాస, దిన, పక్ష, రాత్రి ముహూర్త తిథి, పర్వ కలా కాష్ఠ ప్రమాణాలకు ఉత్తరాయణ, దక్షిణాయనాలకు గణితానికి యోగానికి కూడ సంవత్సరాన్ని ప్రభువుగా చేశాడు. బ్రహ్మ ఈ విధంగా రాజ్యాలను విభజించి దిక్పాలకులను స్థాపించాడు. తూర్పుదిక్కునందు వైరాజుని పుత్రుడైన సుధన్వుని రాజుగా చేశాడు. దక్షిణ దిక్కునందు కర్దమప్రజాపతి పుత్రుడైన శంఖపదుని పడమర దిక్కునందు, రాజముని పుత్రుడైన కేతుమంతుని, అట్లే హిరణ్యరోముని ఉత్తరదిక్కునందును రాజుగా చేశాడు. వాళ్ళు ఈ భూమినంతనూ ధర్మంగా పరిపాలిస్తున్నారు. చాక్షుష మన్వంతర కాలము పూర్తి అయిన తరువాత బ్రహ్మ వైవస్వత మనువుకు రాజ్యం వప్పచెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో

పృథుచరిత్ర - దిక్పాల ప్రతిష్ఠ అను నాల్గవ అధ్యాయం

☆☆☆

# ఐదవ అధ్యా యము

## వేనుడి మరణం- పృథుపు జన్మ

ఆ వైవస్వతమనువు యొక్క విస్తర వృత్తాంతాన్ని యిక చెపుతాను విను అని వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! పూర్వము అత్రి వంశంలో పుట్టిన 'అంగుడు' అనే రాజు ప్రజాపతి అయ్యాడు. అతని కొడుకు వేనుడు. అతడు ధర్మం తెలిసినవాడుకాడు. మృత్యువు కుమార్తె అయిన సునీథకు పుత్రుడు. అతడు ధర్మభ్రష్టుడై కామంచేత, లోభంచేత ఆకర్షింపబడ్డాడు. రాజ్యంలో అధర్మాన్ని స్థాపించాడు. వేదధర్మాలను అతి క్రమించాడు. అధర్మమందు ఆసక్తి కలవాడయ్యాడు. అతని రాజ్యంలో స్వాధ్యాయం చదివేవాళ్ళు లేరు. వషట్కారాలు లేవు. యజ్ఞాలలో ఇచ్చిన సోమరసాన్ని దేవతలు త్రాగలేదు. యాగం చేయకూడదు, హోమం చేయకూడదని ప్రజాపతియైన అతని ప్రతిజ్ఞ. నేనే పూజింపదగినవాడను, యజ్ఞస్వరూపుడను, యజ్ఞం చేసేవాడినికూడ, ప్రజలు నా కొరకే యజ్ఞం చేయాలి. నాకొరకే హోమం చేయాలి. హద్దుమీరి చేయరానిపనులు చేస్తున్నవానికి మరీచి మొదలైన మహర్షులందరు మేము చాలా సంవత్సరాలు దీక్షలో ఉంటాము.

వేనమహారాజా! నీవు అధర్మం చేయక. మేము పురాతనమైన ధర్మాన్ని పాటిస్తున్నాం. నీవు అత్రి వంశంలో పుట్టావు. ప్రజాపతివి సందేహం లేదు. ప్రజలను పరిపాలిస్తానని నీవు ప్రతిజ్ఞ చేశావు. అని పలుకగా ధర్మాన్ని సృష్టించినవాడు నాకంటే ఎవడున్నాడు? నేను ఎవడి మాటలు వినాలి? పాండిత్య పరాక్రమ తప సత్యములలో నాకు సమానుడెవ్వడునాడు? అన్ని ధర్మాలకు కారణమైన నన్ను అజ్ఞానులైన మీరు తెలుసుకొనుటలేదు. నేను కావాలంటే భూమినంతను తగల బెట్టగలను. లేదా నీటిలో నీటిలో ముంచి వేయగలను. భూమిని ఆకాశాన్ని అడ్డగించ గలను. ఇందుకు సందేహం లేదు. అని వేనుడు అజ్ఞానంచేత గర్వంచేత, మంచి పడువడి పాటించకపోగా మహర్షులు కోపించి మహాబలశాలిరై ప్రకాశిస్తున్న వేనుని పట్టుకొని అతని ఎడమతొడను మథించారు (తరిచారు) అలా మథిస్తుండగా పిక్కలి పొట్టి నల్లని పురుషుడు పుట్టాడు. అతడు భయపడుతూ చేతులు జోడించి నిలబడ్డాడు.

అత్రి మహర్షి అతని చూచి 'నిషీద' (కూర్చో) అన్నాడు. అతడు కిరాత(నిషాద) వంశానికి మూలపురుషుడయ్యాడు. వేనుని పాపం వలన చేపలు పట్టు జాతి సృష్టించబడింది. ఆ జాతినుండి తుషారులు, తుంబురులు అనే ధర్మరహితమైన అసభ్యజాతులు పుట్టాయి. తరువాత మహర్షులు వేనుని కుడి చేతిని మధించారు (తరిచారు) అప్పుడు 'పృధువు' అనే అగ్నితో సమానమైన తేజస్సుగలవాడు పుట్టాడు. అతడు ధనుస్సును ధరించి కవచంతో పుట్టాడు. అతడు గొప్ప ధ్వనిగల ధనుస్సును పట్టుకొని దివ్యములైన బాణాలను పట్టుకొని ప్రజలను రక్షించటానికి పుట్టగానే ప్రజలు సంతోషించారు. వేనుడు స్వర్గము పొందాడు. సత్పుత్రుడు జన్మించి నందున వేనుడు పున్నామనరకము నుండి బయటపడ్డాడు.

సముద్రములు, నదులు, రత్నాలను, తేగా దేవతలతో కూడిన బ్రహ్మ రాగా ప్రాణులందరూ సముద్రనదీ జలాలతో పట్టాభిషేకం చేశారు. ధర్మవేత్తలైనవారిచే ఆదిరాజుగా ప్రతాపవంతుడైన పృథువు పట్టాభిషేకం చేయబడ్డాడు. తన తండ్రిచే బాధపడిన ప్రజలు పృధుచక్రవర్తి చేత రంజింపబడ్డారు. ప్రజల అనురాగం వలన అతడు రాజయ్యాడు. రాజు అనే మాటకు ప్రజలను రంజింపచేసేవాడు (సంతోష పెట్టేవాడు) అని అర్థం. అతడు యుద్ధానికి వెళ్ళేటప్పుడు సముద్రం దారిచ్చేది. పర్వతాలు కూడ మార్గమిచ్చేవి. జండా ఎప్పుడు విరుగలేదు. దున్నకుండానే భూమి పండేది. అన్నం కావాలనుకోగానే గిన్నెనిండా అన్నం కనిపించేది. ఆవులు కామ ధేనువు వలె కోర్కికలు తేర్చేవి. చెట్లులో ప్రతి ఆకువద్దనూ తేనె ఉండేది.

ఆ సమయంలోనే పృధుమహారాజు బ్రహ్మయజ్ఞం చేశాడు. ఆ యజ్ఞంలో సోమరసంతో నిండిన కుండనుండి బుద్ధిమంతులైన సూత మాగధులు(స్తోత్రం చేయువారు) పుట్టారు. అప్పుడు ఋషులు సూత మాగధులకు పృధుమహారాజును స్తోత్రం చేయండి అని చెప్పారు. అప్పుడు వారు దేవతల ఘనకార్యాలను వెల్లడిస్తూ స్తోత్రం చేస్తూ ఉంటాము. ఈ రాజు గుణాలు ఏమి తెలియకుండా ఎలా స్తోత్రం చేస్తామని ప్రశ్నించారు. వెనుకటి కల్పంలో ఇతడెటువంటి పనులు చేశాడో, ఏ గుణాలు కలవాడో ఆ పనులే ఆ గుణాలే కలవాడుగా స్తోత్రం చేయమన్నారు ఋషులు.

అప్పుడు సూతమాగధులు పృధుచక్రవర్తిని 'మహాబలపరాక్రమములు గలవాడా! వేనపుత్రా! నీవంటి సత్యము పలికేవాడు, దాత మరొకడు లేడు, నీవు సత్యమైన ప్రతిజ్ఞ గలవాడవు. నీవు శ్రీమంతుడవు, విజయం గలవాడవు, గొప్ప

ఓర్పు గలవాడవు. పరాక్రమవంతుడవు, చెడ్డవాళ్ళను శిక్షించేవాడివి. ధర్మం తెలిసిన వాడవు. చేసిన మేలు మరువనివాడవు, దయ గలవాడవు, ప్రియంగా మాట్లాడే వాడవు, గౌరవింపదగినవాడవు, ఎదుటివారిని గౌరవించేవాడవు, యజ్ఞం చేసే స్వభావం కలవాడవు. బ్రాహ్మణ భక్తుడవు, నీవు శాన్తుడవు, నీ పనులలో ఆసక్తి కలవాడవు, వ్యవహారంలో నేర్పుగలవాడవు, అని స్తోత్రం చేశారు. అప్పటి నుండి వాళ్ళకు ఆశీర్వాదంచేసే అధికారం వచ్చింది. వాళ్ళ స్తోత్రంచేత ప్రసన్నుడై సూతునకు అనూపదేశాన్ని, మగధుడికి మగధదేశాన్ని దానం చేశాడు పృథుమహారాజు. మహారాజైన పృథువును చూచి ప్రసన్నులైన ఋషులు ప్రజలకు ఇలా చెప్పారు.

ఈ పృథుమహారాజే మీ జీవితానికి ఉపయోగం కలుగచేస్తాడు, అని అప్పుడు ప్రజలు మహారాజు వద్దకు వచ్చి మహారాజా! ఋషులు చెప్పినట్లు మాకు జీవించే వ్యవస్థ కలుగజేయుము అని విన్నవించారు. అప్పుడు రాజు ప్రజలకు మేలు చేయగోరి ధనుస్సు బాణాలను తీసుకొని భూమిని ఆహారం సమకూర్చవలసిందని పీడించాడు. అప్పుడు భూమి పృథువుకు భయపడి ఆవు రూపాన్ని పొంది పరుగెత్తింది. పృథువు దానిని వెంటాడాడు. రాజునకు భయపడి భూమి అన్ని లోకాలు తిరిగి తనకు ఎదురుగా నిలిచి ధనుస్సు ధరించియున్న పృథువును చూచింది దేవతలకు కూడా ఎదిరింపరాని అతన్ని చూచి రక్షణ లేనిదై పృథువునే శరణు వేడింది. భూమి చేతులు జోడించి స్త్రీ వధ చేయతగదని ప్రార్థించింది.

మరియు మహారాజా! నేను లేకపోతే ప్రజల నందరను నీవెక్కడ ఉంచుతావు? అందరూ నాపైన నివసిస్తున్నారు. నేను సమస్త ప్రపంచాన్ని మోస్తున్నాను. నన్ను నీవు నశింపచేస్తే ప్రజలందరూ నశిస్తారు. నీవు ప్రజలకు క్షేమం కలుగజేసేటట్లైతే నామాట విను- ఏ పనులైనా ఉపాయంతో నెరవేరుతాయి. ఈ ప్రజలను పోషించడానికి ఉపాయం ఆలోచించు. నన్ను చంపి ప్రజలను నీవు రక్షించలేవు. తరువాత పశ్చాత్తాపడతావు. స్త్రీని చంపకూడదని పెద్దలు చెపుతారు అని ఈ విధంగా భూమి చెప్పిన మాటలు విని కోపం తగ్గించుకొని రాజు భూమితో ఇలా అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
వేనుడి మరణం- పృథువు జన్మ అను ఐదవ అధ్యాయం

☆☆☆

# ఆరవ అధ్యాయము

## పృథువు భూమిని చేసి పితుకుట

తన కొరకుగాని, ఇతరుడైన ఒక్కని కొరకుగాని చాలా ప్రాణులను చంపే వాడికి పాపం వస్తుంది. చాలామంది కొరకు ఒకనిని చంపితే పుణ్యం వస్తుంది. కనుక ప్రజల కొరకు నిన్ను చంపుతా. నీవు నా మాట వినకపోతే నిన్ను చంపి ప్రజలను రక్షిస్తాను. ప్రజలనందరినీ పోషించి బ్రతికించు. నీవు సమర్ధురాలవు. నీవు నాకు కూతురువైతే ఈ బాణాన్ని ప్రయోగించను అని. భూమి అప్పుడిలా అన్నది. నీవు చెప్పినదంతయూ చేస్తాను. ఉపాయం లేని పని సమకూరదు. ఫలించదు. నాకొక దూడను చూడు. అప్పుడు ప్రేమతో స్రవిస్తాను. అంతటా నన్ను సమతలంగా చెయ్యి. అప్పుడు స్రవించిన పాలు అంతటా వ్యాపిస్తాయి.

వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

పృథుమహారాజు అప్పుడు తన ధనుస్సు చివరభాగంతో పర్వతాలను బ్రద్దలు చేసి భూమిని సమతలం చేశాడు. ఇతర మన్వంతరాలలో భూమి ఎత్తుపల్లాలుగా ఉండేది. సమతలం చేసిన తరువాత పట్టణాలు గ్రామాలు ఆవులను కాపాడుట వ్యవసాయం వ్యాపారం సత్యం, అసత్యం లోభము అసూయ లేకుండా పోవుట ఏర్పడ్డాయి. వైవస్వత మన్వంతరంలో పృథుమహారాజు మొదలుకొని యివి సంభ వించాయి. భూమి సమతలంగా ఉన్నచోటల్లా ప్రజలు నివసించ నారంభించారు. ఆహారం, పండ్లు, దుంపలు సమకూరాయి. పృథుమహారాజు స్వాయంభువ మనువును దూడగా చేసి తన చేతులతో అన్ని రకాలైన పైరులను పాలుగా పితికాడు. ఆ అన్నంతో ప్రజలు ఇప్పటికీ జీవిస్తున్నారు.

ఋషులిలా అంటున్నారు!

మళ్ళీ పితికారనీ చంద్రుడు దూడ, బృహస్పతి పితికేవాడు. వేదాలు గిన్నె కాగా తపస్సు శాశ్వత బ్రహ్మరూపమైన పాలు వచ్చాయి. తరువాత ఇంద్రుడు మొదలైన దేవతలు బంగారుపాత్ర తెచ్చి పాలు పితికారని వింటున్నాము. అప్పుడు ఇంద్రుడు దూడ, పితికేవాడు సూర్యుడు కాగా బలకరమైన పాలు వెలువడ్డాయి. దేవతలా పాలను త్రాగారు. పితృదేవతలు కూడ పితికినట్లు వింటున్నాం. వెండిపాత్ర లోకి స్వధను(పితృదేవతల ఆహారం) పితికారు. అప్పుడు యముడు దూడ, కాలుడు(లోకనాశకుడు) పితికేవాడు. అతడు స్వధ (పితృదేవతల ఆహారం)

పితికాడు. తరువాత తక్షకుణ్ణి దూడగా చేసిన సర్పాలు కూడ అనపకాయ బుర్రను పాత్రగాచేసి విషాన్ని పాలుగా పితికాయి. అప్పుడు ఐరావతుడు పితికేవాడు. తరువాత రాక్షసులు పితికాయి. వాళ్ళకు పాత్ర ఇనపది.

ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు దూడగా ఉన్నాడు. రెండుశిరస్సులుగ 'మధువు' పితికేవాడు, మాయయే పాలు. ఆ మాయారూపమైన పాలను త్రాగి రాక్షసులు మాయావులు(మాయచేసేవాళ్ళు) అయ్యారు. తరువాత యక్షులు పితికారు. పచ్చిపాత్రలో అంతర్ధానము (కనపడకపోవుట) అనే పాలు, కుబేరుడు దూడ, రజతనాభుడు పితికేవాడు. రాక్షసులు, పిశాచాలు మళ్ళీ పితికారు. వీళ్ళు శవము యొక్క పుర్రెలోకి రజత నాభుడు పితికాడు. సుమాలి దూడ. రక్తం పాలు. ఆ పాలతో యక్షులు, రాక్షసులు దేవతలతో సమానులయ్యారు. గంధర్వులు తామరాకులోకి మళ్ళీ అప్సరోగణాలతో కలిసి పితికారు.

అప్పుడు చిత్రరథుడు దూడ, సురుచి పితికేవాడు, పరిశుద్ధములైన సుగంధ ద్రవ్యాలు పాలు. పర్వతాలు మళ్ళీ పితికాయి. ఓషధులు అనేకవిధాలైన రత్నాలు పాలు. దూడ హిమవంతుడు. పితికేవాడు మేరుపర్వతము. కొండయే పాత్ర. లతలు మళ్ళీ పితికాయి. పాత్ర మోదుగ ఆకు. మద్దిచెట్టు పితికేవాడు. భూమి మొక్కలను కోసివేసినా మళ్ళీ మొలుచుటయే పాలు. ఈభూమి తల్లివలె అందరినీ పోషించేది. పరమపవిత్రమైనది. అన్నికోరికలను తీర్చునది. అన్నివిధాలైన పైరులను పెంచేది. ఈభూమి సముద్రము వరకూ ఉండేది. మధుకైటభులనే రాక్షసులయొక్క మేదస్సుచే తడిసినందున మేదినీ అనే పేరు కలదైనది. అందుచేత భూదేవి పృథుమహారాజు కుమార్తె అయినది.

పృథువు భూమిని విభజించాడు శుద్ధిచేశాడు కూడ. పైరుల ఆకారాన్ని పొంది విస్తారమైన పట్టణములు, పురములు, మాలలుగా కలదైనది. ఇలాంటి ప్రభావం గలవాడు పృథుచక్రవర్తి. సమస్తప్రాణుల చేత నమస్కరింపదగినవాడు, పూజింపదగినవాడును సంశయం లేదు. వేదపండితులైన బ్రాహ్మణులచేత కూడ పృథువు నమస్కరింపదగినవాడు. రాజులచేత, రాజు కాదలచినవారి చేతనూ ఆదిరాజైన పృథువు నమస్కరింపదగినవాడు. యుద్ధంలో జయం కోరే యోధుల చేత మొదటి రాజైన పృథువే నమస్కరింపదగినవాడు. పృథువును తలుచుకొని యుద్ధానికి వెళ్ళినవాడు ఘోరయుద్ధములలో జయం పొంది క్షేమంగా కీర్తి గల

వాడవుతాడు. ధనవంతులైన వైశ్యులచేత కూడ అందరికీ జీవనం కల్పించిన పృథువే నమస్కరింపదగినవాడు. అట్లే శూద్రులచేత కూడ ఆదిరాజు నమస్కరింపదగినవాడు. దూడలను పితికేవాళ్ళకు పాలపాత్రలను చెప్పాను ఇంకా నీకేమి చెప్పను? ఈ పృథుచరిత్రను మొదటినుండి విన్నవాడు కొడుకులు మనవళ్ళతో చాలాకాలము సంతోషిస్తాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పృథువు భూమిని పితుకుట అను ఆరవ అధ్యాయము

☆ ☆ ☆

# ఏడవ అధ్యాయము

## మన్వంతర, మనుదేవతా ఋషివర్ణన

జనమేజేయుడిలా అడిగాడు.

ఓ తపోధనా! అన్ని మన్వంతరాల గూర్చి విస్తారంగా వినగోరుచున్నాను. వారి సృష్టిక్రమాన్ని కూడ చెప్పవలసినదిగా కోరుతున్నాను అని.

అప్పుడు వైశంపాయనుడిలా అన్నాడు.

నాయనా! వందల కొలది సంవత్సరాలు కూడ విస్తారంగా చెప్పటానికి చాలవు. మన్వంతరాలను తగ్గించి చెపుతాను విను!

స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఔత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సావర్ణి, భౌత్యుడు, రౌచ్యుడు, బ్రహ్మ సావర్ణి మొదలగు నలుగురూ మనువులుగా చెప్పబడుచున్నారు. వీరిలో కొందరు గతించినవారు ఇప్పుడున్నవారు రాబోవువారు ఉన్నారు. ఈ మనువులను గూర్చి ఆ కాలమందలి ఋషుల గూర్చి దేవగణముల గూర్చి చెపుతాను!

మరీచి, అత్రి, అంగీరసుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు, వశిష్టుడు వీరు ఏడగురు బ్రహ్మకుమారులు. రాజా! ఉత్తరదిక్కున కనిపించే సప్తరుషులు వేరు. స్వాయంభువ మన్వంతరంలో 'యాములు' అనే దేవతలున్నారు. అగ్నీధ్రుడు, అగ్నిబాహుడు, మేధా, మేధాతిథి, వసువు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, హవ్యుడు, సవనుడు, పుత్రుడు ఈ పదిమందిని స్వాయంభువుని పుత్రులు. రాజా! ఇది మొదటి మన్వంతరం.

ఔర్వుడు, వశిష్టుని కుమారుడు స్తంభుడు, కాశ్యపుడు, ప్రాణుడు, బృహస్పతి, దత్తుడు, అత్రి, చ్యవనుడు ఈ ఋషులు తుషితులనే దేవతలుగా స్వారోచిష మన్వంతరంలో చెప్పబడుతున్నారు. హవిధ్రుడు, సుకృతి, జ్యోతి, ఆప, మూర్తి, ఆయ, స్మయ, ప్రథిత, నభస్య, నభు, ఊర్జ అనువారు స్వారోచిష మనువు యొక్క మహాబలవంతులైన పుత్రులు. రెండవ మన్వంతరం ఇది.

ఇక మూడవ మన్వంతరం చెపుతాను విను.

వాశిష్టులని పేరు పొందిన వసిష్ఠుని పుత్రులు ఏడుగురు. వారే బ్రహ్మనుండి జన్మించి ఊర్జులని ప్రసిద్ధిచెందారు. వారే ఈ మన్వంతరంలోని ఋషులు. మహారాజా! ఇప్పుడు ఉత్తముడనే మనువు యొక్క పుత్రులను గూర్చి చెపుతున్నాను విను. ఈష, ఊర్జ, తనూర్జ, మధు, మాధవ, శుచి, శుక్ర, సహ, నభస్య, నభ అను వీరు ఉత్తమమనువు పుత్రులు. ఈ మన్వంతరంలో భానుగణము దేవతలు. ఇది మూఢవ మన్వంతర వృత్తాంతము.

ఇక్క నాల్గవ మన్వంతర విషయం చెప్తుతున్నాను.

ఇది తామస మన్వంతరము. దీనిలో కావ్యుడు, పృథు, అగ్ని, జిహ్నుధాత, కపివంతుడు, అకపివంతుడు, వీరు సప్తరుషులు. వీరికి పురాణాల్లో అనేక పుత్రులు చెప్పబడ్డారు. ఈ మన్వంతరంలో సత్యులనేవాళ్ళు దేవగణము. ఓ రాజా! ద్యుతి, తపస్య, సుతప, తపోమూల, తపోధన, తపోరతి, అకల్మాష, తనిద, ధన్వి, పరంతప అనే పదిమంది తామసువు పుత్రులు.

తరువాత ఐదవ మన్వంతరంలో వేదబాహు, యదుధ్ను, మునివేదశిర, హిరణ్యారోమ, పర్జన్య, సోమపుత్ర, ఊర్ధ్వబాహు మరియు అత్రిపుత్రుడు, సత్యనేత్రుడు అనేవారు సప్తరుషులు. ఈ మన్వంతరంలోని దేవతలందరూ రజోగుణంతో కూడినవాళ్ళు. వీరి ప్రకృతి మార్గము కూడ రజోగుణము కలది. పారిప్లవ, రైభ్యనామకులు ఈ మన్వంతరంలోని దేవతలు. ధృతిమంతుడు, అవ్యయుడు, యుక్తుడు, తత్వదర్శి, నిరుత్సుకుడు, అరణ్యుడు, ప్రకాశనుడు, నిర్మోహుడు, సత్యవాక్కు మరియు కృతి అనేవారు ఐదవ రైవతమనువు యొక్క కుమారులు.

ఇక ఆరవ మన్వంతర వృత్తాంతము చెపుతాను విను.

భృగువు, నభ, వివస్వంతుడు, సుధామ, విరాజ, అతినామ, సహిష్ణు వీరు ఈ మన్వంతరంలోని సప్తరుషులు. ఇక చాక్షుష మన్వంతరం తర్వాత మన్వంతరం

లోని దేవతలను విను అద్యుడు, ప్రభూతుడు, ఋషిబుభుడు, లేఖుడు, ఈ ఐదుగురూ ఈ మన్వంతరం తాలూకు దేవతలు. వద్వల అనే స్త్రీకి పుట్టిన అంగిరస ఋషిపుత్రులు. ఊరువు మొదలైన పదిమంది ఆరవ మనువు పుత్రులు.

ఇక ఏడవ మన్వంతర వృత్తాంతం చెపుతా విను.

అత్రి, వసిష్ఠుడు, కశ్యపుడు, గౌతముడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు ఋచీకుని పుత్రుడైన జమదగ్ని, వీరు ఏడవ మన్వంతరపు సప్తర్షులు. సాధ్యగణము, విశ్వేదేవగణము, రుద్రగణము, వసుగణము, మరుద్గణము, ఆదిత్యగణము, అశ్వినిదేవత లిద్దరూ వీరు దేవతలు. మరియు ఇక్ష్వాకు మొదలైన పదిమంది వైవస్వతమనువు యొక్క పుత్రులు మహారాజ! నేను చెప్పిన గొప్ప ఋషుల యొక్క కొడుకులు, మనుమలు అన్ని దిక్కులా వ్యాపించి ఉన్నారు. పైన చెప్పిన అన్ని మన్వంతరాలతోనూ నలభై తొమ్మిది వాయువులు లోకవ్యవస్థ కొరకూ, లోకరక్షణ కొరకూ నిలిచి ఉన్నాయి. ఒక మన్వంతరం పూర్తికాగానే నాలుగు సప్తకగణములు తమ పని పూర్తి చేసుకొని బ్రహ్మలోకానికి వెళ్ళిపోతాయి. వారి తరువాత ఇతర పురుషులు తమ తపోబలంతో ఖాళీ ఐన స్థానాల్లను పూర్తి చేస్తారు. మహారాజ! ఇలా అన్ని మన్వంతరాలూ వస్తూ పోతూ ఉంటాయి. ఈ విధంగా ఏడు మన్వంతరాలు కథను వినిపించాను.

ఇప్పుడు రాబోయే ఆరు మన్వంతరాల కథనూ చెప్పుతాను విను.

సావర్ణి మనువులు ఐదుగురు. మొదటి సావర్ణి సూర్యుని పుత్రుడు. అతనికి వైవస్వతసావర్ణి అనే పేరు వచ్చింది. తక్కిన నలుగురు సావర్ణులు బ్రహ్మదేవుని పుత్రులు. వాళ్ళు సుమేరుపర్వతం మీద తపస్సు చేశారు. ఈ కారణంచే వాళ్ళు మేరుసావర్ణి అనే పేరుతో ప్రసిద్ధి చెందారు. దక్షుని కుమార్తె ప్రియ అనే దానికి పుట్టినవాళ్ళు గొప్ప తపశ్శాలురు తేజస్సు గలవారును. రుచిప్రజాపతి కుమారుడు రౌచ్యుడు, భూతిప్రజాప్రతి పుత్రుడు భౌత్యుడు వీరిద్దరూ మనువులయ్యారు. తక్కిన నలుగురు మనువులు భూతికి పుట్టినవాళ్ళు. కనుక వాళ్ళు భౌత్యులని పిలువబడుతున్నారు. ఇప్పుడు రాబోవు ఎనిమిదవ సావర్ణిలో ఋషులను గూర్చి చెప్పుతా!

రాముడు, వ్యాసుడు, అత్రి పుత్రుడు, దీప్తిమంతుడు, భారద్వాజుడు, ద్రోణుని కుమారుడు అశ్వత్థామ, గౌతముని కుమారుడు, శరద్వంతుడు, కుశికుని

కులంలో పుట్టిన గాలవుడు, కశ్యప వంశమందులిరుదువు వీరు బ్రహ్మతో సమాన మైన తేజస్సు కలవాళ్ళు. మరియు ఇట్టివాడే ఐన భౌత్యుడు ఆ మన్వంతరపు సప్తరుషులు. వీరందరూ పవిత్రులు మహర్షులు ఎల్లప్పుడూ బ్రహ్మలోకంలో నివ సిస్తారు. వీళ్ళు తమ తపోబలం వల్ల జరిగిన జరుగుచున్న జరుగబోయే వృత్తాంతాన్ని తెలుసుకొన గలవాళ్ళు. ధర్మతత్త్వము తెలిసి వంశస్థాపకులు అవుతారు. సత్య యుగం మొదలగు యుగాలలో ఈ మహర్షులు వర్ణాశ్రమ విభాగం చేస్తారు.

ధర్మం క్షీణించినపుడు వీళ్ళ వంశంలోనే వేదమును ప్రచారం చేసే మహా త్ములు పుడతారు. వీళ్ళు కోరినట్లు వరాలిచ్చే సమర్థత పొందుతారు. వీరెప్పుడూ మహర్షులే. రాజా! ఈ విధంగా ఈ మన్వంతర ఋషులను వర్ణించాను. ఇప్పుడు సావర్ణి మనువు యొక్క కలుగబోవు పుత్రులనూ గూర్చి చెపుతా విను. వాళ్ళు పదిమంది. వరీయమడు, అవరీయనుడు, సమ్మతుడు, ధృతి మంతుడు, వసువు, చరిష్ణువు, అధృష్టుడు, ఆర్యుడు, వాజుడు, సుమతి అనే వాళ్ళు పదిమంది. ఇప్పుడు మొదటి సావర్ణి మన్వంతరంలోని మునుల గూర్చి చెపుతాను విను.

పులస్త్యుని కుమారుడు మేధాతిథి, కశ్యపుని పుత్రుడు వసువు, భృగుపుత్రుడు జ్యోతిష్మంతుడు, తేజస్వి, అంగిరుడు వశిష్ట పుత్రుడు సనకుడు, అత్రి, సువన, హవ్యవాహనుడు, పులహపుత్రుడు పౌలహుడు. వీరే మేరుసావర్ణి మన్వంతరంలో సప్తర్షులౌతారు. ఈ మన్వంతరంలో ముగ్గురే దేవతలౌతారు. వారు దక్షపుత్రుడు, రోహితకుడు సంతానము కాగలరు. ధృష్టకేతు పంచహోత్ర, నిరాకృతిచ ప్రృధుశ్రవ, భూరిధామ, ఋచీక, అష్టహతగయ అనేవాళ్ళు ప్రథమ సావర్ణియొక్క పుత్రులు. గొప్ప తేజశ్శాలురు అవుతారు.

పదవ మన్వంతరంలో పులహపుత్రుడు హవిష్మంతుడు, భృగుపుత్రుడు సుకృతి, అత్రిపుత్రుడు అయోమూర్తి, అష్టమ పులస్త్యపుత్రుడు ప్రమతి, కశ్యప పుత్రుడు నభోగుడు, అంగిరసపుత్రుడు సత్యుడు వీరు సప్తర్షులౌతారు. ఈ మన్వంతరంలో దక్షిణోత్తరదిశలను అభిమానించే ఇద్దరు దేవతలవుతారు. సుత, ఉత్తమేజ, నికుషంజ, వీర్యవంత, శతానీక, నిరమిత్ర, వృషసేన, జయద్రధ, భూరిద్యమ్న, సువర్చస ఈ పదిమంది దక్షసావిత్రికి పుత్రులౌతారు. ఇప్పుడు పద కొండవ మన్వంతరంలో మూడవసావర్ణి కాలంలో కాబోయే ఋషుల పేర్లు చెపుతా.

కాశ్యపపుత్రుడు హవిష్మంతుడు, అత్రిపుత్రుడు అనఘుడు, అంగిరసుని పుత్రుడు చారుధిష్ణ్యుడు, పులస్త్యపుత్రుడు నిశ్చరుడు, పులహపుత్రుడు అతితేజుడు

వీరే సప్తర్షులు ఔతారు. ఈమన్వంతరంలో బ్రహ్మపుత్రులు మూడు సంప్రదాయా లలో ఉండి దేవతలు కాగలరు. సంవర్తకుడు, సుశర్మ, దేవానీకుడు, పురూద్వహుడు, క్షమాధన్వుడు, దృఢాయువు, ఆదర్శుడు, పండకుడు, మనువు ఈ తొమ్మిదిమంది ఈ మూడవ రుద్రసావర్ణి యొక్క పుత్రులౌతారు. ఇప్పుడు నాల్గవ సావర్ణి యొక్క సప్తర్షులనువిను.

వసిష్ఠపుత్రుడు ద్యుతి, అత్రిపుత్రుడు సుతపుడు, అంగిరసుడు, కశ్యప పుత్రుడు తపస్వి, పులస్త్యపుత్రుడు తపోశనుడు, పులహపుత్రుడు తపోరవి, భృగు పుత్రుడు విక్షేపుడు వీళ్ళే సప్తర్షులౌతారు. ఈ మన్వంతరంలో బ్రహ్మమానస సుత్రులు ఐదువిభాగాల్లో విభజింపబడినవాళ్ళు దేవతలవుతారు. దేవబాహువు, అదూరుడు, దేవశ్రేష్ఠుడు, విదూరథుడు, మిత్రవంతుడు, మిత్రదేవుడు, మిత్రకృత్తు, మిత్ర బాహువు, సువర్చుడు ఈ పన్నెండుగురు బ్రహ్మ సావర్ణి పుత్రులు.

పదమూడవ "రౌచ్య"మన్వంతరంలో అంగిరసునిపుత్రుడు ధృతిమంతుడు, పులస్త్యపుత్రుడు హవ్యపుడు, పులహపుత్రుడు తత్త్వదర్శి, భృగుపుత్రుడు నిరుత్సుకుడు, అత్రిపుత్రుడు నిష్ప్రకంపుడు, కాశ్యపపుత్రుడు నిర్మోహుడు, వసిష్ఠ పుత్రుడు సుతపుడు వీరు సప్తర్షులౌతారు. ఈ మన్వంతరంలో కూడ బ్రహ్మ యొక్క ముగ్గురుపుత్రులే దేవగణం అవుతారు. ఇప్పుడు పదమూడవ మనువు పుత్రులను గూర్చి విను. చిత్రసేనుడు, విచిత్రుడు, నయుడు, ధర్మభృతుడు, ధృతుడు, సునేత్రుడు, క్షత్రవృద్ధి, సుతపుడు, నిర్భయుడు, ధృఢుడు వీరే రౌచ్యమనువు యొక్క పుత్రులు. ఇప్పుడు పధ్నాల్గవ భౌత్యమన్వంతరంలో ఉండే సప్తర్షులను విను.

కశ్యపపుత్రుడు అగ్నీధ్రుడు, పులస్త్యపుత్రుడు భార్గవుడు, భృగుపుత్రుడు అతిబాహువు, అంగీరసునిపుత్రుడు శుచి, అతిపుత్ర యుక్తుడు, వసిష్ఠపుత్రుడు శుక్రుడు, పులహపుత్రుడు అజితుడు వీరే ఈమన్వంతరపు సప్తర్షులు అవుతారు. ప్రతిరోజూ ప్రొద్దున ఈమనువుయొక్క, సప్తర్షులయొక్క, మనుపుత్రుల యొక్కయు పేర్లను పలుకువాళ్ళు సుఖం కలవాళ్ళు అవుతారు. ఇలా చేయటంచేత కీర్తి, ఆయుస్సు ప్రాప్తిస్తాయి. ఈవిధంగ వెనుకటికాలంలో, రాబోవుకాలంలో మహర్షు లయ్యే వారిని, ఐదుదేవగణాల వృత్తాంతాన్ని చెప్పాను. తరంగ, భీరు, విప్ర, తరస్వాన్, ఉగ్ర, అభిమాని, ప్రవీణ, జిష్ణుస్కందన, తేజస్వి, సబల అనువాళ్ళు భౌత్యమనువుయొక్క పుత్రులౌతారు.

భౌత్యమనువు కాలం పూర్తికాగానే ఒక కల్పం పూర్తిఅవుతుంది. ఓ మహారాజ జనమేజయ! ఈవిధంగ నేను పేర్లను చెప్పుతూ పద్నాలుగు మనువుల యొక్క వృత్తాంతం చెప్పి వినిపించాను. తపస్సుచేత, ప్రజాసృష్టిచేత గ్రామనగరాలలో సముద్రాలతో కూడిన భూమిని పాలిస్తు వారుండగనే లోకనాశం కూడా జరుగుతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వమందు
మన్వంతర, మనుదేవతా ఋషివర్ణన అను ఏడవ అధ్యాయము

★★★

# ఎనిమిదవ అధ్యాయము

## మన్వంతర, యుగ, బ్రహ్మాదిన, వర్షమానములు

మరల జనమేజయుడు ఓ బ్రాహ్మణోత్తమా! ఇప్పుడు మన్వంతరము యొక్క యుగముల సంఖ్యనూ, బ్రహ్మ యొక్క పగటి ప్రమాణాన్నీ చెప్పుము అని అడిగాడు.

అప్పుడు వైశంపాయనుడిలా అన్నాడు.

సూర్యుడు మనకు పగటిని, రాత్రిని విభజిస్తున్నాడు. ఈ రాత్రింబవళ్ళ లెక్కప్రకారమే మన్వంతరము మొదలగువాటి సంఖ్యను నిరూపిస్తాను. పదిహేను రెప్పపాట్లు "కాష్ట" అనబడుతుంది. ముప్పైకాష్టలు "కల", ముప్పైకలలు "ముహూర్తము", ముప్పైముహూర్తాలు ఒకరోజు. ఈవిధంగా చంద్రసూర్యుల నడకనుబట్టి రాత్రింబవళ్ళ లెక్క జరుగుతున్నది. 15 రోజులు ఒకపక్షం. రెండు పక్షాలు ఒకనెల. రెండునెలలు ఒక ఋతువు, మూడుఋతువులు దక్షిణాయనం, అలా మూడుఋతువులు ఉత్తరాయణం. రెండు అయనాలు ఒక సంవత్సరం. కాలతత్త్వం తెలిసినవాళ్ళు రెండుపక్షాలు పితృదేవతలకు ఒకరోజు. పితృదేవతలకు కృష్ణపక్షం పగలు, శుక్లపక్షం రాత్రి. కనుకనే కృష్ణపక్షంలోనే తల్లితండ్రులకు శ్రాద్ధం చేయబడుతుంది.

మనుష్యుల సంవత్సరకాలము దేవతలకు ఒకరోజు అవుతుంది. ఉత్తరాయణం వాళ్ళకు పగలు, దక్షిణాయనం రాత్రి. దేవతల పదిసంవత్సరాల కాలం మనువుకు ఒకరోజు. అతనికి ఉత్తరాయణం పగలు, దక్షిణాయనం రాత్రి. దేవతల పదిసంవత్సరాలు మనువుకు ఒకరోజు. ఈ ప్రకారంగా పదిరోజులు మనువుకు

ఒక పక్షం. పదిపక్షాలు ఒకనెల, పన్నెండు మాసాలు ఒక ఋతువు, మూడు ఋతువులు ఒక అయనం. ఇలా రెండు అయనాలు గడిస్తే మనువుకు ఒక సంవత్సరం. దేవతల వేయి సంవత్సరాలు మనువుకొక సంవత్సరం.

ఓరాజా! సత్య, త్రేతా, ద్వాపర, కలి, అనేవి నాలుగు యుగాలు. వీటిలో మనువుల యొక్క నాలుగువేల సంవత్సరాలు సత్యయుగం. మూడువేల సంవత్సరాలు త్రేతాయుగం, రెండువేల సంవత్సరాలు ద్వాపరయుగం. వేయి యుగాల కాలంలో కలియుగం పూర్తి అయిపోతుంది. ఈ నాలుగు యుగాల ప్రాతఃకాల, సాయంకాల పరిమాణం- సత్యయుగంలో ప్రాతఃకాలం నాలుగు వందల సంవత్సరాలు, మరొక నాలుగు వందల సంవత్సరాలు సాయంకాలము. రెండే కాలాలుంటాయి. త్రేతాయుగంలో మూడు వందల సంవత్సరాలు ప్రాతః కాలము, మరొక మూడు వందల సంవత్సరాలు సాయంకాలము. ఇలాగే ద్వాపర యుగంలో రెండువందల సంవత్సరాలు ప్రాతఃకాలం, మరో రెండు వందల సంత్సరాలు సాయంకాలం. కలియుగంలో వందసంవత్సరాలు ప్రాతఃకాలం మరొక వంద సంవత్సరాలు సాయంకాలము. ఈ విధంగా మనువుకు అన్ని యుగాల మొత్తం సంఖ్య పన్నెండు వేల సంవత్సరాలు, ఇప్పుడు మనుష్యమానం ప్రకారం యుగ సంఖ్యను చెపుతాను విను.

71 యుగాలు ఒక మన్వంతరం. ఈ మనువులకు రెండు అయనాలు ఉంటాయి. మనువుల దక్షిణాయనకాలం బ్రహ్మకు పగలు. వాళ్ళ ఉత్తరాయణం మనువుకు రాత్రి. ఏ ఆయనంలోనైనా ఒక మనువు లయం చెందితే తక్కిన సమయానికంతకూ రెండవమనువు అతనిస్థానంలోకి వస్తాడు. పదివేల మన్వంతరాలు గడిస్తే బ్రహ్మకు ఒక సంవత్సరం అవుతుంది. ఇలా యదార్థం తెలిసిన వాళ్ళు చెప్పే మాటలు బ్రహ్మ రోజు కల్పము. వెయ్యియుగాలు గడిస్తే బ్రహ్మకు ఒక రాత్రి అవుతుంది. బ్రహ్మయొక్క రాత్రి సమయంలో పర్వతాలతో వనాలతో కూడిన ఈ భూమి మెల్లమెల్లగా నీటిలో మునిగిపోతుంది. తరువాత వెయ్యియుగాలు నిండితే బ్రహ్మకల్పం నశిస్తుంది. బ్రహ్మకు ఒకరోజు గడిస్తే ఒక కల్పం అవుతుంది. ఈ విధంగా డెబ్బైయొక యుగాల వివరణ వినిపించాను.

జనమేజయా! సత్యత్రేతాది యుగాల సంఖ్య కీర్తిని వృద్ధిచేసే పద్నాలుగు మనువుల యొక్క వృత్తాంతము నీకు చెప్పాను. వేదాలలో, పురాణాలలో మనువులు, ప్రజాపతులు చెప్పబడ్డారు. వీరి గుణాలను వింటే లోకంలో ధనం

ప్రాప్తిస్తుంది. ప్రతి మన్వంతరంలోనూ ఒకమారు ప్రలయము సృష్టి జరుగుతాయి. ఈ సృష్టి లయాల ప్రవాహాన్ని నిరూపించటం మిక్కిలి కష్టము. వంద సంవత్సరా లలో కూడ పూర్తిగా చెప్పటం శక్యం కాదు. మన్వంతరం పూర్తి అయినప్పుడు దేవతలు సప్తర్షులు మాత్రం తపస్సు బ్రహ్మచర్యము శాస్త్రజ్ఞానంతో పాటు ఉంటారు. కాని వెయ్యి యుగాలు పూర్తి అయిన తరువాత అంతా నశించిపోతుంది. ఆ సమయంలో అన్ని ప్రాణులు సూర్యుని తాపానికి మండిపోతాయి. ఆ సమయంలో సమస్త జీవసముదాయము ఆదిత్యగణమూ బ్రహ్మదేవుడు భగవంతుడైన నారాయణుని శరీరంలో ప్రవేశిస్తారు. ప్రతికల్పంలోనూ ప్రాణులను సృష్టిస్తూ నిత్యస్వరూపుడై వెలుగొందుతున్నాడు పరమాత్మ.

ఈ సమస్త ప్రపంచమూ అతని మహిమయే. కల్పాన్తమై ఈ ప్రపంచం సముద్రంలో కలిసిపోయినప్పుడు భగవంతునికి రాత్రి సమయం అవుతుంది. ఆ సమయంలో బ్రహ్మదేవుడు విష్ణుమూర్తి గర్భంలో నిద్రపోయి వెయ్యిసంవత్సరాలు పడుకొంటాడు. రాత్రి గడిచిపోగానే ఆయన లేచి మరల సృష్టిపనిలో ప్రవేశిస్తాడు. అప్పుడు మళ్ళీ వెనుకటి ధర్మశాస్త్రాలు, పురాణాలు, దేవతాస్థానాలు, మహాపురుషుల చరిత్రలు ప్రపంచంలో ఏర్పడతాయి. ఈ పనులలో మధ్య మధ్య ప్రళయం వస్తూ బాధ పెడుతుంది. వెనుక సూర్యుని తాపానికి తగులబడిపోయిన ప్రాణులు ఆదేవర్షులు, యక్షరాక్షసగంధర్వ, సర్పాలు, పూర్వపు ఋతువులు వచ్చి తమతమ పనులు చేయుటం ప్రారంభిస్తాయి.

ప్రజాసృష్టి చేయు బ్రహ్మ ఈ విధంగా మాటిమాటికీ భగవంతుని శరీరం నుంచి పుట్టి ప్రజలను సృష్టిస్తాడు. ఈ మధ్యలో దేవతలు, ఋషులు, బ్రహ్మలో లీనమైనవాళ్ళు మళ్ళీ పుట్టనవసరంలేదు. మహారాజా! కాలతత్వం తెలిసిన దేవదేవుడు నారాయణుడు. ఈ ప్రకారం క్రమం వెయ్యి పగళ్ళు వెయ్యి రాత్రులు గడిపి సృష్టి విలయాన్ని చేస్తూ ఉంటాడు. ఇపుడు నేను వైవస్వత మనువు యొక్క వృత్తాంతాన్ని చెపుతా. ఎందుకంటే ఈ మన్వంతరంలోనే రాక్షసుల నాశము జనులకు మేలు చేయుటానికి భగవంతుడు కృష్ణుడు వృష్ణివంశంలో పుట్టాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలకంశమందలి ఖిలకంశపర్వంలో
మన్వంతర, యుగ, బ్రహ్మదిన, వర్షగణనములు అనుబడినబడిన అధ్యాయము

☆☆☆

# తొమ్మిదవ అధ్యాయము

## వైవస్వతమను, యమ, యమీ,శిశువుల పుట్టుక

వైశంపాయనుడిలా చెపుతున్నాడు.

జనమేజయ మహారాజా! కశ్యపుని వలన దాక్షాయణికి సూర్యుడు పుట్టాడు. అతనికి విశ్వకర్మ కూతురు 'సంజ్ఞ' అను స్త్రీతో వివాహం జరిగింది. సంజ్ఞ మూడు లోకాలలోనూ 'సురేణు' అను పేరుతో ప్రసిద్ధి చెందింది. ఆమె కోపస్వభావు రాలు. సౌందర్యవతి, పడుచుది ఐనా సూర్యుని మిక్కిలి వేడిశరీరంతో సంతోషించ లేదు. సూర్యతేజస్సుచే ఆమె శరీరమంతా కాలిపోయి రూపలావణ్యాలు నశించాయి. పూర్వం ఒకప్పుడు బుధుడు భిక్షకోసం కశ్యపుని ఇంటికి వెళ్ళాడు. అప్పుడు అదితి గర్భవతిగా ఉంది. అందుచే అలసట వలన ఆమె వెంటనే బిక్ష పెట్టలేకపోయింది. ఇందుకు కోపించి బుధుడు నీ గర్భం నశిస్తుందని శపించాడు. ఈమాట విని అదితి ఏడవసాగింది. ఏడుస్తున్న భార్యను చూచి కశ్యపుడు ప్రేమతో ప్రియురాలా! నీ కడుపులో పిల్లవాడు చనిపోడు. వాడు గ్రుడ్డు మీద కూర్చొని ఉన్నాడు అని చెప్పాడు.

కశ్యపుడు ఇలా పలుకుటచే సూర్యుడికి మార్తండుడనే పేరు వచ్చింది. మెల్లమెల్లగా సూర్యుని తేజస్సు పెరిగింది. అందుచే మూడులోకాలు తపించి పోవటం ప్రారంభించాయి. సూర్యుడి ద్వారా సంజ్ఞకు ఒక పిల్ల, ఇద్దరు కుమారులు కలిగారు. వారిలో కన్యపేరు 'యమున'. ఇద్దరు మగపిల్లల్లో ఒకడు శ్రాద్ధదేవుడు, రెండవవాడు యముడు. శ్రాద్ధదేవుడే వైవస్వతమనువుగా ప్రసిద్ధిచెందాడు. యముడు, యమున ఇద్దరూ కవలపిల్లలు. సంజ్ఞ సూర్యుని దుర్భరమైన తేజస్సును సహించలేక పోయింది. ఈకారణంగా ఆమె తనతో సమానమైన అందము, లావణ్యముగల ఒక ఛాయను సృష్టించింది. ఆఛాయ స్త్రీని సంజ్ఞ ఎదుట చేతులు జోడించి నిలబడింది.

నేను నీఆజ్ఞను పరిపాలించే సేవకురాలను, నన్ను ఆజ్ఞాపించు. నేనేం చేయను? అన్నది. సంజ్ఞ ఓ శుభస్వరూపురాలా! నేను నా తండ్రి యింటికి వెళ్తాను. నీవు ప్రశాంతంగా ఇక్కడ ఉంటూ మగపిల్లల నిద్దరినీ, కన్యనూ రక్షిస్తూ ఉండు. కాని ఈ విషయం సూర్యభగవానునికి ఎప్పుడూ చెప్పవద్దు అన్నది. అప్పుడు

ఛాయదేవి! ఎవడైనా నాజుట్టు పట్టుకొనేదాకా, నాకు శాపం ఇచ్చేదాకా ఈ విషయాన్ని ఎవరికీ చెప్పను. నీవు సుఖంగా వెళ్ళు అన్నది. వైశంపాయనుడిలా చెప్పాడు.

సంజ్ఞ ఈ విధంగా ఛాయను ఒప్పించి సిగ్గుతో తన తండ్రివద్దకు వెళ్ళి పోయింది. విశ్వకర్మ సంజ్ఞను గద్దించి అడిగి నీ భర్తవద్దకు వెళ్ళమన్నాడు. తండ్రి మాటిమాటికీ మందలించుటచేత సంజ్ఞ ఆడగుర్రం ఆకారాన్ని ధరించి వెళ్ళి పోయింది. ఉత్తర కురుదేశంలో గడ్డిమేస్తూ తిరుగుతూ ఉంది. సూర్యుడు ఛాయను సంజ్ఞగానే తలచి తనతో సమానమైన తేజస్సుగల ఒక కుమారుని కన్నాడు. ఆ పుత్రుడు పెద్దన్న మనువుతో సమానమైన ఆకారం కలవాడు అయ్యాడు. అందుచే అతడు సావర్ణుడనే పేరుతో ప్రసిద్ధిచెందాడు. సూర్యునికి ఛాయయందు పుట్టినవాడు శనైశ్చరుడనే పేరు కలవాడు. ఛాయ తన పుత్రునే మిక్కిలి ప్రేమతో చూచేది. సంజ్ఞ పుత్రులపై ఎక్కువ ప్రేమ చూపించేది కాదు. వైవస్వతమనువు సవతితల్లి చెడునడ వడిని సహించాడు. కాని యముడికి ఓర్పులేదు. బాలచపల త్వము, రోషమువలన యముడు ఛాయను నిందించాడు. అప్పుడామె నీకాళ్ళు తెగిపడుగాక అని యముణ్ణి శపించింది.

అందుకతడు చాల బాధపడి శాపభయంచేత కలతచెంది తన తండ్రి యైన సూర్యుని దగ్గరకు వెళ్ళాడు. చేతులు జోడించి నాకిచ్చిన శాపం తొలగిపోయే టట్లు చేయమని కోరాడు. తల్లి మమ్మల్ని సరిగా చూడక చిన్నవాడిని మిక్కిలి ప్రేమతో చూస్తోంది. ఇందుచే నేను కాలెత్తాను, కాని తన్నలేదు. ఈ తప్పును క్షమించండి. ఇందుకామె నీకాళ్ళు తెగిపడతాయని శపించింది. మీరు ప్రసన్నులై క్షమిస్తే నాకాళ్ళు తెగిపడవు అన్నాడు. అప్పుడు సూర్యుడు నాయనా! దీనికి పెద్ద కారణం ఉంటుంది. నీవంటి సత్యం పలికే ధర్మాత్ముడికి సాధారణంగా కోపం రాదు. నీతల్లి మాటను నేను మార్చలేను. క్రిములు నీపాదంనుంచి మాంసాన్ని తీసుకుపోతాయి భూమిమీదికి. అప్పుడు నీవు సుఖపడతావు. ఈవిధంగా నీతల్లి మాట చెల్లినట్లు వుతుంది. నీవు శాపంనుండి కాపాడబడినవాడవు అవుతావు అన్నాడు.

తరువాత సూర్యుడు సంజ్ఞతో దేవి! తల్లి పిల్లలందరిపై సమానప్రేమ చూపించాలి. నీవు చిన్నవాడిని ఎందుకెక్కువగా ప్రేమిస్తున్నావు? అని ప్రశ్నిస్తే

ఆమేదీ సమాధానం చెప్పలేదు. తన అభిప్రాయాన్ని ఏమీ చెప్పలేదు. అప్పుడు సూర్యుడు తన యోగబలంచేత జరిగినదంతా గ్రహించాడు. ఛాయను నశించమని శాపమివ్వడానికి సిద్ధపడ్డాడు. కోపంతో ఆమె తలవెంట్రుకలను చేతితో పట్టు కొన్నాడు. అప్పుడామె చేసిన ప్రతిజ్ఞ ప్రకారం జరిగిన విషయాన్నంతనీ చెప్పేసింది. ఈవిషయ మంతా విని కోపించి సూర్యుడు విశ్వకర్మ దగ్గిరికి వెళ్ళాడు. విశ్వకర్మ సూర్యుని గౌరవించి పూజించాడు. కోపంతో ఉన్న సూర్యుని ఓదారుస్తూ ఇలా చెప్పాడు.

దేవా! నీ మిక్కిలి తేజస్సుతో కూడిన రూపం బాగాలేదు. ఈకారణంచేత సంజ్ఞ ఆడగుర్రం రూపం ధరించి అడవిలో గడ్డి మేస్తున్నది. ఇవేళ మీరు ఆకులు తింటూ చిక్కిపోయి, దీనురాలై, జడలు ధరించి, బ్రహ్మచారిణి, పూజింపతగినది, యోగబలంతో కూడినది అయిన ఆమెను యోగబలంతో ఏనుగుచే పెరికి వేయ బడిన తామరపూవువలె ఉన్నదాని చూడగలవు. నామాట నంగీకరిస్తే ఈనాడే మీరూపాన్ని మిక్కిలి అందంగా తయారుచేస్తానన్నాడు. సూర్యుడు (త్వష్ట) విశ్వకర్మ యొక్క మాటను ఒప్పుకొన్నాడు.

అప్పుడు సూర్యుణ్ణి విశ్వకర్మ చక్రంమీద కూర్చొనపెట్టి తరిచాడు. అప్పుడు సూర్యుని రూపం మిక్కిలి అందంగా చూడదగినదయింది. అప్పటి నుంచి సూర్యుని ముఖం ఎర్రపడింది. సూర్యుని పూర్వపు ముఖకాంతినుండి ధాత, అర్యమ, మిత్ర, వరుణ, అంశ, భగ, వివస్వత్, పూష, పర్జన్య, జఘన్య, త్వష్ట, విష్ణు అనే పన్నెండుగురు సూర్యులు వెలువడ్డారు. తన శరీరంనుండి బయలెవడలిన ఆదిత్యులను చూచి సూర్యుడు మిక్కిలి ప్రసన్నుడయ్యాడు. విశ్వకర్మ అతనికి గంధంపువ్వులు, అలంకారాలు, ధగధగ మెరిసే కిరీటం సమర్పించి సమ్మానించాడు. మరియు సూర్యునితో ఇలా అన్నాడు.

ఓసూర్యదేవా! ఇప్పుడు మీరు మీభార్య అయిన సంజ్ఞ దగ్గరకు వెళ్ళండి. ఇప్పుడామె ఆడగుర్రం రూపంతో ఉత్తరకురుదేశంలో గడ్డివనంలో తిరుగుతూ ఉంది. అప్పుడు సూర్యుడు తన యోగబలంచేత మగగుర్రం రూపం ధరించి అక్కడకు వెళ్ళాడు. గుర్రం రూపు ధరించి ఉన్న ఆమెతో సంగమానికి సిద్ధపడ్డాడు, పరపురుషుడని ఆమె ఇష్టపడలేదు. సూర్యదేవుని వీర్యాన్ని ఆమె ముక్కు రంధ్రాల ద్వారా వెలుపలికి వదిలింది. దానినుండి దేవతల వైద్యులు అశ్వినీ కుమారులు

పుట్టారు. ఆ పిల్లలలో ఒకడిపేరు దస్రుడు, రెండవవాడిపేరు నాసత్యుడు. అప్పటి నుండి సూర్యుడు వాళ్ళకు తండ్రి అయ్యాడు. సూర్యుని భార్య తల్లి అయింది. ఎనిమిదవ ప్రజాపతియొక్క (సూర్యుని యొక్క) కుమారులు వీరిద్దరూ.

తరువాత సూర్యుడు తన సహజరూపాన్ని ధరించి తన భార్య సంజ్ఞ ఎదుట కనపడ్డాడు. జనమేజయా! సంజ్ఞా తనభర్తను చూచి ప్రసన్నురాలైంది. యముడు తల్లి శాపం వలన మిక్కిలి దుఃఖపడుతూ ధర్మపూర్వకంగా ప్రజలను పరిపాలించ సాగాడు. మరియు తమ పనులచే పితృదేవతలకు అధిపతి లోకపాలకుడు అయ్యాడు. శ్రాద్ధదేవుడు మనువని, సావర్ణి అనే రెండుపేర్లతో ప్రసిద్ధి చెందాడు. శ్రాద్ధదేవుని తమ్ముడు శనైశ్చరుడు గ్రహాలలో ఒక పూజింపదగిన స్థానాన్ని పొందాడు.

ఓ జనమేజయా! సూర్యుని వలన పుట్టిన ఈ దేవత జన్మకథను విన్నవాడు తలుచుకొన్నవాడు అన్ని ఆపదలనుండి విడువబడి గొప్ప కీర్తిని పొందుతాడు. యముని చెల్లెలు యమిజనులకు ప్రియమైన యమునానది అయినది. విశ్వకర్మ సూర్యుని తరచునప్పుడు వెలువడిన తేజస్సుచే విష్ణుచక్రాన్ని నిర్మించాడు. విష్ణువు దానితో చాలామంది రాక్షసులను చంపాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి హరివంశపర్వములో
వైవస్వతమను, యమ, యమీ,శనుల పుట్టుక అను తొమ్మిదవ అధ్యాయము

☆ ☆ ☆

# పదవ అధ్యాయము

## వైవస్వత మను వంశం, పురూరవ జన్మ

వైశంపాయనుడిలా చెప్పాడు.

వైవస్వతమనువుకు తనతో సమానులైన తొమ్మిదిమంది కొడుకులన్నారు. వాళ్ళు ఇక్ష్వాకుడు, నాభగుడు, దృష్ణుడు, శర్యాతి, నరిష్యుడు, ప్రాంశువు, నాభాగారిష్టుడు, కరూషుడు, పృషధ్రుడు అనువాళ్ళు. వైవస్వతమనువుకు పుత్రులు కలుగక పూర్వం మిత్రుని వరుణుని ప్రసన్నులను చేసుకోవటానికి పుత్రేష్టి యజ్ఞాన్ని ప్రారంభించాడు. ఆ యజ్ఞంలో మిత్ర వరుణులకు భాగము ఇవ్వటానికి మునులు ఆహుతి వేయగా దేవతలు, గంధర్వులు, మునులు మిక్కిలి ప్రసన్నులయ్యారు.

వాళ్ళు ఆహా ఈ మహారాజు మనువు యొక్క తపస్సు ఇతని పరాక్రమం శాస్త్ర జ్ఞానం అద్భుతమైనవి. అని మెచ్చుకొన్నారు.

ఆ యజ్ఞంలో దివ్యమైన వస్త్రాలు ధరించి, దివ్యమైన ఆభరణాలు ధరించి, దివ్యములైన అస్త్రాలు ధరించిన ఇల అనే కన్యక పుట్టింది. మహారాజు ఆమెకు ఇల అని పేరు పెట్టి, ఆ కన్యతో ఇలా అన్నాడు. ఓ పుత్రీ! నీవు పుత్రులను కోరు తున్న ప్రజాపతినగు నా మాటలను పాటించు. అది విని ఇల మహారాజ నేను మిత్రావరుణుల అంశతో పుట్టాను. అందుచే వాళ్ళ దగ్గరకు వెళ్తాను. అలా చేయక పోతే నేను ధర్మం పాటించని దానవుతాను. నేను నశించిపోతాను అని మనువుతో చెప్పి మిత్రావరుణుల వద్దకు వెళ్ళింది. అక్కడ చేతులు జోడించి దేవా! నేను మీయిద్దరి అంశతో పుట్టాను. కనుక నేనేమి చేయాలో ఆజ్ఞ ఇవ్వండి. మహారాజు మనువు నా ఆజ్ఞను పాటించు అంటున్నాడు, అన్నది. అప్పుడు మిత్రావరుణులు ఓ సుందరి! నీ ధర్మదృష్టి, సత్యనిష్ఠ ఇంద్రియని గ్రహము చూచి మేమిద్దరం చాల సంతోషించాము.

ఓ భాగ్యవంతురాల! నీవు మూడు లోకాలలోనూ మా యిద్దరికీ కుమార్తెవు. మనువుకు వంశాన్ని ఉద్ధరించే పుత్రుడవు నీవే అవుతావు. సుద్యుమ్నుడనే పేరుతో మూడు లోకాలలలో ప్రసిద్ధి పొందుతావు. లోకానికి ప్రియమైనవాడవు ధర్మ స్వభావంతో మనువు వంశాన్ని వృద్ధి చేయువాడవవుతావు అని చెప్పారు. ఇలా వాళ్ళ ఇద్దరి మాట విని తన తండ్రి మనువు వద్దకు తిరిగివెళ్ళింది. దారిలో చంద్రుని కుమారుడు బుధుడు తారసిల్లాడు. ఆమెను సంగమానికి పిలిచాడు. ఈ విధంగా బుధుడు వలన ఆమెకు పురూరవుడనే కొడుకు పుట్టాడు. అతడు పుట్టగానే ఇల స్త్రీ రూపాన్ని విడిచిపెట్టింది. పురుషరూపంతో సుద్యుమ్నుడనే పేరుతో ప్రసిద్ధి పొందింది. సుద్యుమ్నునికి ఉత్కలుడు గయుడు వినతాశ్వుడు అనే పరమ ధర్మాత్ములైన పుత్రులు పుట్టారు.

తరువాత ఉత్కలుడికి ఉత్కలదేశం, వినతాశ్వుడికి పడమర దిక్కు గయుడికి తూర్పు దిక్కు పరిపాలించటానికి ప్రభుత్వ (మిచ్చారు)ము ప్రాప్తించింది. గయ మహారాజు రాజధాని గయ అనే పట్టణం. జనమేజయ మహారాజ ప్రజాపతి అయిన మనువు ఇక్ష్వాకుడు మొదలైన పదిమంది పుత్రులను కని సూర్యభగవానుని శరీరంలో ఎప్పుడు ప్రవేశించాడో అప్పుడు అతని కొడుకులు పది విభాగాలుగా భూమిని చేసి వనములతో యూపస్తంభములతోడకూ గుర్తులు గలదానినిగా

చేశారు. పెద్దవాడైన ఇక్ష్వాకుడు మధ్యదేశాన్ని పొందాడు. సుద్యుమ్నుడికి కన్యా స్వభావం ఉండటంచేత మధ్యప్రదేశమతనికి ప్రాప్తించలేదు. అతడు గురువైన వసిష్ఠుని ఆజ్ఞననుసరించి ప్రతిష్ఠానపురాన్ని పరిపాలించాడు.

కీర్తిశాలి అయిన ప్రద్యుమ్నుడు కొన్ని రోజులు ప్రతిష్ఠానపురాన్ని పరిపాలించి, ఆ రాజ్యాన్ని పురూరవుడికి ఇచ్చాడు. ఉత్కలకునికి ధృష్టకుడు, అంబరీషుడు, దండుడు అనే కీర్తిమంతులైన ముగ్గురు పుత్రులు పుట్టారు. దండుడే దండ కారణ్యాన్ని ఏర్పరచినవాడు. ఆ వనము తపశ్శాలురకు తపస్సు చేసుకొనే ఉత్తమ స్థానమైంది. అక్కడ ప్రవేశిస్తేనే మనిషి పవిత్రుడౌతాడు. పాపాలు తొలగిపోయిన వాడౌతాడు. ఈ విధంగా ఇలుని కని సుద్యుమ్నుడు స్వర్గస్థుడయ్యాడు. మహారాజా! మనుపుత్రుడైన సుద్యుమ్నునిలో స్త్రీ పురుష లక్షణాలు ఉండుటచే అతనిని సుద్యుమ్నుడనీ, ఇల అనీ రెండు పేర్లతో పిలిచారు.

నరిష్యత్తుడు కుశకులు అనే వాళ్ళు పుత్రులు, నాభగుడికి అంబరీషుడు కుమారుడు. ధృష్ణుని పుత్రుడు ధార్ష్టకుడు, శర్యాతికి ఆనర్తుడనే కొడుకు, సుకన్య అనే కూతురు కలిగారు. తరువాత ఆమె చ్యవనమహర్షికి భార్య అయింది. ఆనర్తుని కొడుకు తేజశ్శాలి, రేవుడు. అతనికి ఆవర్తదేశం, (ద్వారక) రాజ్యం ప్రాప్తించింది. కుశస్థలి అతని రాజధాని రేవుడికికకుద్మి పెద్దకొడుకు. కొన్ని రోజుల తరువాత రేవుడు తన కూతురుతో సంగీతం వినటానికి బ్రహ్మలోకం వెళ్ళాడు.

అక్కడ వాళ్ళు ముహూర్తకాలమే ఉన్నారు. ఆ కాలం భూలోకంలో కొన్ని యుగాలైంది. తరువాత యాదవులతో నిండిన తన రాజధాని ద్వారకకు తిరిగి వచ్చాడు. అప్పటికి అతడు యువకుడుగానే ఉన్నాడు. తిరిగివచ్చిన రేవుడు ద్వారాలు కలిగి మిక్కిలి అందంగా ఉన్న దానినిగానూ శ్రీకృష్ణుడు బోజవృష్ణి అంధ కులచే రక్షింపబడుచున్నదానినిగా చూచాడు. అక్కడ పరిస్థితులను బాగా తెలుసు కొని తన కన్యను రేవతిని బలరామునికిచ్చి వివాహం చేశాడు. తరువాత తపస్సు చేయటానికి మేరుపర్వతానికి వెళ్ళాడు. బలరాముడు రేవతితో ఆనందంగా ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వమందు
వైవస్వత మను వంశం, పురూరవ జన్మ అను పదవ అధ్యాయము

☆ ☆ ☆

# పదకొండవ అధ్యాయము

## ధుంధువు వధ

జనమేజయుడిలా అడిగాడు.

ఓ బ్రాహ్మణోత్తమా! చాలా యుగాల కాలం గడిచిపోతే రేవతికిగా రైవతుడికి గానిని ముసలితనం ఎందుకురాలేదు? రైవతుడు తపస్సు చేయటానికి మేరు పర్వతానికి వెళ్ళగా ఈనాడు కూడ అతని వంశం ఎలా ఉన్నది. ఈ విషయాన్ని బాగా వినగోరుతున్నాను.

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ పుణ్యాత్ముడా! బ్రహ్మలోకంలో ఆకలిదప్పిక, ముసలితనము, చావు, ఋతువులు మారుట ఉండదు. రైవతుడు బ్రహ్మలోకానికి వెళ్ళినప్పుడు పుణ్యా జనులనే రాక్షసులు అతని రాజధాని కుశావతిని పాడుచేశారు. రేవతునకు వంద సోదరులున్నారు. రాక్షసులు పట్టణాన్ని పాడుచేసేటప్పుడు వాళ్ళందరూ నలుదిక్కు లకూ పారిపోయారు. వారు నివసించినచోట వాళ్ళ సంతానంవృద్ధి చెందింది. వాళ్ళందరు శార్యాతులనే పేరుతో ప్రసిద్ధి పొందారు. వాళ్ళందరూ పర్వతాలమీదకి వెళ్ళి నివసించటం ప్రారంభించారు. నాభాగారిష్టుడికి వైశ్యస్త్రీ యందు పుట్టిన ఇద్దరు కుమారులున్నారు. వాళ్ళు బ్రహ్మలో లీనమయ్యారు. కరూషుని కొడుకు లందరూ యుద్ధం చేయటంలో ఆరితేరారు. వాళ్ళ కారూషులనే పేరుతో ప్రసిద్ధి చెందారు. ప్రాంశువనువాడికి ఒకడే పుత్రుడు. అతనిపేరు ప్రజాపతి. వృషధ్రుడు తన గురువుగారి ఆవును చంపి గురువు శాపంచేత అతడు శూద్రుడయ్యాడు.

జనమేజయ మహారాజా! ఈ విధంగా వైవస్వత మనువు యొక్క తొమ్మిది మంది కొడుకుల వృత్తాంతము చెప్పి వినిపించాను. మనువు తుమ్ముతుండగా ఇక్ష్వకుడనే కుమారుడు కలిగాడు. అతనికి నూరుగురు కుమారులు పుట్టారు. వారిలో వికుక్షి పెద్దవాడు. అతని పొట్ట చాలా పెద్దది. ఈ కారణంచేత అతను యుద్ధం చేయలేకపోయాడు. కాని ధర్మాత్ముడై నందున అతని అయోధ్యా నగర రాజ్యం ఇచ్చారు. అతనికి శకుని మొదలైన యాభైమంది పుత్రులు కలిగారు. అందరూ ధర్మాత్ములే. వాళ్ళు ఉత్తరాపథంలో ఉండి అక్కడ దేశాలను రక్షిస్తూ

ఉండేవాళ్ళు. శశాదుడు మొదలగు నలభై ఎనిమిది మంది దక్షిణదిక్కునందుండి అక్కడ ప్రదేశాలను రక్షిస్తూ ఉండేవాళ్ళు.

ఇక్ష్వాకుడు అష్టకాశ్రాద్ధానికి మృగాలను చంపి మాంసం తెమ్మన్నాడు. అప్పుడు వికుక్షి వేటాడి మృగాల్ని చంపాడు. ఆ మృగమాంసం శ్రాద్ధంలో ఉపయోగించక ముందే ఒక కుందేలు మాంసాన్ని తిన్నాడు. అందుచే వశిష్ఠుని మాట చొప్పున ఇక్ష్వాకుడు అతన్ని విడిచిపెట్టాడు. కుందేలు మాంసం తినుటచేతనే అతడు శశాదుడని పిలువబడ్డాడు. ఇక్ష్వాకు తరువాత శశాదుడే తండ్రి రాజ్యానికి అధికారి అయ్యాడు. పరాక్రమవంతుడైన కకుత్స్థుడనే పేరు వచ్చింది. కకుత్స్థుడి కొడుకు అనేనుడు. ఇతని కొడుకు పృథువు. పృథుపుత్రుడు విష్టారశ్వుడు. ఇతని కొడుకు ఆర్ద్రుడు. ఇతని కొడుకు యువనాశ్వుడు. ఇతని కుమారుడు శ్రావస్తుడు. ఇతడే శ్రావస్తిపురంలో నివసించేవాడు. ఇతనికి మహాయస్వి పుత్రుడు. బృహదశ్వుడు కూడ పుత్రుడే. బృహదశ్వుని కొడుకు ధార్మికుడైన కువలాశ్వుడు. ఇతడే ధుంధు అనేవాణ్ణి చంపాడు. అందుచే ఇతనికి దుంధుమారుడనే పేరు వచ్చింది. ఇంత కథను విని జనమేజయుడు కువలాశ్వుడు ఏ కారణంచేత ధుంధువును చంపాడు? ఆ వృత్తాంతాన్ని బాగా వినగోరుతున్నానని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కువలాశ్వుడుకి నూరుగురు కొడుకులున్నారు. వారందరూ పండితులూ ధర్మాత్ములే యజ్ఞాలే చేసేవాళ్ళు ఎక్కువ డబ్బు దక్షిణగా ఇచ్చేవాళ్ళు. మరియు ధనుర్వేదం అంతు చూచినవాళ్ళు. కొంతకాలం తర్వాత బృహదశ్వుడు కుమారుడై కువలాశ్వుడికి రాజ్యమిచ్చి వనానికి వెళ్ళాడు. ఇదే సమయంలో బ్రహ్మర్షి ఉత్తంకుడు వచ్చి రాజుతో ఇలా చెప్పాడు.

రాజా! మమ్మల్ని రక్షించడం మీకు ప్రధానమైనపని. కనుక మొదట మీరీపని చేయ్యాలి. అలా కాకపోతే వానప్రస్థులైన తర్వాత ప్రశాంతంగా తపస్సు చేసుకోలేరు. నీవు రాజ్యం పరిపాలిస్తుంటే భూమండలం ఏ భయంలేకుండా ఉంటుంది. ప్రజలను పాలించుట గొప్ప ధర్మం. అరణ్యానికి వెళ్తే ఈ ధర్మం దక్కదు. అరణ్యానికి వెళ్ళాలనే బుద్ధి మార్చుకో. ప్రజలను నీవు రక్షించాలి. పూర్వపు మహారాజులిట్లే చేశారు. నా ఆశ్రమం దగ్గర ఇసుకతో కూడిన సమతలమైన ఎడారి ఉంది. అక్కడనే ఉజ్జానకం అనే సముద్రం ఉంది. అక్కడ దుంధువు అను రాక్షసుడు లోకనాశం కోసం దారుణమైన తపస్సు చేస్తున్నాడు. సంవత్సరం తరువాత ముక్కు నుండి

గాలిని విడిస్తే కొండలతో, అడవులతో కూడిన భూమి కంపిస్తుంది. అతనిని శ్వాస వాయువుకి పెద్దదుమ్ము లేస్తుంది. ఏడురోజులు భూమి కంపిస్తూ ఉంటుంది.

నిప్పురవ్వలు, బొగ్గులు, పొగ ఏడురోజులుంటాయి. ఇందుచేత అక్కడ నా ఆశ్రమంలో ఉండలేకపోతున్నాను. ప్రపంచం మేలుకోరి పెద్ద శరీరము గల వాణ్ణి చంపివేయి. అతడు చస్తే లోకాలు స్తిమితపడతాయి. మహారాజా! నీవొక్కడవే వాణ్ణి చంపడానికి సమర్థుడవు. రౌద్రస్వరూపుడైన మహారాక్షసుని చంపినవాడికి వరమిచ్చి అతని తేజస్సును నీవు వృద్ధి పొందిస్తావు అని విష్ణువు నాకు వరమిచ్చాడు. సాధారణ పరాక్రమం కలవాడు అతనిని చంపలేడు. మహాత్ముడైన ఉత్తంకుడిలా చెప్పగా బృహదశ్వుడు ధుంధువును చంపుటకు కువలాశ్వుని చూపి మహాత్మా! నేను ఆయుధం ముట్టనని ప్రతిజ్ఞ చేశాను.

ఇందుచే నా కుమారుడు తప్పక ఆ రాక్షసుని వధిస్తాడు అని కుమారునికా పని వప్పచెప్పి తాను (బృహదశ్వుడు) తపస్సు చేసుకొనుటకు పర్వతశిఖరంమీదికి వెళ్ళాడు. కువలాశ్వుడు నూరుగురు కొడుకులతో ఉత్తంకుని వెంట ధుంధువుని చంపుటకు వెళ్ళాడు. ఈసమయంలో ఉత్తంకుని ప్రార్థనను బట్టి లోకకళ్యాణం కొరకు శ్రీమహావిష్ణువు కువలాశ్వుని శరీరంలో ప్రవేశించాడు. దేవదుందుభులు మోగినై. కువలాశ్వుడు కుమారులచేత సముద్రం త్రవ్వించాడు. నారాయణుడు తన శరీరం లో ప్రవేశించుటచేత కువలాశ్వుడు మరింత బలవంతుడు అయ్యాడు. సముద్రం త్రవ్వుతుండగా ఇసకలో దాగి ఉన్న ధుంధువు పడమరదిక్కు నావరించి కనిపించాడు.

అతడు ముఖంనుంచి పుట్టిన కోపాగ్నితో లోకాలను తపింప చేస్తున్నట్లున్నాడు. ఆ రాక్షసుడు కువలాశ్వుని నూరుగురు కొడుకులను కాల్చివేశాడు. తరువాత మహాతేజశ్శాలి కువలాశ్వుడు తన యోగబలంచేత అగ్నిని ఆర్పివేశాడు. పెద్దశరీరం గల ఆ రాక్షసుని తనబలంతో చంపి ఉత్తంకుడికి రాక్షసుడి చచ్చిన శరీరాన్ని చూపించాడు. ఉత్తంకుడు మహాత్ముడైన రాజుకు వరమిచ్చాడు. మరియు నశించని ధనరాశిని, శత్రువులను జయించు శక్తిని, ధర్మమందాసక్తిని, స్వర్గ నివాసమును, చనిపోయిన రాజపుత్రులకు నశించని పుణ్యాలోకాలను ఉత్తంకుడు రాజుకు అనుగ్రహించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వమందు
ధుంధువు వధ అను పదకొండవ అధ్యాయము

☆ ☆ ☆

# పన్నెండవ అధ్యాయము

## మహర్షిగాలవుని పుట్టుక

తరువాత వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓరాజా! కువలాశ్వుని కొడుకులలో ముగ్గురుమాత్రం బ్రతికి ఉన్నారు. వాళ్ళలో దృఢాశ్వుడు పెద్దవాడు. చంద్రాశ్వులిద్దరూ తమ్ముళ్ళు. ధుంధుమారుని కుమారుడు దృఢాశ్వుడికి హర్యశ్వుడు కుమారుడు. హర్యశ్వుడి కొడుకు నికుంభుడు. అతడెల్లప్పుడూ క్షత్రియధర్మమందు ఆసక్తి కలవాడు. నికుంభుని కొడుకు సంహతాశ్వుడు. ఇతడు యుద్ధంలో మంచినేర్పరి. సంహతాశ్వుడికి హైమవతి అనే కన్య కూడా ఉంది. ఆమెపేరు దృషద్వతి. ఈమె కొడుకు ప్రసేన జిత్తు మూడులోకాలలో ప్రసిద్ధుడు. ప్రసేనజిత్తు పతివ్రతయైన గౌరిని భార్యగా చేసుకొన్నాడు. ఆమె భర్తచే శపింపబడి బాహుద అనే నది అయింది. ఆమె పుత్రుడు యువనాశ్వుడు. ఇతని కుమారుడు ముల్లోకాలు జయించిన 'మాంధాత'. అతనికి శశబిందు కుమార్తె, 'చైత్రరథి' భార్య. ఆమె పదివేల సోదరులకు ఒకేఒక అక్క. మాంధాతకు పురుకుత్సుడు, ముచికుందుడు అనే కొడుకులిద్దరు. పురుకుత్సుని కొడుకు 'త్రసద్దస్యుడు'. ఇతని కుమారుడు సంభూతుడు.ఇతని పుత్రుడు సుధన్వుడు

సుధన్వుడికి విద్వాంసుడైన త్రయ్యారుణుడు పుత్రుడు. ఇతని కుమారుడు సత్యవ్రతుడు. ఇతడు వివాహమంత్రాలకు విఘ్నం కలిగించాడు. ఇతరుని భార్యను అపహరించి తెచ్చాడు. ఆమెను భార్యగా చేసుకున్నాడు. అప్పుడు తండ్రి ఇతడిని విడిచిపెట్టాడు. త్రయ్యారుణుడు కులంలో చెడబుట్టావు, నిన్ను కొడుకునుగా చెప్పుకొన కోరుటలేదు. నీఉ వెళ్ళి చండాలులతోపాటు ఉండు అని కొడుకును తిట్టాడు. తండ్రి యిలా చెప్పినమీదట సత్యవ్రతుడు ఊరిబయటకు వెళ్ళి పోయాడు. వశిష్ఠుడుకూడ ఆపలేదు. ఈవిధంగా సత్యవ్రతుడు చండాలవాటికలో నివసించాడు. త్రయ్యారుణుడు రాజ్యం విడిచిపెట్టి అరణ్యానికి వెళ్ళాడు. సత్య వ్రతుడి పాపపు పనికి రాజ్యంలో పన్నెండు సంవత్సరాలు వర్షం పడలేదు.

ఈసమయంలో గొప్ప తపశ్శాలి విశ్వామిత్రుడు భార్యను విడిచిపెట్టి నీరులేని ఒక ప్రదేశంలో తపస్సు చేయటానికి వెళ్ళాడు. విశ్వామిత్రుని భార్య కుటుంబ

పోషణకు తన నడిమికొడుకును వందగోవులకు అమ్మివేసింది. సత్యవ్రతుడు కొడుకును అమ్ముతున్న విషయం చూచి విడిపించాడు. అతన్ని పోషించాడు. విశ్వామిత్రుని సంతోషంకోసం, ఆయన అనుగ్రహంకొరకూ ఆ పిల్లవానిని తాను పోషించాడు. ఆపిల్లవాని కంఠానికి తల్లి త్రాడు కట్టుటచేత అతడు గాలవుడని పిలవబడ్డాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వములో
మహర్షిగాలవుని పుట్టుక అను పన్నెండవ అధ్యాయము

☆ ☆ ☆

# పదమూడవ అధ్యాయము

## త్రిశంకుకథ

వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

సత్యవ్రతుడు భక్తిచేత దయవలన విశ్వామిత్రుని భార్యను పోషించాడు. లేళ్ళను, అడివిపందులనూ, దున్నపోతుల్ని చంపి విశ్వామిత్రుని ఆశ్రమ సమీపంలో మాంసాన్ని చెట్టుకు కట్టాడు. సత్యవ్రతుడు తండ్రి ఆజ్ఞ ప్రకారం పన్నెండు సంవత్సరాల వరకు జనరహితమైన అరణ్యంలో ఉంటూ నియమాల్ని పాలిస్తున్నాడు. ఇంత సమయమూ వసిష్ఠుడు పౌరుహిత్యము గురుత్వము ఉండటంచేత అయోధ్యా రాజ్యాన్ని అంతఃపుర రక్షణమూ చేశాడు. సత్యవ్రతుడు బాల్యంచేతనో, రాబోవు కష్టాన్నిబట్టో వసిష్ఠుడి మీద మిక్కిలి కోపం కలవాడయ్యాడు. ఎందుకంటే తన తండ్రి త్రయ్యారుణుడు తనను విడిచిపెట్టేటప్పుడు వసిష్ఠుడు అడ్డుకోలేదు. అందుచే అతని పాపం నశించింది. చెట్టుకు కట్టిన మాంసం అయిపోగా అన్ని కోరికలను తీర్చునటువంటి మిక్కిలి పాలనిచ్చే వసిష్ఠుని ఆవును చూచాడు. జనమేజయ మహారాజా! కోపంచేత అలసట వలన ఆకలిచేత కూడ ఆ ఆవును చంపేశాడు. ఆ మాంసాన్ని తాను తిని విశ్వామిత్రుని కొడుకులకు కూడ పెట్టాడు. ఈ సంగతిని విని వసిష్ఠుడు కోపించాడు. మరియు ఇలా అన్నాడు.

తండ్రిని సంతోష పెట్టకపోవుట, గురువుగారి ఆవును చంపుట, మాంసాన్ని శుద్ధి చేయకుండా తినటం ఈ మూడు పాపాలు చేశావు. కనుక నీవు త్రిశంకువు అయ్యావు అని. (శంకువంటే పాపము) విశ్వామిత్రుడు భార్యను పోషించటానికి వచ్చి త్రిశంకువుకు సంతోషంతో వరమిచ్చాడు. అప్పుడు త్రిశంకువు ఈ శరీరంతో

స్వర్గానికి వెళ్ళేట్లు వరం కోరాడు. పన్నెండు సంవత్సరాలు వర్షం లేక ఏర్పడిన భయంపోగా విశ్వామిత్రుడు త్రిశంకుని తండ్రి రాజ్యాని పట్టాభిషిక్తుని చేసి అతనిచే యాగం చేయించాడు. వసిష్ఠుడు దేవతలూ చూస్తుండగానే విశ్వామిత్రుడు త్రిశంకుని స్వర్గానికి పంపాడు. త్రిశంకు భార్య సత్యరథ. హరిశ్చంద్రుడనే కుమారుని కన్నది. హరిశ్చంద్రుడు త్రైశంకవుడని పిలువబడ్డాడు. ఇతడు రాజసూయయాగం చేసి సమ్రాట్టయ్యాడు.

హరిశ్చంద్రుని కొడుకు రోహితుడు. ఇతడు రోహితపురమనే పట్టణాన్ని నిర్మించాడు. రాజర్షి రోహితుడు చాలాకాలం రాజ్యం పరిపాలించి ప్రజలను బాగా పరిపాలించాడు. తరువాత ఈ సంసారం సారం లేనిదని గ్రహించి నగరాన్ని బ్రాహ్మణులకు దానమిచ్చాడు. రోహితుని కొడుకు హరితుడు హరితుని కొడుకు 'చంచు' ఇతనికి విజయుడు, సుదేవుడు అని ఇద్దరు కొడుకులు. ఈ యిద్దరిలో పెద్దవాడు క్షత్రియ జాతినంతను జయించాడు. కనుక విజయుడనబడుచున్నాడు. ఇతని కొడుకు ధర్మార్థ పండితుడైన 'రురుకుడు' ఇతనికి వృకుడు కొడుకు వృకుని పుత్రుడు బాహువు. శకయవన, కాంభోజ, పారద, పహ్లవ, హైహయ, తాలజంఘులు మొదలగువాళ్ళు మ్లేచ్ఛులు, బాహువును రాజ్యం నుంచి తప్పించారు. బాహువు కుమారుడు సగరుడు. ఇతడు విషంతోపాటు పుట్టాడు. ఇతడు ఔర్వుని ఆశ్రమంలో భార్గవునిచేత రక్షింపబడ్డాడు. సగరుడు భార్గవుడి నుండి ఆగ్నేయాస్త్రాన్ని పొంది తాలజంఘులను, హైహయుడు మొదలగువాళ్ళను జయించాడు. మరియు శకపహ్లావ పారదాదుల ధర్మాన్ని నశింపచేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
త్రిశంకు కథ అనే పదమూడవ అధ్యాయము

☆☆☆

# పధ్నాల్గవ అధ్యాయము

## సగరుని పుట్టుక

జనమేజయుడిలా అడిగాడు.

ఓ తపోధనా! సగరుడు విషంతో ఎలా పుట్టాడు? మరియు అతడు కోపించి 'శకులు' మొదలగు క్షత్రియుల కులానికి తగిన ధర్మాన్ని నాశనం చేయుట, ఈ విషయం తమరు దయచేసి వివరంగా చెప్పండి. వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజు జూదం, త్రాగుడు మొదలైన వ్యసనాలలో పడ్డాడు. ఈ కారణంచేత శకయవనాది రాజులు అందరూ కలిసి తమ భుజబలంతో బాహుకుణ్ణి రాజ్యం నుంచి తొలగించి ఆ రాజ్యం మీద అధికారం చలాయించారు. అప్పుడు రాజు బాహువు దుఃఖపడి భార్యతో అడివికి వెళ్ళాడు. అక్కడనే మరణించాడు కూడా. బాహువు భార్య, భర్తతోపాటే అడవికి వెళ్ళింది. అంతకు మునుపే సవతి ఆమెకు విషం పెట్టింది. ఆమె, మరణించిన భర్తతోపాటు చితిపై కూర్చొని తాను కూడ ప్రాణత్యాగానికి సిద్ధపడింది.

అప్పుడు భృగువంశంవాడైన ఔర్వుడు ఆమెను దయతో అడ్డగించాడు. అతని ఆశ్రమంలోనే ఆమె విషంతోపాటు శిశువును కన్నది. అతడే సగరుడు. ఔర్వుడు ఆ శిశువుకు జాతకర్మ మొదలగు సంస్కారాలను జరిపి వేదశాస్త్రాలను బోధించి యుద్ధవిద్యలో శిక్షణ యిచ్చి ఆగ్నేయాస్త్రాన్ని కూడ ఇచ్చాడు. ఆ అస్త్ర బలంతో యుద్ధంలో హైహయులను నశింపచేశాడు. దీనిచే ప్రపంచంలో అతడు గొప్పకీర్తి పొందాడు. తరువాత శకయవనాదులను చంపుటకు బయల్దేరాడు. వీరుడైన సగరుడు చంపుతుండగా ఆ రాజులు వసిష్ఠమహర్షిని శరణుకోరారు. శరణుజొచ్చినవాళ్ళను రక్షించడం ధర్మం కనుక వసిష్ఠుడు వాళ్ళకు అభయమిచ్చి సగరుణ్ణి చంపవద్దని అడ్డగించాడు.

గురువు మాటను గౌరవించి సగరుడు వాళ్ళను చంపకుండా వాళ్ళ ధర్మాన్ని నశింపచేసి వేషాన్ని మార్పు చేయించాడు. శిరస్సును సగం గొరిగించి శకులను విడిచిపెట్టాడు. యవనులకు కాంబోజులకు పూర్తిగా తల గొరిగించి పారదులకు తలవెంట్రుకలు లేకుండ చేసి, పహ్లవులకు మీసాలు ధరింపచేశాడు. వీళ్ళలో ఎవరికీ వేదాన్ని ఉచ్చరించే అధికారం లేకుండా చేశాడు. జనమేజయ మహారాజా! సగరుడు గురువు వసిష్ఠుడు చెప్పినట్లు శత్రువులను మితిమీరి చంపటం ఆపి శకయవనాది రాజులను జయించి వారిని ధర్మభ్రష్టులను చేశాడు. సగర మహారాజు ఈ విధంగా భూమండలాన్ని జయించి అశ్వమేధ యాగానికి దీక్ష పూనాడు. ఆ యజ్ఞపు గుర్రాన్ని తానే రక్షిస్తూ దాని వెనుక వెళ్ళాడు. ఆగ్నేయదిశలో సముద్రం ఒడ్డున తిరుగుతుండగా ఇంద్రుడా గుర్రాన్ని దొంగిలించి భూమి క్రిందికి వెళ్ళాడు.

అప్పుడు సగరుడు ఆ ప్రదేశాన్ని కొడుకులచే త్రవ్వించాడు. అలా వారు త్రవ్వుతుండగా అక్కడ ఆదిపురుషుడు విష్ణుమూర్తి యోగములో ఉండి కపిలదేవుని రూపంలో కూర్చుని ఉన్నాడు. అతన్ని చూడగానే సగరపుత్రులు దగ్గరకు వెళ్ళి

యోగాన్ని పాడుచేశారు. కపిలదేవుడు కళ్ళు తెరవగానే భయంకరమైన అగ్ని వెలువడింది. ఆ అగ్నిలో సగరపుత్రులందరూ తగలబడిపోయారు. బర్హకేతు, సుకేతు, ధర్మరథుడు, పంచజనుడు అనే నలుగురు మాత్రం చావకుండా మిగిలారు. ఆ సమయంలో విష్ణువు ప్రత్యక్షమై సగరుడికి వరమిస్తూ రాజా! మీ వంశం నశించదు. నీవు గొప్ప కీర్తి పొందుతావు. సముద్రుడు నీకు పుత్రుడు. చివరకు తగలబడిన నీ కొడుకులు నాశంలేని లోకాలను పొందుతారు అని చెప్పాడు.

ఈ సమయంలోనే సముద్రుడు చేతులతో పూజాద్రవ్యం తీసుకొని సగరుడి వద్దకు వచ్చాడు. నమస్కరించాడు. అప్పుడు సగరుడు సముద్రుని తన పుత్రునిగా భావించాడు. కాబట్టే సముద్రానికి సాగరమనే పేరు వచ్చింది. సగరుడు సముద్రము నుండే తన యజ్ఞాశ్వాన్ని పొందాడు. నూరు యజ్ఞాలు చేసినవాడయ్యాడు. సగర మహారాజుకు అరవై వేలమంది పుత్రులున్నారని విన్నాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో

సగరుని పుట్టుక అను పదనాల్గవ అధ్యాయము

☆☆☆

# పదిహేనవ అధ్యాయము

## సూర్యవంశ వర్ణనము

జనమేజయుడిలా అడిగాడు.

మహాత్ముడైన సగరుడికి వీరులైన కుమారులు ఎలా పుట్టారు? వాళ్ళు అరవై వేలమంది ఎట్లు పుట్టినది మహాత్మా తెలియజేయుము. వైశంపాయనిడిలా సమాధానం చెప్పాడు.

సగరుడికి ఇద్దరు భార్యలు. పెద్దభార్య విదర్భరాజు కుమార్తె కేశిని, రెండవ భార్య అరిష్టనేమికూతురు ఆమె ధర్మాత్మురాలు మిక్కిలి సౌందర్యవతి. వాళిద్దరికీ ఔర్వుడు వరమిచ్చాడు. ఒకటవది వెయ్యి కొడుకులను, రెండవది వంశోద్ధారకుడైన ఒకణ్ణే కోరుకోమన్నాడు. చిన్నరాణి ఆశతో అరవై వేలమందిని కోరుకుంది. పెద్ద భార్య ఒకే పుత్రుణ్ణి కోరింది. ఔర్వముని అలాగే జరుగుతుందని వరమిచ్చాడు. కేశినికి ఒకే పుత్రుడు అసమంజసుడనేవాడు పుట్టాడు. అతనికి పంచజనుడనే

రెండవ పేరు కూడా ఉంది. రెండవ రాణికి గింజలతో కూడిన ఆనపకాయ పుట్టింది. అందులో అరవై వేలమంది శిశువులు నువ్వుగింజల్లాంటి వాళ్ళు పుట్టారు.

అసమంజసుడు పరాక్రమవంతుడైన వీరుడు. చిన్నరాణి పిల్లలు మెల్లమెల్లగా పెరిగారు. ఆ శిశువులను తండ్రి నేతిపాత్రలలో ఉంచాడు. వాళ్ళ పోషకుదాదులను కూడ అన్ని వేలమందిని నియమించాడు. పది నెలలైన పిమ్మట ఆ పిల్లలందరూ ఎదిగి తండ్రికి ఆనందం కలగచేశారు. సగరుడి అరవై వేల పుత్రులు ఈ విధంగా జన్మించారు. ఆ రాజపుత్రులందరి శరీరాలలో నారాయణుని తేజస్సు ప్రవేశించింది. వారిలో పంచజనుడనేవాడే పట్టాభిషిక్తుడయ్యాడు. పంచజనుడికి అంశుమంతుడనే వీరుడైన పుత్రుడు కలిగాడు. అంశుమంతునికి దిలీపుడు. ఇతనికి బట్వాంగుడని కూడ పేరున్నది. ఇతడు స్వర్గం నుంచి వచ్చి ముహూర్తకాల జీవితంలో మూడు లోకాలను ధ్యానబలంచేత బ్రహ్మస్వరూపంగా భావించాడు.

దిలీపుని కుమారుడు భగీరథుడు. అతడే గంగానదిని తెచ్చినవాడు కీర్తిమంతుడైన ఆ మహానుభావుడు ఇంద్రునితో సమానమైన పరాక్రమం కలవాడు. భగీరథుడు గంగను కుమార్తెగా పొంది సముద్రానికి చేర్చాడు. కాబట్టి గంగను విద్వాంసులు భాగీరథి అని పిలుస్తారు. భగీరథుని కొడుకు 'శత్రుడు' ఇతని కొడుకు నాభాగుడు. నాభాగుని కుమారుడు అంబరీషుడు. ఇతనికి సింధుద్వీపుడు. ఇతనికి అయుతాజిత్తు పుట్టారు. అయుతాజిత్తు కొడుకు ఋతుపర్ణుడు. ఇతడు గొప్ప కీర్తి గలవాడు. జూదంలో రహస్యాలు తెలిసినవాడు కూడ. నలుడితో ఇతనికి గొప్ప స్నేహం ఉంది. ఇతని కుమారుడు ఆర్తుపర్ణి. ఇతని కొడుకు సుదాసుడు. ఇతడు ఇంద్రునికి మిత్రుడు. ఇతని కుమారుడు సౌదాసుడు. ఇతనికి కల్మాషపాదుడనీ మిత్రసహుడనీ కూడ ప్రసిద్ధి ఉంది.

కల్మాషపాదుని కుమారుడు సర్వకర్ముడు, ఇతని పుత్రుడు అనరణ్యుడు ఇతని కొడుకు నిఘ్నుడు. ఇతని పుత్రులు అనమిత్రుడు రఘువు అనేవాళ్ళు. అన మిత్రుని పుత్రుడు దువిదుహుడు. ఇతడు విద్వాంసుడు. ఇతని కుమారుడు దిలీపుడు. ఇతడు రాముడికి ముత్తాత. దిలీపుని కొడుకు 'రఘువు' ఆయనే అయోధ్య రాజ్య సింహాసనముపై కూర్చున్నవాడు. రఘువు కొడుకు అజుడు. అజుని పుత్రుడు దశరథుడు. ఇతనికి ధర్మాత్ముడు రాముడు పుత్రుడు. రాముని పుత్రుడు కుశుడు. ఇతని కొడుకు 'అతిథి' ఇతనికి నిషధుడు. ఇతనికి నలుడు,

ఇతనికి నభుడు. ఇతనికి పుండరీకుడు, ఇతనికి క్షేమధన్వుడు, ఇతనికి దేవానీకుడు కొడుకు, ఇతనికి అహీనగుడు.

అహీనగుడికి సుధన్వుడు, ఇతనికి అనలుడు. ఇతనికి ఉక్థుడు, ఇతనికి వజ్ర నాభుడు, ఇతనికి శంఖుడు. వీడి కొడుకు పుష్యకుడు వీనికి అర్థసిద్ధి. ఇతనికి సుదర్శనుడు. ఇతనికి అగ్నివర్ణుడు ఇతనికి శీఘ్రుడు. ఇతనికి పుత్రుడు 'మరువు' ఇతడు కలాపద్వీపంలో యోగాభ్యాసం చేశాడు. ఇతనికి బృహద్బలుడు. వీరసేనుని కుమారుడు మరోనలుడున్నాడు. జనమేజయ మహారాజా! ఇంతవరకు ఇక్ష్వాకు వంశమందలి ప్రధాన రాజుల గూర్చి చెప్పి వినిపించాను. సూర్యుని యొక్క వంశ మందలి రాజుల యొక్క సృష్టిని చదివినవాడు. ప్రజలను పుష్టినిచ్చే శ్రాద్ధదేవుని వంశావళిని చదివినవాడు. సూర్యుని లోకానికి వెళ్ళి ఆనందిస్తాడు. బ్రతికి ఉన్నంత కాలం పాపాలు పోయి రజోగుణము నశించి ఆయుర్దాయం కలవాడవుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
సూర్యవంశవర్ణనము అను పదిహేనవ అధ్యాయము

☆☆☆

# పదహారవ అధ్యాయము

## శ్రాద్ధకల్ప వర్ణన

జనమేజయుడిలా అడిగాడు.

ఓ బ్రాహ్మణశ్రేష్టుడా! అదితి పుత్రుడైన సూర్యుడు శ్రాద్ధదేవుడెలా అయ్యాడు? శ్రాద్ధం యొక్క విధానం ఎటువంటిది? పితృలోకం యొక్క పుట్టుక ఎలాంటిది? పితరులు స్వర్గంలో ఉంటారనీ వాళ్ళు దేవతలకు కూడ దేవతలనీ అని నేను బ్రాహ్మణుల నుంచి విన్నాను. ఈ విషయం బాగా తెలుసుకొన గోరుతున్నాను. పితృగణం ఎవరు? వాళ్ళ బలం ఏమి? మనం ఎలా చేస్తే శ్రాద్ధం వాళ్ళకు సంతోషం కలుగుతుంది? పితృదేవతలు మనకిచ్చే మేలుఏమిటి? ఈ విషయం అంతా తెలుసుకొనగోరుతున్నాను.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! పూర్వం సనత్కుమారుడు మార్కండేయుడికీ మార్కండేయుడు భీష్ముడికీ ఈ విషయం చెప్పటం జరిగింది. భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు. అదే విషయాన్ని నీకు వినిపిస్తున్నా! భీష్ముడిలా చెప్పాడు ధర్మరాజా! పితృదేవతలను

తృప్తిపరచటంలో ఆసక్తి కలవాడు, కోరిన ప్రయోజనం పొందటానికి పితృ దేవత లను సంతోషపెట్టేవాడు. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖాన్ని పొంద టానికి సమర్థుడగుతున్నాడు. ఆ పితృదేవతలు ధర్మం కోరేవాళ్ళకు ధర్మం పుత్రులను కోరేవాళ్ళకి పుత్రులను, పుష్టికావాలనుకొనే వాళ్ళకు పుష్టిని యిస్తారు. మళ్ళీ ధర్మరాజు ఇలా అడిగాడు.

ఓ పూజ్యుడా! ప్రాణులందరూ తమ తమ కర్మలఫలాన్ని అనుభవిస్తూ ఉంటారు. కొంతమందికి పితరులు స్వర్గంలోను, కొందరు నరకంలోను ఉంటారు. మనుష్యులందరూ తమ కోరికలు తీరాలని తండ్రికి, తాతకి, ముత్తాతకి శ్రాద్ధం చేసి పిండాలు పెడతారు. వేర్వేరు లోకాల్లో ఉండేవాళ్ళు శ్రాద్ధంలో ఇవ్వబడిన పిండాలను ఎలా పొందుతారు? ఈ స్థితిలో నరకంలో ఉండే పితరులు కోరిన ఫలితాన్ని ఎలా ఇవ్వగలరు? ఏ పితరులు స్వర్గమందుంటారు. ఏ పితరులు నరకంలో ఉంటారు? మనమెందుకు పితృయజ్ఞం చెయ్యాలి? స్వర్గంలో దేవతలు కూడ పితరులకు శ్రాద్ధం పెడతారని విన్నాను.

మహానుభావా! ఈ విషయం విస్తరంగా వినాలని కోరుతున్నాను. అమిత బుద్ధిమంతుడవు నీవు ఈ విషయం చెప్పుము. పితృదేవతలను తరింపచేయు టానికి శ్రాద్ధం ఎలా చేయాలి. భీష్ముడిలా చెప్పాడు. నీవడిగిన విషయాలకు స్వర్గ మందున్న మా తండ్రి శంతనుమహారాజు ద్వారా నేను విన్నది చెప్పుతా! ఒకరోజున తద్దినంలో పిండాలు పెడుతున్నా ఆ సమయంలో నా తండ్రి భూమిలోంచి వెలుప లకు వచ్చి భుజకీర్తితో కూడిన ఎర్రనిచేతిని చాచి పిండం పెట్టమని అడిగాడు. అతడు వెనుక నేను చూచినట్లే ఉన్నాడు. శాస్త్రంలో చచ్చిపోయినవాడి చేతిలో పిండం పెట్టడం ఎక్కడాలేదు. అని ఆలోచించి సందేహించకుండా దర్భల మీదనే పెట్టాను.

అప్పుడు నా తండ్రి మిక్కిలి సంతోషించి మధురమైన వాక్కుతో భరత వంశంలో శ్రేష్ఠుడా! నీ వల్ల నేను సంతానం కలవాడ నయ్యాను. నేను భూలోకం లోను, స్వర్గంలోనూ కూడ కృతార్థుడనయ్యాను. నీ వంటి విద్వాంసుడు కొడు కవటం నా అదృష్టం. వేదధర్మాలను నీవు అనుసరించావు. వాటిని ప్రమాణంగా చేసుకొన్నావు. అందుచే నాకు మిక్కిలి సంతోషం కలిగించిన వాడవయ్యావు. రాజు నడవడిబట్టి ప్రజలు నడుస్తారు. నీ సత్ప్రవర్తనకు, శాస్త్రప్రమాణ బుద్ధికి మెచ్చి నీకు వరమిస్తున్నాను. నీవు ఎప్పుడు మరణించాలనుకుంటే అప్పుడే మరణి

స్తావు. ఇంకా ఏదైనా నీవు వరం కోరితే అది కూడా ఇస్తాను. నీమనస్సులో విషయం చెప్పు. అప్పుడు నేను కృతార్థుడనైనాను. నీవు సంతోషించావు కనుక అని, అప్పుడు భీష్ముడు తండ్రినిలా అడిగాడు.

తండ్రీ! దేవతలకు, పితరులకు ఏమీ తేడాలేదని వింటున్నాను. ఐతే దేవతల్ని పూజించాలా! పితరులను పూజించాలా! మనం పిండాలు పరలోకంలో ఉన్న పితరులకు ఎలా ప్రాప్తిస్తాయి? మరియు శ్రాద్ధం యొక్క ప్రయోజనమేమి? దేవదానవ గంధర్వాదులు ఎవర్ని పూజిస్తారు? ఈవిషయంలో నాకు పెద్దసందేహం ఉంది. తెలుసుకోవాలని ఉత్సాహంకూడా ఉంది. మీరు అన్నీ తెలిసినవారు. కనుక నాసందేహాన్ని పోగొట్టండి. అప్పుడు భీష్ముడి తండ్రి ఇలా చెప్పాడు. నీ ప్రశ్నలన్నిటికీ సంగ్రహంగా సమాధానం చెపుతా. శ్రద్ధగా విను.

స్వర్గంలో దేవతలందరూ బ్రహ్మపుత్రులు. దేవతలు, మనుష్యులు, కిన్నరులు, మహాసర్పాలు అందరూ పితృయజ్ఞం చేస్తారు. ఇలా చెయ్యాలని బ్రహ్మయొక్క శాసనం. పితృ యజ్ఞంచేత పితరులు తృప్తిపడి మనలను తృప్తిపరుస్తారు. కాబట్టి నీవు సోమరితనం లేకుండ శ్రేష్ఠమైన శ్రాద్ధ పితృదేవతలను పూజింపుము. అన్ని కోరికలను తీర్చు వారు మేలుచేస్తారు. పేరు, గోత్రం మొదలైనవి చెప్పి వాళ్ళ నారాధిస్తే స్వర్గమందున్న దేవతలు కూడ సంతోషిస్తారు. ఈవేళ ప్రఖ్యాతిచెందిన పితృభక్తుడు మార్కండేయ ముని మనపై అనుగ్రహంతో ఇక్కడకు వచ్చారు. మిగిలిన మాటలు వీరే నీకు చెపుతారు. ఇట్లుచెప్పి నాతండ్రి అక్కడనే అంతర్ధానం చెందాడు. (కనబడకుండా పోయాడు.)

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
శ్రాద్ధకల్ప వర్ణనే పదహారవ అధ్యాయము

☆☆☆

# పదిహేడవ అధ్యాయము

## మార్కండేయ సనత్కుమార సంవాదము

తరువాత భీష్ముడిలా చెప్పాడు.

నేను మాతండ్రి మాటప్రకారం మార్కండేయమునిని పూర్వం తండ్రి నడిగిన ప్రశ్ననే అడిగాను. ధర్మాత్ముడు, మహాతపశ్శాలియైన మార్కండేయుడు ఇలా చెప్పాడు.

పూర్వం నేను పితరుల దయచేత దీర్ఘాయుస్సును, పితృభక్తిచేత గొప్పకీర్తినీ పొందాను. పూర్వం మేరుపర్వతంమీద అతికఠోర తపస్సు చేస్తుండగా కొన్ని యుగాలు, యుగాన్తరాలు గడిచిపోయాయి. ఒకరోజున ఆకాశ మండలాన్ని అంతనీ ప్రకాశింపచేస్తూ ఒకవిమానం ఉత్తరదిక్కునుండి వస్తుండగా చూచాను. ఆవిమానం దగ్గరకు రాగానే ఆవిమానంలో మంచంమీద మండుతున్న సూర్యుని వంటి బొటనవ్రేలు మాత్రం ప్రమాణంగల పురుషుణ్ణి చూశాను. అతడు అగ్నిమీద అగ్ని ఉన్నట్లు కనపడ్డాడు. నేనతనికి శిరస్సువంచి నమస్కరించాను. విమానంలో ఉన్న పురుషునికి పాద్యము, అర్ఘ్యము ఇచ్చి పూజించాను. సమీపించ రాని విధంగా ఉన్న ఆ పురుషుని ఎవనిగా నిన్ను తెలుసుకోవాలని అడిగాను. తపఃప్రభావంచే పుట్టిన నారాయణాంశగలిగి దేవతలకు కూడ దేవతవైనవాడని నా ఉద్దేశం అని పలికాను. అతడు చిరునవ్వు నవ్వుతూ నాకిట్లు చెప్పాడు.

నీతపస్సు ఇప్పటికీ పూర్తికాలేదు అని పలికి అతడు దేవతారూపాన్ని పొందాడు. అంతటి అందమైన పురుషుని నేనెపుడూ చూడలేదు. సనత్కుమారుడిలా అన్నాడు. నేను బ్రహ్మయొక్క తపస్సుచేత, మహిమచేత అతనికి పుట్టిన మానసపుత్రుణ్ణి. నారాయణుని సత్త్వగుణ స్వరూపాన్ని. నువ్వు వేదాలలో సనత్కుమారుని పేరు విని ఉంటావు. ఆ సనత్కుమారుడను నేనే. నీకు శుభమగుగాక. నీకు నేనేం ఉప కారం చెయ్యాలో చెప్పు. తక్కిన నా సోదరులందరూ నాకంటే చిన్నవాళ్ళు. నాకు ఏడుగురు సోదరులున్నారు. వాళ్ళు వంశాలను స్థాపించారు. క్రతువు, వసిష్ఠుడు, పులహుడు, పులస్త్యుడు, అత్రి, అంగిరసుడు, మరీచి వీరు దేవగంధర్వాదులచే సేవింపబడిన వాళ్ళు.

మేము సన్యాసిధర్మం అవలంబించినవాళ్ళం. ప్రజాధర్మాన్ని, కామాన్ని విడిచి పెట్టి పుట్టినప్పటివలెనే ఉన్నాను. నన్ను సనత్కుమారునిగా తెలుసుకో. కనుక నాపేరు సనత్కుమారుడు. నాయందలి భక్తితో నన్ను చూడాలని తపస్సు చేశావు. ఇదిగో కనబడ్డాను. నీకు ఏకోరికను తీర్చమంటావో చెప్పు అని మాట్లాడిన అతనితో ఇలా చెప్పాను. అయ్యా! పితృదేవతల సృష్టి, శ్రాద్ధంయొక్క ప్రయోజనం తెలియ చేయండి అని. అతడు నా సంశయాన్ని పోగొట్టాడు. ధర్మాత్ముడైన అతడు చాలసేపు మాట్లాడి చివర ఓబ్రహ్మర్షీ! నీప్రశ్న విని చాల సంతోషించాను. ఇప్పుడీ విషయాన్ని వివరంగా చెపుతాను విను.

ఓ మునిశ్రేష్ఠా! పూర్వం బ్రహ్మ తనను పూజిస్తారని దేవతలను సృష్టించాడు. కాని వాళ్ళు విషయఫలాలను కోరి ప్రయత్నించారు. అప్పుడు బ్రహ్మ మూఢులైన దేవతలను శపించాడు. మీరు పరిస్థితులను తెలుసుకొనే జ్ఞానంలేని వాళ్ళవుతారు అని శపించగా అప్పుడు దేవతలు వినయంతో బ్రహ్మను శరణువేడారు. అప్పుడు బ్రహ్మ మీరు చేసిన అపరాధానికి ప్రాయశ్చిత్తం మీపుత్రుల నడగండి. మీకు మళ్ళీ వెనుకటి జ్ఞానం వస్తుంది అని చెప్పాడు.

వారు పుత్రులను ప్రాయశ్చిత్తంగూర్చి అడిగారు. కుమారులు ప్రాయశ్చిత్తాలు స్తోత్రపాఠము, ధ్యానము, సాష్టాంగ నమస్కారం వీటిని మనస్సుచేత, వాక్కుచేత, తపస్సుచేత తెలియజేయాలి అని చెప్పగా ప్రాయశ్చిత్తపదానికి అర్థం తెలిసింది. వాళ్ళకు వెనుకటి జ్ఞానంకూడ ప్రాప్తించింది. అప్పుడు దేవతలు మాకు ప్రాయశ్చిత్తమంటే ఏమిటో తెలిసింది. మాకు జ్ఞానం కలిగింది.

పుత్రులారా! వెళ్ళండి అని చెప్పగా అప్పుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళండి అని పుత్రులు చెప్పారు. తరువాత దేవతలు మనం పుత్రులచే నిందింపబడ్డామని తమ సందేహం తీర్చుకోడానికి బ్రహ్మదగ్గరికి వెళ్ళారు. తమ సందేహాన్ని దేవతలు చెప్పగా బ్రహ్మ మీరు దేవతలకు శరీరమునిచ్చునటువే వాళ్ళకు పితరులు. వాళ్ళు మీకు జ్ఞానమిచ్చునటువే వాళ్ళు మీకు పితరులు. వాళ్ళకు మీరూ, మీకు వాళ్ళూ తల్లిదండ్రులు అవడంలో సందేహమేమీలేదు అన్నాడు.

అప్పుడు దేవతలకు, పితరులకు సందేహం తొలగిపోయింది. రాక్షసులుగాని, దానవులుగాని ఎవరైనా పితరులను తృప్తిపరచక పోతే దానికి ఫలితమనుభవిస్తారు. శ్రాద్ధములచేత చంద్రుడుకూడ తృప్తిపడి సముద్ర, వన, పర్వతాలను, సమస్త ప్రాణులను బల వంతులనుగా చేస్తాడు. పితృదేవతలు శ్రాద్ధాలు పెట్టేవాళ్ళకు పుష్టినిస్తారు. తండ్రి, తాత, ముత్తాతల పేర్లు చెప్పి పిండాలు పెట్టినచో పితృదేవతలు తృప్తిపడి వంశసంతానానికి అభివృద్ధి కలుగజేస్తారు. ఈవిధంగా దేవతలు, పితరులు ఒకరికొకరు పితరులయ్యారు. భావమేమిటంటే దేవతలే పితరులు; పితరులే దేవతలు అని.

ఇది శ్రీమన్మహాభారతంలో ఖిలవంశమందలి ఖిలవంశపర్వంలో
మార్కండేయ సనత్కుమార సంవాదము అను పదిహేడవ అధ్యాయము

***

# పద్దెనిమిదవ అధ్యాయము

## పితృకల్పము శ్రాద్ధఫలవర్ణన

మార్కండేయుడిలా చెప్పాడు.

సనత్కుమారుడీవిధంగా చెప్పిన తరువాత నేనాయనను ఈ సందేహం అడిగాను. భీష్మా విను! సోవర్ధనులనే దేవప్రధానులైన పితృగణాలు ఎన్ని? ఏ లోకంలో వుంటారు?

సనత్కుమారుడిలా సమాధానమిచ్చాడు.

ఓ మునిశ్రేష్ఠా! మొత్తం వాళ్ళు ఏడుగణాలు. అందులో నాలుగు గణాలు రూపం కలవి. తక్కువ మూడుగణాలు రూపం లేనివి. వాళ్ళ లోకం సృష్టిని మహాత్వం, ప్రభావం చెపుతాను విను.

ధర్మమూర్తిధరులైన మూడుగణాలు లోకాలు సనాతనములనే పేరు గలవి. రూపంలేని మూడు పితృగణాలు ప్రజాపతి పుత్రులు. విరాజ ప్రజాపతి పుత్రులు గనుక వైరాజులు అనే ప్రసిద్ధి పొందారు. దేవగణాలు వాళ్ళను పూజిస్తాయి. యోగభ్రష్టులైన వీళ్ళు సనాతనములైన లోకాలను పొంది వెయ్యి యుగాల తరువాత బ్రహ్మవాదులుగా పుడతారు. వాళ్ళు పూర్వజన్మ స్మృతి కలిగి ఉత్తమమైన సాంఖ్య యోగాన్ని అవలంబించి మరల పుట్టనక్కరలేని ఉత్తమస్థితిని పొందుతారు. ఈ పితృదేవతలు యోగులకు యోగబలాన్ని వృద్ధి చేస్తారు. పూర్వము వాళ్ళు తమ యోగబలంతో సోముని (చంద్రుని) తృప్తి పరచి చంద్రలోకంలో ఉన్నారు. కనుక శ్రాద్ధం తప్పకుండా చెయ్యాలి.

ఓ మహామునీ! సోమపానం చేసే మహాత్ముల యొక్క ఈ మొదటి సృష్టిని చెప్పాను. ఈ పితృదేవతల యొక్క మనస్సంకల్పం చేతనే మేనక పుట్టింది. ఆమె హిమవంతుని భార్యయై మైనాకుని కన్నది. మైనాకుని కొడుకు క్రౌంచపర్వతం. హిమవంతుడు మేనక వలన ముగ్గురు కన్యలను కన్నాడు. వాళ్ళు అపర్ణ, ఏకపర్ణ, ఏకపాటల అనువాళ్ళు. ఆ ముగ్గురూ గొప్ప తపస్సుప చేసి లోకాన్ని తపింపచేశారు. ఏకపర్ణ ఒకే ఆకును తిని తపస్సు చేసింది. ఏకపాటల పాటలపుష్పాన్ని ఒక్కటినే ఆహారంగా తీసుకున్నది. మూడవది ఏ ఆహారం లేకుండా తపస్సు చేయగా తల్లి ఆమెను ఉ= ఓ అమ్మాయీ మా=వద్దు అని నివారించింది. అందుచే ఆమెకు

ఉమ అనే పేరు వచ్చింది. ప్రపంచంలో ఈ ముగ్గురూ బ్రహ్మవాదినులు యోగ బలం కలవాళ్ళు. ఆ ముగ్గురిలో పెద్దది ఉమ. ఆమెకు గొప్పయోగబలం ఉంది. గొప్ప అందకత్తె. శివుడామె భర్త. ఏకపర్ణ ఏకపాటల భర్తలు కూడా యోగాచార్యులు.

మరీచిమహర్షి పుత్రుడుండే స్థానము సోమపదము. స్వర్గంలో ఉండే దేవతలు సోమపదమందుండే, పితరులకు శ్రాద్ధం చేసి వారిని సంతోషపెడతారు. సోమపద మందలి పితరులు అగ్నిష్వాత్తులనబడతారు. ఈ పితరుల మనస్సంకల్పం వల్ల పుట్టిన కన్య 'అచ్ఛోదనది' దానినుండి ఏర్పడినదే అచ్ఛోదనమనే సరస్సు. అచ్ఛోద తన తల్లి తండ్రులనేప్పుడూ చూడలేదు. దివ్యదృష్టితో శరీరంలేని పితరులను చూచి గుర్తు పట్టలేకపోయింది. ఈ కారణం చేత సిగ్గు పడింది. ఈ సమయంలో ఆయువు యొక్క కుమారుడు అమావసువు తన కుమార్తె అద్రికతో విమానంలో కూర్చుని అక్కడకు వచ్చాడు. అచ్ఛోద ఆయువును చూచి తండ్రీ అని పిలిచింది. తండ్రి కానివాణ్ణి తండ్రీ అనటంచే ధర్మాన్ని దాటినట్లైంది.

ఈ అధర్మంచేత స్వర్గం నుండి జారి పడనారంభించింది. క్రింద పడేటప్పుడు మిక్కిలి చిన్న విమానంలో తన పితరులు కూర్చొని ఉన్నారు. వాళ్ళు మిక్కిలి చిన్న శరీరం కలవాళ్ళు, వాళ్ళ శరీర తేజస్సు అగ్నిలా ప్రకాశిస్తోంది. శిరస్సు క్రిందికి పెట్టి జారిపడుతున్న అచ్ఛోద వాళ్ళను చూచి దీనంగా అరుస్తూ నన్ను రక్షించండి అని కేకలు వేసింది. ఆకాశంలో ఉన్న ఆమెకు భయపడవద్దని వాళ్ళు చెప్పారు. ఆమె ఆకాశంలోనే నిలిచి దీనంగా వాళ్ళను స్తోత్రంచేసి సంతోషపెట్టింది. పితృ దేవతలు నీ దోషం చేతనే నీవు పడుతున్నావు. దేవతలు ఏ శరీరాలతో చేసిన పనులకు ఆ శరీరాలతో ఫలితాన్ని అనుభవిస్తారు. దేవతలు చేసిన పనులకు వెంటనే ఫలితం కనిపిస్తుంది. కనుక నీవు ఈ కర్మఫలితాన్ని అనుభవించిన తరువాతనే తపస్సు యొక్క ఫలితాన్ని అనుభవిస్తావు.

పితరులిలా చెప్పిన మీదట మళ్ళీ వాళ్ళని స్తోత్రం చేసి సంతోషపెట్ట నారంభించింది. కొంచెంసేపు కర్మఫలాన్ని గూర్చి విచారించిన తరువాత వాళ్ళిలా అన్నారు. పుత్రీ! మహాత్ముడైన అమావసు భూలోకంలో పుట్టి రాజైనప్పుడు నీవతనికి పుత్రికవుతావు. భూలోకంలో నీ కడుపునుండి పరాశర పుత్రుడు వ్యాసుడు, శంతన పుత్రులు విచిత్రవీర్య చిత్రాంగదులు జన్మిస్తారు. వ్యాసమహర్షి తన ప్రతిభచే వేదాన్ని నాలుగు భాగాలు చేస్తాడు. నీవు పుత్రుల్ని కన్న తరువాత మళ్ళీ నీలో

లోకానికి వెళ్తావు. పితరులను గౌరవించనందున నీకు నీచ జన్మవస్తుంది. ద్వాపర యుగంలో వసువు భార్యకు పుత్రికవు అవుతావు. కాని నీవు చేప నుండి పుడతావు. ఇలా చెప్పిన తరువాత మత్స్యరాజుకు భార్య సత్యవతిగా పుట్టింది. ఈమె చేప కడుపున పుట్టింది. పల్లెవాళ్ళు పెంచడంచేత దాశేయి అని పేరు వచ్చింది. స్వర్గంలో నివసించే బర్హిషదులనే పితరులు వైభ్రాజులనబడుచున్నారు.

దేవతలందరూ ఈ పితరులను పూజిస్తారు. ఆ పితరులు తపశ్శాలియైన పులస్త్య ప్రజాపతికి పుత్రులు. ద్వాపరయుగంలో వారికి మనసు నుండి పుట్టిన కన్య 'పీవరి' అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది. ఆమె ఒక యోగాచార్యునకు భార్య మరొక యోగాచార్యునకు తల్లి అవుతుంది. ఆమె కూడ యోగిని. ఆ యుగం లోనే పరాశరుని వంశంలో శుకుడనే మహాతపశ్శాలి వ్యాసుని పుత్రుడు జన్మిస్తాడు. పీవరి కడుపున శుకునకు కృష్ణుడు, గౌరుడు, ప్రభువు, శంభుడు అనే నలుగురు మహాబలవంతులు యోగులైన పుత్రులు, కృత్వీ అనేక కన్య పుడతారు. ఆ కన్య అణుహకి అనే వాడికి భార్య బ్రహ్మదత్తుడికి తల్లి అవుతుంది. తరువాత శుకుడు వేదవ్యాసుని వలన ధర్మాలను తెలుసుకొని మరల జన్మించనవసరం లేని మోక్షాన్ని పొందాడు.

ఓ మునీశ్వరా! ధర్మమూర్తిధారులు ఆకాశంలో సంచరించువారైన పితరులు అందరూ స్వర్గలోకంలో ఉంటారు. వృష్ణి అంధక వంశాల వర్ణనలో వీరిని గూర్చి చర్చ వచ్చింది. ఇప్పుడు శరీరం ధరించిన మనుష్యలోకంలోని పితరులను వర్ణిస్తాను. సుకాలురనే పితరులు వసిష్ఠ ప్రజాపతి పుత్రులు. వాళ్ళందరూ అన్ని కోరికలు తీరిన జ్యోతిస్స్వరూప లోకాలలో నివసిస్తారు. బ్రాహ్మణ సమూహం నిత్యమూ వీళ్ళకి తర్పణం చేస్తుంది. స్వర్గలోకంలో గోవనే కన్య వీళ్ళ మానసపుత్రిక. ఆమెకు 'ఏకశృంగ' అని మరొక పేరు. ఏకశృంగ శుకునికి మిక్కిలి ప్రియమైన భార్య. ఆమె వలన 'సాధ్యు'ల యొక్క కీర్తి విస్తరించింది.

అంగిరసుని పుత్రులు సాధ్యులచే పెంచబడిన వాళ్ళు సూర్యకిరణాలచే ప్రకాశించు లోకాలలో ఉంటారు. కోరికలు కలవాళ్ళు ఆ పితరులను తృప్తిపరుస్తారు. యశోదవాళ్ళ మానసకన్య ఈమె విశ్వమహత్తను వాడి భార్య. ఆమె రాజర్షి దిలీపుడికి తల్లి. సుస్వధ అను పేరుతో ప్రసిద్ధులైన పితరులు పులహుని పుత్రులు కర్దమ ప్రజాపతికి తండ్రులు. వాళ్ళెప్పుడూ ఆకాశంలో నివసిస్తారు. వాళ్ళకు వైశ్యులు తర్పణాలు చేస్తారు. 'విరజ' వాళ్ళ మానసకన్య. నహుషుని భార్య యయాతికి

తల్లి. ఇంతవరకు మూడు విధానాలైన పితరులను చెప్పాను. ఇక నాల్గవ పితరుల చరిత్ర చెపుతా!

శుక్రాచార్యుని పుత్రిస్వధకు పుట్టిన పితరులు' అందరూ అగ్నిపుత్రులు, శూద్రులు వాళ్ళకు తర్పణాలు చేస్తారు. వాళ్ళు మానసలోకాల్లో ఉంటారు. వాళ్ళ మానసకన్య నర్మదానది. నర్మద దక్షిణ దిశగా ప్రవహిస్తూ అనేక ప్రాణులను, పవిత్రులను చేస్తోంది. మహారాజ పురుకుత్సుని భార్య త్రసదస్సునికి తల్లి. ధర్మం నశించినప్పుడు ప్రజాపతి మనువు ఈ ఏడుగురు పితరులకు శ్రాద్ధమును తర్పణాలను చేస్తాడు. కనుక ఇతన్ని శ్రాద్ధదేవుడంటారు. స్వధామంత్రం చదువుతూ పితరులకు వెండి పాత్ర దానం చేసినవాడు పితరులను తృప్తిపరచినవాడవుతాడు. ఈ విధంగా పితరులను తృప్తిపరిస్తే పితరులు మనను తృప్తిపరుస్తారు.

ఓ మహామునీ! దేవతల పనికంటే పితరుల పని మిక్కిలి పొగడతగినది. ఎందుకనగా పితరులకు కోపముండదు. కనుక దేవతలకంటే వీళ్ళు త్వరగా తృప్తి పడతారు. వాళ్ళ ప్రసన్నత స్థిరమైనది. కాబట్టి వాళ్ళను తృప్తిపరచడం ప్రధానం. ఓ బ్రహ్మర్షీ! నీవు పితృభక్తుడవు. నా భక్తుడవు కూడా. నీకు మేలు చేస్తాను. శ్రాద్ధము యొక్క ఫలాన్ని ప్రత్యక్షంగా చూడగలవు. ఓ మార్కండేయ! మీలాంటి సిద్ధులు కూడా సాధారణ దృష్టితో పితరుల గొప్పతనాన్ని చూడలేరు. సనత్కుమారుడీ విధంగా చెప్పి నాకు దివ్యదృష్టినిచ్చి తనకిష్టమైన దిక్కుకు వెళ్ళిపోయాడు. మార్కండేయుడిలా అన్నాడు.

ఓ భీష్మా! సనత్కుమారుని దయచేత మనుష్యులకు తెలియరాని జ్ఞానాన్ని పొందాను. దాన్ని చెప్పుతా విను!

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పితృకల్పము శ్రాద్ధఫలవర్ణన అను పద్ధెనిమిదవ అధ్యాయము

☆☆☆

# పందొమ్మిదవ అధ్యాయము

## పితృకల్పము-భరద్వాజ పుత్రుల కథ

మార్కండేయుడిలా చెప్పాడు.

తండ్రీ! పూర్వము మహర్షి భరద్వాజుడి పుత్రులు యోగులయ్యారు. కాని కొన్ని రోజుల తరువాత కొన్ని చెడ్డపనులు చేసి యోగభ్రష్టులయ్యారు. కర్మవశం

వల్లవాళ్ళు మానస సరోవరం ఒడ్డున వెళ్ళిపడ్డారు. వెనుకటి యోగసిద్ధిని పొందలేక పోయారు స్వర్గలోకంలో చాలా రోజులున్న తరువాత కురుక్షేత్రంలోని కౌశిక వంశంలో పుట్టారు. ఈ జన్మలో పితృదేవతలకు శ్రాద్ధం చేయాలని ప్రయత్నించారు. జీవహింసచేత పాపాత్ములై వెనుకటి కంటే నీచజన్మ నెత్తారు. పూర్వజన్మలో పితరులకు దానం చేయటంచేత నీచజన్మ నెత్తినా అన్ని మాటలు గుర్తున్నాయి. వాళ్ళు ఏ జన్మలో ఏ సంఘటనలు జరిగింది దివ్యదృష్టితో చూచారు. వెనుకటి జన్మలలోని విషయాలను తలచుకొని మెల్ల మెల్లగా ధర్మాన్ని ఆచరించడం ప్రారంభించారు.

కొంచెం సమయం తరువాత తమ మంచి పనులచేత పోయిన బ్రాహ్మణ ధర్మాన్ని మళ్ళీ పొందారు. మళ్ళీ వాళ్ళకి పూర్వజన్మలో సంపాదించిన యోగబలం వచ్చింది. అందు యోగసిద్ధి శాశ్వత లోకాలను కూడ పొందారు. ఈ కథ చెప్పి ఓ మునివరా! ఈ విధంగా మీకు కూడా మంచి బుద్ధిప్రాప్తిస్తుంది. సాధారణ బుద్ధి గలవాళ్ళకు యోగసిద్ధి పొందరానిదే అవుతుంది. ఒకవేళ ఏవిధంగానైనా పొందినా వేట మొదలైన వ్యసనాలతో అధర్మంగా ప్రవర్తించి గురువులకు దుఃఖం కలిగిస్తారు. సత్ప్రవర్తన కలవారే యోగసిద్ధిని పొందటానికి సమర్థులు. సద్గుణాలు సత్ప్రవర్తన లేనివాళ్ళకు యోగసిద్ధిని పొందటం చాలాకష్టం.

నాయనా! ఈ విధంగా భరద్వాజుని పుత్రుడు అన్ని మంచి గుణాలు కలవాడై మరల బ్రాహ్మణుడయ్యాడు. అతనికి పూర్వపు చెడ్డపనులు, పొరపాట్లు గుర్తున్నాయి. ప్రపంచంలో ధ్యానమూ చదువుతో కూడిన శాన్తిమార్గంలో నడిచేవాడికి శాన్తి తప్పక ప్రాప్తిస్తుంది. అందువల్ల ఓ భార్గవా! నీవు కూడ యోగమార్గాన్ని అవలంబించుము. ఓ భీష్మా! సనత్కుమారుడు నాకిలా చెప్పి అక్కడనే అంతర్ధానం చెందాడు. (కనబడలేదు) నేను పద్దెనిమిది సంవత్సరాలు ఆయనను సేవించాను. కాని ఒక్కరోజుగా తలచాను. ఆ మహానుభావుని అనుగ్రహం వల్ల నాకు అలసట, ఆకలిదప్పులు కాలం గూడా తెలియలేదు. తరువాత శిష్యుల వలన సమయం తెలుసుకొన్నాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పితృకల్పము-భరద్వాజ పుత్రుల కథ అను పందొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఇరవయ్యో అధ్యాయము

## బ్రహ్మదత్త వంశ వర్ణనము

మార్కండేయుడిలా అన్నాడు.

ఆ మహానుభావుడంతర్ధానమైన తరువాత ఆ మహాత్ముని మాటప్రకారం విజ్ఞానంతో కూడిన దివ్యనేత్రం నాకేర్పడింది. అప్పుడు నేను కౌశికుని పుత్రులైన బ్రాహ్మణులను చూచాను. వాళ్ళలో ఏడవవాడు పనులవల్ల స్వభావంవల్ల 'పితృవర్తి' అనే పేరుతో ప్రసిద్ధిపొందాడు. అతడు ఏడవజన్మలో బ్రహ్మదత్తుడనే రాజు అయ్యాడు. కాంపిల్యమనే పట్టణంలో శుక్రుని కుమార్తె గర్భంనుండి అణుహుడనే వానివలన బ్రహ్మదత్తుడు పుట్టాడు. భీష్ముడిలా అన్నాడు.

మహానుభావ! మార్కండేయుడు బ్రహ్మదత్తుని వంశాన్ని వర్ణించినట్లు నీకు వినిపిస్తా. ధర్మరాజు అడిగాడు. అణుహుడనే రాజు ఎవని పుత్రుడు? ఎపుడున్నాడు? బ్రహ్మదత్తుడు అతని కుమారుడే కదా! రాజైన బ్రహ్మదత్తుడు ఎట్టి పరాక్రమం కలవాడు? అతడు భరద్వాజుని పుత్రులలో ఏడవవాడెలా అయ్యాడు? యోగాచార్యుడైన శుకమహర్షి సాధారణవీరుడికి తన కన్యను ఎప్పుడూ ఇవ్వడు ఓ మహా మునీ! నేను ఈ వృత్తాంతాన్ని విశేషంగా బ్రహ్మదత్తుని చరిత్రనూ విన గోరుతున్నాను. మార్కండేయముని నోటినుండి మీరు విన్నట్లు చెప్పండి.

భీష్ముడిలా చెప్పాడు.

ధర్మరాజ! రాజర్షి మహాత్ముడైన బ్రహ్మదత్తుడు నా తాత ప్రతీపమహారాజు సమకాలికుడు. ఆయన ప్రాణులకు మంచి జరగాలని ఆలోచించేవాడు. యోగాచార్యుడైన గాలవఋషి అతనికి మిత్రుడు. ఆయన తన తపోబలంవల్ల వేదాంగాలను నిర్మించి సంహితపదము ఒకేమారుగ చదవాలనే నియమాన్ని వ్యాపింపచేశాడు. యోగాత్మకుడైన పుండరీకుడు ఆయనకు మంత్రి. ఆయన ఏడుమార్లు పుట్టాడు. ఏడుజన్మలలోనూ యోగాత్మునితో కలిసి ఉండేవాడు. మార్కండేయ ముని పురువంశపు బ్రహ్మదత్తుని వంశం ఎలా వర్ణించాడో అలా చెపుతున్నాను.

ధర్మరాజా! బృహత్క్షత్రుడనే రాజుకు సహోత్రుడనే పుత్రుడున్నాడు. అతని పుత్రుడు 'హస్తి'. హస్తినాపురాన్ని అతడే నిర్మింపచేశాడు. ఇతనతికి ముగ్గురు పుత్రులు. వాళ్ళు అజమీఢుడు, ద్విమీడుడు, పురుమీఢుడు. పురుమీడుని పుత్రుడు

'బృహద్దిషువు' అనువాడు. ఇతనికి మహాయశశ్శాలియైన బృహద్ధనువు పుత్రుడు. ఇతనిని బృహద్ధర్ముడని కూడ పిలుస్తారు. ఇతని కుమారుడు సత్యజిత్తు. ఇతని పుత్రుడు విశ్వజిత్తు. ఇతని కుమారుడు సేనజిత్తు. సేనజిత్తుకు రుచిరుడు, శ్వేతకేతువు, మహిమ్నారుడు, వత్సుడు అనే నలుగురు కుమారులు. వత్సుడు అవన్తిపట్టణానికి రాజు. ఇతని వంశంవాళ్ళని పరివత్సకులంటారు.

రుచిరుని పుత్రుడు పృథుసేనుడు. ఇతనికి 'పారుడు' కుమారుడు. వీనికి నీపుడు పుత్రుడు. ఇతనికి వందమంది పుత్రులు. వాళ్ళందరూ గొప్ప పరాక్రమ వంతులు. వారందరూ 'నీపు'లని ప్రసిద్ధి చెందిన రాజులు. నీపుడికి వంశోద్ధారకుడైన పుత్రుడు 'సమరుడు'. కాంపిల్యనగరంలో ఉండే సమరుడు ఎక్కువ యుద్ధప్రీతి కలవాడు. సమరుని కుమారులు పరుడు, పారుడు, సదశ్వుడు మిక్కిలి ధర్మాత్ములు. పారుని కొడుకు పృథువు. ఇతనికి సుకృతుడు కొడుకు. ఇతనికి విభ్రాజుడు కొడుకు. విభ్రాజుని పుత్రుడు అణుహుడు. 'కృత్వి'కి భర్త దామాదుడు.

ఈ అణుహుని పుత్రుడే రాజర్షి బ్రహ్మదత్తుడు. ఇతని పుత్రుడు విష్వక్సేనుడు. బ్రహ్మదత్తుని రెండవకుమారుని పేరు సర్వసేనుడు. విష్వక్సేనుని పుత్రుడు దండసేనుడు. ఇతని పుత్రుడు భల్లాటుడు. పూర్వమితడు కర్ణునిచేత చంపబడ్డాడు. భల్లాటుడి కొడుకు 'దుర్బుద్ధి' అనేవాడు అయ్యాడు. అతడు నీపవంశరాజుల్ని చంపివేశాడు. తాను రాజసింహాసనం మీద కూర్చున్నాడు. ఉగ్రాయుధుడనేవాడు మిక్కిలి అభిమానవంతుడు. అతన్ని నేనే యుద్ధంలో చంపేశాను. ఉగ్రాయుధుడు అహంకారము గలవాడు, మదించినవాడు కూడ. ధర్మరాజు ఉగ్రాయుధుడు ఎవడి కొడుకు? ఏ వంశంలో పుట్టాడు? ఎందుకు నీవతన్ని చంపావు? ఈవిషయం నాకు చెప్పుమని అడిగాడు. భీష్ముడిలా చెప్పాడు.

అజమీఢుని కొడుకు యవనీరుడు. ఇతని కొడుకు ధృతిమంతుడు. ఈతని కొడుకు సత్యధృతి, ఇతని పుత్రుడు దృఢనేమి. వీనికొడుకు సుధర్ముడు. ఇతని కుమారుడు సార్వభౌముడు. ఇతని వంశంలో 'మహాన్' అనే రాజు జన్మించాడు. ఇతని పుత్రుడు రుక్మరథుడు. ఇతని పుత్రుడు సుపార్శ్వుడు, ఇతని పుత్రుడు సుమతి, వీని కుమారుడు 'సన్నతి'. ఈతని కొడుకు మహావీరుడు. ఇతని పుత్రుడు కృతుడు. ఇతడు కోసలదేశపు హిరణ్యనాభుని శిష్యుడు. హిరణ్యనాభుడు సామ వేదాన్ని ఇరవైనాలుగు భాగాలుగ విభజించాడు. మహావీరుడు ఉగ్రాయుధుడు

కృతకుడి పుత్రుడు. ఉగ్రాయుధుడు పాంచాలదేశ రాజైన నీపుడనేవాణ్ణి చంపివేశాడు ఉగ్రాయుధుని కొడుకు క్షేమ్యుడు. ఇతని పుత్రుడు సువీరుడు. ఇతని కొడుకు నృపంజయుడు. ఇతని కొడుకు బహురథుడు.

ఈ రాజులందరూ పురువంశీయులే. తరువాత ఉగ్రాయుధుడి బుద్ధి పాడయింది. ఇతడు నీపరాజులను చంపి రాజ్యాన్ని విస్తరింపచేశాడు. నా తండ్రి చనిపోయినపుడు మంత్రులచే చుట్టబడి నేను నేలపై పరుండియుండగా ఉగ్రాయుధుడి దూతవచ్చి కురునందన! ఉగ్రాయుధుడు మీకుమార్తె 'గంధకాళి' స్త్రీలలో రత్నం. ఆమెను నాకు ఇచ్చివేయి. నేనామెను భార్యగా చేసుకుంటా, ఇలాచేస్తే మీరాజ్యం ధనంతో వృద్ధిచెందుతుంది. నేను అన్ని శ్రేష్టవస్తువులపైనా అధికారిని. నాపేరు వినగానే శత్రువులు పారిపోతున్నారు. నీవు నీరాజ్యాన్ని, ప్రాణాల్ని, వంశాన్ని క్షేమంగా ఉంచాలనుకుంటే నా ఆజ్ఞను పరిపాలించు. లేకపోతే నీకు శాంతి ఉండదు అని పలికాడు.

తీవ్రమైన దూతల మాటలువిని దుష్టబుద్ధి అయిన అతని అభిప్రాయం గ్రహించి యుద్ధానికి సిద్ధంకండి అని నేను సేనాపతికి ఆజ్ఞయిచ్చాను. అప్పుడు విచిత్రవీర్యుడు చిన్నపిల్లవాడు. ఆలోచనాపరులైన మంత్రులు, ఋత్విక్కులు, స్నేహితులుకూడ యుద్ధానికి వెళ్ళవద్దనది నన్ను ఆపుచేశారు. మంత్రులు ఇది యుద్ధానికి సమయంకాదని, సామదానభేదోపాయములతో ప్రయత్నించి వాటివల్ల ప్రయోజనం లేకపోతే అప్పుడు యుద్ధంలో ఉగ్రాయుధుణ్ణి చంపుదువుగాక అని సలహా యిచ్చారు. ధర్మరాజా! సమయం వచ్చినప్పుడు పెద్దవాళ్ళ మాట మన్నించాలి. అప్పుడు రాజా యుద్ధం విరమించాను. తరువాత మంత్రులు సామదానాది ఉపాయాలతో ప్రయత్నించారు. అతడు ఏమాత్రం అనుకూలుడు కాలేదు. ఉగ్రాయుధుడు భీష్ముడికి దూతలతో కబురంపి యుద్ధానికి తన సైన్యాన్నికూడ పంపాడు. కాని సైన్యం అతని పరస్త్రీవ్యామోహపాపం కారణంగా తిరిగి వెళ్ళిపోయింది. పాపాలవల్ల అతనిని మరణించినట్లు తలచాను.

తరువాత బ్రాహ్మణుల ఆశీర్వాదంపొంది యుద్ధానికి వెళ్ళి నాబలంచేత, అస్త్రబలంచేత అతనిని సంహరించాను. ఈవిధంగా ఉగ్రాయుధుడిచేత నీపరాజు, నాచేత ఉగ్రాయుధుడు మరణించిన తరువాత నా ఆజ్ఞప్రకారం ద్రుపదుడి తండ్రి 'పృషత్తు' కాంపిల్యనగరంనుండి వచ్చి అహిచ్ఛత్రనగరంపై అధికారం చేపట్టాడు. తరువాత ద్రుపదుడు ఆరాజ్యానికి ప్రభువయ్యాడు. ద్రుపదరాజు ద్రోణుని తన

రాజ్యంనుంచి వెడలగొట్టినప్పుడు అర్జునుడు ద్రుపదుని జయించి అహిచ్ఛత్ర, కాంపిల్యనగరాల్ని గురువైన ద్రోణుడికి ఇచ్చాడు. ద్రోణుడా రాజ్యాలను తీసికొని మళ్ళీ ద్రుపదుడికే ఇచ్చేశాడు. ధర్మరాజా! ద్రుపద, బ్రహ్మదత్త, నీప, ఉగ్రాయుధుల వంశవృత్తాంతాన్ని నీకు వినిపించాను అన్నాడు భీష్మపితామహుడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
బ్రహ్మదత్త వంశ వర్ణనము ఇరవయ్యవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఒకటవ అధ్యాయము

## పక్షిణి కథ

అప్పుడు ధర్మరాజు ఇలా అడిగాడు. పూజింపదగిన పక్షిణి చాలాకాలం బ్రహ్మదత్తుని రాజభవనంలో ఉన్నప్పుడు అతని పెద్దకొడుకు కళ్ళుపెరికి ఎందుకు గ్రుడ్డివాణ్ణి చేసింది? ఇలా రాజుకి అపకారం ఎందుకు చేసింది? ఆపక్షిణి ఎవరు? ఆమెకు బ్రహ్మదత్తునితో స్నేహం ఎలా ఏర్పడింది? ఈవిషయంలో నాకు సందేహం ఉంది. కనుక విస్తరంగా ఈ వృత్తాంతం చెప్పండి.

భీష్ముడిలా చెప్పాడు.

ఒక పక్షిణి(ఆడపక్షి) బ్రహ్మదత్తుడికి స్నేహితురాలు. ఆపక్షికి రెక్కలు, వీపు, పొట్ట నల్లనివి. తలమాత్రం ఎర్రనిది. ప్రతిరోజూ ప్రొద్దున అది రాజభవనంనుండి వెళ్ళిపోతుంది. సముద్రపు ఒడ్డున, నీటిమడుగులందు, సరస్సులందూ, నదులు, పర్వతాలు, పొదరిండ్లు, వనములు, సువాసనలుగల వాయువులు ఉన్నచోట తిరిగి సాయంకాలానికి కాంపిల్యనగరానికి తిరిగివచ్చి రాత్రి అంతా బ్రహ్మదత్తుని యింటిలో నివసిస్తుంది. తాను చూచిన ఆశ్చర్యకర సంఘటనలను మహారాజుకు వినిపిస్తుంది.//

ఒకనాడు బ్రహ్మదత్తుడికి కుమారుడు కలిగాడు. అతడిపేరు సర్వసేనుడు. ఇంతకు పూర్వమే పక్షిణి తనగూటిలో ఒకగ్రుడ్డు పెట్టింది. ఆగూటిలో పూర్వం ఒకగ్రుడ్డు చితికిపోయింది. అందుచేత పుట్టిన పక్షిపిల్ల చేతులు, కాళ్ళు కలది, ఎర్రని ముఖం కలిగి కన్నులు లేనిదైంది. తరువాత స్వల్పకాలంలో కళ్ళు వచ్చాయి. కొంచం రెక్కలు కూడా వచ్చాయి. ఆ పక్షి రాజపుత్రుని తన బిడ్డనూ సమాన ప్రేమతో చూస్తూండేది. ప్రతిరోజూ తన ముక్కుతో రెండు అమృతఫలాలు తెచ్చేది.

తన పిల్లకొకటి, రెండవది రాజుశిశువుకు పెట్టేది. పిల్లలిద్దరూ ఆపండ్లు తిని సంతోషంగా ఉండేవాళ్ళు.

పగటి పూట ఆపక్షి బయటకు వెళ్ళినపుడు దాది రాజపుత్రుని పిచ్చుకపిల్లతో ఆడించేది. ఒకనాడు రాజపుత్రుడు పక్షిపిల్ల కంఠం పట్టుకొని పిడికిలితో చంపేశాడు. రాజు చనిపోయిన పక్షిపిల్లనూ, శిశువును చంపిన కొడుకునూ చూచి దుఃఖించాడు. కన్నీరు కారుస్తూ దాదిని నిందించాడు. ఆపిచ్చుకపిల్లను గూర్చి విచారిస్తూ రాజు దుఃఖపడ్డాడు. ఆరోజున కూడా పక్షి రెండు పండ్లను బ్రహ్మదత్తుని యింటికి తెచ్చింది. మరణించిన తనశిశువుని చూచి మూర్ఛపోయింది. తెలివి వచ్చిన తరువాత దీనురాలై దుఃఖించింది. ఆపక్షి వస్తూనే జాలి కలిగేట్టు ఏడవటం మొదలుపెట్టింది. పూజనీయ(పక్షి) ఇలా అంది.

కుమారా! నేను నిన్ను పిలుస్తూ నీవద్దకు వచ్చాను. నీవు ఆకలితో చిన్ననోరు, ఎర్రని దవడలు చూపిస్తూ స్పష్టంగాని మాటలతో నాదగ్గరకు రావేం? నేను ప్రతి దినమూ రాగానే నిన్ను నారెక్కలతో పట్టుకొని గొప్ప సంతోషంతో కొంచెం మాట్లాడే దాన్ని. నీవూ కొంచెం ఏదో మాట్లాడేదానివి. ఈవేళ ఆ సుందరమైన మాటలను ఎందుకు వినలేకపోతున్నాను? నీవు రెక్కలు కొట్టుకుంటూ నాదగ్గరికి వచ్చి మంచి నీళ్ళు అడుగుతావు అనుకొన్నాను. కాని నీ అకాలమరణంచేత నాకోరిక పూర్తిగా నశించిపోయింది చాలాసేపు దుఃఖించి రాజుతో ఇలా అంది.

ఓ నీచక్షత్రియుడా! నువ్వు రాజువు. సనాతనధర్మం తెలిసినవాడవు. దాది సహాయంతో నాపుత్రుని గూటినుండి బయటకులాగి నీపిల్లవానిచేత ఎందుకు చంపించావు? అంగిరసుని ఈమాట నీవు వినలేదా? "చిరకాలంనుంచి తన యింట్లో ఉన్నవాళ్ళను రక్షించాలి. ఇలా రక్షించనివాడు తప్పక కుంభీపాక నరకంలో పడతాడు. అతడిచ్చే ఆహారాన్ని దేవతలు, పితరులు ముట్టుకోరు" అని. ధర్మరాజా! ఆ పక్షి ఇలా పలికి వివేకం కోల్పోయి రాజపుత్రుని రెండు కళ్ళూ పెరికింది. ఆకాశానికి ఎగిరిపోయింది. కుమారుని పరిస్థితి చూచి రాజు అన్నాడు.

కళ్యాణి! నువ్వు బాగా చేశావు. ఇప్పుడు నీవు దుఃఖం విడిచి తిరిగివచ్చెయ్యి. నువ్వు నేను వెనుకటి స్నేహభావం కొనసాగిద్దాం. నువ్వు తిరిగివచ్చి యిక్కడవే ఉండు. నాపుత్రుని కళ్ళు పెరికినందుకు నీపై నాకు కొంచెంకూడ ద్వేషభావం

లేదు. స్నేహితురాలా! నీవు చేసిన పని సరైనది. ఓ రాజేంద్రా! నేను పుత్రమరణంచేత దుఃఖపడుతున్నట్లే నీవుకూడ గ్రుడ్డివాడైన కుమారునివల్ల దుఃఖపడతావు కదా! నీకుమారుణ్ణి గ్రుడ్డివాణ్ణిచేసి మీయింట్లో నివసించ దలచుటలేదు. శుక్రాచార్యులు చెప్పిన మాటలు చెపుతాను విను.

చెడుమిత్రుని, నీచుడైన రాజునీ, చెడుభార్య మొదలగువాళ్ళను దూరంగా విడిచిపెట్టాలి. వర్ణసంకర పురుషుని నమ్మరాదు. నమ్మినవాడు త్వరగా నష్టపోతాడు. ఇలా శుక్రాచార్యుల నీతివచనాలు చాలచెప్పి నీపుత్రుని గ్రుడ్డివానిని చేసి నిన్ను నమ్మజాలను అని పలికి ఆ పక్షి ఆకాశానికి ఎగిరిపోయింది. ధర్మరాజా! ఈవిధంగా నేను నీకు బ్రహ్మదత్తు, పూజనీయ(పక్షిణి) వృత్తాంతం వినిపించాను. శ్రాద్ధం విషయంలో నీ ప్రశ్నకు సమాధానంగా ఒకకథ చెపుతా. మార్కండేయుడు అడిగితే సనత్కుమారుడిలా ఈవిషయాన్ని చెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పక్షిణికథ అను ఇరవైఒకటవ అధ్యాయము

☆☆☆

# ఇరవై రెండవ అధ్యాయము

## శ్రాద్ధ మహిమ

మార్కండేయుడిలా అన్నాడు.

ఓ భీష్మపితామహా! శ్రాద్ధంవల్ల కీర్తి వస్తుంది. శ్రాద్ధంవల్లనే యోగము, మోక్షమూ ప్రాప్తిస్తున్నాయి. ఇందుచేత శ్రాద్ధానికి గొప్పఫలితముందని చెపుతున్నాను. బ్రహ్మ దత్తుడు ఏడు జన్మలలో శ్రాద్ధంవల్ల పొందిన గొప్పఫలితం, పూర్వం బ్రాహ్మణులు ఆవును చంపటం మొదలైన పాపాలుచేసి శ్రాద్ధంవల్ల పొందిన ఫలాన్నీ తెలియజేసే కథను నీకు వినిపిస్తున్నాను.

ఆకథ విన్నందువల్ల ధర్మబుద్ధి వృద్ధిచెందుతుంది. సనత్కుమారుడు పూర్వం అధర్మం చేసేవాళ్ళను, ధర్మంచేసే ఏడుగురు బ్రాహ్మణులను గూర్చి చర్చ చేసే సందున వాళ్ళను చూడటానికి నేను స్వయంగా కురుక్షేత్రానికి వెళ్ళాను. అప్పుడు నాదివ్యదృష్టితో వాగ్దోషము, కోపము, హింస, దుర్మార్గము కలవాళ్ళను, కవి, చాస్పృమ, పితృవర్తి అనే పేర్లు కలవాళ్ళను ఏడుగురు బ్రామ్మణులను చూచాను.

విశ్వామిత్రుని పుత్రులు గార్గ్యుని శిష్యులు అయిన వాళ్ళు తండ్రి చనిపోయిన పిమ్మట బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించి గర్గమహర్షి ఆశ్రమంలో ఉంటున్నారు.

ఒకనాడు గురువు ఆజ్ఞచేత ఆవును మేపుటకు అడివికి తీసుకు వెళ్ళారు. మార్గంలో వాళ్ళకు ఆకలివేసి ఆ ఆవును చంపాలనుకున్నారు. వాళ్ళలో కవి, చాప్రమ అనే సోదరులు అలా చంపవద్దని కోరారు. కాని ఇతర సోదరులను ఆప లేకపోయారు. వాళ్ళల్లో నిత్యమూ శ్రాద్ధమందు ఆసక్తి కల 'పితృవర్తి' మీరీ ఆవును చంపాలనే గట్టిగా నిశ్చయించుకుంటే పితరులకు శ్రాద్ధం పెడదాం. ఇలా చేస్తే పితరులు సంతోషిస్తారు. ఈ గోవుకు కూడా మంచిమేలు కలుగుతుంది. మనకుం పాపం కలగదు అన్నాడు. చివరకు ఏడుగురూ ఈమాటను అంగీకరించారు. ఆవును నీళ్ళు చల్లి పితృదేవతల కొరకు చంపేశారు. అందరూ కలిసి తినేశారు. తరువాత గురువైన గర్గునిదగ్గరకు వెళ్ళి మహాత్మా! ఆవుని పెద్దపులి తినేసింది. దూడనుమాత్రం తీసుకొచ్చాం అని చెప్పారు.

ముని దూడను తీసుకున్నాడు. ఆయన సరలస్వభావం గలవాడు. ఇలా గురువుకు అన్యాయంగా సేవచేస్తూ ఆయుష్షునిండగా మరణించారు. వాళ్ళు ఏడుగురు సోదరులూ ఒక కిరాతుడికి బిడ్డలై పుట్టారు. ఈజన్మలో వాళ్ళు తమ పనులు చేసుకుంటూ ఆశ, అసత్యమూ విడిచిపెట్టి జీవనానికి సరిపడినంత మాత్రమే ఆహారం తెచ్చుకొనేవాళ్ళు. ఆహారాన్ని సంపాదించుకున్న తరువాత సమయమంతా ధ్యానంతో గడిపేవాళ్ళు. వాళ్ళపేర్లు నిర్వైరుడు, నిర్వృతి, శాన్త నిర్మన్యు, కృతి, వైధన, మాతృవర్తి అనేవి. ఆ ఏడుగురు మిక్కిలి ధర్మాత్ములు. కిరాతులమధ్య నివసిస్తున్నా తల్లిదండ్రుల సేవలో నిమగ్నులయ్యేవాళ్ళు.

ఇలా ఉండగా వాళ్ళ తల్లిదండ్రులు మరణించారు. అప్పుడు వాళ్ళు ధనుర్బాణాలను విడిచిపెట్టారు. వెనుకజన్మలో చేసిన మంచిపనులవల్ల వాళ్ళు కాలంజర పర్వతంమీద మృగాలై పుట్టారు. తరువాత పక్షులై, హంసలై పుట్టారు. తరువాత మనుష్యజన్మ పొందారు. గోమాంసమును పితరులకు పెట్టిన పుణ్యంచేత వాళ్ళకు పూర్వజన్మజ్ఞానం నశించలేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
శ్రాద్ధ మహిమ అను ఇరవైరెండవ అధ్యాయము

☆☆☆

# ఇరవై మూడవ అధ్యాయము

## బ్రహ్మాదత్త కథ

మార్కండేయుడిలా చెప్పాడు.

ఓ భీష్మపితామహా! యోగధర్మమందున్నట్టి మానససరోవరమందు విహరించు ఏడుహంసలు వాయువును, నీటిని మాత్రమే ఆహారంగా తీసుకొని శరీరాన్ని కృశింపచేశాయి. వాటిపేర్లు పద్మగర్భ, అరవిందాక్ష, క్షీరగర్భ, సులోచన, ఉరుబిందు, సుబిందు, హిమగర్భ అని. ఆసమయంలో విభ్రాజుడనే రాజు తన అంతఃపుర స్త్రీలతో వనంలో విహరిస్తున్నాడు. అలా తిరుగుతూ యోగాభ్యాసం చేస్తున్న హంసలగుంపును చూచాడు. వాటిని చూచాక తన మనస్సులో వైరాగ్యం కలిగి మాటిమాటికీ వాటిమాటలనే విచారిస్తూ తన రాజధానికి తిరిగివచ్చాడు.

విభ్రాజుడికి అణుహుడను ధర్మాత్ముడైన పుత్రుడున్నాడు. శుకమహర్షి అన్ని శుభలక్షణాలుగల తన కుమార్తె 'కృత్వి'కి అణుహునితో వివాహం చేశాడు. కృత్వి యోగాచార్యుడికి తల్లి. స్వయంగా యోగినికూడ. కొంతకాలం తరువాత విభ్రాజ మహారాజు అణుహునికి రాజ్యం వప్పచెప్పి పౌరుల అనుమతితో బ్రాహ్మణుల ఆశీర్వాదంతో తపస్సు చేయటానికి ఏడుహంసలను వెనుకచూచినట్టి సరోవరానికి వెళ్ళాడు. ఆ సరస్సు ఒడ్డున ఆహారం మాని వాయువును మాత్రమే ఆహారంగా తీసుకొని వైరాగ్యంతో తపస్సుచేయ మొదలుపెట్టాడు. ఈ హంసలలో ఏహంస కడుపున ఐనా పుట్టి నేను గొప్ప యోగినవుతానని ఈతనికి కోరిక కలిగింది. ఇటువంటి కోరికతో విభ్రాజమహారాజు కఠోరమైన తపస్సు చేయటంలో మునిగిపోయాడు.

అందువల్ల అతని శరీరం మిక్కిలి ప్రకాశించింది. ఈ కారణంచేత ఆ సరస్సుకు వనానికి వైభ్రాజమనే పేరు వచ్చింది. ఆ సరోవరంలో నివసించే మూడు హంసలు యోగభ్రష్టులైనాయి. మిగిలిన నాలుగూ యోగాన్ని కొనసాగిస్తున్నాయి. అవి అన్నీ కాంపిల్యమనే నగరంలో రాజైన బ్రహ్మదత్తుడు మొదలైన పేర్లతో పుట్టాయి. వాటి పాపమంతా నశించిపోయింది. తక్కిన మూడు హంసలకీ వెనుకటి జన్మలోని మాటలు గుర్తులేవు. ఆ నాలుగు హంసలూ యోగ, జ్ఞాన, తపస్సులందు,

వేద వేదాంగములందూ అంతుచూచాయి. వాటికి పూర్వజన్మ స్మృతి ఉన్నది. బ్రహ్మ దత్తుడు కొద్దిసమయంలోనే జ్ఞానధ్యాన తపస్సులందు వేదవేదాంగముల లోనూ అంతుచూచిన వాడయ్యాడు.

పూర్వము బాభ్రవ్యుడు, వత్సుడు వీళ్ళిద్దరూ వేదవేదాంగాలూ తెలిసిన శ్రోత్రియుని పుత్రులు మరియు రాజుకు మంత్రులుకూడాను. ఛిద్రదర్శి, సునేత్రుడు మంత్రిపుత్రులు. వాళ్ళు వేదవేదాంగజ్ఞానాన్ని సంపాదించారు. వాళ్ళు బ్రహ్మదత్తుడికి గట్టిమిత్రులైయారు. భరద్వాజుడి ఏడుగురు పుత్రులలో ఐదవవాడు 'కవి' పాంచాలు డని పిలవబడేవాడు. ఖసుభర, కండరీక అని యితరులు పిలవ బడ్డారు. వాళ్ళిద్దరిలో పాంచాలుడు ఋగ్వేది. కండరీకుడు యజుర్వేది. పాంచాలుడు ఆచార్యుడయ్యాడు. కండరీకుడు అధ్వర్యుడయ్యాడు. అన్నిప్రాణుల భాషలనూ తెలిసిన అణుహు పుత్రుడు బ్రహ్మదత్తుడు రాజయ్యాడు. పాంచాలుడు, కండరీకుడు అతనికి మిత్రులయ్యారు ఈముగ్గురూ సంసారమందాసక్తి కలవారై మన్మధునికి బంటులయ్యారు. కాని పూర్వజన్మలో చేసిన శ్రాద్ధఫలంవల్ల ధర్మార్థ కామముల ఫలం పొందటానికి సమర్థులయ్యారు. ఈసమయంలో అణుహుడు సత్పుత్రుడైన బ్రహ్మదత్తుడికి రాజ్యం వప్పచెప్పి ఉత్తమగతిని పొందాడు.

ఆసితదేవలకుల పుత్రికలు దుర్ధర్ష, సన్నతి అనువారు బ్రహ్మదత్తుడికి భార్య లయ్యారు. సన్నతి ఆకారము మిక్కిలి చెడ్డది. ఈవిధంగా ఏడవజన్మవరకూ ఐదవ కుమారుడు పాంచికుడు, ఆరుజన్మల వరకూ పుండరీకుడు, బ్రహ్మదత్తుడు అవుతాడు. మిగిలిన నాలుగుహంసలు ఆ కాంపిల్యనగరంలోనే ఒక మిక్కిలి దరిద్ర బ్రాహ్మణుని యింటిలో శ్రోత్రియులుగా పుట్టారు. ఆ నలుగురి సోదరులపేర్లు ధృతిమంతుడు, సుమనసుడు, విద్వాంసుడు, తత్వదర్శి. వీళ్ళందరూ వేదం చదివిన వాళ్ళు, మోక్షమును కోరువారును. కొన్నిరోజుల తరువాత వాళ్ళకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. వాళ్ళందరూ తండ్రి అనుమతి తీసుకొని యోగమందా సక్తితో బయల్దేరారు.

అప్పుడు తండ్రి, నన్ను విడిచివెళ్ళటం మీకు ధర్మంకాదు. బీదరికాన్ని పోగొట్ట కుండా, శుశ్రూష చేయకుండా ఎలా వెళ్తారు? అని అడిగాడు. అప్పుడు కుమారులు తండ్రీ! నీజీవితం చక్కగా గడిచేట్లు ఏర్పాటు చేస్తున్నాము. గొప్ప అర్థంగల ఈ

శ్లోకాన్ని మంత్రులతో కూడియున్న రాజైన బ్రహ్మదత్తుడికి వినిపించు. అతడు సంతోషించి నీకు గ్రామాలను పుష్కలంగా భోగాలను ఇస్తాడు. నీవు కోరిన వాటి నన్నిటినీ ఇస్తాడు. నీవు స్వేచ్ఛగా వెళ్ళు అని పలికి వాళ్ళందరూ తండ్రిని పూజించి యోగధర్మాన్ని అవలంబించి గొప్పసుఖాన్ని పొందారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి హరివంశపర్వంలో
బ్రహ్మదత్త కథ అను ఇరవైమూడవ అధ్యాయము

☆☆☆

## ఇరవైనాల్గవ అధ్యాయము

### విభ్రాజుడు బ్రహ్మదత్తుని పుత్రుడగుట

మార్కండేయుడిలా చెప్పాడు.

బ్రహ్మదత్తుడికి వైభ్రాజుడనే రాజు పుట్టాడు. వైభ్రాజుడికి ప్రపంచంలో విష్వక్సేనుడని ప్రసిద్ధి యేర్పడుతుంది. అతడు గొప్పయోగి, తపశ్శాలికూడ. ఒకనాడు బ్రహ్మదత్తుడు తనభార్యతో శచీదేవితో ఇంద్రుడిలాగా వనంలో విహరించాడు. అపుడు ఆ రాజు చీమ మాటను విన్నాడు. కాముకుడు కామినియైన స్త్రీని ప్రార్థించే మాటఅది. ఆ మాటకు ఆడచీమ కోపగించింది. బ్రహ్మదత్తుడు పెద్దగా నవ్వాడు. అప్పుడు అతని భార్య 'సన్నతి' సిగ్గుపడింది. చాలారోజులు అన్నం తినలేదు. భర్త బ్రతిమాలగా ఆమె నీవు నవ్వావు గనుక నేను బ్రతకదలుచుకోలేదు. రాజు తన నవ్వుకు కారణం చెప్పినా ఆమె నమ్మలేదు. ఇంకా కోపగించి, మనుష్యులలో ఎవడికీ చీమల మాటలు తెలియవు. దేవతానుగ్రహంవల్ల పూర్వజన్మలో చేసిన తపోబలంచేత తప్ప చీమల మాటలెలా తెలుస్తాయి? నీకిట్టి ప్రభావము ఉంటే నేను నమ్మేటట్లు చేయి.

ఇలా కాకపోతే నేను ప్రాణాలు విడుస్తాను. రాణియొక్క కఠినమైన యీ మాటలు విని ఆపదలో పడినవాడై నారాయణుని శరణువేడాడు. ఆరురాత్రులు ఉపవాసం చేశాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు కనిపించాడు. తెల్లవారుజామున నీవు శుభాన్ని పొందుతావు అనిచెప్పి భగవంతుడు అంతర్ధానం చెందాడు. నలుగురు బ్రాహ్మణులకు తండ్రి పుత్రులకు చెప్పిన శ్లోకాలను చదువుకొని చింతలేనివా డయ్యాడు. వాళ్ళు మంత్రులతో కలిసి కూర్చొని రాజైన బ్రహ్మదత్తుని కలిసి విని పించటానికి చాలాసేపు సమయంకోసం ఎదురుచూశారు. కాని వాళ్ళకు

సమయమే దొరకలేదు. పిమ్మట రాజు సరస్సులో స్నానంచేసి నారాయణుని వలన వరంపొంది బంగారు రథం మీద తన పట్టణంలో ప్రవేశించాడు.

కండరీకుడు గుర్రపుపగ్గాలు పట్టుకున్నాడు బాభ్రవ్యుడు చామరం విసిరాడు. ఇది సమయమని ఆ బ్రాహ్మణుడు రాజుకి మంత్రులకీ ఆశ్లోకం వినిపించాడు. ఓ మహారాజా! దశార్ణదేశంలో ఏడుగురు కిరాతులు, కాలంజన పర్వతంమీద ఏడు మృగాలు, శరద్వీపంలో ఏడు చక్రవాకపక్షులు, వాటి ఏడిటినుండి మానస సరోవరంలో ఏడుహంసలై పుట్టాయి. వాటినుండి మేము నలుగురము కురు క్షేత్రంలో వేదవేదాంగ పండితుడైన ఒక సత్కులబ్రాహ్మణుని ఇంటిలో పుట్టి చాలాదూరం వెళ్ళి మిమ్మల్ని ముగ్గుర్నీ వెతికాను. చాలా కష్టపడి చూచాను. ఈ రెండు శ్లోకాలు విని రాజైన బ్రహ్మదత్తుడు ఆయన మంత్రులు పాంచాలుడు, పుండరీకుడు మూర్ఛపోయారు.

వారిచేతులనుండి పగ్గాలు, చామరాలు విడిపోయి క్రిందపడ్డాయి. వాళ్ళ ఈస్థితిని చూచి నగరజనులు మిత్రులు చాల దుఃఖపడ్డారు. ఈవిధంగా రాజు ఆయన మంత్రులు మూర్ఛపోయి రథంమీదనే పడిపోయారు. క్షణం తరువాత తెలివి వచ్చింది. అప్పుడు వాళ్ళు పట్టణంలోకి వచ్చారు. ఆ శ్లోకాలు విని వాళ్ళు మానస సరోవరాన్ని పూర్వజన్మలోని యోగి కథలను గుర్తు తెచ్చుకున్నారు. దానితో వాళ్ళు సంతోషించి ఆ బ్రాహ్మణుడికి మంచిభోజనం పెట్టి కావలసినంత ధనం ఇచ్చారు. తరువాత రాజు బ్రహ్మదత్తుడు తన పుత్రుడైన విష్వక్సేనుని రాజ్యమందు పట్టాభిషిక్తుని చేసి భార్యతో వనానికి వెళ్ళాడు.

అడవిలో దేవలుని కూతురు 'సన్నతి' సంతోషంతో బ్రహ్మదత్తునితో మహారాజ! మీరు భోగాలలో మునిగిపోయారు. మీరు చీమభాషను తెలిసినవారని ఎరుగుదును. మీశక్తిని తెలిసికొనటానికే కోపం ప్రకటించి మంచిపనే చేశాను. మీరు యోగజ్ఞానాన్ని మరిచిపోయారు. దాన్ని మీకు గుర్తుకుతెచ్చాను. ఇప్పుడు మనకు మంచిస్థానం ప్రాప్తిస్తుంది అని పలికింది. బ్రహ్మదత్తుడు తనభార్య మాటలు విని సంతోషించాడు. యోగబలంతో గొప్పస్థానాన్ని పొందాడు. యోగ సిద్ధుడు ధర్మాత్ముడైన కండరీకుడుకూడా సాంఖ్యయోగంద్వారా యోగుల స్థానాన్ని పొందాడు. మహాతపశ్శాలి పాంచాలపుత్రుడు వేదప్రసిద్ధమైన క్రమాన్ని ప్రవర్తింపజేసి ఉచ్చరించే పద్ధతిని తెలిపి యోగాచార్యస్థానాన్ని కీర్తిని పొందాడు.

ఈ పురాతనకథను నేను ప్రత్యక్షంగా చూచాను. కనుకనే భీష్మపితామహా! నీవుకూడా ఈ శ్రాద్ధఫలితాన్ని మనస్సుకు పట్టించుకో. దీనివల్ల నీకు శుభం కలుగుతుంది. వాగ్దుష్టాది ఈ ఏడుగురి సోదరుల ఉత్తమచరిత్రను మనస్సుకు పట్టించుకున్నవాళ్ళు ఎప్పుడూ పశుపక్ష్యాది జన్మను పొందరు. ఈ ఉపాఖ్యానాన్ని వినడంచేత హృదయంలో యోగధర్మం స్ఫురిస్తుంది. దానివల్ల యోగగతిని పొందుతారు. మార్కండేయుడు శ్రాద్ధఫలాన్ని చెప్పటానికి సోమదేవుని ప్రసన్నుని చేసుకోటానికి ఈ కథ చెప్పాడు. సోమదేవుడు ప్రసన్నుడై సంతోషం కలుగజేస్తాడు. ఇప్పుడు వృష్ణివంశ ప్రసంగంలో చంద్రవంశాన్ని వర్ణిస్తున్నాను విను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
విభ్రాజుడు బ్రహ్మదత్తుని పుత్రుడగుట అను ఇరవైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ఇరవైఐదవ అధ్యాయము

## చంద్రుని పుట్టుక, దేవాసుర యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! పూర్వం బ్రహ్మ ప్రపంచసృష్టి మొదలెట్టినప్పుడు సోముని(చంద్రుని) తండ్రి అత్రిమహర్షి బ్రహ్మ మనస్సునుండి పుట్టాడు. తరువాత అత్రి తన పుత్రులను వెంటబెట్టుకొని సమస్తప్రాణులకూ శుభం కోరుతూ ఉండేవాడు. గొప్ప తేజశ్శాలి. అత్రికఱ్ఱవలె నిలిచి, చేతులు పైకెత్తి మౌనంతో వెయ్యి దివ్య సంవత్సరాలు కఠోర తపస్సు చేశాడు. రెప్పపాటు లేకుండా ఇంతకాలం నిలబడి ఉండటం చేత అతని శరీరంనుండి తేజస్సు అతని శరీరాన్నంతా తేజోమయంగా చేస్తూ పైకిలేవ మొదలెట్టింది. తపస్సు చేసే సమయంలో అతని కళ్ళనుండి వెడలిన నీరుచేత పది దిక్కులు మిక్కిలి ప్రకాశించాయి. ఆ తేజస్సును దిగ్దేవతలు గర్భంగా ధరించాయి. కాని వాళ్ళు సహించలేకపోయారు. తరువాత తేజోమయములలో కొన్ని సంతోషపెట్టే చంద్రబింబ రూపమైన గర్భం ఆదిగ్దేవతలతోపాటు భూమిమీద పడింది.

ఇలా భూమిపై పడిన చంద్రుని బ్రహ్మదేవుడు లోకకళ్యాణం కొరకు లేవనెత్తి తన రథంమీద కూర్చోపెట్టాడు. బ్రహ్మయొక్క ఆ రథం వేదంచేత నిర్మింపబడిం

దని నేను విన్నాను. ఆ రథానికి వెయ్యి తెల్లని గుర్రాలు కట్టబడ్డాయి. నారాయణ స్వరూపుడైన అత్రిపుత్రుడు చంద్రుడు క్రిందపడగానే బ్రహ్మదేవుని ఏడుగురు పుత్రులూ కలిసి అన్నివేదాల మంత్రాలనే ఉచ్చరిస్తూ స్తోత్రం చేయమొదలెట్టారు. ప్రకాశవంతమైన చంద్రుని వృద్ధిచెందే కాంతిచేత మూడులోకాలు ప్రకాశింపచేయ బడ్డాయి.

లోకపితామహుడు బ్రహ్మ చంద్రుని రథంమీద కూర్చొనబెట్టుకొని ఇరవై ఏడుమార్లు భూమికి ప్రదక్షిణం చేశాడు. ప్రదక్షిణం చేసేటప్పుడు రథవేగంవల్ల జారిపడిన చంద్రుని తేజస్సువలన భూమిమీద అనేక ఓషధులు పుట్టాయి. ఆ ఓషధుల ప్రభావంవల్ల మూడులోకాలు జరాయుజాండజాది నాల్గువిధాలైన ప్రాణుల పోషణా జరుగుతున్నది. చంద్రుడు ప్రపంచానికి పుష్టినిచ్చేవాడు. ఈవిధంగా తేజస్సును పొంది అనేకవిధాల స్తోత్రం చేయబడుతూ చంద్రుడు వెయ్యి పద్మ సంవత్సరాలు తపస్సు చేశాడు. బంగారురంగు గలిగి ప్రపంచాన్ని పరిపాలిస్తున్న దేవతలకు తనపనులచే ప్రసిద్ధిచెందిన చంద్రుడు నిధి(గని) అయినాడు.

తరువాత బ్రహ్మవేత్తలలో గొప్పవాడైన బ్రహ్మదేవుడు చంద్రుణ్ణి ఓషధులకు, బ్రాహ్మణులకు, నీటికి రాజుగాచేసి పట్టాభిషేకం చేశాడు. ఇలా పట్టాభిషిక్తుడై చంద్రుడు తనకాంతిచే మూడులోకాలను కాంతితో కూడినవాటినిగా చేశాడు. ప్రచేతుని కుమారుడైన దక్షప్రజాపతి ఆ చంద్రునికి ఇరవైఏడుగురు కన్యలను ఇచ్చాడు. ఆ ఇరవైఏడుగురూ నక్షత్రాలపేర్లతో ప్రసిద్ధిపొందారు. చంద్రుడు ఇంత గొప్పరాజ్యాన్ని పొందిన తరువాత ఒక లక్షగోవులను దానంచేసి రాజసూయయాగం ప్రారంభించాడు. ఆ యజ్ఞంలో పూజ్యుడైన అత్రిమహర్షి హోత (హోమం చేసేవాడు), భృగుమహర్షి అధ్వర్యుడు (యాగం నడిపించేవాడు), వసిష్ఠుడు సామవేదం గానంచేసేవాడు, బ్రహ్మ బ్రహ్మస్థానంలో ఉండగా విష్ణుమూర్తి, సనత్కుమారుడు మొదలైన బ్రహ్మర్షులు ఆ యజ్ఞంలో సభ్యులయ్యారు. చంద్రుడు ఆయజ్ఞంలో సభ్యులకు ఇతరమహర్షులకు మూడులోకాలనూ దానమిచ్చాడని నేను విన్నాను.

సినీ, కుహు, ద్యుతి, తుష్టి, ప్రభ, వసు, కీర్తి, ధృతి, లక్ష్మి ఈ తొమ్మిది దేవతలూ అతనికి సేవచేస్తారు. చంద్రుడు యజ్ఞంచివర అవభృథస్నానం చేసిన తర్వాత అతని తేజస్సుతో పదిదిక్కులూ మిక్కిలి ప్రకాశించాయి. జనమేజయ

మహారాజా! చంద్రుడు మునులద్వారా అతకుమించిన గౌరవాన్నిపొంది ఐశ్వర్య మదంచే మదించాడు. అతని బుద్ధి నీతిమార్గంనుండి తప్పిపోయింది. అతడు అంగిరసుని మాటలువిని దేవగురువైన బృహస్పతి భార్య 'తార'ను అపహరించాడు. అప్పుడు దేవతలు బ్రహ్మర్షులు ప్రార్థించారు. కాని చంద్రుడు తారను పంపలేదు. ఇందుచేత బృహస్పతి చంద్రునిపై కోపించాడు.

శుక్రాచార్యుడు చంద్రుడికి మద్దతునిచ్చాడు. బృహస్పతి తండ్రియైన అంగిరసుని శిష్యుడు శుక్రాచార్యులు. అందుచే వాళ్ళు గురుపుత్రుడైన బృహస్పతిపై పక్షపాతం కలిగి ఉన్నారు. రుద్రుడు కూడ అంగిరసుని శిష్యుడే. ఈకారణంచేత తన ఆజగవ ధనుస్సును ఎక్కుపెట్టి బృహస్పతిపక్షంలో నిలిచాడు. ఆయుద్ధంలో చాలామంది దేవతలు, రాక్షసులు మరణించారు. ఆ యుద్ధంలో బ్రతికి ఉన్న చంద్రుని పక్షం దేవతలు బ్రహ్మను శరణువేడారు. అప్పుడు బ్రహ్మదేవుడు శుక్రా చార్యుని శంకరుని యుద్ధం మాన్పించి, తారను బృహస్పతికి ఇప్పించాడు. తారను గర్భవతిగా చూచి బృహస్పతి నీవు నా భార్యవై ఇతరుని వల్ల గర్భం ధరించరాదు అని పలుకగా తేజశ్శాలియైన పుత్రుని రెల్లువనంలో పారేసింది తార. ఆ శిశువు తేజస్సును చూచి దేవతలు సంశయించినవారై తారను అడిగారు.

దేవి! నిజం చెప్పు. ఈ శిశువు ఎవని పుత్రుడు? చంద్రుని కొడుకా బృహస్పతి కొడుకా? ఈ విధంగా దేవతలు అడుగగా తార భయపడి ఏమీ చెప్పలేదు. ఆ శిశువే అప్పుడు తారకు శాపమివ్వటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు బ్రహ్మ ఆమెను ఎవని పుత్రుడో నిజం చెప్పమని అడిగాడు. తార చేతులు జోడించి ఇతడు చంద్రుని కుమారుడని మెల్లగా చెప్పింది. అప్పుడు చంద్రుడు పిల్లవాని శిరస్సును మూర్కొని, అతనికి బుధుడని పేరు పెట్టాడు. ఈ బుధుడు ఎల్లప్పుడూ సూర్యునికి విరుద్ధమైన దిక్కున ఉదయిస్తాడు. బుధుడు వైరాజమనవు కుమార్తె ఇల యందు ఒక కుమారుణ్ణి కన్నాడు. అతని పేరు పురూరవుడు. పురూరవునడు ఊర్వశి అనే అప్సరస యందు ఏడుగురు పుత్రులను కన్నాడు. ఈ సమయంలో చంద్రుని క్షయరోగం కలిగింది. ఇందుచే చంద్రమండలం క్షీణించటం మొదలు పెట్టింది.

అప్పుడు తన తండ్రియైన అత్రి మహర్షిని శరణువేడాడు. అత్రిమహర్షి అతని దుఃఖాన్నిపోగొట్టాడు. ఈ విధంగా క్షయరోగం పోయిన తరువాత చంద్రుని కాంతి

మళ్ళీ అన్నివైపులా ప్రకాశించింది. జనమేజయా! ఈ విధంగా నేను చంద్రుని కీర్తిని వృద్ధి చేసే వృత్తాంతాన్ని చెప్పాను. ఇప్పుడు ఈ వంశచరిత్ర చెపుతాను. ఈ కథను వినుటచే ధనము, ఆరోగ్యము, పుణ్యము, ఆయుస్సు, వృద్ధి పొందుట సంభవించును. తలచిన కోరిక పూర్తి అవుతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
చంద్రుని పుట్టుక, దేవాసుర యుద్ధము అను ఇరవై ఐదవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఆరవ అధ్యాయము

## పురూరవ చరిత్ర

వైశంపాయనుడు ఇలా చెపుతున్నాడు.

మహారాజ! బుధుని కొడుకు విద్వాంసుడైన పురూరవుడు. అతడు తేజశ్శాలి దానశీలుడు గొప్ప దక్షిణలిచ్చి యాగాలు చేసేవాడు. బ్రహ్మవాది, పరాక్రమ వంతుడు, శత్రువులకు జయింపశక్యము కానివాడు. సత్యము పలుకువాడు పవిత్ర మైన బుద్ధి గలవాడు. అందరిచే ప్రార్థింపబడువాడు. మూడు లోకాలలోనూ గొప్ప కీర్తి గలవాడు. ధర్మం తెలిసినవాడును గొప్ప కీర్తి గల ఊర్వశి అభిమానం విడిచి అతనిని ప్రేమించింది. రాజు ఆమెతో పదిహేను సంవత్సరాలు కలిసిఉన్నాడు. అందమైన చైత్రరథమనే కుబేరుని ఉద్యానవనములోను అలకా పట్టణంలోన ఈ విధంగా అనేక సుందర ప్రదేశాలలో 44 సంవత్సరాలు ఆమెతో విహరించాడు. ప్రయాగలో రాజ్యం చేశాడు. అతనికి దేవతల వంటి ఏడుగురులు పుత్రులు కలిగారు. వాళ్ళు ఆయువు, అమావసు, విశ్వావసు, శృతాయు, దృఢాయువు, శతాయువు, వనవాయువు అనువారు. ఇంతవరకు విని జనమేజయ మహారాజు అడిగాడు.

బ్రాహ్మణోత్తమా! మీరు చాలా విషయాలు తెలిసినవారు. దేవలోకంలో ఉండే ఊర్వశి భూలోకంలో ఉండే మహారాజును ఎందుకు ప్రేమించింది? ఈ సందేహం తీర్చకోరుతున్నాను. అప్పుడు వైశంపాయను డిలా చెప్పాడు. మహారాజా! ఊర్వశి బ్రహ్మ శాపంచేత మనుష్యస్త్రీ అయి పురూరవుని వివాహం చేసుకుంది. వివాహ సమయంలో శాపం నుంచి తప్పుకోవటానికి పురూరవుడికి ఒక షరతు పెట్టింది. దిగంబరుడుగా (ఊర్వశి వద్దకు) తనవద్దకు రాకూడదు. ఆమె కోరినప్పుడే

సంగమం. పక్కదగ్గర రెండు గొర్రెలు కట్టి ఉంటాయినే యీ మాత్రమే ఆహారం ఒక పూటే భోజనం.

ఈ నియమాలు ఎంతకాలం పాటిస్తే అంతకాలమే నీ దగ్గర ఉంటాను. అమె చెప్పి నియమాల్ని రాజు పాటించాడు. యాభై మూడు సంవత్సరాలు ఆసక్తితో ఉన్నది. ఊర్వశి మనుష్యస్త్రీగా ఉండగా గంధర్వులు విచారం కలవాళ్ళయ్యారు. స్వర్గానికి అలంకారమైన ఊర్వశి తిరిగి వచ్చేటట్లు ఆలోచిద్దాం. విశ్వావసువనే గంధర్వుడు ఆమె పెట్టిన షరతులో ఏదైనా జరగకపోతే ఊర్వశి తిరిగి వచ్చేస్తుంది. కాబట్టి నేను కొందరి సహాయంతో వెళ్తాను అని చెప్పి అతడు ప్రయాగకు వెళ్ళాడు. రాత్రి సమయంలో రాజభవనంలో దూరి ఒక గొర్రెను దొంగిలించి తెచ్చాడు. అప్పుడు ఊర్వశి రాజా! నా గొర్రెను ఎడపహరించాడు? అని ప్రశ్నించగా తొందరలో దిగంబరుడుగా రాజు పరుగెత్తాడు.

అప్పుడు దిగంబరుడైన పురూరవుని చూచి కామరూపం గల ఊర్వశి కనబడకుండా పోయింది. గంధర్వుడు విడిచిపెట్టిన గొర్రెను చూచి రాజు ఇంటికి పట్టుకొచ్చాడు. ఇంటిలో ఊర్వశి కనపడక మహారాజు మిక్కిలి దుఃఖించాడు. ఆమెను వెతుకుతూ భూమండలమంతా తిరిగాడు కురుక్షేత్రంలో ఆమెను చూచాడు. అక్కడ సరస్సులో స్నానం చేసి ఐదుగురప్సరలతో ఆమె క్రీడిస్తున్నది. ఆమెను చూచి రాజు మిక్కిలి దుఃఖపడ్డాడు. ఊర్వశి నేను ప్రేమించిన రాజు ఇతడే అని చెలికత్తెలకు చూపింది. చెలికత్తెలు ఊర్వశిని ఇక్కడే ఉండు అన్నారు. అప్పుడు ఊర్వశి రాజుతో నేను గర్భవతినని చెప్పింది.

ఒక సంవత్సరంలో నీకు పుత్రుడు కలుగుతాడు. ఒక్క రాత్రి మాత్రం నాతో పాటు ఉంటావు. అన్నది. రాజు సంతోషంతో తన పట్టణానికి వెళ్ళిపోయాడు. ఒక సంవత్సరం గడిచాక ఊర్వశి మళ్ళీ వచ్చింది. మహారాజు ఒక రాత్రి ఆమెతో గడిపాడు. తరువాత ఊర్వశి మహారాజ! గంధర్వులు నీకు వరమిద్దామనుకొన్నారు. నీవు వాళ్ళతో సమానుడవైనట్లు వరము అడుగుము అని చెప్పింది. రాజలాగే వరమడిగాడు. గంధర్వులు తథాస్తు అన్నారు. గంధర్వులు నిప్పులతో నిండిన పాత్రను రాజుకు ఇచ్చి ఈ అగ్నితో యాగం చేస్తే మాలోకాన్ని పొందుతావన్నారు. అప్పుడు రాజు ఊర్వశి పుట్టిన కుమారుని తీసికొని తన పట్టణానికి వెళ్ళాడు.

అరణ్యంలో అగ్నిని ఉంచి పుత్రునితో ఇంటికి వెళ్ళాడు. కొంచం సమయం తరువాత అగ్ని దగ్గరికి వెళ్తే అక్కడ అగ్నిలేదు. ఒక రావిచెట్టు ఉంది. కొన్ని

క్షణాల తరువాత అగ్నివల్ల రావిచెట్టు పుట్టుట అతనికి ఆశ్చర్యం కలిగించింది. తరువాత గంధర్వులకు అగ్ని కనబడలేదని చెప్పాడు. రావిచెట్టు నుండి అరణి తయారుచేసి శాస్త్ర ప్రకారం మథించి ఆ అగ్నిని మూడుగా చేసి రాజు యజ్ఞం చేశాడు. అనేక విధాలైన యజ్ఞాలు చేసి గంధర్వలోకాన్ని పొందాడు. పూర్వము ఒకటిగా ఉన్న అగ్నిని పురూరవుడు మూడుగా చేశాడు. ఇలాంటి ప్రభావం కలవాడు పురూరవుడు మహర్షులు పొగడినట్టి పవిత్రమైన ప్రయాగక్షేత్రంలో పురూరవ మహారాజు రాజ్యం చేశాడు. ప్రయాగకే మారుపేరు 'ప్రతిష్ఠానం' ఉత్తర భారతంలో గంగతీరాన ప్రతిష్ఠాన నగరం (ప్రయాగ) ఉన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పురూరవ చరిత్ర అను ఇరవై ఆరవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఏడవ అధ్యాయము

## పురూరవని ద్వితీయ పుత్ర వర్ణనము

పురూరవుని పుత్రులందరూ దేవకుమారుల వంటివాళ్ళు. వాళ్ళ పేర్లు - ఆయువు, అమావసు, విశ్వాయువు, శృతాయువు, వనాయువు, శతాయువు, దృఢాయువు. వీళ్ళు స్వర్గలోకంలో పుట్టారు. భీముడు నగ్నజిత్తు అనేవాళ్ళు, అమావసు పుత్రులు, భీముడి పుత్రుడు కాంచనప్రభుడు. ఇతని పుత్రులు మహాబలి సుహోత్రుడు, కేశిని కడుపున పుట్టిన జహ్నువు సుహోత్రుని కొడుకు, ఇతడు సర్వమేధమనే యజ్ఞం చేశాడు. భాగీరథి ఇతని గుణాలను మెచ్చుకొని భర్తగా చేసుకొను ప్రస్తావం చేసింది. జహ్నుమహర్షి అంగీకరింపక పోవుటచే అతని యజ్ఞశాలను ముంచివేసింది. అది చూచి సుహోత్రుని పుత్రుడు జహ్నువు కోపించి ఈ నీటినంతను త్రాగినీ ప్రయత్నాన్ని వ్యర్థం చేస్తాను.

నీ గర్వానికి ప్రతిఫలం అనుభవిస్తావు అని గంగనంతును త్రాగేశాడు. ఈ సంఘటన చూచి మహర్షులు జహ్నుమహర్షిని బ్రతిమాలారు. భగీరథుడు గంగను జహ్నువుకు పుత్రికగా మార్చారు. ఇందుచే గంగకు జాహ్నవి అనే పేరు వచ్చింది. యువనాశ్వుని శాపంచేత గంగ యొక్క సగభాగం నుండి కావేరి పుట్టింది. ఇది యువనాశ్వునికి పుత్రిక. జహ్నుమహర్షి కావేరిని పెళ్ళి చేసుకున్నాడు. కావేరికి

జహ్నువు వలన 'సునహు'డనే కొడుకు జన్మించాడు. ఇతని కొడుకు అజకుడు. ఈతని కొడుకు చిలాకుడనే రాజు. ఇతనికి వేటంటే ఎక్కువ ఇష్టం. ఇతని కొడుకు కుశుడు.

కుశుడికి నలుగురు కుమారులు. వాళ్ళు దేవతలవంటి వాళ్ళు. గొప్ప తేజశ్శాలురు. వాళ్ళ పేర్లు 'కుశికుడు, కుశనాభుడు, కుశాంబుడు, మూర్తిమంతుడు' - వాళ్ళలో కుశికుడు ఇంద్రునితో సమానమైన పుత్రుని కనాలని తపస్సు ప్రారంభించాడు. వెయ్యి సంవత్సరాలు గడిచాక, ఇంద్రుడు ఈతనికి నాతో సమానుడైన పుత్రుడు కలుగుతాడని భయపడి తానే ఆ దంపతులకు పుత్రుడుగా జన్మించాడు. ఆ పుత్రుని పేరు 'గాధి'. పురుకుత్స మహారాజు కూతురు కుశికుడికి భార్య అయినది. ఆమెకు పుత్రుడు గాధి. గాధికి సత్యవతి అనే కన్య ఉన్నది. ఆమెకు భృగుపుత్రుడైన ఋచీకునితో వివాహం జరిగింది.

భృగుపుత్రుడైన ఋచీకుడు తన భార్యతో సంతోషంగా ఉన్నాడు. మరియు గాధికి పుత్రసంతానం కోసం చరువును (నేతిఅన్నం) తయారుచేశాడు. ఋచీకుడు భార్యను పిలిచి ఈ చెరువును నీవు, నీ తల్లి ఈ చెరువును ఉపయోగించాలి. (తినాలి) ఆమెకు తేజశ్శాలియైన క్షత్రియుడు పుడతాడు. నీ పుత్రుడు ధైర్యము శాంతి గల బ్రాహ్మణుడౌతాడు. ఇలా చెప్పి ఋచీకుడు తపస్సు చేసుకొనుటకు అరణ్యానికి వెళ్ళాడు. ఈ సమయంలో తన భార్యతో గాధి తన కుమార్తెను చూడటానికి ఆశ్రమానికి వచ్చాడు. అప్పుడు సత్యవతి ఋచీకుడిచ్చిన చెరువును తెచ్చి తల్లికి ఇచ్చింది.

తల్లి అజ్ఞానంచేత తన చెరువును కుమార్తె సత్యవతికి తినిపించింది. ఆమె చెరువును తాను తిన్నది. ఇందువల్ల సత్యవతి శరీరం ప్రకాశవంతం అయింది. ఆమె గర్భం క్షత్రియులను నాశనం చేసే భయానకరూపంలో ఉంది. అప్పుడు ఋచీకుడు యోగబలంచేత అంతనూ తెలిసికొని సత్యవతితో సుమంగళీ! చెరువులు తారుమారు కావటంచేత నీకు పుట్టేవాడు క్రూరమైన పనులు చేసేవాడు. భయంకరుడు అవుతాడు. నీ తల్లికి పుట్టేవాడు తపశ్శాలి బ్రహ్మజ్ఞాని అవుతాడు. ఎందు చేతనంటే ఆ చెరువులో నాలుగు వేదాలనీ సమావేశపరచాను. భర్త యిలా చెప్పిన మీదట వినయంతో దేవా! నాకు బ్రాహ్మణాధముడు (నీచ బ్రాహ్మణుడు) పుట్టకుండుగాక అని కోరింది.

ఋచీకుడు తల్లి దోషంచేతకాని, తండ్రి దోషంచేతకాని క్రూరుడు పుడతాడు. అని చెప్పగా సత్యవతి మరల మనుమడు సద్బ్రాహ్మణుడు శాంతుడు కావాలని ప్రార్థించింది. ఋచీకుడు ప్రసన్నుడై నీవు చెప్పినటే జరుగుందని చెప్పాడు. సత్యవతికి జమదగ్ని పుట్టాడు. ఇతడు ఇంద్రియ నిగ్రహం కలవాడు, శాంతి స్వభావుడు తపో నిష్ఠ కలవాడు అయ్యాడు. సత్యవతి "కౌశికి" అనే మహానదిగా మారింది. ఇక్ష్వాకు వంశంలో "రేణువు" అనే ఒకరాజున్నాడు. అతనికి కుమార్తె రేణుక. ఆమెకు ఋచీకుని పుత్రుడైన జమదగ్ని వలన తేజస్వి భయంకరుడైన పుత్రుడు కలిగాడు. అతడు అన్ని విద్యలలో ఆరితేరాడు. ధనుర్విద్యలో పరిపూర్ణుడు క్షత్రియులను నశింప చేసేవాడు. 'రాముడు' అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

సత్యవతి వలన ఋచీకుడికి ఇద్దరు పుత్రులు కలిగారు. వారిలో శునశ్శేపుడు, మధ్యవాడు చివరవాడు శునఃపుచ్ఛుడు. కుశికనందన పుత్రుడైన గాధి కొడుకు విశ్వామిత్రుడు. ఇతడు తన విద్యాశాంత స్వభావాల కారణంగా సప్తర్షులలో స్థానాన్ని పొందాడు. ఇతనికి విశ్వరథుడని కూడ పేరు కలదు. భృగుపుత్రుడైన ఋచీకుని దయవలననే వంశవర్ధనుడు మహాత్ముడైన విశ్వామిత్రుడు గాధి యింటిలో జన్మించాడు. ఇక ఇప్పుడు మహర్షి విశ్వామిత్రుని కుమారులైన దేవరాతుడు మొదలగువారు మూడు లోకాలలో ప్రసిద్ధులు. వాళ్ళ పేర్లు చెపుతాను విను.

దేవశ్రవుడు, కతి, ఇతని పుత్రులే కాత్యాయనులు. శాలావతి యందు హిరణ్యాక్షుడు. రేణుమన్తుడు, గాలవుడు, ముద్గలుడు, మధుచ్ఛన్దుడు, జయుడు మొదలగువారు. పాణినుడు, బభ్రవుడు, ధ్యానజప్యుడు మొదలగువారు కౌశిక వంశీయులు. యాజ్ఞవల్క్య, అఘమర్షణ, ఔదుంబరాదులు, హిరణ్యాక్షుని పుత్రులు. బాదరాయణ దేవల సాంకృత్యాదులు విశ్వామిత్ర వంశంలో పుట్టిన వాళ్ళు. సాంకృతి మొదలైన కుశికవంశ మహాత్ముల నుండి అనేకులు ఇతర ఋషుల వంశము వాళ్ళను వివాహం చేసుకొన్నారు. బ్రాహ్మణ, క్షత్రియ వంశాల వారికి సంబంధాలు కనిపిస్తున్నాయి.

విశ్వామిత్రుని కొడుకులలో శునశ్శేపుడు పెద్దవాడు. శునశ్శేపుడు హరి శ్చంద్రుని యజ్ఞంలో పశువుగా ఆజ్ఞాపింపబడ్డాడు. కాని దేవతలు మళ్ళీ విశ్వా మిత్రునికి అతనిని ఇచ్చివేశారు. దేవతలు తిరిగి అర్పించుట (ఇచ్చుట)చేతనే

అతని పేరు దేవరాతుడని ప్రసిద్ధిచెందింది. దేవరాతుడు మొదలైన ఏడుగురు పృషద్వతి కుమారుడు ఎనిమిదవవాడు వీళ్ళు విశ్వామిత్రుని పుత్రుల ఎనిమిదవవాడి పేరు 'లోహి' జనమేజయ మహారాజా! జహ్ను వంశచరిత్ర పూర్తి అయింది. ఇప్పుడు ఆయువు వంశాన్ని వర్ణిస్తాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పురూరవని ద్వితీయ పుత్ర వర్ణనము అను ఇరవై ఏడవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఎనిమిదవ అధ్యాయము

## ఆయువు వంశ వర్ణనము

వైశంపాయనుడిలా అన్నాడు.

ఆయువు యొక్క కొడుకు లందరూ వీరులు. రాహువు కుమార్తె ప్రభయందు పుట్టారు. వీళ్ళు ఐదుగురు వీళ్ళపేర్లు నహుషుడు, వృద్ధశర్మ, రంభుడు, రజి అనేనుడు. వీళ్ళు మహారథులుగా మూడు లోకాలలో ప్రసిద్ధిచెందారు. 'రజి'కి నూటైదుగురు పుత్రులు పుట్టారు. వాళ్ళు రాజేయులని పేరు పొందారు. వాళ్ళు ఇంద్రుని కూడ భయపెట్టారు. దేవతలకూ, రాక్షసులకూ యుద్ధం వచ్చినప్పుడు, దేవతలు, రాక్షసులు కలిసి బ్రహ్మవద్దకు వెళ్ళారు. మారెండు పక్షాలలో ఏ పక్షం విజయం సాధిస్తుంది? దయచేసి చెప్పండి అన్నారు. అప్పుడు బ్రహ్మ రజి ఉన్న పక్షం గెలుస్తుంది అన్నాడు. ధర్మమున్నచోటనే జయముంటుంది. అని చెప్పాడు.

ఇలా చెప్పిన మీదట దేవతలు రాక్షసులు రజిని సేనాపతిగా చేసుకొనటానికి అతని దగ్గరికి వెళ్ళారు. మహారాజా! మా విజయం కోసం మీరు శ్రేష్ఠమైన ధనుస్సు చేత బట్టండి అని రెండు పక్షాలవాళ్ళూ అడిగారు. అప్పుడు అర్థశాస్త్రం తెలిసిన రజి తన స్వార్థాన్ని దృష్టిలో పెట్టుకొని ఓ ఇంద్రాది దేవతలారా! నేను రాక్షసుల నందరినీ జయించి ఇంద్రపదవిని పొందగలను అన్నాడు. ఇది విని దేవతలు సంతోషించారు. రాజా నీకోరిక పూర్తి అవుతుంది అని దేవతలు చెప్పారు. అప్పుడు రాక్షసులతో చూడండి. దేవతలు నా మాట నెట్లంగీకరించారో అట్లే మీరు కూడ సమ్మతిస్తే నేను యుద్ధానికి సిద్ధపడతాను అన్నాడు.

అహంకారం గల రాక్షసులు అభిమానంతో ప్రహ్లాదుడు మా ఇంద్రుడు అతనిని వెంట బెట్టుకొని విజయాన్ని సాధిస్తాం అన్నారు. నీవు దేవతలు చెప్పిన నియమంపై దృఢంగా నిలిచి ఇంద్ర పదవిని పొందుము అన్నారు. అప్పుడు రజి తథాస్తు (అట్లే అగుగాక) అని పలికి నిశ్చింతగా ఉన్నాడు. దేవతలు నీవు రాక్షసులను చంపి ఇంద్రపదవిని పొందు అన్నారు. వాళ్ళమాట ప్రకారం రజి యుద్ధభూమిలో ఇంద్రునికి కూడ జయింపశక్యం కాని రాక్షసులను చంపి దేవతల చేతినుండి జారిపోయిన రాజ్యలక్ష్మిని పునరుద్ధరించాడు. తరువాత దేవతల నందరినీ వెంట బెట్టుకొని ఇంద్రుడు రజి దగ్గరకు వెళ్ళాడు.

రాజా! ఇప్పుడు నీవు దేవతలకు రాజైన ఇంద్రుడవు అయ్యావు. ఇందులో సందేహమేమీలేదు. కాని ఈనాటి నుండి నేను నీ పుత్రుడనుగా చెప్పుకుంటాను. నా మంచి పనుల బలంతో ఇంద్రుడనై ప్రసిద్ధిని పొందుతాను అన్నాడు. రాజా! రజి ఇంద్రుని మాటకారితనం చేత మోసపోయి సంతోషంతో అతని మాటను అంగీకరించాడు. రజికి స్వర్గరాజ్యం దొరకగానే అతడు అక్కడ రాజ్యం చేయటానికి తన ఐదువందల మంది కొడుకులు స్వర్గంలో ప్రవేశించి ఇది మా తండ్రి రాజ్యము. కాబట్టి మేమందరం ఈ రాజ్యాన్ని పంచుకొంటాం అని పలికి స్వర్గరాజ్యాన్ని పంచుకొన్నారు.

తరువాత చాలాకాలం గడవగా బలశాలియైన ఇంద్రుడు రాజ్యం కోల్పోయి బృహస్పతితో మహానుభావా! రాజ్యం కోల్పోయి కృశించిపోయాను. నా కోసం రేగుపండంత పురోడాశాన్ని (యజ్ఞంలో దేవతలికిచ్చే ఆహారాన్ని) నాకు కల్పించు దానిని తిని బలవంతుడనౌతాను అని అడిగాడు. అప్పుడు బృహస్పతి దేవేంద్రా! నీవు నాకు ముందే చెప్పి ఉంటే నీ ప్రీతికొరకు చేయరానిది లేదు. దేవేంద్రా! ప్రయత్నిస్తాను. నీవు త్వరలో రాజ్యాన్ని యజ్ఞభాగాన్ని పొందేటట్లు చేస్తాను. నీవు భయపడకు. తరువాత ఇంద్రుని తేజస్సు వృద్ధి పొందటానికి రజికి బుద్ధి నశించే టట్లు పని ప్రారంభించాడు బృహస్పతి. ముందు ఒక ధర్మశాస్త్రాన్ని రచించాడు. అందులో ధర్మాన్ని నిందించే మాటలు వ్రాయబడి ఉన్నాయి. అందులోని తర్క శాస్త్రం మాటలు మూర్ఖులకు ఆనందం కలిగించేటట్లు ఉన్నాయి.

బృహస్పతి తయారుచేసిన గ్రంథం రజియొక్క మందబుద్ధులైన కుమారులకు బాగా నచ్చింది. సంతోషం కలిగించింది. అది చదివి ధర్మవిరుద్ధమైన బుద్ధి కల వాళ్ళయ్యారు. ఆ పుస్తకంలోని చెడు ఉపదేశాన్నే గొప్ప జ్ఞానంగా తలచారు. వాళ్ళ

మనస్సులలో అధర్మం ఇల్లు కట్టుకొంది. ఆ అధర్మంచేత ఆ రజి పుత్రులు నష్ట పోవటం మొదలైంది. ఈ విధంగా బ్రహ్మద్వేషం కలవాళ్ళయ్యారు. వాళ్ళ పరాక్రమం క్షీణించింది. అప్పుడు ఇంద్రుడు బృహస్పతి దయచే కామక్రోధాలతో నిండిన రజి పుత్రులను చంపి మళ్ళీ రాజ్యాన్ని పొంది సుఖంగా ఉన్నాడు. ఈ రాజ్యం కోల్పోవటం దేవేంద్రుని కీర్తి విన్నవాడు దుర్మార్గుడు కాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
ఆయువు వంశ వర్ణనము అను ఇరవై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ఇరవై తొమ్మిదవ అధ్యాయము

## కశ్యప ప్రజాపతి వంశచరిత్ర

వైశంపాయనడిలా అన్నాడు.

రంభుడు సంతానం లేనివాడు. కాబట్టి అనేనసుని వంశాన్ని చెపుతాను. అనేనసుని పుత్రుడు గొప్పకీర్తి గల ప్రతిక్షత్రుడు. ఇతని పుత్రుడు సృంజయుడు. ఇతని పుత్రుడు విజయుడు. ఇతని కొడుకు కృతి, ఇతని కుమారుడు హర్యశ్వుడు. ఇతనికి ప్రతాపవంతుడైన పుత్రుడు సహదేవుడు. ఇతని పుత్రుడు నదీనుడు. ఇతని కుమారుడు జయసేనుడు, ఇతని కుమారుడు సంకృతి. వీనికి యశస్వీపుత్రుడు, వీని క్షత్రధర్ముడు. ఈ విధంగా అనేనసుని పుత్రులను లెక్కపెట్టి చెప్పాను. ఇక క్షత్రవృద్ధుని వంశ వృత్తాంతాన్ని విను.

క్షత్రవృద్ధుని కుమారుడు సునహోత్రుడు, ఇతనికి కాశుడు, శలుడు, గృత్సమదుడు అని ముగ్గురు కొడుకులు. కాశుడికి కాశ్యుడు, దీర్ఘతపుడు కుమారుడు. దీర్ఘతపుడి పుత్రుడు ధన్వుడు, ఇతడి కొడుకు ధన్వంతరి. ఇది విని జనమేజయుడు ధన్వంతరి దేవత కదా భూలోకంలో ఎందుకు జన్మించాడు? ఈ వృత్తాంతాన్ని వినగోరుతున్నాను అన్నాడు. అప్పుడు వైశంపాయునుడు ఇలా చెప్పాడు. ధన్వంతరి పుట్టుకను చెపుతాను.

అతడు పూర్వం అమృతం కొరకు సముద్రాన్ని మధిస్తుండగా పుట్టాడు. అతడు ఆ సమయంలో విష్ణువును స్మరిస్తున్నాడు. (తలుచుకొంటున్నాడు) పుట్టిన తరువాత ఎదురుగా విష్ణువును చూచి స్తంభించి పోయి నిలబడ్డాడు. విష్ణువు

నిలబడిన ఉన్న అతన్ని చూచి నీవు అబ్జుడవు (నీటిలో పుట్టినవాడవు) అన్నాడు. అప్పుడు అబ్జుడు ఓ ప్రభూ! నేను నీ పుత్రుణ్ణి. మీరు నాకు యజ్ఞంలో భాగం నివాసస్థానం ఏర్పరచండి అన్నాడు. అప్పుడు విష్ణువు ఓ అబ్జుడా! దేవతలు మొదటనే యజ్ఞభాగాలను పంచుకున్నారు. మహర్షులు కూడ హవిస్సును దేవతలకు ఇచ్చారు. ఈ సమయంలో యజ్ఞభాగాన్ని కల్పించలేము. నీవు క్రొత్త దేవతవు. రెండవ జన్మలో గొప్ప కీర్తిని పొందుతావు. అప్పుడు గర్భంలో ఉండగానే నీకు అణిమాదిసిద్ధులు ప్రాప్తిస్తాయి.

ఆ శరీరంతోనే నీవు దేవతవు అవుతావు. అప్పుడు బ్రాహ్మణులు నీ కొరకు చరువు మంత్ర జపాదుల ద్వారా యజ్ఞవిధానం ఏర్పరుస్తారు. ఆజన్మలో నీవు ఆయుర్వేదాన్ని ఎనిమిది భాగాలు చేస్తావు. బ్రహ్మ దీనిని పూర్వమే నిశ్చయించి పెట్టాడు. ద్వాపరయుగంలో నీవు రెండవసారి జన్మిస్తావు. విష్ణువు ఈ వరమిచ్చి అంతర్ధానం చెందాడు. ద్వాపరయుగంలో కాశీరాజైన సుహోత్రుని పుత్రుడు దీర్ఘతపుడు పుత్రసంతానం కోసం కఠోరమైన తపస్సు ప్రారంభించాడు. అబ్జదేవుడు అతనికి పుత్రుని ప్రసాదించేవాడు. ఇతని తపస్సుకు ప్రసన్నుడై అబ్జదేవుడు నీవేదడిగితే అది యిస్తానన్నాడు. దీర్ఘతపుడు మీరు నాకు పుత్రుడుగా జన్మించాలి అని కోరాడు. అబ్జదేవుడు అలాగే అగుగాక అని అంతర్ధానం చెందాడు.

కొంతకాలం తరువాత కాశీరాజుగా ధన్వంతరి అవతరించాడు. మహర్షి భరద్వాజుడి వద్ద ఆయుర్వేదాన్ని నేర్చుకొన్నాడు. ఆయుర్వేదంలోని ఎనిమిది భాగా లనూ తన విద్యార్థులకు చెప్పాడు. మహారాజ! ధన్వంతరి కొడుకు కేతుమంతుడు, ఇతని పుత్రుడు భీమరథుడు ఇతని కొడుకు దివోదాసుడు. దివోదాసుడు కాశీనగరం రాజు అయ్యాడు. క్షేమకుడనే రాక్షసుడు కాశీపట్టణంలో మనుష్యులు లేకుండా చేశాడు. బుద్ధిమంతుడైన మహాత్ముడు నికుంభుడు వెయ్యి సంవత్సరాల వరకూ 'కాశీ' జనం లేనిది అవుతుందని శాపమిచ్చాడు. నికుంభుడు ఈ విధంగా శాపమిచ్చిన తర్వాత దివోదాసుడు గొమతీనది ఒడ్డున తన రాజధానిని ఏర్పరచు కొన్నాడు. పూర్వం కాశీనగరం మీద 'భద్రశ్రేణు'ని అధికారం ఉండేది. దివోదాసుడు భద్రశ్రేణ్యుని వందమంది పుత్రులను చంపి కాశీకి అధికారి అయ్యాడు.

ఇంతవరకూ విని జనమేజయ మహారాజు అడిగాడు.

నికుంభుడు కాశీకి ఎందుకు శాపం పెట్టాడు? అతడు సామాన్యుడై ఉండడు. ఆ నికుంభుడెవడో కూడ చెప్పకోరుతున్నాను. వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! రాజర్షి దివోదాసుడు కాశీపట్టణంలో నివసిస్తుండగా శంకరుడు వివాహం చేసుకొని పార్వతిని సంతోషపెట్టుటకు అత్తవారి యింటిలో ఉంటున్నాడు. అతని ఆజ్ఞచేత యోగ్యులైన శివగణంలో వాళ్ళు శివుని ఉపదేశాలతో పార్వతిని సంతోష పెడుతున్నారు. పార్వతి సంతోషిస్తున్నది కాని ఆమె తల్లి మేనక సంతోషించలేదు. ఆమె మాటిమాటికీ శంకరుణ్ణి పార్వతినీ నిందిస్తూ ఉన్నది. ఓబిడ్డా! నీ భర్త అయన ప్రక్కనున్నవారూ అందరూ ఆచారభ్రష్టులు. వాళ్ళెప్పుడూ దరిద్రులుగా ఉంటారు. మంచిస్వభావం వాళ్ళకు లేనేలేదు. తల్లి ఇలా మాట్లాడగా పార్వతి కోపించింది. కొంచం నవ్వి తన భర్తవద్దకు వెళ్ళింది. అక్కడ ఏడుపుముఖంతో దేవ! ఇప్పుడు నేనిక్కడ ఉండను. మీ యింటికి నన్ను తీసుకువెళ్ళండి అన్నది.

పార్వతి మాటలు విని శంకరుడు మూడులోకాలను పరిశీలించి భూలోకంలో వారణసీపురంలో ఉండ టానికి నిశ్చయించుకున్నాడు. కాని అతనిపై దివోదాసుని అధికారం ఉంటుంది. ఇందువల్ల తనవద్ద కూర్చున్న నికుంభుని పిలిచి గణ నాయకా! నీవు వెళ్ళి మృదువైన ఉపాయంతో కాశీలో ఎవరూ లేకుండా చెయ్యి. ఇది కూడ గుర్తుంచుకో. దివోదాసుడు గొప్ప పరాక్రమవంతుడు. శివుని ఆజ్ఞచే నికుంభుడు కాశీకి వెళ్ళి అక్కడ కలలో కండుకుడనే మంగలికి దర్శనమిచ్చాడు. నా స్వరూపాన్ని తయారుచేసి నగరంలో ఏభాగమందైనా స్థాపించు. ఇలాచేస్తే నీకు శుభం కలుగజేస్తాను అన్నాడు. మంగలి నికుంభుని ఆజ్ఞపాలించి పని అంతా పూర్తిచేశాడు. పట్టణ ముఖద్వార మందు పెద్దఆర్భాటంగా నికుంభునికి పూజ చేయమొదలెట్టాడు.

రాజైన దివోదాసుకు కూడా మంగలి సూచించాడు. ప్రతిదినమూ గంధధూప నైవేద్యాదులతో పూజ చేస్తున్నాడు. కాశీలో జనానికి ఇది పెద్ద ఆశ్చర్యంగా ఉంది. నికుంభుడీ విధంగా నిత్యమూ గణనాయకుని పూజిస్తున్నాడు. పురవాసులకు వేలాది వరాలిస్తున్నాడు. సుయశ అనే రాజుభార్య, రాజు ప్రేరేపించగా పుత్రులను కోరివచ్చి పూజచేసి పుత్రుడు కావాలని కోరింది. చాలామార్లు సంతానాపేక్షతో అక్కడకు వచ్చింది. నికుంభుడు పుత్రుని అనుగ్రహించలేదు. రాజు కోపిస్తే మనకు పని జరుగుతుంది అని. చాలాకాలానికి రాజుకి కోపం వచ్చింది. పట్టణద్వారంలో ఉన్న ఈభూతం పౌరులందరికీ సంతోషంతో వందలాది వరాలిస్తోంది. ఎల్లప్పుడూ మా వాళ్ళు పూజిస్తూనే ఉన్నారు. పుత్రసంతానాన్ని కోరి విన్నవించాను. చేసిన మేలు మరిచే ఈతడు నాకు పుత్రుని కలుగజేయుటలేదు. కనుక ఇతనిని నేను

గౌరవించను. ఇతని స్థానాన్ని నాశనం చేస్తాను అని నిశ్చయించి రాజద్రోహియైన దుర్మార్గుడు గణపతిస్థానాన్ని నాశనం చేశాడు. అప్పుడు నికుంభుడు ప్రత్యక్షంగా బయట పడి ఏకారణంలేకుండా నా మందిరాన్ని నాశనం చేశావు కనుక నీ నగరం జనంలేనిది ఔతుంది అని శపించాడు. శాపంచేత పట్టణం శూన్యం అయింది. ఇలా శపించి నికుంభుడు శివునివద్దకు తిరిగివచ్చాడు.

ఆ శాపంచేత పురజనులందరూ నలు దిక్కులకూ పారిపోయారు. అప్పుడు శంకరుడు అక్కడ నివాసస్థానం ఏర్పరచుకొన్నాడు. పార్వతిని సంతోషపెడుతూ ఉన్నాడు. కాని పార్వతి సంతోషించలేదు. నేనీ పట్టణంలో ఉండను అన్నది. శివుడు ఇక్కడ అవిముక్తస్థానమే నాయిల్లు. దీనిని విడిచిపెట్టను. నీకు ఇష్టమైతే తండ్రి యింటికి వెళ్ళు. నేనక్కడకు వెళ్ళను అని నవ్వుతూ పలికాడు. అందుచే కాశీకి అవిముక్త క్షేత్రమని పేరువచ్చింది. ఈవిధంగా కాశీకి శాపవృత్తాంతం. దీనికి అవిముక్తమనే పేరు రావటానికి కారణం చెప్పాను. భగవంతుడైన శివుడు పార్వతితో మూడుయుగాలలోనూ నివసిస్తాడు. కలియుగంలో ఆ నగరం అంతర్ధానం చెందు తుంది. శివుడు కూడ కనబడకుండా ఉంటాడు. ఈవిధంగా శపింపబడిన తరువాత జనులకు నివాసమైంది.

భద్రశ్రేణ్యుని పుత్రుడు దుర్దముడు. దివోదాసునిచే బాలుడని దయతో అతడు విడిచిపెట్టబడ్డాడు. దుర్దముడనే రాజుకు హైహయుడను కుమారుడు అయ్యాడు. బలాత్కారంగా దివోదాసు అపహరించిన తండ్రి రాజ్యాన్ని సంపా దించాడు. దృషద్వతికి దివోదాసు వలన ప్రతర్దనుడు పుట్టాడు. ఇతడు (ప్రతర్దనుడు) దుర్దముడు లాగుకొన్న రాజ్యాన్ని తన అధికారంలోకి తెచ్చుకొన్నాడు. ప్రతర్దనుడికి వత్సుడు, భర్గుడను ఇద్దరు పుత్రులు. వత్సుడికి అలర్కుడు, వీడికి సన్నతి పుత్రులు. కాశీరాజైన అలర్కుడు సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు, బ్రహ్మవేత్త కూడ. అలర్కుడు లోపాముద్రాదేవి అనుగ్రహం వలన అరవై ఆరువేల సంవత్స రాలు యువకుడుగా రాజ్యంచేశాడని పురాతన కథ ఉంది. అతనికి చాలా గొప్ప రాజ్యం ఉండేది.

నికుంభుని శాపం చివరకాలంలో క్షేమకుడనే రాక్షసుణ్ణి చంపి అందమైన వారాణసీ నగరాన్ని మరల ఏర్పరచాడు. సన్నతి పుత్రుడు సునీథుడు. ఇతనికి

క్షేమ్యుడు పుత్రుడు. ఇతని పుత్రుడు కేతుమంతుడు. ఇతనికి సుకేతువు, ఇతనికి ధర్మకేతువు, వీనికి సత్య కేతువు, ఇతనికి విభుడుడు, వీనికి ఆనర్తుడు, ఈతనికి సుకుమారుడు, వీనికి ధృష్టకేతువు, ఇతనికి వేణుహోత్రుడు, ఇతనికి భర్గుడు పుత్రులు. అలర్కుడి తండ్రి వత్సుడికి వత్సభూమి, వత్సభూమి తండ్రియైన భార్గవునకు భృగుభూమి జన్మించారు. మహర్షి అంగిరసునకు వీరందరూ భృగు వంశంలో పుట్టారు. వత్సభూమి, భృగుభూమి అనువారికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతులకు చెందిన వెయ్యిమంది జన్మించారు. వీళ్ళందరికీ కాశిరాజు మూల పురుషుడు. ఇక నహుషుని వృత్తాంతం చెపుతాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
కశ్యప ప్రజాపతి వంశచరిత్ర అను ఇరవైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పైయ్యవ అధ్యాయము

## నహుషయయాతుల వంశ వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

పితృదేవతల కన్యయైన విరజయందు నహుషునకు గొప్పశక్తి గలవాళ్ళు, ఇంద్రునితో సమానులైన పుత్రులు కలిగారు. వాళ్ళు యతి, యయాతి, సంయాతి, ఆయాతి, భవ, సుయాతి అనువారు. వాళ్ళలో యతి పెద్దవాడు. యయాతి మధ్య వాడు. గోవు అనే కకుత్స్థుని కుమార్తెతో అతనికి వివాహం జరిగింది. 'యతి' మునివ్రతము నవలంబించి పరబ్రహ్మంలో కలిసిపోయాడు. తక్కిన ఐదుగురిలో యయాతి భూమిని జయించి రాజయ్యాడు. శుక్రాచార్యుల కూతురు దేవయాని, వృషపర్వుని కూతురు శర్మిష్ఠ ఇద్దరూ అతనికి భార్యలు. దేవయానికి 'యదు', 'తుర్వసు'లు, శర్మిష్ఠకు 'ద్రుహ్యు', 'అను', 'పూరువు' అనువారు పుత్రులు.

ఇంద్రుడు సంతోషించి యయాతికి ప్రకాశమానమైన బంగారురథాన్ని యిచ్చాడు. దానికి మనోవేగంతో సమానవేగంగల గుర్రాలు కట్టబడ్డాయి. ఆ దివ్యరథం సహాయంతో అతడు ఆరురోజుల్లో భూలోకాన్ని, ఇంద్రునితో కూడిన స్వర్గమందలి దేవతలను జయించాడు. ఆ రథం పురువంశ రాజులందరి అధికారం లోనూ ఉన్నది. జనమేజయుని సమయంనుండి గార్గ్యుని శాపంచేత నశించి

పోయింది. జనమేజయుడు గార్గ్యుని కుమారుని చంపి బ్రహ్మహత్యాపాపాన్ని పొందాడు. గర్గుడు కోపించి శాపం పెట్టాడు. ఆ కారణంచేత జనమేజయుడు రథం లేనివాడయ్యాడు. పతితుడై (పాపాత్ముడై) ఇటూ అటూ తిరుగుట ప్రారంభించాడు. నగరవాసులు, గ్రామవాసులు అతన్ని విడిచిపెట్టారు.

ఈ దుఃఖంతో అతనికి శాంతి లేకపోయింది. చివరకు "ఇంద్రోతు"డనే బ్రహ్మర్షి శౌనకుని శరణువేడాడు. శౌనకుడతనిని పవిత్రుని చేయుటకు అశ్వమేధయాగం చేయించాడు. ఆ యజ్ఞం చివర అవబృథస్నానం చేయగానే పాపం నశించింది. అప్పుడు ఇంద్రుడు సంతోషించి దివ్యరథాన్ని వసువను వాని కిచ్చాడు. వసువు బృహద్రుడికి, తరువాత ఇతని పుత్రునికీ ఆరథంమీద అధికారాకం ప్రాప్తించింది. తరువాత బృహద్వంశరాజైన జరాసంధుని చంపి భీముడా రథాన్ని శ్రీకృష్ణపరమాత్మకు అర్పించాడు. యయాతి మహారాజు ఏడుద్వీపాలతో కూడిన భూమండలాన్ని జయించి దానిని ఐదుభాగాలు చేశాడు. ఆ ఐదుభాగాలలో ఆగ్నేయ దిక్కును తుర్వసుకు, పడమరదిక్కును ద్రుహ్యునికీ, ఉత్తరదిక్కును 'అణువు'కు, ఈశాన్యదిక్కును యదువుకు, మధ్యభాగాన్ని పూరువుకు ఇచ్చాడు. యయాతి పుత్రులు ఈనాడు కూడా గ్రామనగరాదులతో శోభించే ఏడుద్వీపాలతో కూడిన భూమిని ధర్మంగా పరిపాలిస్తూ ఉన్నారు.

రాజా! పైన చెప్పిన మహా పురుషుల వృత్తాంతాన్ని ముందు చెపుతాను. ఇలా ఐదుగురు పుత్రులకు రాజ్యాన్ని విభజించి అస్త్రశస్త్రాలను విడిచిపెట్టాడు. తరువాత యయాతి పెద్దకొడుకైన యదువుతో కుమారా! నేను ముసలివాడినైనాను. నీవు నా ముసలితనాన్ని తీసికొని నీ యౌవనాన్ని నాకిమ్ము. నేను యువకుడనై భూమిపై తిరగగలుగుతాను అన్నాడు. యదువు నేనొక బ్రాహ్మణుడికి కోరినదాని విస్తానన్నాను. ఆబ్రాహ్మణుని కోరిక తీర్చిగాని నీ ముసలితనాన్ని తీసుకోలేనన్నాడు. మరియు ముసలితనంలో బోజనము, నీరుత్రాగుట మొదలైనవాటికి సంబంధించిన దోషాలు చాలా ఉన్నాయి. ఇందుచే నీ ముసలితనాన్ని నేను తీసుకోవాలనుకోటం లేదు. నాకంటే మిక్కిలి యిష్టమైన కొడుకులు మీకున్నారు.

వాళ్ళలో ఒకణ్ణి యెన్నుకోండి అన్నాడు. యదువు మాటలను విని యయాతి కోపించాడు. మరియు అతన్ని తిరస్కరిస్తూ ఓరిదుర్బుద్ధీ! నేను నీకు తండ్రీని.

నా ఆజ్ఞను లెక్కచేయకపోతే ఇంతకంటే గొప్పధర్మం ఏముంది? అనిపలికి ఓరి మూఢుడా! నా ఆజ్ఞను పాటించనందున నీ వంశం వాళ్ళందరికీ రాజ్యాధికారం ఉండదని శపించాడు. తరువాత యయాతి తుర్వసు, ద్రుహ్యు, అణు అనే కొడుకు లను ముసలితనం తీసుకోమని అడిగాడు. వాళ్ళలో కూడా ఎవడూ ఒప్పుకోలేదు. వాళ్ళను కూడ అట్లే శపించాడు యయాతి. ఇలా నలుగురు పుత్రుల్నీ శపించిం తరువాత అయిదవవాడైన పూరువుతో చెప్పాడు.

నువ్వు నామాట పాటిస్తే నాముసలితనాన్ని నీకిచ్చి నీ పడుచుతనాన్ని తీసుకొని రాజభోగాల్ని అనుభవిస్తాను అని యయాతి పలికాడు. ప్రతాపవంతుడైన పూరువు తండ్రి ఆజ్ఞను శిరసావహించి ఆయన ముసలితనాన్ని తీసుకున్నాడు. యయాతి పూరువు రూపయౌవనాల్ని తీసుకొని రాజభోగాలను అనుభవిస్తున్నాడు. తన కోరిక తీర్చుకోటానికి యయాతి విశ్వాచి అనే అప్సరసను వెంట బెట్టుకొని చైత్రరథ వనంలో విహరించాడు. తరువాత సుఖాలకు అంతుండదు అని ఆలోచించి పూరువు వద్దకు వెళ్ళి తన ముసలితనాన్ని తీసుకున్నాడు. ఆ సమయంలో అతడన్న మాటలు చెపుతా విను. ఈ మాటలు వింటే పూర్వ సంస్కారాలు అణగిపోతాయి. భోగాలను అనుభవించడంవల్ల వాంచ తగ్గదు. ఇంకా పెరుగుతుంది అని ఆమాటల సారాంశం.

ముసలివాడికి జుట్టు ఊడిపోతుంది. పళ్ళు ఊడిపోతాయి. బ్రతకాలనే ఆశ, ధనాశ మాత్రం తగ్గదు. ఆశ లేకపోవటంవల్ల కలిగే సుఖంలో ఏసుఖమైనా పదహారవ వంతుకూడ ఉండదు అని రాజర్షి యయాతి భార్యతో అరణ్యానికి వెళ్ళాడు. చాలాకాలం గొప్పతపస్సు చేశాడు. ఎత్తైన కొండ చరియమీద తపస్సుచేసి చివరలో ఆహారం మాని శరీరం విడిచి భార్యతోపాటు స్వర్గానికి వెళ్ళాడు. అతని వంశంలో ఐదుగురు గొప్పరాజర్షులున్నారు. రాజర్షులు గౌరవించిన రాజర్షి యదువు వంశాన్ని విను. ఆ వంశంలోనే నారాయణుడు, హరి, విష్ణువు అనబడే పరమాత్మ కులాన్ని ఉద్ధరించేవాడై జన్మించాడు. యయాతి చరిత్రను చదివినవాడు ధన్యుడు, సంతానవంతుడు, చిరంజీవి, కీర్తికలవాడు అవుతాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలకంశమందలి హరివంశపర్వంలో
నహుషయయాతుల వంశ వర్ణనము అను ముప్పైయ్యవ అధ్యాయము

☆☆☆

# ముప్పైయొకటవ అధ్యాయము

## కుక్షేయు వంశవర్ణనము

జనమేజయుడిలా అడిగాడు.

మహాత్మా! నేను 'పూరు' వంశాన్ని పూర్తిగా వినగోరుతున్నాను. ద్రుహ్యుడు, అనువు, యదువు, తుర్వసువు వీరల వంశాన్ని విడివిడిగా వైశంపాయనుడీ విధంగా చెప్ప మొదలుపెట్టాడు. మహారాజ! నీవు ద్రుహ్యుడు అను యదు, తుర్వసు మొదలైన పూరువంశరాజుల చరిత్ర విను. ఆ వంశంలోనే కదా నీజన్మ.

మహాత్ముడైన పూరువుకు ప్రచిన్వంతుడనే బలశాలియైన ఒక పుత్రుడున్నాడు. ఇతడు తూర్పుదిక్కున విజయం పొందాడు. ప్రచిన్వంతుని పుత్రుడు ప్రవీరుడు. ఇతని కుమారుడు మనస్యుడు. ఇతని కొడుకు అభయదుడు. ఇతని కొడుకు సుధన్వుడు. ఇతని కుమారుడు బహుగవుడు. ఈతని పుత్రుడు శమ్యాతి. ఈతని కొడుకు రహస్యాతి, వీని కొడుకు రౌద్రాశ్వుడు. ఇతనికి ఘృతాచి అనే అప్సరస యందు పదిమంది పుత్రులు కలిగారు. వాళ్ళలో ఋచేయుడు అనువాడు మొదటి వాడు. కృకణేయుడు, కక్షేయుడు, స్థండిలేయుడు, సన్నతేయుడు, దశార్ణేయుడు, జలేయుడు, స్థలేయుడు, బలేయుడు, ధనేయుడు అనే పదిమంది కొడుకులు పుట్టారు. అలాగే పదిమంది కూతుళ్ళు. ఆపిల్లల పేర్లు - రుద్ర, శూద్ర, భద్ర, మదల, మలహ, ఖలద, నలద, సురస, గోచపల.

ఈ కన్యలందరూ అందగత్తెలు. అత్రికులంలో పుట్టిన ఋషి ప్రభాకరుడు వీళ్ళభర్త. ఇతడు రుద్ర అనే భార్యయందు సోముడు అనే పుత్రుని కన్నాడు. రాహువు సూర్యుని చంపినపుడు అతడు భూమి మీదికి జారిపడుతుండగా ప్రపంచ మంతటా చీకటి వ్యాపించింది. కాంతిని సృష్టించే ఋషి అత్రి నీకు శుభమగుగాక అవగానే పడుతున్న సూర్యుడు బ్రహ్మర్షి మాటవలన పడలేదు. ఈ మహాతపశ్శాలి అత్రిగోత్రాన్ని ప్రవర్తింపచేశాడు. దేవతలు యజ్ఞంలో ఇతనికికూడ యజ్ఞభాగాన్ని తప్పనిసరైనదాన్ని చేశారు. ఆ కన్యలవల్ల ఈతనికి మహాబలవంతులైన పదిమంది పుత్రులు జన్మించారు. ఈ పదిమంది పితరులుగా పేరొందారు. వేదపారదర్శులు, గోత్రప్రవర్తకులు, స్వస్త్యాత్రేయులుగా ప్రసిద్ధిచెందారు. కాని అత్రివలె యజ్ఞభాగానికి అధికారులు కాలేదు.

కున్షేయువుకు ముగ్గురు మహారథులైన పుత్రులు సభానరడు, చాక్షుషుడు, పరమన్యుడు. సభానరుని కొడుకు కాలానలుడనే రాజు. కాలానలుడికి ధర్మం తెలిసిన సృంజయుడు, ఇతనికి పురంజయుడు, వీని పుత్రుడు జనమేజయుడు. ఇతనికి మహాశాలుడు, ఇతనికి మహామనస్సు. ఇతడు దేవతలచే పూజింపబడిన వాడు, గొప్పకీర్తి గలవాడు. ధర్మం తెలిసిన ఉశీనరుడు బలశాలియైన తితిక్షువు వీరిద్దరూ మహాశాలుని పుత్రులు. ఉశీనరుడికి పెద్దపెద్ద రాజర్షివంశంలో పుట్టిన ఐదుగురు భార్యలు ఉన్నారు. వాళ్ళపేర్లు నృగ, కృమి, నవ, దర్వా, దృషద్వతి. ఉశీనర మహారాజుకు ఆ భార్యల వలన వంశకీర్తిని విస్తరింపచేసే ఐదుగురు పుత్రులు జన్మించారు. వాళ్ళలో నృగకు నృగుడు, కృమికి కృమి, నవకు నవుడు, దర్వాకు సువ్రతుడు, దృషద్వతికి శిబి పుట్టారు.

శిబి యొక్క పుత్రుల పేర్లు విను. వృషదర్భుడు, సువీరుడు, మద్రకుడు, కేకయుడు అని నలుగురు కుమారులు. వీళ్ళ రాజధాని పేరు వీళ్ళ పేరునను సరించియే యున్నది. ఇప్పుడు తితిక్షువు యొక్క వంశావళిని వర్ణిస్తున్నాను విను. తితిక్షువుకు మహాబాహువు ఉపద్రథుడు పుత్రుడు. ఇతడు తూర్పుదిక్కున రాజ్యాన్ని స్థాపించాడు. ఉపద్రథుడికి పుత్రుడు ఫేనుడు, ఇతనికి సుతపుడు, వీనికి 'బలి'. ఇతడు పూర్వజన్మలో గొప్పయోగి. ఇతనికి ఐదుగురు కుమారులు. మొదటివాడు అంగుడు', వంగుడు, సుహ్మడు, పుండ్రుడు, కళింగుడు. వీళ్ళు బాలేయక్షత్రియులని పిలువబడ్డారు. పుట్టుకచే వీళ్ళు క్షత్రియులైనా బ్రాహ్మణు లయ్యారు. బ్రహ్మదేవుడు సంతోషించి బలికి నీవు యోగివి, కల్పాన్తము వరకు ఆయుస్సు కలవాడవు, యుద్ధంలో జయము, బలంలో సాటిలేనితనము కల వాడవు, నాలుగు వర్ణాలను స్థాపించేవాడవు అవుతావు అని వరమిచ్చాడు. బ్రహ్మ ఈ వరములిచ్చిన మీదట బలికి మిక్కిలి శాన్తి కలిగింది.

అతని పుత్రులందరూ సుదేష్ణకు జన్మించినవాళ్ళు. వాళ్ళు క్షేత్రజ్ఞులని పిలువ బడుచున్నారు. బలి యీ పుత్రుల్ని రాజ్యమందు పట్టాభిషిక్తులనుచేసి తనను కృతకృత్యునిగా తలచి యోగమార్గాన్ని అవలంబించాడు. అతనిని ఎవడూ ఎదిరించ లేకపోయాడు. కొంచం సమయం తరువాత అతడు యోగపదాన్ని పొందాడు. అతని ఐదుగురు పుత్రుల రాజ్యాలు అంగ, వంగ, కళింగ, సుహ్మక, పుండ్రక దేశాలు. ఇప్పుడు అంగుని వంశావళి చెపుతున్నాను విను.

అంగుని కొడుకు దధివాహనుడు. ఇతనికి దివిరథుడు, వీనికి ఇంద్ర తుల్యుడు, విద్వాంసుడైన ధర్మరథుడు, ఇతనికి చిత్రరథుడు పుత్రులు. చిత్ర రథుడు విష్ణు పదమనే పర్వతంమీద యజ్ఞం చేశాడు. అందులో సోమరసాన్ని త్రాగి ఇంద్రునితో సమానుడయ్యాడు. చిత్రరథుని పుత్రుడు దశరథుడు. అతడు లోమపాదుడని పేరుపొందాడు. ఋష్యశృంగుని దయచేత దశరథుడికి చతురంగు డనే పుత్రుడు జన్మించాడు. వీనికి పృథులాక్షుడు, వీనికి 'చంపుడు'. ఇతని రాజధాని 'చంప'. మొదట దీనిపేరు మాలిని. మునిశ్రేష్ఠుడైన పూర్ణభద్రుని దయవలన ఇతనికి హర్యంగుడు, వీనికి భద్రరథుడు, ఇతనికి బృహత్కర్మ, ఇతనికి బృహదర్భుడు, వీనికి బృహన్మనసుడు, ఇతనికి జయద్రథుడు, ఇతనికి దృఢరథుడు, వీనికి విశ్వజిత్తు, ఇతనికి కర్ణుడు, ఇతనికి వికర్ణుడు. ఇతనికి వందమంది పుత్రులు.

బృహన్మనసుడికి చైత్యుని కన్యలైన యశోదేవి, సత్య అనువారితో వివాహం జరిగింది. చైత్యుని యీ ఇద్దరు కన్యల వలన ఆ వంశం రెండు భాగాలుగా విడి పోయింది. రాజా! జయద్రథుడు, విజయుడు సత్యాదేవి అనువారికి జన్మించాడు. విజయుడు శాన్తిగుణంచేత బ్రాహ్మణులకంటే, శౌర్యగుణంలో క్షత్రియులకంటెనూ గొప్పవాడు. విజయుడి పుత్రుడు ధృతి, ఇతనికి ధృతవ్రతుడు, ఇతనికి సత్యకర్మ, ఇతనికి అధిరథుడు పుత్రులుగా జన్మించారు. అధిరథుడు సూతుడయ్యాడు. ఇతడు కర్ణుని పెంచినవాడు. ఈ కారణంచేత కర్ణుడు సూతపుత్రుడయ్యాడు. ఈ విధంగా నేను నీకు బలశాలియైన కర్ణుని వృత్తాంతం చెప్పాను. కర్ణుని కొడుకు వృషసేనుడు. ఇతని కొడుకు 'వృషుడు' అంగవంశపు రాజులందరూ సత్యవ్రతులు, పుత్రవంతులు, మహారథులు. ఇప్పుడు నీవు పుట్టిన 'ఋచేయు' వంశంవాళ్ళను గూర్చి విను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
కుక్షేయవంశ వర్ణనము అను ముప్పైయొకటవ అధ్యాయము

☆☆☆

# ముప్పైరెండవ అధ్యాయము

## పురువంశ పరంపర

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజర్షియైన ఋచేయువు గొప్పవీరుడు. తక్షకుని కుమార్తె జ్వలనతో అతనికి వివాహం జరిగింది. జ్వలనకు మతినారుడనే పుత్రుడు కలిగాడు. ఇతనికి ముగ్గురు

కుమారులు. వాళ్ళపేర్లు తంసుడు, ప్రతిరథుడు, సుబాహువు. మతినారుకు ఒక 'గౌరి' అనే కన్య కూడ ఉంది. ఆమె మాంధాతకు తల్లి అయింది. మతినారుని పుత్రులు ముగ్గురూ బ్రహ్మజ్ఞానులు, బలవంతులు, యుద్ధనిపుణులు కూడ. వాళ్ళలో తంసుడు పెద్దవాడు. ప్రతిరథుని కొడుకు కణ్వుడు. ఇతని కొడుకే మేధాతిథి. ఇతని వలన కణ్వుడు బ్రాహ్మణుడయ్యాడు. ఇతని వంశీయులను కాణ్వాయనులని పిలుస్తారు. కణ్వుని కూతురు 'ఈలిని'. ఈమె ఎక్కువ బ్రాహ్మణ భక్తి కలది. 'తంసు'తో ఈమెకు వివాహం జరిగింది. తంసుని కుమారుడు 'సురోధుడు'. ఇతడు బ్రహ్మజ్ఞాని, పరాక్రమవంతుడు కూడ. ఉపదానవి ఇతని భార్య. ఈమె కుమారులు దుష్యంతుడు, సుష్మంతుడు, ప్రవీరుడు, అనఘుడు అను నలుగురు. దుష్యంతుని కొడుకు భరతుడు. ఇతడు పదివేల ఏనుగుల బలం కలవాడు. సర్వదమనుడను ఈతడు చక్రవర్తి. భరతుని తల్లి శకుంతల. అతని పేరుతోనే మీరు భారతులనబడుతున్నారు. ఆకాశవాణి శకుంతల నవమానించవద్దు. భరతుని తండ్రివి నీవేనని శకుంతల సత్యమే పలికింది. నీవు భరతుని పోషించు శకుంతల నీ భార్యయేయని పలికింది. తల్లుల కోసంచేత భరతుని పుత్రులు నశించారు. ఈ విషయంలో ఒక కథ.

భరద్వాజుడు భరతునిచేత ఒక యజ్ఞం చేయించాడు. దేవతలు భరద్వాజుని భరతుని కుమారరూపంగా మార్చారు. పూర్వం తల్లులు భరతపుత్రుల్ని పనికిరాని వారినిగా చేశారు. భరద్వాజునివల్ల కలిగిన పుత్రునికి వితథుడని పేరువచ్చింది. వితథుడు పుట్టగానే మహారాజు భరతుడు స్వర్గస్థుడయ్యాడు. తరువాత భరద్వాజుడు కూడా వితథుడికి పట్టాభిషేకంచేసి, అరణ్యానికి వెళ్ళిపోయాడు. వితథుడికి కుమారులు ఐదుగురు. వాళ్ళపేర్లు సుహోత్రుడు, సుహోత, గయుడు, గర్గుడు, కపిలుడు. సుహోత్రుడికి ఇద్దరు కొడుకులు. వాళ్ళపేర్లు కాశికుడు, గృత్సమతి. వాళ్ళ యిద్దరినుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతులకు చెందిన అనేక పుత్రులు జన్మించారు. కాని 'కాశికకు' ఒక్కడే దీర్ఘతపుడనువాడు. ఇతనికి ధన్వంతరి జన్మించాడు. ఇతని కొడుకు కేతుమంతుడు. ఇతనికి భీమరథుడు, ఇతనికి దివోదాసుడు. ఇతడు రాక్షసులకు యమునివంటివాడు. ఆకాలంలో క్షేమకుడనే రాక్షసుడు రాజైన దివోదాసు రాజధానియైన కాశీని జనశూన్యంగా చేశాడు. దివోదాసుడు గోమతీనదిఒడ్డున రాజధానిని ఏర్పరుచుకొన్నాడు.

ఇప్పుడు విశ్వామిత్రుని పుత్రుల పేర్లు చెపుతా విను.

విశ్వామిత్రునికి భార్య శాలావతివల్ల దేవశ్రవుడు, కతి, హిరణ్యాక్షుడు పుట్టారు. ముల్లోకములందు ప్రసిద్ధిచెందిన దేవరాతుడు మొదలగువారు విశ్వామిత్రుని పుత్రులు. కతికి కాత్యాయనుడు జన్మించాడు. ఇతని రెండవభార్య 'రేణు' రేణు మంతుని, సాంకృత్యుని, గాలవుని, మౌద్గల్యుని కన్నది. ఈకుశికవంశ మహాత్ములు సమస్తప్రపంచానికీ తెలిసినవాళ్ళు. పాణిన, బభ్రవ, ధ్యానజవ్య, పార్థివ, దేవరాత, శాలంకాయన, సీశ్రవ, లేహిత్య, యామదూత, కారీష ఇంకా ఇతర కౌశికులు కుశిక వంశమునందు జన్మించినవారుగా తలచబడుచున్నారు. ఈ మహాత్ములలో చాలమందికి ఇతరఋషుల కులమందు వివాహాలు జరిగాయి. విశ్వామిత్రుని పుత్రుల్లో శునశ్శేపుడు పెద్దవాడు. అతడు భృగువంశంవాడై యుండి కౌశికవంశీయుడయ్యాడు. దృషద్వతి పుత్రులైన అష్టకదేవరాతాదులు అందరూ విశ్వామిత్రుని పుత్రులు. అష్టకుడి కొడుకు లేహి. ఈవిధంగా రాజా! జహ్నుగణ వృత్తాంతం నీకు చెప్పాను. ఇప్పుడు అజమీఢవంశ వృత్తాంతం చెపుతా విను.

అజమీఢుడికి నలిని అనే భార్యయందు సుశాంతిక జన్మించింది. ఆమెకు పూరుజాతి అతనికి వాహ్యాశ్వుడు, పుత్రులు. వాహ్యాశ్వుడికి ఐదుగురు కొడుకులు. వాళ్ళపేర్లు ముద్గలుడు, సృంజయుడు, యవీనరడు క్రిమిలాశ్వుడు. ఈ ఐదుగురు దేశరక్షణలో సమర్థులు. ఇందుచే పంచాలురని చెప్పబడుతున్నారు. వీళ్ళ రాజ్యం పేరుకూడా పంచాలమే. ముద్గలవంశ రాజులు మౌద్గల్యులుగా చెప్పబడుచున్నారు. వీళ్ళు క్షత్రియవంశంలో పుట్టి కూడ బ్రాహ్మణులుగా చూడబడుతున్నారు. కణ్వుడు, ముద్గలవంశంవాళ్ళు అంగిరసునిపై పక్షపాతం కలవాళ్ళు. ఇంద్రసేనుడు ముద్గలుని పెద్దకొడుకు. ఇంద్రసేనుడికి వధ్ర్యశుడు, ఇతనికి దివోదాసుడు, అహల్య పుట్టారు. అహల్యకు శతానందుడు గౌతమునివలన కలిగాడు. ఇతనికి సత్యధృతి. ఇతనికి ఒకకొడుకు, ఒకకూతురు కలిగారు. వేటకు వెళ్ళిన శంతనమహారాజు ఈ ఇద్దరు పిల్లల్ని దయతో ఇంటికి తీసుకువెళ్ళాడు. పిల్లవాడి పేరు కృపుడు, పిల్లపేరు కృపి. రాజా! ఈవిధంగా నీకు గౌతమపుత్రుల చరిత్ర చెప్పాను. దివోదాసు సంతతిగూర్చి చెపుతా విను.

దివోదాసు కొడుకు మిత్రయువు. ఇతనివల్ల మైత్రాయణీశాఖ ఏర్పడింది. ఈ శాఖవాళ్ళకు మైత్రేయులని పేరు. వీళ్ళందరూ క్షత్రియులు. భృగువంశంతో సంబంధం కలవాళ్ళు. సృంజయుని కొడుకు పంచజనుడు. ఇతనికి సోమదత్తుడు, ఈతనికి సహదేవుడు ఇతనికి సోమకుడు కొడుకులు. సోమకుని పుత్రుడు జన్తువు.

ఇతనికి పందమంది కొడుకులు అందరికంటే చిన్నవాడు పృషతుడు, ఇతనికి ద్రుపదుడు, ఇతనికి ధృష్టద్యుమ్నుడు, వీనికి ధృష్టకేతువు జన్మించారు.వీళ్ళందరూ అజమీఢుని వంశంవాళ్ళు, అజమీఢుని మూడవభార్య మీ పూర్వులకు తల్లి, ధూమిని వెయ్యిసంవత్సరాలు తపస్సు చేసింది. మితభోజనం చేస్తూ దర్భలపై పరుండేది. అజమీఢుడికి ధూమినికీ ఋక్షుడు పుట్టాడు. ఇతనికి సంవరణుడు, ఇతనికి కురువు. ఇతడు కురుక్షేత్రనగరాన్ని నిర్మించాడు.

ఇతని వంశం విశాలమైనది. ఈవంశీయులు కౌరవులు. కురుమహారాజుకు సుధన్వుడు, సుధనువు, మహాబాహువు పరీక్షిత్తు, ప్రవరుడు అని నలుగురు పుత్రులు. సుధన్వుని కొడుకు సుహోత్రుడు. ఇతనికి చ్యవనుడు, ఇతని కొడుకు కృతయజ్ఞుడు. ఇతనికి విశ్రుతుడు, ఇతనికి చైద్యోపరిచరుడు. ఇతనికి గిరికయందు బృహద్రథుడు, ప్రత్యగ్రహుడు, కుశుడు, మారుతుడు, యదువు, మత్స్యుడు, సత్త్ముడు అని ఏడుగురు జన్మించారు. అతని కుమార్తె 'కాలి', బృహద్రథుని కొడుకు కుశాగ్రుడు. ఇతనికి వృషభుడు, వీనికి పుష్పవంతుడు, ఇతనికి సత్య హితుడు, వీనికి ఊర్జుడు, ఇతనికి సంభవుడు. వీనికి పుట్టినవాడు రెండుముక్కలుగా ఉన్నాడు. జర అనే రాక్షసి ఆ రెండుముక్కల్నీ కలిపింది. ఇందు వల్ల అతని పేరు జరాసంధుడు. ఇతడు క్షత్రియులనందరినీ జయించాడు.ఇతని కొడుకు సహ దేవుడు. ఇతని పుత్రుడు ఉదాయువు. ఇతని కుమారుడు శ్రుతధర్ముడు. ఇతడు మగధదేశపు రాజు. 'కురు' మహారాజు రెండవపుత్రుడు పరీక్షిత్తుకు ధర్మాత్ముడైన జనమేజయుడు.

ఇతనికి శ్రుతసేనుడు, ఉగ్రసేనుడు, భీమసేనుడు అని ముగ్గురు పుత్రులు. వీళ్ళుకాక సురథుడు, మతిమంతుడు అనే యిద్దరు పుత్రులు కూడా ఉన్నారు. సురథుని కొడుకు విదూరథుడు. ఇతనికి ఋక్షుడు. వీనికి కురువు. మహారాజా! ఈవిధంగా మీవంశంలో ఇద్దరు ఋక్షులు, ఇద్దరు పరీక్షిత్తులు, ముగ్గురు భీమ సేనులు, ఇద్దరు జనమేజయులు పుట్టారు. రెండవ ఋక్షుడికి భీమసేనుడు, వీనికి ప్రతీపుడు. ఇతనికి ముగ్గురు కుమారులు. శంతను, దేవాపి, బాహ్లీకి. నీవు శంతనువంశంలో పుట్టావు. బాహ్లీకునకు సోమదత్తుడు. ఇతనికి భూరిశ్రవుడు, భూరి, శలుడు అని ముగ్గురు పుత్రులు. దేవాపి మునిధర్మాన్ని స్వీకరించాడు. ఇందుచే చ్యవనుడు అతన్ని పుత్రుడుగా స్వీకరించాడు.

రాజా! ఇప్పుడు శంతనువంశాన్ని చెపుతా. నీవు ఆవంశంలోనే జన్మించావు. శంతనువు రాజయ్యాడు. అతనికి గంగవలన దేవవ్రతుడు జన్మించాడు. ఇతడే భీష్ముడు. కౌరవవంశానికి పితామహుడు (తాత)/ 'కాలి' వలన శంతనుమహారాజుకు విచిత్రవీర్యుడు కలిగాడు. ఇతడు తండ్రికి ఇష్టుడు. కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు) విచిత్రవీర్యుని భార్యయందు పాండు, ధృతరాష్ట్ర, విదురులనే ముగ్గుర్ని కన్నాడు. ధృతరాష్ట్రుడు గాంధారియందు నూరుమంది పుత్రులను కన్నాడు. వాళ్ళలో దుర్యోధనుడు పెద్దవాడు. పాండురాజు కుమారుడు అర్జునుడు. ఇతని కొడుకు అభిమన్యువు. నీతండ్రి పరీక్షిత్తు అభిమన్యుని పుత్రుడు. రాజా! నీవు పుట్టిన పురువంశ చరిత్రను చెప్పాను. ఇప్పుడు తుర్వసుద్రుహ్యు 'అను' యదువంశమును వర్ణిస్తున్నాను. విను.

తుర్వసు కొడుకు వహ్ని, ఇతనికి బహ్లికుడు, ఇతని పుత్రుడు గోభాను. వాని పుత్రుడు విజయవంతుడైన త్రైసానువు. ఇతనికి కరంధముడు. ఇతనికి మరుత్తు. ఆవిక్షితమరుత్తనేవాడు వేరు. ఇతన్ని ఇదివరకే చెప్పాను. రాజైన మరుత్తు చాలా యజ్ఞాలు చేశాడు. గొప్పదక్షిణలిచ్చాడు. కాని పుత్రసంతానం లేదు. సమ్మత అనే ఒక్క కన్యమాత్రం అతనికి జన్మించింది. ఆకన్యను సంవర్తకుడనువాడికి దక్షిణగా ఇచ్చాడు. తరువాత ఆమెకే దుష్యంతుడు జన్మించాడు. ముసలితనంలో యయాతి శాపంచేత తుర్వసువంశం కూడా పూరువంశంలో కలిసిపోయింది. దుష్యంతుని కొడుకు కరుత్థాముడు. అతనికి 'తధాక్రీడుడు', ఇతనికి నలుగురు పుత్రులు:- పాండ్య, కేరల, కోల, చోల. వీళ్ళరాజ్యాలు వీళ్ళపేర్లతోటే ప్రసిద్ధి చెందాయి. 'ద్రుహ్యు' నకు బభ్రు, సేతు అనే యిద్దరు పుత్రులు. సేతువు పుత్రుడు అంగారుడు. ఇతనికి మరుత్పతి అని కూడ ప్రసిద్ధికలదు. పధ్నాలుగు సంవత్సరాలు ఘోరయుద్ధంచేసి అతికష్టంమీద యౌవనాశుడతన్ని చంపివేశాడు. అంగారుడి కొడుకు గాంధారుడు. అతని రాజ్యంకూడ గాంధారమే. గాంధారదేశపు గుర్రాలు మిక్కిలి శ్రేష్ఠములుగా తలచబడ్డాయి. 'అను' అనేవాడి కొడుకు ధర్ముడు. ఇతని కొడుకు ధృతుడు, వీనికొడుకు దుదుహుడు. ఇతనికి ప్రచేతుడు, వీనికి సుచేతుడు. రాజా! ఈవిధంగా నీకు అనువంశచరిత్ర చెప్పాను. ఇప్పుడు యదువుయొక్క వంశావళిని విస్తారంగా వర్ణిస్తాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
పూరువంశ పరంపర అనే ముప్పై రెండవ అధ్యాయము

☆☆☆

# ముప్పై మూడవ అధ్యాయము

## యదువంశ వర్ణన - కార్తవీర్యోత్పత్తి

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజైన యదువుకు ఐదుగురు కొడుకులు. వాళ్ళపేర్లు- సహస్రదుడు, పయోదుడు, క్రోష్టుడు, నీలుడు, అంజికుడు. సహస్రద పుత్రులు హైహయ, హయ, వేణుహయ అను ముగ్గురు. హైహయునకు ధర్మనేత్రుడు, ఇతనికి కార్తుడు, ఇతనికి సాహంజుడు. ఇతని పట్టణం సాహంజని. ఇతనికి మహిష్మంతుడు. ఇతని పట్టణం మాహిష్మతి. ఇతనికి భద్రశేణ్యుడు. ఇతడు కాశీనగరపు రాజు. ఇతనికి దుర్దముడు. వీనికి బుద్ధిమంతుడైన కనకుడు. వీనికి నలుగురు పుత్రులు- కృతవీర్యుడు, కృతేజుడు, కృతవర్మ, కృతాగ్ని. కృతవీర్యుని కొడుకు అర్జునుడు. ఇతని కుమారుడు కార్తవీర్యార్జునుడు. తన వెయ్యిచేతులతో ఏడుద్వీపాలతో కూడిన భూమిని జయించి దానికి రాజయ్యాడు. ఇతడు పదివేల సంవత్సరాలు తపస్సుచేసి దత్తాత్రేయుని పూజించాడు. దత్తాత్రేయుడు ప్రసన్నుడై నాలుగు వరాలిచ్చాడు. మొదటివరానికి వెయ్యిచేతులు, రెండవది అధర్మంగా ప్రవర్తించే వాళ్ళను నశింప చేయుట, మూడవది భూమినంతను జయించుటవలన ప్రజలను సంతోషపెట్టుట, నాల్గవది శత్రువులనందరినీ జయించి చివరకు బలవంతుడైన శత్రువుచేత మరణించుట అని నాల్గువరాలు. ఇతనికి కావాలనుకోగానే వేయి చేతులు పుట్టేవి. ఏడుద్వీపాలను జయించి అక్కడ ఏడువందల యజ్ఞాలు చేశాడు. గొప్ప దక్షిణలిచ్చేవాడు. ప్రతియజ్ఞంలోనూ బంగారు యూపస్తంభాలు, బంగారు అరుగులు తయారుచేయించేవాడు.

విమానాలలో విహరించే దేవతలు, అప్సరసలు, గంధర్వులూ నిత్యమూ అతని యజ్ఞంలో కలుసుకొని ఆ యాజ్ఞాలకు శోబ కలుగజేసేవాళ్ళు. గంధర్వరాజైన వరీదాసుని పుత్రుడు గంధర్వుడైన నారదుడు అతని యజ్ఞాలన్నిటిలోనూ గుణాలను గానంచేయటానికి నియమింపబడ్డాడు. అతడు కార్తవీర్యుని ప్రభావం చూచి ఆశ్చర్యపోయాడు. నారదుడిలా అన్నాడు. యజ్ఞదాన తపస్సులందు, శోభాజ్ఞానపరాక్రమము లందునూ కార్తవీర్యునికి సమానుడెవ్వడూ లేడు. అతడు ఏడుద్వీపాలలోనూ ఖడ్గమును, ధనుస్సునూ ధరించి రథంమీద సంచరిస్తూ ప్రజలకు యోగిలా కనబడేవాడు.

ఈవిధంగా ధర్మపరిపాలన చేస్తూ ప్రజలను రక్షించేవాడు. అతని రాజ్యంలో ఏ లోటూ కనబడేదికాదు. కార్తవీర్యుడు యాభైవేల సంవత్సరాలు రాజ్యం చేసి చక్రవర్తియై ప్రపంచంలో సమస్త శ్రేష్ఠవస్తువులనూ అనుభవించాడు. అతని కాలంలో యోగబలంచేత అతడే క్షేత్రపాలకుడుగా, అతడే పశుపాలకుడుగా, అతడే నీటిని వర్షించే మేఘంగా రూపొందాడు. యుద్ధరంగంలో వేయిభుజాలు ధరించినప్పుడు అతడు వెయ్యికిరణాలు గల సూర్యుని శోభను పొందేవాడు. తేజశ్శాలియైన కార్త వీర్యుడు కర్కోటకుని కుమారులైన సర్పగణాలను జయించి వాళ్ళ మాహిష్మతీ పట్టణాన్ని స్వాధీనం చేసుకొన్నాడు.

అతని భుజబలంచేత వర్షాకాల సముద్రవేగం కూడ ఎదురు ప్రవహించేది. నురుగుమాలతో శోభించే నర్మదానది తన తరంగాలతో భయపడుతూ తాకేది. భయంకరుడైన ఆరాజును చూచి మహాసర్పాలు తలలు కదిపేవి కావు. అతడు రావణుని జయించి తెచ్చి మాహిష్మతీ నగరంలో బంధించాడు. పులస్త్యుడు యాచింపగా రావణుని విడిచిపెట్టాడు. పరశురాముడు బంగారుతాడిచెట్లవనం వంటి ఈతని వెయ్యిచేతులను ఖండించాడు. కార్తవీర్యునికి కుమారులు వంద మంది. వాళ్ళలో జయధ్వజుడనువానికి తాలజంఘుడు పుత్రుడు. అతనికి వంద మంది పుత్రులు. వీళ్ళందరూ హైహయ వంశ మహాపురుషుల వంశంలో పుట్టిన వీతిహోత్ర, సుజాత, భోజ, అవన్తి, తౌండికేర, భరత, విక్రాంత పేర్లుగల రాజులు తాలజంఘువంశంలో పుట్టినవాళ్ళు.

వాళ్ళవంశం చాలా విస్తారమైనది. ఎక్కువమంది అవటంచేత వాళ్ళపేర్లు చెప్పటంలేదు. వృషుడు మొదలైన యాదవులు పుణ్యాత్ములు. వృషుడు మూల పురుషుడు. ఇతనికి మధువు. ఇతనికి వందమంది పుత్రులు. వీళ్ళలో వృషణుడి వల్లనే ఈ వంశం విస్తరించింది. వృషణునికి వృష్ణిగణం, మధువుకి మాధవ గణం, యదువుకు యాదవగణం, హైహయగణం జన్మించాయి. వీళ్ళలో శూర సేనుడనువాడు గొప్పవాడు. అతని దేశమునకుకూడ అతనిపేరే. ధనం నశించేది కాదు, పోయినవస్తువు దొరికేది కార్తవీర్యుని జన్మ తలచుకొన్నవాడికి.

మహారాజా! ఈవిధంగా యయాతి కొడుకులు ఐదుగురు భూమిని పోషించారు. వాళ్ళ వంశచరిత్రను చెప్పాను. యయాతి కొడుకులు ఐదుగురి వంశ వృత్తాంతం విన్నవాళ్ళు ఐదు ఇంద్రియాల్నీ వశం చేసుకోవటానికి సమర్థు

లొతారు. మరియు పుత్రులు, ఐశ్వర్యం, భూమి, ఆయుస్సు, కీర్తి ఈ ఐదింటినీ పొందుతారు. రాజా! ఇప్పుడు ఉత్తమ పురుషార్థంగల క్రోష్టువంశ చరిత్ర చెపుతా విను. ఈ వంశంలో వృష్ణివంశానికి అలంకారమైన శ్రీకృష్ణభగవానుడు జన్మించాడు. ఈ క్రోష్టువంశం వర్ణన విన్నవాడు అన్నిపాపాలనుండి విడువబడిన వాడగుచున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
యదువంశ వర్ణన - కార్తవీర్యోత్పత్తి అను ముప్పై మూడవఅధ్యాయము

☆☆☆

# ముప్పై నాల్గవ అధ్యాయము

## వృష్ణి వంశవర్ణన- అక్రూరాది పరిచయము

వైశంపాయనుడిలా చెప్పాడు.

క్రోష్టువనువాడికి గాంధారి, మాద్రి ఇద్దరు భార్యలు. గాంధారి బలిష్ఠుడైన 'అనమిత్రు'ని కన్నది. మాద్రి యుధాజిత్తు, దేవమీడుడు అను పుత్రులను కన్నది. ఈ ముగ్గురు పుత్రులచేత వృష్ణివంశము మూడుభాగాలుగా విడిపోయింది. యుధాజిత్తుకు 'వృష్ణి', 'అంధకుడు' అని యిద్దరు పుత్రులు. వృష్ణికి కూడా శ్వఫల్కుడు, చిత్రకుడు అని యిద్దరు కొడుకులు. మహాత్ముడైన శ్వఫల్కుడు ఉన్నచోట వ్యాధిభయం ఉండేదికాదు. వర్షాలు లేకపోవుట కూడ ఉండేదికాదు. ఒక సమయంలో కాశీనగరరాజ్యంలో మూడు సంవత్సరాలు వర్షాలు కురవలేదు.

అప్పుడు కాశీరాజు గొప్ప ఆదరంతో శ్వఫల్కుని తన రాజ్యానికి తీసుకు వచ్చాడు. అతడు రాగానే కాశీలో చక్కగా వర్షం కురిసింది. తరువాత కాశీరాజు తన కూతుర్ని గాందినిని శ్వఫల్కునికిచ్చి పెళ్ళి చేశాడు. గాందిని ప్రతిదినమూ బ్రాహ్మణులకు గోదానం చేసేది. ఆమె చాలారోజులు తల్లి గర్భంలోనే ఉండి పోయింది. ఒకరోజున తండ్రి బిడ్డా! ఇన్నాళ్ళు గర్భంలో ఎందుకు ఉన్నావు? త్వరగా జన్మించుము అన్నాడు. ఆ కన్య తండ్రీ! రోజూ ఒక ఆవును దానంచేసే ఏర్పాటు చేస్తే నేను పుడతాను అన్నది. తండ్రి అందుకు ఒప్పుకొన్నాడు. ఆమె పుట్టింది.

తరువాత శ్వఫల్కునిద్వారా గాందినికి అక్రూరుడు పుట్టాడు. ఇతడు దాత, యజ్ఞం చేయువాడు, వేదం తెలిసినవాడు. అతిథులంటే ప్రేమ కలవాడు.

అపానంగ, మద్గు, మృదుర, అరిమేజయ, అవిక్షిప, ఉపేక్ష, అరిమర్దన, శత్రుఘ్న, గృధ్రమీజ, అన్తక, ఆయూహ, ప్రతివాహ అనే పుత్రులు, ఒక అందగత్తె అయిన పిల్లకూడ పుట్టారు. అక్రూరుడికి మిక్కిలి అందగత్తె 'ఉగ్రసేని' భార్య. ఆమె గర్భంనుండి ప్రసేనుడు, ఉపదేవుడు అనే యిద్దరు పుత్రులు పుట్టారు. శ్వఫల్కపుత్రుడైన చిత్రకునకు పృథు, అశ్వగ్రీవ, అశ్వబాహు, సుపార్శ్వక, గవేషణ, అరిష్టనేమి, సుధర్ముడు, సుబాహు అనే పుత్రులు, శ్రవిష్ఠ, 'శ్రవణ' అనే యిద్దరు కన్యలు పుట్టారు. అశ్వకియందు దేవమీఢుషుడు శూరుడనేవాణ్ణి కన్నాడు.

ఇతనికి భోజకన్య 'మహిషి' యందు పదిమంది పుత్రులు కలిగారు. వాళ్ళలో వసుదేవుడు పెద్దవాడు. ఇతనికి ఆనకదుందుభి అని రెండవపేరు. భూలోకంలో వసుదేవుడువంటి అందగాడులేడు. ఇతని శరీరకాంతి వెన్నెలవలె ఉండేది. ఇతడు పుట్టిన తరువాత శూరుడికి దేవభోగ, దేవశ్రవ, అనాధృష్టి, కనవక, వత్సవంతుడు, గృంజిమ, శ్యామ, శమీక, గండూష అని తొమ్మిదిమంది కొడుకులు, పృథుకీర్తి, శృతదేవ, శృతశ్రవ, రాజాధిదేవి అని ఐదుగురు కన్యలూ పుట్టారు. కుంతిభోజుడు 'పృథ'ను తన కుమార్తెగా చేసుకొనుటకు అడిగితే శూరుడు ఆ కన్యను కుంతి భోజుడికి ఇచ్చాడు. కుంతిభోజుడి కుమార్తె అయిన తర్వాత కుంతి అనే పేరు వచ్చింది. 'అన్మ్యుడి'కి శ్రుతదేవయందు జగృహు పుట్టాడు.

చేదిదేశపు రాజైన దమఘోషునివల్ల శ్రుతశ్రవకు 'శిశుపాలుడు' జన్మించాడు. శిశుపాలుడు పూర్వజన్మలో హిరణ్యకశిపుడు. వృద్ధశర్మకు పృథుకీర్తి యందు కరూష దేశాధిపతి దంతవక్త్రుడు జన్మించాడు. కుంతిభోజుడు కుంతిని కుమార్తెగా చేసుకొన్నాడు. ఆమెను పాండురాజు పెండ్లి చేసుకొన్నాడు. ధర్మం తెలిసిన ధర్మరాజు ఆమెయందు యమునివలన, వాయుదేవునివలన భీముడు, ఇంద్రుని వలన ధనంజయుడు (అర్జునుడు) జన్మించారు. అనమిత్రునికి పుత్రుడు 'శిని'. ఇతనికి సత్యకుడు, ఇతనికి యుధానుడు(సాత్యకి), ఇతనికి అసంగుడు, ఇతనికి 'భూమి', వీనికి యుగంధరుడు. ఇక్కడికి వంశం పూర్తి అయింది. దేవభాగుడి కొడుకు ఉద్ధవుడు. ఇతడు గొప్ప పండితుడు. అశ్మకికి అనాధృష్టి వలన 'యశస్వి' జన్మించాడు. దేవశ్రవుని పుత్రుడు శత్రుఘ్నుడు, కిరాతులు అతన్ని తీసుకువెళ్ళి పెంచారు. అతడు పుట్టగానే విడిచిపెట్టబడ్డాడు. ఇతడే ఏకలవ్యుడని ప్రఖ్యాతి చెందాడు. పుత్రులులేని 'వత్సవాతు'కు వసుదేవుడు కాశికుడనే పుత్రుని దానం చేశాడు.

అట్లే సంతానంలేని గండూషుడికి విష్వక్సేనుడు చారుదేష్ణ, సుచారు, పంచాల, కృతలక్షణ అనే నలుగురు పుత్రులను దానంచేశాడు. చారుదేష్ణుడు యుద్ధం లేకుండా ఉండలేడు. చారుదేష్ణుడు రుక్మిణికి చివరికొడుకు. తంత్రజిత్తు, తంత్రి పాలుడు వీళ్ళిద్దరూ 'కనవకు'డి పుత్రులు. వీరుడు, అశ్వహనుడు 'గ్వంజిము'డి పుత్రులు. 'శ్యాముడి' కొడుకు అభీకుడు. శమీకుడు రాజసూయయజ్ఞం ప్రారంభించాడు. ధర్మరాజు ఇతనికి సహాయంచేస్తూ శత్రువులనందరినీ నశింప చేశాడు. ఇప్పుడు వసుదేవుని వీరపుత్రుల వృత్తాంతం వర్ణిస్తాను. మహారాజ! అనేక శాఖలతో కూడిన మూడుభాగాలైన విశాల వృష్ణివంశపు చరిత్ర విన్నవాడు ఎప్పుడూ అనర్థమును పొందడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
వృష్ణి వంశవర్ణన- అక్రూరాది పరిచయము అను ముప్పై నాల్గవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఐదవ అధ్యాయము

## శ్రీకృష్ణావతారము- కాలయవన జన్మ

వైశంపాయనుడిలా చెప్పాడు.

వసుదేవుని భార్యలు పద్నాలుగుమంది. వాళ్ళ పేరవి, రోహిణి, ఇందిర, విశాఖి, భద్ర, సునాస, సహదేవ, శాంతిదేవ, శ్రీదేవ, దేవరక్షిత, వృకదేవి, ఉపదేవి, దేవకి, సుతన, వడవ, వీళ్ళలో శ్రేష్ఠురాలు, రోహిణి, రోహిణి కడుపున వసుదేవుడికి రాముడు, సారణుడు, శఠుడు, దుర్దముడు, శ్వభ్రుడు, పిండారకుడు, ఉశీనరుడు, అనే పుత్రులు, చిత్ర అనే కన్య జన్మించారు. చిత్రకు అకస్మాత్తుగా మరణం సంభవించింది. ఆమె సుభద్ర అనే పేరుతో రోహిణికి పుట్టింది.

ఇలా రోహిణి సంతానం పదిమంది. గొప్ప యశశ్శాలియైన శ్రీకృష్ణుడు దేవకి కడుపున అవతరించాడు. నిశఠుడు రేవతి బలరాముల పుత్రుడు, సుభద్రార్జునుల కుమారుడు అభిమన్యువు. అక్రూరుడికి కాశీరాజు కూతురుకు సత్యకేతువు పుట్టాడు. ఇప్పుడు వసుదేవుడి ఏడుగురు భార్యలకు పుట్టిన వీరపుత్రుల పేర్లను, వృత్తాంతాన్ని చెపుతాను విను.

శాంతిదేవుడికి భోజుడు, విజయుడు, సుదేవకు వృకదేవుడు, గదుడు, సుదేవకు వృకదేవికి అవగాహుడు, త్రిశరాయణుడు, గార్గ్యుడు, త్రిగర్తరాజైన

దేవకునికి పురోహితులు, మహాత్ముడైన గార్గ్యుడు, ఇంద్రియనిగ్రహం కలవాడు, అతనిని నపుంసకుడని, అసత్యమైన కలహం జరిగింది. పన్నెండు సంవత్సరాలు గార్గ్యుడు తపస్సు చేశాడు. ఇతడు ఒక గొల్లపడుచుతో సంగమం చేశాడు. ఆమె గోపాలి అనే అప్సరస. ఆమె గర్భవతియై ప్రసవించిన తరువాత ఆ శిశువును విడిచివెళ్ళగా యవనుడనే రాజు ఆ పిల్లవానిని తనయింటికి తీసుకువెళ్ళి పోషించాడు. పిల్లవాడు దినదినాభివృద్ధి పొందాడు.

అతనికి కాలయవనుడనే పేరు వచ్చింది. కాలయవన జన్మకథ పూర్తి అయింది. కాలయవనుడు యుద్ధంచేయగోరుతూ బ్రాహ్మణులను అడిగాడు. నారదుడు వృష్ణి, అంధక వంశరాజులను గూర్చి చెప్పాడు. అప్పుడు అక్షౌహిణి సైన్యంతో మధురమీదికి దండెత్తాడు. వృష్ణి అంధక వంశీయులకు దూతను పంపాడు. వాళ్ళు గొప్ప బుద్ధిశాలియైన కృష్ణుని ముందుంచుకొని యవనుని భయం చేత ఆలోచించారు. అందరూ నిశ్చయించుకొని అందమైన మధురను విడిచి పారిపోయారు. కుశస్థలిలో ద్వారవతీప్రదేశంలో నివసించదలిచారు. ఈ శ్రీకృష్ణుని జన్మవృత్తాంతాన్ని పరిశుద్ధుడై ఇంద్రియనిగ్రహం కలిగి సర్వకాలము లందు వినిపించు విద్వాంసుడు ఋణంలేనివాడై సుఖపడతాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి హరివంశపర్వంలో
శ్రీకృష్ణావతారము- కాలయవన జన్మ అను ముప్పై ఐదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఆరవ అధ్యాయము

## జనమేజయ వంశవర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! కీర్తిశాలియైన వృజనవంతుడు క్రోష్టు పుత్రుడు. ఇతనికి 'స్వాహి', వీనికి పుత్రుడు 'ఉషద్గు'. యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞప్రభావంచే ఒక పుత్రుడు కలిగాడు. అతనిపేరు చిత్రరథుడు. ఇతడు గొప్పపనులందు ఆసక్తి కలవాడు. చిత్రరథుని పుత్రుడు శశబిందు గొప్పదాత. చివరకు రాజర్షుల సత్యమార్గమును ఆశ్రయించాడు. శశబిందు పుత్రుడు పృథుశ్రవుడు. ఇతనికి అంతరుడు, వీనికి సుయజ్ఞుడు, వీనికి ఉశత్తు, వీనికి శత్రుతాపనుడు, శినేయువు/శినేయు పుత్రుడు

మరుత్తుడు. ఇతడు ధర్మము నాచరించి 'కంబలబర్హి' అనే పుత్రుని పొందాడు. ఇతనికి శతప్రసూతి, శతప్రసూతికి రుక్మకవచుడు పుత్రుడు. పరాజిత్తు. ఇతనికి రుక్మేషు, పృథురుక్మ, జ్యామఘు, పాలిత, హరి మహాబలవంతులైన ఈ ఐదుగురూ పుత్రులు. రుక్మకవచుడు పాలితుడు, హరి అనే పుత్రుల్ని పోషించే భారం విదేహ రాజుకు వప్పచెప్పాడు. రుక్మేషు సింహాసనంపై కూర్చున్నాడు. అతని చిన్నతమ్ముడు పృథురుక్ముడు. అతని ఆజ్ఞను పాలించేవాడు. కొంతకాలం తరువాత ఈ యిద్దరు సోదరులూ కలిసి జ్యామఘుణ్ణి రాజ్యంనుంచి బయటకు వెళ్ళగొట్టారు. జ్యామ ఘుడు రాజ్యాశ వదలి ఆశ్రమవాసి అయ్యాడు.

కొంతకాలం తపస్సుచేసి బ్రాహ్మణుల ఆశీస్సులతో పరాక్రమించి జ్యామ ఘుడు ధనుస్సును ఎత్తాడు. రథంమీద ఎక్కి మరొకదేశం జయించాలని వెళ్ళాడు. అతడు ఒంటరిగా నర్మదానదిఒడ్డు, మృత్తికావతీ పట్టణం, ఋక్షవత్ పర్వతము జయించి శుక్తిమతీ నగరంలో నివసించాడు. పతివ్రత, గడుసుది అయిన శైబ్య' అతని భార్య. జ్యామఘుడు సంతానం లేకపోయినా మరొక వివాహం చేసుకోలేదు. యుద్ధంలో విజయం పొంది ఒక కన్యను తీసుకువచ్చాడు. భార్యకు భయపడి ఇది కోడలు అన్నాడు. అతని భార్య ఎవరికి కోడలు? అని అడిగింది. రాజు నీకే అన్నాడు. నీకు ముందుపుట్టే కొడుక్కి భార్య అవుతుంది అన్నాడు. ఈ మాటవిని ఆ కన్య కఠోరమైన తపస్సు ప్రారంభించింది. ఆమె తపస్సు ప్రభావం చేత ముసలి తనంలో శైబ్యకు ఒక పుత్రుడు కలిగాడు. అతని పేరు విదర్భుడు. అతడు యువకుడైన తరువాత ఉపదానవితో (ఆ కన్యతో) అతనికి వివాహం జరిగింది. అతనికి 'క్రథ', 'కౌశిక' అను యిద్దరు పుత్రులు కలిగారు. తరువాత మూడవ పుత్రుడు రోమపాదుడు పుట్టాడు.

రోమపాదుని కొడుకు బభ్రువు. ఇతనికి 'ఆహృతి', ఇతనికి విద్వాంసుడైన కౌశికుడు. ఇతని కొడుకు చేది. ఇతని వంశంలో పుట్టిన రాజులు చైద్యుల నబడుతు న్నారు. విదర్భుని పుత్రుడు భీముడు. ఇతనికి కుంతి, ఇతనికి ధృష్టుడు. ఇతనికి ఆవన్తుడు, దాశార్హుడు, విషహరుడు అని ముగ్గురు పుత్రులు. దాశార్హుడికి 'వ్యోమ', ఇతనికి జీమూతుడు. ఇతనికి బృహతి, ఇతనికి భీమరథుడు. ఇతనికి నవరథుడు, ఇతనికి దశరథుడు, ఇతని పుత్రుడు శకుని. ఇతనికి కరంభుడు, ఇతనికి దేవ రాతుడు. వీనికి దేవక్షత్రుడు. అతడు పూరువంశపు భద్రవతి కడుపున జన్మించాడు.

అతడు మధువంశీయులకు వంశోద్ధారకుడు. ఇతడు 'మధు'వని పేరుపొందాడు. మధు భార్య వైదర్భికి పురుద్వంతుడు జన్మించాడు. మధుకి ఇక్ష్వాకువంశపు కన్యకూడ ఒకభార్య. ఆమెకు సత్యవంతుడు. ఇతడు సాత్వతుల కీర్తిని వృద్ధి చేసినవాడు. మహారాజ! జ్యామఘుని వంశ వృత్తాంతాన్ని వింటే ప్రపంచంలో గొప్పకీర్తి, పుత్రప్రాప్తి కలుగుతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
జనమేజయ వంశవర్ణనము అను ముప్పై ఆరవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఏడవ అధ్యాయము

## కుకుర (బభ్రు) వంశవర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! కౌసల్య కడుపున పుట్టిన భజిన, భజమాన, దేవావృధ, అంధక, యాదవులకానందం కలిగించు వృష్ణి వీళ్ళందరూ సాత్వతకుని పుత్రులు. నేనిపుడు నలుగురు పుత్రుల వృత్తాంతం విస్తరంగా చెపుతున్నాను. భజమానుడికి సృంజయుని కన్యలు 'వాహ్యక', 'ఉపవాహ్యక' అను భార్యలిద్దరున్నారు. వీళ్ళ యిద్దరివల్ల భజమానునికి చాలామంది పుత్రులు కలిగారు. వాళ్ళలో క్రిమి, క్రమణ, ధృష్ణు, శూర, పురంజయ అను పుత్రులు వాహ్య కడుపున పుట్టారు. అయుతజిత్తు, సహస్రజిత్తు, శతజిత్తు, దశక అనువాళ్ళు ఉపవాహ్యక పుత్రులు.

దేవావృధుడను రాజు పర్ణాశానదిలో స్నానము, ఆచమనంచేసి ప్రశాంతమైన మనస్సుతో కఠోరమైన తపస్సు చేశాడు. అతడు నిత్యమూ పర్ణాశానదిలో స్నానం చేశేవాడు. ఇందుచే ఆ నది సంతోషించి అతనికి ఇష్టమైన పని చేయాలని తలంచింది. దేవావృధుడికి తగిన స్త్రీ కనబడక తానే అతనికి భార్య కాదలచింది. పర్ణాశ ఒక కన్యకరూపాన్ని పొంది దేవావృధుని భర్తగా వరించింది. రాజు అందుకు అంగీకరించాడు. కొన్నిరోజులకు పర్ణాశ గర్భిణి అయింది. పదిమాసాలు నిండిన తరువాత ఒక పుత్రుని కన్నది. అతని పేరు 'బభ్రు'. ఇతడు తన యోగబలంచేత అంతటా ఒకేమారు కనిపించేవాడని చెపుతారు. ఇతడు తండ్రికి తగినవాడు. దేవతాసమానుడు. ఇతడు యుద్ధభూమిలో ఏడువందల అరవైఆరు యోధులను సంహరించాడు. బుద్ధిమంతుడైన బభ్రు బ్రహ్మవాది, అనేక సద్గుణాలు కలవాడు.

సాత్వతవంశీయులలో అతడు గొప్పకీర్తి గడించినవాడు. ఇతని వంశం మిక్కిలి విశాలమైనది.

మృత్తికావత నగరరాజు భోజుడు. దృఢాశ్వుని కుమార్తెకు, అంధకవంశానికి చెందిన 'కుకుర', భజమాన, శమి, కంబలబర్హి అనే నలుగురు పుత్రులు కలిగారు. వాళ్ళలో కుకురుని కుమారుడు ధృష్ణువు. ఇతనికి పోతరోముడు, వీనికి తైత్తిరి, ఇతనికి పునర్వసు, ఈతనికి అభిజిత్తు పుత్రులు. ఆహుకుడు, ఆహుకి కూడ ఈతని సంతతియే. ఆహుకుడు నాలుగుదిక్కులనూ జయించినవాడు. ఆహుకికి అవన్తిరాజుతో వివాహం జరిగింది. ఆహుకునికి ఇద్దరు పుత్రులు. ఒకడి పేరు దేవకుడు, రెండవవాడు ఉగ్రసేనుడు. దేవకుడికి దేవవంతుడు, ఉపదేవుడు, సుదేవుడు, దేవరక్షితుడు అనే నలుగురు పుత్రులు. దేవకి, శాంతిదేవ, సుదేవ, దేవరక్షిత, వృకదేవి, ఉపదేవి, సునామ్ని అనే ఏడుగురు కన్యలు జన్మించారు. ఆహుక పుత్రుడైన ఉగ్రసేనుడికి కంసుడు, న్యగ్రోధుడు, సునాముడు, కంకుడు, శంకుడు, రాష్ట్రపాలుడు, సుతను, పుష్టిమంతుడు, అనాధృష్టి అని తొమ్మిదిమంది కొడుకులు, కంసవతి, సుతను, రాష్ట్రపాలి కంక అని ఐదుగురు పుత్రికలు ఉన్నారు. పుత్రులలో కంసుడు పెద్దవాడు.

మహారాజ! ఈవిధంగా కుకురవంశమందు పుట్టిన ఉగ్రసేనుడు అతని సంతానంయొక్క వృత్తాంతం చెప్పి వినిపించాను. కుకురవంశ వృత్తాంతం విన్నవారికి వంశవృద్ధి కలుగుతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
కుకుర (బభ్రు) వంశవర్ణనము ముప్పై ఏడవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఎనిమిదవ అధ్యాయము

## భజమాన వంశ, స్యమంతకమణి వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! మహారథి విదూరథుడు భజమానుని పుత్రుడు. ఇతనికి ఇద్దరు కొడుకులు రాజాధిదేవుడు, శూరుడు. రాజాధిదేవుడికి దత్తుడు, అతిదత్తుడు, శోణాశ్వుడు, శ్వేతవాహనుడు, శమి, దండశర్మ, దండశత్రు, శత్రుజిత్తు అనే

పరాక్రమవంతులైన ఎనిమిదిమంది పుత్రులు, శ్రవణ, శ్రవిష్ఠ అనే ఇద్దరు పుత్రికలు. శమికి ప్రతిక్షత్రుడు, ఇతనికి భోజుడు, వీనికి హృదీకుడు పుత్రులు. హృదీకుని పుత్రులలో కృతవర్మ పెద్దవాడు. శతధన్వుడు మధ్యవాడు. దేవర్షి చ్యవనుని ఆశీర్వాదంచేత శతధన్వుడికి, భిషక్కు, వైతరణ, సుదాన్త, విదాన్త అను నలుగురు పుత్రులు, అట్లే కామద, కామదంతిక అనే ఇద్దరు కన్యకలు పుట్టారు. కంబల బర్హిషుడికి దేవవన్తుడు, అసమేజుడు, నామసమేజుడు అనే ముగ్గురు పుత్రులు. అంధకుడు సంతానంలేని అసమేజుడికి సుదంష్ట్ర, సుచారు, కృష్ణుడనే పుత్రులు ముగ్గురుని ఇచ్చాడు. ఈవిధంగా అంధకవంశం వీరుల వృత్తాంతం చెప్పి వినిపించాను. ఈ అంధక కథను నిత్యమూ చదివి మనస్సుకు పట్టించుకున్నవాడు విస్తారమైన సంతతి కలవాడౌతాడు.

గాంధారి, మాద్రి వీళ్ళిద్దరూ క్రోష్టరాజుకు భార్యలు. గాంధారికి శత్రువిజయి అయిన అనమిత్రుడు పుత్రుడు. యుధాజిత్తు, దేవమీఢుడు మాద్రికి పుత్రులు. అనమిత్రుని కొడుకు నిఘ్నుడు. ఇతనికి ఇద్దరు పుత్రులు ప్రసేనుడు. సత్రాజిత్తు. ప్రసేనుడు ద్వారకాపట్టణమందున్నపుడు సత్రాజిత్తు సముద్రంనుంచి స్యమంతక మణిని పొందాడు. సూర్యుడికి మిత్రుడు సత్రాజిత్తు. ఒకనాడు చీకటితో స్నానాదులను పూర్తిచేసి రథంమీద కూర్చొని సూర్యుని ఉపస్థానం(స్తోత్రం) చెపుతూ సముద్రం ఒడ్డున ఉన్నాడు. సూర్యుడు అప్పుడు ఎదురుగా వచ్చి నిలిచాడు. అప్పుడు సత్రాజిత్తు మహాత్మా! నేను నిత్యమూ నిన్ను చూస్తున్నాను. నీతో స్నేహం వల్ల నాకేం ప్రయోజనం కలిగింది? అని అడిగాడు. సూర్యుడాతని మాటవిని స్యమంతకమణిని తన కంఠంనుంచి తీసి రహస్యంగా ఉంచాడు. సత్రాజిత్తు క్షణకాలం కబుర్లు చెప్పి వెళ్ళేటప్పుడు మహానుభావా! లోకాన్ని ప్రకాశింపచేసే మీ మణిని నాకివ్వండి అని అడిగాడు. సూర్యుడు మణిని అతనికిచ్చాడు.

సత్రాజిత్తు ఆ మణిని ధరించి తన పట్టణానికి వచ్చాడు. పట్టణంలో జనులు సూర్యుడే వస్తున్నాడని నలువైపులకూ పరుగెత్తారు. ఇలా ద్వారకానగరాన్ని ఆశ్చర్య పరుస్తూ తన ఇంటికి వెళ్ళాడు. తరువాత సత్రాజిత్తు ఆ మణిని తన సోదరుడైన ప్రసేనజిత్తుకిచ్చాడు. అప్పటినుండి వృష్ణి, అంధకవంశాల వారి ఇళ్ళల్లో బంగారం వర్షం కురవటం ప్రారంభించింది. కావలసినపుడు వర్షాలు కురిసేవి. మనోవ్యథలు, వ్యాధులు నశించాయి. తరువాత శ్రీకృష్ణుడు ఆ మణిని పొందాలనుకున్నాడు. కాని తీసుకోలేదు. తరువాత ఒకనాడు ప్రసేనుడు ఆ మణిని ధరించి వేటకు

వెళ్ళాడు. అక్కడ ఒక సింహం అతన్ని చంపింది. ఆ మణిని చేతపట్టుకొని పారి పోతుండగా గొప్పఎలుగుబంటు ఆ సింహాన్ని చంపి మణిని తీసుకొని తన గుహలోకి వెళ్ళింది. మణికోరి శ్రీకృష్ణుడే ప్రసేనుని చంపి ఉంటాడని వృష్ణి అంధక వంశం వీరులనుకొన నారంభించారు.

శ్రీకృష్ణుడు వారి అపోహను తొలగించుటకై మణిని వెదకటానికి ప్రతిజ్ఞ చేశాడు. ప్రసేనుని అడుగుల గుర్తులు చూస్తూ అడివికి వెళ్ళాడు. అతనితో సేవకులు కూడ చాలామంది వెళ్ళారు. చాలాచోట్ల వెతకగా చివరకు ఒకచోట ప్రసేనుడు గుర్రంతో పాటు చచ్చిపడి ఉన్నాడు. అతనివద్ద మణిలేదు. తరువాత దగ్గరలోనే ఒక సింహం చచ్చిపడి ఉంది. అక్కడ ఎలుగుబంటి అడుగుల గుర్తులు కనబడ్డాయి. అప్పుడు ఆ గుర్తులబట్టి శ్రీకృష్ణుడు గుహవద్దకు వెళ్ళాడు. గుహలోపల స్త్రీల మధురవాక్కు వినిపించింది. ఒకదాది ఎలుగుబంటి శిశువును ఆడిస్తోంది. పిల్లవాడు ఏడుస్తున్నాడు. అతన్ని ఓదార్చటానికి దాది చెపుతోంది. "సింహం ప్రసేనుణ్ణి చంపింది. సింహాన్ని జాంబవంతుడు చంపాడు. ఓ సుకుమార! ఏడవకు, నీదే యీమణి" అని.

ఈమాటలు విని శ్రీకృష్ణుడు, బలరాముడు మొదలగువారిని గుహ వెలుపల నుంచి తానొక్కడే గుహలో ప్రవేశించాడు. అక్కడ జాంబవంతుడు కృష్ణుని చూచి అతనితో యుద్ధానికి దిగాడు. ఇరవైయొక్కరోజులు వరకూ ఇద్దరికీ బాహుయుద్ధం జరిగింది. ఆలస్యం కావటంచేత బలరాముడు మొదలైన యాదవులు ద్వారకా నగరానికి తిరిగి వెళ్ళారు. కృష్ణుడు చచ్చిపోయాడని సాటింపు వేశారు. శ్రీకృష్ణుడు మహాబలవంతుడైన గొప్పఎలుగుబంటిని(జాంబవంతుని) ఓడించి స్యమంతక మణిని, భల్లూకరాజు కూతురు జాంబవతిని స్వీకరించాడు. శ్రీకృష్ణుడ తన అపవాదును పోగొట్టుకొనుటకు ఆ మణిని సాత్వతవంశీయుల సమక్షంలో సత్రా జిత్తుకు ఇచ్చివేశాడు. సత్రాజిత్తుకు పదిమంది భార్యలు. వాళ్ళపుత్రులు వంద మంది. వాళ్ళలో పేరు పొందినవాళ్ళు ముగ్గురు- భంగకారుడు, వాతపతి, ఉపస్వా వంతుడు. కుమార్తెలు ముగ్గురు- స్త్రీరత్నమైన సత్యభామ, వ్రతిని, ప్రస్వాపిని. ఈ ముగ్గురినీ శ్రీకృష్ణుడికి భార్యలుగా ఇచ్చాడు.

సత్రాజిత్తు కొడుకు భంగారకుడికి ఇద్దరు పుత్రులు- సమాక్షుడు, దారేయుడు. మాద్రీయుధా జిత్తుల కుమార్తె పృశ్ని. ఈమెకు శ్వఫల్క, చిత్రకులు ఇద్దరు పుత్రులు. శ్వఫల్కుని భార్య కాశీరాజు కూతురు గాందిని. ఆమెతండ్రి నిత్యమూ

గోదానం చేశేవాడు. గాందిని కడుపున శ్రుతవంతుడు అక్రూరుడు, ఉపమద్గు. అరిమేజయమద్గు, గిరిక్షిప, ఉపేక్ష, ధార్మికుడైన గృధ్రుడు, ఓజాన్తకుడు, అవాహ, ప్రతివాహ అనే పుత్రులు, సర్వాంగసుందరియైన ఒకకన్య జన్మించారు. ఆమె సాంబునికి భార్య అయింది. అక్రూరుడికి ఉగ్రసేనివలన సుదేవుడు, ఉపదేవుడు ఇద్దరు పుత్రులు. చిత్రుకునికి పృథు, విపృథు, అశ్వసేన, సుపార్శ్వక, గవేషణ అనే ఐదుగురు పుత్రులు. అరిష్టనేమికి ధర్మ, ధర్మభృత్తు, సుబాహు, బహుబాహు అనే పుత్రులు, శ్రవిష్ఠ, శ్రవణ అనే ఇద్దరు పుత్రికలు. శ్రీకృష్ణభగవానుని అపవాద కథను విన్నవాళ్ళు ఎప్పుడూ అపవాదు రానివాళ్ళు అవుతారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
భజమాన వంశ, స్యమంతకమణి వర్ణనము అను ముప్పై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై తొమ్మిదవ అధ్యాయము

## కృష్ణుడు శతధన్వుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! శ్రీకృష్ణుడు సత్రాజిత్తుకిచ్చిన మణిని అక్రూరుడు శతధన్వుని ద్వారా అపహరింపచేసి స్వాధీనం చేసుకొన్నాడు. కృష్ణుని ద్వారా సత్రాజిత్తుకు మణి చేరినప్పటినుండీ అక్రూరుడు సత్యభామా మణిని అడగటం ప్రారంభించారు. వాళ్ళకోరిక ఫలించకపోయేటప్పటికి శతధన్వుడు సత్రాజిత్తును చంపి మణిని అక్రూరుడికి ఇచ్చాడు. అప్పుడు అతడు మణి తనవద్ద ఉన్నదని ఎవనికీ చెప్ప కుండునట్లు శతధన్వునిచే ప్రతిజ్ఞ చేయించాడు. ఈసమయంలో తండ్రి మరణం చేత దుఃఖిస్తున్న సత్యభామ రథంమీద హస్తినాపురానికి వెళ్ళింది. అక్కడ ఆమె తనభర్తకు శతధన్వుని పని చెప్పి దుఃఖించమొదలుపెట్టింది. ఆ సమయంలో లక్కయింటిలో తగలబడిపోయిన పాండవులకు తర్పణం మాత్రంచేసి తక్కిన పనినంతనూ సాత్యకికి వప్పచెప్పి శ్రీకృష్ణుడు త్వరగా ద్వారకకు వచ్చి బల రామునితో ఇలా అన్నాడు!

ప్రసేనుని సింహం చంపింది. శతధన్వుడు సత్రాజిత్తును చంపాడు. ఈ పరిస్థితిలో స్యమంతకమణి నాకు చెందవలసియున్నది. కాబట్టి నీవు ఒక త్వరగా

వెళ్ళే రథంమీద వెళ్ళి శతధన్వుని చంపి మణిని తీసుకురా. అప్పుడు స్యమంతక మణి మనచేతిలో ఉంటుంది. తరువాత శతధన్వుడికీ కృష్ణుడికీ ఘోర యుద్ధం జరిగింది. అప్పుడు అన్నిదిక్కులా అక్రూరుడి కోసం చూచాడు. ఆ యుద్ధంలో అక్రూరుడు శతధన్వుడికి సహాయం చేయలేదు.

అప్పుడు శతధన్వుడు మిక్కిలి వేగంగా వెళ్ళే గుర్రాన్ని ఎక్కి పారిపోయాడు. చాలాదూరం వెళ్ళాక గుర్రం అలిసిపోయింది. అప్పుడు శత ధన్వుడి దగ్గరకు రథం మీద కృష్ణుడు వచ్చేశాడు. శతధన్వుడు గుర్రాన్ని వదిలేసి కాళ్ళతో పరుగెత్తాడు. శ్రీకృష్ణుని రథం, గుర్రాలుకూడ అలిసిపోయాయి. అప్పుడు శ్రీకృష్ణుడు బలరాముడితో అన్నా! గుర్రాలు అలిసిపోయాయి. నీవిక్కడనే ఉండు. నేను శతధన్వుని వెంట పరుగెత్తి మణిని లాక్కొనివస్తాను. అని శ్రీకృష్ణుడు శతధన్వుని వెంట పరుగెత్తి మిధిలానగరంవద్దకు వచ్చాక శతధన్వుని చంపివేశాడు. కాని అతని వద్ద మణి దొరకలేదు.

అప్పుడు బలరాముడి దగ్గరకు వచ్చాడు. బలరాముడు కృష్ణా! మణి యిమ్మన్నాడు. అతనిదగ్గర మణి లేదన్నాడు కృష్ణుడు. అప్పుడు బల రాముడు కోపించి మాటిమాటికీ నిందించి నీవు నాకు తమ్ముడివి కనుక నేనేమీ అనలేకపోతున్నాను. నీకు శుభమగుగాక! నేను వెళ్తున్నా. నాకు ద్వారకతోకాని, నీతో కాని, వృష్ణివంశం వాళ్ళతోకాని పనిలేదు అనిపలికి మిధిలానగరంలో ప్రవేశించాడు. మిధిలానగరరాజు బలరాముని మిక్కిలి ఆదరించాడు.

అక్రూరుడు స్యమంతకమణిని రక్షించటానికి నేను యజ్ఞంచేస్తూ ఉంటే నాతో ఎవ్వడూ దెబ్బలాటకు రాడని దీక్షాకవచాన్ని ధరించాడు. అనేక యజ్ఞాలు చేయ మొదలుపెట్టాడు. అతని యజ్ఞాలు వరసగా అరవైఏళ్ళు సాగాయి. ఈ సమయంలోనే దుర్యోధనుడు మిధిలకు వెళ్ళాడు. అక్కడ బలరామునివద్ద గదా యుద్ధాన్ని నేర్చుకొన్నాడు. తరువాత శ్రీకృష్ణుడు మహారధికులైన వృష్ణివంశం వాళ్ళను, అంధక వంశంవాళ్ళనూ, మహాపురుషులను వెంటబెట్టుకొని వెళ్ళి బలరాముని బ్రతిమాలి ద్వారకానగరానికి తీసుకువచ్చాడు. అక్రూరుడు బంధువులతో కలిసి సత్రాజిత్తును చంపి ద్వారకను విడిచిపెట్టి అంధకవంశీయులతో వేరొకచోటికి వెళ్ళిపోయాడు. మహాత్ముడైన కృష్ణుడు జ్ఞాతులలో భేదబుద్ధి ఏర్పడు తుందని అక్రూరుణ్ణి ఉపేక్షించి వదిలేశాడు. అక్రూరుడు ద్వారకను విడిచివెళ్ళగానే వర్షాలు కురవలేదు. వర్షాలు లేక రాజ్యం చాల నశించింది.

అప్పుడు "కుకుర", అంధకవంశజనులు అక్రూరుని బ్రతిమాలారు. దానపతి అక్రూరుడు రాగానే వర్షం కురిసింది. అక్రూరుడు శ్రీకృష్ణుని సంతోషపెట్టుటకు తనతోబుట్టువును కట్టబెట్టాడు. శ్రీకృష్ణుడు అక్రూరునిదగ్గర మణి ఉందని తెలుసుకొని సభలో నీవద్ద ఉన్న మణిని ఇమ్ము. బలరాముడికి నామీద అనుమానం ఉండుటచే నాపై కోపంతో ఉన్నాడు అని చెప్పగా అక్రూరుడు మణిని ఇచ్చేశాడు. శ్రీకృష్ణుడు అక్రూరుని సరళబుద్ధిచే ప్రసన్నుడై ఆ మణిని మరల అక్రూరుడికే ఇచ్చివేశాడు. అక్రూరుడు మణిరాగానే దాన్ని ధరించాడు. దానితో సూర్యునివలె ప్రకాశించాడు. పవిత్రతతో, శాంతమైన మనస్సుతో, నియమంగా ఈ కథను విన్నవాళ్ళు సమస్తశుభాలను, కోరికలను పూర్తిచేసుకుంటారు. వాళ్ళ కీర్తి బ్రహ్మ లోకం వరకూ వ్యాపిస్తుంది. ఇది సత్యమని నీకు చెపుతున్నాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
కృష్ణుడు శతధన్వుని చంపుట అను ముప్పై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నలభైయవ అధ్యాయము

## వరాహాది అవతారముల వివరణ

జనమేజయుడిలా అడిగాడు.

మహానుభావా! నేను పురాణాల్లో అవతారకథల సందర్భంలో సజ్జనులు, అమిత తేజశ్శాలియైన నారాయణుడు వరాహరూపం ధరించాడని చెప్పగా విన్నాను. కాని ఆయన చరిత్ర, అనేకవిధాలైన ఆయన గుణములు, పనులు మొదలైనవాటిని బాగా ఎరుగను. ఒకప్పుడు ఒకానొక యజ్ఞంలో చాలామంది బ్రాహ్మణులు ఒకచోట చేరారు. వాళ్ళద్వారా వేదవ్యాసుడు చెప్పిన వరాహచరిత్ర మాట విన్నాను. నారాయణుడు వరాహరూపం ధరించి తన కోరలతో భూమిని, సముద్రంనుంచి పైకి తెచ్చాడని తెలిసింది. ఇప్పుడు విస్తృతంగా ఆయన అవతారం, అతని పని వీటినన్నిటినీ బాగా వర్ణించండి. విష్ణుతత్వాన్ని వివరించి చెప్పండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
వరాహాది అవతారముల వివరణ అను నలభైయవ అధ్యాయము

☆☆☆

# నలభై ఒకటవ అధ్యాయము

## విష్ణువు-వరాహ నృసింహాది అవతార వర్ణనము

వైశంపాయనుడిలా పలికాడు.

మహారాజ! నీవు నాపై పెద్ద ప్రశ్నల బరువు మోపావు. అదృష్టంవల్ల నీవు ఈవేళ శ్రీకృష్ణునికథ వినటానికి ఉత్సాహంతో ఉన్నావు. నేను నాశక్తి కొలది శ్రీకృష్ణభగవానుని కథ చెపుతున్నాను. విను.

వేదం బాగా తెలిసినవాళ్ళు, బ్రాహ్మణులు సహస్రాక్షుడని, సహస్రముఖుడని, సహస్రపాదుడని, సహస్రశీర్షుడనీ, సహస్రహస్తుడని, సహస్రబాహుడని, సహస్ర జిహ్వుడని, సహస్రకిరీటుడని ఎవనిని పొగడుతున్నారో, ఎవడు అక్షయుడు, హవనుడు, సవనుడు, ద్రవ్యము, హోత పవిత్రమైన పాత్ర అయిఉన్నాడో, ఎవడు యజ్ఞవేది, దీక్ష, చరువు, స్రువము, స్రుక్కు, సోమరసం, శూర్పం(చాట), ముసలం (రోకలి), ప్రోక్షణీపాత్ర, దక్షిణాయనము అయిఉన్నాడో, ఎవడు యజుర్వేది, సామవేది బ్రాహ్మణుడో, ఎవడు యజ్ఞంలో సదస్యుడో, సదనము, సభ, యూపం, సమిధలు, దర్భలు, చమస, ఉలూఖలం(రోలు), ప్రాగ్వంశం, యజ్ఞభూమి, ఋత్విక్కు, స్థండిలం(అరుగు), ఏకహాయనీశకటం మొదలైనవి సోమక్రయాది వస్తువులు, స్థావరం, జంగమం, ప్రాశ్చిత్తం, అర్ఘ్యం, కుశ అయిఉన్నాడో, ఎవడు మంత్రం, యజ్ఞవహం, వహ్నిభాగం, భాగవహం, అగ్రేభుజ, సోమభుజ, హుతార్చి, ఉదాయుధ, శాశ్వత, విభు శబ్దాలతో చెప్పబడుచున్నాడో, ఆ శ్రీవత్సమనే పుట్టుమచ్చగలవాడు, లక్ష్మీదేవితో కూడినవాడు, దేవదేవుడు ఐన నారాయణుడు అనేకమార్లు అవతరించాడు. ఆయన మళ్ళీ అవతరిస్తాడని కూడ నేను ప్రజాపతి నోటినుండి విన్నాను.

ఓ మహారాజా! భగవంతుడు విష్ణుమూర్తి దేవలోకాన్ని విడిచి ఎందుకు వసుదేవునింటిలో జన్మించాడు? అనే నీ ప్రశ్న చాలా పవిత్రమైనది. ఈప్రశ్నను గూర్చి నీకు ఆ ప్రభువుయొక్క గొప్పతనాన్ని, చరిత్రను మొదటినుండి చివరివరకు విని పిస్తాను. నీవు పరిశుద్ధము, శాన్తము ఐన మనస్సుతో విను. సమస్తప్రాణులకు అంతరాత్మయైన భగవంతుడు దేవతలకు, మనుష్యులకు శుభంకొరకు

మాటిమిటికీ అవతరిస్తూ ఉంటాడు. భగవంతుడైన విష్ణుని పవిత్రచరిత్రను వినటం పవిత్ర పురాణంతో వేదంతో సమానమైన పుణ్యఫలాన్ని ఇస్తుంది. అందుచేత నీవు ప్రశాంతమైన మనస్సుతో తన్మయత్వంతో ఈ చరిత్ర విను.

రాజా! లోకంలో ధర్మం ఎప్పుడు తగ్గిపోతుందో అప్పుడు ధర్మాన్ని స్థాపించ డానికి భగవంతుడు భూమిమీద అవతరిస్తాడు. ఇలాంటి సమయంలో భగవంతుని ఏ స్వరూపం అవతరిస్తుందో దానిని రాజసమూర్తి అంటారు. అతని గొప్పదైన స్వరూపం ఎల్లప్పుడూ స్వర్గంలో ఉండి చేయశక్యంకాని తపస్సును చేస్తూ ఉంటుంది. అది అతని సాత్వికమూర్తి. అతనియొక్క ఏ రూపం సృష్టిలయములను నిర్వహించుటకు యోగనిద్రలో మునిగిఉంటుందో అది తామసమూర్తిగా తలచ బడుచున్నది. భగవంతుడు ఒక వెయ్యిసంవత్సరాలు యోగనిద్రలో ఉంటాడు. వెయ్యి సంవత్సరాలు పూర్తి అయిన తరువాత మళ్ళీ సృష్టి ప్రారంభిస్తాడు.

ఆ సమయంలో బ్రహ్మ లోకపాలకులను చంద్ర, సూర్య, అగ్ని, కపిలముని, సప్తర్షిగణము, శివ, వాయు సముద్రాలను, మహానుభావులైన సనత్కుమార, మను మొదలగు వారందరనూ ఆ మహాప్రభువు సృష్టిస్తాడు. ఈసమయంలోనే తేజశ్శాలియైన ఆ పురాణ పురుషుడే గ్రామములు, నగరములు మొదలైనవాటిని కూడ సృష్టిస్తాడు. వెయ్యి యుగాలు పూర్తిఅయిన పిమ్మట సమస్తసృష్టి అతని శరీరంలో లీనమౌతుంది. సమస్త ప్రపంచమూ నశించిన తరువాత మధుకైటభులనే ఇద్దరు రాక్షసులు విష్ణుమూర్తితో యుద్ధానికి సిద్ధపడతారు. అప్పుడు భగవంతుడు వాళ్ళకు వరాలిచ్చి ఆ సముద్రంలోనే చంపుతాడు. పూర్వం భగవంతుడు పాల సముద్రంలో పడుకొని యోగనిద్రలో ఉన్నాడు. అప్పుడతని బొడ్డునుండి ఒక తామరపువ్వు పుట్టింది. ఆ కమలంనుండే బ్రహ్మాదిదేవతలు, ఋషులు పుట్టారు. ఇందువల్లనే పురాణాలలో భగవంతుని ఆ అవతారాన్ని పుష్కరావతారమన్నారు.

మహారాజ! మహాత్ముడైన నారాయణునియొక్క వరాహావతారం మిక్కిలి వినసొంపైనది. ఈ అవతారంలో నారాయణుడు వరాహరూపం ధరించి సము ద్రంలో చొరబడ్డాడు. నీటిలో మునిగిఉన్న వనాలతో, పర్వతాలతో కూడిన భూమిని కోరలతో పైకితెచ్చాడు. వరాహమూర్తికి నాలుగువేదాలు కాళ్ళు. యూపస్తంభం కోర, క్రతువు(యజ్ఞము) దంతాలు. చితి ముఖము, అగ్ని నాలుక, దర్భలు రోమాలు, రాత్రింబవళ్ళు నేత్రాలు. వేదాంగాలు చెవి అలంకారాలు. ముక్కు,

స్రువం ముఖము. సామగానం కంఠస్వరం. ధర్మం, సత్యం మోకాళ్ళు. కర్మ పరాక్రమ సత్కారము. ప్రాయశ్చిత్తాలు ఘోరములైన గోళ్ళు, ఉద్గాత అస్త్రం, హోమం లింగము, ఓషధులన్నీ వృషణ్ణాల్లో ఉండే వీర్యం, వాయువు అంతరాత్మ. మంత్రం పృష్ఠము, సోమరసం రక్తము, వేది భుజశిరస్సు, హవిస్సు గంధం. హవ్యకవ్యములు వేగము (తుమ్ము, ఆవలింత మొదలైనవి).

శరీరం ప్రాగ్వంశము. హృదయం దక్షిణ. స్వాధ్యాయం స్వీకారము. పెదవులు అలంకారాలు. ధర్మాన్ని స్థాపించటానికి మహావీరుని రూపంగా మారుటయే అలంకారస్వరూపము. అనేకవిధాలైన ఛందస్సులు నడక. రహస్యములైన ఉపనిషత్తులు ఆసనము. నీడ భార్యగా మారింది. ఈ యజ్ఞవరాహ రూపము ధరించిన పరమాత్మ అనేకవిధములైన దీక్షలచే పూజింపబడ్డవాడు, దక్షిణ హృదయంగా కలవాడు. యోగమందాసక్తి కలవాడు. మహాయజ్ఞస్వరూపుడు. వేదములు పెదవులుగా గలవాడు. ప్రావర్గ్యభూషణుడు, మహాయోగియైన విష్ణువు మేరుపర్వత శిఖరంతో సమానుడు, అంత ఉన్నతుడు అయ్యాడు. తరువాత ఆయన లోకకళ్యాణంకోసం నీటిలోపల దూరి యజ్ఞవరాహమూర్తి ద్వారా పర్వతాలతో, వనాలతోకూడిన భూమిని బయటకు తీశాడు. ఇంతవరకు భగవంతుని వరాహావతార వృత్తాంతం చెప్పాను. దీనితర్వాత నరసింహావతార చరిత్ర చెపుతున్నాను.

పూర్వం సత్యయుగసమయంలో దేవతలకు శత్రువు రాక్షసులకు మొదటివాడైన హిరణ్యకశిపుడు పదకొండువేల సంవత్సరాలవరకు నీరుమాత్రమే త్రాగుతూ ధృఢమైన ఆసనంమీద ఇంద్రియాలను నియమించి కఠోరమైన తపస్సు చేశాడు. అతని శమదమాది గుణాలను, బ్రహ్మచర్య, తపస్సులనుచూచి ప్రసన్నుడై బ్రహ్మ హంసలవిమానంమీద వచ్చి, హిరణ్యకశిపునితో నీతపస్సుకు సంతోషించాను. వరం కోరుకో. కావలసిన, ఇష్టమైనదానిని పొందు అన్నాడు. అప్పుడు హిరణ్యకశిపుడు ఓ పితామహా! దేవ, గంధర్వ, యక్ష, అసుర, సర్వరాక్షస, పిశాచ, మనుష్యలలో ఎవడూ నన్ను చంపలేకుండా ఉండేట్లు వరమిమ్మన్నాడు. ఋషులుకూడ శాపం పెట్టలేనట్లు, ఏ ఆయుధంచేత చావకుండునట్లు, ఎండినవస్తువుతోకాని, తడివస్తువు తోకాని చావకుండునట్లు, ఒక్కచేతిదెబ్బతో సేవక, సైన్య, వాహనాలతో కూడిన నన్ను చంపుటకు ఎవడు సమర్థుడో వాడే నన్ను చంపునట్లు, సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, నీరు, ఆకాశం, నక్షత్రాలు, పదిదిక్కులు, కామం,

క్రోధం, వరుణుడు, ఇంద్రుడు, యముడు, కుబేరుడు, కింపురుషరాజు నేనేకావాలి అని కోరాడు. ఇలా వరమడిగిన తరువాత బ్రహ్మ నవ్వుతూ ఓ రాజా! ఈ దివ్యములైన వరాలిస్తున్నాను. ఈ కోరికలనన్నిటినీ పొందుతావు అనిచెప్పి బ్రహ్మ వెళ్ళిపోయాడు.

దేవతలు బ్రహ్మ ఇచ్చిన వరాలను విని ఇంద్రుడు మొదలైన దేవతలు బ్రహ్మవద్దకు వెళ్ళి మహాత్మా! ఈ వరదానంచేత ఆ రాక్షసుడు మమ్మల్ని చంపుతాడు. కనుక అతని మరణానికి ఉపాయమేదైనా ఆలోచించు. జీవులందరినీ నీవే సృష్టించావు. హవ్యకవ్యములను సృష్టించావు. నీ ప్రకృతితత్వాన్ని ఎవడూ ఎరుగడు అని విన్నవించారు. అప్పుడు బ్రహ్మ దేవతలారా! హిరణ్యకశిపుడు తన తపస్సుకు ఫలితం తప్పక పొందుతాడు. తరువాత భగవంతుడు విష్ణువు స్వయంగా అతన్ని చంపుతాడు అనిచెప్పాడు. అప్పుడు దేవతలు సంతోషించి తమతమ స్థానాలకు వెళ్ళిపోయారు. రాక్షసరాజు హిరణ్యకశిపుడు వరాలుపొంది గర్వాంధు డయ్యాడు. మొట్టమదట మంచి నియమాల్ని పరిపాలించేవాళ్ళను, సత్యమందు, ధర్మమందు ఆసక్తి కలవారిని, ఆశ్రమాల్లో ఉండే మునులనీ బాధ పెట్టసాగాడు. తరువాత మూడులోకాలలోని దేవతలను వెళ్ళగొట్టి మొత్తం మూడు లోకాలనూ తనవశం చేసుకొని స్వర్గలోకం మీద అధికారం చెలాయిస్తూ అక్కడనే ఉండిపోయాడు.

స్వర్గంలో ఉన్న సమయంలో యజ్ఞంలో హవిర్భాగాలను దేవతలకు లేకుండా చేసి రాక్షసులకు వాటిపై అధికారం ఇచ్చాడు. ఈస్థితిలో ఆదిత్యులు, రుద్రులు, విశ్వేదేవులు, మరుద్గణాలు విష్ణుమూర్తిని శరణువేడి ఇలాచెప్పారు. దేవతలకు ప్రభు వైనవాడా! నీవే మమ్మల్ని సృష్టించావు. నీవే పరమదైవం, పరమగురువు. మేము హిరణ్యకశిపుడికి భయపడి నిన్ను శరణువేడుతున్నాం. మీరు అతన్ని నశింప చేయండి. ఎలాగైనా అతని దుర్మార్గంనుంచి మమ్మల్ని రక్షించండి. అప్పుడు విష్ణుమూర్తి ఇలా అన్నాడు. ఓ దేవతలారా! నేను మీకు అభయమిస్తున్నాను. మీరు భయం విడిచిపెట్టండి. మళ్ళీ స్వర్గరాజ్యం మీకు ప్రాప్తిస్తుంది.

హిరణ్యకశిపుడు వరాలచే చంపశక్యంకానివాడై గర్వించాడు. నేను త్వరలోనే అతని సహచరులను, అతన్ని చంపుతాను. ఇలాచెప్పి ఆ విష్ణుమూర్తి దేవతలను పంపి సగం సింహము, సగం మానవరూపంగల శరీరాన్ని ధరించి హిరణ్యకశిపుని సభాభవనానికి వెళ్ళాడు. నరసింహరూపంతో మేఘంలాంటి శరీరం, మేఘంవంటి

కంఠధ్వని, వేగమూ కలవాడై అతిబలవంతుడు, అహంకారమత్తుడు అయిన హిరణ్యాకశిపుని అతని సహాయులను చేతితో చంపాడు. ఈవిధంగా నరసింహావతారమును చెప్పాను. తరువాత వామనావతారకథను వినిపిస్తాను.

పూర్వం భగవంతుడైన విష్ణువు బలవంతుడైన బలి అనే రాక్షసునికొరకు వామనరూపం ధరించి, తన మూడు అడుగులతో జయింపరాని రాక్షసులను భయపెట్టాడు. చంపివేశాడు. క్షోభించిన రాక్షసులు విప్రచిత్తి, శిబి, శంకురయుడు, అయశ్శిరుడు, శంకుశరుడు, హయగ్రీవుడు, వేగవంతుడు, కేతువంతుడు, ఉగ్రుడు, సామవ్యగ్రుడు, పుష్కరుడు, పుష్కడు, వేపనుడు, బృహత్కీర్తి మహాజహ్వుడు, సాశ్వుడు, అశ్వపతి, ప్రహ్లాదుడు, అశ్వశిరుడు, కుంభుడు, సంహ్రాదుడు, గగనప్రియుడు, అనుహ్లాదుడు, హరి, హరుడు, వరాహుడు, శంకరుడు, రుజుడు, శరభుడు, శలభుడు, కుపనుడు, కోసనుడు, క్రథుడు, బృహత్కీర్తి మహాజుహ్వుడు, శంకుకర్ణుడు, మహాస్వనుడు, దీర్ఘజిహ్వుడు, అర్కనయనుడు, మృదుచాపుడు మొదలగు వారు చాలమంది ఉన్నారు.

ఆ రాక్షసుల వద్ద చాలా శస్త్రములు ఉన్నాయి. వాళ్ళ వేషాలు, అలంకారాలు కూడా చాలా భయంకరంగా ఉన్నాయి. వాళ్ళలో గొప్ప ఉత్సాహం ఉంది. తాబేలు, కోడి వంటి ముఖాల వాళ్ళు గాడిద, ఒంటె ముఖాలవాళ్ళు, పంది ముఖం కలవాళ్ళు, మొసలివంటి నోరు వాళ్ళు, నక్కముఖాల వాళ్ళు అయిన రాక్షసులు, అనేకములైన పూలదండలు ధరించి తమ ఆయుధములు పట్టుకొని భగవంతుడైన వామనుణ్ణి సమీపిస్తూనే చుట్టు ముట్టారు. అప్పుడు వామనుడు తన భయంకర స్వరూపాన్ని ప్రకటించి చేతులతో, కాళ్ళతోనూ ఆరాక్షసుల్ని నుతిమిన్నైచి మహా భయంకరమైన రూపం ధరించి చంపివేశాడు. భూమికి బరువు తొలగించాడు. వేదవేత్తలైన బ్రాహ్మణులు విష్ణుమూర్తి గుణాన్ని గానం చేశారు.

వామనుడు తన పరాక్రమం ప్రదర్శిస్తూ భూమిపై ఉన్నప్పుడు సూర్యచంద్రులు అతని రొమ్ముమీద కనిపించారు. అయన ఆకాశంలో ఉన్నప్పుడు సూర్యచంద్రులు నాభి ప్రదేశమందున్నారు. ఇంకా ఎదిగినప్పుడు మోకాళ్ళ వద్ద ఉన్నారు. ఈ విధంగా వామనరూపం ధరించిన విష్ణువు పెద్ద పెద్ద రాక్షసుల్ని చంపి భూమికి భారం లేకుండా చేశాడు. స్వర్గరాజ్యాన్ని మరల ఇంద్రునికి ఇచ్చాడు. వామన భగవంతుని చరిత్రను నీకు వినిపించాను. ఇప్పుడు ఆ నారాయణుని యొక్క దయామయమైన దత్తాత్రేయ అవతారకథను చెపుతాను.

మహారాజా! వేదము వేదంలో చెప్పబడిన ధర్మాలు యజ్ఞయాగాదులు లేకుండా పోయినప్పుడు నాలుగు వర్ణాల వాళ్ళు కలిసిపోయినపుడు ధర్మం తగ్గి అధర్మం వృద్ధి చెందినపుడు సత్యం నశించి అసత్యం అధికారం చలాయిస్తున్నప్పుడు జనం ఛిన్నాభిన్నమై ధర్మం వ్యాకులముకాగా అప్పుడు దత్తాత్రేయ రూపాన్ని ధరించి భగవంతుడు మళ్ళీ వేదధర్మాల్నీ యజ్ఞాలనీ నాలుగు ఆశ్రమాల ధర్మాలనూ ప్రవర్తింప చేశాడు. వరాలనిచ్చే దత్తాత్రేయుడు బుద్ధిమంతుడైన కర్తవీర్యుడికి నీకు రెండు చేతులే ఉంటాయి. కాని సమయం వచ్చినప్పుడు వెయ్యి చేతులవుతాయి. ఓ కార్తవీర్యా! నీవు రాజ్యపరిపాలన చేస్తావు. నీవు ధర్మం తెలిసిన వాడవు అవుతావు. శత్రువులు నిన్ను కన్నెత్తి చూడజాలరు. అని వరమిచ్చాడు. ఈ విధంగా దత్తాత్రే యావతార కథ వినిపించాడు. ఇప్పుడు పరశురామావతార కథ చెపుతా విను!

ఈ అవతారంలో భగవంతుడు పరశురామరూపం ధరించి వెయ్యి చేతులు కలిగి యుద్ధంలో జయింపశక్యం కాని కార్తవీర్యుని సంహరించాడు పరశురాముడు నేలమీద నుండి రథమందు కూర్చున్న కార్తవీర్యుని నేల మీద పడవేశాడు. ధిక్కరించి మేఘంలా గర్జిస్తూ ఉన్న కార్తవీర్యుని వెయ్యి చేతులను నరికివేశాడు. కోట్ల కొలది క్షత్రియులతో కూడిన భూమి ఇరవై ఒక్కమార్లు క్షత్రియులు లేనిదిగా చేయబడింది. భూమి మీద క్షత్రియులు లేకుండా చేసి పాపం పోగొట్టుటానికి అశ్వమేధయాగం చేశాడు. ఆ యజ్ఞంలో ఆయన గుర్రాలను, ఏనుగులను, అమితమైన బంగారు రాసులను, అనేక గోవులను, అనేక విధాలైన దక్షిణాలను బ్రాహ్మణులకు ఇచ్చాడు. చివరకు సంతోషంతో భూమండలాన్ని అంతనూ మరీచిపుత్రుడైన కశ్యపుడికి దానం చేశాడు.

ఇప్పటికీ లోకకల్యాణం కోసం కఠోరమైన తపస్సు చేస్తూ మహేంద్ర పర్వతం మీద దేవతలవలె నివసిస్తున్నాడు. మహారాజ! నేను శాశ్వతుడు నాశం కానివాడైన శ్రీమహావిష్ణువు యొక్క పరశురామ వృత్తాంతాన్ని వినిపించాను. ఇరవై నాలుగవ యుగంలో పద్మాలవంటి అందమైన కళ్ళు కలిగిన పరమాత్మ తనను నాలుగు భాగాలుగా విభజించుకొని దశరథ మహారాజుకు పుత్రుడుగా అవతరించాడు. అతడు లోకంలో రాముడని ప్రసిద్ధిచెందాడు. సూర్యునితో సమానమైన తేజస్సు

కలవాడు. ఈ రామావతారంలో ప్రజలను సంతోషపెట్టుట రాక్షసవంశమును నశింప చేయుట, ధర్మానికి అభివృద్ధి కలిగించుట ప్రధానమైన ఉద్దేశము.

ప్రపంచ ప్రజలందరూ అతని రాజా! రామచంద్ర! అని పిలుస్తారు. బుద్ధిమంతుడైన విశ్వామిత్రుడు దేవతలకు శత్రువులైన రాక్షసులను నశింప చేయుటకు, దేవతలకు కూడ పొంద శక్యముగాని గొప్పగొప్ప అస్త్రాల్ని రామచంద్రునికి ఉపదేశించాడు. శ్రీరాముడు చిన్నతనంలోనే ఆ అస్త్రాల మహిమతో యజ్ఞానికి విఘ్నం కలిగించే మరీచ సుబాహులను సంహరించాడు. అతడు మహాత్ముడు రాజర్షి అయిన జనక మహారాజు యజ్ఞంలో ప్రవేశించి అవలీలగా శివధనుస్సును విరిచాడు. సమస్త ప్రాణులకు శుభం కోరి శ్రీరాముడు లక్ష్మణుని వెంట బెట్టుకొని పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యావాసం చేశాడు.

ఎప్పుడూ విడువకుండునట్టి మహాలక్ష్మి సీతరూపంలో అవతరించి శ్రీరామునికి భార్యయై అరణ్యావాస సమయంలో కూడ భర్తతో కూడా ఉంది. రామచంద్రుడు పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యావాస వ్రతాన్ని స్వీకరించి జనస్థానంలో ఉంటూ దేవతల పనిని నెరవేర్చాడు. లక్ష్మణునితో పాటు సీతని వెతికే సమయంలో శాపానికి గురియై మహాబలవంతుడయిన విరాధుణ్ణి, కబంధుణ్ణి ఈ యిద్దరు గంధర్వులనీ సూర్యుడు అగ్ని మెరుపులాంటి వజ్రాయుధముతో సమానమైన బాణాలతో చంపివేశాడు. ఆ రాక్షసులను మళ్ళీ గంధర్వరూపం వచ్చింది. తరువాత రామచంద్రమూర్తి వాలిని చంపి సుగ్రీవుడికి రాజ్య పట్టాభిషేకం చేశాడు. దేవతల నుండి అనేక వరాలు పొంది మదించి యున్న రాక్షసరాజైన రావణుని అతని బంధువులతో సహా సంహరించాడు.

ఆ శ్రీరాముడే యుద్ధవీరుడు వరాలు పొంది గర్వంతో కూడిన 'మధు' పుత్రుడైన రావణసురుణ్ణి ఇతర రాక్షసులను కూడ సంహరించాడు. ధర్మప్రధానుడై శ్రీరామచంద్రుడు ఈ మహాకార్యాలనన్నిటినీ నిర్వహించి. అయోధ్యానగరంలో పది అశ్వమేధయాగాలు చేశాడు. అతని రాజ్యంలో ఎక్కడా అశుభవార్త వినపడలేదు. వాయునిత్యమూ అనుకూలంగా వీచేది. ఒక్క స్త్రీ కూడా భర్త పోయిన దుఃఖించేది లేదు. దొంగతనం ఉండేది కాదు. నీటివల్ల, గాలివల్ల ఎప్పుడూ ఏ ప్రాణికీ నష్టం వాటిల్లలేదు. వృద్ధుడు మరణించిన పిల్లవానికి ప్రేతకార్యం చేయటం ఉండేదికాదు.

అన్ని వర్ణాలవాళ్ళు తమతమ విధులను నిర్వర్తించేవాళ్ళు. భార్యాభర్తలలో కలహం ఉండేది కాదు. ఆకాలంలో రాముడు ఒక్కడే రాజు అతడే పరిపాలించువాడు.

అందువల్లన సమస్త ప్రపంచమూ ఏ బాధలేకుండా సుఖపడింది. శ్రీరాముని పరిపాలన కాలంలో మనిషికి వెయ్యి సంవత్సరాలు పూర్ణాయుస్సు. అందరూ ఏవ్యాధీ లేనివాళ్ళే. పురాణం తెలిసిన వాళ్ళు అతని గొప్పతనాన్ని గానం చేసేవాళ్ళు. భగవంతుడైన శ్రీరాముడు నల్లని వర్ణం గలవాడు. ఆయన కళ్ళు ఎర్రగా ఉండేవి. ముఖం తేజస్సుగలది. మితంగా మాట్లాడేవాడు. అతని చేతులు, మోకాళ్ళ వరకూ ఉండేవి. భుజశిరస్సులు సింహానికి ఉన్నట్లు ఉండేవి. ఆయన యువకుడు బల వంతుడు, సమస్త కల్యాణ గుణాలకూ గనియైనవాడు. శ్రీరాముడు పదకొండు వేల ఏళ్ళు అయోధ్యకు రాజై పరిపాలించాడు.

ఋగ్యజుస్సామ వేదాలధ్వని నగరంలో వినిపిస్తుండేది. సూర్యచంద్రులను మించిన కాంతి గలవాడు శ్రీరాముడు. గొప్ప దక్షిణలిచ్చి వందలకొలది యాగాలు చేశాడు. తరువాత తన ఉత్తమస్థానానికి వెళ్ళాడు. ఓ మహారాజా! ఇక్ష్వాకుకుల నందనుడు మహాబాహువైన రామచంద్రుడు ఈ విధంగా పరివార సమేతంగా రావణాసురుని చంపి తన పరమశ్రేష్ఠమైన తన స్థానమును చేరాడు. వైశంపాయను డిలా అన్నాడు. మహారాజా! మాధురలో లోకక్షేమం కోసం అవతరించి మహా త్ముడైన శ్రీకృష్ణుడు చేసిన ఘనకార్యాలను ఇప్పుడు చెపుతున్నాను విను!

శ్రీకృష్ణుడు 'శ్వాల్వుని', 'మైంద', 'ద్వివిదు'లను, కంసుని, అరిష్టుని, వృషభుని, కేశి అనే రాక్షసుని, పూతనను కువలయా పీడమనే ఏనుగును, చాణూరముష్టికులను, మనుష్యరూపంలో ఉన్న చాలామంది రాక్షసులను సంహరించాడు. అతడు బాణా సురుని వెయ్యి చేతుల్ని నరికివేశాడు. మహాబలవంతుడైన యవనరాజు నరకా సురుని చంపాడు. అతడు చెడ్డ రాక్షసులను చంపి బలాత్కారంగా వాళ్ళ ధన రత్నాదులను హరించాడు. గడిచిపోయిన పద్దెనిమిదవ ద్వాపరయుగంలో నారాయణుని తొమ్మిదవ అవతారం జరిగింది. ఈ సమయంలో ఆయన వేద వ్యాస రూపంలో అవతరించాడు. సత్యవతీ పుత్రుడయిన వ్యాసుడు ఒకేరాశిగా ఉన్న వేదాన్ని నాలుగు భాగాలు చేశాడు. భరత వంశాన్ని నిలబెట్టాడు.

మహారాజా! ఈ విధంగా నేను నీకు గడిచిన భగవంతుని లోకహితకరములైన అవతారాలను వాటి వృత్తాంతాలను వినిపించాను. ఇప్పుడు రాబోయే అవతారాల

వృత్తాంతం చెపుతా విను. తొమ్మిదవ అవతారము యొక్క పని పూర్తి అయిన తరువాత శ్రీమహావిష్ణువు మళ్ళీ లోకక్షేమం కొరకు సంభ్రుగ్రామంలో విష్ణుయశుడనే బ్రాహ్మణునికి పుత్రుడై 'కల్కి' అనే పేరుతో పదవ అవతారం ధరిస్తాడు. అప్పుడు యాజ్ఞవల్క్యమహర్షితోపాటు ఆ 'కల్కి' భగవానుడు మొదట క్షణికవాదులైన బౌద్ధులను శాస్త్రార్థరూపమైన వాగ్యుద్ధంలోను తరువాత ఆయుధ యుద్ధంలో కూడా ఓడించి గంగా యమునల మధ్యప్రదేశంలో నివసిస్తాడు.

తరువాత ఒకరి భార్య నింకొకరు అపహరించటం వల్ల వాగ్వాదంరాగా అప్పటి రాజు, మంత్రి, సైనికులు వారిలోవారు యుద్ధం చేసుకొని మరణిస్తారు. అప్పుడు ప్రపంచంలో అరాచకం వ్యాపిస్తుంది. ప్రజలు ఒకరితో ఇంకొకరు యుద్ధం చేస్తారు. బలవంతులు బలహీనులు సమస్తమునూ అపహరిస్తారు. అప్పుడు కలి యుగం మధ్యకాలమవుతుంది. ఇందువల్ల అందరూ ఉపాయం లేక మిక్కిలి దుఃఖించి పోట్లాడువారై కలియుగం పూర్తి అయ్యేటప్పుడు మిగిలి ఉన్న ప్రజలు కూడ నశిస్తారు. ఈ విధంగా కలియుగం పూర్తి అయిన తరువాత మరల సత్య యుగం (కృత యుగం) ప్రారంభమవుతుంది.

ఆ సమయంలో ప్రజలు సహజంగా న్యాయమందు ఆసక్తి కలవారౌతారు. బ్రహ్మజ్ఞానులైన ఋషులు పురాణాల్లో విష్ణుభగవానుని అనేక అవతారలను వర్ణిస్తారు. భగవంతుని అవతారాల వర్ణనను విని దేవతలు కూడ ఏమీ తెలియని వాళ్ళు అవుతారు. వేదములు, పురాణములు ప్రచారంలో ఉంటాయి. కల్యాణ గుణ పరిపూర్ణుడైన భగవంతుని అవతారాలను తగ్గించి వర్ణించాను. సాటిలేని పరాక్రమం గల విష్ణు భగవానుని అవతారకథలను చేతులు జోడించి విన్నవాడని పితృదేవతలు సంతోషిస్తారు. యోగీశ్వరుడైన విష్ణుభగవానుని యోగమాయ వృత్తాంతాన్ని శ్రద్ధగా విన్నవాడు సమస్త పాపాలనుండి విడువబడుతాడు. భగవంతుని దయతో ధనధాన్యములు గొప్ప సంపద కలవాడౌతాడు. అన్ని విధాలైన భోగాలు అతనికి సులభమౌతాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
విష్ణుపర్వ-వరాహ నృసింహాది అవతార వర్ణనము అను నలభై ఒకటవ అధ్యాయము

☆☆☆

# నలభై రెండవ అధ్యాయము

## ఈశ్వరత్వము- తారకామయ యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఇప్పుడు నేను సత్యయుగంలో విష్ణుభగవానుని విశ్వత్వము, హరిత్వము దేవలోకంలోని వైకుంఠత్వము మనుష్యలోకంలోని కృష్ణత్వము మొదలైన ఊహాకందని సత్యయుగంలో జరిగిన, జరుగబోయే కార్యములను యదార్థంగా వర్ణిస్తున్నాను విను.

ఆ భగవంతుడు నాశం లేనివాడు. జగత్తును సృష్టించేవాడు. అంతులేని ఆత్మ స్వరూపం తెలియబడని రూపం కలవాడు. ఆ మహాప్రభువే శరీరాన్ని ధరించి సత్యయుగంలో 'హరి' అని పిలవబడతాడు. బ్రహ్మ, ఇంద్రుడు, చంద్రుడు, యముడు, శుక్రుడు, బృహస్పతి, వీళ్ళందరూ నారాయణుని వేర్వేరు రూపాలు. వాళ్ళే అదితికి పుత్రులుగా పుట్టి విష్ణువు, ఇందునికి తమ్ముడు ప్రసిద్ధి పొందాడు. దేవతలకు శత్రువులైన దైత్య దానవ రాక్షసులను చంపుటకు అదితి కడుపున పుట్టుట ఆయన అనుగ్రహమే.

త్రిగుణాత్మకుడు మాయయుడైన పరమేశ్వరుని నుండి బ్రహ్మ పుట్టాడు. ఆ మొదటి పురుషుడే పూర్వం మరీచి మొదలైన ప్రజాపతులను సృష్టించాడు. అతడే కశ్యపుడు మొదలైన అనేక రూపాలను పొంది మిక్కిలి గొప్పదైన బ్రహ్మ వంశాన్ని విస్తరింపచేశాడు. ఆ మహాత్ముల వల్లనే వేదంలోని అనేక శాఖలు వెలువడ్డాయి. వేదాని చదవటం గొప్ప మహిమతో కూడిన పరమేశ్వరుని యొక్క పేర్లను పలుకుటయే. ఓ మహారాజా! ఆ భగవంతుడు వేదపాఠస్వరూపుడు. అనీ ఇంకా ఇతరములైన వర్ణింపదగిన విషయాలను చెపుతున్నాను విను.

సత్యయుగంలో వృత్రాసురుని సంహారం అయిన తరువాత ముల్లోకాలలో ప్రసిద్ధి చెందిన తారకామయమనే యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షస సమూహం యుద్ధం పిచ్చితో భయంకరరూపం ధరించి దేవ, గంధర్వ, యక్ష, రాక్షస సర్పజాతి వాళ్ళను చంపివేశారు. యుద్ధంలో చంపబడుతూ పెడముఖం పెట్టి తగ్గిపోయిన ఆయుధాలు కలవాళ్ళై విష్ణుమూర్తిని శరణు వేడారు.

ఈ సమయంలో మేఘాలు బొగ్గులను వర్షిస్తూ సూర్య చంద్రగ్రహ సముదాయంతో కూడిన ఆకాశాన్ని కప్పివేస్తూ మెరుపులతో కూడి ఘోరములై ధ్వని చేస్తూ ఉండగా ఏడువాయువులు వేగంతో ఒకదానినొకటి ఢీకొంటూ వీచాయి. పిడుగులు, తోకచుక్కలు ఆకాశంనుండి పడ్డాయి. వేడినీళ్ళ వర్షం మొదలైన అశుభ శకునాలను చూచి ఆకాశం మండిపోతున్నట్లు తలచబడింది. ఆకాశంలో ఎగిరే విమానాలు ఒకమారు క్రిందకీ ఒకమారు పైకీ పోతున్నట్లు కనిపించాయి.

నలువైపులా చీకటి అలుముకొని ఏమీ కనపడుటలేదు. ప్రళయకాలమని అందరూ భయపడ్డారు. ఇదే సమయంలో నల్లని శరీరంగల భగవంతుడు విష్ణుమూర్తి తన రెండుచేతులతో చీకటిని చీల్చివేసి దివ్యరూపంతో అందరి ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఆ సమయంలో ఆయన స్వచ్ఛమైన పీతాంబరాన్ని ధరించి ఉన్నాడు. శరీరమంతటా బంగారుఆభరణాలు ఉన్నాయి. ఆయనవద్ద బంగారు వస్త్రాలున్నాయి. ఆయన పర్వంలాగా నిశ్చలంగా ఉన్నాడు. చేతిలో నందకమనే ఖడ్గం ఉంది. శంఖచక్రగదారూపములైన ఆయుధాలు ఉన్నాయి. ఆయన దివ్యతేజస్సుగల రథంమీద కూర్చున్నాడు. ఆయన రథపు జండాపై గరుత్మంతుడు కూర్చుని ఉన్నాడు. ఇటువంటి అభయదాతయైన పరమాత్మను చూడగానే చేతులు జోడించి జయజయ ధ్వనులు చేస్తూ శరణువేడారు.

ఆకాశమందున్న పురుషోత్తముడైన విష్ణువు వాళ్ళందరి దీనవాక్కులను విని యుద్ధంలో రాక్షసులను చంపాలని సంకల్పించి ప్రేమతో ఓ దేవతలారా! భయపడవద్దు. నిశ్చింతగా ఉండండి. నేనిప్పుడే ఈ రాక్షసులను ఓడించుతాను. అప్పుడు మీరు మళ్ళీ మూడులోకాల రాజ్యాలపై అధికారాన్ని పొందుతారు. సత్యమైన ప్రతిజ్ఞ గల విష్ణుమూర్తి యొక్క ఈ వాక్కును విని పాలసముద్రంలో అమృతం దొరికినప్పటి ఆనందాన్ని పొందారు. తరువాత చీకటి నశించింది. మేఘాలు మాయమయ్యాయి, సుఖకరమైన వాయువు వీచింది. సూర్యచంద్రుల కాంతులు నిర్మలమయ్యాయి. మనుష్యులకు భయం తొలగిపోయింది. మహర్షులు భయం లేని వారై గట్టిగా వేదాలను చదువసాగారు. ప్రపంచంలో ప్రాణులందరూ సంతోషంతో ధర్మ కార్యములు చేయమొదలుపెట్టారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
ఈశ్వరత్వము- తారకామయ యుద్ధము అను నలభై రెండవ అధ్యాయము

☆☆☆

# నలభై మూడవ అధ్యాయము

## యుద్ధానికి సిద్ధమైన రాక్షససేన

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! దైత్యులు దానవులు (రాక్షసులు) భగవంతుడు దేవతలకు అభయమిచ్చాడని విని మిక్కిలి ఆసక్తితో యుద్ధానికి తయారవటం ప్రారంభించారు. మయుడనే రాక్షసుడు బంగారు రథంమీద బయల్దేరాడు. ఆరథం పన్నెండు వందల చేతి విస్తారం కలిగి ఉంది. ఆ రథంలో గద పరిఘ మొదలైన ఆయుధాలు చిరుగంటలు మొదలైన వస్తువులు ఉన్నాయి. ఆ రథం పెద్ద పెద్దపులి చర్మంతో కప్పబడింది. రత్నాలతో బంగారు జాలరులతో ప్రకాశిస్తున్నది. ఆ రథం బయల్దేరేటప్పుడు మేఘధ్వనితో సమానమైనధ్వని ఏర్పడుతుంది. ఆ రాక్షసుడు ఎలుగు బంటిలా నల్లగా ఉన్నాడు. అతడు చాలామంది శత్రువులను చంపటంలో సమర్థుడు. తారకాసురుడు కూడ పొడవుగా విశాలంగా ఉన్న ఒక రథంమీద కూర్చున్నాడు. విరోచనుడు గదచేత పట్టుకొని నిలిచాడు. హయగ్రీవుడు (రాక్షసుడు)వెయ్యి గుర్రాలు పూన్చిన రథంమీద కూర్చుని అటూఇటూ తిరుగుతున్నాడు. వరాహ రాక్షసుడు ధనుష్టంకారం చేస్తూ సైన్యానికి ముందున్నాడు. ఖరుడనే రాక్షసుడు కళ్ళనుండి క్రోధంవల్ల కన్నీరు కారుస్తున్నాడు. రాక్షసులందరూ గర్జిస్తున్నారు. ఆయుధాలతో ఆడుతున్నారు. కొందరు రాక్షసులు చక్రాలతో సైన్యాన్ని సంతోష పెడుతూన్నారు. ఈ విధంగా రాక్షససైన్యం మదించి యుద్ధానికి సిద్ధంగా ఉన్నది. ఉత్సాహంతో దేవతల ఎదుట నిలిచింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
యుద్ధానికి సిద్ధమైన రాక్షససేన అను నలభై మూడవ అధ్యాయము

☆☆☆

# నలభై నాల్గవ అధ్యాయము

## యుద్ధానికి దేవతలు సిద్ధపడుట

వైశంపాయనుడిలా అన్నాడు.

నాయనా! యుద్ధానికి సిద్ధమైన రాక్షస సైన్యముయొక్క విస్తారం విన్నావుగా, ఇక విష్ణువుకు సంబంధించిన దేవతల సమస్త సైన్యాన్ని గూర్చి విను.

ఆదిత్యులు, వసువులు, రుద్రులు, బలశాలులైన అశ్వినీదేవతలు సైన్యంతో అనుసరించు. వారితో తమ బలానికి తగినట్లు సిద్ధపడ్డారు. దిక్పాలకుడైన సహస్రాక్షడు (ఇంద్రుడు) ముందుగా ఐరావతమనే తన ఏనుగు నెక్కాడు. అతనికి ఎడమప్రక్కన గరుత్మంతునితో సమానవేగం గలదియు అయిన బంగారురథం ఉన్నది. తేజశ్శాలురైన మహర్షులాతని స్తోత్రం చేస్తున్నారు. దేవ సైనికులు అతన్ని రక్షిస్తున్నారు. అతని రథానికి వెయ్యి గుర్రాలు కట్టబడ్డాయి. కోట్లకొలది అప్సరసలు నాట్యం చేశారు. సారథియైన మాతలి రథంపై కూర్చున్నాడు. దేవసేనకు తూర్పున ఇంద్రుడు యమధర్మరాజు, దక్షిణాన, వరుణుడు, పడమరదిక్కున కుబేరుడు ఉత్తరదిక్కున నియమింపబడ్డారు. సూర్యుడు తన రథంమీద కూర్చుని దేవసేనలో సంచరిస్తున్నాడు. ఈ విధంగా దేవసేన యుద్ధానికి సిద్ధమైంది. బృహస్పతి దేవ సైన్యానికి శుభమగుగాక! అంటే శుక్రాచార్యులు రాక్షససైన్యానికి శుభమగుగాక. అని ఆశీర్వదించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
యుద్ధానికి దేవతలు సిద్ధపడుట అను నలభై నాల్గవ అధ్యాయము

☆☆☆

# నలభై ఐదవ అధ్యాయము

## సురాసుర యుద్ధము- ఔర్వాగ్ని పుట్టుక

వైశంపాయనుడిలా చెప్పాడు.

తమతమ జయాన్ని కోరుతున్న దేవతలయొక్క, రాక్షసులయొక్క సేనలకు ఘోరమైన (సంకులమైన) యుద్ధం జరిగింది. వేగంగా పరుగెట్టే రథాలచేత విసురు తున్న అనేక విధాల ఆయుధాలచేత దేవతలకు రాక్షసులకు ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధం ప్రళయకాలంలాగా లోకానికి భయం కలిగించింది. పరిఘలనే ఆయు ధాలతోను, పర్వతాలతోనూ రాక్షసులు ఇంద్రుడు మొదలగు దేవతలను కొట్టారు. రాక్షసులచే చంపబడుతూ దేవతలు మిక్కిలి దీనులయ్యారు. రాక్షసుల దెబ్బలకు తలలు బొమ్మలూ బ్రద్దలై దేవతలకు గాయాల నుండి రక్తం ప్రవహించింది. రాక్షసమాయచేత దేవతల సైన్యం స్తంభించిపోయింది.

అప్పుడు ఇంద్రుడు రాక్షససైన్యంలో ప్రవేశించాడు. గొప్ప రాక్షససైన్యాన్ని చంపుతూ తామసాస్త్రంతో చీకటిని సృష్టించాడు. ఇంద్రుని ప్రభావంవల్ల దేవతలు

మాయాపాశమునుండి బయటపడ్డారు. ఆ చీకటిలో ఎవరు శత్రువులో ఎవరు మిత్రులో తెలియలేదు. దేవతలు గట్టి ప్రయత్నముతో రాక్షసుల శరీరాలను భూమిపై పడవేశారు. రాక్షసగణాలు పర్వతాలవలె నేలపై వ్రాలారు. అప్పుడు మయుడు/ఇంద్రుడు సృష్టించిన చీకటిని పారద్రోలే మాయను సృష్టించాడు. రాక్షసులు నేలపై పడినవాళ్ళు లేచారు. మయుని మాయచే తపించిపోతూ దేవతలు ఇంద్రుని రక్షించ మని శరణువేడారు. అప్పుడు ఇంద్రుడు వరుణునితో చెప్పగా అతడిలా చెప్పాడు.

పూర్వం ఉర్వుడనే బ్రహ్మర్షి మిక్కిలి కఠినమైన తపస్సుచేసి బ్రహ్మతో సమాన మైన గుణలములు కలవాడయ్యాడు. అతని తపస్సుచేత ప్రపంచమంతటా తపించి పోయింది. అప్పుడు మునులు దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. అంతకు ముందే హిరణ్యకశిపుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి దేవతల రాకను తెలియ చేశాడు. బ్రహ్మర్షులు ఉర్వునితో ఇలా చెప్పారు.

ఓ మహానుభావా! మీ ఋషివంశం నశించింది. నీవు ఒక్కడివే మిగిలిఉన్నావు. నీకు సంతానం లేదు. సంతానవృద్ధికి నీవే ప్రయత్నమూ చేయటంలేదు. చిన్నప్పటి నుండి తపస్సు చేస్తూ ఆత్మను కష్టపెడుతున్నారు. చాలామంది మునులు సంతానం లేనివాళ్ళై వంశపరంపరను సమాప్తి చేశారు. సంతానం లేకుండా వంశ వృద్ధి అసంభవం. వంశవిస్తారం కోసం తగిన పుత్రుని పుట్టించండి. అప్పుడు ఋషి మునులను తిరస్కరిస్తూ ఇలా అన్నాడు.

ఓ ముని సమూహమా! పూర్వం బ్రహ్మ మునులకు అరణ్యంలో దొరికే ఆహారమే పూర్వంనుంచీ వచ్చే ధర్మంగా చెప్పాడు. పండ్లు, దుంపలు తిని బ్రహ్మ చర్యం పాటించటమే ఋషులు చేయదగిన పని. ఇలాంటివాడు బ్రహ్మను కూడ వణికించగలడు. మీకు తపస్సు వలన ప్రభావముంటే బ్రహ్మలాగా మానస పుత్ర సృష్టి చేయండి అని ఉర్వుడు అగ్నిని సృష్టించాడు. ఉర్వుడు నా పుత్రునిపై మీరు చూపించిన దయకు ధన్యవాదాలు. నేను కృతార్థుడనని తలుస్తున్నాను. అప్పుడు ఓ మునిశ్రేష్టుడా! గుర్రంముఖంతో సముద్ర మితని స్థానం. ప్రళయ మేర్పడినప్పుడు నేను నీ పుత్రుడూ సమస్త ప్రపంచాన్నీ కడుపులో పెట్టుకుంటాం. ఇతడు రాక్షసుల నందరినీ బూడిద చేస్తాడు. అని బ్రహ్మ పలికాడు.

అప్పుడు ఔర్వుడు అగ్ని సముద్రంలో గుర్రం ముఖంతో ప్రవేశించాడు. బ్రహ్మ ఋషులు వెళ్ళిపోయారు. ఈ ఆశ్చర్యకరమైన సంఘటనను చూచి

హిరణ్యకశిపుడు ఉర్వుడికి సాష్టాంగ నమస్కారం చేసి ఓ పూజ్యుడా! మీ తపస్సు వల్ల అద్భుతమైన కార్యం ఏర్పడింది. బ్రహ్మకూడ సంతోషించాడు. నీవు నీ పుత్రుడూ నాపై దయ చూపిస్తే నేను కృతార్థుడనౌతాను. అని పలుకగా మహర్షి ఉర్వుడు అగ్నిరూపమైన మాయను నీకిస్తున్నాను. అగ్ని కూడ ఈ మాయను తాకలేదు. ఈ మాయ మీ వంశానికి స్వాధీనమై ఉండి తనవారిని రక్షిస్తూ శత్రువులను నాశం చేస్తుంది. అన్నాడు. తరువాత హిరణ్యకశిపుడు ఉర్వమహర్షికి నమస్కరించి ఆ మాయను తీసుకొని సంతోషంతో స్వర్గానికి వెళ్ళాడు.

వరుణదేవుడు హిరణ్యకశిపు వద్ద నున్న మాయను గూర్చి వృత్తాంతమంతా చెప్పి ఇంద్రునితో ఈ మాయను నాశనం చేయాలంటే నీటినుండి పుట్టిన చంద్రుణ్ణి నాతో కూడా ఉండమనండి. అప్పుడు చంద్రుడు నీటిలో నుండు జంతువులను వెంటబెట్టుకొని తమ దయతో ఈ మాయను నశింపచేస్తా అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి హరివంశపర్వంలో
సురాసుర యుద్ధము- ఔర్వాగ్ని పుట్టుక అను నలభై అయిదవ అధ్యాయము

☆☆☆

# నలభై ఆరవ అధ్యాయము

## దేవతల విజయము, కాలనేమి యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఇలాగే అగుగాక అని యింద్రుడు సంతోషించినవాడై ఓ చంద్రుడా! నీవు యుద్ధంలో శత్రునాశం కోసం దేవతల విజయం కొరకు వరుణదేవుడికి సహాయం చెయ్యి. మమ్మల్ని కాల్చివేస్తున్న రాక్షసమాయను శాంతింపచెయ్యిఅన్నాడు. అప్పుడు చంద్రుడు దేవరాజా! ఇప్పుడు నాప్రభావం చూపిస్తాను. ఈ రాక్షసులను చలిచే నశించిపోయేటట్లు మంచును వర్షిస్తాను. మాయ తొలగి మదం గర్వం నశించి పోయిన రాక్షసులను చూస్తావు అని మంచును వర్షించగా వరుణుడు వర్షాలు కురిపించాడు. పాశముల దెబ్బలతో రాక్షసులు నేలపై ఒరిగారు.

తరువాత రాక్షసరాజు మయుడు వరుణుని పాశాలతో బంధింపబడినట్టియు, చంద్రుని మంచుః స్సంతో శక్తిహీనులునైన రాక్షసులను చూచి మాయతో కూడిన

పర్వతాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడు రాళ్ళవర్షంవల్ల దేవతలు మరణించారు. రాక్షసులు బ్రతికారు. రాక్షసమాయ వృద్ధి చెందటంచూచి విష్ణువు అగ్నికి, వాయు దేవునికి ఆజ్ఞ ఇచ్చాడు. వాళ్ళిద్దరూ ఒకరొకరు సహాయమై ప్రళయకాలంలాగా రాక్షససైన్యాన్ని చంప మొదలుపెట్టారు. దానితో రాక్షసుల పర్వతమాయ నష్టమైపోయింది. ముందు వాయుదేవుడు నడుస్తుంటే అతనివెనుక అగ్నిదేవుడు. ఈ విధంగా ఇద్దరూ అడ్డూ లేకుండా రాక్షససైన్యంలో చొరబడి సంచరించారు. రాక్షసుల విమానాలు తగలబడిపోయాయి. వాయువు వలన నేలకూలాయి. దీనివల్ల రాక్షసులలో నిరాశ వ్యాపించింది.

ఈ విధంగా రాక్షసమాయ నాశంకాగా దేవతలు సంతోషిస్తూ విష్ణుభగవానుని స్తోత్రం చేస్తూ నలువైపుల నుంచీ జయజయధ్వానాలు చేశారు. ఈ విధంగా ఇంద్రుడికి జయం రాక్షసులకు పరాజయం (ఓడిపోవుట) కలిగింది. దీనితో దిక్కులు నిర్మలమయ్యాయి. ధర్మకార్యాలు జరుగ నారంభించాయి. పుణ్యాత్ము లకు అభివృద్ధి, పాపాత్ములకు నాశం సంభవించింది. అంతటా ప్రశాంత వాతావరణ మేర్పడగా "కాలనేమి" అనే రాక్షసుడు రాక్షసులకు సంభవించిన భయం విని సూర్యుని వంటి కిరీటాన్ని ధ్వని చేయుచున్న ఆభరణాలు ధరించి పెద్ద పర్వతంలాగా గ్రీష్మర్తువులో బయల్దేరిన అగ్నిలాగా మండిపోతూ యుద్ధానికి దిగాడు. అతని శరీరం మూడులోకాలంతా విశాలమైనది.

తన భుజాలతో ఆకాశాన్ని ఎత్తివేస్తూ పాదాలతో భూమిని అణగతొక్కుతూ వచ్చాడు. ప్రళయకాలంలో ఆకలిగొన్న మృత్యుదేవతలా యుద్ధభూమిని చేరాడు. యుద్ధరంగంలో కాలనేమిని దేవతలు భయంతో ఒణుకుతూ చూచారు. ఆ కాలనేమి గాలికి కదులుతున్న వస్త్రం గలవాడై దేవతలనందర్నీ భయపెట్టాడు. మయుడు కాలనేమిని కౌగలించు కున్నప్పుడు విష్ణువుతో కూడిన మందరపర్వతం గుర్తుకొచ్చింది. అప్పుడు ఇంద్రునితో సహా దేవతలందరూ భయపడిపోయారు. యముడే వస్తున్నట్లు తలచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
దేవతల విజయము, కాలనేమి యుద్ధము అను నలభై ఆరవ అధ్యాయము

☆☆☆

# నలభై ఏడవ అధ్యాయము

## దేవతలు కాలనేమితో యుద్ధము చేయుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కాలనేమి రాక్షసులను సంతోషపెట్టుటకు వర్షాకాల మేఘంలాగా వృద్ధి పొందాడు. కాలనేమిని చూచి రాక్షసులు స్తిమితపడి లేచారు. అమృతం ప్రాప్తించినట్లు ఆనందించారు. అందరూ యుద్ధానికి సంసిద్ధులయ్యారు. మయ తార వరాహ హయగ్రీవ రాక్షసులు అనేక విధాలైన ఆయుధాలు పట్టుకొని కాలనేమిని ముందుంచుకొని యుద్ధరంగంలో నిలబడ్డారు. వాయువుచే రక్షింపబడి నారాయణునిపై ఆధారపడిన దేవసైన్యము అనేక విధాలైన అస్త్రములను పట్టుకొని సముద్రంలా ప్రకాశించింది. రెండు సేనలు కలిశాక ఘోరమైన యుద్ధం ప్రారంభ మయింది. దేవతలు మొదట చురుకుగా లేకపోయినా తరువాత పరాక్రమించి రాక్షసులను చంపనారంభించారు. రాక్షసులు మొదట పరాక్రమం చూపించి తరువాత సడలిపోయారు.

రెండు సైన్యాలూ సముద్రంనుంచి పైకి లేచిన మేఘాలవలె ఉన్నాయి. ఎవరి శిబిరాల్లో వారుండగా ఒక్కసారి భేరీలు మ్రోగాయి. శంఖాలు ఊదబడ్డాయి. ఆ ధ్వనిచే భూమండలం దిక్కులు ఆకాశము ప్రతిధ్వనించాయి. రాక్షసుల సింహ నాదాలు వినబడలేదు. అప్పుడు రెండు సైన్యాలు ఒకరిపై ఒకరు పడి చంప నారంభించారు. కొందరు వీరులు ద్వంద్వయుద్ధం చేశారు. దేవతలు అనేకవిధాలైన ఆయుధాలతో రాక్షసులను కొట్టారు.

కొందరి శరీరాలు చూర్ణమయ్యాయి. కొందరి శరీరాలు బాణాలు గ్రుచ్చుకొని ముక్కలైనాయి. రోషంతో కూడిన సైనికులు రథాలమీద, విమానాలమీద ఎక్కి యుద్ధం చేశారు. ఎంత ఆపద వచ్చినా యుద్ధరంగాన్ని విడవక నిలిచి పోరాడారు కొందరు. రథాలచేత కాలిబంట్లచేత మార్గం ఆవరింపబడింది. ఆకాశంలో రథముల ధ్వనులు గంభీరంగా వినిపిస్తున్నాయి. ఒకడి రథం దొంగిలించబడింది. ఒకడు రథంక్రింద పడి చచ్చాడు. రథం నడిచే మార్గం లేకపోయింది. ఇద్దరు కత్తియుద్ధం చేస్తూ ఆరుపులే అలంకారాలుగా ఒకరినొకరు కొట్టుకున్నారు. చాలామంది సైనికులు రక్తం కక్కుకున్నారు.

స్థానాన్ని పొందాలని భగవంతుని దగ్గరకు వెళ్ళాడు. అక్కడ శంఖచక్ర గదలనే ఆయుధాలను ధరించి విష్ణువు తన అందమైన గదను త్రిప్పుతూ రాక్షసులను చంపుటకు సిద్ధంగా ఉన్నాడు. భగవంతుడు నీటితో నిండిన మేఘంలా నల్లగా ఉన్నాడు. మెరుపులాంటి పీతాంబరాన్ని ధరించాడు. బంగారు రెక్కలు గల గరుత్మంతుడు తన పీఠం మీద కూర్చొని ఉన్నాడు. కాలనేమి విష్ణువును చూచి మిక్కిలి కోపించాడు. విష్ణువును చూచి యిలా అన్నాడు.

మా పురాతన రాక్షసులకు ఈతడు శత్రువు. ఇతడు సముద్రంలో నివసించే మధుకైటభులను చంపాడు. ఇతడు మనకు జయింపశక్యం కాని శత్రువని విన్నాను. ఇతడు యుద్ధంలో ఆయుధాన్ని ధరించి మనల్ని సర్వనాశనం చేశాడు. ఇతని కారణంగా చాలామంది రాక్షసస్త్రీలు విధవలయ్యారు. ఇతడే దేవతల విష్ణువు. సర్పాలకు అనంతుడువలె బ్రహ్మకు బ్రహ్మదేవతలకు ఆధారము. రాక్షసులకు శత్రువు. ఇతని రోషంచేతనే హిరణ్యాకశిపుడు నశించాడు. ఇతని వల్లనే దేవతలు మహర్షు లిచ్చిన నేతిని తీసుకొంటున్నారు. ఇతడే రాక్షసుల నాశానికి మూలకారణం. ఇతని చక్రంచేత మావంశం నిర్మూలించబడింది. ఇది మా రాక్షసులకు యమ ధర్మరాజు.

ఈనాడు నాకు కనిపించాడు. ఈవేళనే ఈ దుర్బుద్ధి తన పనులకు ఫలము అనుభవిస్తాడు. అదృష్టం వల్ల నేడు నాకు కనిపించాడు. ఈవేళ యీతన్ని చంపి మా పూర్వుల ఋణం తీర్చుకుంటాను. నారాయణుని చంపిన తరువాత అతని ఆశ్రితులను హతమారుస్తా. ఇకపైన ఇతని వల్ల రాక్షసులకు దుఃఖం లేకుండా చేస్తా. ఇతడే నరసింహరూపంతో నా తండ్రియైన హిరణ్యకశిపుని సంహరించాడు. ఇతడే వామనరూపంతో బలిచక్రవర్తి నుండి మూడు అడుగుల భూమి అడిగి మూడులోకాలనీ తీసుకున్నాడు. ఈ వేళ దేవతలతోపాటు ఇతన్ని చంపుతా. ఇలా అని విష్ణువును తిరస్కరించి యుద్ధానికి సిద్ధపడ్డాడు.

ఇలా తిరస్కరించినా విష్ణుమూర్తి కోపించలేదు. తన ఓర్పుతో చిరునవ్వు నవ్వి ఓ రాక్షసశ్రేష్ఠా! శక్తి ఉన్నా కోపం రానివాడు వాస్తవంగా బలవంతుడు. గర్వమనే ఈ దోషంచేతనే నీవు మరణిస్తావు. బ్రహ్మదేవుని ఆజ్ఞను పాటించనివాడు ఎవడు సుఖపడతాడు? మీ పూర్వులు వెళ్ళినచోటికి నీవు వెళ్ళగోరుతున్నావు. ఈనాడు నిన్ను చంపి దేవతలను వారివారి స్థానాలలో మళ్ళీ స్థాపిస్తాను. శ్రీమహావిష్ణువు

ఇలా మాట్లాడుచుండగా రాక్షసుడు నవ్వాడు. కోపంతో ఆయుధాలను చేతులతో పట్టుకొన్నాడు. తరువాత ఆయుధాలతో అలంకరింపబడిన వంద చేతులను ఎత్తి కోపంతో మిక్కిలి ఎర్రబడిన కన్నులు కలవాడై విష్ణుమూర్తిని రొమ్ముమీద కొట్టాడు.

మయుడు తారుడు మొదలైన రాక్షసులు కూడ ఆయుధాలను, ఖడ్గాలను పట్టుకొని విష్ణువు మీదికి వచ్చారు. అన్ని ఆయుధాలతో బలవంతులైన ఆ రాక్షసులు కొట్టినప్పుడు విష్ణువు పర్వతంలా కదలకుండా నిలబడ్డాడు. కాలనేమి మీదికి గరుత్మంతుడు వెళ్ళగా అతడు బలంకొద్దీ గదను చేతులతో పట్టుకొని గరుడుని పై విసిరాడు. గరుత్మంతుడు బాధపడుచుండగా చూచి కోపంతో ఎర్రనైన కన్నులు గలవాడై విష్ణుమూర్తి చక్రాన్ని పట్టుకున్నాడు. గరుడుడు, విష్ణువు ఇద్దరూ శరీరాలను పెంచారు. కాలనేమి చేతులు కూడ వృద్ధి చెంది పదిదిక్కులా వ్యాపించాయి. ఋషులు, గంధర్వులు, విష్ణువును స్తోత్రం చేశారు.

అప్పుడు భగవంతుని కిరీటంలో స్వర్గము, వస్త్రంలో మేఘాలతో కూడిన ఆకాశం పాదాలలో భూమి చేతులలో పది దిక్కులూ ఇమిడిపోయాయి. అతని చేతిలో సూర్యకిరణముల వలె ప్రకాశించుచున్నట్టియు, అగ్నివంటిది శత్రువులను సంహరించునట్టి, చక్రం మిక్కిలి అందంగాను, గట్టిగాను, భయంకరంగాను ఉన్నది. అంచులు బంగారువి. దాని మధ్యభాగం వజ్రమయం. ఆయుధాలలో సాటిలేనిది. ఆ చక్రం యజమాని కోరికను బట్టి లావుగాను, సన్నగాను అనేక రూపాలు ధరించటంలో శక్తి కలది. దానికి భయపడని శత్రువు లేడు. అటువంటి చక్రంతో విష్ణుభగవానుడు కాలనేమి యొక్క వందచేతులను అట్టహాసం (పెద్దనవ్వు)తో నూరుతలలను ఖండించివేశాడు. ఆ రాక్షసుడు మరణించి కూడ నిలిచియే ఉన్నాడు.

అప్పుడు గరుత్మంతుడు వాయువేగము గలవాడై వక్షస్థలంతో కాలనేమిని నేలపై పడవేశాడు. అతని మృతశరీరం భూమిపై పడింది. ఆతడు మరణించగానే దేవతలు ఋషులు బాగుబాగని మెచ్చుకుంటూ అందరూ కలిసి శ్రీమహావిష్ణువును పూజించారు. తక్కిన రాక్షసులు ఆశ్చర్యపడుతూ స్తంభించిపోయారు. అప్పుడు భగవంతుడు ఆ రాక్షసులలో కొందరిని జుట్టు పట్టుకొని కొందరిని కంఠం పట్టుకొని నేలపై కూల్చివేశాడు. తక్కిన రాక్షసులను తన గదచక్రము మొదలైన ఆయుధాలతో సంహరించాడు. వాళ్ళందరూ ఆకాశం నుండి జారి నేలపై పడ్డారు. ఈ

విధంగా రాక్షసులను చంపి పురుషోత్తముడైన భగవంతుడు ఇంద్రునికి ఇష్టమైన పని చేసి సంతోషించిన మనస్సుతో నిలిచియున్నాడు.

ఇలా యుద్ధం పూర్తి అయిన తరువాత బ్రహ్మ బ్రహ్మర్షులు, దేవర్షులు, గంధర్వులు, అప్సరసలు, ఆప్రదేశానికి వచ్చారు. దేవదేవుడు చక్రహస్తుడు అయిన భగవంతుని ప్రార్థిస్తూ ఈనాడు రాక్షససంహారమనే పనిని పూర్తి చేసి దేవతలకు కష్టాన్ని తొలగించావు. ఇందువల్ల మేము చాలా సంతోషిస్తున్నాము. నీవు తప్ప మరొకడు ఆ రాక్షసుని చంపలేడు. తమయొక్క ఈ ఘనకార్యం చూచి మేము చాలా ఆనందిస్తున్నాం. రండి మనమందరం స్వర్గలోకానికి వెళ్దాం. అక్కడ బ్రహ్మర్షులందరూ ఒకచోట చేరి మీరాకకు ఎదురుచూస్తున్నారు.

ఇప్పుడు మూడు లోకాలూ సంతోషిస్తున్నాయి. ఇప్పుడు మీరు అక్కడకు వెళ్ళండి. అక్కడ మహర్షులందరు ఉత్తమ స్తోత్రాలతో మీకు శాస్త్రప్రకారం పూజ చేస్తారు. నీవు అందరికీ వరాలు ఇస్తావు. మేము నీకేమీయగలం? ఇంద్రుడికి మూడు లోకాల రాజ్యం ఇవ్వండి అని బ్రహ్మ ఇలా పలికిన తరువాత ఇంద్రాది దేవతలకు విష్ణుమూర్తి కాలనేమిని నేను చంపాను. చావగా మిగిలిన వాళ్ళు 'బలి' రాహువు మాత్రమే. కనుక ఇక ఇప్పుడు ఇంద్రుడు, వరుణుడు, తమ దిక్కులపై మళ్ళీ అధికారం పొందదురుగాక. అట్లే యముడు దక్షిణదిశకు కుబేరుడు ఉత్తర దిక్కుకు పరిపాలకులు కాగలరు. చంద్రుడు నక్షత్రాలతో పాటు కర్తవ్యమును నిర్వహిస్తాడు. సూర్యుడు కాలనిర్మాణము చేయగలడు. అగ్నిదేవుడు బ్రాహ్మణు లిచ్చే హవిస్సును స్వీకరించుగాక.

దేవతలారా! మీరిప్పుడు రాక్షసులవల్ల భయం లేకుండా శాన్తంగా ఉండండి. మీకు శుభమగుగాక! ఇప్పుడు నేను బ్రహ్మలోకానికి వెళ్తాను. రాక్షసులను ఎప్పుడూ నమ్మవద్దు. రాక్షసులవల్ల మీకెప్పుడు భయమేర్పడిన నేను వచ్చి మీ భయాన్ని తొలగిస్తాను. మహారాజా! సత్యపరాక్రముడైన విష్ణుభగవానుడు బ్రహ్మతో బ్రహ్మ లోకానికి వెళ్ళాడు. తారకామయ యుద్ధంలో విష్ణుమూర్తి విషయంలో నీవడిగిన ఆశ్చర్యకరమైన సంఘటన వర్ణించి చెప్పాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
విష్ణువు దేవతలను ఊరడించుట కాలనేమి వధ అను నలభై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

వేరొక రూపమే. ఊహ కందని స్వరూపము కల నారాయణుడు ఋషులకు నమస్కరించి బ్రహ్మలోకంలో తిరగటం మొదలుపెట్టాడు.

అలా తిరిగే సమయంలో ఎత్తైన యూపస్తంభాలు చషాలముతో అగ్నితో బ్రహ్మర్షులు అలంకరించినవి అక్కడ ఉన్నాయి. నేతి పొగ యొక్క సువాసన అంతటా వ్యాపిస్తోంది. బ్రాహ్మణులు వేదపఠనం చేస్తున్నారు. నారాయణుని సంతోషం కోసం యజ్ఞాలు జరుగుతున్నాయి. ఈ పనులను చూచి ఆయన ఆయన అక్కడనే తిరుగుతున్నాడు. అక్కడ ఉన్న ఋషులు, సభలో ఉన్నవారు, దేవతలూ పవిత్రమైన మనస్సుతో తమ పవిత్ర హస్తాలతో అర్ఘ్యం పట్టుకొని ఓ కేశవ! మేము చేసిన పని, చేయుచున్న పని యేది కలదో దానియందు మీ సహాయం మాకు కావాలి. అగ్ని చంద్రుడు ఈ ప్రపంచము మీనుండియే పుట్టాయి. ధ్యానబలంచేత జ్ఞాననేత్రంతో చూస్తే ఒక్క జనార్దనిని వల్లనే ఈ జగత్తు పుడుతోంది. అని స్పష్టమౌతుంది. నారాయణుడు కనపడకపోయినా దేవతలను మనుష్యులనూ బాగా తెలిసికొంటాడు. స్వర్గంలో దేవతలకు కూడ నారాయణుని వలన బలము, ఐశ్వర్యము కలుగుతున్నాయి.

భగవంతుడు యజ్ఞం చేసేవాళ్ళకు యజ్ఞఫలాన్ని ఇస్తాడు. పవిత్రుడు, స్వతంత్రుడు లోకపాలకుడు కూడ అయి ఉన్నాడు. స్వాగతం అడిగినతర్వాత గొప్ప కాంతిగల నారాయణునితో మునులు ఓ పద్మనాభ! తమరు మంత్రములతో కూడిన యజ్ఞంచేత పవిత్రమైన పాద్యాన్ని కాళ్ళు కడుక్కునే నీళ్ళను) పొందుటకు అధికారం కలవారు. మేము మిమ్ముల్ని అతిథిగా భావిస్తున్నాము. మీరు యుద్ధానికి వెళ్ళినప్పుడు మా కర్మకాండ ఆగిపోయింది. ఎందుకనగా విష్ణు భగవానుడు లేని యజ్ఞము వ్యర్థం. యజ్ఞంలో దక్షిణ ఇవ్వటం పూర్తి అయిన తరువాత మీ ద్వారా యజ్ఞం యొక్క ఫలితం ప్రాప్తిస్తుంది. అందుచేత ఈ వేళ మేము మీ యజ్ఞమే ప్రారంభిస్తున్నాం అని చెప్పారు.

మహారాజా! ఈ విధంగా బ్రహ్మర్షులు సత్కరించగా విష్ణుభగవానుడు ఆ సభలో ఉన్న మునులచే గౌరవింపబడి బ్రహ్మకు మునులకు ఇలాగే అగుగాక అని పలికాడు. బ్రహ్మ మిక్కిలి ఆనందంతో బ్రహ్మలోకంలో ఉన్నాడు

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో

బ్రహ్మలోక వర్ణన అను నలభై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# యాభైయవ అధ్యాయము

## విష్ణువు యోగనిద్ర, ఋషుల దేవతల ప్రార్థన

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈ విధంగా ఆ బ్రహ్మర్షులు సత్కరింపగా విష్ణుమూర్తి ఆసభలో ఉన్న మునులను వీడ్కొని బ్రహ్మకు నమస్కరించి సంతోషంతో పురాణాల్లో ప్రసిద్ధమైన దివ్యమగు నారాయణాశ్రమంలో ప్రవేశించాడు. అక్కడ ప్రవేశిస్తూనే అస్త్ర శస్త్రాల్ని విడిచిపెట్టి అక్కడ సముద్రరూపమైన తన నివాసాన్ని చూచాడు. ఆస్థానము ప్రళయకాల మేఘాలతో నిండి, మెరుపుల సమూహంతో కూడి, ఘోర మైన చీకటిచే కప్పబడి, దేవతలకు రాక్షసులకు తెలియనిది. సూర్యచంద్ర వాయువుల సంచారం లేనిది. ఆ ప్రదేశం విష్ణుమూర్తి తేజస్సుచేతనే ప్రకాశిస్తున్నది. అక్కడ ప్రవేశించి జడలు కట్టుకొన్నాడు. వెయ్యి శిరస్సులు ధరించి పడుకొన బోతున్నాడు. ఈ సమయంలో ప్రళయకాలం వచ్చినట్లు చూచి నిద్రా దేవత అతన్ని సేవించ మొదలుపెట్టింది.

విష్ణుభగవానుడు ఏకార్ణవ నియమానుసారంగా మేఘంలా చల్లనై ఆనంద దాయకమగు పక్కపై పడుకొన్నాడు. ఆ సమయంలో దేవతలందరూ ఋషులూ లోకసృష్టికొరకు పడుకొన్న భగవంతుడైన విష్ణువును ఉపాసించటం ప్రారంభించారు. ఆ నిద్రాసమయంలోనే ఆయన బొడ్డునుండి సూర్యునితో సమానమైన తేజస్సు గలది సుందరమైన రంగుల గలది అయిన ఒక తామరపువ్వు పుట్టింది. ఈ పద్మమే బ్రహ్మదేవుని జన్మస్థానము. ఆ భగవంతుడైన విష్ణువు నిద్రలోనే యజ్ఞో పవీతంతో కూడిన చేతినిఎత్తి లోకాలను గూర్చి ఆలోచించ మొదలుపెట్టాడు. నారాయణుని నుండి బ్రహ్మ పుట్టినట్లే బ్రహ్మ నిశ్వాసవాయువు నుండి ప్రజలు జన్మించారు. తరువాత ప్రజాపతుల నుండి పుట్టిన ప్రజలు బ్రహ్మ ఏర్పరచిన నాలుగు వర్ణాలుగా విభజింపబడి వేదోక్త కర్మల ననుసరించి భగవను వచ్చి తనలో లీనమయ్యారు.

బ్రహ్మ బ్రహ్మర్షులు ఎవరూ కూడా యోగనిద్రలో ఉన్న భగవంతుని స్వరూపాన్ని తెలుసుకొనలేకపోయారు. భగవంతుడు ఎక్కడ నిద్రపోతాడు? ఎక్కడ కూర్చుంటాడు? ఎప్పుడు మేల్కొంటాడు? ఎప్పుడు పడుకొంటాడు? అతడు నిద్ర పోయేటప్పుడు అన్ని ప్రాణులలో చిన్నవాళ్ళెవరు? భోగమనుభవించే

వాళ్ళెవరు? మొదలైన విషయాలు ఎవరికీ బోధపడవు. దేవతలు అతని విషయంలో అనేకరకాలైన ఊహలు చేస్తూ ఉంటారు. కాని అతని పుట్టుక, పని, యధార్థస్థితి ఎవడికీ తెలుసుకునే శక్తిలేదు. పూర్వ ఋషులు చెప్పిన మంత్రాల ద్వారా భగవంతుని విషయంలో కొంచము తెలుసుకొని శక్తి కొలది అతని గుణాన్ని వర్ణిస్తూ ఉంటారు.

భగవంతుని పూర్వచరిత్ర వేదాల ద్వారా, పురాణాలద్వారా మాత్రమే వింటున్నాం. కాని అతని వాస్తవ విషయం తెలియుటలేదు. అతని చరిత్రలతోనే వైదిక లౌకిక వాక్కులు నిండి ఉన్నాయి. ఆ భగవంతుడు అన్ని ప్రాణులకు మేలు చేయుటకు అయా సమయాల్లో అవతరిస్తూ ఉంటాడు. రాక్షసులను నశింపచేయు టానికి ఆయన ఎల్లప్పుడు సిద్ధంగా ఉంటాడు. అవతార సమయంలో కూడా ఆషాఢమాసం నుండి కార్తికమాసం వరకూ నిద్రపోతాడు. వాస్తవంగా యజ్ఞాలు యజ్ఞ సాధనాలు వేదస్వరూపములే. వర్షాకాలంలో యజ్ఞయాగాది కార్యాలన్నీ ఆగిపోతాయి. శరదృతువులో వాజపేయం మొదలైన యజ్ఞాలు ప్రారంభించగానే ఆయన మేల్కొం టాడు. విష్ణు భగవానుడు నిద్రపోయిన తరువాత ఇంద్రుడు వర్షచక్రాన్ని త్రిప్పుతాడు.

భగవంతుని తమోగుణరూపమైన మాయే నిద్రగా చెప్పబడుతోంది. అతని తమోగుణరూపమైన మాయే రాత్రి అయి నిద్రారూపంలో జీవుల యొక్క జీవితంలో సగభాగం నష్టపరుస్తున్నది. పగటి పూట తిన్న ఆహారాన్ని అరిగేట్టు చేయుటానికి రాత్రిపూట నిద్ర ఆక్రమిస్తుంది. మరణ సమయంలో ఈ నిద్రే ప్రాణాన్ని తీసుకుపోతుంది. ఈ నిద్ర జీవుల్ని త్వరగా మోహంలో పడవేస్తుంది. భగవంతుడైన విష్ణువు తన నారాయణాశ్రమంలో ఆ నిద్రకు లోబడి సమస్త ప్రపంచాన్ని మోహంలో పడవేసి పడుకుంటాడు. వెయ్యి దివ్యసంవత్సరాలు నిద్రతో గడుపుతాడు. ద్వాపరయుగం చివర జీవులు మిక్కిలి దుఃఖంలో ఉండటం చూచి మహర్షులు స్తోత్రం చేయగా ఆయన మేల్కొంటాడు. ఋషి సమూహం ఇలా పలుకుతారు.

ఓ హృషీకేశ! ఇప్పుడు మీరు అనుభవించిన పుష్పమాలను వలె నిద్రను విడిచిపెట్టండి. ఇటు చూడండి. బ్రహ్మజ్ఞానులు, బ్రహ్మవాదులు వ్రతాలు చేసే వాళ్ళు అయిన ఋషిసమూహం బ్రహ్మగారితో సహ తమ దర్శనం కోరి స్తోత్రం చేస్తున్నారు. మీరు దేవతల శుభవాక్యాలను వినండి. ఇటువైపు మునులతో కూడి

సప్తర్షులు అర్థవంతములైన దివ్యస్తోత్రములు చేస్తున్నారు. ఓ కమలనయన! దేవతలకు ఏదో కావలసిన ప్రయోజనమున్నది. అందుచేతనే మీరు లేచారు. ఈ వాక్యాలను విని భగవంతుడు విష్ణువు మేల్కొన్నాడు. అతడు లేవగానే చీకటి మాయమైంది. బ్రహ్మాదిదేవతలు లోకక్షేమం కోసం కొంచం చెప్పదలచి బాధ పడుతూ నిలబడ్డారు. వాళ్ళను చూడగానే విష్ణువు వాళ్ళను గూర్చి ధర్మంతో హేతుబద్ధమై అర్థవంతముగ మాటలను ఇట్లు పలికాడు.

ఓ దేవతలారా! మీకెవళ్ళతో యుద్ధం వచ్చింది? ఎవళ్ళ వల్ల మీరు భయపడు తాన్నారు? రాక్షసుల వల్ల మనుష్యులకు అశుభం కలిగే సంఘటన లేమీ లేవుగదా! చెప్పండి. నేను త్వరగా తెలుసుకోవాలనుకుంటున్నాను. మీకు శుభం కలుగ జేయటం కొరకు, నేను లేచి కూర్చున్నాను. ఇప్పుడు నేను చేయదగిన దానిని చెప్పండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
విష్ణువు యోగనిద్ర ఋషుల దేవతల ప్రార్థన అను యాభైయవ అధ్యాయము

☆☆☆

# యాభై ఒకటవ అధ్యాయము

## విష్ణువు దేవతలతో మాట్లాడుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

శ్రీమహావిష్ణువు మాటలు విని బ్రహ్మదేవుడు దేవతలందరికీ మేలు కలిగే మాటను ఇలా చెప్పాడు.

రాక్షస వినాశకుడవైన నారాయణా! నీవు మమ్ము యుద్ధసముద్రం నుండి బయటకు తీసి అభయమివ్వటానికి నిలిచి ఉండగా భయపడే ఊహే లేదు. ఇంద్రుడు రాజ్యం చేస్తుంటే మీరు మా శత్రువులను నశింపచేస్తున్నారు. మనుష్యు లందరూ సత్యధర్మపరులై ఉన్నారు. రాజులు ఒకరితోఒకరు యుద్ధం చేయటం లేదు. ఎక్కువ ధనాన్ని వెచ్చించి ప్రజలకు సుఖసమృద్ధిని, ధనాగారాన్ని నింపుట చేస్తున్నారు. ఎవరినీ కఠినంగా దండించడలేదు. నాలుగు వర్ణాలవాళ్ళు ధర్మాన్ని పరిపాలిస్తూ దేశరక్షణ చేస్తున్నారు. ఎవరికీ ఎట్టి భయమూ లేదు. జనులందరూ మంత్రుల యొక్క ఆలోచనాబలంచేత చతురంగసేన చేతనూ రక్షింపబడుచు న్నారు. ఎక్కువగా దక్షిణలిచ్చి యజ్ఞాలు చేస్తున్నారు.

అందరూ ఋషుల నియమాల ననుసరించి నడుస్తున్నారు. ధర్మశాస్త్రం చెప్పిన ధర్మాలనన్నిటినీ ప్రజలు ఎరుగుదురు. రాజులు మహర్షుల వలె తేజస్సు కలవారై సత్యయుగంగా చేస్తున్నారు కాలాన్ని. మేఘాలు సకాలంలో వర్షం కురుస్తున్నాయి. వాయువు అనుకూలంగా వీస్తున్నది. దిక్కులు నిర్మలంగా ఉన్నాయి. ఏ విధమైన అపశకునాలు లేవు. చంద్రుడు సౌమ్యంగా తిరుగుతున్నాడు. సూర్యుడు అందరికీ అనుకూలంగా ఉన్నాడు. అగ్ని అనేక విధములైన హవిస్సులతో తృప్తిపడి చక్కని పరిమళం వెదజల్లుతున్నాడు. రాజుల యొక్క సేనల వలన భూమికి పెద్దకష్ట మేర్పడింది. భూమి మునిగిపోయే పడవలా భయంకరమైన కష్టంలో ఉంది. ఇప్పుడు ఒక్కొక్క నగరంలో ఒక్కొక్క రాజు ఉన్నాడు. ప్రతి పట్టణానికి కోట్ల కొలది గ్రామాలున్నాయి. ప్రతి రాజువద్ద లెక్కలేనంత సేన ఉంది. ఆ రాజుల యొక్క విస్తారమైన సేవలచేత భూమి సందు లేకుండా ఉంది.

ఓ భగవంతుడా! ఈ విధంగా దుఃఖపడుతూ భూమి కాలంతో పాటు నా వద్దకు వచ్చింది. ఇప్పుడు నీవొక్కడేవే ఈమెకు గతి. మనుష్యులకు కర్మభూమియైనది బాధపడుచున్నది. ఆమె బాధను మేము విన్నాం, నీవు విన్నావు. ఆమెకు బరువు తగ్గించుటకు నీతో ఆలోచించుతాము. ప్రజలందరూ ధర్మమార్గాన నడుస్తున్నారు. ధర్మానికి లోపం కలుగుకుండునట్లు ఆలోచించండి. భూమికి భారం లేకుండ చేయటానికి రాజులనే చంపాలి. ఈ విషయాన్ని స్థిరంగా ఆలోచించటానికి మనం భూమితోకూడ మేరుపర్వత శిఖరానికి వెళ్దాం రండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
విష్ణువు దేవతలతో మాట్లాడుట అను యాభై ఒకటవ అధ్యాయము.

☆☆☆

# యాభై రెండవ అధ్యాయము

## భూమి తన దుఃఖాన్ని చెప్పుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నీటితో కూడిన మేఘంలాగ నల్లని శరీరం గల విష్ణుభగవానుడు గంభీరమైన కంఠస్వరంతో అలాగా కానీయండి అని దేవతలతోపాటు మేరుపర్వతం వైపు బయల్దేరారు. భగవంతుని వక్షస్థలం శ్రీవత్సమనే పుట్టుమచ్చతో హారము ప్రకాశిస్తున్నది. ఆయన శరీరం మీద పీతాంబరం ప్రకాశిస్తోంది. అందుచే సంధ్యా

కాల మేఘంతో కూడిన పర్వతంలా అతని శరీరం శోభిస్తోంది. ఆయన గరుడ వాహనంపై వెళ్ళుచుండగా బ్రహ్మ, ఇంద్రాదిదేవతలు వెంట వచ్చారు. త్వరగానే వాళ్ళు మేరుపర్వతం చేరారు. అక్కడ దేవతలు సూర్యకిరణాలతో ప్రకాశించుతూ ఏరూపాన్నైనా ధరించగల దేవసభను చూచారు.

అందులో బంగారు స్తంభాలున్నాయి. దాని బయట ద్వారము రత్నములు పొదగబడి ఉంది. వజ్రాలతో రణం ఉంది. అంతటా రత్నాలు పొదిగిన చిత్రాలున్నాయి. విశ్వకర్మ నిర్మించిన దేవమాయతో కూడిన సభా భవనం అది. దేవతలందులో ప్రవేశించి సంతోషంతో విమానలలో ఆసనముల మీదను కూర్చొని ఉన్నారు. తరువాత బ్రహ్మ ప్రభంజనవాయువుకి శబ్దం వినపడకుండా చూడమని ఆజ్ఞ యిచ్చాడు. నిశ్శబ్దంగా స్తిమితంగా ఉన్న ఆ దేవతల సభలో భూమి కష్టంతో దీనంగా ఇలా పలికింది.

దేవా! కొంచం బలంతో ధరించే దాన్ని నీ అనుగ్రహంతో నేను ప్రయత్న పూర్వకంగా ధరిస్తున్నాను. నీవు పోషించని ప్రాణిలేదు. ఓ నారాయణా! లోకం యొక్క మేలుకోరి నీవే ప్రతియుగంలోనూ భూమికి బరువు తగ్గిస్తున్నావు. నీ ప్రభావంచేతనే నేను పాతాళం చేరాను. ఇప్పుడు నిన్ను శరణువేడుతున్నాను. మీరు నన్ను రక్షించండి. దుర్మార్గులైన రాక్షసుల ద్వారా బాధ ఏర్పడినప్పుడు మిమ్మల్ని శరణు వేడుతున్నాను. నిన్ను శరణువేడకపోతే లక్ష విధాల భయం కలుగుతోంది. పూర్వం బ్రహ్మ నన్ను తగ్గించి మట్టితో ఇద్దరు రాక్షసుల్ని సృష్టించాడు. తరువాత వాళ్ళ శరీరాలు తాకి చూడగా ఒకడి శరీరం మెత్తగా, రెండవవాడి శరీరం కఠినంగా ఉంది. మెత్తని శరీరం వాడికి మధువని, గట్టి శరీరంవాడికి కైటభుడని పేరపెట్టాడు.

నామకరణం అయిన తరువాత వాళ్ళిద్దరూ యుద్ధం చెయ్యాలని ఆలోచించారు. వాళ్ళు వస్తున్నారని చూచి బ్రహ్మదేవుడు సముద్రము నీటిలో దాక్కున్నాడు. పూర్వం నీబొడ్డు నుండి పుట్టిన పద్మమే అతని నివాసస్థానమైంది. ఆ రాక్షసులిద్దరూ మహాసముద్రం నీటిలో ప్రవేశించారు. అక్కడ చాలాకాలం నిశ్చింతగా నిద్రపోయారు. చాలాకాలం తరువాత వాళ్ళిద్దరూ తిరుగుతూ తిరుగుతూ బ్రహ్మగారి దగ్గరకు వచ్చారు. పెద్ద శరీరం గల భయంకర రాక్షసులను చూచి బ్రహ్మ తామర తూడుతో విష్ణుమూర్తిని మేల్కొలిపాడు. విష్ణుమూర్తి పక్క నుండి లేచాడు. అప్పుడా రాక్షసులకు విష్ణుభగవానునికి ఘోరమైన యుద్ధం జరిగింది.

చాలాకాలం యుద్ధం చేసిన తరువాత ఆ రాక్షసులిద్దరూ సంతోషించారు. మేము నీ యుద్ధము నేర్పు చూచి సంతోషించాము. కనుక మేము నీ చేతిలోనే మరణించుట మంచిదని తలుస్తున్నాము. కాని నీరు లేనిచోట చావాలని మా అభిప్రాయం. మేము ఎవడిచేతిలో చస్తామో వాడికే పుత్రులముగా పుట్టాలని మా కోరిక అన్నారు. అప్పుడు నీవు వాళ్ళిద్దరినీ నీ చేతులతో పట్టుకొని గట్టిగా నొక్కటం చేత వెంటనే మరణించారు. ఇలా చచ్చిపోయి ఆ రాక్షసులు సముద్రపు నీటిలో మునిగిపోయారు. నీటి కెరటాలచే కొట్టబడిన వాళ్ళ శరీరం నుండి వచ్చిన క్రొవ్వు నీటిలో కలిసిపోయింది. నారాయణుడు మళ్ళీ ప్రజలను సృష్టించాడు. రాక్షసుల కొవ్వుతో కప్పబడినందున భూమికి 'మేదిని' అనే పేరు వచ్చింది. తరువాత నీ ప్రభావం వల్ల నేను నిత్యమైన భూమిగా చేయబడ్డాను.

పూర్వం వరాహరూపం ధరించి మార్కండేయుడు చూస్తుండగానే ఒక కొమ్ముతో నీటిమధ్య నుండి నన్ను పైకి తెచ్చావు. నీవొకమారు బలిచక్రవర్తి యజ్ఞంలో కాళ్ళతో కొలిచి నన్ను ఉద్ధరించావు. ఈ సమయంలో దిక్కులేనిదాన్నై మిక్కిలి కష్టపడి నిన్ను శరణుజొచ్చాను. బంగారానికి అగ్ని, కిరణాలకు సూర్యుడు, నక్షత్రాలకు చంద్రుడులాగా నీవు నాకు గురువుగా ఉన్నావు. ప్రపంచాన్ని నేను మోస్తుంటే నాకు శక్తినిచ్చి పోషించేవాడివి నీవు, పరశురాముడు నా బరువును తోసివేయుటకు ఇరవై ఒక్కమారు క్షత్రియులను నశింపచేశాడు. రాజుల రక్తంతో తర్పణం చేశాడు. తరువాత దక్షిణగా కశ్యపమునికి దానం చేశాడు. క్షత్రియుల రక్తమాంసాలచేత, కొవ్వుచేత దుర్గంధం కలదానినై కశ్యపమహర్షి వద్దకు వెళ్ళాను. ఓ భూమి! ముఖం వంచి ఎందుకు దుఃఖిస్తున్నావని కశ్యపుడు అడిగాడు. అప్పుడు నేను కశ్యపమహర్షికి ఇలా చెప్పాను.

పరశురాముడు నాభర్తలను చంపివేశాడు. నేనిప్పుడు విధవైనాను. నాపట్టణాలు శూన్యమయ్యాయి. కాబట్టి నేను బ్రతక తలుచుకోలేదు. కనుకనే మహానుభావా! నాకు తగిన భర్తను ఇవ్వండి. అతడు సముద్రాలనీ, గ్రామాలనూ, నగరాలతోసహా నన్ను రక్షించటానికి సమర్థుడుగా ఉండాలి.

పూజ్యుడైన కశ్యపుడు ఆ మాటను విని సరేనన్నాడు. తరువాత మనుష్యులలో గొప్పవాడైన మనువుకు నన్ను ఇచ్చాడు. ఆ మనువు వలన జన్మించిన ఇక్ష్వాకులం రాజులలో ఒకరి తరువాత ఒకరిని పొందాను. మహర్షులతో సమానులైన రాజులచే

పరిపాలింపబడ్డాను. చాలామంది క్షత్రియులు నన్ను జయించి స్వర్గం చేరారు. నాకోసం దెబ్బలాటలు జరిగాయి, జరుగుతున్నాయి కూడా.

ఓ జగన్నాధా! ఇది అంతా నీ యొక్క లీలాప్రభావమే. లోకకళ్యాణం కోసం నీవే యుద్ధభూమిలో క్షత్రియుల మరణానికి కారణం. కనుక నా భారాన్ని తగ్గించ టానికి నీ హృదయంలో దయుంటే నాకు అభయం ఇవ్వండి. చక్రాయుధాన్ని ధరించే నీవే నాకు సహాయం చేసేవాడవు. నేను నిన్ను శరణు వేడుతున్నాను. మీరు నా భారాన్ని తొలగిస్తారా లేదా చెప్పండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
భూమి తన దుఃఖాన్ని చెప్పుట అను యాభై రెండవ అధ్యాయము

☆☆☆

# యాభై మూడవ అధ్యాయము

## బ్రహ్మ ఆజ్ఞచే దేవతల అంశావతారములు

వైశంపాయనుడిలా చెప్పాడు.

దేవతలందరూ భూదేవి మాటలను విని ఆమె అభిప్రాయాన్ని నెరవేర్చుటకు దేవతలు బ్రహ్మతో దేవా! భూదేవి బరువు తగ్గించటానికి ఏదైనా ఉపాయం చూడండి. ఎందుకనగా అన్ని లోకాల్నీ నీవే సృష్టించావు. నీవే లోకకర్తవు ప్రభువు. ఎవరే పని చేయాలో చెప్పు. ఎవరు భూలోకంలో అవతరించాలో మీ రాజ్ఞాపిస్తే మేము ఏ జాతిలోనైన పుట్టుటకు సమర్థులము అన్నారు. దేవతల మాటలు విని బ్రహ్మ ఓ దేవతలారా మీ నిశ్చయమే నానిశ్చయము. కాబట్టి మీరు తేజస్సును బట్టి ప్రభావాన్ని బట్టి మీమీ అంశలతో ప్రపంచంలో అవతరించి మూడులోకాలకు లక్ష్మివంటి భూదేవిని రక్షించండి. నేనిదివరకే ఆలోచించిన ఉపాయాన్ని చెపుతా వినండి.

నేను పూర్వం ఇతిహాస పురాణాది విషయాల చర్చ చేస్తుండగా గంగ సముద్రం మరుద్గణం మొదలైనవారు నావద్దకు వచ్చారు. సముద్రుడు ఉజ్జ్వలవేషం ధరించి చంద్రునితో కూడి గంభీరమైన కంఠధ్వని కలవాడై నన్ను తిరస్కరిస్తూ తన ఒడ్డును దాటుతూ ఉప్పు నీటితో ఆ ప్రదేశాన్ని తడిపేశాడు. ఆ ప్రదేశాన్ని తొక్కివేయుటకు ప్రయత్నించాడు. అప్పుడు కోపంతో నేను శాంతించావా? అని అడిగాను. వెంటనే

సముద్రుడు తన వేగాన్ని తరంగాల్ని లేకుండా చేశాడు. అతని శరీరం మీద రాజ్యలక్ష్మి శోభ కనబడింది. తరువాత మీకు శుభం కోరి నేను గంగకూ సముద్రునికి శాపమిచ్చాను. నీవు రాజు రూపములో నా యెదుటకు వచ్చావు కనుక రాజు వేకమ్ము. భరతవంశంలో పుట్టి నీ తేజః ప్రభావాలతో ప్రజలను నియమించు నేను శాంతించ మన్నంతనే శాంతించావు. కనుక ప్రపంచంలో శంతనుడు అనే పేరు పొందుతావు.

అప్పుడు సౌందర్యవతియైన గంగ స్త్రీగా మారి నీతో కూడా ఉంటుంది. నేనిలా మాట్లాడగానే సముద్రుడు మిక్కిలి కోపించి ప్రభూ! దేవదేవ! నేను నీ ఆజ్ఞను పాటించే పుత్రుడను. మిమ్మల్ని తప్ప ఎవ్వరినీ ఎరుగను. నాకెందుకు శాపమిచ్చావు? నేను నీ ఆజ్ఞ ప్రకారం ప్రతిపూర్ణిమనాడూ వృద్ధి చెందుతూ ఉంటాను. ఇందులో నా తప్పేముంది? వాయువేగంగా వీచటంచేత నా నీరు మీ శరీరాన్ని తాకింది. దీనిచేత నేను శాపం పొందదగినవాడను కాను. మరొక కారణం చేత నేను తప్పు చేస్తే క్షమించి నాకు శాపం తగలకుండా చేయండి. నా మాట మీద విశ్వాసముంటే నాపై దయచూపండి. గంగాదేవి ఏమీ తప్పు చేయలేదు. నా తప్పు వలన ఈమెకు శాపం తగదు. అందుచే ఈమెపై ప్రసన్నులుకండి అన్నాడు.

అప్పుడు దేవతలు ఓ సముద్రుడా! నీవు దేవతల ప్రయోజనాన్ని ఎరుగవు. ఈ కారణంచేత శాపం వల్ల భయపడిపోయావు. భయపడవలసిన అవసరంలేదు. శాంతి పొందు. ఇప్పుడు నీవు సముద్ర శరీరం విడిచి రాజు శరీరంలో భరతవంశంలో జన్మించుము. అక్కడ రాజులకు చక్రవర్తివై నాలుగు వర్ణాల ప్రజలను పరిపాలిస్తూ కాలం గడుపుతావు. ఈ గంగ కూడ అందమైన రూపం ధరించి నిన్ను సేవిస్తుంది. ఓ సముద్రుడా! నా అనుమతితో గంగతో ఆనందాన్ని అనుభవిస్తూ మనుష్యజన్మ వల్ల కష్టాన్ని మరిచిపోతావు. ఇప్పుడు అష్టవసువులు స్వర్గం నుండి జారి పాతాళంలో ప్రవేశించబోయారు. వాళ్ళను పుట్టించటానికి నేను నిన్ను పంపుతున్నాను.

ఈ గంగ ఆ ఎనమండుగుర్ని పుత్రులుగా కంటుంది. వాళ్ళు సూర్యునివంటి గుణవంతులు, దేవతలకు సంతోషం కలిగించేవాళ్ళు. నీవు త్వరగా వసువులను కని కురువంశాన్ని వృద్ధిచేసి మళ్ళీ సముద్ర శరీరాన్ని ప్రవేశిస్తావు. దేవతలారా! మీ మేలు కొరకు భూమికి భారం తొలగించుటకు భవిష్యత్తును చూచి పూర్వమే నిశ్చయించాను. ఈవిధంగా శంతను వంశాన్ని భూమిపై జన్మింపచేశాను. శంతను

వంశంలో పుట్టే ఏడుగురూ స్వర్గానికి వెళ్తారు. ఎనిమిదవవాడైన గంగా పుత్రుడు భీష్ముడు ఒకడే భూలోకంలో ఉంటాడు. శంతను మహారాజుకు రెండవ భార్యకు విచిత్రవీర్యుడనే పుత్రుడు కలిగాడు.

తేజశ్శాలియైన అతడు రాజ్యమందు పట్టాభిషిక్తుడయ్యాడు. అతని పుత్రులు పాండు ధృతరాష్ట్రులు. భూలోకంలోనే ఉంటారు. పాండురాజుకు కుంతి, మాద్రి అని యిద్దరు భార్యలు. ధృతరాష్ట్రుడికి పతివ్రతయైన గంధారి ఒక్కటే భార్య. ఓ దేవతలారా! మీరు శంతను వంశాన్ని విభజించి కొందరిని దేవతల పక్షంలోను, మరికొందరిని శత్రుపక్షంలోను సృష్టించండి. ముందు ముందు ఈ యిద్దరి రాజుల పుత్రులకు గొప్ప భయంకరయుద్ధం జరుగుతుంది. ఆయుద్ధంలో చాలా మంది రాజులు మరణించి యమలోకానికి పోతారు. ఈ పోరాటం ప్రళయ కాలంలా భయంకరమౌతుంది. అప్పుడు చాలామంది రాజులు వాహనాలు నశించి అనేక పట్టాణాలు, రాష్ట్రాలు గల భూమి బరువులేనిదవుతుంది.

ద్వాపరయుగం చివరలో రాజులందరూ శస్త్రాలతో యుద్ధం చేసి వాహనాలతో సహా నష్టపోతారని నేను జ్ఞాన దృష్టితో చూచాను. ఆయుద్ధంలో చావకబ్రతికియున్న వాళ్ళను అశ్వత్థామ భస్మం చేస్తాడు. ప్రళయకాలం వంటి ఆ క్రూరకార్యం పూర్తి కాగానే మూడవ ద్వాపరయుగం పూర్తి అవుతుంది. పరమేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు తన స్వస్థానానికి వెళ్ళిన తరువాత భయంకరమైన కలియుగం వస్తుంది. కలియుగం సాధారణంగా అందరూ ధర్మం తప్పినవారౌతారు. అప్పుడు ధర్మం ఎక్కడో ఒకచోట ఉంటుంది. సత్యం క్షీణించిపోతుంది. అసత్యం పెరుగుతుంది. ఆసమయంలో అందరూ శంకరుడికీ కుమారస్వామికీ భక్తులౌతారు. జనులు, ముసలివాళ్ళు కాకుండనే మరణిస్తారు. రాజుల వినాశానికి నేను చెప్పిందే మంచి ఉపాయం.

దేవతాలారా! మీరు వృథాగా కాలం గడపక వెంటనే మీ మీ అంశలతో భూలోకంలో అవతరించండి. కుంతి గర్భాన యముని అంశను, గాంధారి గర్భాన కలిపురుషుని అంశను స్థాపించండి. ఈ యిద్దరి వల్ల రెండు పక్షాలు ఏర్పడుతాయి. భూమండలంలోని రాజులంతా ఈ రెండు పక్షాలలో చేరతారు. అప్పుడు భూమి లోకాన్ని ధరించే శరీరాన్ని పొందుతుంది. భూలోకంలో రాజుల వినాశానికి ఈ ఉపాయాన్ని మొదటే నిశ్చయించి పెట్టాను. బ్రహ్మ మాటలు విని భూమి తిరిగి

వెళ్ళిపోయింది. రాజుల నాశానికి సమయము నిరీక్షిస్తున్నది. (ఎదురుచూస్తున్నది) బ్రహ్మ ఈ విధంగా రాక్షసుల వినాశం కోసం దేవతలందరికీ ఆజ్ఞ ఇచ్చాడు. దేవతలందరూ తమ తమ అంశలతో భూమిపై అవతరించాడు.

మహాబలవంతులైన వాళ్ళు లక్షలకొలది వేలకొలది వృష్ణి వంశంలో కురు వంశంలో పాంచాల వంశంలో బ్రాహ్మణుల ఇళ్ళలో జన్మించారు. వీళ్ళు ధర్మబుద్ధి కలవాళ్ళు. వీళ్ళు పర్వతాలను కదపగలరు. భూమిని చీల్చగలరు. ఆకాశానికి ఎగరగలరు. సముద్రాన్ని కల్లోలం చేయగలరు. బ్రహ్మ ఈ విధంగా వాళ్ళను ఆజ్ఞాపించి లోకరక్షణ భారాన్ని నారాయణునిపై ఉంచి శాంతిని పొందాడు. భగవంతుడైన విష్ణువు బుద్ధిమంతుడైన వసుదేవుని కులంలో జన్మించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి హరివంశపర్వంలో
బ్రహ్మ ఆజ్ఞచే దేవతల అంశావతారములు అను యాభై మూడవ అధ్యాయము

☆☆☆

# యాభై నాల్గవ అధ్యాయము

## నారద విష్ణు సంవాదం

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! నియమప్రకారం నిశ్చయింపబడిన సమయంలో అర్జునుడు ఇంద్రుని యొక్క భీముడు, వాయువు యొక్క నకుల సహదేవులు, అశ్వినీదేవతల యొక్క కర్ణుడు, సూర్యుని యొక్క ద్రోణాచార్యుడు, బృహస్పతి యొక్క భీష్ముడు, ఎనిమిదవ వసువు యొక్క విదురుడు, ధర్మం యొక్క దుర్యోధనుడు, కలియొక్క అభిమన్యుడు, చంద్రుని యొక్క భూరిశ్రవుడు, శుక్రుని యొక్క శృతాయుధుడు, వరుణుని యొక్క అశ్వత్థామ, శంకరుని యొక్క కణికుడు, మిత్రుని యొక్క ధృతరాష్ట్రుడు, కుబేరుని యొక్క ఇలా దుశ్శాసనుడు మొదలగువాళ్ళు గంధర్వుల యొక్క, సర్పాలయొక్క అంశతో జన్మించారు. దేవతలీవిధంగా అవతరించిన తరువాత దేవతల పక్షంలో కలిసి ఉన్న నారదమహర్షి విష్ణుభగవానుని సభకు వెళ్ళి కోపంతో విష్ణువును ఇలా అన్నాడు.

ఓ కేశవ! దేవతలు చాలామంది రాజుల నాశంకోసం తమతమ అంశలతో అవతరించారు. వాళ్ళంతా వ్యర్థం నీ సహాయంతోనే క్షత్రియులతో యుద్ధం

ఫలిస్తుంది. వరనారాయణులుంటేగాని పని జరుగదు. యథార్థం తెలిసికూడా భూమి కోసం ఇలా చేయటం బాగాలేదు. దేవతలందరూ అవతరించారు కాని నీ అంశతో ఎవడూ అవతరించలేదు. అవతరించిన దేవతల సహాయం కొరకు నీవు వాళ్ళను ప్రేరేపిస్తే వాళ్ళు తమ పనిలో ఫలితం సాధించగలగుతారు. ఓ విష్ణుదేవా! నీ అంశావ తారం కనబడక నేను పరుగెత్తుకొని వచ్చాను. నిన్నీ పనిలో ప్రేరేపించు టకే నేనిక్కడకి వచ్చాను. దీనికి కారణం చెపుతా -

ఓ హృషీకేశ! పూర్వం తారకామయ యుద్ధ సమయంలో నీచేత మరణించిన వారి స్థితి చెపుతున్నా. భూలోకంలో యమునానది ఒడ్డున అనేక విధాలైన జనులతో నిండిన మధురాపురమనే అందమైన పట్టణముంది. పూర్వం మధువనమని దాని పేరు. అక్కడ గొప్ప పరాక్రమవంతుడు అందరికీ భయంకలిగించేవాడు అయిన మధు అనే రాక్షసుడు ఉంటూ ఉండేవాడు. అతని కొడుకు మహాబలశాలి 'రావణుడు' తన తండ్రితో సమానమైన బలవంతుడు. జనులకు భయం కలిగించే వాడు చాలా సంవత్సరాలు ఆటలతో గడిపిన తరువాత అక్కడి జనులను, దేవత లను వెళ్ళగొట్టే వాడు. అప్పుడు అయోధ్యలో శ్రీరాముడు రాజ్యం పాలిస్తున్నాడు.

రావణుడు రామచంద్రుని వద్దకు దూతని పంపాడు. ఆదూత పెడుసుగా మాట్లాడేవాడు. అతడు రాముని వద్దకు వచ్చి రామా! రాక్షసరాజు లవణుడు మీకు సమీపంలో ఉన్నాడు. మీకు శత్రువు. సాధారణంగా అభిమానవంతులైన సామంత రాజులను దగ్గర ఉండనీయకూడదు. రాజులు శత్రువులను ఓడించుట ముఖ్యమైన పనిగా తలుస్తారు. పట్టాభిషిక్తుడైన మొదట తన ఇంద్రియాలని జయించాలి. ఇంద్రియ జయమే వాస్తమైన విజయం. రాజులకు నీతిని ఉపదేశించే వాడెవడూ ఉండడు. ఇంద్రియాలనే శత్రువులు బలవంతులైతే అటివాళ్ళు ఉద్ధరింపబడరు. మీరు ఒక సాధారణ స్త్రీ కొరకు రావణుని, అతని వంశాన్నీ చంపారు. నాకీవిషయం యుక్తయుక్తంగా లేదు.

ప్రపంచంలో మీరు చేసిన ఈ పని గొప్పదిగా తలచబడుచున్నది. కాని మీకిది నిందింపతగినదే. ఎందుచేతనంటే అప్పుడు మీరు వ్రతాన్ని అవలంబించి వనవాసం చేస్తున్నారు. వనవాసియైన తాపసుడు రాక్షసైన్యాన్ని చంపటం సజ్జనులు ఒప్పుకొనేది కాదు. కోపాన్ని విడిచిపెట్టుటే సజ్జనులకు తగిన ధర్మం. మీరు మోహానికీ కోపానికి లొంగిపోయి రాక్షసులను చంపారు. రావణుడు దుర్బుద్ధి ఇంద్రియ జయం లేనివాడు కాబట్టి మీరతన్ని చంపగలిగారు. మీరు సమర్థులైతే ఇప్పుడు

నాతో యుద్ధానికి రండి. అని పలికాడు. కఠినంగా మాట్లాడే దూత మాటలను విని శ్రీరాముడు ధైర్యంతో తొట్రుపాటు లేకండా చిరునవ్వుతో ఇలా అన్నాడు.

ఓ దూతా! నేను వేదమార్గాన్ని అనుసరించేవాణ్ణి. రావణుని పై గౌరవం చూపించి నన్ను దూషించటం న్యాయం కాదు. నేను సత్యమును పాటించేవాణ్ణి. రావణుడు నా భార్య నపహరించాడు. అందుచే అతన్ని చంపాను. ఈ విషయంలో దోషం ఏమున్నది? నీవు నీ ప్రభువు సందేశాన్ని వినిపించి నీ పని పూర్తి చేసుకొన్నావు. ఇప్పుడు నీవు వెళ్ళవచ్చు. నావంటివాళ్ళు తనను పొగడుకునే నీచులతో యుద్ధం చేయరు. ఈ నా చిన్నతమ్ముడు శత్రుఘ్నుడే యుద్ధంలో అతన్ని చంపుతాడు. శ్రీరామచంద్రుడీ విధంగా మాట్లాడిన తరువాత సుమిత్రాదేవి కుమారుడైన శత్రు ఘ్నుని వెంట బెట్టుకొని ఆ దూత వెళ్ళిపోయాడు. ఆ రాక్షసుని పట్టణానికి త్వరగా వెళ్ళి శత్రుఘ్నుడు యుద్ధోత్సాహంతో నగరసమీపంలో శిబిరం నిర్మించాడు.

దూత నుండి విషయమంతా విని క్రోధోద్రిక్తుడై యుద్ధానికి సంసిద్ధంగా శత్రు ఘ్నుని వద్దకు రావణాసురుడు వచ్చాడు. ఆ యిద్దరు వీరులకు గొప్ప యుద్ధం జరిగింది. ఒకరిపై ఇంకొకరు తీవ్రమైన బాణవర్షం కురిపించారు. ఇద్దరిలో ఎవరూ అలిసిపోలేదు. తరువాత కొంతసేపటికి శత్రుఘ్నుని బాణాలచేత బాధింప బడి తన త్రిశూలాన్ని చేత బట్టి గర్జిస్తూ రాక్షసుడు శత్రుఘ్నుని కంఠం పట్టుకొని అంకుశంతో లాగాడు. అప్పుడు శత్రుఘ్నుడు కత్తి పట్టుకొని ఆ రాక్షసుని శిరస్సును ఖండించాడు. అతని నివాసమైన వనాన్ని కూడ ఛేదించాడు. అక్కడ ఒక పట్టణాన్ని నిర్మించాడు. ఆ నగరాన్ని సుందరంగా తయారుచేశాడు.

ఆ పట్టణంలో రథాలు, గుర్రాలు, ఏనుగులు ఉన్నాయి. ఆ పట్టణం యమునా నదిఒడ్డున అర్ధచంద్రాకారంగా నిర్మించబడింది. అక్కడ ప్రజలు సుఖసంతోషాలతో అభివృద్ధితో ఉన్నారు. రావణాసురుడు చనిపోయిన తరువాత భోజవంశంలో పుట్టిన మహాబలశాలి ఉగ్రసేనుడు రాజ్యసింహాసనమెక్కాడు. కాలనేమి కొడుకు ఉగ్రసేనుడికి పుత్రుడుగా జన్మించాడు. కంసుడు తన పరాక్రమంచేత ప్రపంచ ప్రఖ్యాతి చెందాడు. కాని అతడు దుర్మార్గుడు. అతని పేరు వింటేనే రాజుల యొక్క, ప్రజల యొక్క హృదయం కంపించేది. రాజధర్మం కంసుడికి బాగా ఇష్టమైనది. అతని స్వజనం కూడా అతని వలన సంతోషించే వారుకారు. అతని రాజ్యానికీ మంచి చేసేవాడు కాడు. అతడెప్పుడూ కోపంతో నిండి ఉండేవాడు. ప్రజలు తన్ని చూచి భయపడేవాళ్ళు.

హయగ్రీవుడనే రాక్షసుడు కంసునికి చిన్న తమ్ముడుగా పుట్టి 'కేశి' అనే పేరు గలవాడయ్యాడు. అతడు మనుష్య మాంసం తింటూ బృందావనంలో ఉండేవాడు. దితిపుత్రుడై నరిష్టుడు ఏనుగు రూపాన్ని పొంది కంసుడికి వాహనమయ్యాడు. లంబుడు ప్రలంబుడుగా పుట్టాడు. భాండీరవనం మర్రిచెట్టు మీద ఉండేవాడు. ఖరుడు ధేనుకాసురుడయ్యాడు. ఇతడు తాటిచెట్ల వనంలో ఉండి ప్రజల్ని చంపుతుండేవాడు. రాహుడు, కిశోరుడు అనే రాక్షసులు చాణూరుడు, ముష్టికుడు అనే మల్లులుగా పుట్టారు. నీవీ రాక్షసులను సంహరించావు. వీళ్ళు మనుష్యరూపంతో మనుషుల్ని బాధించేవాళ్ళు.

నిన్ను ద్వేషించేవాళ్ళందరూనీ భక్తుల్ని చంపేవాళ్ళు. నీకు విరోధులైన వాళ్ళు స్వర్గం పొందలేరు. అందువల్ల ఓ మహావిష్ణు రా భూలోకానికి పోదాం. రాక్షస సంహారం కోసం నీవు భూమి మీద అవతరించుము. దేవతలు అనేక విధాలైన రూపాలను ధరించి భూలోకంలో అవతరించారు. ఈ సమయంలో నీవు కూడ అవతరించు. నీవు అవతరిస్తే కంసుడు నశిస్తాడు. భూదేవి పని పూర్తి అవుతుంది. భారతదేశపు గొప్ప భారం నీమీద ఉంది. నీవు భారతదేశానికి నేత్రాలు. కాబట్టి హృషీకేశ! నీవు భారతదేశానికి వెళ్ళి రాక్షసులను సంహరించు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు హరివంశపర్వంలో
నారద విష్ణు సంవాదం అను యాభై నాల్గవ అధ్యాయము

☆☆☆

# యాభై అయిదవ అధ్యాయము

## బ్రహ్మ ఉపదేశము

వైశంపాయనుడిలా చెప్పాడు.

విష్ణుమూర్తి నారదుని మాటలు విని చిరునవ్వుతో శుభమైన వాక్యాన్ని ఇలా పలికాడు.

నీవు మూడులోకాల క్షేమం కోసం మాట్లాడిన దానికి సమాధానం చెపుతున్నా- రాక్షసులు ఏయే శరీరాలు ధరించి భూలోకం ఉన్న నేను అంతా ఎరుగుదును. ఉగ్రసేనుడి కొడుకు కంసుణ్ణి, కేశి, కువలయాపీడ, చాణూరముష్టిక రాక్షసుల నందరినీ నేనెరుగుదును. వీళ్ళు కాక ఖర, ప్రలంబ, పూతనలను, గరుడునికి

భయపడి యమునలో దాగిన కాళియునీ బాగా ఎరుగుదును. రాజుల తలలపై ప్రకాశించు జరాసంధుని కూడా ఎరుగుదును. ప్రాగ్జోతిషపురంలో నరకాసురుడు శోణితపురంలో బాణాసురుడు కూడ నాకు తెలుసు. భూభారాన్ని తగ్గించే పని నామీద ఉంది. కంసుడు మొదలైనవాళ్ళను ఎలా చంపాలో ఆలోచిస్తూనే ఉన్నాను. నేను యోగబలం చేత రాక్షసుల మాయనంతనూ నాశం చేస్తా. నేను ఎక్కడ ఉండి ఏవేషంలో రాక్షసు లను నాశం చెయ్యాలో బ్రహ్మ యిలా చెప్పాడు.

నారాయణా! పూర్వం కశ్యపుడు, వరుణుని ఆవులను తీసుకువెళ్ళాడు. కశ్యపుడికి అదితి, సురభి అని ఇద్దరు భార్యలు. వాళ్ళకు వరుణుని ఆవులను ఇవ్వటం ఇష్టంలేదు. ఒకరోజున వరుణుడు నావద్దకు వచ్చి నమస్కరించి ఓ పూజ్యుడా! నా తండ్రి కశ్యపుడు ఆవులనన్నిటినీ తీసుకున్నాడు. తన పని పూర్తి అయినా ఆవులను పంపలేదు. తన భార్యలైన అదితి, సురభి, అనేవాళ్ళ మాటలను సమర్థిస్తున్నాడు. నా ఆవులకు ఏనష్టం రాదు. సముద్రము ఒడ్డున సంచరిస్తున్నాయి. కశ్యపుడు తప్ప ఎవడూ బెదిరించలేడు. ఆ ఆవులు అమృతం వంటి శ్రేష్ఠమైన పాలను ఎన్నైనా యిస్తాయి. నీవు ప్రభువు గురువూ, నీవు అందరినీ నియమించే వాడివి. నీవే మాకు గొప్పదిక్కు. తప్పు చేసినవాళ్ళను శిక్షించకపోతే లోకం అస్తవ్యస్త మౌతుంది.

మీరు నా ఆవులను ఇప్పించండి. నేను సముద్రానికి వెళ్ళిపోతాను. మీరు మొదట ఆవులను, బ్రాహ్మణులనూ సృష్టించారు. అందుచేత ఆవులను కాపాడటం మీకు ప్రధానమైన పని. ఆవులను రక్షిస్తే అవి బ్రాహ్మణుల్ని రక్షిస్తాయి. గోబ్రాహ్మణ రక్షణ వల్ల ప్రపంచమంతా రక్షింపబడుతుంది. ఓ అచ్యుతా! వరుణుడిలా చెప్పిన మీదట బాగా తెలుసుకొని కశ్యపుడికి ఆవుల్ని అపహరించినందువల్ల భూలోకంలో గొల్లవాడుగా పుట్టమని శాపమిచ్చాడు. అతని భార్యలైన అదితి, సురభి కూడా అతనితోపాటు భూలోకంలో పుడతారు. కశ్యపుడు గొల్లవాడై పుట్టి తన యిద్దరు భార్యలతో విహరిస్తాడు అని అన్నాడు.

కనుక ఈ సమయంలో కశ్యపుడు గొల్లవాడై వసుదేవుడనే పేరుతో గోరక్షణ చేస్తున్నాడు. మధురానగరం దగ్గరే గోవర్ధనమనే పర్వతము ఉంది. అక్కడనే వసుదేవుడు ఉండి కంసుడికి పన్ను చెల్లిస్తూ గోకులానికి రాజుగా ఉన్నాడు. అదితి, సురభి ఇద్దరూ దేవకి, రోహిణి, పేర్లతో అవతరించారు. సురభి రోహిణి అయింది.

అదితి దేవకి అయింది. ఓ మధుసూదనా! లోకకల్యాణం కోసం గోపాలక వేషంలో అవతరించండి. పూర్వం వామనావతారంలో మాయతో కప్పబడినట్లు ఇప్పుడు గోపాలుడవై నీ శరీరాన్ని పోషించుకో. ఇంద్రుడు మొదలైన దేవతలు జయజయ ధ్యానాలు చేస్తూ స్తోత్రం చేస్తారు.

కాబట్టి నీవు దేవకీ రోహిణుల గర్భంలో జన్మించి వారిని సంతోషపెట్టు. అక్కడ వేలాది గోపికలు నీకు ఉత్సాహం కలిగిస్తారు. ఆవులను మేపటానికి అడివిలో తిరుగుతావు. ఆసమయంలో వనమాలతో ప్రకాశించే అందమైన నీ శరీరాన్ని చూచి కృతార్థులౌతారు. ఓ కమలనేత్ర! విష్ణు! నీవు బాలవేషంలో అవతరిస్తే నీ తత్త్వం తెలియక జనులు అజ్ఞానంలో పడతారు. 'గోపాలకులందరూ భక్తులై గోశాలలో నీకు సహాయం చేస్తారు. నీవు జలక్రీడకు యమునలో దిగినప్పుడు వాళ్ళందరూ మిక్కిలి సంతోషిస్తారు. వసుదేవుడికి నీవు ప్రాణమే. ఇప్పటివరకు నిన్ను తండ్రీ అనేవాడు కుమారా అంటాడు. మహర్షి కశ్యపుడే తండ్రి కాదగినవాడు అట్లే దేవకియే నీకు తల్లికాదగినది.

ఇప్పుడు యోగబలంతో భూలోకంలో రాజులను జయించుటకు వెళ్ళు. మేమందరం ఇప్పుడు మాయిళ్ళకు వెళ్తున్నాం. వైశంపాయనుడిలా అన్నాడు. మహారాజా! శ్రీమహావిష్ణువు దేవతలను వాళ్ళలోకానికి పంపి క్షీరసముద్రానికి ఉత్తర దిక్కునందున్న తన నివాసానికి వెళ్ళాడు. అక్కడ మేరుపర్వతం విశాలగుహ ఉన్నది. అక్కడనే తన వెనుకటి శరీరాన్ని ఉంచి భూలోకంలో వసుదేవుని యింటితో సంబంధం పెట్టుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి ఖిలవంశ పర్వంలో
బ్రహ్మ ఉపదేశము అను యాభై అయిదవ అధ్యాయము
మొదటిదైన ఖిలవంశపర్వం సమాప్తము

☆☆☆

## హరివంశ పురాణంలో రెండవదైన

# విష్ణు పర్వము

## మొదటి అధ్యాయము

### కంస నారద సంవాదము

వైశంపాయనుడిలా చెప్పాడు.

విష్ణువు దేవతల అంశలు భూలోకంలో పుట్టినట్లు తెలిసికొని నారదుడు కంసుడికి ఈ సమాచారం వినిపించటానికి మధురకు వెళ్ళాడు. కంసుడు త్వరగా మరణించాలని ఉద్దేశం. స్వర్గలోకం నుండి బయల్దేరి ఆయన ఒక్కక్షణంలో మధురా నగరంలో ఒక ఉద్యానవనమందు దిగాడు. అక్కడ నుండి కంసుడికి దూతను పంపాడు. ఆ దూత వెళ్ళి కంసుడికి నారదుని రాకను తెలియచేశాడు. నారదుని రాక వినగానే కంసుడు త్వరగా లేచి నగరం బయటకు వెళ్ళి చెప్పినచోట నిలిచాడు. అక్కడ పాపరహితుడై అగ్నివలె తేజశ్శాలియైన నారదుని ఎదుట నిలిచాడు. వెంటనే మునిశ్రేష్ఠుడికి నమస్కరించి శాస్త్ర ప్రకారం పూజ చేశాడు. తరువాత మునిరాజైన నారదుని అగ్నివంటి రంగు గల ఆసనం మీద కూర్చొనబెట్టాడు.

తరువాత మిక్కిలి కోపిష్ఠి కంసుడితో నారదుడు ఓ వీరుడా! నీవు నాకు బాగా సత్కారం చేశావు. నేనిపుడు చెప్పబోయే విషయం ఏకాగ్రతతో విని మనస్సుకు పట్టించుకో. నేను స్వర్గలోకంలో బయల్దేరి బ్రహ్మలోకం మొదలు అనేక లోకాలు తిరుగుతూ సుమేరుపర్వతం మీదికి వెళ్ళాను. అక్కడ ఇంద్ర కుబేరుల ఉద్యాన వనాలు చూచి దేవతలతోపాటు పవిత్ర తీర్థాలలో స్నానం చేసి పూజింపదగిన గంగానదిని చూచాను. అన్ని తీర్థాలలో స్నానం చేసి బ్రహ్మర్షులు సేవించే బ్రహ్మ లోకానికి వెళ్ళాను. అక్కడ బ్రహ్మ భవనం దేవతలు, ఋషులు, గంధర్వాప్సరసలు వీళ్ళ ధ్వనులతో నిండి ఉంది. నేనొకప్పుడు మేరుపర్వతం మీద దేవతల సమూహంతో కూడిన బ్రహ్మసభకు వెళ్ళాను. అక్కడ బ్రహ్మాదిదేవతలు దివ్యము లైన ఆసనాలమీద కూర్చున్నారు.

అక్కడ వారందరి సమాలోచనా, నిన్ను చంపుటకొరకే జరుగుతున్నది. మధురా నగరంలో నీ చిన్న చెల్లెలు దేవకికి పుట్టే ఎనిమిదవ సంతానం నీకు

మృత్యుదేవత అవుతుంది. అతడే నిన్ను చంపుతాడు. పూర్వజన్మలో కూడా నిన్ను చంపినవాడతడే. ఈ ఆశ్చర్యకర వృత్తాంతాన్ని నీచెవిలో వేశా. కాబట్టి దేవకి గర్భాన్ని నశింపచేసే ఉపాయం ఆలోచించు. నీమీద నాకు ఎక్కువ ప్రేమ. అందు చేత ఈ సమాచారాన్ని నీకు వినిపించటానికి ఇక్కడకు వచ్చా. ఇక వెళ్ళొస్తా. నీకు శుభమగుగాక. ఇలా చెప్పి నారదుడు వెళ్ళిన తర్వాత అతని మాటల నాలోచించి పెద్దగా నవ్వాడు. నా బాహుబలంచేత సమస్త భూమండలాన్ని క్షోభింపచేస్తా.

ఈనాడే మనుష్య పశుపక్ష్యాది దేవతలను సమర్థించే జీవులను చంపివేస్తాను. హయగ్రీవ, కేశి, ప్రలంబ, ధేనుకాది మిత్రులారా! మారువేషంతో భూమండలం అంతా తిరగండి. మన పక్షాన్ని దూషించేవాళ్ళను చంపండి. నారదుడు కడుపులో ఉన్న శిశువువల్ల నాకు భయమని చెప్పాడు. కనుక పిల్లల మీద కూడ దృష్టి పెట్టండి. సభలో ఉన్నవారి వైపు తిరిగి మీరెవ్వరూ భయపడకండి. నారదుడు కలహప్రియుడు. లోకులను ఉత్తేజపరుస్తూ తిరుగుతాడు అని పలికి విచారమనే అగ్నిచే కాలిపోతూ కంసుడు ఇంట్లో ప్రవేశించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కంస నారద సంవాదము అను మొదటి అధ్యాయము

☆☆☆

# రెండవ అధ్యాయము

## యోగనిద్రతో సంభాషణ

వైశంపాయనుడిలా చెప్పాడు.

కంసుడు మితిమీరిన కోపంతో తనమేలు కోరు మంత్రులతో దేవకి గర్భాన్ని ఛేదించటానికి ప్రయత్నించండి అని ఆజ్ఞాపించాడు. మొదటి శిశువు నుండి శిశువులనందరినీ చంపవలసిందే. దేవకి నాయింట్లో రక్షింపబడుతూ ఉన్నది. దేవకి గర్భవతి అయినప్పుడు మిక్కిలి జాగ్రత్తతో ఉండాలి. నా అంతఃపురస్త్రీలు మాసాలను బాగా లెక్కబెడతారు. నమ్మకస్తులైన నా సేవకులు రాత్రింబవళ్ళు వసుదేవుని రక్షిస్తూ ఉంటారు. ఈ కాపలాకి కారణం ఎవరికీ చెప్పవద్దు. ఈ పని మనుష్యులు సాధించ తగినది. మనుష్యులే పూర్తిచేస్తారు. మంత్రసమూహంచేత, ఓషధులచేత, ప్రయత్న పూర్వకంగా దేవతలను కూడ అనుకూలం చేసుకోవాలి అన్నాడు.

ఈ విధంగా దేవకి గర్భాన్ని (శిశువును) ఛేదించటానికి ప్రయత్నిస్తున్నాడు. కంసుడు నారదుని ద్వారా తన మరణ కారణాన్ని విని భయంతో దేవకి శిశువులను చంపుటకు ఆలోచింప మొదలుపెట్టాడు. భగవంతుడు విష్ణువు కూడా ధ్యానయోగం చేత కంసుడు దేవకి పుత్రులను చంపే ఆలోచనలో ఉన్నాడని తెలుసుకున్నాడు. కంసుడు దేవకి పిల్లల్ని ఏడుగుర్ని చంపుతాడు. నేను ఎనిమిదవ శిశువుగా జన్మించి నా పని పూర్తిచేస్తాను ఇలా ఆలోచిస్తూ ఉండగానే ఆయనకు గుర్తొచ్చింది. పాతాళ లోకంలో దేవతలతో సమాన పరాక్రమం గల కాలనేమి పుత్రులు షడ్గర్భులనే ఆరుగురు పడి నిద్రపోతున్నారు. వాళ్ళు అమృతం త్రాగి దీర్ఘాయువులయ్యారు.

పూర్వం వాళ్ళు తమ తాత అయిన హిరణ్యకశిపుని తిరస్కరించి బ్రహ్మను సేవించారు. గొప్ప తపస్సు చేసి బ్రహ్మను సంతోషపెట్టారు. మీకు వరమిస్తానని బ్రహ్మ చెప్పగా వాళ్ళు యక్షగంధర్వాదులలో ఎవరి వల్లనూ చావులేకుండునట్లు వరం అడిగారు. బ్రహ్మ అట్లేనని వరమిచ్చాడు. అప్పుడు హిరణ్యకశిపుడు కోపించి మీకు షడ్గర్భులని పేరు పెట్టిన మీ తండ్రే మిమ్మల్ని చంపుతాడు అని శపించాడు. ఈ విషయం గుర్తురాగానే విష్ణువు పాతాళానికి వెళ్ళి భగవంతుడు తన మాయా బలంతో నిద్రపోతున్న షడ్గర్భుల శరీరాలలో ప్రవేశించాడు. వాళ్ళ ప్రాణాలను నిద్రా దేవికిచ్చాడు. ఇలా చెప్పాడు!

నిద్రాదేవీ! నీవు దేవకి ఇంటికి వెళ్ళు ఆమె గర్భంలో ఒక్కొకణ్ణి ప్రవేశపెట్టు. క్రమంగా వాళ్ళు చంపబడతారు. ఇలా అయితే కంసుడి ప్రయత్నం వ్యర్థమవు తుంది. అప్పుడు నేను సంతోషిస్తాను. మీరు ప్రాణులందరిచే పూజింపబడతారు. తరువాత చంద్రుని అంశతో దేవకి గర్భం ధరిస్తుంది. అతడు నాకు అన్నఔతాడు. ఏడవ శిశువును దేవకి గర్భం నుంచి తీసుకొని రోహిణి గర్భంలో ప్రవేశపెట్టు. అతనికి సంకర్షణుడని పేరు వస్తుంది. ఇలా జరిగిన తరువాత భయంచేత దేవకి గర్భం పోతుంది. ఈ వార్త అంతటా వ్యాపిస్తుంది. తరువాత దేవకికి నేను ఎనిమిదవ శిశువునౌతాను. నన్ను చంపటానికి కంసుడు అనేక ఉపాయాలు పన్నుతాడు.

నందగోపుని భార్య యశోదకు నీవు తొమ్మిదవ శిశువుగా మా వంశంలో జన్మిస్తావు. నేను కూడ అర్ధరాత్రి 'అభిజిత్' నక్షత్రంతో కూడిన సమయంలో జన్మిస్తాను. ఇలా అయిన తరువాత నేను యశోద దగ్గరకూ నీవు దేవకివద్దకూ చేరతాము. తరువాత కంసుడు కాళ్ళు పట్టుకొని నిన్నొక రాతి మీదపడ వేస్తాడు. అప్పుడు నీవు ఆకాశానికి వెళ్ళి స్థిరమైన స్థానానికి వెళ్తావు. ఆ సమయంలో నీ

శరీర కాంతినా శరీరవర్ణం కలిగి ఉంటుంది. పెద్ద చేతులు ధరించి త్రిశూలాన్ని ఖడ్గాన్ని పూర్ణపాత్రను నిర్మలమైన పద్మాన్ని, నల్లవస్త్రాన్ని ధరించి తెల్లని హారం మెడలో, చెవులకు కుండలాలు చంద్రుని వంటి ముఖం కిరీటంతో కూడిన జుట్టుముడి కలిగి సర్పాలవంటి చేతులతో భయపెడుతూ నా ఆజ్ఞను అనుసరిస్తూ నీవు స్వర్గానికి వెళ్తావు. అక్కడ ఇంద్రుడు దేవతలతో కూడి నీకు అభిషేకం చేస్తాడు. నిన్ను సోదరిగా స్వీకరిస్తాడు. కుశికుని గోత్రాన్నిబట్టి కౌశికివవుతావు. అతడు వింధ్యపర్వతంమీద శాశ్వతస్థానాన్ని నీకు కల్పిస్తాడు.

నీవు మహిమతో వేలాధిస్థానాలను అలంకరిస్తావు. నీవు వరాలనిచ్చి ప్రజలందరి కోరికలను తీర్చి మూడులోకాలలో సంచరిస్తావు. ఆపర్వతంమీదనే ఉండే మాంసము మొదలైన వాటిని తింటూ భూతప్రేతపిశాచాలతో తిరుగుతావు. ప్రజలు నిన్ను నవమినాడు పూజిస్తారు. భక్తులు నమస్కరిస్తారు. నిన్ను పూజించిన వాళ్ళకు ఏ కొరతా ఉండదు. ప్రజలు నిన్ను స్మరించి అన్నివిధాలైన కష్టాలనుండి రక్షింపబడతారు. నిన్ను ఈ స్తోత్రంతో సేవించేవాళ్ళకు నీ దర్శనం కలుగుతుంది. నేను వాళ్ళనెప్పుడునూ విడువను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి విష్ణుపర్వంలో
యోగనిద్రతో సంభాషణం అను రెండవ అధ్యాయము

☆☆☆

# మూడవ అధ్యాయము

## ఆర్యా స్తోత్రమ్

వైశంపాయనుడిలా చెప్పాడు.

పూర్వం ఋషులు చెప్పిన ఆర్యాస్తోత్రాన్ని చెపుతా!

శ్లో॥ నారాయణీం నమస్యామి దేవీం త్రిభువనేశ్వరీమ్
త్వం హిసిద్ధిర్ధృతిః కీర్తిః శ్రీర్విద్యాసన్నతిర్మతిః॥
సంధ్యా రాత్రిః ప్రభా నిద్రా కాలరాత్రిస్తథైవచ
ఆర్యాకాత్యాయనీ దేవీ కౌశికీ బ్రహ్మచారిణీ॥
జననీసిద్ధ సేనస్య ఉగ్రచారీమహాబలా
జయాచవిజయాచైవ పుష్టి స్తుష్టిః క్షమాదయా॥

జ్యేష్ఠా యమస్యభగినీ నీలకౌశేయవాసినీ
బహురూపా విరూపాచ అనేక విధచారిణీ॥
విరూపాక్షీ విశాలాక్షీ భక్తానాం పరిరక్షిణీ
పర్వతాగ్రేషు ఘోరేషు నదీషు చ గుహాసుచ॥
వాసస్తవ మహాదేవి వనేషూపవనేషుచ
శబరైర్బర్బరైశ్చైవ పులిన్దైశ్చ సుపూజితా॥
మయూరపిచ్ఛ ధ్వజినీ లోకాన్క్రమసి సర్వశః
కుక్కుటైశ్ఛాగలై ర్మేషై స్సింహైర్వ్యాఘ్రై స్సమాకులా॥
ఘంటానినాద బహులా విన్ధ్యవాసిన్యభిశ్రుతా
త్రిశూలీపట్టి సధరా సూర్యచంద్ర పతాకినీ॥
నవమీ కృష్ణపక్షస్య శుక్లస్యైకాదశీతథా
భగినీబలదేవస్య రజనీకలహప్రియా॥
ఆవాసస్సర్వభూతానాం నిష్ఠాత్వం పరమాగతిః
నందగోపసుతాచైవ దేవానాం విజయావహా॥
చీరవాసాస్సు వాసాశ్చ రౌద్రసంధ్యా చరీనిశా
ప్రకీర్ణకేశీ మృత్యుశ్చ తథామాంసౌదనప్రియా
లక్ష్మీరలక్ష్మీరూపేణ దానవానాంవధాయచ
సావిత్రీ చాపిదేవానా మార్యామంత్రగణాయచ॥
కన్యానాం బ్రహ్మచర్యత్వం సౌభాగ్యం ప్రమదాసుచ
అంతర్వేదీచ యజ్ఞానాం ఋత్విజాంచైవ దక్షిణా॥
కర్షకాణాంచ సీతేతి భూతానాం ధరణీతిచ
సిద్ధిస్త్వం యాత్రికాణాంతు మాతాభూత గణస్యచ॥
యక్షాణాం ప్రథమా యక్షీనాగానాం సురసేతిచ
బ్రహ్మవాదిన్యథోదీక్షా శోభాచ పరమాతథా॥
జ్యోతిషాంత్వం ప్రభాదేవి నక్షత్రాణాంచ రోహిణీ
రాజద్వారేషు తీర్థేషు నదీనాం సంగమేషుచ॥
పూర్ణాచ పూర్ణిమాచంద్రే త్వం బుద్ధిరంబికాశుచిః
సరస్వతీ చ వాల్మీకీ స్మృతిర్ద్వైపాయనే తథా॥

ఋషీణాం ధర్మబుద్ధిస్త్వ దేవానాం మానసీతథా
సురాదేవీతు భూతేషు స్తూయసేత్వం స్వకర్మభిః॥
ఇంద్రస్య చారుదృష్టిస్త్వం సహస్రనయనేతిచ
తాపసానాంచ దేవీత్వ మరణీచాగ్ని హోత్రిణామ్॥
క్షుధాచ సర్వభూతానాం తృప్తిస్త్వం దైవతేషుచ
స్వాహాతృప్తిర్ధృతిర్మేధా వసూనాం త్వం వసూమతీ॥
అశాత్వం మానుణాంచ పుష్టిశ్చకృత కర్మణామ్
దిశశ్చవిదిశశ్చైవ తధా హ్యగ్ని శిఖాప్రభా॥
శకునీ పూతనాత్వంచ రేవతీచసుదారుణా
నిద్రాపి సర్వభూతానాం మెహినీ క్షత్రియాతథా॥
విద్యానాం బ్రహ్మ విద్యాత్వం త్వమోంకారోవషట్ తధా
నారీణాం పార్వతీచత్వాం పౌరాణీ మృషయోవిదుః॥
అరుంధతీ చ సాధ్వీనాం ప్రజాపతి వచో యధా
పర్యాయనామభిర్దివ్యైరింద్రాణీ చేతివిశ్రుతాః॥
త్వయావ్యాప్తమిదం సర్వం జగత్స్థావర జంగమమ్
సంగ్రామేషుచ సర్వేషు అగ్ని ప్రజ్వలితేషుచ ॥
నదీతీరషుచౌరేషు కాంతారేషు భయేషుచ
ప్రవాసే రాజబంధేచ శత్రూణాంచ ప్రమర్దనే॥
ప్రణాత్యయేషు సర్వేషు త్వం హిరక్షాన సంయశః
త్వయి మేహ్రుదయాదేవి త్వయిచిత్తం మనస్త్వయి॥
రక్షమాంసర్వపాపేభ్యః ప్రసాదం కర్తుమర్హసి
ఇమంయస్స్తవం దివ్యమితి వ్యాసప్రకల్పితమ్॥
యఃపఠేత్ ప్రాతరుత్థాయ శుచిః ప్రయతమానసః
త్రిభిర్మాసైః కాంక్షితంచ ఫలంవై సంప్రయచ్ఛతి॥
షడ్భిర్మాసైర్వరిష్ఠంతు వరమేకం ప్రయచ్ఛతి
అర్చితాతుత్రిభిర్మాసైర్దివ్యంచక్షుః ప్రయచ్ఛతి॥
సంవత్సరేణ సిద్ధింతు యధాకామం ప్రయచ్ఛతి
సత్యం బ్రహ్మచ దివ్యంచ ద్వైపాయనవచోయధా॥

నృణాంబంధం వధంఘోరం పుత్రనాశం ధనక్షయమ్
వ్యాధిమృత్యుభయం చైవ పూజితాశమయిష్యతి॥
భవిష్యసిమహాదేవీ వరదా కామరూపిణీ
మోహాయిత్వాచతం కంసంత్వం త్వమేకాభోక్ష్యసే జగత్॥
అహమప్యాత్మనోవృత్తిం విధాస్యేగోషుగోపవత్
స్వవృధ్యర్థమహంచైవ కరిష్యే కంసగోపతామ్॥
ఏవంతాం ససమాదిశ్య గతోంతర్ధానమీశ్వరః
సాచాపితం నమస్కృత్య తథాస్త్వితి చ నిశ్చితా॥
యశ్చైతత్పఠతే స్తోత్రం శృణుయాద్వాప్యభక్షణః
సర్వార్థ సిద్ధింలభతే నరోనాస్త్యత్ర సంశయః॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఆర్యా స్తోత్రమ్ అను మూడవ అధ్యాయము

☆☆☆

# నాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణ జననము

వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

మహారాజా! వెనుక చెప్పినట్లుగా దేవతలో సమానమైన తేజస్సుగల దేవకి గర్భం ధరించిశిశువు నల్లారాతిమీద కొట్టి చంపుతున్నాడు. ఏడవ గర్భాన్ని యోగ మాయ తనబలంతో తీసుకువెళ్ళి రోహిణి గర్భంలో ప్రవేశపెట్టింది. అర్థరాత్రి దేవకికి గర్భం పోయింది. దేవకి నిద్రకు వశురాలై నేలపై పడుకుంది. నాగర్భం పోయిందని మేల్కోని విచారిస్తుండగా నిద్రాదేవి రోహిణితో ఇలా అన్నది.

కళ్యాణి! దేవకి గర్భాన్ని (శిశువును) తెచ్చి నేను నీ గర్భమందుంచాను. నీకు పుట్టే కుమారుడు సంకర్షణుడనే పేరుతో ప్రసిద్ధి పొందుతాడు. కొద్దికాలం తర్వాత రోహిణికి పుత్రరత్నం జన్మించాడు. కుమారుడు జన్మించిన సంతోషంతో ముఖం వంచుకొని పిల్లవానిని తీసుకొని యింటిలో ప్రవేశించింది. తరువాత దేవకి ఏడవ గర్భం ఏమైందని విచారిస్తుండగా ఆమె ఎనిమిదవ గర్భాన్ని ధరించింది. మంత్రులు ఆ గర్భాన్ని ప్రయత్నపూర్వకంగా రక్షించ మొదలుపెట్టారు. విష్ణుమూర్తి

దేవకి యశోద గర్భంలో ప్రవేశించినప్పుడే నిద్రాదేవి కూడా యశోద గర్భంలో ప్రవేశించింది. తరువాత నెలలు నిండగానే దేవకి, యశోద ఇద్దరూ పుత్రుని, కన్యను క్రమంగా కన్నారు.

శ్రీకృష్ణ జన్మసమయంలో అగ్నులు ప్రశాంతంగా వెలిగాయి. గాలులు సుఖ కరంగా వీచాయి. దుమ్ము అణిగిపోయింది. నక్షత్రాలు బాగా ప్రకాశించాయి. శ్రీకృష్ణుడు అభిజిత్తనే నక్షత్రం జయన్తి అనే రాత్రి విజయముహూర్తం గల సమయంలో పుట్టాడు. భగవంతుడు తెలియబడనివాడు, నిత్యుడు సూక్ష్మస్వరూపం కలవాడు. అట్టి నారాయణుడు తన చూపులచే అందరినీ మోహింపచేసేవాడు. అట్టి జన్మసమయాన దేవదుందుభులు మ్రోగాయి, పుష్పవర్షం కురిసింది. మహర్షులు, గంధర్వులు, అప్సరసలు మంగళకరములైన వాక్కులతో మధు సూదనుడైన భగవంతుని స్తోత్రం చేశారు.

రాత్రిపూట పుట్టినట్టియు శ్రీవత్సమనే పుట్టుమచ్చ గలిగినట్టి దివ్యలక్షణాలతో కూడిన ఆ భగవంతుని చూచి వసుదేవుడు ప్రభూ! ఈ రూపం కనపడనీయకు, కంసునివల్ల భయపడి ఇలా చెప్పుతున్నాను. నీ అన్నలైన నా పుత్రుల్ని, ఆ కంసుడు చంపాడు అని పలికి త్వరగా ఆ పిల్లవానిని తీసుకొని రాత్రిపూట యశోద యింటికి ఇంటికి వెళ్ళాడు. యశోదకు తెలియకుండ పిల్లవానిని ఆమెవద్ద ఉంచి పిల్లను తీసుకొని వచ్చి దేవకి పక్కలో ఉంచాడు. తరువాత వసుదేవుడు తనకు కన్యక జన్మించిందని కంసునికి చెప్పాడు. ఆ మాట విని కంసుడు రక్షకపురుషులతో వెంటనే వసుదేవుని యింటికి వచ్చాడు. ద్వారం దగ్గర నిలిచి ఏమయిందని అడిగాడు. త్వరగా ఆ శిశువును యిమ్మని భయపెట్టాడు.

అప్పుడు దేవకి ఇంట్లో స్త్రీలు అయ్యో అయ్యో అని మొరపెట్టారు. దేవకి కన్నీటితో గద్గదస్వరం కలిగి దీనురాలిగా ఆడపిల్ల పుట్టిందని చెప్పి ఏడుగురు పిల్లవాళ్ళను నీవు చంపావు. ఇది ఆడపిల్ల చూడు అన్నది కంసుడు చూచి సంతోషం తో ఆ పిల్లను లాక్కొన్నాడు. వెంటనే ఆ పిల్లను రాతిమీద చితకగొట్టాడు. ఆ పిల్ల రాతిమీద కొట్టబడి, ఆకాశానికి ఎగిరింది. వెంటనే శిశు శరీరాన్ని విడిచి తల విరబోసుకొని దివ్యమైన గంధం పూసుకొని హారాలతో ప్రకాశిస్తూ దేవత లందరూ స్తోత్రం చేస్తుండగా కన్యకగానే కనిపించింది. ఆమె నాలుగుచేతులు గలిగి చంద్రుని వంటి ముఖంతో అందంగా ఉన్నది. పెద్దగా నవ్వుతూ రోషంతో కంసుని చూచి ఇలా పలికింది.

ఓరి కంసా! నీ వినాశనం కోసమే నన్ను చంపావు. నన్ను వేగంగా పైకెత్తి రాతి మీద కొట్టావు. అందువల్ల నీ మరణసమయంలో శత్రువుచే లాగబడుచున్నప్పుడు చేతులతో చీల్చిన నీ శరీరాన్ని, వెచ్చని రక్తాన్ని త్రాగుతా అని ఆదేవి తన సహచరులతో ఆకాశంలో సంచరించింది. ఆ కన్య వృష్ణి వంశీయులచే పూజింపబడుచూ పెద్దదైంది. వసుదేవుని ఆజ్ఞచేత ఆమె పుత్రునివలె రక్షింపబడుచూ ఎదిగింది. ఆమె ప్రజాపతి అంశవల్ల పుట్టింది. యాదవులందరూ కృష్ణుని రక్షించేది అని ఆమెను పూజించేవాళ్ళు.

ఆ కన్య వెళ్ళిపోయిన తరువాత కంసుడు సిగ్గుపడి ఏకాంతంలో దేవకి వద్దకు వెళ్ళి సోదరీ! నేను మృత్యువాత పడకుండుటకై నీ పుత్రుల్ని చంపాను. మరోవ్యక్తి వలన నేను మరణిస్తానని ఇప్పుడు తెలుస్తున్నది. నేను నీ స్వజనాన్ని చంపుకున్నాను. పురుషప్రయత్నంచేత దైవాన్ని అడ్డగించలేకపోయాను. నీవు పిల్లల మరణాన్ని గూర్చి చింతించకు. వాళ్ళకు కాలం తీరింది. నేను కారణమయ్యాను. కాలమే అన్నిటికీ కారణం. మానవులు నిమిత్తమాత్రులు. దేవి! కష్టాలు వస్తూ ఉంటాయి. నీవు దుఃఖించవద్దు. దేవకి! నేను పుత్రునివలె నీకు నమస్కరిస్తున్నాను. నామీద రోషం విడిచిపెట్టు. నీకు అపకారం చేశాను అన్నాడు.

ఇలా పలికిన కంసుని దేవకి కన్నీటితో దీనురాలై భర్తను చూస్తూ కంసుని తల్లివలె నాయనా! లెమ్ము అని మాట్లాడుతూ నా పిల్లలను ఎందుకు కాల స్వరూపుడవై చంపావు, దైవం కూడా కారణమే. నీవు చేసిన పని నిందించుకొంటూ కాళ్ళమీద పడటంచేత నేను పిల్లలను చంపటం ఓర్చుకుంటున్నాను, చిన్నతనంలో గాని, పడుచుతనంలోగాని, ముసలితనంలోనైనా మరణం రావచ్చు. నీలాంటివాడు కారణమవుతాడు. పుత్రులు కలిగికూడ వాళ్ళు మరణించడం కేవలం దైవం వల్లనే. దేవుడు ఏ జీవుణ్ణి ఎక్కడకు తీసుకువెళ్ళాలో అక్కడకి తీసుకెళ్తాడు. కనుక నాయనా! నువ్వు వెళ్ళు, నేను నీపై కోపంతో ఉన్నావని మనస్సులో పెట్టుకోకు. పూర్వజన్మలో చేసిన పాపాన్నిబట్టి దుఃఖం కలుగుతుంది. ఈ విషయంలో నీతప్పేమి లేదు అన్నది. దేవకి మాటలు విని కంసుడు మండిపోతున్న హృదయంతో తన యింటిలో ప్రవేశించాడు. తనపని నెరవేరక దీనుడై కలత చెందిన మనస్సు కలవాడయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణ జననము అను నాల్గవ అధ్యాయము

☆☆☆

# ఐదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు వ్రేపల్లెకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు!

మహారాజా! ప్రసవించటానికి ముందే వసుదేవుడు తనభార్య రోహిణిని నందగోపుని యింటికి పంపాడు. తరువాత అతడు రోహిణి అందగాడైన పుత్రుణ్ణి కన్నదని విన్నాడు. నందుడు కప్పం చెల్లించటానికి తన భార్యతో మధురకు వెళ్ళాడు. అప్పుడు వసుదేవుడు నందుడు దగ్గరకువెళ్ళి గోపశ్రేష్టా! త్వరగా నీవు యశోదతో గోకులానికి వెళ్ళి ఇద్దరు పిల్లలకు జాతకర్మ మొదలైన సంస్కారములు పూర్తిచేసి పోషించుము. యశోద కొడుకును చూచినట్లే రోహిణి కొడుకును కూడా చూచి పోషించుము. ఆ పుత్రునిచేతనే నేను తండ్రిగా చూడబడతాను. దయలేని కంసుని వలన నా బుద్ధి పాడయింది. కనుక మిక్కిలి శ్రద్ధతో రోహిణీ యశోదల పుత్రులను రక్షించుము. పిల్లలకు అనేకవిధములైన ఆపదలు వస్తున్నాయి. నీ పిల్లవాడు పెద్దవాడు, నా కొడుకు చిన్నవాడు. ఇంచుమించు ఒకే వయస్సు కనుక వాళ్ళకు నామకరణం చేసి మిక్కిలి ప్రయత్నపూర్వకంగా కాపాడాలి.

మిత్రుడా! ఆ పిల్లలిద్దరినీ ఆవులమందలో తిరుగుతూ ఉండేటట్లుచూడు. చిన్నతనంలో అందరూ స్వేచ్ఛగా సంచరిస్తారు. తీవ్రస్వభావం కలిగిఉంటారు. ఈవిషయంలో నీవెల్లప్పుడూ జాగ్రత్తగా ఉండాలి. బృందావనంలో గోపాలకులమని నివాసము కల్పించవద్దు. ఎందుచేతననగా అక్కడ పాపాత్ముడైన 'కేశి' అనేవాడు, అనేకవిధాలైన సర్పాలు, పురుగులు, పక్షులు భయాన్ని కలిగిస్తూ ఉంటాయి. గోశాలలో ఆవులనుండి, దూడలనుండి ఈ పిల్లలిద్దరిద్దరినీ రక్షిస్తూఉండు. రాత్రి గడిచింది. త్వరగావెళ్ళు. పక్షులు కుడిప్రక్కన ఎడమప్రక్కన తిరుగుతున్నాయి.

గోపరాజు నందుడు వసుదేవుని మాటలువిని సంతోషంగా యశోదతో వాహనం ఎక్కాడు. శిశువును పడుకోబెట్టాడు. తరువాత యమునానది ఒడ్డున జనసంచారంలేని మిక్కిలి నీరుగల మార్గం ద్వారా వెళ్ళారు. ఆసమయంలో ప్రాతః కాలమందలి చల్లగాలి వీస్తున్నది. ముందుకు నడవగా దూరంగా క్రూరమృగాలులేని గోకులం కనిపిస్తోంది. ఆ సుందరమైన ప్రదేశం గోవర్ధనపర్వత సమీపం యమునా నది ఒడ్డున ఉంది. అక్కడ ఎప్పుడు చల్లగాలి వీస్తూ ఉంటుంది. అనేకవిధములైన లతలు, పొదరిండ్లు, చెట్లూ ఆ ప్రదేశాన్ని మిక్కిలి శోభింపచేస్తున్నాయి.

చాలాగోవులు అక్కడ గడ్డి మేస్తున్నాయి. ఆ ప్రదేశం సమతలంగా ఉండటం చేత ఆవులు నడవటానికి ఉపయోగకరంగా ఉంది. అనేకములైన సరస్సులున్నాయి. ఎడ్లకొమ్ములతో, మూపురాలతో రాచుకొనబడిన చెట్లున్నాయి. అనేకవిధములైన మృగాలున్నాయి. రుచికరములైన పండ్లుకల వృక్షాలు, చాలినన్ని లతలు, పచ్చిక బీళ్ళు ఉన్నాయి. నలుమూలలా ఆవుల ధ్వనులు వినిపిస్తున్నాయి. చాలామంది గోపికలు తిరుగుతూ కనిపిస్తున్నారు. దూడల అంభారావాలు వినిపిస్తున్నాయి. చాలా ఎడ్లబండ్లున్నాయి. క్షేమంగా సంచరించే జనసమూహంతో కూడిన ప్రదేశ మది. పెరుగు తరచే చప్పుడు వినిపిస్తోంది. గోపికల చేతిగాజుల ధ్వని మనోహరంగా ఉంది. జులుపాలు ధరించిన పిల్లలు ఆడుకొంటున్నారు. నేతివంటకాల వాసన వ్యాపిస్తోంది.

నలుక్కల రంగురంగుల చీరలు ధరించినస్త్రీలు కనిపిస్తున్నారు. అడివి పుష్పాలు అలంకరించుకొని గోపికలు తలలమీద నీటితో నింపిన బిందెలు పెట్టుకొని పంక్తిగా నడుస్తున్నారు. గోపసమూహంతో ధ్వనిగల గోవ్రజంలో ప్రవేశిస్తూనే సంతోషపడ్డాడు. నందగోపుని చూడగానే గోపవృద్ధులు గోపికలూ ఎదురువచ్చారు. నందుడు వసుదేవుని భార్య రోహిణి వద్దకు వెళ్ళి అప్పుడే ఉదయించిన సూర్యునివంటి తేజస్సుకల కృష్ణుని ఆమెకిచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు వ్రేపల్లెకు వెళ్ళుట అను ఐదవ అధ్యాయము

☆☆☆

# ఆరవ అధ్యాయము

## శకటాసుర వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! గోపాలకులకు సుఖసంతోషాలు కలుగజేస్తూ నందుడు చాలా కాలం గడిపాడు. పిల్లలిద్దరిలో పెద్దవాడికి సంకర్షణుడ'ని, రెండవవాడికి కృష్ణుడనీ పేరు పెట్టారు. బలరాముడికే సంకర్షణుడని కూడా పేరు. మేఘవర్ణంకల కృష్ణుడు ఆవుల మధ్యలో సముద్రంమధ్యలో మేఘంలా ఉండి ఎదిగాడు. పుత్రునిపై మిక్కిలి ప్రేమగల యశోద బండిక్రింద నిద్రిస్తున్న అతణ్ణి విడిచి యమునానదికి వెళ్ళింది.

చేతులు, కాళ్ళు కొట్టుకుంటూ కాళ్ళుపైకి సాచుతూ మధురంగా కృష్ణుడు ఏడ్చాడు. అతడు ఒకపాదంతో బండిని పడగొట్టాడు. పాలకోసం ఏడుస్తున్నాడు.

ఇంతలో ఇంటికి వచ్చిన యశోద గాలి వీచకుండగనే పడిపోయిన బండిని చూచింది. అయ్యో అయ్యో అంటూ పిల్లవాణ్ణి త్వరగా తీసుకుంది. బండి ఎందుకు పడ్డదో ఆమెకు తెలియదు. నా పిల్లవానికి శుభమగుగాక అంటూ సంతోషమూ, బలమూ కలదైంది.

కుమారా! కోపిష్టి మీ తండ్రి ఏమంటాడో నిన్ను బండిక్రింద పరుండబెట్టి స్నానానికి వెళ్ళాను. ఈమధ్యలో బండి తిరగబడింది. ఈ విషయం విని ఏమంటాడో! నాకెందుకీ పాడుస్నానం. బండి తిరగబడినా నీవు సుఖంగా ఉన్నందుకు సంతోషిస్తున్నా. అని యశోద పలుకుతూ ఉండగానే ఎర్రనివస్త్రం కట్టుకున్న నందుడు వనంనుండి ఆవులతో వచ్చాడు. తిరగబడిన బండిని చూచాడు. అక్కడ కుండలు పగిలిఉన్నాయి. చక్రం ఇరుసూ ఊడిపోయినాయి. అతడు భయపడి త్వరగా వచ్చి కన్నీరు కారుస్తూ దగ్గరకు వచ్చి నా కొడుకు కులాసాగా ఉన్నాడా అని మాటిమిటికీ పలుకుతూ తల్లివద్ద పాలు త్రాగుతున్న కుమారుని చూచి స్తిమితపడ్డాడు. ఎద్లు పోట్లాడుకోకుండా నాబండి ఎలా తిరగబడింది? అని అడిగాడు. యశోద భయపడి గద్గదస్వరంతో బండిని ఎవడు తిరగ్గొట్టాడో నాకు తెలియదు. నేను బట్టలు ఉతుక్కోవటానికి నదికి వెళ్ళాను. వచ్చేటప్పటికీ బండి తిరగబడి ఉంది.

ఆ భార్యాభర్తలిలా మాట్లాడుకొంటుండగానే అక్కడ ఉన్న పిల్లలు ఈ పిల్లవాడే కాలితో తిరగొట్టాడు. మేమిక్కడకు వచ్చి చూచాము అని చెప్పారు. ఇదివిని నందుడు మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు. నందుడికి ఒకపక్క సంతోషం, రెండవపక్క భయం కలిగాయి. అతడు మాటిమాటికీ ఇది ఎలా జరుగుతుంది? సాధారణ బుద్ధిమంతులైన గోపాలకులు ఆ పిల్లల మాటలను నమ్మలేదు. ఇది ఆశ్చర్యమని పలుకుతూ వాళ్ళందరూ వెళ్ళిపోయారు. బండిని మళ్ళీ బాగు చేయించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శకటాసుర కథ అను ఆరవ అధ్యాయము

☆☆☆

# ఏడవ అధ్యాయము

## పూతనవధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

కొంతకాలానికి పక్షివేషం ధరించి కంసుని దాదియైన పూతన కోపంతో రెక్కలు కొట్టుకుంటూ అర్ధరాత్రి వచ్చింది. నందుని యింటిలో చేరి అందరూ నిద్రపోయే సమయంలో బండిచక్రంలో దాక్కొని ఉంది. స్తనాలలో పాలు అధికంగా ఉన్నాయి. అందరూ నిద్రలో ఉండగా కృష్ణునికి చన్నిచ్చింది. శ్రీకృష్ణుడు పాలతో పాటు ఆమె ప్రాణాలను కూడ లాక్కున్నాడు. అప్పుడు ఆ పక్షి నేలమీద పడ్డది. ఆ చప్పుడు విని భయపడుతూ అందరూ లేచారు. నందయశోదలు స్మృతిలేకుండా నేలపై పడియున్న పూతనను చూచారు.

ఇదిఏమి? ఎవని పనియిది? అని భయపడి గోపాలకులు నందగోపుని ముందుంచుకొని గుమికూడారు. కారణమేమి తెలియలేదు. ఇది చాలా ఆశ్చర్యమని పలుకుతూ అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళారు. వాళ్ళందరూ వెళ్ళిన తరువాత నందగోపుడు యశోదతో ఇదియేమి తెలియటంలేదు, పిల్లవానికి భయం కలిగింది అని పలుకగా యశోద పిల్లవానిని ఒడిలో పెట్టుకొని పడుకున్నాను. ఇంతకంటే నాకేమి తెలియదు. ఈ భయంకరధ్వని విని మేలుకొన్నాను. యశోదకూడ తనకేమి తెలియదని చెప్పిన పిమ్మట బంధువులతో కలిసి భయాన్ని ఊహిస్తూ నందుడు ఆశ్చర్యంలో పడ్డాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పూతనవధ అను ఏడవ అధ్యాయము

☆☆☆

# ఎనిమిదవ అధ్యాయము

## యమలార్జున భంజనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నామకరణం ఐన తరువాత కొంతకాలం గడుస్తుండగా సుందరులైన కృష్ణ సంకర్షణులు గంతులు వేస్తూ ఇద్దరూ కలిసిమెలసి ఉంటున్నారు.

ఇద్దరూ ఒకే ఆసనంమీద ఒకే పక్కమీద ఒకే భోజనం ఈవిధంగా ఒకే ప్రవర్తన కలిగిఉన్నారు. దేవతల పని సాధించటానికి ప్రపంచాన్ని రక్షించటానికీ వాళ్ళిద్దరూ గోపాలక శరీరాన్ని ధరించారు. వాళ్ళ అపూర్వమైన లీలలు తేజస్సు చూచి సూర్య చంద్రులిద్దరూ కలిసిఉన్నట్లు జనం తలచారు. సర్పశరీరం వంటి భుజాలు కలిగి అంతటా తిరుగుతూ దుమ్ము కొట్టుకున్న శరీరాలతో మదించిన ఏనుగు గున్నల వలె ప్రకాశించారు. దూడశాలలో తిరుగుతూ ఆడుకొంటూ పేడ అంటుకున్న తలవెంట్రుకలు కలవారై నవ్వుతూ దెబ్బలాడుకుంటూ మిక్కిలి అల్లరి చేస్తూ ఉంటే నందగోపుడు ఆపిల్లల అల్లరిని ఆపలేకపోయాడు.

తరువాత యశోద కోపంతో పద్మాలవంటి నేత్రాలు కల శ్రీకృష్ణుని మాటి మాటికి బెదిరిస్తూ పొట్టమీద త్రాడుకట్టి ఆ త్రాడు రోటికి కట్టింది. చేతనైతే వెళ్ళు అని అతన్ని లోపలికి తనపనిమీదె వెళ్ళింది. ఆమె పనిలో ఉండగా వాకిట్లోంచి బయటకు వెళ్ళాడు. రోటిని లాక్కుపోతూ కలిసిఉన్న రెండు మద్దిచెట్ల మధ్య నుండి రోటిని లాగాడు. దానితో ఆ చెట్లు రెండూ మొదళ్ళతో కూడా పెకలించ బడ్డాయి. అతడు నవ్వుతున్నాడు. గోపాలకులకు తన బలాన్ని ప్రదర్శించటానికి నిలుచుని ఉన్నాడు. అతని ప్రభావంచేత యశోద కట్టిన సాధారణమైన త్రాడు మిక్కిలి దృఢమైంది. యమున ఒడ్డున దారినపోయే గోపికలు ఇతని పరిస్థితిని చూచి ఆశ్చర్యపడి పెద్దగా ఏడుస్తూ యశోద వద్దకు వెళ్ళారు. తొట్రుపాటుతో ఆ స్త్రీలు యశోదకిట్లు చెప్పారు.

ఓ యశోదా! రా తొందరగా, ఆలస్యం చేస్తావేం, గొల్లపల్లెలో ఉన్న మద్దిచెట్లు రెండూ పిల్లవాడిమీద పడ్డాయి. దూడలాగా త్రాడుతో కట్టబడిన నీ కొడుకు చెట్ల మధ్య నిలబడి నవ్వుతున్నాడు. ఓసి బుద్ధి తక్కువదానా! మూఢురాలా! మృత్యు ముఖం నుండి విడువబడిన కుమారుని తెచ్చుకో యశోద వెంటనే లేచి భయ పడుతూ అయ్యో అయ్యో అంటూ చెట్లు పడ్డ చోటికి వెళ్ళింది. ఆమె ఆ చెట్ల మధ్య పొట్టమీద తాడుతో కట్టబడి రోటిని లాగు తున్న తన పిల్లవాడిని చూచింది. ఈ విషయం అంతటా తెలిసి పిల్లలు, పెద్దవాళ్ళు, స్త్రీలు పల్లెలో ఉన్నవాళ్ళంతా కుతూహలం కలిగించే ఈ సంఘటనను చూచేందుకు అక్కడకు చేరారు.

వాళ్ళు ఇలా మాట్లాడారు. గ్రామమంత విశాలంగా ఉన్న యీ చెట్లు పడి పోయాయి. ఇప్పుడు గాలి ఉండదు. వర్షంపడదు. ఏనుగులకు కష్టం ప్రాప్తించింది. వీటిని ఎవడు పడగొట్టాడు? అయ్యో మొదటికంతా పడిపోయిన యీ చెట్లు

శోభ లేనివయ్యాయి. గోపశ్రేష్టుడవైన నందుడా! ఈ చెట్లు నేలపై పడి నీ పిల్లవాడికి ఏమీ చెరుపు చేయలేదు. బండి విరిగిపోవటం, పూతన మరణించటం, ఈ రెండు మొదటనే చెడును సూచిస్తున్నాయి. ఈ చెట్లు పడిపోవటం మూడవ చెడు సూచన. ఇప్పుడిక్కడ ఉండటం ఉపయోగకరం కాదు. మాటిమాటికీ ఇలా చెడుసూచనలు కనపడటం బాగా లేదు.

అప్పుడే నందగోపుడు ఆందోళనతో పరుగెత్తి కృష్ణుని రోటినుండి విడిపించి ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు. చచ్చిబ్రతికినవానినిలాగా చూస్తూ పద్మములవంటి కన్నులుగల కృష్ణుని లాలిస్తూ తృప్తి పొందలేదు. తరువాత యశోదను తిడుతూ నందగోపుడు ఇంటికి వెళ్ళాడు. తక్కినవాళ్ళంతా పల్లెలోకి వెళ్ళిపోయారు. పొట్టమీద తాడు కట్టడంచేతనే దామోదరుడని పేరు వచ్చింది.

ఇది ఆశ్చర్యకరమైన బాలకృష్ణుని పని.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
యమళార్జున భంజనము అను ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# తొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుని బాలలీల

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ మహారాజా! ఈ విధంగా వ్రజంలో (గొల్లపల్లెలో) శ్రీకృష్ణ సంకర్షణులు శిశుక్రీడలు గడిచి ఏడేళ్ళ బాలులు అయ్యారు. సంకర్షణుడు (బలరాముడు) నల్లనివస్త్రాలను, శ్రీకృష్ణుడు పచ్చనివస్త్రాలను ధరించి గంధం పూసుకొని శిఖలు కలిగి గొల్లపిల్ల వాళ్ళరూపంలో తయారయ్యారు. అన్నదమ్ములిద్దరూ వినసొంపైన వీణను వాయిస్తూ అడివిలో తిరగ మొదలుపెట్టారు.

నెమలికన్నును చెవియందును ఆకులు పువ్వులు శిరస్సుమీద ధరించి భుజములమీద వనమాల వ్రేలాడగా చేతిలో వీణవాయిస్తూ ఆనందిస్తున్నారు. ఒకరినొకరు పరిహాసం చేస్తూ, ఆకుల ప్రక్క పరుండి నిద్రాసుఖాన్ని పొందుతున్నారు. ఇలా ఆవులను మేపుతూ ఆటలాడుతూ శోభ కలిగిఉన్నారు. కొంతకాలం తరువాత శ్రీకృష్ణుడు సంకర్షణుడితో ఇలా అన్నాడు.

ఇప్పుడు ఈ వనంలో గొల్లపిల్లలతో ఆడటానికి బాగాలేదు. మనం ఈ వనాన్ని బాగా ఉపయోగించుకున్నాం. ఇప్పుడిక్కడ గడ్డి దొరకటంలేదు. చెట్లు కర్రలు కూడా తక్కువైపోయాయి. పల్లెలో జనం ఇక్కడ చెట్లను కొట్టివేశారు. ఇప్పుడు మనం మరొకస్థలం చూచుకోకపోతే ఆడుకోవడానికి అలసట తీర్చు కొనేందుకు, కూర్చోనటానికి కూడ స్థలం దొరకదు. ఇక్కడ చెట్లన్నీ మోడులైనాయి. కాబట్టి పక్షులు కూడ చెట్లను విడిచి వెళ్ళిపోయాయి. పర్వతాలకూ, గ్రామాలకూ, వనాలకు ఆవులే శోభ. గడ్డికర్రలు బాగా ఉన్నచోటికి వెళ్ళటం మన కర్తవ్యం.

యమున ఒడ్డున బృందావనమనే తీయని పండ్లతో కూడిన చెట్లుగల స్థానమున్నదని వింటున్నాం, ఆ వనం అందమైంది. కావలసినంత గడ్డిగల ప్రదేశం. చల్లనిగాలి వీచే ప్రదేశం. గోపికలు సుఖంగా సంచరించుటకు తగినది. అందమైన చిత్రమైన అడవులు గలది. అక్కడకు దగ్గరలోనే గోవర్ధనమనే గొప్ప పర్వతం ప్రకాశిస్తోంది. అది పొడవైన శిఖరం కలది. దానిమధ్యలో ఖాండీరమనే మర్రిచెట్టు ఆమడ ఎత్తైనది ఉంది. దాని మధ్యనుండి కాళిందీనది ప్రవహిస్తూ ఉంటుంది. ఆవులను మేపుతూ గోవర్ధనపర్వతాన్ని ఖాండీరమనే మర్రిచెట్టును కాళిందీనదిని చూచి ఆనందిద్దాం. శ్రీకృష్ణుడు ఇక్కడివాళ్ళకు భయం కల్పించి అక్కడకు వెళ్దా మన్నాడు. ఇలా మాట్లాడుతుండగనే అతని శరీరంనుండిభయంకరమైన తోడేళ్ళు పుట్టుకొచ్చాయి. వాటిని చూచి అందరూ భయపడ్డారు. అవి దూడలను తింటూ రాత్రిపూట పిల్లల్ని పట్టుకుపోతూ మిక్కిలి భయం కలిగించాయి. అందరూ ఒకచోట గుమికూడారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని బాలలీల అను తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# పదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు బృందావనానికి వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఈ విధంగా భయంకరమైన తోడేళ్ళు వృద్ధి పొందుతుంటే చూచి స్త్రీలు పురుషులు అందరూ ఆలోచించారు. ఇక్కడ మనము ఉండవద్దు. మరొక గొప్ప వనానికి వెళ్దాం. ఆ ప్రదేశం మంగళకరమై సుఖనివాసస్థానమై ఆవులకు సుఖకరంగా

ఉండాలి. ఆలస్యమెందుకు? ఈవేళనే గోధనంతో వెళ్ళిపోదాం. లేకపోతే మన వ్రజం అంతా తోడేళ్ళు ఘోరంగా చంపుతాయి. ఈ తోడేళ్ళు రాత్రిళ్ళు గర్జిస్తుంటే భయపడుతున్నాం. నా పుత్రుడు చంపబడ్డాడు. నా దూడ చంపబడింది. నా ఆవు తినబడింది. అని ఇంటిలో ఏడుస్తున్నారు. వాళ్ళ ఏడ్పు ఆవుల అంభారవంచేత పెద్దవాళ్ళు అందరినీ లేపుతున్నారు.

ఈ వ్రజాన్ని (గొల్లపల్లె) విడిచి ఆవుల క్షేమం కోసం బృందావనానికి వెళ్ళాలనే నిర్ణయం తెలుసుకొని బృహస్పతి వంటి బుద్ధిశాలి నందుడు ప్రజలతో ఇలా అన్నాడు. ఈవాళే వెళ్ళటం నిశ్చయమైతే త్వరగా సిద్ధంకండి అని, గొల్లపల్లె కంతటికి ఆజ్ఞ ఇవ్వండి అని నందగోపుడు సాటింపు వేయించాడు. శీఘ్రంగా ఆవుల్ని నడిపించండి. దూడలను తీసుకురండి, బండ్లమీద సిద్ధం చెయ్యండి. ఇక్కడినుండి బృందావనానికి మకాం కొరకు పదండి. అనే నందగోపుని మాటవిని గొల్లపల్లె అంతా త్వరగా వెళ్ళటానికి లేచింది. వెళ్ళు, లే, వెళ్దాం పడుకుంటావేం అని వ్రజమంతా కోలాహలం ఏర్పడింది.

సముద్రఘోష వలె జనుల సంభాషణ ధ్వని వినిపించింది. గోపికలు పాత్రలతో నెత్తిమీద పెట్టుకొన్న కుండలతో వ్రజంనుండి పంక్తిగా బయల్దేరారు. ఆ స్త్రీలు నలుపు పసుపు ఎరుపురంగులు గల వస్త్రాలను కప్పుకొనుటచేత గోపికల పంక్తి ఇంద్రధన్సులా కనిపించింది. నడుస్తున్న బండ్ల సమూహంచేత పడవలతో కూడిన సముద్రంలా గొల్లపల్లె ప్రకాశించింది. గొల్లపల్లె అంతా బృందావనం చేరింది. ఆవుల క్షేమం కోసం విశాలమైన స్థానాన్ని నిర్దేశించారు. అక్కడ నివాసానికి కావలసిన వాటినన్నిటినీ సమకూర్చారు. ఆస్థానం మిక్కిలి శోభతో కూడినదై ఉన్నది. పండ్లు, నీరు సమృద్ధిగా అక్కడ ఉన్నాయి. ఆవులు కోరికలను వర్షిస్తున్నాయి. ఆ బృందావనం ఇంద్రుని నందనవనంలా ఉంది. మేఘాలు వర్షించటం చేత గడ్డి బాగా పెరిగింది. దూడలుగాని, ఆవులుగాని, జనులుగాని బాధపడువాళ్ళు లేరు. అక్కడ మధుసూదనుడు కృష్ణపరమాత్మ ఉండటంచేత సమస్తమూ ఆనంద కరంగా ఉన్నది. ఆ బృందావనంలో ఆవులు జనులు యువకుడైన సంకర్షణుడు (బలరాముడు) శ్రీకృష్ణునితో సహా ఆనందంగా నివసించ నారంభించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు బృందావనానికి వెళ్ళుట అను పదవ అధ్యాయము

☆☆☆

# పదకొండవ అధ్యాయము

## వర్షాకాల వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! వసుదేవుని పుత్రుడైన శ్రీకృష్ణుడు బలరాముడు బృందావనము చేరి ఆవులను, దూడలను మేపుతూ విహరిస్తున్నారు. ఈ విధంగా గొల్లపిల్లలతో ఆడుతూ యమునానదిలో జలక్రీడలాడుతూ వేసవికాలం గడిపారు. వర్షర్తువు వచ్చింది. ఇంద్రధనుస్సుతో మేఘాలు వర్షిస్తున్నాయి. మేఘాలు సూర్యమండలాన్ని కప్పుతున్నాయి. గడ్డిబీళతో నేల కప్పబడింది. నీటిని వర్షిస్తున్న మేఘాలచేత భూమి పడుచుతనాన్ని పొందినట్లున్నది. మేఘాలవల్ల వేడి తగ్గింది. నీటిచేత సమస్త భూమండలం సంతోషించింది. వానకు తడిసిన ఆర్ద్ర పురుగులు దావాగ్ని పొగలేని వనాలు ప్రకాశిస్తున్నాయి.

నెమళ్ళకు నృత్యం చేసే సమయం మదంచే మధురమైన కంఠధ్వనితో కూడిన నెమలికూతలు. క్రొత్త మేఘాన్ని చూచి కడిమిచెట్లు పుష్పించాయి. గిరి మల్లికలు నవ్వినై, కడిమిపువ్వులతో వనం పరిమళిస్తూ ఉన్నది. పర్వతాలు దావాగ్ని తాపము శాంతించి ఊపిరి పీల్చుకుంటున్నాయి. ఒకచోట పుట్ట సువాసనను వెదజల్లుతున్నది. తుమెదల ధ్వనులు నెమలికూతలు అంతటా వినిపిస్తున్నాయి. నదులు, సుడిగుండాలతో కూడి ఉన్నాయి. పక్షులు చెట్లఆకుల మధ్య దాగి ఉన్నాయి. దారులన్నీ నీటి మయమయ్యాయి. నదులు, ఒడ్డులందున్న చెట్ల పడగొట్టుతు మిక్కిలి వేగంగా ప్రవహిస్తున్నాయి. ఏనుగులు తొండాలెత్తి ఘీంకారాలు చేస్తూ మేఘధ్వనులను అను కరిస్తున్నట్లున్నాయి. అధికవర్షాలలో ఏనుగులు ఆకాశం నుంచి నేలమీదికి దిగివచ్చిన మేఘాల వలె ప్రకాశిస్తున్నాయి.

వర్షాకాలపు మేఘాల్ని చూచి బలరాముడు కృష్ణునితో కృష్ణా! చూడు మేఘాలు నీ శరీరవర్ణాన్ని దొంగిలించినట్లున్నాయి. నీకు నిద్రాసమయం ఆకాశం నీ శరీరంతో సమానం. చంద్రుడు మేఘాలలో కప్పబడ్డాడు. సూర్యుడు లేనిదైనా యీ కాలం అందంగానే ఉంది. నీటికి తడిసి మదించినలేళ్ళు సంతోషంతో ప్రకాశిస్తున్నాయి. మేఘాలు విరహులకు ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉన్నాయి. గ్రీష్మకాలదోషము పోయి

మేఘాల నీటితో అలంకరింపబడిన బృందావనం కుబేరుని ఉద్యానవనంలా శోభిస్తోంది. చూడు కృష్ణా! ఈ విధంగా వర్షాకాల గుణాల్ని బలరాముడు వర్ణిస్తూనే పల్లెలోకి వెళ్ళాడు. రామకృష్ణులిద్దరూ తక్కిన బంధువుల పిల్లలతో బృందావనమందు విహరించారు.॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
వర్షాకాల వర్ణనము అను పదకొండవ అధ్యాయము

★★★

# పన్నెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుని బాలలీల- యమునాశోభ

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఒకానొకప్పుడు కావలసినరూపం ధరించగల శ్రీకృష్ణుడు సంకర్షణుడు ప్రక్కన లేకుండా అందమైన ఆ వనమందు సంచరించాడు. జూలపాలు ధరించి తేజశ్శాలి, నల్లనివాడు, పద్మములవంటి నేత్రాలు కలవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ వక్షస్థలమందు కలవాడు, మచ్చతో కూడిన చంద్రునివలె ఉన్నవాడు, భుజకీర్తులు కలిగి వికసించిన తామరపువ్వువంటి అరచేయిగలవాడు, పద్మకింజల్కములవంటి పచ్చనివస్త్రం ధరించి సంధ్యాకాల మేఘంవలె ఉన్నవాడు, పిల్లగాలికి కదులుచున్న నెమలిపింఛం కలవాడు అయిన శ్రీకృష్ణుడు ఒకచోట పాడుతూ మరోచోట ఆడుతూ వాద్యము వాయిస్తూ ఒకచోట వేణువును ఊదుతూ ఆవుల సంతోషంత కొరకు నృత్యం చేస్తూ చిత్రములైన వనములలో సంచరించాడు. వనపంక్తులతో విహరిస్తూ కృష్ణుడు ఆనందించాడు.

ఒకనాడు వనంలో ఆవులతో సంచరిస్తూ విశాలంగా ఎత్తుగా ఉన్న ఒక శ్రేష్ఠమైన చెట్టును చూచాడు. ఆ చెట్టు అనేక పక్షులతో, పండ్లతో చిగురుటాకులతోనూ కూడి అక్కడ ఉన్న చెట్లకు రాజులాగా ఉన్నది. భాండీరమనే ఆ మర్రిచెట్టును చూచి దానిక్రింద విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు. తోటిపిల్లలతో ఆటలాడాడు. భాండీరమందుండి ఆడుతున్న శ్రీకృష్ణుని తక్కిన బాలకులు సంతోషపెడుతున్నారు. మరికొంతమంది గొల్లపిల్లలు పాడుతున్నారు. వాళ్ళ పాటకు కృష్ణుడు వాద్యం వాయించాడు.

ఒకనాడు ఆవులను మేపుతూనే తీగలతో అలంకరింపబడిన చెట్లుగల యమునానది ఒడ్డుకు వెళ్ళాడు. పద్మములు, కలువలు కలిగినది హంసలు మొదలైన పక్షులతో సేవింపబడుచున్నది, సుడులతో కూడినది, సముద్రానికి భార్య అయినదియైన ఆ నదిని చూచి అక్కడ సంచరించాడు. ఒకచోట పెద్దనీటి మడుగు కనిపించింది. అది నాల్గు క్రోసుల వైశాల్యం గలది, లోతైనది, క్రూర మృగాలచే విడువబడినది, చేపలు, పక్షులు కూడ లేనిది, విశాలమైన ఆ నీటి మడుగును చూచి ఎవరికీ చొరరాని యీ మడుగులో కాళీయుడను సర్పరాజు నివసిస్తున్నాడు. అతడు పూర్వం నాచే జయింపబడ్డాడు. పక్షిరాజైన గరుత్మంతునికి భయపడి యీ యమునా నదిని కలుషితం చేస్తున్నాడు. ఈ సర్పరాజును నేనే శిక్షించాలి. ఈ నీరు మంచినీరు కలది కావాలి. ఇతన్ని శిక్షిస్తే ఈ మడుగు గొల్ల వాళ్ళందరికీ ఉపయోగపడుతుంది. దీనికొరకే నేను గొల్లపల్లెలో ఉండటం, గొల్ల వాడుగా ఉండటం దుర్మార్గులను శిక్షించుటకే ఈ కడిమచెట్టునెక్కి మడుగులో దూకి కాళీయుని శిక్షిస్తాను. ఇలా చేస్తే నా బాహుబలం లోకంలో ప్రసిద్ధికెక్కుతుంది అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని బాలలీల- యమునాశోభ అను పన్నెండవ అధ్యాయము

☆☆☆

# పదమూడవ అధ్యాయము

## కాళియ సర్ప మర్దనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

శ్రీకృష్ణుడు నది ఒడ్డుకు వచ్చి నడుం బిగించి సంతోషంతో కడిమిచెట్టు చివరకు ఎక్కాడు. శ్రీకృష్ణుడు చెట్టు చివరనుండి ప్రేలాడుతూ ఆ మడుగులోకి దూకుతూ ధ్వని చేశాడు. కృష్ణుడు దూకటంచేత మడుగు కల్లోలమయింది. ఆ ధ్వనిచేత సర్పముయొక్క నివాసము క్షోభ చెందింది. (చలించిపోయింది) అప్పుడు సర్పం కోపంతో ఎర్రని కన్నులు కలదై నీటిలోనుంచి పైకి వచ్చింది. ఆ కాళీయ సర్పము ఎర్రబడిన కన్నులతో ఐదు శిరస్సులు కలిగి కదులుచున్న నాలుక కలదై ఉంది. అగ్నివర్ణంగల తన శరీరంతో మడుగునంతనూ నింపి రోషంతో ప్రకాశిస్తూ

తేజస్సు మండుతున్నట్లు కనిపించాడు కాళీయుడు. అతని కోపానికి నీళ్ళు వేడెక్కినై. నది భయపడినట్లు ఎదురు ప్రవహించింది. కోపంతో నిండిన అతని ముఖాలనుండి గాలి వెడలింది. మడుగులో పిల్లవాడువలె ఆడుతున్న కృష్ణునిచూచి అతని ముఖం నుండి అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. రోషంతో అతడు సృష్టించిన అగ్ని ప్రళయ కాళాగ్ని వలె ఒడ్డునున్న చెట్లును కాల్చి బూడిద చేసింది. అతని పుత్రులు, భార్యలు, సేవకులు అయిన సర్పాలు నోటితో విషాగ్ని కక్కుతూ వచ్చిపడ్డారు. కృష్ణుని తమ శరీరాలతో బంధించారు(యి).

కృష్ణుడు ఏ ప్రయత్నమూ చేయకుండా పర్వతంలా కదలకుండా ఉన్నాడు. ఆ సర్పాలు తీవ్రములైన దంతాలతో కాటువేశాయి. గొప్ప పరాక్రమవంతుడైన శ్రీకృష్ణుడు మరణించలేదు. ఇంతలో భయపడిపోయిన గోపాలకులు అందరూ అరుస్తూ దుఃఖిస్తూ గొల్లపల్లెకు వెళ్ళారు. గోపాలకులిలా చెప్పారు.

కృష్ణుడు కాళీయమడుగులో మునిగి మూర్ఛపోయాడు. కాళీయుడు కృష్ణుని తినేస్తున్నాడు రండి ఆలస్యం చేయకండి. సైన్యంతో కూడిన నందగోపుడికి త్వరగా చెప్పండి. శ్రీకృష్ణుడు మడుగులో కాళీయునిచేత లాగబడుచున్నాడు. నందగోపుడా మాటలు విని వజ్రపాతంగా (పిడుగుపడ్డట్లు) భావించి దీనుడై తొట్రుబడుతూ ఆ మడుగు దగ్గరకు వెళ్ళాడు. పిల్లలు, యువతులు, వృద్ధులూ, యువకుడైన సంకర్షణుడూ నీటిలో ఉన్న సర్పం వద్దకు వచ్చారు. నందగోపుడు మొదలుగాగల గోపాలకులు కన్నీరు కారుస్తూ అయ్యో అయ్యో అంటూ మడుగు ఒడ్డున ఉన్నారు. వాళ్ళు సిగ్గును, ఆశ్చర్యమును, దుఃఖాన్ని పొందారు.

కొందరు అయ్యో కుమారా! అని కొందరు ఛీ అని అయ్యో చచ్చాం అని కొందరూ మిక్కిలి దుఃఖపడ్డారు. స్త్రీలు యశోదను చచ్చిపోయావు ఎందుకంటే సర్పరాజు వశమైన పుత్రుని చూస్తున్నావు కనుక. అయ్యో మడుగు ఒడ్డున దుఃఖిస్తున్న నందగోపుని చూస్తున్నాం. అతడు తన దృష్టిని పుత్రుని ముఖమునందే నిల్పి చైతన్యం లేనివానివలె ఉన్నాడు. మనమంతా యశోదను అనుసరిద్దాం. ఈ మడుగులో ప్రవేశిద్దాం. దామోదరుడు లేకుండా గొల్లపల్లెకు వెళ్ళవద్దు. సూర్యుడు లేని పగలు, చంద్రుడు లేని రాత్రి, ఆబోతులేని ఆవులు, కృష్ణుడు లేని గొల్లపల్లె సమానములు. దూడలు లేని ఆవుల వలె కృష్ణుడు లేకుండా మనం వెళ్ళవద్దు. ఆ స్త్రీల యొక్క, వ్రజవాసుల యొక్క ఏడ్పును విని యశోదా నందుల దుఃఖాన్ని చూచి సంకర్షణుడు కోపించి కృష్ణునితో ఇలా అన్నాడు.

గోపాలకులకు ఆనందాన్ని వృద్ధి చేసేవాడా! కృష్ణా! కృష్ణా! విషమే ఆయుధంగా గల ఈ సర్పరాజును త్వరగా చంపివేయుము. ఈ మన బంధువులంతా నిన్ను సామాన్యమనిషిగా తలచి జాలి గలిగేట్లు దుఃఖిస్తున్నారు. శ్రీకృష్ణుడు బలరాముని మాటవిని సర్పబంధాన్ని త్రెంచివైచి భుజంతో చరిచాడు. పాము శరీరాన్ని పాదాలతో ఆక్రమించి అతని శిరస్సును వంచి చేతితో పట్టుకొన్నాడు. అందమైన భుజకీర్తులు గల శ్రీకృష్ణుడు అతని శిరస్సుపై నిలిచి నృత్యం చేశాడు. కృష్ణుడు బాగా మర్దించుట చేత అలసి నోళ్ళతో రక్తం క్రక్కుతూ భయపడి కాళీయుడిలా అన్నాడు.

ఓ కృష్ణా! అజ్ఞానంచేత రోషాగ్ని ప్రకటించాను. నేను శిక్షింపబడి నీకు వశమైనాను. కనుక భార్యా, పుత్ర, బంధువులతో కూడిననేను ఏమి చెయ్యాలో చెప్పు. నా జీవితాన్ని రక్షించు. ఐదుతలలు వంచిన సర్పాన్ని చూచి శ్రీకృష్ణుడు కోపంలేనివాడై సర్పరాజుతో నీవిక్కడ ఉండవద్దు. భార్యలు, బంధువులతో సముద్రంలోకి వెళ్ళు. మళ్ళీ నీ సేవకుడుగాని, పుత్రుడుగాని ఇక్కడ కనిపిస్తే వెంటనే వాణ్ణి చంపుతా. ఇక్కడ నీటికి శుభముగుగాక. నీవు సముద్రంలోకి వెళ్ళు. నిన్ను చంపను. సర్పమా! నీ తలలందు నా పాదాలగుర్తులు చూచి సముద్రంలో ఉన్న నిన్ను గరుత్మంతుడు చంపడు. సర్పరాజు కృష్ణుని పాదముద్రలను తలపై ధరించి గోపాలకులు చూస్తుండగానే మడుగునుండి కనపడకుండా పోయాడు.

సర్పం జయింపబడిన తరువాత కృష్ణుని గోపాలకులు ఆశ్చర్యంతో స్తోత్రం చేశారు. ప్రదక్షిణం చేశారు. అందరూ నందగోపుని నీవు ధన్యుడవు, అనుగ్రహింపబడ్డావు, నీపుత్రుడింత గొప్పవాడు. నేటినుండి గోపాలకులకు, గోవులకు గోశాలలకు ఆపదలలో శ్రీకృష్ణుడే రక్షకుడు. యమునానది మంగళకరమైన నీరు గలది. దీని ఒడ్డున గోవులు సుఖంగా సంచరిస్తాయి. నివురుగప్పిన నిప్పువలె వ్రజంలో ఉన్న ఈతని శక్తి మనం తెలుసుకొనలేకపోయాం అని ఆశ్చర్యంతో కృష్ణుని అందరూ స్తోత్రం చేశారు. గోపాలక సమూహం సంతోషంతో దేవతలు చైత్రరథమనే ఉద్యాన వనానికి వెళ్ళినట్లు గొల్లపల్లెకు వెళ్ళారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కాళీయ సర్ప మర్దనము అను పదమూడవ అధ్యాయము

☆☆☆

# పద్నాల్గవ అధ్యాయము

## సంకర్షణుడు ధేనుకాసురుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు. సర్పరాజైన కాళీయుడు శిక్షింపబడిన తరువాత రామకృష్ణులిద్దరూ హ్రదం (మడుగు) దగ్గరకు వచ్చారు. వాళ్ళవెంట గోధనం కూడా ఉంది. అక్కడకు దగ్గరలో ఉన్న గోవర్ధనపర్వతంమీదికి వెళ్ళారు. ఆ పర్వతానికి ఉత్తర దిక్కున యమున ఒడ్డున ఒక అందమైన పెద్ద తాటిచెట్ల వనముంది. అందమైన ఆ వనంలో ఉత్సాహంతో కూడి దూడలవలె ఉన్న వారిద్దరూ ప్రవేశించారు. ఆ ప్రదేశం సమతలమై నునుపుగా ఉంది. దర్భలతో నిండి ఉంది. అక్కడ ఎత్తైన తాటిచెట్లు పండ్లతో నిండి ఉన్నాయి. అక్కడ దామోదరుడిలా అన్నాడు.

అహో పండిన తాటికాయలచేత ఈ ప్రదేశం సువాసన గలిగిఉంది. ఇవి రుచికరమైనవి, సువాసన గలవి, చల్లనిరసం కలవి, పండిన తాటికాయలను ఇద్దరం పడవేద్దాం. వీటి సువాసనలను బట్టి అమృతంతో సమానమైన రుచిగలిగి ఉండవచ్చు. దామోదరుని మాటవిని బలరాముడు నవ్వుతూ ఆ చెట్లను ఊపి పండ్లను పడవైచాడు. ఆ తాటివనం మనుష్యులకు వెళ్ళదగినది కాదు. రాక్షసులు నివసింప తగినది. ఆ వనంలో భయంకరుడైన గాడిదరూపం ధరించిన ధేనుకుడనే రాక్షసుడు గాడిదల గుంపులో కలిసి ఉంటాడు. ఆ తాటివనాన్ని ఆ గాడిదరూపం ధరించిన వాడు రక్షిస్తుంటాడు. మనుష్యులను, పక్షులను, క్రూరమృగాల్ని భయపెడు తుంటాడు. తాటికాయల ధ్వనిని విని కోపించాడు. కదలిక కన్నులు కలవాడై ఓండ్ర పెడుతూ గిట్టలతో భూమిని చీలుస్తూ తోకను నేలపై కొట్టి నోరు తెరచిన యముడి వలె వస్తూనే బలరాముణ్ణి చూచాడు. దుష్టుడైన ఆ రాక్షసుడు బలరాముని కరిచాడు. వెనుక వాళ్ళతో రొమ్ముమీద తన్నాడు. బలరాముడు అతని కాళ్ళను పట్టుకొని తాటిచెట్టు మీదికి విసిరాడు. అతడు తొడలు, నడుము, మెడ విరిగి తాటిపండ్లతో పాటు నేలపై పడ్డాడు. ఆ రాక్షసుని తోటివాళ్ళను కూడా అట్లే చేశాడు. ఆ రాక్షసుడు సహచరులతో కూడా చంపబడగా వెనుకటికంటే ఆ తాటి వనం అందంగా కనిపించింది. భయరహితమైన ఆ తాటివనంలో ఆవులు స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. అప్పుడు చెట్ల ఆకులను ఆసనంగా చేసుకొని అన్నదమ్ములిద్దరూ సుఖంగా కూర్చున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
సంకర్షణుడు ధేనుకాసురుని చంపుట అను పద్నాల్గవ అధ్యాయము

☆☆☆

# పదిహేనవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు ప్రలంబుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత శ్రీకృష్ణ బలరాములు సంతోషంతో తాళవనం నుండి మళ్ళీ ఖాండీరవనానికి వచ్చారు. అక్కడ ఆవులు మేస్తున్నాయి. గోధనాన్ని మేపుతూ బాగా గడ్డి మొలచిన వనాలను చూస్తూ ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని పాట పాడుతూ పూవులు కోస్తూ ఆవులను, దూడలను పేరుపెట్టి పిలుస్తూ ఉన్నారు. ఇద్దరి వక్షస్థలమందు వనమాల ప్రకాశిస్తోంది. ఇంద్రధనుస్సుతో కూడిన తెల్లని నల్లని మేఘాల వలె వారిద్దరి శరీరాలు చాలా అందంగా ఉన్నాయి. గోవర్ధన పర్వతమందలి వనంలో తోటిపిల్లలతో కలిసి తిరుగుతూ ఆటలలో ఓడిపోవడం లేదు. తగిన సమయంలో ఖాండీరమనే వృక్షం వద్దకు వచ్చారు. ఆ మర్రిచెట్టు పెద్ద కొమ్మలుగల్గి చెట్లకు రాజులా ఉంది. అక్కడ రాళ్ళతో ద్వంద్వయుద్ధాలతో వ్యాయామం చేశారు. అనేక యుద్ధ పద్ధతులు చూపిస్తూ సింహం వంటి నడక గల అన్నదమ్ములు సంతోషంతో స్వేచ్ఛగా తిరిగారు.

ఇలా ఆటలాడుతున్న వారిని చూచి వాళ్ళ దగ్గరకు ప్రలంబుడను వాడు వచ్చాడు. అతడు కూడ అడవి పువ్వుల నలంకరించుకొని గొల్లవాని వేషం ధరించి వారిద్దరినీ హాస్యంచేత ఆటలచేత ఆశపెట్టి ఆ గోపబాలుర మధ్యలో ప్రవేశించాడు. ఆ రాక్షసుడితో అందరూ ఆటలాడారు. అతన్ని గోపాలునిగానే తలచారు. అవకాశం కోసం చూస్తూ తన క్రూరదృష్టిని శ్రీకృష్ణుని మీద బలరాముని మీద కేంద్రీ కరించాడు. కృష్ణుని సహించలేనని తలచి బలరాముని చంపాలని ప్రయత్నించాడు. ఒకడు ఇద్దరిమీద నుంచి దూకే ఆటలో ఒక గోపాలకుడు కృష్ణుని శ్రీదాముని పైనుంచి దూకాడు. ప్రలంబుడు సంకర్షణుని పైనుండి దూకాడు. ఆ ఆటలో కృష్ణుడు శ్రీదాముని జయించాడు. బలరాముడు ప్రలంబుని జయించాడు. కృష్ణుడి పక్షంలోని గోపాలురు ఇతర గోపాలకులను జయించారు. ఒకరినొకరు మోస్తూ సంతోషంతో పరిగెత్తారు.

ఖాండీరవృక్షం మొదటికి మళ్ళీ అందరూ చేరారు. ఆ రాక్షసుడు సంకర్షణుని భుజం మీదకు ఎత్తుకొని త్వరగా వెళ్ళాడు. బలరాముని బరువు మోయలేక తన

శరీరాన్ని పెంచాడు. ఖాండీర వటవృక్షంలాగా పర్వతం వలెనూ పెద్దదైన శరీరాన్ని చూపించాడు. సూర్యుని వంటి కాంతిగల కిరీటం పెద్ద మెడ కలిగి రౌద్రాకారంతో భూమిని తన పాదాలతో వంగునట్లు చేస్తూ వ్రేలాడుతున్న ఆభరణాలు కలిగి వీరుడైన ప్రలంబుడు వేగంగా వెళ్ళి బలరాముని అపహరించుకు పోయాడు. బలరాముడు కృష్ణా! రాక్షసుడు నన్ను తీసుకుపోతున్నాడు. ఈ దుర్మార్గుని శాసించుట ఎలా? అని కేక వేశాడు. అప్పుడు కృష్ణుడు నవ్వుతూ బలరాముని శక్తి తెలిసినవాడు కనుక నీవు మానవస్వభావంతో మాట్లడుతున్నావు.

నారాయణుని స్మరించు(తలచుకో) దేవతలకు నీ అంతు తెలియకపోవుటచే నీవు అనంతుడవుగా చెప్పబడుచున్నావు. నేనెటువంటివాడనో నీవు కూడ అటు వంటివాడవే. నీవు శేషుడవు మన యిద్దరికీ శరీరమే వేరుగా ఉంది. నీవు అజ్ఞానివిగా ఉన్నావేమి? బలంతో రాక్షసుణ్ణి చంపు. వజ్రాయుధం వంటి పిడికిలితో తలపై కొట్టు. ఇలా కృష్ణునిచేత గుర్తు చేయబడినవాడై బలరాముడు పిడికిలితో రాక్షసుని తలపై కొట్టాడు. మోకాళ్ళతో కొట్టి చంపాడు. ప్రలంబుని చంపి శ్రీకృష్ణుని బలరాముడు కౌగలించుకొన్నాడు. కృష్ణుడు గోపాలకులు దేవతలు మహాబలశాలి యైన బలరాముని స్తోత్రం చేశారు. అప్పుడు జనానికి బలరాముని బలం తెలిసింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు ప్రలంబుని చంపుట అను పదిహేనవ అధ్యాయము

☆☆☆

# పదహారవ అధ్యాయము

## గోపవృద్ధుని ఇంద్రోత్సవ ప్రస్తావన

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈ విధంగా బలరామ కృష్ణులిద్దరూ వనంలో విహరిస్తూండగా రెండు నెలలు గడిచిపోయాయి. ఆ తరువాత వ్రజంలోకి వచ్చారు. అక్కడ ఇంద్ర పూజా మహోత్సవం జరుగుతుందని విన్నారు. గొల్లవాళ్ళందరూ ఆ ఉత్సవం కోసం చాలా ఆసక్తితో ఉన్నారు. ఇలా ఆసక్తితో ఉన్న జనాన్ని శ్రీకృష్ణుడు చూచి అడిగాడు. మీరు ఉత్సాహపడుతున్న ఇంద్రమహోత్సవం ఏమిటి? వాళ్ళలో ముసలివాడు నాయనా! విను.

ఇంద్రధ్వజ పూజ జరుగుతుంది. ఇంద్రుడు దేవతలకు మేఘాలకూ కూడ రాజు. అతనికి సంబంధించిన ఉత్సవమిది. అతడే మేఘాల్ని ప్రేరేపిస్తాడు. అతని ఆజ్ఞను బట్టి మేఘాలు పైరులను పండిస్తాయి. వర్షం కురిపించే వాడు ఇంద్రుడు. అతడు సంతోషించి సమస్తప్రపంచాన్ని సంతోషపెడతాడు. అతనివల్ల ఏర్పడిన పైరులను మనమూ ఇతరులూ అనుభవిస్తాం. గొప్ప ఉత్సవం చేసి దేవతలను తృప్తి పరుస్తాం. ఇంద్రుడి వర్షం వల్ల ఈ లోకంలో పైర్లు వృద్ధి చెందుతాయి. ఈ ఆవులు బాగా పాలు కలిగి దూడలను సంతోషపెడతాయి. మంచి గడ్డిని మేసి ఆవులు ఎడ్లు బాగా బలిసి ఉంటాయి. మేఘాలు వర్షించినచోట భూమి గడ్డి లేనిదిగా పైరులు లేనిదిగా ఉండదు.

జనం ఆకలిబాధలకు గురికారు. పుష్టిగల ఆవులు పవిత్రమైన క్రొత్త పాలను వర్షిస్తాయి. వాయువుతో కూడిన మేఘాలు ఉరుముతాయి. ఆకాశమందలి మేఘాలు జలాన్ని వర్షిస్తాయి. స్వేచ్ఛగా సంచరించు మేఘాలు ఇంద్రుని సేవకులు. దేవేంద్రుడు ఆకాశమందలి మేఘాలు ఒకచోట సూర్యుడు కనపడని విధంగా వేరొకచోట కాటువంటి ఆకారం గల మేఘాలతో ప్రపంచాన్ని అలంకరిస్తాడు. ఒకచోట జల బిందువులనే ముత్యాలు గల దానినిగా ఆకాశాన్ని చేస్తాడు. ఇంద్రుడు భూమి మీద వర్షం కురిపిస్తాడు కనుక భూమండలంలోని రాజులందరూ సంతోషంతో ఇంద్ర మహోత్సవం చేస్తున్నారు. ఆ ప్రసిద్ధిని బట్టి మేం కూడా ఇంద్రపూజామహోత్సవం చేయటానికి సిద్ధపడుతున్నాం.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
గోపవృద్ధుని ఇంద్రోత్సవ ప్రస్తావనగోపవాక్యమునే పదహారవ అధ్యాయము

☆☆☆

# పదిహేడవ అధ్యాయము

## గోవర్ధనోత్సవము

వైశంపాయనుడిలా చెప్పాడు.

ముసలిగొల్లవాని మాటలు విని దామోదరుడు ఇంద్రుని ప్రభావం తనకు తెలిసినా యిలా పలికాడు.

మనం అడవిలో తిరిగే గొల్లవాళ్ళం. ఎల్లప్పుడూ గోధనంతో జీవించేవాళ్ళం. మనకు ఆవులు, కొండలు, వనాలు దేవతలని తెలుసుకో. వ్యవసాయం చేసేవాళ్ళకు

వ్యవసాయమే వృత్తి. వ్యాపారం చేసేవాళ్ళకు అమ్మబడే వస్తువులు వృత్తి. మనకు ఆవులు వృత్తి. (జీవనాధారం) ఇవి మూడు విద్యలు. విద్యయే దైవతం. అదియే పూజింపదగినది. అదే ఉపకారం చేస్తుంది. ఒకని నుండి ఫలితాన్ని అనుభవిస్తూ వేరొకని పూజిస్తే వాడికి రెండు నష్టాలు ప్రాప్తిస్తాయి. ఈ లోకంలో పరలోకంలో ఏర్పడేవే ఆ రెండు కష్టాలు. వ్యవసాయానికి పొలం హద్దు. పొలానికి వనం, వనానికి పర్వతం హద్దు. పర్వతాలు కూడ కావలసిన రూపం ధరిస్తాయని వింటున్నాం. ఆయా శరీరాలు ధరించి చరిస్తాయి క్రీడిస్తాయి. క్రూరమృగాల రూపం పొంది తమ వనాన్ని రక్షించుకుంటాయి.

వనాలలో ఉండేవాళ్ళు పర్వతాలకు గౌరవం ఇవ్వకపోతే ఆ దుర్మార్గులను చంపుతాయి. బ్రాహ్మణులకు మంత్రాలే యజ్ఞము. వ్యవసాయదారులకు నాగళ్ళు యజ్ఞం, గోపాలకులకు కొండయే యజ్ఞము. అంటే మంత్రాలను బ్రాహ్మణులు పూజిస్తారు. అట్లే వ్యవసాయదారులు గోపాలకులు కూడ తమతమ వస్తువులను పూజిస్తారని భావం. మనం బృందావనంలో పర్వతాన్ని పూజించాలి. కాబట్టి గోపాలకులారా! నాకు గిరియజ్ఞం ఇష్టమైంది. కనుక గిరియజ్ఞం జరుగుగాక! ఏదైనా ఒక చెట్టు క్రిందలేక పర్వతంమీద స్వస్తివాచనపూర్వకంగా అగ్నింకుండాలు మండపాలు నిర్మించి పవిత్రమైన పశుబలిని ఇద్దాం. ఇప్పుడు కాలం వ్యర్థంగా గడపవద్దు. మీరు ఏమి ఆలోచిస్తున్నారు? పుష్పమాలలతో ఆవులకు శృంగారం చేసి వాటిద్వారా గోవర్ధనపర్వతానికి ప్రదక్షిణం చేయించండి. తరువాత వాటిని విడిచిపెట్టండి. వాటి ని విడిచిపెట్టండి. వాటి యిష్టానుసారం అని వనానికి వెళ్తాయి.

ఇప్పుడు అద్భుతమైన శరదృతువు వచ్చింది. ఈ కారణంగా గడ్డి, నీరు, మొదలైన వస్తువులు బాగా రుచికరములైనాయి. మేఘాలు ఆకాశం నుంచి తొలగి పోయాయి. ప్రియంగు మొదలైన చెట్లు పుష్పించాయి. నెమలికూతలు విని పించటంలేదు. చెట్లు దట్టమైన ఆకులతో శోభిస్తున్నాయి. నీళ్ళు తగ్గుతున్నాయి. చక్రవాకపక్షులు స్తనాలుగా ఇసుక తిన్నెలు పిరుదులుగా హంసలు నవ్వుగా కలిగి నదులు భర్తయైన సముద్రాన్ని చేరుతున్నాయి. నీళ్ళు వికసించిన కలువపువ్వులు గలవి. ఆకాశం నక్షత్రాలు గలది. వనాలు మనస్సుకు ఇంపైనవి. చేలు, సరస్సులు దిగుడు బావులు వికసించిన కలువపువ్వులతో శోభిస్తున్నాయి. ఆకాశంలో మబ్బులు కనపడటంలేదు.

నిర్మలమైన ఆకాశంలో చంద్రుడు సంతోషిస్తున్నాడు. ఆవులు రెట్టింపు పాలను ఇస్తున్నాయి. వనములు రెట్టింపు శోభ గలవై ఉన్నాయి. నక్షత్రాలు బాగా ప్రకాశిస్తు న్నాయి. మనుష్యుల మనస్సులు నిర్మలములైనాయి. రాజులు విజయానికి బయలు దేరుతున్నారు. మనం పర్వతాన్ని దేవునిగా పూజిద్దాం. ఆవులను కూడా విశేషంగా పూజిద్దాం. శుభం కొరకు ఆవులను పూజిద్దాం. గిరియజ్ఞం చేద్దాం. దేవతలు ఇంద్రుని పూజిస్తే మనం కొండను పూజిద్దాం. నామీద మీకు ప్రేమ ఉంటే, మనమంతా మిత్రులమైతే ఎల్లప్పుడూ అందరికీ ఆవులే పూజింపదగినవి. ఇందులో సందేహం లేదు. మీకందరకు ఇష్టమైతే మనస్సులో వేరే ఆలోచన లేకుండా నామాటను అంగీకరించి లోకకళ్యాణం కోసం ఈ యజ్ఞాన్ని ప్రారంభించండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
గోవర్ధనోత్సవము అను పదిహేడవ అధ్యాయము

☆☆☆

# పద్దెనిమిదవ అధ్యాయము

## గోవర్ధన పూజ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! భగవంతుడైన కృష్ణుని మాటకు గోపాలకులందరూ గగుర్పాటు చెందినవాళ్ళై ఇలా పలికారు.

నాయనా! నీవు బుద్ధిమంతుడవు. నీమాట మాకు మిక్కిలి ఆనందం కలిగించి నది. నీ విమర్శ ప్రకారం నడిస్తే మా ఆవుల సంతతి వృద్ధి చెందుతుంది. నీవు మాకు గతి. శుభమైన పనులు తెలిసినవాడవు. ఆధారము, అభయమిచ్చేవాడవు. మిక్కిలి ఉపకారివి, మిత్రుడవు. ఓకృష్ణా! నీ ప్రతాపం చేతనే ఈ గోపాలక సమూహం గోకులం కష్టాలు లేకుండా ఉంది. సంతోషంతో స్వర్గభోగాలను అను భవిస్తోంది. పుట్టినప్పటి నుండీ నీయొక్క పనులచేత, సాటిలేని బలంచేత, కీర్తి పరాక్రమాల చేతనూ మేము ఆశ్చర్యపడుతున్నాం. నీవు ప్రచండ పరాక్రమంచేత, వివేకంచేత మానవులలో దేవతలలో ఇంద్రునివలె గొప్పవాడవు. మానవులలో నీవు అందరికంటే ప్రధానుడవు. నీవు శరీరబలంలో చాలాక్రీడలలోనూ కుమార

స్వామి వంటివాడవు. నీవు గిరియజ్ఞానికి ఇష్టపడ్డావు. నీ ఆజ్ఞ మాకు తప్పక ఆచరింప దగినది. దాటరానిది కూడ.

కాబట్టి ఇంద్రమహోత్సవము ఆపివేసి గోపాలకులయొక్క గోవులయొక్క క్షేమం కొరకు నీవు చెప్పిన గిరియజ్ఞమే ప్రారంభమవుతుంది. పాలతో భోజనం తయారవుతుంది. నీళ్ళు త్రాగటానికి అందమైన చెంబులు సిద్ధం చేయండి. పాలతో కృత్రిమనదులు నింపండి. భోజనపదార్థాలనన్నింటినీ తీసుకురండి. అన్నము, మాంసము, పాత్రలలో నింపండి. మూడు రాత్రుల పాలను సేకరించండి. గోపాలకు లందరూ యజ్ఞం ప్రారంభించండి. అనగా గొల్లపల్లె ఆనందాన్ని కలిగి స్తుండగా మాంసరాశి, అన్నపర్వతం ఏర్పడింది. గిరియజ్ఞం ప్రారంభమైంది. కొద్ది క్షణాల్లో ఆ ప్రదేశం గోపాలకులతో, గోపికలతో గోధనంతో నిండిపోయింది. యజ్ఞస్థలం వద్ద అగ్నిస్థానము, చరుస్థాలి, అనేకవిధములైన ఆహారపదార్థాలు, సుగంధద్రవ్యాలు, పుష్పమాలలు, ధూపము మొదలైన పూజాసామగ్రి యజ్ఞ స్థానమందు ఉంచబడింది.

తరువాత శుభముహూర్తంలో గోపాలకులు బ్రాహ్మణులతో గిరియజ్ఞం ప్రారంభించారు. యజ్ఞం పూర్తయిన పిమ్మట భగవంతుడైన కృష్ణుడు తన మాయచే గోవర్ధన పర్వతరూపం ధరించి గొప్పదైన భోజనసామగ్రిని భోజనం చేయ మొదలు పెట్టాడు. రెండుప్రక్కల ఉత్తమబ్రాహ్మణులు భోజనానికి కూర్చున్నారు. వాళ్ళు భోజనంతో మిక్కిలి తృప్తిపడి, స్వస్తివాచనం చేస్తూ లేచారు. పర్వతరూపం ధరించిన భగవంతుడు కృష్ణుడు కూడా స్వేచ్ఛగా భోజనం చేసి తృప్తి పొందాను అని పలుకుతూ ఆ రూపంతోనే నవ్వ మొదలుపెట్టాడు. గోవర్ధనపర్వతంమీద పర్వత రూపంలో ఉన్న కృష్ణభగవానునకు గోపాలకులు నమస్కరించారు.

రెండవరూపంతో గోపాలకులతో కలిసి ఉన్న శ్రీకృష్ణుడు కూడా తనకు తాను నమస్కారం చేశాడు. ఆ సమయంలో అక్కడి గోపాలకులు ఆశ్చర్యపడి పర్వతం మీద ఉన్న దేవతతో ఓ భగవంతుడా మేము నీ దాసులము. ఏం చెయ్యాలో ఆజ్ఞాపించండి అని ప్రార్థించారు. పర్వతరూపంలో ఉన్న శ్రీకృష్ణుడు పర్వతవాక్కుగా ఓ గోపాలకులారా! మీ హృదయంలో ఆవులమీద దయఉంటే ఈ రోజు మొదలు కొని మీరు నాపూజ చేయండి. మీరు కోరిన ఫలమును ఇచ్చేవాణ్ణి నేను. నా ప్రతాపంతో మీరు లెక్కలేనన్ని గోవులను తీసుకొని పరమానందంతో ప్రతి వనంలో

విహరించండి. నేను అన్నివిధాల మీకు శుభం కలిగిస్తాను. నేను కూడా మీతో సుఖంగా విహరిస్తాను. నేను నందుడు మొదలగువాళ్ళకు ఎక్కువ ధనాన్ని ఇస్తా. త్వరగా దూడలతో ఆవులను నా యెదుట సమావేశపరచండి. వాటిని చూచి మిక్కిలి ఆనందిస్తా అన్నాడు.

తరువాత గిరిరూపం ధరించిన భగవంతునికి నీరాజనం కొరకు ఎడ్లు లెక్కలేనన్ని ఆవులు అక్కడకు వచ్చాయి. వాళ్ళు గోవర్ధనపర్వతానికి ప్రదక్షిణం చేశారు. ఆవుల కొమ్ములు మొదలైన అవయవాలకు పుష్పమాలలతో అలంకారం చేశారు. వాటిసంఖ్య వందలకొలది వేలకొలదిగా ఉంది. గోపాలకులు ఆవులవెంట పరుగెత్తారు. గోపాలకులు అనేకవిధములైన వస్త్రాలతో ఆభరణాలతో ఆ సమయమందు శోభ కలిగి ఉన్నారు. కొందరు ఎడ్లమీద ఎక్కారు. కొందరు నృత్యం చేశారు. కొందరు వేగంగా వెళ్ళే ఆవులను పట్టుకొన్నారు. ఈ విధంగా గోవులకు నీరాజనోత్సవము గిరిప్రదక్షిణ పూర్తి అయిన పిమ్మట గోవర్ధన దేవుని ప్రత్యక్షమూర్తి అంతర్ధానం చెందింది. తరువాత కృష్ణభగవానుడు గోపాలకులతో వ్రజానికి వెళ్ళాడు. గిరియజ్ఞం యొక్క అద్భుత ఉత్సవాన్ని చూచి పిల్లలు వృద్ధులు అందరూ ఆశ్చర్యపోయారు. అందరూ భగవంతుడైన శ్రీకృష్ణుని స్తోత్రం చేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
గోవర్ధన పూజ అను పద్దెనిమిదవ అధ్యాయము

☆☆☆

# పందొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని మోయుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈవిధంగా ఇంద్రపూజా మహోత్సవము ఆగిపోగా ఇంద్రుడు మిక్కిలి కోపించాడు. సంవర్తకము మొదలగు ముఖ్య మేఘాలను పిలిచి ఓ మేఘ శ్రేష్ఠులారా! మీ హృదయంలో రాజభక్తి ఉంటే నాకిష్టమైన పని చేయాలని కోరిక ఉంటే నేను చెప్పే విషయం జాగ్రత్తగా వినండి. నందుడు మొదలైన కృష్ణ భక్తులు గోపాలకులు బృందావనానికి వెళ్ళినా ఉత్సవాన్ని అవమానించారు. అపహసించారు. వర్షంచేత, గాలిచేత ఏడురోజులు ఆవులకు బాధ కలిగించండి. ఐరావతంమీద స్వయంగా వచ్చి నేను భయంకరమైన వర్షాన్ని, పెనుగాలిని,

సృష్టిస్తాను. మీరు తీవ్రంగా వర్షించటంచేత పెనుగాలి వీచటంచేత ఆవులు ప్రాణాలు విడుస్తాయి. వ్రజం (గొల్లపల్లె) కూడ మరణిస్తుంది. ఈ విధంగా సమస్త మేఘాలుకూ ఆజ్ఞ ఇచ్చాడు.

అప్పుడు నల్లని మేఘాలు ఘోరంగా గర్జిస్తూ భయంకరములై ఆకాశాన్ని ఆవరించాయి. మెరుపులతో, ఇంద్రధనుస్సులతో మేఘాలు ఆకాశాన్ని చీకటితో ఆవరింపబడినట్లు చేశాయి. ఏనుగులవలె, మొసళ్ళవలె, సర్పాలవలె మేఘాలు ఆకాశంలో సంచరించాయి. ఆకాశాన్ని ఆవరించి మేఘాలు/సూర్యుడు కనబడ కుండా చేశాయి. ఏనుగుతొండంలాంటి ధారలతో మేఘాలు వర్షించాయి. పక్షులు తిరుగుటలేదు. మృగజాతులు పారిపోతున్నాయి. ఆకాశం మేఘసమూహం వల్ల నక్షత్రాలు, గ్రహాలు, సూర్యచంద్రులు లేనిదిగా కాంతి హీనమైంది. భూమి అంతా జలమయం అయింది. నదులు పొంగిపోతున్నాయి.

మేఘాలు ఉరుములచేత భయపెట్టబడినట్లు గడ్డి, చెట్లు ఒణుకుతున్నాయి. ప్రళయకాలం వచ్చి అంతా సముద్రమైపోతుందని గోపాలకులు మాట్లాడుకొంటు న్నారు. ఆ భయంకర వర్షంచేత ఆవులకు బాగా కష్టం ఏర్పడింది. ఆవుకు ఆభారవం చేస్తూ కదలలేక స్తంభించాయి. కృశించిపోయిన పొట్ట పొదుగూ కలవయ్యాయి. కొన్ని మరణించాయి. ఆహారం లేక వణికిపోతున్నాయి. దూడలు బాలకులు దామోదరుని ముఖం చూస్తున్నారు. దైన్యంతో కూడిన ముఖాలు కలిగి రక్షించమని అడుగుతున్నారు. గోపాలకులు కూడ మరణించే పరిస్థితి ఏర్పడింది.

ఇదంతా చూచి కృష్ణుడు కోపం కలవాడయ్యాడు. ఉపాయం కనిపించిందని తనకు తానే అనుకొన్నాడు. ఈవేళ మోయరానిది అడవులతో వనాలతో కూడినది ఐన ఈ పర్వతాన్ని పెకలించి వర్షం నుంచి కాపాడటానికి స్థానం కల్పిస్తాను. భూమి వలె విశాలమైన ఈ పర్వతమును మోసి వ్రజమును, గోవులను రక్షిస్తాను. అని ఆలోచించి సత్యపరాక్రముడైన కృష్ణుడు తన భుజబలాన్ని ప్రదర్శిస్తూ రెండవ పర్వతంవలె శరీరం గలవాడై చేతులతో ఆ పర్వతాన్ని పెకలించాడు. ఎడమచేతితో మోయబడిన ఆ పర్వతం ఇంటి ఆకారాన్ని పొందింది. భూమినుండి పెకలింపబడు తున్న ఆ పర్వతం యొక్క చరియలయందు రాళ్ళు కదిలాయి. చెట్లు పడి పోయాయి. అతని చేతియందలి పర్వతం పక్షిలా కనిపించింది. జనులు వర్షిస్తున్న, మేఘాలు గర్జిస్తున్న, వాయువు, జనులకు తెలియలేదు. విద్యాధర గంధర్వాదులు ఈ పర్వతానికి రెక్కలున్నాయనుకొన్నారు.

ఆ పర్వతం బంగారం కాటుక, వెండి రంగులు కదిగా కనిపించింది. ఆ పర్వతం శిఖరాలు కొన్ని శిథిలమై సగం విరిగినవి కొన్ని శిఖరాలు కనిపించాయి. పర్వతంతో కదిలిపోతున్న చెట్ల అనేకవిధాలైన పువ్వులు నేలపై అంతటా వ్యాపించాయి. పెద్దపెద్ద సర్పాలు వెలుపలికి వచ్చాయి. పక్షులు వర్షంచేత భయపడి దైన్యాన్ని పొందాయి. ఎగిరెగిరి మళ్ళీ క్రిందపడుతున్నాయి. శ్రీకృష్ణుని దండంవంటి భుజంచేత ధరింపబడిన పర్వతం గొడుగుగా ప్రకాశించింది. మేఘాలచే మూయబడిన గుహలుగల పర్వతం శ్రీకృష్ణుని భుజమనే దిండుపై నిద్రిస్తున్నట్లున్నది. ఇంద్రునిచే ప్రేరేపించబడిన మేఘాలు తెంపులేని వర్షాన్ని కురిశాయి. ఆ పర్వతాన్ని చేతి యందుంచి చిరునవ్వుతో రక్షకుడైన కృష్ణుడు ప్రజాపతివలె గోపాలకులచే భావింపబడ్డాడు.

గోపాలకులారా! ఈ పర్వతమనే ఇల్లు గాలిలేనిది, ఆవులను రక్షించేది. ఆవుల గుంపులు ప్రవేశించాలి. గాలిలేని ప్రదేశాలలో సుఖంగా నివసించండి. కొండను పెకలించటంచేత క్రింద ఎక్కువ నేల ఉంది. ఐదు క్రోసులు పొడవు క్రోసు వెడల్పు గల ఈ స్థలంలో సుఖంగా నివసించండి. నేను మూడులోకాలను రక్షించగలను. ఈ వ్రజమెంతటిది? గోవుల అంభారవములు గోపాలకుల మాటలు వెలుపల మేఘాల ధ్వని కలిపి పెద్దశబ్దమేర్పడింది. గోవులు గోపాలకులు అక్కడ ప్రవేశించారు. కృష్ణుడు పర్వతం క్రింద స్తంభంలా నిలిచిఉన్నాడు. ఒకచేతితో పర్వతాన్ని ధరించాడు. వ్రజము యొక్క ఛాండాలు బండ్లు వర్షానికి భయపడి అక్కడ ప్రవేశపెట్టబడ్డాయి.

దేవతలకు సాధ్యంకాని కృష్ణుని పని చూచి ఇంద్రుడు తన ప్రతిజ్ఞ నెరవేరక మేఘాలను ఆపివేశాడు. ఏడురాత్రులు గడవగా ఉత్సాహం లేనివాడై మేఘాలతో కప్పబడి ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళాడు. ఏడురాత్రులు గడవగా తన ప్రయత్నం మానుకొన్నాడు. ఇంద్రుడు మేఘాలు వెళ్ళిపోయాయి. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. ఆవులు అలసట తీరి వచ్చిన మార్గానా వెళ్ళిపోయాయి. వ్రేపల్లె తన స్థానానికి తిరిగివచ్చింది. శ్రీకృష్ణుడు ఆ పర్వతాన్ని వెనుకటి స్థానంలో సంతోషంతో నిలిపాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని మోయుట అను పంథొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఇరవైయవ అధ్యాయము

## శ్రీకృష్ణునకు గోవిందునిగా అభిషేకము

దేవేంద్రుడు గోవర్ధనపర్వతాన్ని ఎత్తటం గోకులాన్ని రక్షించడం చూచి ఆశ్చర్య పడి శ్రీకృష్ణుని చూడాలని కోరిక గలవాడయ్యాడు. మదించిన తెల్లని ఐరావతమనే ఏనుగునెక్కి భూలోకానికి వచ్చాడు. పరాక్రమశాలియైన ఇంద్రుడు గోవర్ధన పర్వతశిలపై కూర్చున్నట్టి ఏ పనినైన శ్రమ పడకుండ చేయగల శ్రీకృష్ణుని చూచాడు. గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తున్న గోపాలవేషం ధరించిన విష్ణువును బాలుడిరూపంలో ఉన్నవాణ్ణి చూచి సంతోషించాడు.

నీటితో కూడిన మేఘంలా నల్లనై శ్రీవత్సమనే పుట్టుమచ్చగల శ్రీకృష్ణుని దేవేంద్రుడు తనివితీరక అన్ని కన్నులలో చూచాడు. మిక్కిలి శోభ గలిగినట్టి రాతి బండపై కూర్చునట్టియు దేవునిలా ఉన్న శ్రీకృష్ణుని చూచి సిగ్గుపడ్డాడు. గరుత్మంతుడు కనపడకుండా ఉండి తన రెక్కలతో శ్రీకృష్ణుని ముఖానికి నీడను ఇస్తున్నాడు. బలారి, వనంలో ఏకాంతంగా కూర్చుని యున్నట్టి లోకవృత్తాంతమందా నక్తిగల శ్రీకృష్ణుని కాలినడకన వచ్చి చూచి సమీపంలో దివ్యమైన గంధం పూసుకున్న శరీరంతో కూడినవాడై వెయ్యికన్నులతో చూస్తూ కృష్ణా కృష్ణా మహాబాహూ! నీవు గోవుల మీది ప్రేమతో దేవతలు చేయలేని పనిచేశావు. ప్రళయ కాలంలో వర్షించే మేఘాలనునేను పంపినా నీవు ఆవులను రక్షించావు.

అందుకు నేను మిక్కిలి సంతోషించాను. యోగమహిమచేత ఇంటి ఆకారంలో ఉన్న పర్వతాన్ని మోశావు. ఈ పనికి ఎవడు ఆశ్చర్చపడడు? ఓ కృష్ణా! నీవు ఉత్సవం ఆపుచేయటంవల్ల కోపించి ఏడురోజులు మిక్కిలి వర్షం కురిపించాను. ఆ వర్షాన్ని నీవు ఎదుర్కొన్నావు. ఇది దేవతలకు కూడా సాధ్యంకాని పని. ఓ శ్రీకృష్ణా! నీవు మనుష్య వేషంలో ఉండి విష్ణుతేజస్సును మరుగుపరచావు. దేవతల పనిని నీవు సాధించినట్లే తలచుచున్నాను. నీవు అన్ని పనులను సాధిస్తావు. నీవు దేవతలకు నాయకుడవు. అన్ని పనులలో ముందుండేవాడివి. నీవు తప్ప దేవతలకు మరొక దిక్కులేదు.

ఈ జగత్తంతా నీ శరీరంలో ఉంది. బ్రహ్మదేవుడు బుద్ధిచేత వయస్సుచేత పెద్దవాడైనా నిన్ను అనుసరించలేడు. పర్వతాలలో హిమవత్పర్వతం గొప్పది.

పక్షులలో గరుత్మంతుడు గొప్పవాడు. అట్లే దేవతలందరిలో నీవు గొప్ప వాడవు. గోలోకం అన్ని లోకాలకూ పైన ఉంది. నీ తపోమయమైన సంచారము దానికి కూడ పైన ఉంది. మేము బ్రహ్మదేవుని అడిగినా నీ ప్రవర్తన తెలియలేదు. అన్ని శుభకర్మలకు భూలోకం పుణ్యక్షేత్రము. ఇంద్రియనిగ్రహం కలవారికి నీవు దిక్కు.

గోసేవ చేసినవాళ్ళు గోలోకాన్ని పొందుతారు. ఆ గోలోకం అన్నిటికంటే గొప్పది. గోవుల కేర్పడిన కష్టాన్ని తొలగించావు. గోవుల మాటను బట్టి నేనిక్కడకు వచ్చాను. బ్రహ్మదేవునిపై గౌరవంతో కూడ నేను వచ్చాను. కృష్ణా నేను దేవతలకు రాజైన ఇంద్రుడను. నీకు అన్నను. నేను మేఘాలతో చాలా కష్టం కలిగించాను. ఆ అపరాధాన్ని క్షమించుము. ఇప్పుడు బ్రహ్మ చెప్పిన మాటలు గోవుల యొక్క మాటలు విను. నిన్ను గూర్చి బ్రహ్మదేవుడు ఆకాశమందున్న గోవులు చెప్పిన మాటలివి.

దివ్యములైన నీ పనులచేత సంతోషించాము. నీవు గోవులను గోలోకాన్ని కూడ కాపాడావు. మేము ఎడ్లచేత, హవిస్సుచేత దేవతలను, వేదంచేత సంపదను (లక్ష్మీదేవిని) తృప్తి పరుస్తాం. అందువల్ల నీవు మాకు గురువు, ప్రాణవాయువు, మహాబలశాలివి. నేటినుండి నీవు మాకు ఇంద్రుడవగుము. ఓ శ్రీకృష్ణా నేను దివ్యమైన నీటితో నిండిన బంగారుపాత్రను తెచ్చాను. ఇప్పుడు ఇంద్రపదవికి పట్టాభిషిక్తుడవు అగుము. నేను దేవతలకు ఇంద్రుడను, నీవు గోవులకు ఇంద్రుడ వయ్యావు. ఈ నాటినుండి నీవు ప్రపంచంలో గోవిందుడనే పేరు పొందుతావు. ఆవులు నిన్ను నాకంటే గొప్ప ఇంద్రునిగా ప్రకటించాయి. ఈవేళ నుండి నీవు స్వర్గంలో కూడ ఉపేంద్రుడుగా పిలువబడతావు.

ఓ కృష్ణా! ఇంద్రుడు ఉపేంద్రుడు అనే మన యిద్దరికీ నమస్కారం చేసిన వాళ్ళు ఆరోగ్యాన్ని పొందుతారు. అని దేవేంద్రుడు దివ్యమైన నీటితో శ్రీకృష్ణునికి అభిషేకం చేశాడు. గోవులు ఆ అభిషేకాన్ని చూచి తమ పాదుగుల నుండి స్రవించే పాలతో స్నానం చేయించాయి. ఆకాశంనుండి మేఘాలు కూడా నీటిధారలతో అభిషేకం చేశాయి. పుష్పవర్షం కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. మునులు స్తోత్రం చేశారు. గాలులు సుఖంగా వీచాయి. సూర్యచంద్రులు చక్కగా ప్రకాశించారు. ఈతిబాధలు నశించాయి. రాజులు పరస్పరం విరోధం లేనివార య్యారు. చెట్లు, చిగురుటాకులు , పువ్వులు కలిగి ప్రకాశించాయి. ఏనుగులు

మదాన్ని స్రవించాయి. వనంలో మృగాలు సంతోషించాయి. భూలోకం దేవలోకంలా తృప్తి పొందింది. ఆవులచేత పట్టాభిషిక్తుడై దివ్యమైన పుష్పమాలను దివ్యవస్త్రమును ధరించిన గోవిందునితో ఇంద్రుడు ఇలా అన్నాడు.

ఓ శ్రీకృష్ణా! నేను రావటానికి మరొక కారణం కూడా ఉంది. కంసుడు 'కేశి' అనేవాళ్ళను, అరిష్టుడనేవాణ్ణీ త్వరగా సంహరించుము. నీ మేనత్తయందు నా అంశతో పుట్టినవాడు నా వంటివాడే. అతన్ని రక్షించు. స్నేహితునిగా గౌరవించు. నీ అనుగ్రహం పొంది నీ నడవడిని అనుసరిస్తూ నీకు వశుడై గొప్ప కీర్తిని పొందుతాడు. భరతవంశంలో శ్రేష్టమైన విలుకాడు నీకు తగినవాడు. నీవు లేకపోతే అతనికి ఉత్సాహం ఉండదు. భారతయుద్ధం మీ యిద్దరి మీదనే ఆధారపడి ఉంది. మీ యిద్దరి కలయిక వల్ల రాజులు మరణిస్తారు. నేను ప్రతిజ్ఞ చేసి చెప్పాను.

నా పుత్రుడైన అర్జునుడు అస్త్రవిద్యలో పరిపూర్ణుడు. రాజులందరూ అతని చేతిలో మరణిస్తారు. అతనొక్కడే ధర్మంగా యుద్ధం చేసేవాడు. అతనికి దేవతలు కూడ సాటిరారు. అతడు నీకు బంధువు, సహాయుడు. గోవిందా! నీవు అతనికి నా కొరకు సహాయంగా ఉండు. నీవతన్ని గౌరవంగా చూడు. మహాయుద్ధాల్లో నీవే అతన్ని రక్షించాలి. అతనికి చావు లేదు. ఆ అర్జునుడు నాకు పుత్రుడు. మీ తండ్రికి చెల్లెలి కుమారుడు. అతన్ని యుద్ధమందు, ఇంటియందు అన్ని పరిస్థితుల లోనూ రక్షించుము. కంసుని చంపిన పిమ్మట మహాయుద్ధం రానున్నది. అర్జునునకు గొప్ప కీర్తి వచ్చునట్లు నీవు సహాయం చేయాలి. ఇదీ మొత్తం మీద విషయం. ఇంద్రుని మాటలు విని గోవిందుడు సంతోషించి ఇలా అన్నాడు.

శచీ భర్తయైన ఇంద్రా! నీ మాటలకు సంతోషించాను. నీవు చెప్పిన దానికేమీ లోటురాదు. నీ భావం నాకు తెలుసు. అర్జునుడి పుట్టుక ఎరుగుదును. పాండురాజు కీయబడిన మేనత్త కూడ తెలుసు. యమధర్మరాజు పుత్రుడైన ధర్మరాజును, వాయుపుత్రుడైన భీముని, అశ్వినీదేవతల పుత్రులైన నకుల సహదేవులను కన్యగా ఉన్నప్పుడు సూర్యుని వలన జన్మించిన కర్ణుని కూడ ఎరుగుదును. ధృతరాష్ట్రుని పుత్రుడైన దుర్యోధనుడు తెలిసినవాడే. శాపంవల్ల పాండురాజు మరణించిన విషయమును ఎరుగుదును. కనుక ఇంద్రా దేవతలను సుఖపెట్టుటకై నీవు స్వర్గానికి వెళ్ళు. అర్జుననకు శత్రువైనవాడెవడూ నా యెదుట నిలువలేడు. అర్జునుని కొరకే

పాండవుల నందరినీ దెబ్బ తగలని వారినిగా యుద్ధం పూర్తి అయ్యాక కుంతీదేవికి వప్పచెప్పుతాను. నీ పుత్రుడైన అర్జునుడు చెప్పిన మాటను సేవకునివలె పాటిస్తాను. ఈ ప్రేమవలన, సత్య ప్రతిజ్ఞగల శ్రీకృష్ణుని సంతోషంతో పలికిన మాటలను విని ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణునకు గోవిందునిగా అభిషేకము అను ఇరవైయవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణుని రాసలీల

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఇంద్రుడు వెళ్ళాక గోవర్ధన పర్వతం ఎత్తిన శ్రీకృష్ణుడు వ్రజ నివాసుల చేత పూజింపబడుతూ గొల్లపల్లెలోనే ప్రవేశించాడు. అక్కడ ముసలివాళ్ళు జ్ఞాతులు కూడా ఉండేవాళ్ళు శ్రీకృష్ణుని మెచ్చుకొన్నారు. మేము ధన్యులము నీ వడవడిచేత నీతిచేతను అనుగ్రహింపబడ్డాము. ఆవులు వర్షభయంనుండి బయట పడ్డాయి. మేము మహాభయంనుండి బయటపడ్డాం. దీనికి గోవిందా! నీ యను గ్రహమే కారణం. నీవు దేవతలతో సమానమైన పరాక్రమం కలవాడవు.

ఓ గోవిందా! మనుష్యులకు శక్యంకాని నీ పనులను చూస్తున్నాము. కొండ నెత్తుటచేత కృష్ణా! నిన్ను దేవునిగా తెలుసుకొంటున్నాం. మహాబలశాలివైన నీవు రుద్రులలోగాని, మరుత్తులలోగాని ఎవ్వడవు? వసుదేవుడు నీకేందుకు తండ్రి అయ్యాడు? నీ బలం బాల్యక్రీడ ఈ తక్కువ గోపవంశంలో పుట్టుక దివ్యములైన పనులు మాకు సందేహం కలుగ చేస్తున్నాయి. నీవు గోపాలక వేషంతో మాలో ప్రవేశించటం తగినదికాదు. లోకాల్ని పాలించే నీవు గోవుల నెందుకు రక్షిస్తున్నావు? నీవు దేవుడవా? రాక్షసుడవా? యక్ష గంధర్వులలో ఒకడవా? మాకు బంధువై పుట్టావు ఎవడవైనా నీకు నమస్కారము. ఏదైనా పనిమీదనా లేక కావాలనేనా ఇక్కడ నివసిస్తున్నావు? మేమందరమూ నిన్ను అనుసరించేవాళ్ళం. అందరమూ నిను శరణు జొచ్చాము.

ఇలా గోపాలకులు మాట్లాడిన మాటలు విని తామరపువ్వు రేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణుడు నవ్వుతూ వచ్చిన బంధువులనందరనూ గూర్చి మీరు

గొప్ప పరాక్రమవంతునిగా నన్ను తలుస్తున్నారు. అలా నన్ను అవమానించవద్దు. మీ జాతి వాణ్ణి, బంధువును. తప్పక మీరు వినదలిచితేకొంతకాలం వేచియుండి, తరువాత నా యదార్థస్థితిని వినగలరు, చూడగలరు కూడా. నేను మీకు కొనియాడ దగినవాడను, బంధువును, దేవసమానుడనైతే తెలుసుకొని చేసేదేమున్నది? ఇలా అయితే నన్ను మీరు అనుగ్రహించినట్లే. శ్రీకృష్ణుడిలా మాట్లాడిన తరువాత గోపాలకులు మౌనంతో ఆయా దిక్కులకు వెళ్ళిపోయారు.

శ్రీకృష్ణుడు రాత్రి పూర్ణచంద్రుని చూచి రమణీయమైన శరత్కాలరాత్రి క్రీడించదలచాడు. ఆవుపేడతో నిండిన గొల్లపల్లె వీధుల్లో పరాక్రమవంతుడైన కృష్ణుడు మదించిన యెద్దుల యుద్ధాలను ఏర్పరచాడు. గోపాలకులకు కూడా బలిష్ఠులైన వాళ్ళకు యుద్ధం పెట్టాడు. తాను గోవులను పట్టుకొని ఉన్నాడు. తన వయస్సును గమనించి యువతులైన గోపకన్యలను రాత్రిపూట పిలిచి వాళ్ళతో విహరించి సంతోషించాడు. ఆ గోపికలు రాత్రిపూట సుందరమైన అతని ముఖాన్ని భూమిమీదికి దిగి వచ్చిన చంద్రబింబమునువలె చూచారు. పచ్చని వస్త్రాన్ని ధరించి శ్రీకృష్ణుడు మిక్కిలి శోభ కలవాడయ్యాడు. చిత్రవర్ణంగల వనమాలతో గోవిందుడు వ్రజానికి శోభ కలుగజేశాడు. గోపికలు దామోదరా అని పిలిచారు.

గొల్లపల్లెలోని చిత్రమైన అతని చరిత్రను చూచి ఆ యువతులు ఎత్తైన స్తనములుగల వక్షస్థలములతో అతనిని కౌగలించుకొన్నారు/చంచలనేత్రములు గల ముఖాలతో అతని దివ్యసుందర విగ్రహాన్ని చూచారు. ఆ కాన్తలు భర్తలచే, సోదరులచే తల్లులచేతనూ అడ్డగింపబడినా రాత్రియందు కృష్ణుని వెతికారు వాళ్ళు. పంక్తిగా ఉండి మనోహరుడైన కృష్ణుని రమింపచేశారు. కృష్ణుని చరిత్రను గానం చేస్తూ కృష్ణుని లీలను అనుకరిస్తూ కృష్ణునిపై చూపు నిలిపి కృష్ణునివలె నడుస్తూ ఆనందించారు. ఆ యువతులు అతనియొక్క నృత్యాన్ని గానాన్ని విలాసాన్ని చిరునవ్వును, చూపును, అనుకరిస్తూ క్రీడించారు. ఈ విధంగా మండలాకారంలో ఉన్న గోపకాంతులకు అలంకారమై శ్రీకృష్ణుడు శరత్కాల రాత్రులందు సుఖ మనుభిస్తూ ఆనందించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని రాసలీల అను ఇరవై ఒకటవ అధ్యాయము

★★★

# ఇరవై రెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు అరిష్టాసురుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఒకరోజున సాయంకాలమందు కృష్ణుడు ఆడుతుండగా గోశాలను భయ పెడుతూ మదించిన అరిష్టుడను రాక్షసుడు కనిపించాడు. అతడు మేఘములాగా రంగు కలిగి పదునైన కొమ్ములతో కూడి సూర్యునివంటి ఎర్రనికన్నులు గలవాడై కత్తివలె పదునైన కాళ్ళ చివరిభాగంతో రెండవ యముడులా ఉన్నాడు. నాలుకతో పెదవులను తాకుతూ గర్వంతో తోకనుకొట్టి కఠినమైన భుజ శిరస్సులు కలవాడు, ఎత్తైన మూపురం కలవాడు, మిక్కిలి ఎత్తైనవాడు, పేడతో మూత్రంతో పూయబడిన శరీరం కలవాడు, గోవులను మిక్కిలి భయపెట్టుచున్నవాడు, పెద్ద నడుము, లావు ముఖం, గట్టిమోకాళ్ళు, పెద్దపొట్ట, వ్రేలాడుతున్న గంగడోలు కలవాడు, యుద్ధానికి సిద్ధంగా ఉన్న కొమ్ములు గలవాడు, శత్రు వృషభములను చంపువాడు అయిన అరిష్టుడనే రాక్షసుడు వృషభరూపంలో గోశాలలో పరుగెత్తుతున్నాడు. ఆవులకు గర్భములను పోగొట్టుతూ ఆవలిస్తూ, ఆవులను కొమ్ములతో పొడుస్తూ గోశాలలో యుద్ధంలేక తృప్తి చెందనివాడై కొంతసేపటికి శ్రీకృష్ణుని ఎదుటకు వచ్చాడు. అక్కడ ఆవులను బాధిస్తూ గోశాలను ఎద్దులు లేనిదానినిగా చేశాడు. శ్రీకృష్ణుని సమీపానికి వెళ్తున్న ఆవులను భయపెట్టాడు. పిడుగులతో కూడిన మేఘంలా గర్జిస్తూ శ్రీకృష్ణునికి ఎదురువెళ్ళాడు. గోవిందునిచూచి రోషంతో యుద్ధం కోరుతూ గర్జించాడు. అతడు తనమీదకి వస్తున్నా కృష్ణుడు కదలలేదు. రాక్షసుడు కృష్ణుని మీదకి ఎగిరిపడ్డాడు. ఆబోతు మరొక ఆబోతులా ఇద్దరూ యుద్ధం చేశారు. శ్రీకృష్ణుడు అతని కొమ్ముల మధ్య పాదంపెట్టి అతని కంఠాన్ని నులిమివేశాడు. అతని కొమ్మును పెకలించి దానితోనే ముఖంమీద కొట్టాడు. బాగా కొట్టబడి ఆ రాక్షసుడు ప్రాణాలు విడిచాడు. గోవిందుడు ఎద్దురూపం ధరించిన రాక్షసుని చంపుటచూచి బాగుబాగని శ్రీకృష్ణుని మెచ్చుకొన్నారు సర్వప్రాణులు. ఉపేంద్రుడు వృషభాన్ని చంపి మనోహర మైన చంద్రుడు కల సాయంకాలం రాసక్రీడ జరిపాడు. అందరూ పద్మములవంటి కన్నులు గల కృష్ణుని స్తోత్రం చేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు అరిష్టాసురుని చంపుటఇరవై రెండవ అధ్యాయము

☆☆☆

# ఇరవై మూడవ అధ్యాయము

## కృష్ణుని తీసుకొని వచ్చుటకు అక్రూరుని ప్రయాణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

శ్రీకృష్ణుడు వ్రజంలో ఉన్నట్లు అతడు వృద్ధి పొందుతున్న అగ్నివలె ఉన్నట్లు విని కంసుడు అతనినుండి భయాన్ని శంకిస్తూ కలత చెందాడు. మధురానగర ప్రభువైన కంసుడు, పూతన చావటం, కాళీయుడు ఓడిపోవటం, దేనుక ప్రలంబులు చంపబడుట, గోవర్ధనపర్వతాన్ని ఎత్తటం, దేవేంద్రుని శాసనం వ్యర్థం కావటం, ఆవులు రక్షింపబడుట, అరిష్టుడు మరణించుట, గోపాలకులు సంతోషించటం, చిన్నతనమందే చెట్లను కూల్చటం, ఊహించరాని యీ పనులను వినితనకు అశుభం సమీపించినట్టు తలచాడు. చైతన్యం లేనివాడులాగా మరణించినవాడివలె కనపడ్డాడు. అప్పుడు తన బంధువులను పిలిచి వసుదేవుని కంకుడనేవాడిని సత్యకదారుకులను భూరిశ్రవసుడు మొదలగువాళ్ళను ఆహ్వానించి కంసుడిలా అన్నాడు.

మీరందరూ అన్ని పనులు తెలిసినవాళ్ళు. వేదాలలో పండితులు. న్యాయ పరాయణులు, ధర్మార్థకామాలను ప్రవర్తింపచేసేవాళ్ళు. ఇటువంటి మీరందరూ నాకు అనుకూలముగా ఉన్నారు. నాకు రాబోయే ఆపదను మీరెందుకు ఉపేక్షిస్తు న్నారు? కృష్ణుడనేవాడు నందగోపుని కొడుకు వ్రజంలో వృద్ధి పొందుతున్నాడు. నేను ఆలోచన లేనివాడను. గూఢచారులు లేనివాడను. నా కారణంగానే నంద గోపుని యింటిలో అతడు దాచబడ్డాడు. ఉపేక్షింపబడిన వ్యాధివలె ఆ దుర్మార్గుడు వృద్ధి పొందుతున్నాడు. దేవతలు చేయలేని పనులను బట్టి ఏ దేవత యొక్క పుత్రుడో అని ఊహిస్తున్నాను. అతడు నాతో యుద్ధం చేయాలని కోరుతున్నాడంటే నాకతడు మృత్యుదేవత. విష్ణువు రాక్షసులను చంపటానికి అనేక రూపాలను ధరించినట్లు ఇతడు గోపాలబాలక వేషంలో ఉన్నాడు. ఇతడు విష్ణువో ఇంద్రుడో నన్ను సంహ రించుటకు ఈ రూపంలో ఉన్నాడని భావిస్తున్నాను. ఈ విషయంలో నారదుడు నాకిలా చెప్పాడు.

నందుడి పుత్రుడుగా ప్రసిద్ధుడైనవాడు వసుదేవుని కుమారుడు. అతడు నాకు మృత్యుస్వరూపం. బలరాముడు కాక కృష్ణుడుకూడా వసుదేవుని రెండవ

పుత్రుడు. నీకు సహజంగా బంధువైనవాడే నీ పాలిట యముడు. వసుదేవుడు నా ప్రక్కన కూర్చుని భోజనం చేస్తూ బంధువులతో కూడ నా మొదలు నరుకుతున్నాడు. వసుదేవుడికి గౌరవింపదగిన బంధువును నేనా తన పుత్రుడా? బంధువులలో కలహం ఏర్పడితే రక్షించినవాడే చంపబడతాడు. నేను నశించటానికీ యముణ్ణి పోషించాను. ఓ వసుదేవా! నీవు శత్రువు. పాపాత్ముడవు, వయస్సుచేతనే పెద్దవాడవు గాని జ్ఞానంచేత కాదు. కంసుడు మరణిస్తే నా కుమారుడు మధురా నగరాన్ని పాలిస్తాడని అనుకొంటున్నావా? నీ ఆశ నెరవేరదు. బ్రతకదలచినవాడు యుద్ధంలో నాముందు నిలబడడు.

నిన్ను నమ్మిన నన్ను దుష్టబుద్ధివై చంపదలచావు కనుక నీవు చూస్తుండగానే నీ పుత్రులకు ప్రతీకారం చేస్తాను. నాకు కృష్ణుడికి గట్టి వైరం ఏర్పడింది. ఇద్దరిలో ఎవడో ఒకడు మరణిస్తే కాని యాదవులకు సుఖం లేదు. దానపరుడువైన అక్రూరా! నీవు వెళ్ళి బలరామకృష్ణుల్నీ నందుడు మొదలైనపన్ను చెల్లించేవాళ్ళనూ త్వరగా ఇక్కడకు తీసుకురా, నందగోపుడికి ఇలా చెప్పు. పన్ను తీసుకొని గోపాలకులతో ఇక్కడకురా వసుదేవుని పుత్రులైన కృష్ణ సంకర్షణులను కంసుడు చూడగోరుతు న్నాడు. వీళ్ళిద్దరూ యుద్ధం నేర్పరులని వింటున్నాను, మాకు ఇద్దరూ మల్లులు యుద్ధమందు ఉత్సాహం కలవాళ్ళున్నారు. వాళ్ళిద్దరితో యుద్ధం చేస్తారు. దేవతల వంటి ఆ యిద్దరు పిల్లలను చూడగోరుతున్నాను. వ్రజవాసు లందరితో రాజు ధనుర్యాగం చేస్తాడు. మీరందరు ఉద్యానవనంలో సుఖంగా ఉండవచ్చు.

ఈ యాగం చూడటానికి వచ్చే వాళ్ళందరికీ భోజనం ఏర్పాటు చేస్తున్నాం కనుక పెరుగు, పాలు, నెయ్యి మొదలైన పదార్థాలు తీసుకొనిరండి అని చెప్పు. ఓ అక్రూరా! నీవు త్వరగా వెళ్ళు ఆ యిద్దరు పిల్లలనూ ఇక్కడకు తీసుకురా, వాళ్ళిద్దరినీ చూడాలని నా మనస్సులో మిక్కిలి ఉత్సాహంగా ఉంది. వాళ్ళు వస్తే నాకు చాలా సంతోషం. వాళ్ళిద్దరినీ చూచి తగినట్లు ప్రవర్తిస్తాను. నా ఆజ్ఞ ప్రకారం ఆ యిద్దరు పిల్లలు రాకపోతే వాళ్ళకు శిక్ష విధిస్తా. పిల్లలవద్ద ప్రేమపూర్వకంగా మాట్లాడాలి. మధురములైన మాటలతో వాళ్ళను సంతోషపెడుతూ వాళ్ళనిక్కడకు తీసుకురా! ఆ పిల్లలిద్దరూ ఇక్కడకు వచ్చేటట్లు చేయాలి.

కంసుడీవిధంగా మాటిమాటికి నిందించినా గంభీరమైన హృదయంగల వసుదేవుడు ఓర్పు వహించి ఏమీ మాట్లాడలేదు. నిందింపబడుతున్న వసుదేవుని చూచి అక్కడివాళ్ళు తలలు వంచుకొని ఛీఛీ అని మెల్లగా అన్నారు. మహా

తేజశ్శాలియైన అక్రూరుడు దివ్యదృష్టితో తెలుసుకొని దప్పికలో ఉన్నవాడు నీటిని చూచినట్లు సంతోషంతో కూడినవాడయ్యాడు. ఆ క్షణంలోనే మధుర నుండి బయలుదేరి వెళ్ళాడు. పద్మముల వంటి నేత్రాలు గల శ్రీకృష్ణుని చూచుటకు ఉత్సాహపడుతూ త్వరగా వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కృష్ణుని తీసుకొని వచ్చుటకు అక్రూరుని ప్రయాణము అను ఇరవై మూడవ అధ్యాయము

☆☆☆

# ఇరవై నాల్గవ అధ్యాయము

## కంసునితో అంధకుని మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! యదురాజైన కంసుడు కలతచెంది ఉన్నాడని యాదవులు అతన్ని మృత్యుముఖంలో ఉన్నట్లు తలచారు. అంధకవంశీయుడైన ఉగ్రసేనుడు నిర్భయంగా సభలో కంసుడికి ఇలా చెప్పాడు

వత్సా! నీ మాటలు బాగాలేవు. బంధువుల విషయంలో ఇలా నిందిస్తూ మాట్లాడటం తగదు. పుత్రుని గురించి వసుదేవుణ్ణి నిందించటం వ్యర్థప్రలాపము. రాహువు స్వాతి నక్షత్రంతో కలిసి ఆకాశంలో కిరణాలను విస్తరిస్తోంది. వేకువ జామున స్వప్నం (కల) మధురరాజు లేనిదవుతుందని సూచిస్తోంది. అనేకములైన అప శకునాలు కనిపిస్తున్నాయి. నీవు కూడా ఆత్మీయుల్ని ద్వేషించి నాడవు. రాజధర్మానికి పెడముఖం పెట్టినవాడవు అయ్యావు. కారణం లేకుండా కోపించి సమీపించిన భయం కలవాడయ్యావు. దేవుడితో సమానుడైన వృద్ధుడైన వసుదేవుని అజ్ఞానం చేత నిందిస్తున్నావు. నేను నీమీది ప్రేమను విడిచిపెడుతు న్నాను. వంశానికి మేలు చేయని నిన్ను సేవించను. దానపతి అక్రూరుడు ధన్యుడు కనుక వనంలో ఉన్న పద్మములవంటి నేత్రాలుగల శ్రీకృష్ణుని చూడబోతున్నాడు. నీ మూలాన యదువంశం మొదలు తెగినదైంది. కంసా! వసుదేవుని సహాయంతో శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళు. అతనితో సంధికి ఇష్టపడు. ఇది నాకు ఇష్టమైనపని.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కంసునితో అంధకుని మాటలు అను ఇరవై నాల్గవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఐదవ అధ్యాయము

## కేశివధ వృత్తాంతము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అంధకుడి మాటలు విని కంసుడు ఎర్రబడిన కన్నులు గలవాడై ఏమీ మాట్లాడక కోపంతో తన యింటికి వెళ్ళిపోయాడు. సభలో కూర్చున్న యాదవులు ఇప్పుడు కంసుడికి మృత్యువు సమీపించింది అని పలుకుతూ తమ తమ ఇళ్ళకు వెళ్ళారు. అక్రూరుడు కృష్ణుని చూచుటకు ఉత్సాహపడుతూ మనో వేగంతో నడిచే రథం మీద వెళ్ళాడు. తండ్రితో సమానమైన బంధువుతో కలియకను చెప్పే శుభశకునాలు కృష్ణునికి కనిపించాయి. కంసుడు కృష్ణుని చంపుటకు మనుష్యులను దుఃఖపెట్టే "కేశి" అనే రాక్షసుని వద్దకు దూతను పంపాడు. అతడు దూత మాటలు విని గుర్రంరూపం ధరించి బృందావనానికి వెళ్ళాడు. అక్కడ గోవులను గోపాలకులను చంపుతూ వనాన్ని జనసంచారం లేని దానినిగా చేశాడు.

కేశి ఒకనాడు గొల్లపల్లెకు వెళ్ళాడు. అతనిని చూచి గోపాలకులు స్త్రీలు, పిల్లలు పారిపోయారు. ఏడుస్తూ జగనాథుడైన కృష్ణుని ఆశ్రయించారు. శ్రీకృష్ణుడు వాళ్ళకు అభయమిచ్చి కేశి వైపు పరుగెత్తాడు. కృష్ణుని మేలు కోరేవాళ్ళు నివారించినా శ్రీకృష్ణుడు అతనితో యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ అనేకవిధాల యుద్ధం చేశారు. చివరకు శ్రీకృష్ణుడు అతని భుజాన్ని విరిచేశాడు. ఆ రాక్షసుడు పెద్దగా అరుస్తూ నోటినుండి రక్తం కక్కుతూనే నేలకూలాడు. శ్రీకృష్ణుడు యుద్ధంలో కేశిని చంపి అక్కడనే నవ్వుతూ నిలబడ్డాడు. చచ్చిపోయిన కేశిని చూచి గోపాలకులు గోపస్త్రీలు విఘ్నముల నుండి బయటపడి సంతోషించారు.

దామోదరుని ప్రియమైనమాటలతో మెచ్చుకున్నారు. నారదమహర్షి ఆకాశ మందే కనపడకుండా ఉండి ఓ విష్ణుదేవతా ప్రభూ! కృష్ణా! సంతోషించాను అని పలికాడు. కేశిని చంపినందున నిన్ను నన్ను కేశవుడని పిలుస్తారు. నీకు శుభమగు గాక. ఇప్పుడు నేను వెళ్తున్నాను. ఇంతటితో నీపని పూర్తి కాలేదు. మహాభారత యుద్ధసముద్రం దగ్గరలో ఉంది. కంసుడు మరణించిన తరువాత కౌరవ పాండవ యుద్ధం జరుగుతుంది. సాటిలేని ఘనకార్యములు చేసిన నిన్ను పాండవు

లాశ్రయిస్తారు. ఓ ప్రభూ! నీ పనిని చూచాను. నిన్ను చూచాను. కంసుడు స్వర్గస్థుడయ్యాక మరల కలుస్తాను. మంచిది. వెళ్ళొస్తా. ఇట్లు పలికి నారదుడు ఆకాశానికి వెళ్ళాడు.

శ్రీకృష్ణుడు నారదుని మాటలు విని అట్లే అని పలికి మరల గోపాలకుల వద్దకు వచ్చాడు. గోపాలకులు కృష్ణుని తీసుకొని వ్రజంలోకి ప్రవేశించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కేశవధ వృత్తాంతము అను ఇరవై ఐదవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఆరవ అధ్యాయము

## అక్రూరుడు వ్రేపల్లెకు వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత సూర్యుడు కాంతి తగ్గి అస్తమించుచుండగా ఆకాశం సంధ్యారాగం కలిగి ఉండగా చంద్రమండలం తెల్లనికాంతిని వెదజల్లుచుండ పక్షులు గూళ్ళలో చేరాయి. హోమానికి అగ్నులు ప్రజ్వలింపచేయబడ్డాయి, పిల్లలు నిద్రపోయారు. మాంసభోజనానికి ఇష్టపడే రాక్షసులు సంతోషిస్తున్నారు. పాలు పొయ్యిమీద పెట్టే వేళైంది, కట్టెల మోపులచే వంగిన భుజాలుగల గోపాలకులు ఇళ్ళకు వచ్చారు. పక్షులు బంధువుల కలియకను చెపుతున్నాయి. ఆ సమయంలో దానపతి అక్రూరుడు రథంమీద త్వరగా వచ్చాడు. వస్తూనే కృష్ణుని సన్నిధానాన్ని, బలరాముని నందగోపునీ మాటిమాటికి అడిగాడు.

అతడు రథం నుండి దిగి మకాముకు నందగోపుని యింటిలోకి ప్రవేశించాడు. సంతోషంతో నిండిన ముఖం ఆనందబాష్పాలు కలవాడై ద్వారం దగ్గర పాలు పితుకుతూ దూడల మధ్యలో ఉన్న కృష్ణుని సంతోషంతో నిండిన వాక్కుచే తండ్రీ! కేశవ! రారా అని పిలిచాడు. శిశువుగా ఉన్నప్పుడు చూచి యౌవనం రానున్న వానిని యిప్పుడు చూచి అక్రూరుడు మెచ్చుకొన్నాడు. పద్మాల వంటి కన్నులు గల ఈతడు సింహం పెద్దపులి వంటి పరాక్రమం కలవాడు. పర్వత శ్రేష్ఠము వంటి ఆకారం కలవాడు. శత్రుసంహారం చేయుటకు సమర్థములైన భుజాలతో ప్రకాశిస్తున్నవాడు, ఇతడు గోపవేషం ధరించిన విష్ణువు కుండలాలతో

హారాలతో ప్రకాశిస్తున్నవాడు, గుండ్రని పొడవైన భుజాలు కలవాడు. వేలాది స్త్రీలు సేవించదగిన సౌందర్యం కలవాడు. పీతాంబరములు ధరించినవాడు విష్ణుమూర్తియే.

మూడులోకాలను ఆక్రమించిన పాదాలు కలవాడు. గోపాలకుడై క్షీణించిన యాదవ వంశాన్ని విస్తరింపచేస్తాడు. ఇతని తేజస్సుచే వందలు వేలకొలది యాదవులు వంశాన్ని విస్తరింపచేస్తారు. ఇతని శాసనాన్ని ప్రపంచమంతా అనుసరిస్తుంది. జగత్తు కృతయుగంలో వలె ఉంటుంది. ఇతడు జగత్తునంతనూ తన వశంలో ఉంచుకొని రాజులందరి పైన ఉంటాడు. రాజు మాత్రం కాడు. భూమండలాన్ని జయించి ఉగ్రసేనుని రాజుగా చేస్తాడు. బ్రాహ్మణులచేత ఇతడు పురాతనుడిగా గానం చేయబడుతున్నాడు.

నేనీనాడు శాస్త్రప్రకారము విష్ణుస్వరూపుడైన ఈతన్ని మనస్సుతో పూజిస్తాను. ఇతడు భూలోకంలో పుట్టటం లోకాతీతంగా తలుస్తాను. నేను రాత్రి కృష్ణునితో ఆలోచించి ఇతనితో కలిసివెళ్తాను ఈ విధంగా అనేక ఊహలు చేస్తూ కృష్ణునితో పాటు నందగోపుని ఇంటిలో ప్రవేశించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
అక్రూరుడు వ్రేపల్లెకు వచ్చుట ఇరవై ఆరవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఏడవ అధ్యాయము

## అక్రూరుని నాగలోక వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

అక్రూరుడు శ్రీకృష్ణునితో నందుని ఇంటిలో ప్రవేశించి గోపాలకులలో పెద్దలను పిలిచి బలరామునితో కలిసియున్న కృష్ణునితో సంతోషంగా ఇలా అన్నాడు.

తండ్రీ! రేపు మధురా పట్టణానికి సుఖంగా వెళ్దాం. ప్రజలు గోపాలకులు అందరూ కానుకలు తీసుకొని వెళ్తారు. సంవత్సరానికి ఇచ్చే పన్నును కూడా తీసుకువెళ్తారు. కంసుని ధనుర్యాగం సమృద్ధితో కూడినదవుతుంది. ఈ ఉత్సవాన్ని చూస్తారు బంధువులను కలుసుకొంటారు. ఎల్లప్పుడూ దుఃఖపడుతూ పుత్రుల

వధవల్ల దీనుడైన తండ్రి వసుదేవుని మీరిద్దరూ కలుసుకుంటారు. ఓ గోవిందా! పుత్రులు మరణించినట్టియు దేవతతో సమానురాలనట్టియు పుత్రవియోగంచే తపిస్తున్న దేవకీని చూడగలవు. పుత్రప్రేమతో కూడిన వృద్ధులైన తల్లితండ్రులను ఉద్ధరించి ఆనందింపచేయుము.

శ్రీకృష్ణుడు విషయమంతనూ తెలుసుకొని కోపం లేకుండా సరే అని అంగీకరించాడు. గోపాలకులందరూ అక్రూరుని మాటవిని నందుడితో సహా కంసుని శాసనాన్ని బట్టి బయల్దేరారు. వ్రజవాసులైన గోపాలకులు కానుకలు తీసుకొని ప్రయాణమయ్యారు. వారు పన్నును, ఎద్దులను, నేతిని, దున్నపోతులను, పాలను కానుకలుగా తీసుకున్నారు. తెల్లవారుతుండగా కవ్వములు ధ్వని చేయుచుండగా గోపాలకులు బండ్లమీద కానుకలను సర్ది రథాలపై ముందు వెళ్ళారు. బలరామ కృష్ణులు అక్రూరుడు ఒక రథంపై వెళ్ళారు. యమునానది ఒడ్డుకు వచ్చాక కృష్ణునితో అక్రూరుడు రథాన్ని చూస్తూండు. గుర్రాలకు గడ్డిపెట్టి ఒక క్షణం నాకోసం చూస్తూ ఉండు. నేను యమునలో దిగి వైష్ణవ మంత్రాలతో సర్పరాజైన అనంతుని స్తోత్రంచేసి పూజిస్తాను. నేను వచ్చేవరకూ మీరిద్దరూ ఇక్కడ ఎదురు చూస్తుండండి అన్నాడు

శ్రీకృష్ణుడు సంతోషిస్తూ ధర్మాత్మా! వెళ్ళిరా! నీవు లేకుండా మేము కాలక్షేపం చేయలేం కనుక త్వరగా రా. అన్నాడు. అక్రూరుడు నదిలో మునిగాడు. మునిగి నాగలోకం చూచాడు. అక్కడ అనంతుడు చుట్టచుట్టుకొని తెల్లని ఆసనంపై ప్రకాశిస్తున్నాడు. అతనికి వెయ్యి తలలున్నాయి. బంగారుతాడిచెట్టు వంటి ధ్వజము, నాగలి ధరించి రోకలి అనే ఆయుధం నల్లని వస్త్రాలు ఒకే కుండలము, తెల్లని వర్ణము కలిగి వికసించని కమలము వంటి నేత్రాలు స్వస్తిక్ గుర్తు కలిగి తెల్లని ఆసనంపై కూర్చున్నాడు. అతని వక్షస్థలంమీద బంగారు తామరపువ్వుల మాల ప్రకాశిస్తోంది. వాసుకి మొదలైన పెద్దసర్పాలు అనంతభగవానుని పూజిస్తున్నారు.

ఇద్దరు నాగులు చామరాలతో విసురుతున్నారు. వాసుకి, కర్కోటకుడు మొదలైన మంత్రిసమూహం అతనికి నలువైపులా కూర్చొని ఉన్నారు. అతనికి పద్మాలతో కప్పబడిన నీటిని బంగారుకడవలతో స్నానం చేయించారు. అతని ఒడిలో మేఘమువలె నల్లనై శ్రీవత్సముతో కూడిన వక్షస్థలం కల, పీతాంబర ధారియైన విష్ణుమూర్తిని కూర్చున్నవానిగా చూచాడు. చంద్రునితో సమానమైన

శరీరం కలిగి సంకర్షణుని వలె కూర్చునియున్న మరొకని చూచాడు. అతడు కృష్ణునితో మాట్లాడుట ప్రారంభించాడు. కృష్ణుడు తన తేజస్సుచేత అతని మాటను స్తంభింప చేశాడు. ఆశ్చర్యపడుతూ అక్రూరుడు నీటినుండి లేచాడు. రథంముందు కూర్చున్న బలరామకృష్ణులను చూచాడు. అక్రూరుడు మళ్ళీ ఉత్సాహం కొద్దీ మళ్ళీ మునిగాడు. తెల్లనిముఖంతో నల్లనివస్త్రాలు ధరించి అనంతదేవుడు కూర్చుని ఉన్నాడు. అక్కడ కూడా శ్రీకృష్ణుడున్నాడు. క్షణకాలం తర్వాత నీటినుండి లేచాడు. మంత్రజపం చేసి వెనుకటి రథం దగ్గరకు వెళ్ళాడు.

అతన్నిచూచి కృష్ణుడు మిక్కిలి సంతోషించాడు. అక్రూరుణ్ణి యమునలో నాగలోక కార్యకలాపాలు నీవెలా చూశావు? నాగలోకం చూడటంలో చాలా ఆలస్యమైంది. నీవక్కడ ఆశ్చర్యకరమైన సంఘటన ఏదో చూచినట్లు తోస్తోంది. అని అడిగాడు. అక్రూరుడు వత్సా! ఈ ప్రపంచంలో నీకంటే ఆశ్చర్యకరమైన వస్తువేముంది? ఇక్కడ కూడ ఆ దృశ్యమే చూస్తున్నా. ఇంతకంటే మిక్కిలి ఆశ్చర్యకరమైన దానిని దేనినీ చూడదలుచుటలేదు. అందుచేత కంసరాజు పట్టణానికి వెళ్దాం. సూర్యుడస్తమించకుండా చేరదాం.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి విష్ణుపర్వంలో
అక్రూరుడు నాగలోక వర్ణనము అను ఇరవై ఏడవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఎనిమిదవ అధ్యాయము

## శ్రీ కృష్ణుడు కంసుని ధనుస్సు విరుచుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

తరువాత దానపతి అక్రూరుడు రథం తోలగా రామకృష్ణులు రథంపై వెళ్ళారు. తర్వాత సంధ్యాసమయం అయింది. సూర్యుడు ఎర్రబడ్డాడు. అప్పుడు కంసుడు పరిపాలించే మధురాపురంలో ప్రవేశించారు. సూర్యతేజస్సుగల కృష్ణుని బలరామునీ తీసుకొని అక్రూరుడు తన యింట్లో ప్రవేశించాడు. అక్కడ వాళ్ళిద్దరితో మాట్లాడుతూ భయపడిన మనస్సుతో ఇప్పుడే మీరు తండ్రి యింటికి వెళ్ళవద్దు. మీ కొరకు కంసుడు వృద్ధుడైన వసుదేవుని రాత్రింబవళ్ళు బెదిరిస్తున్నాడు. ఇక్కడ ఉండవద్దంటున్నాడు. కనుక అతడు సుఖంగా ఉండేటట్లు చూడు అన్నాడు.

అప్పుడు కృష్ణుడు నీవంగీకరిస్తే మేమిద్దరం మధురాపుర రాజు మార్గాన్ని చూస్తూ కంసుడింటికే వెళ్తాం అన్నాడు. కొంచెం దూరం వెళ్ళాక ఒక చాకలి కని పించాడు. అతన్ని అందమైన వస్త్రాలిమ్మని కోరారు. చాకలి మీరు అడవిలో ఉండే వాళ్ళుగా కనిపిస్తున్నారు. మూర్ఖులవలె భయం లేకుండా కంసమహారాజు వస్త్రాలను అడగుతున్నారు. మీ రోజులు దగ్గర పడ్డాయి. అని అల్పబుద్ధియైన రజకుడు అన్నాడు. వాళ్ళిద్దరికీ కోపం వచ్చింది. కృష్ణుడు అరిచేతితో అతని తలమీద చరిచాడు. దానితో చాకలివాడు మరణించాడు. చచ్చిపోయినవానిని చూచి అతని భార్యలు దుఃఖిస్తూ జుట్టు విరబోసుకొని కంసుని ఇంటికి వెళ్ళారు.

రామకృష్ణులు మంచి వస్త్రాలను స్వీకరించారు. తరువాత పూలదండలమ్మే గుణకుడనేవాడు కనపడ్డాడు. వాడు పూలదండలమ్మే పెద్దవ్యాపారి. ఐశ్వర్య వంతుడు. అతన్ని కృష్ణుడు మధురంగా పూలదండలు అడిగాడు. వాళ్ళిద్దరికీ కావలసినన్ని పూలదండలిచ్చాడు. సంతోషంతో ఇది మీ సొమ్మేనండి అన్నాడు. అందుకు సంతోషించిన కృష్ణుడు గుణకుడికి వరమిచ్చాడు. మహాలక్ష్మి ఎప్పుడు నిన్ని విడువకుండా ఉంటుంది అని. ఆవ్యాపారి వరాన్ని పొంది కృష్ణుడికి నమ స్కారం చేశాడు. వీళ్ళు యక్షులై ఉంటారనుకొన్నాడు పువ్వులమ్మేవాడు.

ఇలా అమూల్యవస్త్రాలు, పూలదండలు ధరించి వసుదేవ పుత్రులు రాజ మార్గాన వెళ్తూ మైపూత పాత్రను చేత పట్టుకున్న ఒక గూని దానిని చూచారు. అందమైన కన్నులు కలదానా! ఈ మంచి గంధాన్ని ఎవరికి తీసుకువెళ్తున్నావు అని కృష్ణుడామెను అడిగాడు. ఆమె చిరునవ్వుతో అతనికెదురుగా నిలిచి నేను రాజుగారి స్నానగృహానికి వెళ్తున్నా, ఈ మంచి గంధాన్ని తీసుకో. నీకు శుభముగుగాక నాకు నువ్వు మిక్కిలి ప్రియుడవు నీవు ఎక్కడనుండి వస్తున్నావు? నేను మహారాజుకు గంధం తయారు చేసి యిచ్చేదాన్ని అని నవ్వుతూ నిలుచున్న కుబ్జను మా శరీరాలకు సరిపడిన గంధమును ఇమ్ము. మేము మరొక దేశంనుండి వచ్చాము. మేము ద్వంద్వయుద్ధం చేసే మల్లులము. ఈ రాష్ట్రంలో జరుగుచున్న ధనుర్యాగ మహోత్సవాన్ని చూడటానికి వచ్చాము అని కృష్ణుడు చెప్పాడు.

అప్పుడు కుబ్జ కృష్ణునితో నీవు నాకు చూడటానికి చాలా బాగున్నావు ప్రియ మైనవాడవు, రాజులకు తగినటువంటి యీ మైపూతను జంకకుండ తీసుకో అన్నది. వాళ్ళిద్దరూ ఆగంధము పూసుకొని సుందరమైన శరీరములతో ప్రకా శించారు. శ్రీకృష్ణుడు తన వ్రేళ్ళ చివరతో కుబ్జ యొక్క వీపును అదిమాడు.

ఆమె గూను మాయమైంది. పొడవైన శరీరంతో నవ్వుతూ ఎత్తైన స్తనప్రదేశము, తిన్నని శరీరము కలదై పెద్దగా నవ్వింది. మరియు ప్రేమతో నేను అడ్డగిస్తున్నాను ప్రియా! ఎక్కడకు వెళ్తావు? నిలుచో నన్ను స్వీకరించు అన్నది. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు చూస్తూ నవ్వుకున్నారు. తరువాత కామంతో బాధ పడుతున్న ఆమెను నవ్వుతూ విడిచిపెట్టాడు.

తరువాత వాళ్ళిద్దరూ రాజసభలో ప్రవేశించారు. రాజభవనంలోనికి వెళ్ళి ధనుస్సును చూడాలని అనుకోకుండా ధనుశ్శాలకు వెళ్ళారు. అక్కడ ఆయుధ శాలను రక్షించేవానినిధనుర్యాగం చేసే ఆ ధనుస్సును చూపించమని అడిగారు. అతడు స్తంభంవలె ఉన్న ధనుస్సును చూపించ్చాడు. దేవేంద్రుడితో సహా దేవత లెవ్వరూ ఎక్కుపెట్ట శక్యం కానిది. పరాక్రమవంతుడైన కృష్ణుడు దానిని వంచి ఎక్కుపెట్టాడు. ఎక్కుపెట్టేటప్పుడే ఆ ధనుస్సు రెండుగా విరిగిపోయింది. ఆ ధనుస్సును విరిచి శ్రీకృష్ణుడు సంకర్షణుడూ త్వరగా వెళ్ళిపోయారు.

ఆ ధనుర్భంగం వలన అంతఃపురం కంపించిపోయింది. ధ్వని దిక్కులను నింపివేసింది. ఆయుధశాల నుండి బయటకు వచ్చి వారిద్దరూ గోశాలవద్దకు వచ్చారు. ఆయుధశాల రక్షకుడు భయపడుతూ రాజు వద్దకు వెళ్ళి రాజా! ఎవరో ఇద్దరూ మనుష్యులు నల్ల పచ్చని వస్త్రాలు ధరించి ధనుశ్శాలలో ప్రవేశించారు. వారిలో ఒకడు, పద్మాలవంటి కళ్ళు గలవాడు, నల్లనివాడు, పచ్చనివస్త్రం ధరించిన వాడు, దేవతలు కూడ పట్టుకోలేని ఆ ధనుస్సును ఎక్కుపెట్టి వేగంగా శ్రమ లేకుండా వంచాడు. లాగుతుండగానే రెండుగా విరిగిపోయి పెద్దధ్వని యేర్పడింది. ఆ అద్భుతం చూచి ఆశ్చర్యపోయాను.

ఈ విషయాన్ని చెప్పేందకు ఇక్కడకు వచ్చాను. మహారాజా! వాళ్ళిద్దరూ ఎవరో నాకు తెలియదు. ఒకడు కైలాసపర్వతంలాగా తెల్లగా ఉన్నాడు. రెండవవాడు కాటుక పర్వతంలా ఉన్నాడు. ఆ ధనుస్సును విరిచి తోటివానితో త్వరగా వెళ్ళి పోయాడు. అతడెవరో తెలియదు. ధనుర్భంగం విని ఆయుధరక్షకుని పంపి ఇంట్లోకి ప్రవేశించాడు కంసుడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీ కృష్ణుడు కంసుని ధనుస్సు విరుచుట ఇరవై ఎనిమిదవ అధ్యాయము

★★★

# ఇరవై తొమ్మిదవ అధ్యాయము

## కంసుని మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కంసుడు ధనుర్భంగాన్ని గూర్చి విని చాలా ఆలోచిస్తూ దుఃఖ పడ్డాడు. కలత చెందిన మనస్సు కలవాడైనాడు. బాలుడు భయంలేకుండా మహా బలశాలినైన నన్ను తిరస్కరించి రక్షక పురుషులు చూస్తుండగా ధనుస్సును విరిచి ఎలా వెళ్ళాడు? ఇతని కొరకు లోకం నిందించే భయంకరమైన పని చేశాను. సోదరి పుత్రులను ఆరుగుర్ని చంపివేశాను. పురుష ప్రయత్నంచేత దైవాన్ని దాట లేము. నారదుడు చెప్పిన మాట నాకిప్పుడు తటస్థించింది. ఇలా విచారించి, తన యింటినుండి బయల్దేరి యజ్ఞశాల యొక్క సభాభవనంలో ఆసనాలను చూచుటకు వెళ్ళాడు.

అక్కడ అంతటా సింహాసనాలు ఉంచబడ్డాయి. నాలుగువైపులా అరుగులు న్నాయి. దృఢమైన సింహాసనం తనకోసం నిర్మింపబడింది. అలంకరింపబడిన రంగస్థలాన్ని చూచి పనివాళ్ళకు యుద్ధధర్మం తెలిసినవాళ్ళను, యుద్ధ నిపుణు లను ఇంకా ఇతరులను ఆహ్వానించండి. ద్వంద్వయుద్ధం చేసే మల్లులకు ప్రేక్షకు లకు త్వరగా వచ్చి ఆసనాలను రంగస్థలాన్నీ అలంకరించండని సాటింపు వేయిం చండి అని ఆజ్ఞ యిచ్చి తన యింటికి వెళ్ళాడు. తరువాత మహాబలవంతులు ద్వంద్వయుద్ధంలో ప్రపంచ ఖ్యాతి పొందిన చాణూరముష్టికులను పిలిపించాడు. ఆ యిద్దరు మల్లులూ సంతోషంతో అతని వద్దకు వచ్చారు. అప్పుడు కంసుడు ఓ వీరులారా! మీరు నామల్లులుగా చెప్పబడుతున్నారు.

కాబట్టి నేను మీకు తగిన సమ్మానం చేస్తున్నాను. మీరు నేను చేసిన సత్కారా లను తలుచుకొని నాకు గొప్ప పని చేసి పెట్టండి. వ్రజంలో పుట్టి పెరిగిన గోపాలకులు కృష్ణ సంకర్షణులు పిల్లలైనా అసాధ్యులు. రంగస్థలం మీద యుద్ధం చేసే వారిద్దరినీ పడవేసి చంపండి. ఏమీ సందేహించవద్దు. వీళ్ళు పిల్లలని తేలికగా చూడవద్దు. ప్రయత్నం చేసి తీరాలి. యుద్ధంలో వాళ్ళిద్దరినీ రంగస్థలం మీద ఓడిస్తే ఇప్పుడు ముందు కూడ నాకు మంచి జరుగుతుంది అన్నాడు. ఆ మల్లులు రాజు ప్రేమతో మాట్లాడిన మాటలకు సంతోషించి ఆ గోపాలకులు మా ముందు నిలబడితే మరణించినట్లే తలచవచ్చు అని అన్నాడు.

ఈ విధంగా విషపు మాటలు మాట్లాడి రాజు అనుమతితో ఇండ్లకు వెళ్ళారు. తరువాత మావటివాడితో కంసుడు కువలయా పీడమనే ఏనుగు సభాభవనంలో తిరిగే వసుదేవ పుత్రులనిద్దరినీ చంపునట్లు వాళ్ళ మీదకి తోలుము. వాళ్ళిద్దరూ రంగస్థలం మీద పడిపోతే చూడాలని ఉంది. అలా జరిగితే వసుదేవుడు బంధువులు నిరాశులై నశిస్తారు. వీళ్ళనిద్దరినీ ఏనుగులతోగాని, మల్లులతోగాని చంపి పట్టణంలో యాదవులు లేకుండా చేసి నేను సుఖంగా సంచరిస్తాను. కృష్ణుని సమర్థించే యాదవులను నా తండ్రిని నేను విడిచిపెట్టాను. నేను ఉగ్రసేనుడికి పుట్టలేదు. అల్ప పరాక్రమం గల మనుష్యునకు పుట్టానని నారదుడు చెప్పాడు. అని పలికాడు!

అప్పుడు మావటివాడు రాజా! నీ తల్లి యిటువంటి పని ఎలా చేసింది? సామాన్య స్త్రీ కూడా ఎవతెయూ అసహ్యమైన ఇటువంటి పని చేయదు. ఈ విషయం విస్తరంగా చెప్పు నాకు వినాలని ఉత్సాహంగా ఉంది. అప్పుడు కంసుడు నారద మహర్షి చెప్పినట్లు నీకు చెపుతా. నారదుడు ఇంద్రుని యింటి నుండి వచ్చాడు. అతనికి శాస్త్రప్రకారం పూజ చేసి సుఖంగా కూర్చున్న తరువాత మహర్షి నన్ను క్షేమమడిగి ఒక్క మాట చెపుతా విని స్వీకరించు. ఒకమారు దేవతలకు నివాసమైన మేరుపర్వతానికి వెళ్ళాను. అక్కడ దేవతలు సహచరులతో కూడిన నీ మరణాన్ని ఆలోచిస్తున్నారు. దేవకి ఎనిమిదవ శిశువు ఓ కంసా నీకు మృత్యుదేవత అని విన్నాను. ఇది మిక్కిలి రహస్యము. దేవకి శిశువులను నశింపచెయ్యి. శత్రువును తేలికగా చూడకూడదు. ఉగ్రసేనుడు నీకు తండ్రి కాదు. సౌభదేశానికి రాజైన "ద్రుమిలుడు అని చెప్పాడు. అదెట్లా అని అడగగా నారదుడిలా చెప్పాడు.

ఒకప్పుడు నీ తల్లి వెలుపల ఉండి. సుయాముునమనే పర్వతాన్ని చూడటానికి ఉత్సాహం కలిగి తక్కిన స్త్రీలతో వెళ్ళింది. అక్కడ అందమైన కొండ చరియలమీద శిఖరాలపైన గుహలలో నదులందూ కిన్నరుల పాటలను వింటూ కామవికారం కలదైంది. ఇంతలో సువాసనతో కూడిన వాయువు మన్మథోద్రేకం కలిగిస్తూ వీచింది. భూమి ఆర్ద్ర పురుగులతో అలంకరింపబడి యువతిలా ప్రకాశించింది. అప్పుడు సౌభదేశపు రాజు ద్రుమిలుడనే రాక్షసుడు దైవికం అక్కడకు వచ్చాడు. అతడు తన రథాన్ని పర్వతం మీది ఉద్యానవనంలో ఉంచి సారథితో పర్వత శిఖరానికి వచ్చాడు.

అక్కడ అందమైన అనేక దృశ్యాలను చూస్తూ దూరం నుండి చెలికత్తెలతో ఆడుతూ పువ్వులు కోస్తూ తిరుగుతున్న దేవతా రూపం గల ఆమెను చూచి

కామానికి వశుడై సారథిని అక్కడ ఉండమని రాక్షసుడు క్షణకాలం ధ్యానం చేసి ఉగ్రసేనుని భార్యయని తెలుసుకొని ఉగ్రసేనుని రూపంలో నవ్వుతూ ఆమెను చేరాడు. మీ తల్లి కూడ భర్తను చేరి సంతోషించింది. ఇద్దరూ కౌగలించుకున్నారు. కొంచంసేపటి తరువాత ఆమె సందేహించి వెంటనే నిలిచి భయంతో నీవు నాభర్తవు కావు. నీవు ఎవడవో చెప్పు. నీవు నీచుడవు, పాపాత్ముడవు. నాపతివ్రతా ధర్మాన్ని నాశం చేశావు. నావల్ల కులానికి మచ్చ ఏర్పడింది. నాబంధువుల నన్నిప్పుడేమంటారు? నా భర్తవైపు వాళ్ళు నన్ను విడిచి పెడతారు. నేను నిందింపబడే జీవితాన్ని గడపవలసి వస్తుంది. అని అనేకవిధాల అతన్ని తిట్టింది.

అప్పుడా రాక్షసుడు కోపంతో నేను సౌభరాజును నాపేరు ద్రుమిలుడు. నీవు మరణధర్మం గల పతిని ఆశ్రయించి నన్ను తరస్కరిస్తావేమి? స్త్రీలు వ్యభిచారం చేత దూషింపబడరు. కుంతి మొదలైనవాళ్ళు వ్యభిచారం ద్వారా దేవతలకు సమానమైన పరాక్రమం సౌందర్యం గల పుత్రులను పొందారు. అట్లే నీకు శత్రునాశం చేయగల కంసుడు పుడతాడు. అన్నాడు! ఆమె మరల రోషంతో అతన్ని నిందిస్తూ తప్పు చేసికూడా ధైర్యంగా మాట్లాతున్న ఆరాక్షసునితో ఓరీ నీవు స్త్రీలనందరినీ నిందిస్తున్నావు. లోకంలో స్త్రీలు నీచప్రవర్తన కలవాళ్ళు. పతివ్రతలూ కూడా ఉన్నారు. పతివ్రతలైన అరుంధతి మొదలగువారు లోకాలను ప్రజలను కాపాడుతు న్నారు. ఓరి నీచుడా! నీవరంచేత నాకు జన్మించే చెడుప్రవర్తన గల పుత్రుడు నీ పాలిటి మృత్యుదేవత అవుతాడు. అన్నది!

ద్రుమిలుడు ఇలా పలుకబడి ఆకాశానికి వెళ్ళిపోయాడు. నీ తల్లి ఆరోజునే పట్టణానికి వెళ్ళింది. నాకిలా చెప్పి నారదుడు వీణవాయిస్తూ పాడుతూ బ్రహ్మ వద్దకు వెళ్ళాడు. నారదుడు చెప్పినది సత్యం నేను ఉగ్రసేనుడికి క్షేత్రజ సంతానము. తల్లిదండ్రులు విడిచిపెట్టగా నాపరాక్రమంచేత నిలిచియున్నాను. బంధువులు నన్ను ద్వేషిస్తున్నారు. కృష్ణుని సమర్ధించే యాదవుల నందరీ చంపివేస్తా. మొదట నీవు ఏనుగు ద్వారా కృష్ణ బలరాముల్ని చంపు. నీవు అంకుశం తీసుకొని ఏనుగు మీద ఎక్కి రా. సభాద్వారం దగ్గర నిలిచిఉండు. ఆలస్యం చేయవద్దు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశముందలి విష్ణుపర్వంలో
కంసుని మాటలు అను ఇరవై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పైయవ అధ్యాయము
## కువలయా పీడ వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! రెండవరోజున ఉదయం యుద్ధం చూడటానికి నగరజనంతో రంగశాల అంతా నిండిపోయింది. సభలో చిత్రపటాలు అలంకరింపబడ్డాయి. జండాలు చిత్రవిచిత్రములైనవి కట్టబడ్డాయి. సభాభవనంలో అనేక విధాలైన వ్యక్తులకు వేర్వేరు రూపాలు గల ఆసనాలు అమర్చబడ్డాయి. సభాభవనంపైన అంతఃపుర స్త్రీలకు కూర్చునేందుకు ఏర్పాట్లు చేయబడ్డాయి. అందరూ సభలో కూర్చుని ఉండగా రాజు కవలయాపీడమనే ఏనుగును ద్వారమందు ఉంచమని ఆజ్ఞాపించి రంగశాలలోకి వెళ్ళాడు. తెల్లని వస్త్రాలు ధరించి తెల్లని చామరములతో వీచబడుచూ తెల్లని కిరీటం ధరించి తెల్లమబ్బు మీద చంద్రుడులా కంసుడు ప్రవేశించాడు. పౌరులు జయజయ ధ్వనులతో ఆశీస్సులు పలికారు.

తరువాత మల్లులు వస్త్రములను బిగించి రంగస్థలం మీదికి వచ్చారు. తరువాత వసుదేవుని పుత్రులు సంతోషంతో రంగశాల ద్వారం దగ్గరకు వచ్చారు. బలరామకృష్ణులు సుందరవస్త్రాలు ధరించి చందనం పూసుకొని పుష్పమాలలు కంఠమందు వ్రేలాడగా చూడముచ్చటగా ఉన్నారు. వాళ్ళిద్దరూ మదపుటేనుగుచే అడ్డగింపబడ్డారు. ఆ మదపుటేనుగున్ని గుండ్రంగా చేసి కృష్ణబలరాములను చంపటానికి ప్రయత్నించింది. అప్పుడు కృష్ణుడు నవ్వుతూ దుర్మార్గుడైన కంసుని అభిప్రాయాన్ని నిందించాడు. ఈ ఏనుగుతో నన్ను బెదిరించుటకు కోరుతున్న కంసుడు యమధర్మరాజు వద్దకు వెళ్ళటానికి త్వరపడుతున్నాడు అని పలికాడు.

ఆ ఏనుగు గర్జిస్తూ దగ్గరకు రాగానే జబ్బ చరిచి ఎగిరి దాని తొండం పట్టుకొని, దంతాలనుండి తప్పుకొని పాదాలలో దూరి ఏనుగును ఇబ్బంది పెట్టాడు. ఆ ఏనుగు కృష్ణుని చంపలేక తన అవయవాలు అలసిపోగా పెద్దపెట్టున అరిచింది. అది నేలపై కూర్చుండి దంతాలతో బాధించింది. కృష్ణుడు కొంతసేపు దానితో ఆడుకొని, దానిముఖంమీద కాలుపెట్టి రెండుచేతులతో దంతాన్ని పెకలించి దాని తోనే కొట్టాడు. వజ్రాయుధంలాంటి దంతంతో దెబ్బతిని మలమూత్రాలను విడిచి ఘీంకారం చేసింది. దాని చెక్కిళ్ళనుండి రక్తం స్రవించి మరణించింది. బలరాముడు దాని తోక పట్టుకొని లాగాడు.

శ్రీకృష్ణుడు ఏనుగును చంపిన దంతంతోనే మావటివాడిని కూడా ఒక దెబ్బతో చంపాడు. తరువాత వాళ్ళిద్దరూ ఏనుగును రక్షించేవాళ్ళను కూడా చంపివేశారు. వాళ్ళను చంపిన తరువాత రంగస్థల మధ్యకు చేరారు. వృష్ణి అంధక భోజ వంశీయులు పుష్పమాలలు ధరించిన రామకృష్ణులను చూస్తున్నారు. వాళ్ళిద్దరూ సభ్యనినాదాలతో, జబ్బ చరుచుటచే ఏర్పడిన ధ్వనితోనూ సభలోని జనాన్ని సంతోషపెట్టారు. వాళ్ళిద్దరిని చూచి కంసుడు దుఃఖపడ్డాడు. శ్రీకృష్ణుడు గర్జిస్తున్న ఏనుగును చంపి సముద్రంవలె ఉన్న సభాభవనం కలయచూచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కువలయాపీడవధ యనే ముప్పైయవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు కంసుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు బలరామునితో సభాభవనంలో ప్రవేశించినప్పుడు గాలికి అతని వస్త్రం కదులుతున్నది. అతనికి ముందు పద్మాలవంటి కన్నులు గల బలరాముడున్నాడు. ఏనుగుదంతం కలవాడు, యుద్ధసమ్మర్దంచేత రక్తంతో తడిసిన వాడు, జబ్బచరుపుతో భూమిని కంపింపచేస్తున్నవాడు అయిన కృష్ణుని ఏనుగు దంతమే ఆయుధంగా కలవానిగా చూచి కంసుడు ఆయాసపడ్డాడు. శ్రీకృష్ణుడు రంగస్థలంమీద అటూఇటూ కదులుతూ ఉంటే సభలో జనులు పెద్దగా ధ్వనిచేశారు. అప్పుడు కంసుడు కోపంతో ఎఱ్ఱబడిన కన్నులు గలవాడై చాణూరుని కృష్ణునితో, ముష్టికుడు బలరామునితో యుద్ధం చేయటానికి ఆజ్ఞాపించాడు. చాణూరుడు కోపంతో నీటితో నిండిన మేఘంలాగా యుద్ధానికి వచ్చాడు. సభ అంతా నిశ్శబ్దంగా ఉండగా యాదవులందరూ కలిసి ఇలా అన్నారు.

ఈ సభలో అందరి యెదుట ఏ శాస్త్రమునూ పాటించక కేవలం నేర్పు బలంతో బాహుయుద్ధం జరిగేటట్లు ఏర్పాటు జరిగింది. మధ్యలో మల్లులకు దప్పిక తీర్చుటకు నీరు సిద్ధంగా ఉంచబడింది. పిల్లలు, వృద్ధులు, బలహీనులు, బలవంతులు అందరూ చూచుటకు తగిన అవకాశం కల్పించబడింది. ఈ

యుద్ధంలో బలానికీ నేర్పుకీ మాత్రమే ప్రాధాన్యం. క్రింద పడినవాడు మళ్ళీలేచి యుద్ధం చేయకూడదు. ప్రస్తుతం కృష్ణుడికీ ఆంధ్రమల్లుడికీ జరిగే యుద్ధంలో నియమం ఇది. కృష్ణుడు బాలుడు, ఆంధ్రుడు పెద్దవాడు. ఈ విషయం విచారింపదగినది.

అప్పుడు సభలో పెద్ద కోలాహలం ఏర్పడింది. అప్పుడు కృష్ణుడు నేను బాలుణ్ణి. ఆంధ్రుడు పర్వతంలా ఉన్నాడు. అయినా ఈతనితో యుద్ధానికి ఇష్టపడు తున్నాను. నేను కొంచెం కూడా మల్లయుద్ధ నియమాన్ని తప్పి నడవను. మల్ల యుద్ధంలో శత్రుభావం ఉండకూడదు. ఒకవేళ చాణూరుడు శత్రుభావంతో యుద్ధం చేస్తే అతణ్ణి శిక్షిస్తాను. నా యుద్ధం చూచి ప్రపంచమంతా సంతోషిస్తుంది. చాణూరుడు కరూషదేశంలో పుట్టినవాడు. ఇతడు క్రిందపడిన మల్లుని శస్త్రంతో చంపాడు. అని ఈవిధంగా మాట్లాడుతుండగానే వాళ్ళిద్దరికీ భయంకరమైన యుద్ధం ప్రారంభమయింది.

రెండేనుగులు యుద్ధం చేసినట్లుంది. వాళ్ళయుద్ధం. చిత్రవిచిత్రములైన అనేక పద్ధతులతో వాళ్ళిద్దరూ యుద్ధం చేశారు. సభలో జనులు కేకలు వేస్తూ ఉత్సాహంతో యద్ధంచూచి ఆనందించారు. అప్పుడు కంసుడు ముఖం చెమట పట్టి కృష్ణుని చూస్తూ ఎడమచేతితో వాద్యాలను ఆపుచేశాడు. కాని ఆకాశంలో దేవతలు అనేక వాద్యాలు మ్రోగించారు. శ్రీకృష్ణుడు యుద్ధం చేస్తుండగా అంతటా వాద్యధ్వనులు వినిపించాయి. కృష్ణునికి జయం కోరుతూ దేవతలు విమానాలలో వచ్చి ఆకాశంలో నిలిచారు.

శ్రీకృష్ణుడు చాణూరునితో చాలాసేపు యుద్ధం చేసి కంసుని చంపుటకు బలం వృద్ధి చేసుకున్నాడు. అప్పుడు భూమి కంపించింది. ఆసనాలు కదిలాయి. కంసుని కిరీటంనుండి మణి జారిపడింది. కృష్ణుడు రెండుచేతులతో చాణూరుని వంచి పిడికిలితో తలమీద కొట్టాడు. మోకాలితో వక్షస్థలం కుమ్మాడు. కళ్ళనుండి రక్తం, కన్నీరు కారినాయి. అతడు గుడ్లను మిటకీకరించి రంగస్థలం మధ్య పడి పోయాడు. చాణూరుడు మరణించగా అతని శరీరం రంగస్థలాన్నంతనూ వ్యాపించింది.

తరువాత బలరాముడు ముష్టికునితో, కృష్ణుడు తోశలకునితో తలపడ్డారు. కృష్ణుడుతో శలికుని ఎత్తి నూరువిధాల త్రిప్పి నేలపై పిండిచేశాడు. సంకర్షణుడు

చాలాసేపు యుద్ధం చేసి పిడికిలితో నెత్తిమీద కొట్టాడు. అతడు తల విరిగిపడి నేలకూలాడు. అప్పుడు పెద్దధ్వని ఏర్పడింది. కృష్ణుడు సంకర్షణుడు, ఆంధ్ర, తోశలికులను చంపి క్రోధంతో ఎర్రబడిన కళ్ళు కలవాడై రంగస్థల మధ్యభాగంలో తిరిగారు. ప్రేక్షకులుగా ఉన్న నందగోపుడు మొదలగు గోపాలకులు భయంతో కంపించిన శరీరాలు కలవారై అక్కడ నిలిచియున్నారు. పుత్రులు పోయి బాధ పడుతున్న దేవకి ఆనందబాష్పాలు విడుస్తూ శ్రీకృష్ణుని చూచింది. వసుదేవుడు ముసలితనాన్ని విడిచి పుత్రప్రేమతో యువకుడయ్యాడు. వేశ్యలు శ్రీకృష్ణుని ముఖపద్మాన్ని నేత్రాలనే తుమ్మెదలతో త్రాగారు.

శ్రీకృష్ణుని విజయాన్ని చూచిన కంసుడికి ముఖం చెమట పట్టింది. కంసుడు కోపించినవాడై ఈ గోపాలకులిద్దరినీ బయటకు పంపివేయండి అని పాపాత్ములైన వీళ్ళను నేను చూడదలచటం లేదనీ గోపాలకులలో ఎవ్వడు నారాజ్యంలో ఉండటాని కర్హుడు కాడని పలికాడు. నందగోపుడు పాపాత్ముడు. అతన్ని ఇనుపసంకెళ్ళతో కట్టివేయండి. వసుదేవునికూడా శిక్షించండి. తక్కిన సాధారణ గోపాలకుల ఆవుల్ని, డబ్బునూ అపహరించండి.

కృష్ణుడు ఇలా ఆజ్ఞాపిస్తూ కఠినంగా మాట్లాడుతున్న కంసుని చూచాడు. తండ్రిని, నందగోపుని నిందించినందుకు బంధువులు బాధపడుట, దేవకి స్పృహ తప్పి పడిపోవుట చూచి కోపించినవాడై కృష్ణుడు సింహంవలె వేగంతో కంసుని నశింప చేయుటకు రంగమధ్యమునుండి కంసునివద్దకు ఎగిరిదూకాడు. పుర జనులు కృష్ణుని రంగమధ్య నుండి దూకుతున్నట్లు చూడలేదు. కంసుని ప్రక్కన ఉన్నట్లు మాత్రమే చూచారు.ఆ కంసుడు భగవంతుడైన గోవిందుడు ఆకాశం నుండి అక్కడకు వచ్చినట్లు తలచాడు. శ్రీకృష్ణుడు తనచేతిని పొడుగుచేసి రంగసభలో కంసుని జుట్టు పట్టుకున్నాడు. వజ్రాలతో అలంకరించబడిన అతని బంగారుకిరీటం క్రిందపడింది. కంసుడప్పుడు ఏమి చేయలేని స్థితిలో పడ్డాడు.

ఈ విధంగా శిక్షింపబడి నిట్టూర్పు విడుస్తూ కంసుడు కృష్ణుని ముఖం చూడ లేకపోయాడు. ఆసనంనుండి అతన్ని క్రిందికి లాగాడు కృష్ణుడు. సభలో అతణ్ణి లాగి కృష్ణుడు చనిపోయినవానిని విడిచిపెట్టాడు. మర్దింపబడిన అతని శరీరం నేలపై శయనించింది. దుమ్ము కొట్టుకొని కిరీటంలేని అతని నల్లనిముఖం

రేకులు రాలి పోయిన పద్మంలాగా శోభలేనిదైనది. పద్మములవంటి కన్నులు గల శ్రీకృష్ణుడు అతన్ని చంపి సంతోషంతో రెట్టించిన శోభకలవాడై వసుదేవుని పాదాలకు నమ స్కరించాడు. తల్లి పాదాలకు కూడా నమస్కారం చేశాడు. ఆమె ఆనందబాష్పాలతో అతన్ని తడిపింది. తేజస్సుతో ప్రకాశిస్తూ కృష్ణుడు, యాదవు లను అందరినీ క్షేమమడిగాడు. బలరాముడు కూడా కంసుని సోదరుని చేతులతోనే పొడిచి చంపాడు. కృష్ణ బలరాములిద్దరూ శత్రువులను జయించి కోపాన్ని జయించి చాలాకాలం వేరొకచోట ఉండి వ్రజంలో తన తండ్రి యింటికి సంతోషిస్తూ వెళ్ళారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు కంసుని చంపుట అను ముప్పై ఒకటవ అధ్యాయము

☆☆☆

# ముప్పై రెండవ అధ్యాయము

## కంసుని స్త్రీల దుఃఖము

వైశంపాయనుడిలా చెప్పాడు.

కంసుని భార్యలు చనిపోయి క్రిందపడిఉన్న భర్తను చూచి చుట్టుముట్టారు. ఓ మహాబాహూ అయ్యో మేము మరణించాం. వీరపత్నులమైన మేము నీ అంత్య దశను చూచి దుఃఖిస్తున్నాము. నీచే విడువబడి మొదలు తెగినవాళ్ళమయ్యాం. నీ ముఖాన్ని సూర్యుడు తపింపచేస్తున్నాడు. కుండలాలు లేని నీ చెవులు ప్రకాశించుట లేదు. వైధవ్యంతో దుఃఖిస్తూ తపించిన మనస్సు గలవాళ్ళమయ్యాం. నీతో క్రీడించాం. క్షణంలో నీతో వియోగం పొందాం. మనుష్యులగతి అనిత్యమైనది. జరాసంధుని సైన్యాన్ని చంపి యుద్ధమందు యక్షులను జయించి మనుష్యమాత్రుని చేతిలో ఎలా మరణించావు? అని ఈ విధంగా భార్యలు, తల్లి కూడా కుమారుని మరణానికి మిక్కిలి దుఃఖించారు. అప్పుడే సూర్యుడు సంధ్యారాగంతో కూడి అస్తమించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కంసుని స్త్రీల దుఃఖము అను ముప్పై రెండవ అధ్యాయము

☆☆☆

# ముప్పై మూడవ అధ్యాయము

## ఉగ్రసేనునకు పట్టాభిషేకము

వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

మహారాజా! ఉగ్రసేనుడు పుత్రదుఃఖంతో తపిస్తూ విషం త్రాగినవాడివలె నిట్టూర్పు విడుస్తూ కృష్ణుడి దగ్గరకు వచ్చాడు. అతడు ఇంటిలో యాదవులతో చుట్టబడిన శ్రీకృష్ణుని చూచాడు. మరియు పశ్చాత్తాపంతో మాటిమాటికీ కంసుని మరణసంబంధమైన విషయం మాట్లాడుతున్నాడు. కంసుని భార్యలయొక్క జాలిగొలిపే ఏడ్పులను విని యాదవసమూహంలో తను చేసిన పనిని నిందించు కుంటున్నాడు. అయన ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు.

నేను కంసుణ్ణి చంపటం చిన్నపిల్లవాడిపని. కోపానికి లోనై వేలకొలది స్త్రీలను భర్తలేని వాళ్ళనుగా చేశాను. ఈ స్త్రీల దుఃఖాన్ని చూస్తే ఎంత నీచుని మనస్సైనా జాలిపడుతుంది. పాపాత్ముడైన కంసుడు సజ్జనులకు భయం కలిగించాడు. కాబట్టి మొదటినుండి ఇతణ్ణి చంపాలని నిర్ణయించుకొన్నాను. పాపాత్ముడు, భయంకర స్వభావుడు దుర్బుద్ధి అయినవాడు జీవించటంకంటే మరణించటమే మేలు. కంసుడు పాపపుపనులయందు ఆసక్తి కలవాడై సజ్జనులకు నిందింపదగిన వాడయ్యాడు. అందుచేత నలువైపుల నుండి అతనికి తిరస్కారం ప్రాప్తించింది. అతని జీవితంపై దయచూపటం ప్రయోజనంలేని పని.

ఈ ప్రపంచంలో పాపం చేసేవాళ్ళ సంఖ్య ఎక్కువైంది. కంసుడు మిక్కిలి పాపాత్ముడు. అందుచేతనే అతణ్ణి చంపాను. ఈ దుఃఖిస్తున్న స్త్రీజనాన్ని ఊర డించండి. అని ఇట్లు గోవిందుడు మాట్లాడుచుండగానే ఉగ్రసేనుడు పుత్రుని పాపకార్యములచే భయపడుతూ ముఖం వంచుకొని ప్రవేశించాడు. పద్మముల వంటి కన్నులుగల శ్రీకృష్ణుని యాదవ సమూహం మధ్య కన్నీటితో దీనంగా నా కుమారుని చంపావు. స్వధర్మాన్ని పాలించావు. కీర్తిని నలుదిక్కులా వ్యాపింప చేసుకున్నావు. సజ్జనులు నిన్ను మెచ్చుకుంటారు. ఇప్పుడు నీశత్రువులు నీకు భయపడతారు. ఇలాచేసి యదు వంశాన్ని రక్షించావు. నీకు సంబంధించిన వాళ్ళు ఈ పని చూచి గర్విస్తారు. ఇప్పుడు రాజులందరూ నీకు తలవంచుతారు. ఇప్పుడు ఈ రాజ్యమంతా నీ చెప్పుచేతల్లో నడుస్తుంది. యదువంశీయుల రాజ్యంపై నీకు అధికారం ఉంది. నీకు తప్పనిసరిగా చెప్పవలసిన మాటను చెపుతా విను.

గోవిందా! ఇప్పుడు నీవు దయజూపితే కంసుడికి ప్రేతకార్యాలు జరుగుతాయి. అంత్యక్రియలు పూర్తి అయిన పిమ్మట కోడలుతో భార్యతో అరణ్యానికి వెళ్తాను. ప్రేతకార్యం చేయటం చేత లౌకికంగా ఋణం తీరుతుంది. అతనికి దహన సంస్కారం చేసి తర్పణం చేయటంచేత కంసుడి ఋణం తీర్చుకుంటాను. ఇది నేను నీకు విన్నవించేది. నాపై స్నేహం చూపించు.

ఈ మాటలు విని కృష్ణుడు ఆశ్చర్యపడి తండ్రీ! సమయానికి తగినట్లు మాట్లాడావు. నీ వంశానికీ, నీ ప్రవర్తనకూ తగినట్లు మాట్లాడావు. కంసుడికి ప్రేత సంస్కారం జరుగుతుంది. గొప్పకులంలో పుట్టావు. వేదాలు తెలిసినవాడవు. దైవము దాటరానిదని ఎందుకు తెలియదు? పూర్వజన్మలో చేసినపని సమయానికి ఫలిస్తుంది. మంచిగాని, చెడుగాని తాను చేసిన పనికి సమయంలో ఫలమనుభవి స్తాడు జీవుడు. ఈ మాయ దేవతలకు తెలుసుకొనుటకు శక్యము కానిది. తండ్రీ! నేను చెప్పినది చెయ్యి. నాకు రాజ్యంతో పనిలేదు. రాజ్యంమీది ఆశతో కంసుణ్ణి చంపలేదు. లోకంయొక్క క్షేమంకోసము, కీర్తికొరకు మాత్రమే. నేను ఆవులమధ్య గోపాలకులతో వనంలో సంచరిస్తూ సంతోషిస్తా. ఇది సత్యమైనమాట, నీకు చెపుతున్నాను. నాకు రాజ్యంతో పనిలేదు. నీవు రాజువగుము. నాకు గౌరవింప దగినవాడవు. యాదవులకు ప్రభువు. విజయం కొరకు పట్టాభిషిక్తుడవగుము. నీవు నాయిష్టం నెరవేర్చదలిస్తే నీకు బాధలేకపోతేనే చేయి, స్వకీయరాజ్యాన్ని స్వీకరించి చిరకాలం పరిపాలించుము.

ఇదివిని ఉగ్రసేనుడు ఏమి మాట్లాడలేదు. యాదవసమూహంలో సిగ్గుతో తలవంచుకున్న అతనికి గోవిందుడు ధర్మవేత్త కనుక పట్టాభిషేకం చేశాడు. అతడు కిరీటం ధరించి కృష్ణుని సహాయంతో కంసుడికి ప్రేతకర్మను పూర్తిచేశాడు. కృష్ణుని శాసనప్రకారం యాదవులందరూ దేవేంద్రుని దేవతలవలె ఉగ్రసేన మహారాజును అనుసరించారు. యాదవులు తర్పణాలు అంత్యసంస్కారం జరిపారు. ఉత్తమమైన యమునాతీరంలో అతనికి అంత్యసంస్కారాలు జరిగాయి. అట్లే అతని సోదరుడైన సునామునికి కూడా అంత్యక్రియలు జరిపారు. వృష్ణి వంశీయులు, అంధక వంశీయులు అతనికి తర్పణాలు విడిచారు. చనిపోయిన వానికి మేమిచ్చేది అక్షయంగా ఉండుగాక అని పలికారు. శ్రీకృష్ణుడు పదికోట్ల

బంగారునాణాలిచ్చాడు. బ్రాహ్మణులకు కంసుని సద్గతికి. ఉగ్రసేనుడు గోవులను, రత్నాలను, వస్త్రాలను, గ్రామాలను బ్రాహ్మణులకు దానం చేశాడు. చచ్చిన వారిద్దరికీ తర్పణం చేసి యాదవులు దైన్యంతో ఉగ్రసేనుని ముందుంచుకొని మధురలో ప్రవేశించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి విష్ణుపర్వంలో
ఉగ్రసేనునకు పట్టాభిషేకము ముప్పై మూడవ అధ్యాయము

☆☆☆

# ముప్పై నాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణ బలరాముల విద్యాభ్యాసము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత యౌవనం వచ్చిన శ్రీకృష్ణుడు బలరాముడు రాజ్య లక్ష్మిని పొంది రత్నాలతో అలంకరించినట్టి యాదవులతో నిండిన మధురా నగరంలో మిక్కిలి ఆనందంతో నివసిస్తున్నారు. కొంతకాలానికి కృష్ణ బలరాములు ధనుర్వేదం నేర్చుకొనుటకు కాశీలో పుట్టి అవంతిపురంలో నివసిస్తున్న గురువైన సాందీపని వద్దకు వెళ్ళారు. తమ గోత్రం చెప్పి చదువు కొనగోరుచున్న వినయ వంతులైన రామజనార్దులను తీసుకొని సాందీపని మహర్షి విద్యలు నేర్పాడు. వాళ్ళిద్దరూ అరవైనాలుగురోజుల్లో ఆరు అంగములు గల వేదాన్ని అభ్యసించారు. నాలుగు పాదాలుగల ధనుర్వేదాన్ని శస్త్రసమూహాన్ని స్వల్పకాలంలో గురువు వాళ్ళకు బోధించాడు. గురువు వాళ్ళ గొప్ప మేధాశక్తికి సంతోషించాడు.

కృష్ణుడు బలరామునితో కలిసి విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత గురు దక్షిణగా ఏమి యిమ్మంటారని సాందీపని నడిగాడు. వాళ్ళిద్దరి ప్రభావాన్ని తెలుసు కొని గురువు సంతోషంతో సముద్రంలో మునిగిపోయిన నా కుమారుని తెచ్చి యిమ్మన్నాడు. నాకు ఒక్కడే పుత్రుడు జలజంతువైన తిమిచేత చంపబడ్డాడు. ప్రభాసతీర్థమందు మునిగిపోయిన ఆ పిల్లవానిని మరల నాకు తెచ్చిపెట్టు అన్నాడు. శ్రీకృష్ణుడు బలరాముని అంగీకారంతో అట్లేనని ఒప్పుకున్నాడు.

శ్రీకృష్ణుడు సముద్రం వద్దకు వెళ్ళి నీటిలో ప్రవేశించాడు. సముద్రుడు చేతులు జోడిస్తూ ప్రత్యక్షమయ్యాడు. అతన్ని సాందీపని కుమారుడెక్కడ ఉన్నాడని కృష్ణుడడిగాడు. పంచజనుడనే రాక్షసుడు తిమి సంతోషంతో ఆ పిల్లవానిని

మ్రింగాడని సముద్రుడు చెప్పాడు. శ్రీకృష్ణుడు పంచజనుని చంపి గురుపుత్రుని పొందలేక పోయాడు. శంఖాన్ని మాత్రం పొందాడు. అదే పాంచజన్యమనే శంఖం. తరువాత బాలుని కొరకు యముని వద్దకు వెళ్ళాడు. యముడు శ్రీకృష్ణునకు నమస్కరించాడు. శ్రీకృష్ణుడు గురుపుత్రుని ఇమ్మన్నాడు. అందుకు యముడు అంగీకరించలేదు. ఇద్దరికీ ఘోరయుద్ధం జరిగింది. శ్రీకృష్ణుడు యముణ్ణి జయించి గురుపుత్రుని తీసుకువచ్చాడు. అందరికీ ఆశ్చర్యం కలిగింది.

శ్రీకృష్ణుడు గురు పుత్రుని పాంచజన్యాన్ని విలువైన రత్నాల్ని స్వీకరించి తిరిగి వచ్చాడు. విలువైన అనేక రత్నాల్ని తెచ్చి గురువుగారికి శ్రీకృష్ణుడిచ్చాడు. కృష్ణుడు సాందీపనికి అప్పటి రూపం వయస్సు గల పుత్రుని సమర్పించాడు. సాందీపని చిరకాలం క్రింద కని పించని కుమారుని కలుసుకొని రామకృష్ణులను పూజిస్తూ ఆనందించాడు. గదా పరిఘయుద్ధాలలో సర్వశాస్త్రములలోనూ స్వల్పకాలంలో అందరికంటే గొప్పవాళ్ళయ్యారు.

వీరులైన వాళ్ళిద్దరూ గురువుగారిని వీడ్కొని మధురానికి తిరిగివచ్చారు. అప్పుడు యాదవులందరూ ఎదురువచ్చారు. మంగళవాద్యాలు మ్రోగించారు. శ్రీకృష్ణుని స్తోత్రం చేశారు. అందమైన జండాల వరుసలు అంతటా ప్రకాశించాయి. అంతఃపురమంతా సంతోషించింది. గోవిందుని రాకకు ఇంద్రోత్సవంలా సంతో షించారు. రాజమార్గమందు గాయకులు గానం చేశారు. సోదరులైన గోవింద రాములు వచ్చేశారు. ఆడుకోండి అని బంధువులు ఉత్సాహపరుస్తున్నారు. ఆ పట్టణంలో దీనుడుగాని దరిద్రుడుగాని లేడు.గోవిందుని రాకవల్ల సంతోషంతో పక్షులు మంచిమాటలు పలుకుతున్నాయి. స్త్రీ పురుషులందరూ మనస్సులో సుఖాన్ని పొందారు. గాలులు దుమ్ము లేకుండా సుఖకరంగా వీచాయి. రామ కృష్ణులు మధురానగరంలో వసుదేవుని భవనానికి వెళ్ళారు. వాళ్ళిద్దరూ ఆయుధా లను ఇంట్లోపెట్టి స్వేచ్ఛగా సంచరిస్తూ సంతోషంతో ఉన్నారు. విచిత్రములైన ఉద్యానవనాలలో యాదవులతోపాటు సంచరించారు. రైవతకపర్వతం వద్ద సరస్సులందు, మధురలో సంచరిస్తూ ఉగ్రసేనుని అనుసరించిన వారై కొంతకాలం సంతోషిస్తూ సుఖంగా ఉన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణ బలరాముల విద్యాభ్యాసము అను ముప్పై నాల్గవ అధ్యాయము

☆☆☆

# ముప్పై అయిదవ అధ్యాయము

## మధురపై జరాసంధుని దాడి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బలవంతులైన కృష్ణబలరాములు యువకులై రాజ్యలక్ష్మితో కూడి యాదవులతో నిండిన మధురాపురంలో నివసిస్తూ ఆనందంగా విహరిస్తున్నారు. కొంచం కాలం తరువాత జరాసంధుడు 'ఆస్తి' 'ప్రాప్తి' అనే తన కుమార్తెలద్వారా దుఃఖకరమైన కంసుని మరణవార్త విన్నాడు. వెంటనే ప్రతాపశాలియైన జరా సంధుడు ఆరు విభాగాలు గల తన సేనను తీసుకొని వచ్చిపడ్డాడు. ఆ సమయంలో అతడు మిక్కిలి కోపంతో ఉన్నాడు. యాదవుల్ని అందరినీ నశింపచేయాలని సంకల్పిం చాడు. ఎందుకంటే జరాసంధుని కూతుళ్ళిద్దరూ అందకత్తెలు. కంసుడు వాళ్ళిద్దరినీ పెళ్ళిచేసుకొని జరాసంధుని సహాయంతో తండ్రియైన ఉగ్రసేనుని ఖైదులో పెట్టాడు.

యాదవులను హేళనచేస్తూ సుఖంగా కాలం గడుపుతున్నాడు. వసుదేవుడు తనవాళ్ళను సమర్థిస్తూ ఉగ్రసేనుని మేలు కోరేవాడు. కంసుడికీ విషయం నచ్చలేదు. తర్వాత కృష్ణబలరాములు కంసుని చంపి ఉగ్రసేనుని రాజసింహాసనంమీద కూర్చుండబెట్టారు.

కొన్నిరోజుల తరువాత తన కుమార్తెల ద్వారా మరణవార్తను విని యాదవు లను నశింపచేయాలని సిద్ధమయ్యాడు. వీరపత్నులైన తన కుమార్తెల పట్టుదలతో మధుర మీదికి దండెత్తాడు. గొప్ప సేనను తెచ్చాడు. జరాసంధునిచే పూర్వం జయింపబడిన రాజులందరూ అతని వెంట వచ్చారు. జరాసంధుని సమర్థిస్తూ ఎంతోమంది రాజులు సహాయంగా వచ్చారు. వీళ్ళంతా కృష్ణుని ద్వేషిస్తూ వచ్చారు. మధురాపురాన్ని చుట్టుముట్టి నిలిచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
మధురపై జరాసంధుని దాడి అను ముప్పై అయిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఆరవ అధ్యాయము

## జరాసంధునితో శ్రీకృష్ణుని యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అప్పుడు వృష్ణివంశవీరులు కృష్ణునివద్దకు వెళ్ళి మధురలోని ఉద్యానవనాల్లో రాజులు శిబిరాలు స్థాపించుట చూచారు. అప్పుడు శ్రీకృష్ణుడు బలరామునితో పూజ్యుడా! ఇప్పుడు జరాసంధుడు వస్తే దేవతల పని త్వరగా అవుతుంది. అటువైపు చూడు వాయువేగంతో వచ్చే రథాల జండాలు రెపరెప లాడుతున్నాయి. పెద్ద పెద్ద గొడుగులు ప్రకాశిస్తున్నాయి. జరాసంధుడు మంచి సమయంలో వచ్చాడు. యుద్ధానికి ఇతడు మొదటి అతిథి. జరాసంధుడు యుద్ధ భూమికి వస్తే మనమిద్దరం కలిసి ఉందాం. ఇప్పుడు మనంతర్వలోనే యుద్ధం చెయ్యాలి. ఇప్పుడు మన సైన్యం శక్తిని విచారించాలి. అని పలికి జరాసంధుని పరాక్రమం తెలుసుకొనటానికి అతని సేనను చూచాడు. యుద్ధానికి వచ్చిన రాజు లనందరినీ చూచి తనలో తానిలా అనుకున్నాడు.

ఈ రాజులందరూ యమపురానికి వెళ్ళే బాటమీద నిలిచిఉన్నారు. వీళ్ళందరూ నశిస్తారు. స్వల్పకాలంలో భూమికి భారం తగ్గుతుంది. రాజులందరికీ రాజైన జరాసంధుడు వేలాది రాజులు వెంట రాగా అనేకములైన రథాలతో, ఏనుగు లతో, గుర్రాలతో కాల్బలంతోనూ బయల్దేరాడు. తక్కిన రాజులు కూడా తమ తమ సైన్యాలతో పట్టణాన్ని ముట్టడించారు. ఆ సైన్యాల ధ్వని ప్రళయకాల సముద్ర ఘోషమించిపోయింది. అప్పుడు తలపాగలు చొక్కాలు ధరించిన ముసలివాళ్ళు బెత్తాలు పట్టుకొని ధ్వని చేయవద్దంటూ అక్కడకు వచ్చారు. అంతటా నిశ్శబ్దమైన తరువాత జరాసంధుడిలా అన్నాడు.

రాజులందరి సైన్యాలూ! త్వరగా ముందుకు నడవండి. ఈ పట్టణమంతా మనజనంతో ఆక్రమించాలి. ఆయుధాలు సిద్ధంగా ఉంచండి. సంకర్షణుని కృష్ణుని వాడి బాణాలతో చంపుతాను. నేను చెప్పినట్లు పట్టణ ప్రదేశాలలో రాజులు నిలిచి ఉండండి. త్వరగా పట్టణాన్ని ఆక్రమించండి. మద్ర కలింగదేశరాజులు బాహ్లికుడు, గోనర్దుడు, ద్రుముడు, కింపురుషుడు నగరం పడమర ద్వారమును, శీఘ్రముగా ఎక్కండి. వేణుదారి, సోమకుడు, రుక్మి, సూర్యాక్షుడు, మాలవుడు, విందాను

విందులు, దంతవక్త్రుడు, ఛాగలి, పురుమిత్రుడు, విరాటుడు, కౌరవ్య, మాలవ, శతధన్వ, విదూరథభూరిశ్రవులు, బాణుడు, పంచనదుడు నగరపు ఉత్తరద్వారాన్ని మిక్కిలి మర్దించండి.

ఉలూకుడు, కైతవుడు, ఏకలవ్యుడు, బృహత్క్షత్రుడు, జయద్రథుడు, ఉత్త మౌజుడు, శల్యుడు, కౌరవులు, కేకయులు, వామదేవుడు, సాకృతి, తూర్పునగర ద్వారాన్ని ఆక్రమించాలి. కనపడినవాళ్ళను చీల్చివేస్తూ పరుగెత్తండి. నేను, దరదుడు చేదిరాజు, దక్షిణద్వారం కాస్తాము. ఈవిధంగా నగరమంతా సైన్యంచే ఆవరింపబడి మిక్కిలి భయాన్ని పొందుగాక. అనేకవిధాలైన ఆయుధాలతో పట్టణాన్ని చీల్చి వేయండి. మీరంతా పట్టణాన్ని నేలమట్టం చెయ్యాలి. అని చెప్పి జరాసంధుడు చతురంగబలంతో తక్కిన రాజులు వెంట రాగా యాదవులను ఎదుర్కొన్నాడు. యాదవులు కూడ దీటుగా ఎదిరించారు. ఆయుద్ధం దేవదానవ యుద్ధంలా ఘోరంగా సాగింది. బలరామకృష్ణులు నగరం నుంచి బయటకు వచ్చారు.

వాళ్ళు ఇద్దరూ తలచుకొన్నంతనే ఆకాశం నుండి అనేక శస్త్రాస్త్రాలు దిగి నాయి. వాటితోపాటు పచ్చిమాంసం తినే జీవులు కూడ దిగారు. ఆ ఆయుధాలు రామ కృష్ణుల చేతులలో ప్రకాశించాయి. బలరాముడు కుడిచేతితో నాగలిని ఎడమచేతితో రోకలిని పట్టుకున్నాడు. శ్రీకృష్ణుడు శార్ఙ్గమనే ధనుస్సును పట్టు కున్నాడు. ఇలా అస్త్రాలను ధరించి ఇద్దరూ సాక్షాత్తు నారాయణుని వలె యుద్ధ రంగంలో శత్రువులతో యుద్ధం చేయడం మొదలెట్టారు. కృష్ణ బలరాములు శత్రువులను బాధిస్తూ దేవతల వలె సంచరించారు. బలరాముడు నాగలిని, రోకలిని పట్టుకొని యముని లాగా శత్రుసమూహంలో తిరుగుతూ రథాలనీ, ఏనుగులనూ, గుర్రాలనూ నుగ్గు చేశాడు. బలరామునిచే పీడింపబడిన రాజులు మిక్కిలి భయానికి గురిఅయ్యారు. యుద్ధభూమిని విడిచి జరాసంధుని శరణువేడారు. వాళ్ళందరితో జరాసంధుడిలా అన్నాడు.

మీరు యుద్ధరంగంలో ఎందుకు భయపడుతున్నారు? మీ క్షత్రియజీవనం తిరస్కరింపతగినది. యుద్ధం చేయలేక పారిపోయేవాడు. శిశువధ చేసిన పాపాన్ని పొందుతాడు. కనుక మీరు యుద్ధం చేయలేకపోతే రథాలపై కూర్చొని నేను రామ కృష్ణులను చంపేవరకూ మా యుద్ధాన్ని చూస్తూ ఉండండి. తరువాత ఆ

క్షత్రియులందరూ జరాసంధుడు ప్రేరేపింపగా సంతోషంతో బాణవర్షం కురిపిస్తూ యుద్ధానికి సిద్ధమయ్యారు. యుద్ధ మందాసక్తి కలవారై అనేకాయుధాలతో యుద్ధాన్ని కొనసాగించారు. ఈ సమయంలో దేవతలకు సంతోషం కలిగించే శ్రీకృష్ణుడు శ్రేష్ఠమైన గరుత్మంతుడనే జండా గుర్తు గల శ్రేష్ఠమైన రథాన్ని ఎక్కి జరాసంధుని ఎదుర్కొని ఎనిమిది బాణాలతో అతన్ని నొప్పించాడు.

సారధిని కూడ ఐదుబాణాలతో బాధించాడు. గుర్రాలను కూడ చంపాడు. అతడు కష్టంలో పడ్డాడని చిత్రసేనుడు, కైశికుడు బాణాలతో శ్రీకృష్ణుని బాధించారు. కైశికుడు బలరాముని పై మూడు బాణాలు ప్రయోగించాడు. బలరాముడు బల్లెముతో అతని ధనుస్సును రెండు ముక్కలు చేశాడు. బాణవర్షంతో తక్కిన శత్రువులను బాధించాడు. చిత్రసేనుడు బలరాముని తొమ్మిది బాణాలతో బాధ కలిగించాడు. కైశికుడు ఐదుబాణాలతో, జరాసంధుడు ఏడుబాణాలతో బాధించగా వాళ్ళను జనార్దనుడు ఐదుబాణాలతో కృష్ణుడు నొప్పించాడు. బలరాముడు చిత్రసేనుని రథం కూడ నాశనం చేశాడు. బల్లెంతో అతని ధనుస్సును కూడ రెండుగా చేశాడు. బలరాముని చంపుటకు ఎదురుగా పరుగెత్తాడు. చిత్రసేనుని చంపుటకు ప్రయత్నిస్తున్న బలరాముని ధనుస్సును జరాసంధుడు ఖండించాడు.

మరియు గదతో బలరాముని గుర్రాలను చంపాడు. బలరాముని కెదురుగా పరుగెత్తాడు. బలరాముడు రోకలిని తీసుకొని జరాసంధుని ఎదుర్కొన్నాడు. వాళ్ళ ఇద్దరికీ యుద్ధం జరిగింది. చిత్రసేనుడు బలరాముని ఎదుర్కొన్న జరాసంధుని చూచి మరొక రథమెక్కి అతన్ని రక్షించుటకు వెళ్ళాడు. అప్పుడు వాళ్ళిద్దరకూ ఘోరయుద్ధం జరిగింది. తరువాత జరాసంధుడు గొప్ప సైన్యాన్ని తీసుకొని రామ కృష్ణులతో కూడిన భోజవంశీయులను ఎదుర్కొన్నాడు. అప్పుడు రెండు సేనల యొక్క ధ్వని సముద్ర ఘోషనుమించిపోయింది. రెండు వైపులా వాద్యధ్వనులు మిన్ను ముట్టాయి. గిట్టలతో చిమ్మబడిన ధూళి ఆకాశంలో వ్యాపించింది. అనేకమంది శూరులు గర్జిస్తూ యుద్ధంలో నిలిచారు.

రథికులు గుర్రాలపై యుద్ధం చేయువాళ్ళు కాల్బలము వేలకొద్ది ఏనుగులు అంతటా వ్యాపించాయి. ప్రాణాలను లెక్కచేయక తీవ్రంగా ఆయుద్ధం సాగింది. వృష్ణివంశీయులైన యోధులతో జరాసంధుడికి భయంకరమైన యుద్ధం జరిగింది.

'శిని' అనాధృష్టి చిభ్రు, విపృధు, ఆహుకులను వాళ్ళు సైన్యంతో బలరాముని, అవగాహుడు, ప్రుథుడు, కంకుడు, శతద్యుమ్నుడు, విదూరథుడు, కృష్ణుని ముందుంచుకొని బాణవర్షం కురిపించారు. సాత్యకి చిత్రకుడు, శ్యాముడు, యుయుధానుడు, మృదురుడు, శ్వఫల్కుడు, సత్రాజిత్తు, ప్రసేనుడు గొప్ప సైన్యంతో కృష్ణునితో ఉన్నారు. ఆసమయంలో బలశాలి వేణుదారి, ధృతరాష్ట్ర కుమారులు, జరాసంధుని పక్షం రక్షిస్తున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
జరాసంధునితో శ్రీకృష్ణుని యుద్ధము అను ముప్పై ఆరవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఏడవ అధ్యాయము

## జరాసంధుడు పారిపోవుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత జరాసంధునికి అతనిని అనుసరించేవారికి వృష్ణి యాదవులతో గొప్ప యుద్ధాలే జరిగాయి. భగవంతుడైన శ్రీకృష్ణుడు రుక్మి మొదలైన చాలామంది రాజులతో యుద్ధం చేయటం మొదలుపెట్టాడు. ఈ విధంగా ఆ యుద్ధం డెబ్బైరోజులు సాగింది. ఇంద్రవృత్రాసురుల యుద్ధంలాగా అతిభయంకర యుద్ధం జరిగింది. బలరాముడు జరాసంధునిమీద బాణవర్షం కురిపించాడు. అతని సేన నష్టమైంది. రెండువైపుల సేనలు చాలావరకు నశించాయి. జరాసంధుడు త్వరగా వెళ్ళే రథంమీద బలరాముని మీదికి వెళ్ళాడు. ఇద్దరూ అనేక శస్త్రాలతో యుద్ధం చేశారు. కొంతసేపటితర్వాత ఇద్దరివద్దా శస్త్రాస్త్రాలు అయిపోయాయి. వాళ్ళ రథాల సారథులు, గుర్రాలు మరణించాయి. వాళ్ళిద్దరూ గదలు పట్టుకొని యుద్ధం చేశారు. దేవతలు ఆ యుద్ధాన్ని చూడటానికి వచ్చారు.

గదాయుద్ధంలో గొప్పవాడైన జరాసంధుడు గొప్ప యుద్ధం చేసినా బల రాముడు చలించలేదు. ఇద్దరూ సమానంగా యుద్ధం చేస్తున్నారు. చివరకు బలరాముడు జరాసంధుడు గదాయుద్ధంలో నేర్పరి అని తెలుసుకొని కోపంతో గదను విడిచి రోకలి తీసుకొని ముందుకు సాగాడు.

అప్పుడు ఆకాశవాణి ఓ బలదేవా! జరాసంధుడు నీ చేతిలో చావడు. ఇతని మృత్యువు నిర్ణయింపబడి ఉంది. కనుక నీవు శాంతించు అని పలికింది. ఈ మాట విని జరాసంధుడు దుఃఖపడ్డాడు. బలరాముడు కూడా అతనిపై యుద్ధం చేయలేదు. ఇద్దరు వీరులు కూడా శాంతించారు. ఈ విధంగా జరాసంధుడు ఓడిపోయి అక్కడినుండి వెళ్ళిపోయాడు. అప్పుడు సూర్యభగవానుడు అస్త మించాడు. రాత్రి అయినది. ఎవడు జరాసంధుని అనుసరించలేదు.

శ్రీకృష్ణునిచేత రక్షింపబడి విజయం పొందిన వృష్ణి వంశవీరులు తమసేనలను తీసుకొని మధురాపురానికి తిరిగివచ్చారు. ఆకాశంనుండి వచ్చిన ఆయుధాలు అంతర్ధానం చెందాయి. జరాసంధుడు విచారిస్తూ తన దేశానికి తిరిగివెళ్ళాడు. అతనితో కూడా వచ్చిన రాజులు కూడా తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు. జరాసంధుడు గొప్పవీరుడగుటచేత అతడు యుద్ధంమాని వెళ్ళినా వృష్ణివీరులు అతన్ని ప్రశంసించారు. తాము విజయం పొందినట్లు తలచలేకపోయారు. జరా సంధునికి సహాయంగా వచ్చిన సైన్యం ఇరవై అక్షౌహిణులు. అందుచేతనే మాటి మాటికీ వృష్ణివంశీయులపై దాడి చేశాడు. యాదవులు యుద్ధంలో తొలగి పోయినవానిని చేసి మహానందంతో విహరించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
జరాసంధుడు పారిపోవుట అను ముప్పై ఏడవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఎనిమిదవ అధ్యాయము

## వికద్రువు మాటలు- హర్యశ్వ చరిత్ర

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బలవంతుడు, యువకుడైన కృష్ణుడు బలరాముడు యాదవు లతో సుఖంగా వనాలతో, గనులతో సుందరమైన మధురానగరంలో నివసిస్తున్నాడు. ఇంద్రునితో సమానమైన పరాక్రమంకల జరాసంధుడు కృష్ణుని చంపాలని పద్దెనిమి దవమారు యుద్ధానికి వచ్చాడు. యాదవవీరులు జరాసంధుడు మరల యుద్ధానికి రావటంవిని భయపడుతూ ఆలోచన చేశారు. నీతిశాస్త్రం తెలిసిన 'వికద్రువు' ఇలా అన్నాడు.

వత్స! గోవింద! యదువంశీయుల జన్మవృత్తాంతము చెపుతా విను. నేను చెప్పేమాట బాగుంటే ఆ ప్రకారం చేద్దువుగాక. పూర్వం వ్యాసుడు చెప్పినట్లు యాదవవంశము పుట్టుకను చెపుతాను విను.

మనువంశంలో ఇక్ష్వాక మహారాజు కొడుకు హర్యశ్వుడు. అతడు ఇంద్రునితో సమానమైన పరాక్రమం కలవాడు. అతనికి మధువను రాక్షసుని కూతురు మధు మతి భార్య. ఆమె యౌవనంలో గొప్ప సౌందర్యవతి, రాజుకు ప్రాణాలకంటే కూడా ఇష్టమైనది. కావలసినరూపం ధరించగలది. ఆమె ఏకపత్నీవ్రతము వలంబించింది. ఆమె హర్యశ్వుని ప్రేమించింది. ఒకమారు హర్యశ్వుని పెద్దన్న అతన్ని రాజ్యంనుంచి వెళ్ళగొట్టాడు. అప్పుడతడు కొంచం పరివారంతో తప ప్రియురాలైన మధుమతితో అయోధ్యను విడిచి, అడవికి వెళ్ళాలనుకొన్నాడు. వనానికి వెళ్ళి అక్కడ విహరిస్తున్నాడు.

ఒకనాడు భార్య అతనితో రాజా! ఇప్పుడు మీరు రాజ్యంమీద ఆశ వదులు కోండి, మా తండ్రివద్దకు వెళ్దాంరండి. అతని రాజధాని మధువనం మిక్కిలి అందమైనది. అక్కడ అందమైన వృక్షాలున్నాయి, పండ్లు, పువ్వులు ఎక్కువగా ఉంటాయి. అక్కడ మనం స్వర్గసుఖం అనుభవించవచ్చు. నా తల్లి తండ్రి మిమ్మ మిక్కిలి ప్రేమతో చూస్తారు. మాకు ఇష్టమైనవాడివి కనుక లవణాసురుడు కూడా మీపై ఆసక్తి చూపిస్తాడు. అక్కడ మనం రాజ్యంలో ఉన్నట్లే సుఖంగా సంచరిస్తాం. మీఅన్న అధీనంలో ఉండవలసిన అవసరంలేదు. ఇప్పుడు మీ అన్నపై ఆధారపడి ఉండవలసిన అవసరం లేదు. ఆయన రాజ్యమదమత్తుడు, ఎల్లప్పుడూ మనసు ద్వేషించేవాడు. సేవకుడిలా ఈ విధమైన జీవితం తిరస్కరింపదగినది. కాబట్టి నడవండి మాతండ్రి ఇంటికి వెళ్దాం. ఓ రాజా! మీపెద్దన్నమీద హర్యశ్వునకు గొప్ప ఆసక్తి ఉంది. కాని భార్యమాట విన్నాడు. వాళ్ళిద్దరూ మధురకు వెళ్ళారు.

అక్కడ రాక్షసరాజు మధువు మిక్కిలి ఆదరించి క్షేమమడిగి నీకు స్వాగతము. నిన్నుచూచి మిక్కిలి సంతోషిస్తున్నాను. మధువనం తప్ప మిగిలినరాజ్యమంతా నీకిస్తున్నాను. నీవు సంతోషంగా ఇక్కడు ఉండు. ఈవనంలో లవణుడు ఎల్లప్పుడూ మీకు సహాయంగా ఉంటాడు. ఎప్పుడైన శత్రువు వెదుర్కొనవలసివస్తే లవణుడు సహాయం చేస్తాడు. నీవు సముద్రము ఇతర సరోవరాలుగల ఈ అందమైన రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండు. ఆవులతో, గోపాలకులతో నిండిన ఈ రాజ్యం

చాలా అందమైనది. ఇక్కడ ఉంటుంటే మెల్లమెల్లగా ఈ విశాలమైన గిరిపురం నీకు రాజధాని అవుతుంది. గిరిపురం సముద్రం ఒడ్డున ఉంది. ఇక్కడ ఆపదలేమి ఉండవు. ముందు ముందు మీరాజ్యం ఈ ఆనర్తమనే పేరు పొందుతుంది. మీవంశం యదువు యొక్క వంశంలో కలియుటచేత చంద్రవంశంగా చెప్పబడుతోంది.

నేనిప్పుడు నా వైభవాన్ని అంతా నీకిచ్చి తపస్సు చేసుకొనుటానికి సముద్రం లోకి వెళ్ళాను. నీవు నీవంశ విస్తారంకోసం లవణునితోకూడా ఉండి రాజ్యాన్ని అంతటిని రక్షించు అన్నాడు. హర్యశ్వుడు అందుకు అంగీకరించాడు. విశాలమైన నగరాన్ని స్వాధీనం చేసు కొన్నాడు. రాక్షసశ్రేష్ఠుడైన మధువు తపస్సు చేసుకోవటానికి సముద్రం వద్దకు వెళ్ళాడు. తేజశ్శాలియైన హర్యశ్వుడు తన నివాసంకోసం పర్వతం మీద ఆనర్తమనే విశాల నగరాన్ని స్థాపించాడు. స్వల్పకాలంలోనే గోధనంతో కూడిన సమృద్ధి కలదైంది. హర్యశ్వుడు రాజధర్మానుసారం జలాశయములతో, వనము లతో కూడిన మిక్కిలి సమృద్ధిగల రాజ్యాన్ని పరిపాలించాడు. దుర్గములతో రాజ్యం దృఢమైంది. ఈ విధంగా ఉత్తమరాజనీతి ననుసరించి పాలించుటచేత రాజ్యలక్ష్మి అతనికి వశమైంది.

కొన్నాళ్ళకు మధుమతియందు "యదువ"ను కీర్తిమంతుడైన పుత్రుడు కలిగాడు. ఆ యదువు రాజలక్షణాలు కలవాడు, శత్రువులకు లొంగనివాడు, ఇతనికి పూర్వుడైన "పూరువు"వలె కీర్తిగలవాడు, అతనికి ఒక్కడే కుమారుడు జన్మించాడు. హర్యశ్వుడు. అతడు పదివేల సంవత్సరాలు రాజ్యంచేసి స్వర్గస్థుడైయాడు.

తరువాత యదువు రాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. అతడు దొంగల భయం లేకుండునట్లు భూమిని పరిపాలించాడు. అతన్నిబట్టి యాదవులమయ్యాం. అతడింద్రునితో సమానుడు. ఒకప్పుడు సముద్రంలో జలక్రీడచేశాడు. భార్యలు కూడా ఉన్నారు. ఆ సమయంలో ధూమ్రవర్ణుడనే సర్పరాజు బలంతో అతణ్ణి పట్టు కొని తన పట్టణానికి తీసుకువెళ్ళాడు. ఆ పట్టణం భూలోకంలో తన పట్టణం ఎలా ఉందో అలాగా ఉంది. అక్కడ ప్రతియింటియందూ మణిస్తంభాలు, ముత్యా లహారాలతో అలంకరింపబడినది. శంఖాల సమూహంచేత రత్నరాసులచేత శోభిస్తున్నది. అందమైనచెట్లుగలది. అటువంటి సర్పరాజు నగరంలో యదువు ప్రవేశించాడు.

అతనికి మణిసమూహంతో చేయబడిన ఆసనం ఈయబడింది. ఆ యాసనం మీద కూర్చున్నరాజుతో ధూమ్రవర్ణుడు నీతండ్రి స్వర్గస్థుడయ్యాడు. నీ పేరుతో మీవంశం పిలువబడుతుంది. మహారాజా! నీ వంశంలో దేవపుత్రులు, ఋషిపుత్రులు, సర్పపుత్రులు జన్మిస్తారు. యువనాశ్వుని పుత్రుడైన మాంధాత సోదరికి ఐదుగురు కన్యలు పుట్టారు. ఐదుగురిని నీవు వివాహం చేసుకో. నేను నీకు వరంకూడా యిస్తాను. ఇకముందు నీవంశం భౌమ, కుకుర, భోజ, అంధక, యాదవ, దాశార్హ, వృష్ణి అనే ఏడుపేర్లతో ప్రసిద్ధి చెందుతుంది.

తరువాత ఈ ఐదుగురు కుమార్తెలందు నీకు తల్లితండ్రుల తేజస్సుతో కావలసిన రూపం ధరించగల రాజులు పుడతారు. యదువు వరాన్ని కన్యకలను పొంది నీటినుండి పైకి వచ్చాడు. ఐదుగురు కన్యలమధ్య నుండి అంతఃపురాన్ని చూచాడు. తండ్రి వియోగంతో బాధపడుచున్న భార్యలను ఊరడించి తన పట్టణానికి వెళ్ళిపోయాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
వికద్రువు మాటలు- హర్యశ్వ చరిత్ర అను ముప్పై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై తొమ్మిదవ అధ్యాయము

## వికద్రువు యదువంశాన్ని వర్ణించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

యదువు ఆ నాగకన్యలయందు ఐదుగురు కుమారుల్ని కన్నాడు. వాళ్ళందరూ పరాక్రమవంతులు, వంశానికి పేరు తెచ్చేవాళ్ళుకూడా. ముచుకుందుడు, పద్మ వర్ణుడు, మాధవుడు, సారసుడు, హరితుడు అనే యీ పుత్రులనుచూచి సంతో షించాడు యదువు. వాళ్ళు వయస్సు వచ్చాన తరువాత తేజస్సు, బలము, గర్వం గల వాళ్ళై తమ తండ్రిని మేమేం చెయ్యాల్సిందీ చెప్పమనీ అడిగారు. రాజు నా కుమారులైన ముచుకుందుడు, వింధ్య, ఋక్షవత్పర్వతాలమీద రెండు పట్టణాలు నిర్మించాలి. సహ్యాపర్వతంపైన దక్షిణదిశయందు పద్మవర్ణుడు ఉండుగాక. సారసుడు ఆ పర్వతానికి పడమరన చంపావనంలో అలంకరింపబడిన రమణీయ

మైన (అందమైన) ప్రదేశంలో నివసించుగాక. హరితుడు, సర్పరాజుయొక్క ద్వీపాన్ని పాలిస్తాడు. మాధవుడు నా పెద్దకొడుకు యువరాజుగా ఉండి నాతోపాటు నా పట్టణాన్ని రక్షిస్తూ ఉంటాడు. అని అజ్ఞాపింపబడి ఆ కుమారులు పట్టాభిషేకం పొంది తమతమ స్థానాలకి వెళ్ళారు.

ముచుకుందుడు వింధ్యపర్వతమధ్యభాగానికి ఇష్టపడ్డాడు. దారుణమైన రాళ్ళతో సంకటంగాఉన్న ఆ ప్రదేశాన్ని బాగుచేయించాడు. వంతెనలు, అగడ్తలు నిర్మించాడు. దేవాలయాలు కూడ స్థాపించాడు. అందమైన వీధులు, కూడలి ప్రదేశాలు, వనాలు కల్పించాడు. కొద్దికాలంలోనే ధనవంతమైన ఆ నగరాన్ని స్వర్గంలా తయారు చేశాడు. ఆనగరానికి మాహిష్మతి అనిపేరు పెట్టాడు. వింధ్య ఋక్షవత్ పర్వతాల మధ్య నిర్మించిన మరొక పట్టణానికి 'పురిక' అని పేరు వచ్చింది. ధర్మాత్ముడైన ముచుకుందుడు రెండు పట్టణాలను పరిపాలిస్తున్నాడు.

పద్మవర్ణుడు సహ్యపర్వతంపైన వేణానదిఒడ్డున నగరాన్ని నిర్మించాడు. ఆ నగరం విశ్వకర్మ నిర్మించినట్లుంది. ఆ దేశం పేరు పద్మావతం. పట్టణంపేరు కరవీరం. సారసుని పట్టణంపేరు క్రౌంచపురం. అక్కడ సంపెంగ, అశోకవృక్షాలు ఎక్కువగా ఉన్నాయి. ఆ దేశం పేరు 'వనవాసి' అన్ని ఋతువులలో పుష్పించే వృక్షాలు వ్యాపించి ఉన్నాయి. హరితుడు సముద్రద్వీపాన్ని పాలిస్తూ ఉన్నాడు. అచ్చటి పల్లెవాళ్ళు సముద్రంలో నుండి శంఖాలను తీసుకువస్తారు. ఈక్కడి జనులు చేపమాంసం ఆహారంగా కలిగిఉంటారు. వాళ్ళు సముద్రంలోని విలువైన వస్తువు లతో హరితుని సంతోషపెడుతూ ఉంటారు.

ఈ విధంగా ఇక్ష్వాకువంశం నుండి యదువంశం పుట్టింది. యదువుయొక్క నలుగురు పుత్రులచేత నాల్గువిధాలుగా వంశం విభజింపబడింది. యదువు మాధవుడికి రాజ్యం పప్పచెప్పి స్వర్గస్తుడయ్యాడు. మాధవుని పుత్రుడు సత్వతుడు అతని కొడుకు భీముడు. ఇతని సంతతివాళ్ళు సాత్వతులుగా పిలవబడ్డారు. శ్రీరాముడు రాజ్యం చేయుచుండగా శత్రుఘ్నుడు లవణునిచంపి మధువనాన్ని చేదించాడు. ఆ మధుస్థానంలో మధుపురాన్ని శత్రుఘ్నుడు నిర్మించాడు.

రాముడు అవతారం చాలించిన తరువాత మధువుయొక్క మనుమడు భీముడు మధురాపురరాజ్యానికి ఉత్తరాధికారి అయ్యాడు. తరువాత కుశుడు రాజై అపుడు యువరాజుగా ఉండగా భీముని కుమారుడు అంధకుడు రాజ్యం

చేశాడు. అంధకుని కొడుకు రైవతుడు, ఋక్షుడు కూడా రైవతుని కుమారుడు. ఆ సమయంలో సముద్రసమీపాన ఒక పర్వతం పుట్టింది. దానికి రైవతకమని పేరు వచ్చింది. రైవతుని కొడుకు విశ్వగర్భుడనేరాజు. అతడు ప్రసిద్ధుడు. అతనికి ముగ్గురు భార్యలయందు నలుగురు పుత్రులు. దిక్పాలకులవంటివాళ్ళు కలిగారు. వాళ్ళు వసువు, బభ్రువు, సుషేణుడు, సభాక్షుడు అనువాళ్ళు.

యదువీరులు లోకపాలకులవలె ప్రసిద్ధి చెందారు. వాళ్ళచేత యాదవవంశం వృద్ధి పొందింపబడింది. వసువుకు పుత్రుడు వసుదేవుడు పుట్టాక ఇద్దరు కన్యలు జన్మించారు. ఒకతె కుంతి. రెండవది 'సుప్రభ' దేవతవంటి సౌందర్యంకల కుంతి పాండురాజుకు పట్టమహిషి. చేదిరాజైన దమఘోషునకు భార్య అయినది సుప్రభ.

ఇది నీ వంశంయొక్క పుట్టుక. ఈ విషయం నేను పూర్వం వ్యాసమహర్షి చెప్పగా విన్నాను. ఈ సమయంలో యదువంశీయుల మేలు కొరకు మళ్ళీ విజయం సాధించినవాళ్ళనుగానే చేయుటకు నీవు బ్రహ్మదేవునిలాగా అవతరించావు. ఇప్పుడు మేము జరాసంధుని వలన బ్రతకలేము. నీవు అంతా తెలిసినవాడవు. ప్రతివ్యక్తి రహస్యసంభాషణ తెలిసికొంటావు. నీవొక్కడవే జరాసంధునితో యుద్ధం చేయగలవాడవు. మేమంతా నీ అభివృద్ధికొరకే యుద్ధానికి సిద్ధమయ్యాము. ఇప్పుడు రాజు లందరిలో జరాసంధుడే బలవంతుడు. నీవు జరాసంధునితో యుద్ధం చెయ్యగలవాడవు.

నీ బుద్ధిని అనుసరించివెళ్ళే యోధులము మేము. మా సాధనములు అల్పమైనవి. ఒక్కరోజు కూడా ఈ పట్టణం ముట్టడిస్తే సహించలేదు. తక్కువ ఆహారపదార్థాలు, ఇంధనము కలది, దుర్గము లేనిది. కంసుడు బలవంతుడు కనుక ఎక్కువ రక్షణలు ఈ పట్టణానికి లేవు. ఎవరైనా ఆక్రమిస్తే మనుష్యులతో కూడ అంతా నష్టమౌతుంది. శత్రువులు నిరోధింపబడిన పురజనులు యాదవులతో విరోధంచే నష్టపోయామని అంటారు. నీకు పూర్వం విన్నవించాము. ఇప్పుడు చేయదగిన పని చేయుము. నీవు ఈ సైన్యానికి నాయకుడవు. మేము నీ శాసనానికి కట్టుబడి ఉన్నాము. నీ మూలంగా విరోధం గనుక మమ్ము రక్షించు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
వికద్రుడు యదువంశాన్ని వర్ణించుట అను ముప్పై తొమ్మిదవ అధ్యాయము

★★★

# నలభైయవ అధ్యాయము

## పరశురాముని మాటలు

వైశంపాయనుడిట్లా చెప్పాడు.

మహారాజా! వసుదేవుడు వికద్రువు మాటలు విని సంతోషించి ఇలా అన్నాడు. కృష్ణా! వికద్రువు ఆలోచనాపరుడు, బుద్ధిమంతుడు, అతడు చెప్పిన మాట యదార్థము, లోకానికి క్షేమం కలుగజేసేది. శ్రీకృష్ణుడు వికద్రువు తన తండ్రి చెప్పిన మాటలువిని యిలా అన్నాడు.

నేను అన్నివిధాల మీ మాటలను వింటాను. ఇప్పుడు నేను చెప్పే మాటలువిని ఆపైన విచారిద్దాం, బలవంతులవద్ద ఉండకూడదు. సమర్థుడైతే యుద్ధం చెయ్యాలి. నేను శక్తికలవాడనైనా బలరామునితో కలిసి యుద్ధానికి వెళ్తున్నా. ఈ సమయంలో సహ్యాపర్వతంపై అందమైన దక్షిపథానికి వెళ్ళుటకు నేను నిశ్చ యించాను. అక్కడ కరవీరపురం, క్రౌంచపురం, చూచి పర్వతశ్రేష్ఠమైన గోమంత పర్వతంమీదికి వెళ్తాను. మేమిద్దరం పారిపోయామనే మాట విని జరాసంధుడు మధురాపురాన్ని ఆక్రమించి మావెంట పడతాడు. ఆ పరిస్థితిలో సహ్యాపర్వత వనాలలో చొరబడి మా యిద్దరినీ పట్టుకోడానికి అనేక ప్రయత్నాలు చేస్తాడు. మేంవెళ్ళటం చేతనే మావంశం, మన పట్టణం, పురజనులు సుఖపడతారు. శత్రువు ఓడిపోతాడని గమనించిన జయంకోరే రాజు ఆ శత్రువు నాశం కొరకు ప్రయత్నించ కుండా శాంతించడు. ఇలా చెప్పి బలరామకృష్ణులు, దక్షిణావథం వైపు వెళ్ళారు.

మార్గంలో అనేక రాజ్యాలలో తిరుగుతూ, అనేక ప్రదేశాలను చూస్తూ వాళ్ళిద్దరూ ఆనందించారు.(మెచ్చుకొన్నారు) సహ్యాపర్వతంయొక్క అందమైన ప్రదేశాలలో ఆనందిస్తూ దక్షిణావథానికి వెళ్తూ స్వల్పకాలంలోనే తన వంశీయులున్న కరవీరపురం చేరారు. అక్కడ వేణానదితీరమందలి ఊడలతో కూడిన మర్రిచెట్టు దగ్గరకు వచ్చారు.

ఆ వృక్షం క్రింద తపోనిధియైన ఒక మునిని చూచారు. అతడు భుజంమీద గొడ్డలి ధరించాడు. జడలను, నారబట్టలను ధరించాడు, సూర్యుడులా ఉన్నాడు. క్షత్రియులను మట్టుపెట్టినవాడు, హోమం చేసినవాడు, మూడువేళల స్నానం

చేత తడిసి ఉన్నవాడు, దూడతోకూడిన తెల్లనిఆవును లాగుతున్నవాడు అయిన పరశురాముడు. అతన్ని చూచి పాదాలవద్ద నమస్కరించారు వసుదేవుని కుమారులు.

కృష్ణుడా మునితో పూజ్యుడా! నిన్ను పరశురామునిగా తలుస్తున్నాను. మీ బాణబలంతో సముద్రాన్ని దూరంగా పంపించారు. మీరు ఒక్క బాణాన్ని ప్రయోగించి శూర్పారకమనే నగరాన్ని నిర్మించారు. సహ్యపర్వతంమీది దేశాన్ని పడమర సముద్రం ఒడ్డున నిలిపారు. తండ్రి వధ నిమిత్తంగా మీరు చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చారు. కార్తవీర్యార్జునుని వేయిచేతులను నరికివేశారు. మీరు చంపిన రాజుల రక్తంతో భూమి తడిసిపోయింది. నీవు క్షత్రియులకు శత్రువైన రేణుకా పుత్రుడవగు పరశు రాముడవే. యుద్ధమును మానివేసినా గొడ్డలిని ధరించే ఉన్నారు. మీతో కొంచం మాట్లాడదలుచుచున్నాను. మీరు స్పష్టంగా సమాధానమివ్వండి.

మేము యమునానది ఒడ్డున మధురలో ఉండేవాళ్ళం, మేము యాదవులం, మీరు మా విషయం కొంచం వినే ఉంటారు. యదువంశ శ్రేష్ఠుడైన వసుదేవుడు నా తండ్రి. పుట్టినది మొదలు గొల్లపల్లెలోనే ఉంచబడ్డాం. కంసునిభయంవల్ల అక్కడ పెంచబడ్డాం. ఇప్పుడు మధురకు వచ్చాం. కంసుని చంపి ఉగ్రసేనుని రాజుగాచేసి మళ్ళీ గోపాలకవృత్తినే స్వీకరించాం. తరువాత జరాసంధుడు మా పట్టణాన్ని ఆక్రమించగా అతనితో చాలామార్లు యుద్ధం చేశాం. ఇప్పుడు మేమిద్దరం పారిపోయి మీ దగ్గరకు వచ్చాం. మాకు సలహాయిచ్చి మమ్మల్ని గౌరవించండి అన్నాడు. పరశు రాముడు శ్రేష్ఠమైన సమాధానం చెపుతూ ఇలా మాట్లాడాడు.

ఓ కృష్ణా! మీకు సలహా ఇచ్చుటకే నా శిష్యులను విడిచి సముద్రం దగ్గరనుంచి యిక్కడకు వచ్చాను. పద్మములవంటి కన్నులు కలవాడా! నీవు చెప్పిన మీ వృత్తాంత మంత నాకు తెలుసు. జరాసంధుడితో యుద్ధం ప్రారంభమయిందని వినే నీతో కలవటానికి నేనిక్కడకు వచ్చా. నీవు ప్రపంచరక్షకుడవైనవాడవు, నాశరహితుడవు, ఈశ్వరుడవు, పరిపూర్ణ బ్రహ్మస్వరూపుడవైయుండికూడా నీవు ఈ సమయంలో బాలకుని వేషంలో ఉన్నావు. మూడులోకాలలోనూ నీకు తెలయనిదిలేదు. అయినా నీ మాటలకు సమాధానం చెపుతున్నా విను.

గోవింద! పూర్వం మీ వంశీయులే ఈ కరవీరపురంలో ఉండి రాజ్యం స్థాపించారు. ఇప్పుడు వసుదేవుని కుమారుడైన సృగాలుడు ఈ నగరానికి రాజుగా ఉన్నాడు. వాడు కోపిష్టి. ఇతడు మీ వంశంవాడు, అనేక రాజులను చంపివేశాడు. అతడు మదించినవాడు, పుత్రులనుకూడా ద్వేషిస్తాడు. కనుక అక్కడ (కరవీరపురంలో) మీరుండటం నాకు బాగాలేదు. జరాసంధుని చంపగలిగే స్థానాన్ని చెపుతా విను. ఈ వేణానదిని ఈదుకొనిదాటి మరొక రాజు అధికారంలో ఉన్న యజ్ఞపర్వతం మీదికి వెళ్ళండి. అది సహ్యాపర్వతం యొక్క మరొక శిఖరమే. అక్కడ మాంసహారులు, దురాచారులైన దొంగలు నివసిస్తారు, ఆ ప్రదేశం పువ్వులతో కూడిన లతలచే అందంగా ఉంటుంది. అక్కడ ఒకరాత్రి గడిపి ఖట్వాంగమనే నదిని దాటి అక్కడ తపస్సుచేసే మునులను చూడవచ్చు.

తరువాత అందమైన క్రౌంచపురం చూద్దాం. అక్కడ మీ వంశంవాడు మహాకపి అనేవాడు అరణ్యావాసం చేసేవాడున్నాడు. అక్కడ ఒకరోజు ఉండి, రెండవరోజు ప్రొద్దున్న పవిత్రమైన అనడుహతీర్థం వెళ్దాం. తరువాత గోమంత పర్వతం చేరుతారు. మీరిద్దరూ ఆ పర్వతంమీద ఉదయాస్తమయ సమయాలలో, సూర్య చంద్ర నక్షత్రములతో శోభించే తరంగాలతో నిండిన సముద్రాన్నిచూచి సుఖంగా విహరించవచ్చు. అక్కడ యుద్ధమేర్పడితే జరాసంధుని తేలికగా జయించవచ్చు. అక్కడ యుద్ధంలో జరాసంధుడు శక్తిహీనుడవుతాడు. అక్కడ యుద్ధసమయంలో దివ్యాస్త్రాలు మీ వద్దకు వస్తాయి.

ఓ కృష్ణా! ఆ స్థానంలో ఘోరయుద్ధాలు జరుగుతాయని దేవతలు నిశ్చయించారు. దివ్యాయుధాలు అన్నీ అక్కడ కనిపిస్తాయి. అక్కడ శత్రువులు నీ విష్ణుస్వరూపాన్ని చూస్తారు. భూమి భారాన్ని తగ్గించటానికి రాజులతో ప్రథమ యుద్ధం ఇది. ఈ యుద్ధం తరువాత భారతసంగ్రామమే. కాబట్టి కృష్ణా! గోమంత మనే పర్వతానికి వెళ్ళు. జరాసంధునితో యుద్ధమందు విజయం నీకు దగ్గరలో ఉంది. అమృతంతో సమానమైన హోమధేనువు క్షీరమది. దీన్ని త్రాగి నేను చెప్పిన మార్గాన్నే వెళ్ళండి. మీకు శుభమగుగాక.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పరశురాముని మాటలు అను నలభైయవ అధ్యాయము

☆☆☆

# నలభై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణ బలరాములు గోమన్త పర్వతము నెక్కుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బలరామకృష్ణులు ఆవు యొక్క పాలనుత్రాగి బలంతో మదించినవారై పరశురామునితో సహా ప్రయాణమయ్యారు. పరశురాముడు చెప్పిన మార్గం ద్వారా వెళ్తూ మూడు అగ్నులవలె ఉన్నారు. మార్గానికి అలంకారంగా ఉండి వాళ్ళు గోమన్తపర్వతాన్ని చేరారు. ఆ పర్వతం అనేక లతా వృక్షాదులతో, పొదరిండ్లతో, దేవతలతో అతిమనోహరమై యున్నది. ఆ పర్వతం యొక్క ఉత్తర శిఖరాన్ని దేవతల వలె ఎక్కారు. అక్కడ నివాసస్థానం ఏర్పరచుకొన్న యాదవుల నిద్దరిని చూచి పరశురాముడు వాళ్ళ అభిప్రాయం తెలుసుకొనుటకు కృష్ణ! శూర్పారకపురానికి వెళ్తాను. మీ యిద్దరికీ రాక్షసులతో యుద్ధమందు నిరుత్సాహం ఏర్పడదు. మీతో కలిసివచ్చుటవల్ల నాకు సంతోషంగా ఉంది. మీకు యుద్ధ సమయంలో ఆయుధాలు వచ్చే చోటిదే.

గోవింద! జరాసంధుడితో యుద్ధానికి మూలకారణం భూమికి భారం తగ్గించటం. యుద్ధానికి తగిన కఠినరూపాన్ని ధరించు. అస్త్రబలంతో సిద్ధంగా ఉండు. యుద్ధభూమిలో గదాచక్రాది శస్త్రములు ధరించిననిన్ను చూచి యింద్రుడు కూడ ఓడిపోతాడనుకుంటాడు. గరుత్మంతునికి కూడ జండాగుర్తు ఉండటానికి ఆహ్వానం చెయ్యి.యుద్ధంచేసే రాజులు స్వర్గానికి ఎదురుగా ఉన్నారు. యుద్ధాన్ని కోరే రాజులు దుర్యోధనునికి వశులై ఉంటారు. రాజులందరు యుద్ధంలో మరణించటంవల్ల రాబోయే యే విధవతనాన్ని తలచుకొని భూమి కృశించిపోయి నీకై ఎదురుచూస్తూ ఉంది. ఓ కృష్ణా! యుద్ధానికి త్వరపడు రాక్షసవధకు ఆలస్యం చేయవద్దు. రాజులకు స్వర్గప్రాప్తి, దేవతలకు సుఖము కలిగించుము. నీచేత గౌరవింపబడితే అన్ని లోకాలు నన్ను సత్కరించినట్లే భావిస్తాను. ఓ మహాబాహు! కార్యసిద్ధికై వెళ్ళొస్తాను. రాజులతో యుద్ధమందు నన్ను తలచుకో అని పలికి పరశురాముడు శ్రీకృష్ణుని ఆశీర్వదించి తన కిష్టమైన దిక్కుకు వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుల బలరాములుగోమన్త పర్వతమెక్కుట అను నలభై ఒకటవ అధ్యాయము

☆☆☆

# నలభై రెండవ అధ్యాయము

## జరాసంధుడు గోమంతము పైకి వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! పరశురాముడు వెళ్ళిన తరువాత రామకృష్ణులిద్దరూ అందమైన గోమన్తశిఖరంమీద వనమాలతో కూడిన వక్షస్థలం కలవారై నీలపీతాంబరములు ధరించినవారై నల్లని తెల్లని శరీరములు గలవారై అక్కడ అందమైన వనములలో ఆసక్తితో సంచరిస్తున్నారు. సంకర్షణుడు ఒక్కడే పుష్పించిన కడిమివృక్షాలు గల ఆ పర్వతశిఖరంపై నీడగల ప్రదేశమందు కూర్చున్నాడు. అక్కడ పరిమళంతో కూడిన వాయువు వీచింది. మద్యం వాసనగల వాయువు ముక్కుకు సోకింది. ఆ వాసనచేత ఆశ కలిగి మద్యాన్ని వెతుకుతూ ఆ చెట్టును చూచాడు. వర్షాకాలంలో మేఘం కురిసిన నీరే చెట్టుతొర్రలో పడి మద్యమైంది. మనోహరమైన ఆ మద్యాన్ని మాటిమాటికి త్రాగుతూ మత్తెక్కినవాడయ్యాడు. మదించిన అతని కళ్ళు కొంచెం చలించాయి. శరీరం తూలుతోంది. కదంబవృక్షం తొర్రనుండి వచ్చినదగుటచే కాదంబం అనేపేరు మద్యానికి వచ్చింది.

అప్పుడు ముగ్గురు దేవతాస్త్రీలు సేవించటానికి వచ్చారు. రూపుదాల్చిన మద్యం చంద్రకాంతి పద్మాన్ని ధరించిన లక్ష్మి, నమస్కరిస్తూ బలరాముని సేవించారు. మద్యమనే స్త్రీ ప్రభూ! ఇప్పుడు త్వరగా రాక్షసుల మదమణచివెయ్యి. నేను మిక్కిలి ప్రియమైన భార్యను. మద్యాన్ని నీ యెదుట నిలబడి ఉన్నాను. మొదట అనంతుడనే రూపంతో పాతాళంలో నివసించేవాడివి. ఇప్పుడు నీవక్కడ లేకపోవుటచే పుణ్యం చేసుకొని స్త్రీవలె నిన్ను వెతుకుతూ పుష్పాలలో, పూల గుత్తులలో ఉన్నాను. నేను కడిమిచెట్టులో లీనమై దప్పికగొన్న నిన్ను వెతుకుతూ తండ్రియైన వరుణునిచే పంపబడి నీచేత అనుభవింపబడాలని కోరుతున్నాను. అనంతుడవైన నిన్ను ఎట్టి పరిస్థితులలోనూ విడిచిపెట్టను. నిన్ను వీడి లోకులను సేవించదలుచుకోలేదు అన్నది.

తరువాత కాంతి సంకర్షణుడివద్దకు వచ్చి కొంచెం జారుతున్న వస్త్రంతో చలించుచున్న కన్నులు కలదై నమస్కరిస్తూ ప్రేమతో జయజయ అని పలుకుతూ చిరునవ్వుతో నీవు చంద్రునికంటే గొప్పవాడవు, వెయ్యిశిరస్సులుగల నీపై ప్రేమ

కలిగి మదిరలాగానే వచ్చాను. అన్నది. లక్ష్మీదేవి బలరాముని వక్షస్థలమందలి మాలవలె స్వచ్ఛమైనది. పద్మంచేత పట్టుకొని సంకర్షణునితో ఇలా అన్నది.

రామా! స్త్రీలకు ఇష్టుడవైన నీవు మద్యంచే అలంకరింపబడ్డావు. కాన్తినైన నాతో కూడా కలిసి చంద్రునివలె ఉన్నావు. సూర్యునివంటి కాంతిగల నీ కిరీటాన్ని వజ్రాలు పొదిగిన కుండలాలను చెవికి అలంకారమైన పద్మాన్ని నల్లని పట్టువస్త్రాలను పెద్ద మధ్యమణిగల హారాన్ని తెచ్చాను. పురాతనభూషణములైన వీటిని స్వీకరించుము. అన్నది. బలరాముడు ఆ భూషణాలను ఆ స్త్రీలను స్వీకరించి శరత్కాలచంద్రునివలె ప్రకాశించాడు. మేఘంవంటి కాంతిగల కృష్ణునితో కలుసుకొని మిక్కిలి సంతోషాన్ని పొందాడు.

బలరామకృష్ణులు మాట్లాడుకొనుచుండగనే అనేకాలంకారములతో ప్రకాశిస్తూ వినతాపుత్రుడైన గరుత్మంతుడు వేగంగా అక్కడకు వచ్చాడు. పూర్వం భగవంతుడు క్షీరసముద్రంలో నిద్రిస్తున్నప్పుడు రాక్షసరాజు బలి విష్ణుమూర్తి కిరీటాన్ని దొంగిలించి తీసుకుపోయాడు. ఆ కిరీటంకోసం గరుడుడు వెయ్యిసంవత్సరాలు యుద్ధంచేసి విజయం పొందాడు. విష్ణుభగవానుని కిరీటం భుజంమీద పెట్టుకొని ఆకాశంలో ప్రయాణిస్తున్నాడు.

ఒక పర్వతశిఖరంమీద ఏదో పనిమీద మనుష్యరూపం ధరించి సంచరిస్తు న్నాడు. భగవంతుని మనస్సును తెలిసినట్టి గరుత్మంతుడు ఆకాశంనుండియే కిరీటాన్ని ఆయన తలపై విసిరాడు. అది భగవంతుని శిరస్సుపై వాలింది. దీనిచేత కృష్ణుని శోభ వృద్ధి చెందింది. కృష్ణుడు ఈ పని గరుత్మంతుడు చేసిందేనని తెలుసుకొన్నాడు.

అప్పుడు కృష్ణుడు మిక్కిలి సంతోషించి బలరామునితో ఆర్య! ఇప్పుడు పర్వతంమీదనే యుద్ధభూమి ఏర్పడనున్నది. ఇక దేవతల పని పూర్తికావటానికి ఆలస్యం లేదని తెలుస్తోంది. నేను సముద్రంలో పడుకొన్నప్పుడు బలి నా కిరీటాన్ని దొంగిలించాడు. అప్పుడు ఇంద్రుని రూపం ధరించి గరుత్మంతుడు సముద్రం మధ్య నుండి ఈ కిరీటాన్ని తెచ్చాడు. ఈ లక్షణాలను బట్టి జరాసంధుడు వచ్చాడని తెలుస్తోంది. అటుచూడు-విజయం కోరే రాజుల రథాలు జండాల చివరి భాగాలు తెల్లని గొడుగులు కనిపిస్తున్నాయి. ఆ రాజుల రథాల మీద ప్రకాశించే గొడుగుల పంక్తి మనవైపే వస్తున్నట్లు కనిపిస్తోంది.

జరాసంధుడు సరిగా తగిన సమయమంలో వచ్చాడు. యుద్ధభూమిలో సంప్రా ప్తించిన మొట్టమొదటి అతిధి అతడు. రా, మనం కూర్చుందాం. జరాసంధుడు వచ్చేదాకా యుద్ధం ప్రారంభంకాదు. అంతవరకు మనబలం విచారిద్దాం. ఇలా మాట్లాడుతు యుద్ధాన్ని కోరుతున్న కృష్ణుడు జరాసంధుని చంపే కోరికతో అతని సైన్యబలాన్ని చూచాడు. ఆ రాజులను చూచి తనలో అనుకున్నాడు.

ఆ రాజులందరూ యముని దర్శించటానికి సిద్ధంగా ఉన్నారు. భూమి బాధలేని దవుతుంది. స్వర్గం రాజులతో నిండుతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
జరాసంధుడు గోమంతము పైకి వచ్చుట అను నలభై రెండవ అధ్యాయము

☆☆☆

# నలభై మూడవ అధ్యాయము

## గోమన్తమును తగులబెట్టుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజులందరకూ రాజైన జరాసంధుడు సైన్యాలతోకూడిన రాజులు వెంబ డించగా గుర్రాలతో, రథాలతో, ఏనుగులతో, కాల్బలంతో కూడినవాడై యుద్ధానికి వచ్చాడు. సైన్యంతోకూడిన అతడు సముద్రంలా కనిపించాడు. సైన్యా లతో కూడిన రాజులు జరాసంధుడు ముందు నడువగా కొండను చుట్టుముట్టి ని లిచారు. రాత్రిగడిచిన పిమ్మట ఆ రాజులందరూ ఉత్సాహంతో కూడినవారై యుద్ధ మందాసక్తితో కొండనెక్కటానికి గుమికూడారు. కొండచరియలమీద అందరూ సమావేశమై యుద్ధమందాసక్తితో ఆలోచన చేయటం మొదలుపెట్టారు.

ఆ రాజుల సందడి, ధ్వని ప్రళయకాలంలో సముద్రాలఘోషవలె వినిపించింది. చిన్న తలపాగాలు ధరించిన ముసలివాళ్ళు రాజసమునసుసరించి ధ్వని చేయవద్దని హెచ్చరిస్తూ సంచరించారు. నిశ్శబ్దమైన అతని సైన్యము యొక్క రూపం చేపలు, సర్పాలులేని సముద్రంవలె ఉన్నది. అంతా నిశ్శబ్దమైన తర్వాత బృహస్పతివలె జరాసంధుడు మాట్లాడాడు.

రాజులయొక్క సైన్యాలు త్వరగా నడవాలి. ఈ పర్వతంఅంతటా సైన్య సమూహాలతో ముట్టడించాలి. రాతియంత్రాలు విసరదగిన ముద్గరములనే

ఆయుధాలు, ప్రాసములు, తోమరములు మొదలైన ఆయుధాలను యుద్ధం చేసే శూరులను సిద్ధం చెయ్యండి. సుత్తులతో, గడ్డపారలతో పర్వతాన్ని బ్రద్దలు చేయండి. యుద్ధపద్ధతులు తెలిసిన రాజులు దగ్గరలో దగ్గరలో ఉండాలి. ఈ వేళ మొదలుకొని పర్వతాన్ని ముట్టడించటం ప్రారంభించండి. వసుదేవపుత్రులైన వీరిద్దరినీ చంపేవరకూ ఈ పర్వతం ముట్టడించవలసిందే.

ఈ పర్వతాన్ని చిన్నాభిన్నంచేసి రెక్కలు తెగినపక్షినిగా చేయండి. ఆకాశం లో కూడా ఎక్కడో ఒకచోటు లేకుండునట్లుగా బాణాలవర్షం కురిపించండి. రాజులు నన్ననుసరించి కొండప్రదేశాలలో ఉండండి. శీఘ్రంగా కొండనెక్కండి. మద్ర, కళింగ, చేకితాన బాహ్లిక, కాశ్మీరరాజు మొదలగువాళ్ళు రెండవప్రక్కనుంచి పర్వతం ఎక్కండి. పౌరవ, వైష్ణుదా, వైదర్భ, సోమకులు మొదలగువారు ఉత్తరవైపు నుండి పర్వతం ఎక్కాలి. ఉలూకుడు, కైతనేయుడు మొదలగువాళ్ళు తూర్పుదిక్కు నుండి పర్వతాన్ని ముట్టడించాలి. నేను, దరదుడు, చేదిరాజు దక్షిణావైపునుండి ముట్టడి స్తాము. ఈ విధంగా సైన్యాలు పర్వతాన్ని, అన్నివైపుల నుండి ముట్టడించి పిడుగు పట్టు, భయం కలిగించాలి. అనేకవిధాలైన ఆయుధాలతో పర్వతాన్ని బ్రద్దలు చెయ్యాలి. రాజులందరూ కలిసి పర్వతాన్ని నేలమట్టం చెయ్యాలి.

రాజులందరూ జరాసంధుని ఈ శాసనాన్ని అనుసరించి గోమంతపర్వతాన్ని సముద్రం భూమిని ఆక్రమించినట్లు ఆక్రమించి ముట్టడించారు. చేదిరాజు నడుచు టకు శక్యంకాని యీ గోమన్తపర్వతంమీద నీకు యుద్ధమెందుకు? ఎండుకర్రలు, గడ్డి కొండచుట్టూ పెట్టి మంటపెట్టండి, సుకుమారులైన రాజులు బాణాయుద్ధంలో నేర్పు గలవారు కాని కొండనెక్కదగినవారు కారు. నేడే కొండ తగలబెట్టండి. మరొక పనివద్దు. కాల్బలముకొండదుర్గముందు యుద్ధానికి అజ్ఞాపించబడి యున్నారు. పర్వతంమీద ఉన్నవాళ్ళు అన్నం, నీళ్ళు దొరకక పడి చస్తారు. మనం చాలామంది ఉన్నామనుకోవద్దు. ఆ యాదవులిద్దరూ తేలికగా చూడదగిన వాళ్ళు కారు. వాళ్ళ బలం మనకు తెలియదు. దేవతలతో సమానమైనబలం కలవాళ్ళు అని వింటున్నాం. పర్వతానికి నిప్పంటిస్తే తగలబడిపోతారు. ఒకవేళ తప్పుకొనివస్తే అందరం కలిసి పడగొడదాం, దాంతో మరణిస్తారు.

ఈ మాటలు సైన్యంతోకూడిన రాజులకు ఇష్టమైనాయి. పర్వతం నలు మూలల నిప్పంటించారు. గాలికి అగ్ని మరింత ప్రజ్వలించి అంతటా వ్యాపించింది. కొండ కాలిపోయి రాళ్ళు జారిపడ్డాయి. ఉడికిపోతున్న ధాతువులచేత మండుతున్న

చెట్లచేత భయపడిన క్రూరమృగాలచేత పర్వతం పెద్దగా ధ్వనించింది. ప్రళయ కాలాగ్నిలా విజృంభించి ఆ మంటలు పర్వతాన్ని తగలబెట్టాయి. పక్షులు, మృగాలు పారిపోయాయి. ఆ కొండ మంటలచేత భస్మమైంది. సర్పాలు తగలబడ్డాయి. క్షత్రియులు ఆ కొండను తగలబెట్టి మంటలవేడికి తట్టుకోలేక అరక్రోసు దూరం వెళ్ళిపోయారు.

ఇదంతా చూచి బలరాముడు కృష్ణునితో మన యిద్దరి కొరకు కొండను తగలబెట్టుట మంచిపనికాదు. ఈ పర్వతం ఋణం తీర్చుకోటానికి చేతులతో యుద్ధంచేద్దాం. ఈ క్షత్రియులు కొండను తగులబెట్టి యుద్ధం చేయగోరినవారై రథాలపై కూర్చొని ఉన్నారు.

ఇలా పలికి కొండశిఖరం నుండి వనమాలతో అలంకరింపబడిన బలరాముడు క్రిందికి దూకాడు. ఆ రాజుల మధ్య నిలిచాడు. శ్రీకృష్ణుడు బలరాముడు దూకగానే తన పాదాలతో పర్వతాన్ని అణచివేశాడు. శ్రీకృష్ణుని పాదంనుండి పుట్టిన జలధారలు అగ్నిని ఆర్పివేశాయి. తరువాత శ్రీకృష్ణుడు కూడా దూకాడు. ఆ పర్వతం నుండి పుట్టిన జలధారలు అంతనీ ముంచి వేస్తుంటే జరాసంధుని తోటిరాజులు భయ పడ్డారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
గోమన్తమును తగులబెట్టుట యనే నలభై మూడవ అధ్యాయము

☆☆☆

# నలభై నాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు కరవీరపురానికి వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! పర్వతంమీదినుండి క్రిందికి దిగిన వసుదేవపుత్రులను చూచి రాజసమూహం ఆశ్చర్యపడింది. గుర్రాలు, ఏనుగులూ, రథాలు కదలలేదు. రామకృష్ణులు చేతులతోనే యుద్ధం చేయదలచి యుద్ధభూమిలో సంచరిస్తున్నారు. యుద్ధరంగంలో దిగగానే వాళ్ళిద్దరికీ ఆయుధాలు గుర్తొచ్చాయి. మధురానగర యుద్ధంలో చేతులలోకి వచ్చిన ఆయుధాలు మళ్ళీ ఈ సమయంలో కూడా రాజుల అందరి యెదుట ఆకాశం నుండి ఇద్దరి ముందుకు వచ్చాయి.

మండుతున్న అగ్నివంటి ఆయుధాలు సర్పాల ఆకారంగల ఆయుధాలు రాజుల మాంసాన్ని తినటం కొరకు ఎదురుచూస్తున్నాయి. పచ్చిమాంసం తినే పశువులు వాటివెనుక నడుస్తున్నాయి. మిక్కిలి ప్రకాశిస్తున్న ఆ అస్త్రాలు దివ్యములైన పూల దండలను ధరిస్తూ భయం కలిగిస్తున్నాయి. సంవర్తకమనే నాగలి, సౌనందమనే రోకలి, సుదర్శమనే చక్రము, కామోదకమనే గద, ఈ నాలుగు దివ్యాయుధాలు యుద్ధభూమిలో వాళ్ళిద్దరి దగ్గరకు వచ్చాయి.

బలరాముడు పాకుతున్న సర్పంలాంటి దివ్యమైన పుష్పమాలతోకూడిన నాగలిని మొదట పట్టుకొన్నాడు. తరువాత రెండవ ఎడమచేతితో శ్రేష్ఠమైన రోకలి అనే ఆయుధాన్ని పట్టుకొన్నాడు. కేశవుడు సూర్యునివంటి కాంతిగల చక్రమును పట్టుకొన్నాడు. అందమై మేఘమువలె ధ్వనిచేయు శార్ఙ్గమనే ధనుస్సును సంతోషంతో పట్టుకున్నాడు. కామోదకి అనే గదను మరొకచేత ధరించాడు. సాక్షాత్తు విష్ణు స్వరూపులైన వాళ్ళిద్దరూ ఆయుధాల్ని ధరించి శత్రువులతో యుద్ధంచేశారు.

బలరాముడు సర్పంవంటి నాగలిని ఎత్తి యుద్ధరంగంలో శత్రువులకు యమ ధర్మరాజుగా సంచరించాడు. క్షత్రియుల రథాలని లాగివేస్తూ, ఏనుగులను ఎత్తిపడవేస్తూ, నాగలితో బలరాముడు యుద్ధభూమిలో సంచరించాడు. బలరాముని బాధకు తట్టుకోనలేక రాజులు భయపడి జరాసంధుని వద్దకు చేరారు. జరాసంధుడు భయపడినవారిని నిందిస్తూ శీఘ్రంగా ముందుకు నడవండి అని ప్రోత్సాహిస్తూ రామకృష్ణులను హతమారుస్తానని గర్వంతో మాట్లాడాడు. అప్పుడు క్షత్రియు లందరూ మళ్ళీ బాణాలను వర్షిస్తూ యుద్ధానికి పూనుకొన్నారు.

రథములపై నున్న రాజులు ఛత్రచామరాలతో ప్రకాశిస్తున్నారు. వసుదేవ పుత్రులు అటూఇటూ పరుగిడుతూ యుద్ధం చేయగోరుతూ కనిపించారు. అనేక విధాలైన ఆయుధాలతో పీడించినా బలరామకృష్ణులు చలించలేదు. మేఘంవంటి ఆకారంగల శ్రీకృష్ణుడు సూర్యునివలె ప్రకాశించు చక్రంతో మనుష్యులను, ఏనుగు లను, గుర్రాలను, గొప్ప రథాలను ఛేదించాడు. గదచే కొట్టబడి, నాగటిచే లాగబడి రాజులు యుద్ధరంగంలో నిలువలేకపోయారు.

చక్రాయుధంచేత విరగకొట్టబడిన రాజులయొక్క రథసమూహాలు యుద్ధ రంగంలో మూలబడ్డాయి, నాగలిచే లాగటంచేత ఏనుగులు దంతాలు విరిగి పెద్దగా

ధ్వనిచేశాయి. రాజుల శరీరరక్తంతో రణరంగం తడిసిపోయింది. చనిపోయిన ఏనుగులచేత, గుర్రాలచేత భూమి కప్పబడింది. ప్రళయకాల సూర్యునివంటి చక్రాన్నీ, గదనీ ధరించి శ్రీకృష్ణుడు రాజులతో ఓ శూరులారా! వెళ్ళిపోతారేమి? నేను, మా అన్నయ్యా కాలినడకన మీ యెదుట ఉన్నాము. మీకు రక్షకుడైన జరా సంధుడు రాడేమి? అని పలకగా పరాక్రమవంతుడైన దరదుడు నాగలి పట్టుకొని ఉన్న బలరాముని ఎదుర్కొన్నాడు. బలరాముడు వానిని నాగలితో లాగి రోకలితో కొట్టి చంపాడు. దరదుడు మరణించిన తరువాత జరాసంధుడు రాముడితో తలపడ్డాడు.

ఇద్దరూ గదలు పట్టుకొని భూమిని కంపింపచేస్తూ యుద్ధం చేశారు. ఆ యుద్ధం చూస్తూ తక్కినవాళ్ళు యుద్ధం మానేశారు. మదపుటేనుగులు పోరాడినట్లు వాళ్ళ యుద్ధం ఆకర్షించింది. దేవతలు, గంధర్వులు, యక్షులు, సిద్ధులు, ఋషులు, అప్సరసలు ఆ యుద్ధం చూడటానికి వచ్చారు. జరాసంధుడు ఎడమనుండి బల దేవుడు కుడినుండి మండలంగా తిరుగుతూ యుద్ధం చేశారు. ఒకరినొకరు కొట్టు కొన్నారు. ఆ చప్పుడు పదిదిక్కులకూ వ్యాపించింది. బలరాముని గదదెబ్బ పిడుగు పడినట్లుండగా జరాసంధుడి గదచప్పుడు పగిలిపోతున్న పర్వతంధ్వనిలా ఉంది. జరాసంధుని గదదెబ్బకు బలరాముడు కదలలేదు. బలరాముని గదదెబ్బను జరా సంధుడు ధైర్యంతోను శిక్షణవల్లనూ సహించగలిగాడు.

అపుడాకాశవాణి బలదేవా యితడు నీచేతిలో చావడు. శ్రమపడకు అని విని పించింది. త్వరలోనే జరాసంధుడు మరణిస్తాడు. జరాసంధుడా మాటవిని దుఃఖపడ్డాడు. తరువాత బలరాముడు జరాసంధుని కొట్టలేదు. వాళ్ళిద్దరూ వృష్ణి వంశీ యరాజులు యుద్ధం మానివేశారు. ఇట్లు జరాసంధుడు ఓడిపోగా సైన్యం చెల్లా చెదురైంది. రాజులందరూ పెద్దపులిని చూచిన మృగాలవలె భయపడి పారి పోయారు. చేదిరాజు యాదవులతో తనకుగల సంబంధాన్ని తలచి కరూషచేది దేశపు సైన్యాలతో కృష్ణుని వద్దకు వెళ్ళి ఓ యాదవకుమారా! నేను నీకు మేనత్త భర్తను. ఇందుచే నాకు మిక్కిలి ప్రేమపాత్రుడవు. ఈ కారణంచేత సేనతోపాటు నీ వద్దకు వచ్చాను. అల్పబుద్ధి అయిన జరాసంధుడికి ఓరి దుర్బుద్ధీ కృష్ణునితో యుద్ధం మానుకో అని చెప్పాను. అతడు నా మాటను తిరస్కరించాడు, కాబట్టి అతన్ని విడిచిపెట్టాను. యుద్ధంలో ఓడిపోయి తన పరివారంతో భయపడి పారిపోయాడు.

ఎప్పుడో మళ్ళీ నీకు (భయం) చెడు కలిగిస్తాడు. చచ్చిపోయిన మనుష్యులతో నిండిన ఈ ప్రదేశాన్ని ఇప్పుడు విడిచిపెట్టు. ఓ కృష్ణా! సైన్యంతో కరవీరపురంల వెళ్దాం. శృగాలుని, వాసుదేవుని కలుసుకుందాం. ఈ రెండు శ్రేష్టమైన రథాలు. మీ యిద్దరికోసం నేను చేయించాను. గుఱ్రాలను కట్టారు. బలదేవునితోపాటు ఎక్కు. నీకు శుభమగుగాక.

కరవీరపురమందున్న రాజు వద్దకు త్వరగా వెళ్దాం. చేదిరాజు మాటవిని సంతోషంతో కృష్ణుడు యుద్ధంచేత తపించిపోతున్న మాకు బంధువైన నీ మాటలు వర్షధార వలె సుఖం కలిగించాయి. మేలు కలిగించే తియ్యనిమాట చెప్పేవాళ్ళు లోకంలో అరుదు. చేదిరాజా! నీ దర్శనంవల్ల అండగలవాళ్ళమయ్యాం. నీవంటి బంధువుండగా మాకు పొందరానిదిలేదు. నీయొక్క సహాయంతో జరాసంధుని, అతనితో సమానులైన ఇతరరాజులను చంపుటకు మేము సమర్థులము. రాజు లందరిలో నీవే మొదటి బంధువు. చేదిరాజా! నీవిప్పుడు అనేక విధాలైన యుద్ధాలను చూడగలవు. ఇకముందు మాయొక్క చక్రగదాయుద్ధాలను బ్రతికి ఉన్న రాజులు చెప్పుకుంటారు. గోమన్తపర్వతమందలి యుద్ధంలో రాజుల ఓటమిని వినటంచేత, జ్ఞాపకముంచుకొనుటచేతనూ స్వర్గలోకమును పొందుతారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు కరవీరపురానికి వెళ్ళుట అను నలభై నాలుగవ అధ్యాయము

☆☆☆

# నలభై ఐదవ అధ్యాయము

## శృగాలరాజు వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజేంద్రా! యుద్ధంకోసం మదించిఉన్న శృగాలుడు వీళ్ళు ముగ్గురూ వచ్చినట్లు విని పట్టణాన్ని ముట్టడించటానికని మనస్సులో తలచి, యుద్ధానికి బయల్దేరి వచ్చాడు. అతని రథం సూర్యునివంటి కాంతిగలది. పక్షివలె త్వరగా వెళ్ళునదియు, శృగాలుడు సూర్యుని ఆరాధించి అతని నుండి ఈ రథాన్ని పొందాడు. అనేకములైన భూషణములను అలంకరించుకొని అనేక యుద్ధపరికరములతో శ్రీకృష్ణుని ఎదిరించాడు. మిడత అగ్ని పైకి ఉరికినట్లు కృష్ణ బలరాము

లతో యుద్ధానికి వచ్చాడు. అతని అరపులకు రథంధ్వనికీ బరువుకు భూమి వంగిపోతూ భయంతో కంపించింది.

పర్వతంలాగా వస్తున్న లోకపాలకుని వంటి సృగాలునిచూచి కృష్ణుడు చలించ లేదు. శృగాలుడు త్వరగావెళ్ళే రథంతో వాసుదేవుని సమీపించాడు. శ్రీకృష్ణుడు చిరునవ్వుతో యుద్ధం చేయగోరువాడుగా కనిపించాడు. వాళ్ళిద్దరికీ ఘోరమైన యుద్ధం జరిగింది. రెండు మదపుటేనుగులు దెబ్బలాడినట్లున్నది వాళ్ళ యుద్ధం. ఓ కృష్ణా! గోమన్తపర్వతం మీద యుద్ధసమయంలో నీవు చేసినపని నాకు తెలుసు, ఆ సమయంలో సేనాపతులుగా ఉన్నవాళ్ళు అసమర్థులు, తగినవాళ్ళుకారు. ఆ బలహీనమైన సైన్యాన్ని మీరు ఓడించగలిగారు. ఇప్పుడు నేనే రాజును, సేనా నాయకుడనై మీ మీదికి వచ్చాను. ఇప్పుడు నానుండి బ్రతికి ఎక్కడకుపోతారు? మీకు యుద్ధంలో సరైన నేర్పులేదు. నేను నా సేనను వెంట బెట్టుకొని యుద్ధం చేయ గోరుట లేదు. నేను నీవు ఒంటరిగానే యుద్ధంచేద్దాం. నీవుచస్తే నేనిక్కడనే వాసుదేవుణ్ణి, అట్లే నేనుచస్తే నీవిక్కడినే వాసుదేవుడివి.

శృగాలుని మాటలువిని కృష్ణుడు యుద్ధం చెయ్యి అని తాను చక్రం పట్టు కొన్నాడు. శృగాలుడు అనేక ఘోరములైన అస్త్రాలను కృష్ణునిపై ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు పర్వతంలాగా కదలలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు మదించి బలవంతుడైన శృగాలునిమీద చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అది అతన్నిచంపి మరల శ్రీకృష్ణుని చేతియందు చేరింది. శృగాలుడు హృదయం బ్రద్దలై మరణించి నేలకూలాడు. అతని సైన్యము దుఃఖపడింది. కొందరు నగరంలో ప్రవేశించి దుఃఖించారు.

శ్రీకృష్ణుడు మేఘగంభీర ధ్వనితో అక్కడి జనులకు అభయమిచ్చాడు. ఈ పాపాత్ముని కారణంగా బాధ కలుగచేయని ప్రజలను నేను చంపను. ఇది శూరుల నియమం కాదు. అని పలికాడు. మంత్రులు, ప్రజలు దుఃఖించారు. అతని భార్యలు, పుత్రులు మరణించిన సృగాలుని చూచి రొమ్ము బాదుకొని దుఃఖించారు. శక్రదేవుడనే అతని పుత్రుని చూపించి ఈతడు నీవు లేకుండా నీస్థానంలో నిలబడ గలడు? నీవల్ల పొందే సౌఖ్యాలు తృప్తితీరలేదు అని భార్య దుఃఖపడ్డది. అతని పట్టపురాణి పద్మావతి దుఃఖిస్తూ పుత్రుని వాసుదేవుని దగ్గరకు తెచ్చి ఓ వీరుడా! నీవు చంపినవాని పుత్రుడు, నిన్ను శరణువేడుచున్నాడు. ఈతనిని నీవు రక్షించు అన్నది.

ఆమె మాటలు విని కృష్ణుడు ఓ రాజపత్నీ! ఈ దుర్మార్గునితోటే రోషం పోయింది. మేము మామూలు స్థితిలో ఉన్నాము. దేవి! నేను బంధువును, దేవి నీ మంచిమాటలచే నా రోషం శాంతించింది. శృగాలుని పుత్రుడు నా పుత్రుడే. ఇతనికి అభయమిచ్చి పట్టాభిషేకం చేస్తాను. మంత్రులను, పురోహితుని, ప్రజలను పిలవండి. తాత తండ్రులనుండి వచ్చే రాజ్యం నీ కుమారునికి సంక్రమిస్తుంది.

తరువాత ప్రజలు, మంత్రులు, పురోహితుడు రామకృష్ణుల వద్దకు వచ్చారు. పరాక్రమశాలి శ్రీకృష్ణుడు ఆ రాజు పిల్లవానిని సింహాసనంపై కూర్చోనబెట్టి పట్టాభిషేకము చేశాడు. తరువాత వెంటనే ప్రయాణమయ్యాడు. శక్రదేవుడు తల్లితో, మంత్రులతో కూడి శృగాలుని శవపేటికలో పెట్టి పడమరదిక్కుగా దూర ప్రదేశానికి తీసుకువెళ్ళి పరలోకకర్మను నేవేర్చాడు. తర్పణాలు చేశాడు. ఈ విధంగా కర్మచేసి దుఃఖంతో నగరానికి తిరిగివచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శృగాలరాజ వధయనే నలభై ఐదవ అధ్యాయము

☆☆☆

# నలభై ఆరవ అధ్యాయము

## బలరామకృష్ణులు తిరిగి వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణబలరాములు చేది రాజైన దమఘోషునితో ఆరురోజుల్లో మధుర సమీపానికి వెళ్ళారు. రాజు దమఘోషుడు కూడా ఉండటంచేత సంతోషంతో ఐదురాత్రులూ ఒకరాత్రిగా గడిచాయి. వీళ్ళు మధుర వద్దకు వచ్చారని విని ఉగ్రసేనుడు మొదలైన యాదవులు మిక్కిలి సంతోషించి సేనతోపాటు వాళ్ళను ఆహ్వానించటానికి వెళ్ళారు. అన్ని వర్గాలవాళ్ళు స్త్రీ బాల వృద్ధులూ వాళ్ళకు స్వాగతం పలకటానికి వెళ్ళారు.

నాలుగుప్రక్కల ఆనందదాయకమైన వాద్యాలు వాయించారు. స్తోత్ర పాఠకులు వాళ్ళను స్తుతిస్తున్నారు. మధురానగరమంతా జండాలతో, పూలదండలతో అలంకరింపబడింది. ప్రజల ఆనందానికి హద్దు లేదు. గాయకులు మధురంగా పాడారు. ఓ యాదవులారా! శ్రీకృష్ణబలరాములు మధురకు వచ్చారు. ఇకమీరు

నిర్భయంగా పరమానందంగా ఈ పట్టణంలో నివసించండి. అని పలికి ఆశీర్వాదంతోకూడిన ఒక పాటను పాడారు.

ఆ సోదరులిద్దరూ వచ్చిన తరువాత పట్టణంలో దీనుడుగాని, మలినుడుగాని లేడు. పక్షులు మధురంగా కూస్తున్నాయి. ఆవులు, గుర్రాలు, ఏనుగులు సంతోషంతో ఉన్నాయి. స్త్రీపురుషులు మనస్సులో సుఖాన్ని పొందారు, గాలులు దుమ్ము లేకుండా వీచాయి. దిక్కులు నిర్మలం అయ్యాయి. ఆ యిద్దరిరాక వలన కృతయుగంలో ప్రవర్తన ప్రజలలో కనిపించింది. తరువాత పవిత్రమైన సమయంలో శ్రీకృష్ణ బలరాములు రథమెక్కి మధురాపురంలో యాదవుల ననుసరించి, వాళ్ళ వెనుక మెల్లమెల్లగా నడిచారు. సంతోషంతో తమ తండ్రి భవనంలో ప్రవేశించారు రామకృష్ణులు.

అక్కడ ఆయుధాల్ని వాటిస్థానంలో ఉంచి అన్నదములిద్దరూ ఆనందించారు. తరువాత వసుదేవునికి, ఉగ్రసేనునికి నమస్కరించారు. అక్కడివారందరూ మెచ్చుకొనుచుండగా తల్లియైన దేవకి ఇంటికి వెళ్ళారు. ఉగ్రసేనుడికి అనుకూలంగా సోదరులిద్దరూ కొన్నిరోజులు మధురలో ఉంటూ ఆనందించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
బలరామకృష్ణులు తిరిగివచ్చుట అనే నలభై ఆరవ అధ్యాయము

☆☆☆

# నలభై ఏడవ అధ్యాయము

## బలరాముడు యమునను లాగుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కొద్దిరోజుల తరువాత పూర్వపు స్నేహం గుర్తొచ్చి కృష్ణునితో చెప్పి తానొక్కడే వ్రజానికి వెళ్ళాడు. పూర్వం తాము విహరించిన అందమైన పరిమళంతో కూడిన సరస్సులు విశాలవనములు ఒక్కొక్కటి మార్గంలో కనిపించాయి. అతడు త్వరగా వ్రజంలో ప్రవేశించి అరణ్యసంబంధమైన వేషంతో అలంకరించుకొని అచటి గోపాలకులతో ప్రేమగా పూర్వంలాగా మాట్లాడాడు. పూర్వంలాగే గోపికలతో మధురములైన సంభాషణలు చేశాడు. పెద్దలైన గోపాలకులను వాళ్ళ వయస్సులనుబట్టి సంతోషం కలుగుమాటలు పలికాడు.

పెద్దలైన గోపాలకులు చాలాకాలమునకు వచ్చినవాడు, అందరినీ ఆనందిం పజేయువాడును అయిన బలరామునకు స్వాగతం చెప్పారు. ఇప్పుడు నిన్ను చూచి సంతోషిస్తున్నాము. నీవిక్కడికి తిరిగిరావడం మాకందరికీ చాలా ఆనందం కలిగిం చింది. నీవు లోకంలో శత్రువులకు భయంకరుడుగా ప్రసిద్ధిపొందావు. ఓ యాదవ కుమారా! యాదవులను ఆనందింపచేయువాడా! నీవు మాకు అభివృద్ధి కలుగ చేయాలి. ప్రాణులకు పుట్టినచోటు సంతోషం కలిగిస్తుంది కదా! ఈనాడు మేము దేవతలకు కూడ గౌరవింపదగినవారమయ్యాం. నీరాకను కోరుతూ నిన్నుచూచిన మల్లులు, కంసుడు చంపబడ్డారు.

జనులు ఉగ్రసేనుడికి పట్టాభిషేకం చేశారు. నీవు సముద్రంలో 'తిమి' రూపంలో ఉన్న రాక్షసునితో యుద్ధంచేయుట, గోమంత పర్వతంమీద క్షత్రియు లతో యుద్ధము చేయుట, పంచజనుని చంపుట, జరా సంధునితో యుద్ధం చేయుట, దరదుని వధించుట, సృగాలునిచంపుట, అతని పుత్రునికి పట్టాభిషేకం చేయుట, పౌరులను ఊరడించుట, మధురలో ప్రవేశించుట, అన్నీ విన్నాం. దేవతలచే పొగడతగినవాడవు, భూమి ప్రశాంతమైంది. రాజులు వశులైయారు. నీరాకను చూచి వెనుకటిలా భాగ్యవంతులమయ్యాము రామా! మేము, మా బంధువులు సంతోషిస్తున్నాము అని పలికారు.

అప్పుడు బలరాముడు రెండుప్రక్కల నిలబడినవారితో యాదవులందరిలో మీరు నాకు బంధువులు. మా బాల్యం ఇక్కడే గడిచింది. మీరు మమ్మల్ని పెంచారు. మనస్సులో మాకు మార్పు ఎలా కలుగుతుంది. మీ యిళ్ళలో భోజనం చేశాం, ఆవుల్ని రక్షించాం, మాకు మీరు బంధువులు, మాపై ప్రేమాతిశయం కలవారు మీరు. బలరాముడీవిధంగా గోపాలకుల మధ్య యదార్థం మాట్లాడుచుండగా వ్రజ కాంతలు సంతోషంతో కూడిన ముఖాలు కలవారయ్యారు.

తరువాత బలరాముడు వనవిహారం చేశాడు. ఈ సమయంలో దేశకాల ములు తెలిసిన గోపాలకులు బలరామునకు మద్యం తెచ్చి యిచ్చారు. బంధువు లతో కూడిన బలరాముడు మద్యపానం చేశాడు. తరువాత అడవిలోని అనేక విధాలైన పువ్వులను, పండ్లను, ఇష్టమైన పిండివంటలను తెచ్చిపెట్టారు. చక్కని జుట్టు, ఒకచెవికి మాత్రమే వ్రేలాడే కుండలము, చందనము, పుష్పమాలలు ధరించి తెల్లని శరీరంపై నల్లనివస్త్రాలు కట్టుకొని భుజంమీద నాగలితో మదించినవాడై శోభ కలిగి ఉన్నాడు.

అతడు ఓ మహానదీ! స్నానం చేయాలనుకుంటున్నాను, నా వద్దకు రా అని యమునను పిలిచాడు. ఆ నదిమత్తులో ఉండి మాట్లాడే అతని పలుకు లెక్కచేయక అతని వద్దకు రాలేదు. అప్పుడతడు కోపించి నాగలిని వంచి యమునను లాగాడు. ఆ నది నాగలి చూపించిన మార్గముననుసరించి వేగంగా ప్రవహిస్తూ వ్యాకులమైంది. బృందావనంలో ప్రవేశించి స్త్రీరూపాన్ని ధరించి బలదేవుని వద్దకు వెళ్ళి ఓ ప్రభూ! మీరు నాపై ప్రసన్నత చూపండి. వెనుకటి పద్ధతికి వ్యతిరేకంగా నడుచుటకు భయపడ్డాను. నేను శిరస్సుతో నీ పాదాలకు నమస్కరిస్తున్నా. నాకు వెళ్ళవలసిన మార్గం చెప్పు అని పలికింది. బలరాముడు యమునతో ఇలా అన్నాడు.

నాగలి చూపినమార్గంగా యీ ప్రదేశాన్నంతనీ నీటితో తడుపుము, శాంతించుము. సుఖంగా వెళ్ళిరా. లోకమున్నంతవరకూ నీ కీర్తి ఉండుగాక. వ్రజ వాసులు యమునను లాగటంచూచి బాగు బాగని రామునికి నమస్కారం చేశారు. ఆ నదిని వ్రజవాసులను వదలి బలదేవుడు మరల మధురానగరానికి తిరిగివెళ్ళాడు. అక్కడ ఇంట్లో శ్రీకృష్ణుని చూచాడు.

బాటసారి వేషంతో క్రొత్త వనమాల ధరించి త్వరగా వస్తున్న నాగలిని ధరించి యున్న బలరాముని చూచి వెంటనే లేచి కృష్ణుడు ఆయనకు ఆసనమును ఇచ్చాడు. సుఖంగా కూర్చున్న బలరాముని వ్రజవాసుల క్షేమమడిగాడు. తరువాత వాళ్ళ యిద్దరికీ విచిత్రములైన సంభాషణలు వసుదేవుని యెదుట జరిగాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
బలరాముడు యమునను లాగుట అను నలభై ఏడవ అధ్యాయము

☆☆☆

# నలభై ఎనిమిదవ అధ్యాయము

## రుక్మిణీ స్వయంవరమునకు సిద్ధమగుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత గూఢచారులు దిక్పాలకులవంటివాళ్ళు శ్రీకృష్ణుని యింటికి వచ్చారు. వాళ్ళు విరోధపు సమాచారాన్ని విన్నారు. ఆ సమయంలోనే యితర యాదవులుకూడ మెల్లగా కృష్ణుని సభలో ప్రవేశించారు. వాళ్ళందరూవచ్చాక గూఢచారులు రాజ్యనాశం గూర్చి కారణాలు చెపుతూ ఇలా అన్నారు.

ఓ జనార్ధన! విదర్భనగరంలో దక్షిణదేశపు రాజుల గొప్ప సమ్మేళనమొకటి జరుగబోతోంది. భోజరాజ కుమారుడైన రుక్మియొక్క ఆహ్వానం అనుసరించి అనేకదేశాల రాజులు ఉత్సాహంతో అక్కడకు వెళ్తున్నారు. జనులనుండి నేనిలా విన్నాను.

రుక్మికి రుక్మిణి అనే ఒకసోదరి ఉంది. ఆమె స్వయంవరం జరుగనున్నది. తమతమ సేనలను వెంటబెట్టుకొని త్వరగా అక్కడకు వెళ్తున్నారు. ఓ జనార్దనా! ఇవేళ నుండి ముప్పైయవరోజున, బంగారు ఆభరణాలను ధరించి త్రిలోకసుందరి యైన ఆ కన్య స్వయంవరం జరుగుతుంది. కనుక మేమందరం అక్కడకు వెళ్తాం. అక్కడ ఏనుగులు, గుర్రాలు, రథాలు ఎక్కివచ్చే మహాత్ములయొక్క లక్షలకొలది శిబిరాలను చూస్తాం. సింహాలు, పెద్దపులులవంటి పరాక్రమవంతులు యుద్ధమందు ఆసక్తి కలవాళ్ళు, ఈర్ష్యతోకూడిన రాజులు విజయం పొందటానికి విస్తారమైన సైన్యంతో వెళ్తున్నారు. వాళ్ళందరూ  వెళ్ళాక మేము వంటరిగా వెళ్తాం. కాబట్టి మేము కూడా అక్కడికి తప్పక వెళ్తాం.

దూతనుండి వచ్చిన మాటలు, శ్రీకృష్ణుని హృదయం ముళ్ళులాగా గుచ్చు కొన్నాయి. యాదవులు యుద్ధమందు ఆసక్తి కలవారై గర్వంతో దేవతల వలె రథాలపై బయల్దేరారు. శ్రీకృష్ణుడు చక్రమును, గదను ధరించి ప్రకాశించాడు. శ్రీకృష్ణుని అనుసరించే యితర యాదవులు రథాలనెక్కారు. శ్రీకృష్ణుడు ఉగ్రసేనునితో నా అన్నయు, నీవు ఇక్కడ ఉండండి, పట్టణంలో ఎవ్వరూలేరని అవకాశం చూచుకొని పట్టణాన్ని ఆక్రమించటానికి జరాసంధుని మిత్రులు రావచ్చు. అన్నాడు.

భోజరాజు, ఉగ్రసేనుడు, శ్రీకృష్ణుని మాటలువిని శత్రువుల వశింపచేయుశక్తి కలవాడా! నీవు లేకపోతే మేము సుఖంగా ఉండలేము. నీ సహాయంవలన మేము దేవేంద్రునితో కలిసి వచ్చినా రాజుల్ని చూచి భయపడము, నీతో మమ్ములను తీసుకొనిపొమ్ము అన్నాడు. ఆ మాటలు విని కృష్ణుడు నవ్వుతూ నీయిష్టప్రకారమే చేస్తాను అని పలికి రథంమీద వెళ్ళిపోయాడు. సూర్యుడస్తమిస్తుండగా భీష్మక మహారాజు ఇల్లు చేరాడు.

అక్కడ రాజుల శిబిరాలతో భూమి నిండి ఉంది. సభాస్థలం చాలా విశాల మైనది. ఇదంతా చూచి రాజురూపాన్ని ధరించినవాడై గుమికూడిన రాజుల మధ్యలో

సంచరించటానికి శ్రీకృష్ణుడు గరుత్మంతుని తలచుకొన్నాడు. తలచినంతనే గరుత్మంతుడు కేశవుని వద్దకు వచ్చాడు. గరుత్మంతునికి స్వాగతంచెప్పి గోవిందుడు కైశికుని ఇంటికి పదమన్నాడు. మనం అక్కడకెవెళ్ళి స్వయంవరసమయాన్ని ఎదురు చూస్తూ ఉందాం. వచ్చిన రాజులను చూద్దాం. అని గరుడునకు చెప్పి కైశికుని పట్టణానికి వెళ్ళాడు.

శ్రీకృష్ణుడు విదర్భనగరం రాగానే యాదవులందరూ అతని నివాసానికి ఏర్పాటు చేశారు. రాజనీతిశాస్త్రవేత్త అయిన కైశికుడు సంతోషంతో శ్రీకృష్ణుని సత్కరించి తన పట్టణంలోకి తీసుకువెళ్ళాడు. ఇంతకుముందే కృష్ణునికొరకు దివ్యమైన భవనం నిర్మింపబడింది. కృష్ణుడాభవనంలో తన సేనతో ప్రవేశించాడు. అన్నపానాదులతో, రత్నాలతోనూ, పూజింపబడినవాడై కృష్ణుడు ఆ రాజభవనంలో సుఖంగా ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
రుక్మిణీ స్వయంవరమునకు సిద్ధమగుట అను నలభై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# నలభై తొమ్మిదవ అధ్యాయము

## సునీథుని మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అక్కడకు చేరిన రాజులు గరుత్మంతునితో కృష్ణుడు వచ్చాడని అతన్ని చూచి విచారపడ్డారు. వాళ్ళందరూ కలిసి ఆలోచించటానికి సభలో కూర్చున్నారు. ఆ రాజులు గొప్ప పరాక్రమవంతులు, ఆలోచనాపరులు. వాళ్ళ ఆసనాలు విచిత్రమైన బంగారుఆసనాలు. ఆ సభ దేవసభలా ఉంది.వాళ్ళమధ్యలో జరాసంధుడు దేవతలను గూర్చి దేవేంద్రునివలె మాట్లాడాడు. ఓ రాజశ్రేష్ఠులారా! వినండి.

వసుదేవుని పుత్రుడైన కృష్ణుడు బలవంతుడు గరుత్మంతునితోకూడకుండిన పురానికి వచ్చాడు. యాదవులందరితో కలిసి కన్య కొరకు వచ్చాడు. కన్యను పొందటానికి తప్పక ప్రయత్నిస్తాడు. మహారాజులారా! ఈ విషయంలో నీతిశాస్త్ర

బద్ధంగా కార్యకారణాలను నిశ్చయించండి. బలాబలాలు దృష్టిలో పెట్టుకొని నిర్ణయించాలి. మహాపరాక్రమవంతులైన వసుదేవ పుత్రులు గరుత్మంతుడు లేకుండగానే గోమన్త పర్వతంమీద జరిగిన మహా ఘోరకృత్యం మీకు తెలిసిందే కదా!.

వృష్ణి, భోజ, యాదవ, అంధక మహారథులతో కలిసియుద్ధం చేయటం ఎలా ఉంటుందో గరుత్మంతునిపై కూర్చుని కన్య కొరకు ప్రయత్నించే అతనితో ఎవడు యుద్ధానికి నిలబడగలడు? దేవతలందరితో ఇంద్రుడుకూడ నిలువలేడు. పూర్వం ప్రళయంలో ఘోరమైన మహాసముద్రజలంలో పాతాళం చేరిన భూమిని వరాహరూపంతో విష్ణువు పైకి తెచ్చాడు. అతడు హిరణ్యాక్షుని చంపాడు. మహా బలశాలి హిరణ్యకశిపుడు ఎవరికీ చంపశక్యం కానివాడు. నరసింహరూపం ధరించి విష్ణువే అతన్ని చంపాడు. వామనరూపంతో బలిని బంధించి పాతాళంలో ఉంచాడు. పరశురాముడుగా, కార్త్యావీర్యార్జునుని సంహరించాడు. మోసంచేసి చాలామందిని చంపాడు.

అందుచేత మీ మేలు కోరి చెపుతున్నాను. అతడు విష్ణువు, నారాయణుడు, సమస్తప్రాణులను సృష్టించువాడు. ఎవరూ అతన్ని జయించలేరు. అతడు భగవంతుడు కాకపోతే గరుత్మంతుడు వాహనం ఎలా అవుతాడు? గరుడుని ముందు ఎవడు నిలువగలడు? విష్ణువు స్వయంవరంకోసం వచ్చాడు. విష్ణువు రావటంవల్ల గొప్ప భయంకరమైన అనర్థం సంభవిస్తుంది. మీరందరూ ఈ విషయం ఆలోచించుకొని చేయదగిన పని చేయండి.

జరాసంధుడీ విధంగా మాట్లాడగా గొప్ప తెలివిగలవాడైన సునీథుడు, మగధ రాజు బాగా మాట్లాడాడు. గోమన్తంలో రామకృష్ణులు చేసినపని ఎవరికీ శక్యం కాని ది. చక్రం, నాగలి ఈ రెంటిచేతనే గొప్పసైన్యం కాలిపోయింది. కాలినడకతో యుద్ధం చేస్తూ గొప్పసేనను నాశం చేశారు. రాజులారా! గరుత్మంతుడు వచ్చాడని తెలిసింది కదా! అతని రెక్కలగాలికి ఆకాశమందు సంచరించే జీవులు తిరిగి పోతున్నారు. సముద్రాలు కల్లోలమయ్యాయి. కొండలు భూమి మాటిమాటికీ కదిలిపోయాయి. మనమందరం ఏమి ఉపద్రవమిది అని భయపడ్డాం. గరుత్మంతుని పై కూర్చుని కేశవుడు యుద్ధంచేస్తే మనలాంటివాళ్ళు యుద్ధంలో ఎలా నిలువగలరు. రాజులకు స్వయంవరమంటే మిక్కిలి సంతోషాన్ని కలుగజేసేది,

కీర్తినిపెంచేది, కూడా. ఇక్కడ చాలా రాజులు ఒకచోట చేరటంవల్ల మిక్కిలి ఘోరమైన యుద్ధం ఊహింపబడుతోంది. ఆ కన్య మనలో ఎవరినైన వరిస్తే శ్రీకృష్ణుని భుజబలాన్ని ఎవడు సహించగలడు? అందుచేత ఈ స్వయంవరం గొప్ప ఆపదను తెచ్చి పెట్టింది. ఒక్క కన్య కొరకు కృష్ణుడు మనమూ రావటం నిందింపదగినదిగా ఉంది అని పలికాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి విష్ణుపర్వంలో
సునీథుని మాటలు అను నలభై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# యాభైయవ అధ్యాయము

## రుక్మిణీ స్వయంవరము

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజేంద్రా! మహాత్ముడైన సునీథుడిలా మాట్లాడగా కరూషదేశాధిపతి దంతవక్త్రుడు ఈ విధంగా మాట్లాడాడు.

మగధరాజు జరాసంధుడు, సునీథుడు (శిశుపాలుడు) మాట్లాడిన మాటలు మనకు మేలు చేసేవి, యుక్తియుక్తములైనవి. ఈ మంచిమాటలకు వ్యతిరేకంగా మాట్లాడదలచటంలేదు. నీతిశాస్త్రం అగాధం అంతులేనిది. రాజసభలలో దీనిని చెప్పేవాళ్ళు చాలా తక్కువ. మీకు గుర్తు చేయటానికి ఒకమాట చెపుతాను వినండి. కృష్ణుడీస్వయంవరానికి వస్తే ఆశ్చర్యమేముంది? మనమెలా వచ్చామో వాళ్ళు అలాగే వచ్చారు. ఇందులో గుణదోషాలను చూడరాదు. మనం గోమన్త పర్వతాన్ని ముట్టడించినప్పుడు చేసిన యుద్ధంలో దోషమేముంది? కంసుడు నారదుని మాటలు విని రామకృష్ణులను ఏనుగుతో చంపదలచాడు, కాని ఆ యేనుగును చంపి సభలో ప్రవేశించారు కృష్ణుడు. కంసుడు జాగర్తగా లేక కృష్ణునిచే చంపబడ్డాడు. వాళ్ళు మనతో యుద్ధంచేస్తే మనమూ యుద్ధం చేశాము. ఇలా చెయ్యటంలో మనదోషమేమీలేదు. మధురలో మనపక్షంయొక్క బలంచూచి మధురానగరం విడిచి గోమన్తపర్వతం మీదికి పారిపోయారు.

అప్పుడు వాళ్ళతో యుద్ధం చేయటానికి ఆ పర్వతానికి మనం వెళ్ళాము. అక్కడ మనకు విజయం ప్రాప్తించలేదు. గోమన్తపర్వతానికి నిప్పంటించగా వాళ్ళు

చావలేదు. అప్పుడు యుద్ధం చేసిన కృష్ణుడికి కోపం కలుగజేశాం. కాబట్టి మనం వెళ్ళిన చోట్లల్లా యుద్ధం సంభవిస్తుంది. కాబట్టి ఈ సమయంలో కృష్ణునితో స్నేహంగా ఉండటం ముఖ్యకర్తవ్యం. వాళ్ళు యుద్ధం చెయ్యటానికి కుండినపురం రాలేదు. కన్యకను పొందటమే వాళ్ళ లక్ష్యము. ఈ పరిస్థితిలో యుద్ధం యెందుకు వస్తుంది. వాళ్ళు సామాన్యమానవులు కారు. దేవలోకంలో కూడ అందరికంటే గొప్పవాళ్ళు. వాళ్ళే దేవతలనూ, లోకాలనూ సృష్టించారు. వీళ్ళు దేవతలకు కూడ దేవుళ్ళు. యాదవభోజ అంధకగణంతో వచ్చాడు. గనుక మనలను సంతోష పెట్టుటకే అతని రాకకావచ్చు. కాబట్టి కృష్ణుని అతిథిగా భావించి అతనిని సత్కరించాలి. ఆయనతో ఈవిధంగా సంధి చేసుకుంటే మనం నిర్భయంగా నిశ్చింతగా జీవనం చేయవచ్చు.

ఈ విధంగా బుద్ధిమంతుడైన దంతవక్త్రుడు మాట్లాడిన పిమ్మట మాటలు విని 'సాల్వుడు' ఓ రాజసమూహమా! కృష్ణునికి భయపడి ఆయుధాలను విడిచి అతనితో సంధి చేసుకొనవలసిన ఆవశ్యకత లేదు. మనను నిందించుకొని ఇతరుని పొగడి సంధి చేసుకోవటం రాజు చేయదగినపని కాదు. ప్రసిద్ధి చెందిన రాజ వంశంలో పుట్టి పిరికివాళ్ళలా దుర్బుద్ధితో మాట్లాడటం మిక్కిలి నిందింపతగినది. కృష్ణుడు, నారాయణుడు జయింపశక్యం కానివాడు, సమస్తప్రపంచాన్ని సృష్టించిన వాడని నాకు తెలుసు.

కంసుడితోపాటు మనమందరం నశించటానికి, భూమికి భారం తగ్గటానికి, లోకరక్షణకూ దేవకి గర్భమందు జన్మించాడని కూడా ఎరుగుదును. యుద్ధభూమిలో అతని చక్రాయుధంచే కొట్టబడి, యముడి దగ్గరకు వెళ్ళవలసివస్తుంది. సమయం రానిదే ఎవడూ చావడు, సమయం పూర్తయితే ఎవడు బ్రతకనూలేడు. భగవంతుడు నారాయణుడు ధర్మం క్షీణిస్తున్నప్పుడు అవతరించి రాక్షసులను నశింపచేస్తాడు. అతడు చంపబడడు. కృష్ణుడిక్కడకి కన్యకోసం వచ్చాడు. యుద్ధం చేయటానికి రాలేదు. ఆమె అతనిదే అవుతుంది. ఈ పరిస్థితులో ఆనందించాలి. అని మాట్లాడగా భీష్మకమహారాజు ఎవడి మాటలకూ జవాబివ్వలేదు.

నా కొడుకు ఆయుధబలంతో గర్విస్తున్నాడు. యుద్ధాన్ని అభిమానిస్తాడు. భగవంతుడైన కృష్ణుడు నా కుమార్తెను తన భుజబలంతో తీసుకుపోతాడు. రాజులతో కృష్ణుడికి యుద్ధం ఏర్పడుతుంది. నా కొడుకు జయించలేడు. శ్రీకృష్ణుడి బారినుండి ఎలా బ్రతుకుతాడు? కృష్ణుడు నా కన్యకు తగిన వరుడు. అందులో

సందేహం లేదు, కాని రుక్మి మూఢుడు. యుద్ధంలో వెనుదిరుగనివాడు. శ్రీకృష్ణునితో యుద్ధంచేసి భస్మమౌతాడు.

అతడెన్నెన్నో మానవులకు సాధ్యంగాని పనులు చేశాడు. మహావీరులనెందరినో సంహరించాడు. యుద్ధం తలుచుకుంటే నా మనస్సు దుఃఖపడుతోంది. దంతవక్త్ర మహారాజు బాగా చెప్పాడు. నేను కృష్ణుని శాంతింపజేసి ఉచితమైనపని చేస్తాను. అని భీష్మకమహారాజు తన మనస్సులో ఇలా ఆలోచించాడు.

కృష్ణుని ప్రసన్నుని చేయుటకు అతని వద్దకు వెళ్ళ నిశ్చయించాడు. ఆ సమయంలో వందిమాగధులు స్తోత్రం చేశారు. దానితో రాజులందరూ తమతమ నివాసాలకు వెళ్ళారు. రాత్రి గడిచి తెల్లవారింది.ప్రాతఃకాలకృత్యాలు తీర్చుకొని రాజులు తమ నివాసాలలో ఆసనాల మీద కూర్చున్నారు. తరువాత వాళ్ళు పట్టణం లోకి తమ దూతలను పంపారు. ఆ దూతలు తిరిగివచ్చి రాజులకు పట్టణ వృత్తాంతాన్ని ఏకాంతంలో తెలియజేశారు. వాళ్ళద్వారా కృష్ణునికి అభిషేకమనే విషయం విని కొందరు రాజులు సంతోషించారు. కొందరు భయపడ్డారు, మరికొందరు దీనులయ్యారు.

ఈ విధంగా మూడువిధాల విడిపోయి సేన మహాసముద్రంలా క్షోభించింది. భీష్మకమహారాజు వాళ్ళ మతభేదం చూచి మండుచున్న మనస్సుతో రాజ సమూహమును శాన్తింపచేయటానికి వెళ్ళాడు. ఆ సమయంలో దూతలు క్రథుడు, కైశికుడు అనేవాళ్ళకు ఉత్తరాలు ఇవ్వటానికి సముద్రంవంటి రాజసభలో ప్రవేశించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
రుక్మిణీ స్వయంవరము అను యాభైయవ అధ్యాయము

☆☆☆

# యాభై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణునకు అభిషేకము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శ్రీకృష్ణుడు గరుత్మంతునితో విదర్భనగరంలో ప్రవేశించగా రాజైన కైశికుడు మనస్సులో ఇలా ఆలోచించాడు. నేను శ్రీకృష్ణుని పట్టాభిషేకం చూస్తే

నా పాపాలన్నీ నశించిపోతాయి. మూడులోకాలలోను పట్టాభిషేకానికి తగ్గవాడు కృష్ణుడొక్కడే. ఆయనకు అతిధిమర్యాదగా ఏమి ఇవ్వను? యోగ్యునికి దానం చేయకపోతే ధర్మానికి లోపం వస్తుంది. క్రథుడు కైశికుడు సోదరులిద్దరూ ఇలా అనేకవిధాల ఆలోచించి చివరకు తమ రాజ్యాన్ని ఇద్దామని అనుకొని కృష్ణుడి దగ్గరకు వెళ్ళారు. విదర్భనగరానికి రాజులైనవాళ్ళిద్దరూ శ్రీకృష్ణునికి నమస్కరించి నీవు మాయింటికి వచ్చుట వల్ల మాజన్మ ఫలించింది. మా పితృదేవతలు తృప్తిపడ్డారు.

ఛత్రచామరాలు ధ్వజసింహాసనం సైన్యము గొప్ప ధనాగారము గల ఈ పట్టణము మాతో సహా నీది. నీవు ఉపేంద్రుడవు దేవేంద్రుడు నీకు పట్టాభిషేకం చేశాడు. ఇప్పుడు మేము మారాజ్య సింహాసనం మీద నీకు పట్టాభిషేకం చేస్తాము. ఈ నగరాన్ని ధనాగారాన్నీ, మమల్నీ, ప్రజల్నీ స్వీకరించు. జరాసంధుడు కాని, ఇతర రాజులుగాని మా పనిని అడ్డగించలేరు. జరాసంధుడు కృష్ణుడికి రాజ్యం లేదు. ఎప్పుడు రాజసింహాసనం మీద కూర్చొనలేదు. అలాంటివాడు రాజసమూహం మధ్య ఎలా కూర్చుంటాడు. అతడు మిక్కిలి అభిమానవంతుడు కాబట్టి కన్య కోసం స్వయంవర సభకు రాడు. రాజులందరూ ఎత్తైన ఆసనాలమీద కూర్చుంటే అతడు చిన్న ఆసనం మీద ఎలా కూర్చుంటాడు. అన్నాడు!

జరాసంధుని మాటలు విని బుద్ధిమంతుడైన భీష్మకుడు అనేకవిధాల ఆలోచించి యుద్ధం,ఆపుచేయుటకు శ్రీకృష్ణునితో, మీకు విశ్రాంతి కొరకు మంచి భవనం తయారుచేయించాం. నీవు దేవతలకు దేవుడవు. కాబట్టి భూలోకంలో రాజేంద్ర పదవిని స్వీకరించుము. ఇట్లైతే రాజసింహాసనం మీద రాజుల మధ్య కూర్చుండుటకు ఇబ్బంది ఉండదు. ఇప్పుడు విదర్భనగరంలో రాజులందరిపై ప్రభువుకాగలవు. రేపు సభలో సింహాసనంపై కూర్చొనగలవు. ఈవేళ పట్టాభిషేకం పూర్తి చేస్తాం. నీశాసనం ప్రకారం రాజులందరూ ఇక్కడ నిలువగలరు. మేము త్వరగా ఈ పని త్వరగా పూర్తి చేస్తాం. అన్నాడు!

క్రథ కైశికులిద్దరూ చేతులు జోడించి కృష్ణునితో ఇంద్రుని ఆజ్ఞాపత్రం రాజ సభకు పంపబడింది. అక్కడ కైశికుడు వ్రాసిన పత్రం ద్వారా దేవదూత మాటలను, ఇంద్రుని ఆజ్ఞను రాజసమూహం మధ్య వినిపించాడు. కైశికుడు ఓ రాజ సమూహమా! భగవంతుడైన కృష్ణుడు గరుడునితోపాటు అతిథిగా ఈ విదర్భ నగరానికి వచ్చియున్నాడు. ఆ సంగతి మీకు తెలుసు. యోగ్యుడని భావించి నా

సోదరుడు క్రథుడు తన రాజ్యాన్ని అతనికి ఇచ్చాడు. ఈ సింహాసనపై కూర్చుండుము అని చెపుతుండగానే ఆకాశం నుండి ఒక దేవదూత కనబడకుండా రాజా! మీరు కూర్చున్న ఆసనం మీద కృష్ణుని కూర్చుండ బెట్టవద్దు. ఈయన కొరకు దేవేంద్రుడు విశ్వకర్మ నిర్మించిన అతిసుందరమైన సింహాసన్నాని పంపాడు.

ఆ ఆసనం మీద కూర్చొనబెట్టి అందరి సమక్షంలో రాజేంద్ర పదవియందు అభిషేకం చేస్తాం. పట్టాభిషేకానికి రానివాడు శ్రీకృష్ణునిచే చంపబడతాడు. ఈ యెనిమిది కలశములు కుబేరుడు పంపినవి. ఇంద్రుని సందేశం మీకు చెప్పాను. లేఖ ద్వారా రాజులనందరనూ పిలిచి కేశవునకు అభిషేకం చెయ్యండి. అని ప్రేరేపించి దేవదూత స్వర్గానికి వెళ్ళాడు. కృష్ణునికా ఆసనం ఇచ్చి అందరూ కృష్ణుని అభిషేకానికి రండి. ఇంద్రుని ఆజ్ఞ త్రోసినేయరానిది. ఈ పట్టాభిషేకం చూస్తే పాపాలన్నీ నశిస్తాయి. మీ అందరి కొరకు నేను కృష్ణునితో సంధి చేసుకున్నాడు. కృష్ణుని స్వభావము మిక్కిలి సరళమైనదని నేను గుర్తించాను. ఆయన మీతో విరోధించడు. జరాసంధునితో విశేషమైన విరోధం అతని మనస్సులో లేదు. ఇప్పుడు మీరు చేయతగిన పని ఆలోచించండి.

కైశికుని మాటలు విని శాపభయంతో వాళ్ళు ఆలోచించసాగారు. ఇదే సమయంలో ఇంద్రుని ఆజ్ఞ వలన మేఘగంభీర వాక్కుతో చిత్రాంగదుడు కనపడకుండా ఓ రాజసమూహమా! త్రిలోకాధిపతి ఇంద్రుడు మీక్షేమం కోసం కృష్ణుడితో విరోధం పెట్టుకొని ఉండటం మీకు తగదు. మీరాతనితో స్నేహంగా ఉండి. ప్రజలకు శుభం కలిగేట్లు రాజ్యం చేయండి. ఆనందించండి! ఆయన వినయం గలవాళ్ళ దుఃఖాన్ని పోగొడుతాడు. అతన్ని శత్రువుగా చూస్తే అగ్నివలె నశింపచేస్తాడు. భగవంతుడైన కృష్ణుడు దేవతలకు కూడ దేవత. అతడు మనుష్యరూపంలో అవతరించిన భగవంతుడు. ఇంద్రుడు కోరినప్పుడు అతనికి సహాయం చేస్తాడు. రాజులే ఆయనకు అభిషేకం చేయాలని దేవేంద్రుడు పట్టాభిషేకం చేయలేదు.

కాబట్టి ఇప్పుడు మీరందరూ కైశికునితోపాటు విదర్భనగరానికి వచ్చి శాస్త్ర ప్రకారం కృష్ణునికి పట్టాభిషేకం చేయండి. కృష్ణుడితో స్నేహానికి ఇది మంచి అవసరము. (సమయము) ఈ విషయం ఆలోచించే మీలో ఉత్సాహాన్ని నింపటానికి నన్నిక్కడికి పంపాడు. కృష్ణుడికి విదర్భనగరంలో పట్టాభిషేకం జరుగుతుంది అనే విషయం ప్రకటింపబడింది. క్రథ కైశికులిద్దరూ అభిషేకం చేయటానికి సిద్ధంగా

ఉన్నారు. కాబట్టి మీరు వాళ్ళతో రండి. అతనికి అభిషేకం చేసి సత్కారాన్ని పొందండండి. తరువాత స్వయంవరం సభలో సమావేశం కండి. జరాసంధుడు, సునీథుడు, రుక్మి, సాల్వుడు, సభశూన్యం కాకుండ ఇక్కడ ఉంటారు.

ఈవిధంగా చిత్రాంగదుడు చెప్పిన ఇంద్రుని సందేశం విని రాజులందరూ వెళ్ళటానికి ఇష్టపడ్డారు. వాళ్ళందరూ జరాసంధుని అనుమతి పొంది భీష్మకమహా రాజును ముందుంచుకొని తమ సేనలతో వెళ్ళారు. భీష్మకుడు తన సైన్యంతో, రాజులతోనూ కలత చెందిన మనస్సు కలవాడై వెళ్ళాడు. కైశికుని యింటిలో కృష్ణుని అభిషేకం కోసం దేవసభ వచ్చింది. సభకు నలుమూలలా జండా లెగురు తున్నాయి. దివ్యరత్నకాంతులతో సభ అంతా ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. ఆనందాన్ని కలిగించే దివ్యమైన సువాసన సభలో వ్యాపించింది. అప్సరసలు నాట్యం చేస్తున్నారు. గంధర్వులు గానం చేస్తున్నారు. మునులు, సిద్ధులు మొదలగువారు ఆకాశంనుండి శ్రీకృష్ణుని స్తోత్రం చేస్తున్నారు.

దేవదుందుభులు మ్రోగాయి. దేవతలు సువాసనగల గంధపుచూర్ణాన్ని చల్లుతున్నారు. ఇంద్రుడు ఆకాశంలో విమానంమీద కూర్చుని కార్యకలాపాన్ని అంతనీ చూస్తున్నాడు. దిక్పాలకులందరూ స్తుతిస్తున్నారు. రాజలందరూ సభలో ప్రవేశించారు. కైశికమహారాజు వాళ్ళకు స్వాగతం పలికాడు. అందరినీ లోపలికి తీసుకువచ్చాడు. రాజులందరూ వచ్చారని విని అన్ని శుభాలతో కూడిన శ్రీకృష్ణుడు తన నివాసంనుండి బయటకు వచ్చాడు.

అప్పుడు ఆకాశంనుండి కలశములనీరు భగవంతుని శిరస్సుపై పడుతోంది. బంగారము, రత్నములు, గంధపుష్పములు, గంధచూర్ణముతో కలిపిన నీటిని కైశికుడు ఆయనకు అభిషేకం చేశాడు. ఈ విధంగా కృష్ణభగవానుడు భూషణాలు, దివ్యవస్త్రాలు ధరించి గంధంపూసుకొని రాజసభలో ఆసనం మీద ప్రకాశిస్తున్నాడు. ఇష్టం వచ్చిన రూపం ధరించగల గరుత్మంతుడు మనుష్యరూపం ధరించి కృష్ణుడికి కుడివైపున కూర్చున్నాడు. క్రథ, కైశిక, సాత్యకి మొదలైనవాళ్ళు అంధకవంశీయులు ఎడమవైపున ప్రకాశిస్తున్నారు.

ఈ విధంగా భగవంతుడైన శ్రీకృష్ణుడు ప్రకాశిస్తుండగా రాజులు నలువైపుల నుండి అతన్ని పూజించి తమ ఆసనాలపై కూర్చున్నారు. అన్ని శాస్త్రార్థాలు తెలిసిన మహాజ్ఞానియైన కైశికుడు శాస్త్రప్రకారం పూజించి ఓ ప్రభూ! అజ్ఞానులైన రాజులు నిన్ను ఎదుర్కొన్నారు. ఓ దేవా! దానిని క్షమించు.

అనగా శ్రీకృష్ణుడు కైశికా! నాకు కోపం ఒక్కరోజునా ఉండదు. క్షత్రియ ధర్మాన్ని అనుసరించేవాళ్ళకు యుద్ధం చేయతగినదే. వాళ్ళమీద నేనెందుకు కోపిస్తాను? జరిగిందేదో జరిగింది, మరణించినవాళ్ళంతా స్వర్గలోకానికి వెళ్ళారు. మీరందరూ ఓర్పు వహించి వైరబుద్ధిని విడిచిపెట్టండి. భగవంతుడైన శ్రీకృష్ణుడిలా పలికి వాళ్ళను ఊరడిస్తూ కైశికుని ముఖంచూస్తూ మౌనంగా ఉన్నాడు.

ఈ సమయంలోనే భీష్మకుడు పూజించి ఓ దేవా! నా కుమారుడు రుక్మి చిన్నతనపు చపలత్వంవల్ల స్వయంవరంద్వారా తన చెల్లెలికి వివాహం చేయ గోరుతున్నాడు. కాని నేను అలా చేయకోరుటలేదు. ఒక యోగ్యుడైన వాడిని వెతికి అతనికిచ్చి వివాహం చేయాలని నా అభిప్రాయం. నీవు ప్రసన్నుడవై నా కుమారుని గర్వమనే అపరాధాన్ని క్షమించకోరుతున్నాను అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణునకు అభిషేకము అను యాభై ఒకటవ అధ్యాయము

☆☆☆

# యాభై రెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు మధురకు బయలుదేరుట

శ్రీకృష్ణుడిలా అన్నాడు.

ఓ రాజా! ఇప్పుడే అతడు నీమీద, రాజులమీద నాయకుడైయాడు. ఇంక పెద్దవాడైతే ఏమి కష్టం తెచ్చిపెడతాడో. గొప్పకులంలో పుట్టి ప్రతాపవంతులైన ఏ ఒక్కడియెదటనైనా అసత్యం మాట్లాడితే శిక్ష అనే అగ్నిలో అతడే భస్మమౌతాడు. నీవుగాని, నీ కుమారుడుగాని, వాళ్ళ ఎదుట అసత్యం ఎలా చెప్పుటకు తగినవారు? అంతటి స్వయంవర సభ నీకు తెలియకుండా ఎలా నిర్మించాడు? అని నాకు పెద్ద సందేహం వచ్చిన మహారాజులకు తగినవిధంగా పూజచేసి ఆతిధ్యం ఇచ్చి ఉన్నావు, నీ కుమారుని పని నీకెట్లు తెలియదు? నేనిక్కడికి రావటమే బహుశా మీకు ఇష్టంగాలేదు. నేను యోగ్యుడను కానని నాకు ఆతిధ్యమీయలేదు. నన్ను విడిచి యోగ్యుడైనవాడికి నీ కన్యను ఇమ్ము. అందుకనే నేను స్వయంవరసభలో ప్రవేశించలేదు. అతిధ్యమీయనందున సిగ్గుపడి, విశ్రాంతి కొరకు విదర్భనగరం వెళ్ళాను. కైశికుడు అక్కడ అతిధ్యమిచ్చాడు.

మహాత్ముడు భీష్మకమహారాజు వజ్రాయుధంలాంటి శ్రీకృష్ణుని మాటలువిని మధురములైన మాటలతో కోపాన్ని శాంతింపచేయటానికి ఓ దేవలోక ప్రభూ! దయతో నా అపరాధాన్ని క్షమించు. నేను అజ్ఞానాంధకారంలో పడ్డాను. నాకు జ్ఞాన నేత్రాన్ని అనుగ్రహించు. నేను ఈ సమయంలో నిన్ను శరణు వేడుతున్నాను. నేను చేయదలచిన విషయన్ని చెపుతా విను.

నేను స్వయంవరసభలో రాజులనందరి సమక్షంలో నా కన్యకు వివాహం చేయదలచుటలేదు. కాబట్టి మీరు నాపై ప్రసన్నులై కోపాన్ని విడిచిపెట్టండి అని. అప్పుడు శ్రీకృష్ణుడు, ఎక్కువగా మాట్లాడితే ప్రయోజనమేముంది? నీ కుమార్తెను నాకిచ్చినా, ఇవ్వకపోయినా నీకు నాయకుడెవడు? నీవు నాకు కన్య నిచ్చినా, లేకపోయినా నేనేమీ చెప్పదలుచుకోలేదు. కాని రుక్మిణి దివ్యమూర్తి అగు టయే నాతో సంబంధానికి కారణం.

పూర్వం హేమకూటపర్వతంమీద అంశావతార సందర్భంలో దేవతలు లక్ష్మీ దేవితో నీవు భర్తతోపాటు భూలోకానికి వెళ్ళు. కుండినగరంలో భీష్మకునికి జన్మించి అక్కడనే ఉంటూ భగవంతుని రాకకు ఎదురుచూస్తూ ఉండు అన్నారు. ఇందుచేత అన్ని మాటలు నీకు చెప్పాను. మీకిప్పుడు ఏది మంచిదనితోస్తే అది చెయ్యండి, నీ కుమార్తె సాక్షాత్తు లక్ష్మీదేవి. బ్రహ్మదేవుని మాట చొప్పున ఆమె భూలోకంలో అవతరించింది. ఆమె స్వయంవరానికి తగినదికాదు. యోగ్యుడైన వాడికి ఈయ తగినది. ఇది ధర్మబద్ధమైన విషయము. ఆమెను స్వయంవర సభకు పంపక ఆమెకు తగిన వరుణ్ణి వెతకండి. అటువంటివానితో వివాహం చెయ్యండి.

ఈ కారణంచేత ఇంద్రుడు ప్రేరేపించగా గరుత్మంతుడు స్వయంవర సభకు విఘ్నం కలిగించటానికి వచ్చాడు. నేను ఒకచోట చేరిన రాజుల గొప్ప ఉత్సవాన్నీ, పద్మాసనంలేని లక్ష్మీ స్వరూపురాలైన మీ కన్యను చూడటానికి వచ్చాను. నేను సౌమ్యరూపంతో వచ్చినప్పుడే క్షమించాను. నన్ను క్షమించినవానిగా తలచుము. విదర్భనగర రాజులైన వీళ్ళిద్దరూ ఆతిధ్యమిచ్చి తమ రాజ్యాన్ని యిచ్చారు. ఆ దానానికి ఫలితంగా వీళ్ళ వీళ్ళ పూర్వులు పదితరాలవాళ్ళు స్వర్గం చేరారు. రాబోయే పదితరాలవాళ్ళుకూడా స్వర్గమును పొందుతారు. పట్టాభిషేకానికి వచ్చిన రాజులు కూడా స్వర్గానికి వెళ్తారు. మీకందరికీ శుభమగుగాక, నేను గరుత్మంతునితో వెళ్తాను.

ఇలా భీష్మకునితో చెప్పి రాజులవీడ్కొని సభనుండి బయటకువచ్చి రథం దగ్గరకు వెళ్ళాడు. భీష్మకుడు సంతోషించాడు. రాజులందరూ దుఃఖపడ్డారు.

భీష్మకుడు ఓ దేవదేవ! నీకు నమస్కారం. నీవు సాక్షాత్తు విష్ణుమూర్తివి, అని స్తోత్రం చేసి రాజుల ఎదుట విలువైన వజ్రవైఢూర్యాదిరత్నములను, బంగారమును శ్రీకృష్ణునికి ఇచ్చాడు. మళ్ళీ నమస్కారం చేశాడు. తరువాత గరుడునికి నమస్కరించి శ్రీకృష్ణునికి గొప్ప ఆభరణములనిచ్చి పంపాడు.

భగవంతుడు కూడా రాజులందరితో గౌరవింపబడి బయల్దేరాడు. శ్రీకృష్ణుడు మధురానగరానికి వెళ్ళాక శ్రేష్టమైన ఆసనమును తీసుకొని సభను కూడా తీసుకొని దేవతలు స్వర్గానికి వెళ్ళారు. క్రోసుదూరం వెళ్ళి శ్రీకృష్ణుని అనుమతి పొంది రాజులందరూ మరల స్వయంవరసభలో ప్రవేశించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు మధురకు బయలుదేరుట అనుయాభై రెండవ అధ్యాయము

☆☆☆

# యాభై మూడవ అధ్యాయము

## సాల్వరాజు మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళిన తరువాత ఇతర రాజులు కూడా సెలవు తీసుకొని వెళ్ళుటకు మళ్ళీ స్వయంవరసభకు వెళ్ళి తమ తమ స్థానాలలో కూర్చున్నారు. అప్పుడు నీతివేత్త అయిన భీష్మకుడు ఇక్కడకు వచ్చిన మహారాజు లారా! స్వయంవరానికి ఏర్పడిన విఘ్నాన్ని మీరు మీ కళ్ళతో చూచారు. ఇప్పుడు మీతో ఎక్కువగా నేనేం చెప్పను? నా తెలివితక్కువచే మిక్కిలి మీకు కష్టం కలిగింది. దీనికి నన్ను క్షమించండి. ఇలా చెప్పి ఆ రాజులకు తగిన సమ్మానం చేశాడు. అందరికీ వీడ్కోలు పలికాడు. ఆ రాజులు సత్కరింపబడి సంతోషంతో తమ తమ నగరాలకు వెళ్ళారు.

కేవలం శిశుపాలుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, సేభపతి, సాల్వుడు, మొదలైనరాజులు భీష్మకుని గూఢాభిప్రాయాన్ని తెలుసుకోవటానికి అక్కడ ఆగిపోయారు. భీష్మకుడు స్నేహపూర్వకంగా చూచి వాళ్ళతో మీ యొక్క నీతితో కూడిన మాటను విని ఇలాంటిపని చేశాను. దీన్ని క్షమించండి. మేము నిత్యమూ

తప్పుచేసేవాళ్ళం అని పలికి రాజసభలో కుమారుని గూర్చి భయపడుతూ నా కుమారుని పనిచూచి భయపడ్డాను. నా పుత్రుడు చిన్నవాడు, కృష్ణుడు పురుషోత్త ముడు. తన భుజబలంచేత స్థిరమైన కీర్తిని పొందాడు. స్త్రీలలో దేవకి ధన్యురాలు. ఆమె తనగర్భంలో అతన్ని ధరించింది. అతని ముఖపద్మాన్ని నిత్యమూ చూస్తున్నది అని పలుకుచుండగా బుద్ధిశాలి సాల్వుడు ఓ రాజేంద్రా! నీ కుమారుని విషయంలో నీవు బాధపడవద్దు. యుద్ధంలో జయపరాజయాలు క్షత్రియులకు సంభవిస్తాయి.

ప్రపంచంలో కృష్ణ బలరాములు తప్ప మూడవవాడెవడు నీ కుమారుని జయించగలవాడు? ప్రపంచంలోని రాజులలో నీ కుమారుడు సాటి లేనివాడు, అతడు భార్గవాస్త్రాన్ని ప్రారంభిస్తే ఎవడతన్ని జయింపగలడు? నీ కుమారుడు సమస్తశస్త్రాలలో నేర్పరి, గొప్ప బుద్ధిమంతుడు. కృష్ణుని భగవంతునిగా తలచే నీ పుత్రుడు యుద్ధానికి ముందడుగు వెయ్యలేదు. అతన్ని జయించేవాడు కాలయ వనుడొక్కడే. పూర్వం గార్గ్యుడు తపస్సు చేసి శంకరునివల్ల మధురానగర రాజులచే జయింపబడని పుత్రుని వరంగా పొందాడు. శ్రీకృష్ణుడు మధురలోనే పుట్టాడు. కాబట్టి కాలయవనుడు మాత్రమే కృష్ణుని జయింపగలడు, కాబట్టి నామట మీకు బాగుంటే కాలయవనుని నగరానికి దూతగా పంపండి అన్నాడు.

ఆ మాట విని రాజులు సంతోషించారు. వాళ్ళందరూ జరాసంధునికి ఇదే మనమిప్పుడు చేయదగినపని అన్నారు. బుద్ధిమంతుడు జరాసంధుడు రాజుల మాటవిని ఆకాశవాణిని తలుచుకొని కలత చెందిన మనస్సు కలవాడయ్యాడు. పూర్వం ఎంతోమంది రాజులు నన్ను శరణువేడి అపహరింపబడిన తమ రాజ్యాలను మరల పొందగలిగారు. వాళ్ళే ఇప్పుడు నన్ను మరొకణ్ణి శరణు వేడమంటారు. నేనిలా చేయటంకంటే మరణించుటే శ్రేష్ఠమైనపని. మరణం సమీపించినా నా నియమం విడువను. యవనపతి నాకిష్టంగాని పని చేయలేదు. మీ అందరి రక్షణ కొరకు దూతను పంపటానికి అంగీకరిస్తున్నాను. కృష్ణుడు బాధించకుండుటకు ఆకాశమార్గంగా వెళ్ళాలి. పంపదగిన దూతను ఆలోచించి పంపండి.

సేభాపతి రథంమీద తన పట్టణానికి వెళ్తున్నాడు. అతడే యవనరాజుకు చెప్పి ఈ సందేశాన్ని చెప్పి వెళ్తాడు. కృష్ణునితో జరిగే యుద్ధంలో మనతో కలుస్తాడు. అని సాల్వునితో చెప్పి నీవు అతడు మధుర మీదికి యుద్ధానికి వచ్చేటట్లు ప్రయత్నించుము. జరాసంధుడీ విధంగా రాజులతో చెప్పి భీష్మకుని సెలవడిగి

తన నగరానికి బయల్దేరాడు. సాల్వుడు కూడా రాజులను వీడ్కొని రథంమీద ఆకాశ మార్గంగా వెళ్ళాడు. దక్షిణదేశపు రాజులు కొంచం దూరము జరాసంధుని అనుసరించి వెళ్ళి తమ తమ నగరాలకు వెళ్ళారు. ఇక్కడ క్రథకైశికులిద్దరూ రాజుల దురాలచనను విని మిక్కిలి దుఃఖించారు. భగవంతుడైన కృష్ణుని తలుచు కుంటూ తమ నగరానికి వెళ్ళారు. భీష్మక మహారాజు తన కుమారునితో ఇంటికి వచ్చాడు. రుక్మిణి కృష్ణునికే నేను పత్నినన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
సాల్వరాజు మాటలు అను యాభై మూడవ అధ్యాయము

☆☆☆

# యాభై నాల్గవ అధ్యాయము

## సాల్వకాలయవన సంవాదము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బలవంతుడైన కాలయవనుడు రాజధర్మం ప్రకారం ప్రజలను పరిపాలిస్తున్నాడు. ఏ వ్యసనములు లేనివాడు, సత్యమునే పలుకువాడు. ఒకరోజున మంత్రులతో సభలో కూర్చుని అనేక వార్తలను విని ఆనందిస్తున్నాడు. చాలామంది యవన విద్వాంసులు అతన్ని సేవిస్తున్నారు. ఆ సమయంలో కామం వృద్ధిపరిచే చల్లనివాయువు పరిమళాన్ని వెదజల్లుతూ వీచింది. సభలోని వారందరూ ఇదేమిటని అటూఇటూ చూచారు.

దివ్యమైన రథం వస్తున్నట్లు చూచారు. ఆ రథం శత్రువులకు భయం కలిగించునది, మిత్రులకు సంతోషమును వృద్ధిచేయునది. ఆ రథంలో కూర్చున్న సౌభదేశపు రాజునుచూచి సంతోషంతో సింహాసనంనుంచి లేచి ఎదురుగావెళ్ళి పూజాద్రవ్యం తీసుకొని రథంనుండి దిగటాన్ని ఎదురుచూస్తున్నారు. సాల్వుడు కూడా మిక్కిలి సంతోషంతో యవనరాజునుచూచి రథంనుండి దిగాడు. పూజించు టకు ప్రయత్నిస్తున్న యవనునితో సాల్వుడు నేను పూజకు తగినవాడనుకాను. రాజుల దూతగా నీ వద్దకు వచ్చాను. జరాసంధుడు ఇతరరాజులూ పంపారు. అన్నాడు!

కాలయవనుడు రాజులచేత జరాసంధునిచేత పంపబడి దూతగా వచ్చావని ఎరుగుదును కాబట్టి విశేషంగా నిన్ను పూజిస్తాను. నిన్ను పూజిస్తే రాజులందరినీ పూజించినట్లు అవుతుంది. అని ఒకరినొకరు క్షేమం అడిగి ఇద్దరూ ఒక ఆసనంమీద కూర్చున్నారు. అప్పుడు కాలయవనుడు జరాసంధుని భుజబలాన్నిబట్టి మన మందరం సుఖంగా ఉంటున్నాము. అతనికి సాధ్యంకానిదేమున్నది? అతడేమి ఆజ్ఞాపిస్తున్నాడో చెప్పు. అతనిమాట ప్రకారం కష్టమైనపనినైనా చేస్తాను అన్నాడు.

జరాసంధుడు చెప్పిన మాటలను చెపుతాను. కృష్ణుడు అందరినీ బాధిస్తూ ఎవరికీ జయింపరానివాడయ్యాడు. అతని చెడుప్రవర్తనను విని చంపుటకు ప్రయత్నించాను. కొండకు నిప్పంటిస్తే రాముడు కొండశిఖరం నుండి దూకాడు. నాగలితో, రోకలితోనూ, సైన్యాన్ని, రథలను, గుర్రాలను, ఏనుగులను నుగ్గు చేశాడు. తరువాత కృష్ణుడు చక్రం పట్టుకొని పాదాలతో ఆ పర్వతాన్ని కుదిపేసి శత్రు సైన్యంలో చొరబడ్డాడు. చక్రంచేత, గదచేత గుర్రాలను, ఏనుగులను చూర్ణం చేశాడు. చక్రాయుధానికి భయపడిన సైన్యమును చూచుచున్న నాకు ఎదుట గదచేతబూని బలరాముడు ఎదురైయాడు. పన్నెండు అక్షౌహిణీల సైన్యాన్ని సంహరించి గదతో నన్ను కొట్టాడు. కోపంతో కాల్చివేస్తూన నన్ను చూచాడు. ఆ రూపాన్ని చూచి బ్రతకదలుచుకున్నవాడెవడు అతని ఎదుట నిలబడతాడు? గదతో రెండవ మారు కొట్టుటకు సిద్ధమగుచుండగా బ్రహ్మ అశరీరవాక్కుతో అతన్ని కొట్టవద్దు, నీచేతిలో అతను చావడు అని పలికాడు.

ఆ మాటవిని చింతిస్తూ మరలివచ్చాను. నీవు మధురానగరవాసులచే చంపబడనివాడవుగా వరం పొంది ఉన్నావు కనుక రాజులందరి ప్రార్థనమబట్టి నీవు ప్రయత్నించి కృష్ణునిమీద విజయం సాధించటానికి మధురకు రమ్ము. అక్కడ కృష్ణునిచంపి విజయపతాకను ఎగురవెయ్యి. వసుదేవుని పుత్రుడు బలరాముడు మధురలో నివసిస్తాడు. అతడు కృష్ణునికి సోదరుడు. వాళ్ళనిద్దరినీ జయించుము. రాజులందరి క్షేమం కొరకు జరాసంధుడు చెప్పినదానిని నీకు చెప్పాను. నీవు విచారించి తగినపని చేయుము.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
సాల్వకాలయవన సంవాదము అను యాభై నాల్గవ అధ్యాయము

★★★

# యాభై ఐదవ అధ్యాయము

## కాలయవనుని మాటలు

రాజుల ఆజ్ఞప్రకారం మాట్లాడుచున్న సాల్వరాజులతో యవనరాజు నేను ధన్యుడను. అనుగ్రహింపబడినవాడను. నా జీవితం ఫలించింది. మూడులోకాల లోనూ దేవదానవ గణములచేత కూడా జయింపబడని శ్రీకృష్ణుని జయించుటకు నన్ను నిశ్చయించారు కనుక నాకు విజయం ప్రాప్తిస్తుంది. వాళ్ళ నిశ్చయం ప్రకారమే నేను చేస్తాను. ఈ యుద్ధంలో నేను ఓడిపోయినా జయించినట్లే. ఈ రోజున తిథి, నక్షత్రములు ముహూర్తము అన్నీ బాగున్నాయి. కాబట్టి ఈ దినమందే కృష్ణునిపై విజయం పొందుటకు మధురపై దండెత్తుతాను అన్నాడు.

కాలయవనుడు సాల్వునకిట్లు చెప్పి సత్కరించి అతనికి విలువైన మణులు అలంకారాలు సమర్పించాడు. యుద్ధయాత్ర సిద్ధించుటకు బ్రాహ్మణులకు చాలా ధనమిచ్చాడు. తరువాత అగ్నిలో హోమంచేసి మంగళకృత్యములను నెరవేర్చి శ్రీకృష్ణుని జయించుటకు బయల్దేరాడు. సాల్వరాజు చేయవలసిన పని పూర్తి చేసినవాడై యవనరాజును కౌగలించుకొని తన పట్టణానికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కాలయవనుని మాటలు అను యాభై ఐదవ అధ్యాయము

☆☆☆

# యాభై ఆరవ అధ్యాయము

## కాలయవనుడు మధురకు వచ్చుట

జనమేజయుడిలా అడిగాడు.

ఇంద్రునితో సమానమైన పరాక్రమంగల గరుత్మంతుడు విదర్భనగరంనుండి వెళ్ళేటప్పుడు కృష్ణుడు అతన్ని ఎందుకు వెంటతీసుకువెళ్ళాడు? అలావెళ్ళి ఏపని చేశాడు?

వైశంపాయనుడిలా చెప్పాడు.

గరుడుడు విదర్భనగరంనుండి తిరిగివెళ్ళి చేసిన ఘనకార్యాన్ని చెపుతా విను. కృష్ణుడు నేను మధురానగరానికి వెళ్తున్నానని రాజుల సమక్షంలో చెప్పగానే

గరుత్మంతుడు నేను వెళ్తానని మనస్సులో అనుకొని భగవంతునికి నమస్కరించి నేను రైవతకపర్వతంమీద ఉన్న కుశస్థలినగరానికి వెళ్తున్నాను. సముద్రంఒడ్డున పర్వతంమీద ఆ పట్టణాన్ని రుక్మి నివాసంగా చేసుకొన్నాడు. అది చాలా అందమైన ప్రదేశం. దాన్ని నలువైపులా పరిశీలించి ఆ పట్టణం నీకు ఉండటానికి తగినట్లు ఉంటే అచటి బాధలన్నిటినీ దూరంచేసి నీవద్దకు తిరిగివస్తాను అన్నాడు. ఇలాచెప్పి గరుత్మంతుడు పడమరగా ప్రయాణించాడు. శ్రీకృష్ణుడు యాదవులతోపాటు మధురానగరంలో ప్రవేశించాడు. ఆసమయంలో అతనికి స్వాగతం చెప్పటానికి మహారాజు ఉగ్రసేనుడు, పౌరులు, వేశ్యలూ పట్టణం వెలుపలకువచ్చి శాస్త్రప్రకారం పూజించారు. భగవంతుని రాకకు అందరూ సంతోషించారు. జనమేజయుడు ఓ బ్రాహ్మణోత్తమా! రాజులందరూ కలిసి పట్టాభిషేకం చేశారని విని ఉగ్రసేనుడు ఏం చేశాడని ప్రశ్నించాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! చాలామంది రాజులు రాజేంద్రునిగా భగవంతుడైన శ్రీకృష్ణునకు పట్టాభిషేకం చేశారు. నిధిపతియైన శంఖుడు యాదవరూపం ధరించి అక్కడకు వచ్చిన రాజులలో ఒక్కొకనికి పదివేల బంగారునాణాలు ఇచ్చాడు. అక్కడకు వచ్చిన ఏ ఒక్కడు ఒట్టిచేతులతో తిరిగిరాలేదు అని దూతలద్వారా విని ఉగ్ర సేనుడు మధురలో ఉత్సవంతోపాటు ప్రతిదేవాలయంలోనూ పూజలు చేయించాడు. వసుదేవుని ఇంటినుండి తనయింటి వరకూ నృత్యగీతాలు జరిగాయి. విచిత్ర వర్ణాలుకల జండాలు నలువైపులా ఎగరవేశారు. నగరమంతా సున్నం వేయటంచే తెల్లగా కని పించింది. ప్రతిచోటా పూర్ణకుంభం ఉంచబడింది. రాజమార్గం చందనజలంతో తడపబడింది. వృద్ధస్త్రీలు స్తోత్రంచేస్తూ మంగళ గేయాలు పాడారు. సాధారణస్త్రీలు పూజించడానికి తమ తమ స్థానాల్లో నిలిచి ఎదురుచూస్తున్నారు.

ఈవిధంగా ఉగ్రసేనుడు నగరాన్ని ఆనందమయంగా చేస్తూ వసుదేవుని యింటికి వెళ్ళాడు. భగవంతుని రాకను వినిపించాడు. అక్కడ కొంచంసేపు మాట్లాడి బలరామునితో కలిసి అంతఃపురం బయట రథందగ్గరకు వచ్చాడు. అప్పుడు పెద్దగా శంఖధ్వని వినిపించింది. భగవంతుని శంఖధ్వని విని బాలురు, వృద్ధులు, స్త్రీలు మధురావాసులందరూ, సూతమాగధవందిజనమూ అంతఃపురం

నుండి బయటకు వచ్చారు. తరువాత ఉగ్రసేనుడు, బలరాముడూ పూజాద్రవ్యం తీసుకొని సేనతో ముందుకు నడిచారు. ఉగ్రసేనుడు కృష్ణుడు కనపడగానే తన రథంనుండి దిగి కాలినడకన వెళ్తూ బలరామునితో నేను రథంమీద వెళ్ళటం తగదు. కనుక దిగాను. నీవు రథంమీదనే వెళ్ళు. నేను విష్ణుస్వరూపుడైన అతన్ని స్తోత్రం చేయదలచుచున్నాను అన్నాడు.

అప్పుడు బలరాముడు స్తోత్రమక్కర లేకుండానే జనార్దనుడైన కృష్ణుడు నీవిషయంలో సంతోషంతో కూడినవాడు. ఆయన రాజేంద్ర పదవికి అభిషిక్తుడై నీయింటికి వస్తున్నాడు అన్నాడు. యిద్దరూ మాట్లాడుకొంటూ కేశవుని సమీపానికి వచ్చారు. పూజించుటకై చేయియెత్తిన ఉగ్రసేనమహారాజును చూచి రథమాపి శ్రీకృష్ణుడు నేను మిమ్ము మధురాపురంరాజుగా పట్టాభిషేకం చేశాను. అందుకు విరుద్ధంగా ప్రవర్తించటం తగదు. నాకు పూజ మీరు చేయదగినదికాదు. నేను కోరుటలేదు. మీ అభిప్రాయం తెలుసుకొనే నేనిలా చెపుతున్నాను. మధురానగర రాజ్యానికి మీరు రాజులు. రాజుకు విరుద్ధమైన పని చేయకూడదు. నేను రాజుకు కావలసిన ధనాన్ని యిస్తాను. ఇతరరాజులకు ఒక్కొకనికి లక్షబంగారునాణాలు ఇచ్చినట్లే మీకుకూడా వస్త్రములు, భూషణములతోపాటు మొదటనే లక్షబంగారు నాణాలు విడిగా తీసిపెట్టాను.

ఇప్పుడు బంగారపు అలంకారముగల రథంమీద కూర్చొనండి. ఛత్రచామరాదులతో అలంకరింపబడి సూర్యునితో సమానమైన కాంతిగల కిరీటాన్ని ధరించి కొడుకులు, మనుమలతో సంతోషిస్తూ మధురానగరాన్ని పరిపాలిస్తూ ఉండండి. ఇప్పుడు మీరు శత్రువులను తిరస్కరించి భోజవంశమును వృద్ధిచెందించండి. దేవతలరాజైన ఇంద్రుడు పూజ్యుడైన బలరామునికి పదివేల బంగారు నాణెములను, సూతమాగధవందిజనులు మొదలగువాళ్ళకు ఒక్కొక్కడికి వెయ్యిబంగారు నాణాలను, వృద్ధులకు, స్త్రీలకు వందనాణాలను పంపాడు. భగవంతుడైన కృష్ణుడీవిధంగా మధురాపురవాసులయొక్క, సేనయొక్క సమక్షంలో మధురా నగరరాజు ఉగ్రసేనునకు ఈవిధంగా పూజచేసి మహానందంతో మధురాపురంలో ప్రవేశించాడు.

దివ్యములైన పుష్పమాలలను, దివ్యచందనమును ధరించి శ్రీకృష్ణుడు స్వర్గంలో దేవతలతో కూడియున్న దేవేంద్రునివలె మిక్కిలి శోభించాడు. ఆ సమయంలో భేరీమృదంగాది వాద్యాలయొక్క, గుర్రాలయొక్క, వీరులయొక్క

సంతోషధ్వనులు అంతరిక్షంలో మేఘాలధ్వనివలె మిన్నుముట్టినవి. వంది మాగధులచే స్తోత్రం చేయబడుచున్న కృష్ణునికి ప్రజలు నమస్కరించారు. కృష్ణుడు అంతులేని ధనరాసులను దానంచేసి ఆశ్చర్యపడలేదు. దివ్యమైన శరీరకాంతితో వచ్చుచున్న శ్రీకృష్ణుని చూచి మధురాపురస్త్రీలు అడుగడుగునా నమస్కరించారు.

క్షీరసముద్రమందు పరుండే పరమాత్మ సర్పశయనం విడిచిపెట్టి మధురా పురానికి వచ్చాడు. ఇతడే బలిని బంధించినవాడు. కేశిరాక్షసుని చంపినవాడితడే. కంసుడు మొదలైన రాక్షసులనీతడే చంపాడు. భోజరాజైన ఉగ్రసేనుని మధురా పురానికి రాజుచేసింది ఇతడే. ఇతడెప్పుడూ రాజ్యకాంక్షతో సింహాసనమెక్కలేదు. ఇప్పుడు రాజేంద్రపదవిని పొంది మధురకు వచ్చాడు అనే పురజనుల మాటలువిని వందిమాగధులు ఓ సుగుణసముద్రా! నిన్ను వేయిశిరస్సులు, రెండువేల నాలుకలు గల అనంతుడే వర్ణించగలవాడు. దేవరాజు ఇంద్రునివద్దనుండి సింహాసనము, దేవసభ, నీటితో నిండిన అభిషేకకలశము ఎవనికొరకు ఎప్పుడూ వచ్చినట్లు వినలేదు. నిన్ను గర్భంలో ధరించిన దేవకి ధన్యురాలు. నీ ముఖపద్మాన్ని ప్రేమతో ఎప్పుడూ చూచే అదృష్టం ఆమెకే కలిగింది. ఇలాంటి మెప్పుమాటలనువింటూ ఉగ్రసేనుడు, కృష్ణబలరాములు ప్రాకారద్వారంవద్దకు వచ్చారు.

అప్పుడు పూజించి నమస్కారంచేసి మహారాజు ఉగ్రసేనుడు ఒక ఏనుగు మీద కూర్చున్నాడు. మేఘం వర్షించినట్లు బంగారువర్షం కురిపించాడు. ఆ బంగారు వర్షంలో భగవంతుడైన కృష్ణుడు తన తండ్రియైన వసుదేవుని యింటివద్దకు చేరి ఉగ్రసేనుడితో పూజ్యుడా! ఇంద్రుడు నా అభిషేకానికి పంపిన రాజసింహాసనాన్ని ఇప్పుడు మాతండ్రి యింటిలో ఉంచుతా. కొంచంకాలం తరువాత మీ సభలో పెడతాను. ఈవిషయంలో మీరు కోపించవద్దని ప్రార్థిస్తున్నాను అన్నాడు. ఆ సమయంలో దేవకీవసుదేవులయొక్క, రోహిణియొక్క సంతోషానికి హద్దులేదు. ఏమి చేయవలసినదీ తెలియని స్థితిలో పడ్డారు.

తరువాత కంసుని తల్లి దేశకాలపరిస్థితులనుబట్టి భగవంతుడైన కృష్ణునికి పూజచేసి కంసుడు అనేక దేశాల నుండి తెచ్చిన ధనాన్ని అంతా కృష్ణుని పాద పద్మములకు సమర్పించింది. అప్పుడు కృష్ణుడు మధుర మైనవాక్కుతో మహారాజ! నేను మధురారాజ్యాన్ని కోరటంలేదు. నాకు ధనంమీద కోరికకూడ లేదు. దీన్ని పొందటానికి కంసుని చంపలేదు. అతడు దైవవశంవల్ల మరణించాడు. ఇప్పుడు

మీరు అనేకయజ్ఞాలు చేయండి. ఎక్కువధనం దానం చేయండి. కంసుని మరణం వల్ల దుఃఖాన్ని విడిచిపెట్టండి. మీరు నాకు ఇచ్చిన ధనాన్ని మీకు తిరిగి ఇస్తున్నాను. దాన్ని స్వీకరించండి. ఈవిధంగా ఉగ్రసేనుని ఊరడించి కృష్ణుడు బలరామునితో తల్లితండ్రులవద్దకు వెళ్ళాడు.

గొప్ప బలశాలురైన రామకృష్ణులు ఆనందంతోనిండిన హృదయాలు కలవారై తల్లిదండ్రుల పాదాలకు వంగి నమస్కరించారు. అప్పుడు మధురానగరము స్వర్గాన్ని విడిచిపెట్టివచ్చిన అమరావతివలె ప్రకాశించింది. పురజనులు వసుదేవుని భవనం చూచి ఇది దేవలోకంగాని భూలోకంకాదు అని మనస్సులో అనుకొన్నారు. భార్యా సమేతుడైన ఉగ్రసేనుని విడిచి వసుదేవుని యింటిలో ప్రవేశించి కేశవబలరాములు ఆయుధాలను విడిచిపెట్టి తమయింటిలో స్వేచ్ఛగా సంచరిస్తూ ఉన్నారు. వాళ్ళిద్దరూ ప్రాతఃకాలకృత్యాలను పూర్తిచేసి సుఖంగా కూర్చునియుండగా గొప్ప కష్టసూచనలు కనబడ్డాయి. సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి. సర్పరాజు ఆశ్చర్య పడ్డాడు. యాదవులు కంపించారు. ఈస్థితిలో కూడ కృష్ణబలరాములు చలించ లేదు. చివరకు రెక్కలగాలిచేత పక్షిరాజైన గరుత్మంతుడు వస్తున్నాడని తెలిసింది.

కొంచంసేపటి తరువాత దివ్యమైన పుష్పమాలను, దివ్యచందనమును ధరించిన పక్షిరాజు గరుత్మంతుడు వచ్చాడు. సోదరులిద్దరికీ నమస్కరించి కూర్చు న్నాడు. తనకు యుద్ధ మంత్రి, ఆపద్బంధువు, ధైర్యశాలియైన గరుడునకు స్వాగతం పలికి మనం ఆలోచించవలసిన పని గురించి ఉగ్రసేనుని అంతఃపురానికి వెళ్దాం. అక్కడ ఆనందంగా ఆలోచిద్దాం అన్నాడు కృష్ణుడు. తరువాత కృష్ణబలరాములు, గరుత్మంతుడు ముగ్గురూ ఉగ్రసేనుని అంతఃపురానికి వెళ్ళారు. అక్కడ రహస్య విషయాన్ని ఆలోచించటం ప్రారంభించారు. మొదట కృష్ణుడు ఇలా అన్నాడు.

బ్రహ్మ వరంచేత జరాసంధుడు మనచే చంపబడడు. చాలమందిరాజులు అతని పక్షంలో ఉన్నారు. గొప్పసైన్యాన్ని కలిగి ఉన్నాడు. కాబట్టి వైనతేయా! మధురా నగరం మాయిద్దరికీ నివాసానికి తగినదికాదుఅన్నాడు. గరుత్మంతుడు దేవదేవ! నమస్కరించి మీవద్దనుండి నీ నివాసానికి తగిన ప్రదేశం చూడటానికి కుశస్థలికి వెళ్ళాను. ఆ పట్టణం అన్ని మంచిలక్షణాలు కలది. అన్ని సౌఖ్యాలు కలది. కనుకనే నాకు బాగానచ్చింది. ఆ నగరానికి నలువైపులా సముద్రం ఉండటం ఒక ప్రత్యేకత.

దేవతలు కూడ ఆనగరాన్ని ముట్టడించలేరు. అక్కడ ఎల్లప్పుడూ గొప్ప ఆనందంతో ఉండవచ్చు. ఆ నగరం శత్రువర్గానికి భయంకరమైనది. మిత్రవర్గానికి సంతోషం వృద్ధిచేయునది. భూమండలంలో ఏ రాజు నగరమూ దానికి సరిపోదు. ఇప్పుడు మీరు మిక్కిలి గొప్పదైన ఆ నగరాన్ని రాజధాని చేసుకొని పర్వతశ్రేష్ఠమైన రైవతక గిరిని దేవనగరంగ మలచండి. ముందుకాలంలో ఆ పట్టణం ద్వారవతిగా ప్రసిద్ధి చెందుతుంది. సముద్రుడు మరికొంత స్థలం మీకిస్తే విశ్వకర్మ మరింత శోభగా ఉండునట్లు నిర్మాణాలు చేస్తాడు అని గరుత్మంతుడు ఈవిధంగా చెప్పి తలవంచి నమస్కారం చేశాడు. తన ఆసనం మీద కూర్చున్నాడు.

కృష్ణబలరాములు గరుడుడు చెప్పినది మేలైనదిగా తలచారు. విలువైన ఆభరణాలతో గరుత్మంతునకు సత్కారం చేసి విడిచిపెట్టారు. స్వర్గమందలి దేవతల వలె వాళ్ళిద్దరూ ఆనందంతో ఉన్నారు. ఉగ్రసేనుడు గరుత్మంతుని మాటలు విని శ్రీకృష్ణునితో ఓ ప్రభూ! నీవు లేకపోతే భర్తపోయిన స్త్రీవలె మేము ఈ నగరంలోగాని, మరొకచోటగాని సుఖంగా ఉండజాలము. నీవు మావద్ద ఉంటే మేము నీ భుజంనీడన ఉంటూ రాజులకు భయపడము. ఇంద్రునికి కూడ భయపడము. ఓ యాదవశ్రేష్ఠా! విజయంకొరకు నీవు వెళ్ళేచోటకు నీతోపాటు మమ్మ కూడా తీసుకువెళ్ళు అన్నాడు. భగవంతుడు కృష్ణుడు ఉగ్రసేనుడి మాటలు విని చిరునవ్వుతో మహారాజ! నేను మీయిష్టప్రకారమే చేస్తా అనిచెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కాలయవనుడు మధురకు వచ్చుట అను యాభై ఆరవ అధ్యాయము

☆☆☆

# యాభై ఏడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కొంతకాలం గడిచాక మహాత్ముడైన కృష్ణుడు ఒకరోజాలన యాదవుల సభలో సభ్యులనుగూర్చి సభాసదులారా! మన యీ మధురానగరం గొప్ప శుభాలనిచ్చేది. నేనిక్కడనే పుట్టాను. వ్రజంలో పెరిగాను. ఇప్పుడు మనకు దుఃఖాలేమి లేవు. శత్రువులను ఓడించాము. కాని జరాసంధునితో, ఇతరరాజులతో

విరోధము వేళ్ళు బారింది. ఇప్పుడు మనదగ్గర గుర్రాలు మొదలైన వాహనాలు లెక్కలేనంత కాల్బలం, అనేకవిధములైన రత్నాలు, మిత్రులు ఎక్కువగా ఉన్నారు. ఈ మధురాపురం భూమి చిన్నదగుటచే శత్రువు త్వరగా ముట్టడించటానికి వీలౌతున్నది. మన బలము, మిత్రులు పెరిగారు. కోట్లకొలది క్రొత్త కాల్బలానికి తగినంత భూమిలేదు. కనుక ఓ యాదవపుంగవులారా! ఇప్పుడిక్కడ ఉండటం నాకిష్టంగాలేదు. కాబట్టి ఇంకొక పట్టణంలో నివసిస్తాను. ఇందుకు నన్ను క్షమించండి. నేను చెప్పినది మీరు తెలుసుకుంటే నా ప్రయత్నం వల్ల మీకు శుభం కలుగుతుంది అన్నాడు.

ఈ మాటలు విని యాదవులు ఏకగ్రీవంగా సంతోషంతో ఓ యదుశ్రేష్టా! మా క్షేమానికి తగినపనినే చేయండి అన్నారు. తరువాత వృష్ణివంశీయులు ఆలోచించుకొని జరాసంధుడు మనకు చంపశక్యం కానివాడు. శత్రుపక్ష సైన్యం కూడా పెరిగింది. శత్రువులు ముట్టడిస్తే మన సైన్యాన్ని తేలికగా నాశం చేస్తారు. ఆ శత్రువుల సైన్యాన్ని వందసంవత్సరాలైనా చంపలేము. అని మరొక చోటకు వెళ్ళాలని నిశ్చయించారు.

ఇదే సమయంలో కాలయవనునితోపాటు జరాసంధుడు మధురకు వచ్చాడు. అతనివెంట గొప్ప సైన్యముంది. శ్రీకృష్ణుడు ఈ రోజే మంచిది. మన సైన్యంతో వెళ్ళిపోదాం అన్నాడు. కృష్ణుని ఆజ్ఞప్రకారం అందరూ యాదవులు వెళ్ళిపోయారు. పుత్రమిత్రకళత్రాదులు గజాశ్వరథవాహనములు వెంటరాగా వృష్ణివంశీయులు పడమర దిక్కుగా వెళ్ళారు.

శ్రీకృష్ణుడు మొదలైన యుద్ధనైపుణ్యంకల యాదవులు తమ తమ సేనలతో వెళ్ళిపోయారు. తరువాత అందమైన సముద్రపుఒడ్డున గుర్తించబడినస్థానం చేరి వాళ్ళు సంతోషించారు. ఆ స్థానం లతలతో కూడిన పొదరిండ్లు కొబ్బరిచెట్లు కల వనములతో కూడినది. మొగలిపువ్వుల తోటలో ద్రాక్షతోటలు కలిగి మిక్కిలి శోభిస్తున్నది. దేవతలు స్వర్గం చేరినట్లు వారీ స్థానాన్నిచేరి మిక్కిలి ఆనందించారు.

ఆ సమయంలో నివాసమునకు తగిన ప్రదేశాన్ని వెతుకుచుండగా సింధురాజు నిర్మించిన ఎనిమిది కోణములుగల నగరము కనిపించింది. శ్రీకృష్ణుడు అక్కడనే తాను పట్టణం నిర్మించాలని కోరిక వెలిబుచ్చాడు. యాదవులు సేనలకు శిబిరాలు స్థాపించాలని అక్కడ నిశ్చయించారు. శ్రీకృష్ణుడు యాదవులతో ఆలోచించి ఆ

ప్రదేశంలో నివాసానికి నిశ్చయించాడు. శాస్త్రప్రకారము భవననిర్మాణము చేశారు. యాదవులు ద్వారవతీపురంలో ప్రవేశించి సుఖంగా నివసించ మొదలుపెట్టారు. భగవంతుడైన కృష్ణుడు కాలయవనుడు రావటంచేత, జరాసంధుని భయంవల్లనూ ద్వారవతీపురంలో నివసించటం ప్రారంభించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళుట అను యాభై ఏడవ అధ్యాయము

☆☆☆

# యాభై ఎనిమిదవ అధ్యాయము

## కాలయవన వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! మహాత్ముడు యదుశ్రేష్ఠుడైన వాసుదేవుని చరిత్ర విస్తారంగా వినకోరుతున్నాను. భూమండలంలో మిక్కిలి ఉత్తమస్థానమైన మధురానగరాన్ని యుద్ధం లేకుండానే ఎందుకు విడిచిపెట్టాడు? కాలయవనుడు భగవంతునితో ఎలా ప్రవర్తించాడు? ద్వారవతిలో చేరితే కృష్ణుడు ఏం చేశాడు? కాలయవనుని పరాక్రమానికి భయపడి శ్రీకృష్ణుడు పారిపోవలసిన పరిస్థితికి వచ్చాడంటే అతడెంత బలవంతుడు? ఎవని పుత్రుడు?

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! గార్గ్యమహర్షి యాదవులకు గురువు. అతడు భార్యఉన్నా చాలాకాలం బ్రహ్మచర్యవ్రతం పాటించాడు. ఒకనాడు అతని బావమరిది సభలో నపుంసకుడని హేలన చేశాడు. అందుకతడు కష్టపడి పుత్రవాంఛతో అతడు అజితంజయనగరానికి వెళ్ళాడు. అక్కడ శంకరుని ప్రసన్నుని చేసుకొనుటకు ఒక ఘోరంగా పన్నెండేళ్ళు తపస్సు చేశాడు. శివుడతని తపస్సుకు అనుగ్రహించి మహా ప్రతాపవంతుడైన ఒక పుత్రుడు కలుగుతాడని వరమిచ్చాడు. తరువాత యవనరాజు ఈ విషయమంతా విని ఆ మునిని పిలిచి అనేకవిధాల ఊరడించి అతన్ని గొల్లపల్లెలో గొల్లపడుచుల మధ్య నివసించేటట్లు ఏర్పాటు చేశాడు.

గోపాలి అనే అప్సరస గొల్లపడుచు వేషంలో అతనివలన గర్భం ధరించింది. కాలయవనుడనే శూరుడు, మహాబలశాలి జన్మించాడు. ఆ పిల్లవాడు సంతానంలేని

రాజుయొక్క అంతఃపురంలో ఎదిగాడు. రాజు మరణించిన తర్వాత కాలయవనుడు రాజై యుద్ధాన్ని కోరుతూ బ్రాహ్మణులను అడిగాడు. వృష్ణివంశం, అంధకవంశం వాళ్ళను నారదుడు సూచించాడు. అతడే శ్రీకృష్ణుడనికూడ తెలియచేశాడు. కాలయవనుడు వృద్ధిపొందటం విని అతడెప్పుడు వచ్చిపడునోఅని ఆలోచిస్తూనే ద్వారవతికి చేరాడు.

ఆ కాలయవనుడు అనేక శకతుషార దరదాది జాతులతో కలిసి మధురమీద దండెత్తాడు. అతని సైన్యము నడకకు భూమి కంపించింది.ధూళి ఆకాశాన్ని కప్పివేసింది. మదించి ఉన్న కాలయవనుడు మనతో యుద్ధానికి సిద్ధమౌతున్నాడు. నారదుడు మనం మధురలో నివసించుట పూర్తి అయినట్లు చెప్పాడు కాబట్టి యిక్కడనుండి పారిపోవుటే మేలు.

ఇలా నిశ్చయించి శ్రీకృష్ణుడు ఒక కుండలో నల్లని ఘోరమైన సర్పాన్ని పడవేసి మూతవేసి తనదూతతో కాలయవనుడికి పంపాడు. కృష్ణుడు మీకు కాల సర్పంలాంటివాడని భావం. ఆ దూత కాలయవనుడికి ఆ కుండను చూపించాడు. అతడు యాదవుడు నన్ను భయపెట్టాలని చూస్తున్నాడని గ్రహించి ఆ కుండనిండా చీమలు నింపాడు. ఆ సర్పం చీమలచేతినపడి బూడిద అయ్యింది. ఆ కుండను యవనరాజు కృష్ణుడికి పంపాడు. తన ఉపాయం ఫలించలేదని గ్రహించిన కృష్ణుడు మధురను విడిచి ద్వారకకు వెళ్ళాడు.

అక్కడ వృష్ణివంశంవాళ్ళను ఊరడించాడు.వైరాన్ని పోగొట్టుకోవాలని కాలి నడకన వెళ్ళే బాటసారివేషం ధరించి మధురకు తిరిగివచ్చాడు.అప్పుడతని చేతిలో యేమి ఆయుధంలేదు. కాలయవనుడతన్నిచూచి యుద్ధానికి తలపడ్డాడు. భగవంతుడతన్ని చూచి పారిపోయాడు. కాలయవనుడతన్ని పట్టుకోటానికి వెనకనే వెళ్ళాడు. కాని కృష్ణుని పట్టుకోలేకపోయాడు.

పూర్వం మాధాతపుత్రుడు ముచుకుందుడు దేవ రాక్షసులయుద్ధంలో గెలుపొందాడు. దేవతలు వరమిస్తామంటే అలసియున్న అతడు నిద్ర కావాలన్నాడు. నిద్రా సమయంలో మెలకువ కలిగించినవాణ్ణి కోపంతో బూడిదచేస్తాను అని వరమడగగా ఇంద్రాదిదేవతలే అట్లే అగుగాక అని వరమిచ్చారు. అతడు భూ లోకంలో ఒక పర్వతంమీదికి వెళ్ళి ఒక గుహలో కృష్ణుడు తనకు కనపడేవరకు నిద్రపోతూనే ఉన్నాడు. నారదుడప్పుడే కృష్ణుని వద్దకు వచ్చి ఈ విషయమంతా చెప్పాడు.

యవనరాజు వెంటాడుతుండగా శ్రీకృష్ణుడు నిశ్శబ్దంగా ముచుకుందుని గుహలో ప్రవేశించాడు. ముచుకుందుని తలవైపున దాగిఉన్నాడు. కాలయవనుడు గుహలోపల దూరగా యమధర్మరాజువంటి ముచుకుందుడు కనపడ్డాడు. అతడే కృష్ణుడనుకొని కాలయవనుడు కాలితో తన్నాడు. కాలిదెబ్బకు నిద్రాభంగమయింది. వెంటనే కోపించిన ముచుకుందుని నేత్రాగ్ని కాలయవనుడిని కాల్చి భస్మంచేసింది. తరువాత శ్రీకృష్ణుడు తన కోరిక తీరినవాడై మేల్కొనిన ముచుకుందునితో రాజా! మీరు చాలారోజులనుండి నిద్రపోతున్నట్లు నారదుడు చెప్పాడు. ఇప్పుడు నాకు గొప్పపనిని నెరవేర్చారు. మీకు శుభమగుగాక, నేను వెళ్తున్నానన్నాడు.

మహారాజు ముచుకుందుడు మిక్కిలి చిన్న ఆకారంలో ఉన్న భగవంతుని చూచి నిద్రలో చాలాకాలం గడిచినట్లు అనగానే వేరొకయుగం వచ్చినట్లు తలచి భగ వంతునితో నీవెవడవు, ఎందుకు వచ్చావు? నీకు తెలిస్తే నాకు నిద్రలో ఎంత కాలం గడిచింది? చెప్పమన్నాడు. యదువంశంలో వసుదేవుని కుమారుడను, నా పేరు వాసుదేవుడు, మీరు త్రేతాయుగంనుండి యిక్కడ నిద్రపోతున్నట్లు నారదమహర్షి చెప్పాడు. ఇప్పుడు కలియుగం వచ్చింది. మీకేం సేవ చేయమంటారో చెప్పండి, నా శత్రువును భస్మం చేసి మీరు గొప్ప ఉపకారం చేశారు అని వాసు దేవుడు చెప్పిన తరువాత ముచుకుందుడు గుహనుండి బయటకు వచ్చాడు.

శ్రీకృష్ణుడతని వెనుక నడవసాగాడు. అతనికి ప్రపంచమంతా పొట్టిదిగా కనిపించింది. మనుష్యులు, స్వల్ప ఉత్సాహం కలవాళ్ళు, కొంచం పరాక్రమం కలవాళ్ళు, కొంచం బలంకలవాళ్ళుగా కనపడ్డారు. తన రాజ్యాన్ని మరొకడు పరి పాలిస్తున్నాడు. అతడు సంతోషంతో కృష్ణుని వీడ్కొని తపస్సు చేసుకొనుటకు హిమాలయపర్వతం మీదికి వెళ్ళాడు. కొంతకాలమక్కడ తపస్సుచేసి శరీరవ విడిచిపెట్టాడు. తన మంచిపనుల ఫలితంగా స్వర్గం చేరాడు. కాలయవనుని సైన్యాన్ని తీసుకొని శ్రీకృష్ణుడు ద్వారకాపురం వెళ్ళాడు. తరువాత శత్రువునుండి ప్రాప్తించిన సంపదనంతనూ ఉగ్రసేనుడికి ఇచ్చివేశాడు. ద్వారకానగరం అనేక విధాలయిన రత్న, ధన, సమూహాలతో లెక్కలేనన్ని ఏనుగులు, గుర్రాలు కలిగి మిక్కిలి శోభతో ఉన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కాలయవన కథ అను యాభై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# యాభై తొమ్మిదవ అధ్యాయము

## ద్వారకాపుర నిర్మాణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత తెల్లవారి సూర్యోదయం కాగా కృష్ణుడు ప్రాతఃకాల జపం మొదలైన పనులు పూర్తి చేసుకొని దుర్గనిర్మాణానికి తగిన స్థానం చూడటానికి వనంలోకి వెళ్ళాడు. ప్రధానులైన యాదవులు అతని వెంట ఉన్నారు. దుర్గ నిర్మాణానికి స్థలం నిర్ణయించిన తరువాత శుభదినమందు రోహిణి నక్షత్రంలో బ్రాహ్మణుడు స్వస్తివాచనం చేయగా దుర్గ నిర్మాణ కార్యక్రమం ప్రారంభించ బడింది.

శ్రీకృష్ణుడు యాదవులను పిలిచి ఓ యాదవులారా! చూడండి నేను స్వర్గం లాగా, అందమైన పట్టణాన్ని నిర్మించి దానికి పేరు గూడ ద్వారవతి అని నిర్ణయిం చాను. ఈ పట్టణం అమరావతిలాగా శోభిస్తూ ఉంటుంది. అమరావతిలో ఇళ్ళు, వాకిళ్ళు, రాజమార్గం మొదలైనవెలా ఉన్నాయో అలాగే ఇక్కడ గూడా నిర్మింప బడతాయి. ఇళ్ళు నిర్మించటానికి నేర్పరులైన శిల్పులకు వార్త పంపాలి. అన్నాడు.

శ్రీకృష్ణుని మాటప్రకారం గృహనిర్మాణ కార్యక్రమమందు ఉత్సాహంతో యాదవులు మంచి ముహూర్తంలో అన్ని పనులు చేయమొదలుపెట్టారు. మొదట స్థలం కొలిచి శుభదినమందు బ్రాహ్మణులచేత వాస్తుపూజ చేయించారు. తరువాత భగవంతుడైన శ్రీకృష్ణుడు శిల్పులను పిలిచి మాకు నాలుగువీధుల కూడలి, ఇష్ట దేవతా స్థానములో మనోహరంగా అందంగా భవనాలు నిర్మించాలి. అని చెప్పాడు. ఆ శిల్పులు భగవంతుని ఆజ్ఞను అంగీకరించి ముళ్ళు మొదలైనవాటిని తొలగించి నేలను బాగుచేశారు. తరువాత నియమాన్ని బట్టి భవననిర్మాణాన్ని నిశ్చయించారు. ఆ యిండ్ల వెలుపల బ్రహ్మ, వరుణుడు మొదలైనవారి స్థానములు కల్పించారు. అన్ని హంగులు ఏర్పరచారు.

శ్రీకృష్ణుడు పట్టణ నిర్మాణం త్వరగా జరగాలని అనుకున్నాడు. ప్రజాపతి పుత్రుడైన విశ్వకర్మ పట్టణనిర్మాణం చేస్తే బాగుంటుందని మనస్సులో తలచాడు.

దేవతలలో శ్రేష్ఠుడైన విశ్వకర్మ కృష్ణుని యెదుట ప్రత్యక్షమయ్యాడు. విశ్వకర్మ ఓ మహావిష్ణూ! ఇంద్రుడు త్వరగా నీ దగ్గరకు వెళ్ళమని నన్ను పంపాడు. సేవకుడను వచ్చాను ఆజ్ఞాపించు చేయవలసినపని యేమి? శంకరుడు నీవు సమానులే ఓ మహాబాహూ! నేనేమి చేయాలో శాసించుము. అన్నాడు.

కేశవుడా మాటలువిని స్వర్గంలో అమరావతీపురంలాగా పురనిర్మాణం ఇక్కడ చేయాలి. నీవలా చేయుటకు సమర్థుడవు. అన్నాడు. విశ్వకర్మ నీవు చెప్పినట్లే చేస్తా. కాని ఈ పట్టణం యాదవులందరూ ఉండటానికి సరిపోదు. సముద్రుడు కొంచం స్థలమిస్తే చాలా అందంగా ఈ పట్టణం తయారవుతుంది. అన్నాడు. కృష్ణుడింతకు ముందే సముద్రుని స్థానం అడగాలని సంకల్పించాడు. విశ్వకర్మ మాటను విని కృష్ణుడు సముద్రుని నాకు పన్నెండు ఆమడలు విశాలమైన స్థలం కావాలి. నువ్వు అలాచేస్తే నా పట్టణం కావలసినంత స్థలం కలదౌతుంది. నా సైన్యం నివసించటానికి స్థలం సరిపోతుంది. నామీద గౌరవముంటే పన్నెండు ఆమడలు వెనక్కి జరుగు.

సముద్రం వాయువు సహాయంతో వెనక్కి జరిగింది. అప్పుడు విశ్వకర్మ మీరు ఈ రోజునుండి నగరంలో ప్రవేశించే కార్యక్రమం ప్రారంభించండి. నేను మనస్సుచేత అందమైన ద్వారకాపురాన్ని నిర్మించాను. త్వరలోనే ఆ పట్టణం ద్వారతోరణములు మొదలగువాటితో కూడి శ్రేష్టమైన ప్రాకారంతో అగడ్తలలో సురక్షితంగా ఉంది. అందమైన స్త్రీ పురుషులు, వర్తకులు అనేక విధాలైన అంగడులు, దిగుడుబావులు, చలివేంద్రములు, ఉద్యానవనములు కలిగి మిక్కిలి శోభతో ఉంది. శ్రీకృష్ణుడా పట్టణంలో సంతోషంతో నివసించాడు.

విశ్వకర్మ ఆ పట్టణాన్ని స్వర్గంలా తీర్చిదిద్ది గోవిందుడు పూజింపగా స్వర్గానికి వెళ్ళాడు. యాదవులందరూ ఆ పట్టణంలో మిక్కిలి సంతోషంతో నివసిస్తున్నారు. తరువాత శ్రీకృష్ణుడు ధనం ద్వారా ద్వారకానగర ప్రజలను తృప్తిపరచుటకై ఒకరోజు రాత్రి కుబేరుని అధీనంలో ఉన్న శంఖనిధిని తనయింటికి పిలిచాడు. గని అధిపతి ద్వారకాప్రభువు వద్దకు వచ్చాడు. అతడు నమస్కరిస్తూ ఓ భగవంతుడా! నేను దేవతలనిధి రక్షకుణ్ణి. ఓ యదునందనా! ఇప్పుడు తమకు నేను ఏ సేవచేయవలెనో ఆజ్ఞ ఈయండి అన్నాడు.

అప్పుడు భగవంతుడు నీవు ద్వారకానగరంలో జనుల్ని అందరినీ ధనవంతు లనుగా చెయ్యి. ఈనగరంలో బీదవాడు, ఆకలితో అలమటించేవాడు, బల హీనుడు, మలినుడు, అడుక్కునేవాడు కనబడకూడదు అన్నాడు. అప్పుడు నిధిపతి నమస్కరించి మీ యాజ్ఞ శిరసావహిస్తున్నానని తన నిధులను పిలిచాడు. ఆ నిధులతో మీరు ద్వారకానగరంలో ప్రతియింటా ధనం వర్షించాలి అన్నాడు. వెంటనే ఆనిధులు తమ ప్రభువుయొక్క ఆజ్ఞను నెరవేర్చాయి. అందువల్ల ద్వారకానగరంలో ఏ ఒక్కడు దరిద్రుడనేవాడు లేడు. ఒకసారిగా అందరూ ధనవంతులయ్యారు. ఒకరోజున శ్రీకృష్ణుడు ద్వారకానగర ప్రజలకు శుభము, క్షేమమూ చేయదలచి వాయుదేవుణ్ణి పిలిచాడు. పిలవగానే వాయుదేవుడు ఏకాంతమందుండగా శ్రీకృష్ణునివద్దకు వెళ్ళి దేవా! మీకు నేను సేవకుడను. నేను మీకే సేవచేయాలో సెలవీయండి అని అడిగాడు.

భగవంతుడు ఓ వాయుదేవా! నీవు త్వరగా స్వర్గానికి వెళ్ళి దేవతల అను మతితో 'సుధర్మ' అనే దేవతల సభాభవనాన్ని యిక్కడకు తీసుకురా. యాదవులు ఆ సభ యందు కూర్చుంటారు. నాశరహితము, కోరిక ప్రకారం సంచరించేదీ, కావలసిన రూపం ధరించేదీ అయిన సభను ఇక్కడకు తీసుకురావాలి అన్నాడు. వాయుదేవుడు వెంటనే స్వర్గానికివెళ్ళి అక్కడ దేవతలకు శ్రీకృష్ణుని కోరికనుచెప్పి వాళ్ళ అనుమతితో 'సుధర్మ' అనే దేవసభను భూలోకానికి తెచ్చాడు. దేవతల సభాభవనాన్ని శ్రీకృష్ణునికి సమర్పించి వాయుదేవుడు అంతర్ధానం చెందాడు.

శ్రీకృష్ణుడు ద్వారకలోని ప్రజల కళ్యాణంకొరకు 'సుధర్మ'ను పట్టణంలో స్థాపించాడు. అప్పుడు భగవంతుడు మెల్ల మెల్లగా స్వర్గంలో, భూలోకంలోనూ ఉండే పద్మాలు మొదలైన అనేకవిధాలైన వస్తువులతో ఆ పట్టణాన్ని ఒక సుందర స్త్రీవలె శృంగారించాడు. సైన్యాధ్యక్షులను, పురోహితుని నియమించి పదిమంది యాదవ వృద్ధులను వంశక్షేమమును చూచుటకు, దారుకుడనువాణ్ణి సారథిగాను, యోధులలో ముఖ్యునిగా సాత్యకిని ఏర్పరచి శ్రీకృష్ణుడు యాదవులతో సంతోషించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుండలి ఖిష్ణుపర్వంలో ద్వారకాపుర నిర్మాణము అను యాభై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# అరవైయవ అధ్యాయము

## రుక్మిణీహరణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ప్రతాపవంతుడైన జరాసంధుడు చేదిదేశపురాజగు దమఘోషుని ఇష్టం నెరవేర్చుటకు, మహారాజైనా భీష్మకుని కుమార్తెకు శిశుపాలునితో వివాహం జరుగుతుందని రాజసమూహంతో సాటించాడు. తరువాత కపటయుద్ధంలో నేర్పరియైన దంతవక్త్రుని కుమారుడైన సువక్త్రుడు, భగదత్తుడు, భూరిశ్రవుడు మొదలగు రాజులకు ఈ సమాచారాన్ని పంపాడు. వాళ్ళు స్వయంవరంలో కలుసుకోవటానికి భోజరాజు వద్దకు వెళ్ళారు. ఇదివిని జనమేజయుడు వైశంపాయనుని అడిగాడు.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! ప్రతాపశాలియైన రుక్మి ఏ దేశంవాడు? ఏ వంశంలో పుట్టాడు? అని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ రాజా! యాదవుడనే రాజుకు విదర్భుడనే పుత్రుడున్నాడు. అతడు వింధ్య పర్వతానికి దక్షిణాన దక్షిణవిదర్భ అనే ఒక నగరంలో ఉంటున్నాడు. అతనికి క్రథ, కైశికుడు, ముఖ్యులైన బలశాలురైన పుత్రులున్నారు. అతని వంశంలో భీముడనేవాడికి వృష్ణులనే రాజులు జన్మించారు. వాళ్ళలో క్రథుడనే వానివంశంలో భీష్మకుడు జన్మిం చాడు. భీష్మకుడు కుండిన నగరంలో ఉండేవాడు. అతని కొడుకు రుక్మి, కుమార్తె రుక్మిణి. రుక్మి ద్రుముడనే వానినుండి దివ్యాస్త్రాలను పొందాడు. పరశురాముని నుండి బ్రహ్మాస్త్రాన్ని పొందాడు. అతడు నిత్యమూ శ్రీకృష్ణునితో విరోధంగలవాడు. రుక్మిణి సౌందర్యం సాటిలేనిది. ఆమెను శ్రీకృష్ణుడు, శ్రీకృష్ణుని ఆమెయు ప్రేమించుకున్నారు.

రుక్మి ఆమెను ద్వేషంవలన శ్రీకృష్ణునికి ఈయలేదు. తరువాత జరాసంధుడు శిశుపాలునకు ఆ కన్యనిమ్మని భీష్మకుని అడిగాడు. భీష్మకుడు అంగీ కరించాడు. జరాసంధుడు శిశుపాలుని వివాహానికి దంతవక్త్రుడు, పౌండ్రకవాసు దేవుడు మొదలగువాళ్ళను పిలిచి వాళ్ళతోపాటు భీష్మకుని యింటికి వెళ్ళాడు. ఇటు శ్రీకృష్ణుడు, బలరాముడుకూడా మేనత్తను సంతోషపెట్టుటకు వృష్ణివంశీయులతో

పాటు పెద్దసైన్యాన్ని తీసుకొని అక్కడకు చేరాడు. క్రథకైశికులు వాళ్ళకు స్వాగతం పలికి పట్టణం వెలుపల ఉద్యానవనంలో వాళ్ళను ఉంచారు. వివాహం రేపనగా శచీదేవికి పూజ చేసేందుకు రుక్మిణి జ్యేష్ఠానక్షత్రంలో రథంమీద దేవ మందిరానికి వెళ్ళింది. సైనికులు నలువైపులా కాపలా ఉన్నారు.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు లక్ష్మీదేవివలె ఉన్న ఆమెను చూచాడు. తెల్లని పట్టుచీర కట్టి అద్భుతసౌందర్యవతి యైన రుక్మిణిని చూడగానే తనకు కాబోయేభార్య అని ఆశకలిగింది. అప్పుడు బలరాముడు మొదలగువాళ్ళతో ఆలోచించి దేవతా పూజ అయినతర్వాత రుక్మిణి ఆలయం లోంచి బయటకు వచ్చింది. శ్రీకృష్ణుడు వెంటనే ఆమెను పట్టుకొని తన రథంమీద కూర్చోపెట్టాడు. అప్పుడు అడ్డగించు టకు వచ్చినవాళ్ళను చెట్టుపెరికి చంపాడు. అతని ఆజ్ఞచేత వృష్ణివంశీయులు నలువైపులా రక్షణకు నిలిచారు. తక్కినరాజులు అనేకవిధాలైన రథాలతో గుర్రా లతో, ఏనుగులతో బలరాముని చుట్టుముట్టారు. రుక్మిణిని తీసుకొని శ్రీకృష్ణుడు త్వరగా తన పట్టణానికి వెళ్ళాడు. బలరాముడు, యుయుధానుడు, అక్రూరుడు, కృతవర్మ, చక్రదేవవసుదేవులు మొదలగువాళ్ళు శత్రువుల నెదుర్కొన్నారు.

దంతవక్త్రుడు, శిశుపాలుడు, జరాసంధుడు జనార్దనుని చంపాలని బయల్దేరారు. చేదిరాజైన దమఘోషుడు తనసోదరులతో అంగవంగాదిదేశాల రాజులతో యుద్ధానికి వచ్చాడు. వృష్ణివంశీయులు బలరాముని తమనాయకునిగా ఎన్నుకొని ముందుకుసాగారు. జరాసంధుడు అతివేగంగా రావటంచూచి సాత్యకి ఏడుబాణాలతో అతన్ని బాధించాడు. అక్రూరుడు తొమ్మిదిబాణాలతో దంత వక్త్రుని, దంతవక్త్రుడు పదిబాణాలతో అక్రూరుని బాధించుకున్నారు. విపృథుడు ఏడుబాణాలతో శిశుపాలుని నొప్పించాడు. చైద్యుడు విపృథుని ఆరుబాణాలతో బాధించాడు. బల్లెంతో అతిదాంతుడు బృహద్దుర్గుని శిరస్సును నరికివేశాడు. చక్రదేవుడు దంతవక్త్రుని బాణంతో హృదయాన్ని బ్రద్దలుచేశాడు. కృతవర్మ రాజపుత్రుని మూడుబాణాలతో బాధించాడు. పౌండ్రకుడు ఆరుబాణాలతో కృతవర్మ ధనుస్సును ముక్కలుచేశాడు.

కంకుడు ఏనుగుమీద కూర్చొని తోమరమనే ఆయుధంతో అంగదేశపురాజు ఏనుగును చీల్చివేశాడు. బలరాముడు కైశికులను చాలామందిని చంపాడు. మగధదేశీయులను వందమందిని కోపంతో సంహరించాడు. బలరాముడు జరాసంధుని ఎదుర్కొన్నాడు. జరాసంధుడతన్ని మూడుబాణాలతో బాధించాడు.

బలరాముడాతన్ని ఎనిమిదిబాణాలతో నొప్పించాడు. జండానుకూడ కూల్చివేశాడు. ఆ యుద్ధం దేవదానవయుద్ధంలా ఘోరంగా జరిగింది. జరాసంధుడు బలరాముని జండాను పడగొట్టాడు. ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ సమయంలో ఏనుగులు ఏనుగులతో, రథాలు రథ్యాలతో కొట్టుకొని భగ్నమయ్యాయి. కాల్బలము ఖడ్గాలతో శిరస్సులను ఖండించుకున్నది. యుద్ధరంగంలో శంఖభేరీ మృదంగాదుల ధ్వని మిన్నుముట్టింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
రుక్మిణీ హరణము అను అరవైయవ అధ్యాయము

☆☆☆

# అరవై ఒకటవ అధ్యాయము

## రుక్మిణీ వివాహము

వైశంపాయనుడిలా చెప్పాడు.

శ్రీకృష్ణుడు రుక్మిణిని తీసుకుపోతున్నాడని విని రుక్మి కోపంతో భీష్మకుని యెదుట కృష్ణుడుని సంహరించకుండా, ఆమెను తీసుకురాకుండా కుండిన నగరంలో ప్రవేశించను అని ప్రతిజ్ఞ చేశాడు. గొప్ప ఆయుధాలు, జండా కల రథాన్ని, గొప్పసైన్యంతో కోపించినవాడై వేగంగా వెళ్ళాడు. దక్షిణాపథరాజులు అతన్ని అనుసరించారు. క్రాథుడు, అంశుమంతుడు, శ్రుతవర్మ, వేణుదారి భీష్మకుని యితర పుత్రులు, క్రథ, కైశిక ప్రముఖులైన మహారథులందరూ నర్మదా నది ఒడ్డునే వెళ్ళి ప్రియురాలితో కూడియున్న కృష్ణుని కోపంతో చూచారు.

రుక్మి సైన్యాన్ని నిలిపి మదబలంతో మధుసూదనునితో యుద్ధం చేయదలచి ఎదుర్కొన్నాడు. పదునైన అరవై నాలుగు బాణాలు కృష్ణుని పై ప్రయోగించాడు. జనార్దనుడు డెబ్బై బాణాలతో రుక్మిని బాధించాడు. జండాను కూడ విరుగకొట్టాడు. సారథి శిరస్సును ఖండించాడు. అతడు కష్టంలో ఉన్నాడని దక్షిణ దేశరాజులు శ్రీకృష్ణుని చుట్టుముట్టారు. అంశుమంతుడు పది బాణాలు ప్రయోగించాడు. శ్రుత వర్మ ఐదు బాణాలతో వేణుదారి ఏడుతో కృష్ణుని బాధించారు. అప్పుడు గోవిందుడు అంశుమంతుని గుండె చీల్చాడు. అతడు రథం మీద ఒరిగాడు. శ్రుతవర్మ గుర్రాలను నాలుగు బాణాలతో చంపాడు. వేదారిధ్వజాన్ని ఛేదించి అతని కుడిభుజాన్ని బాధించాడు.

అట్లే శ్రుతవర్మను ఐదు బాణాలతో కొట్టగా అతడు ధ్వజానికి ఆకున్నాడు క్రథకైశికాది మహారథులు బాణవర్షం కురిపిస్తూ కృష్ణుని ఎదుర్కొన్నారు. కోపించి వచ్చిన వారినందరినీ మహాబలుడైన కృష్ణుడు పారద్రోలాడు. సైన్యం పారిపోవుట చూచి రుక్మి కేశవుని ఐదు బాణాలతో వక్షస్థలమందు కొట్టాడు. పదునైన బాణాలతో సారధిని కూడ నొప్పించాడు. ఒక బాణంతో ధ్వజాన్ని కొట్టాడు. ఇది చూచి కోపించినవాడై కృష్ణుడు బాణాలతో అతన్ని బాధించి ధనుస్సును ఖండించాడు. మరొక ధనుస్సు పట్టుకొని కృష్ణుని చంపాలని దివ్యాస్త్రాలను ప్రయోగించాడు. రథం విరిగి ఖడ్గం ముక్కలు కాగా రథం నుండి క్రిందికి ఉరికి గరుత్మంతుని వలె మీదికి వచ్చాడు. కేశవుడు మీదికి వస్తున్న అతని ఖడ్గాన్ని ఖండించాడు.

మూడు బాణాలతో హృదయం బ్రద్దలు చేశాడు. అతడు చప్పుడయ్యేటట్లు నేలపై పడ్డాడు. స్మృతి తప్పి మూర్ఛిల్లాడు. తక్కిన రాజులను శ్రీకృష్ణుడు తన బాణాలతో మరల బాధించాడు. పడిపోయిన రుక్మిని చూచి రాజులు పారి పోయారు. రుక్మిణి నేలపై దొర్లుతున్న సోదరుని చూచి అతని ప్రాణాన్ని కోరుతూ విష్ణువైన శ్రీకృష్ణుని పాదాలపై పడ్డది. ఆమెను లేవదీసి కౌగలించుకొని శ్రీకృష్ణుడు ఊరడించాడు. రుక్మికి అభయమిచ్చి తన పట్టణానికి వెళ్ళాడు. వృష్ణివంశీయులు కూడ జరాసంధుని తక్కిన రాజులను ఓడించి బలరాముని ముందుంచుకొని సంతోషంతో ద్వారకకు వెళ్ళారు.

శ్రీకృష్ణుడు వెళ్ళిన తరువాత శ్రుతర్వుడనువాడు రుక్మిని తన రథం మీద ఎక్కించి తన పట్టణానికి వెళ్ళాడు. రుక్మి చెల్లెలను తీసుకురా లేక ప్రతిజ్ఞాభంగమై కుండినపురంలో ప్రవేశింపదలచలేదు. విదర్భదేశంలో మరొనగరం నివాసం కొరకు నిర్మించుకున్నాడు. దానికి భోజకటమని పేరు వచ్చింది. దాని దక్షిణ భాగంలో నివసించాడు. భీష్మకుడు కుండిన నగరంలోనే నివసిస్తున్నాడు. బలరాముడు యాదవుల సమూహంతో ద్వారకకు రాగా కేశవుడు రుక్మిణిని వివాహం చేసుకున్నాడు. తరువాత సంతోషిస్తున్న ఆమెతో రాముడు సీతతో వలె క్రీడించాడు. ఆమె శ్రీకృష్ణునకు పెద్ద భార్య అయింది. పతివ్రత, సుగుణములు కలది. రూపము, శీలము కలదియైన ఆమెయందు మహారథులైన పుత్రులు పదిమంది జన్మించారు.

వాళ్ళు చారుదేష్ణుడు, సుదేష్ణుడు, ప్రద్యుమ్నుడు, సుషేణుడు, చారుగుప్తుడు, చారుబాహువు, చారువిందుడు, సుచారుడు, భద్రచారుడు అనువారు చారుమతి

అనే కన్యకయు. వాళ్ళు ధర్మార్థ పురుషార్థాలలో నేర్పరులు యుద్ధ నిపుణులును. తరువాత కృష్ణుడు మరొక ఏడుగురు కన్యలను వివాహమాడాడు. వాళ్ళు- కాళింది, మిత్రవింద, సత్య, నాగ్నజితి, జాంబవతి, రోహిణి, లక్ష్మణ, సత్యభామ, తన్వి అనేవాళ్ళు. వీళ్ళుకాక పదహారు వేల భార్యలున్నారు. అందరూ శ్రేష్ఠమైన వస్త్రములు, ఆభరణాలు ధరించి సుఖంగా ఉన్నవారే. ఆ స్త్రీలయందు శ్రీకృష్ణుని పుత్రులు వేల కొలది వీరులున్నారు. అందరూ బలవంతులు, మహారథులు యాగాలు చేసిన వాళ్ళు. పుణ్యకర్మలను ఆచరించువార్లు. మహాబలశాలు, మహానుభావులు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
రుక్మిణీ వివాహము అను అరవై ఒకటవ అధ్యాయము

☆☆☆

# అరవై రెండవ అధ్యాయము

## రుక్మివధ వృత్తాంతము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కొంత సమయం తరువాత శత్రుసంహారకుడైన రుక్మితన కుమార్తెకు స్వయంవర మందిరం తయారు చేయించాడు. స్వయంవరానికి అనేక దేశాల రాజులకు రాజకుమారులకు ఆహ్వానం పంపాడు. వాళ్ళు వేషభూషణాదులతో విదర్భనగరంలో సమావేశమయ్యారు. ఇతర రాజకుమారులతోపాటు కృష్ణుని పుత్రుడు ప్రద్యుమ్నుడు కూడ అక్కడకు చేరాడు. సౌందర్య లావణ్యములతో కూడిన ఆకన్య పేరు శుభాంగి. ఆమె పై ప్రద్యుమ్నుని కెంత ప్రేమ కలదో శుభాంగికి అతని పై అంత ప్రేమ ఉన్నది. స్వయంవర సభలో రాజులు రాజ కుమారులు వెళ్ళి కూర్చొన్న తరువాత శుభాంగి ప్రద్యుమ్నుని వరించింది. వధూ వరులిద్దరూ ఒకరి కొకరు తగిన సౌందర్యం కలవాళ్ళు.

స్వయంవరం ముగియగానే రాజులు తమ తమ నగరాలకి తిరిగివెళ్ళారు. ప్రద్యుమ్నుడు శుభాంగిని వెంట బెట్టుకొని ద్వారకకు చేరాడు. వాళ్ళిద్దరూ నలదమయంతుల వలె విహరిస్తున్నారు. కొంచం సమయం గడిచాక శుభాంగి గర్భవతియై పరాక్రమవంతుడు మిక్కిలి సుందరుడు అయిన అనిరుద్ధుడనే పుత్రుని కన్నది. ఆ పిల్లవాడు క్రమంగా పెద్దవాడై ధనుర్విద్య, వేదవిద్య నీతిశాస్త్రములలో పండితుడయ్యాడు. ఆ సమయంలో రుక్మికి బంగారు బొమ్మలాంటి రుక్మవతి అనే

కన్య పౌత్రి (మనుమరాలు) జన్మించింది. ఆ పిల్లకు యుక్తవయస్సు రాగా శ్రీకృష్ణుడు తన మనుమడు అనిరుద్ధునకు ఇచ్చి వివాహం చెయ్యమని రుక్మిని అడిగాడు.

రుక్మికి శ్రీకృష్ణునితో వైరభావము కొనసాగుతూనే ఉంది. అయినప్పటికీ రుక్మిణి పట్టుబట్టటంచేత ప్రద్యుమ్నుని పై ప్రేమచేతను వైరం వదలుకొని అంగీ కరించాడు. అప్పుడు కృష్ణుడు తన పుత్రులను బలరాముని వృష్టి సమూహాన్ని రుక్మిణి నీ వెంటబెట్టుకొని తన సైన్యంతో విదర్భనగరం చేరాడు. ఇటు రుక్మి తన జ్ఞాతి బంధువులను రాజులను ఆహ్వానించుటచే వారందరూ అక్కడకు చేరారు. తరువాత శుభలగ్నంలో అనిరుద్ధుని వివాహం జరిగింది. ఇలా అని రుద్ధునితో రుక్మవతికి వివాహం జరుగుట వలన విదర్భనగర జనులకు యాదవు లకూ హద్దు లేని ఆనందం కలిగింది. కన్యవైపు నుండి గొప్ప ఆదర సత్కారాలు పొంది వరపక్షం వాళ్ళు ఆనందించారు.

అశ్మకదేశపు రాజు వేణుదారి శ్రుతర్వాచాణూరుడు మొదలైన దక్షిణ దేశపు రాజులు. ఆలోచన చేసి ఏకాంతంలో రుక్మివద్దకు వెళ్ళి రాజా! నీవు జూదంలో గొప్ప నేర్పరివి. మాకు జూదమాడాలని మిక్కిలి ఉత్సాహంగా ఉంది. బలరాముడికి కూడ ఇది యిష్టమే కాని అతడు నేర్పరి మాత్రం కాదు. అందువల్ల నీ సహాయంతో మేము అతన్ని జయించాలని కోరుతున్నాం. అన్నారు! రుక్మి జూదానికి అంగీకరిం చాడు. తరువాత ఆ రాజులందరూ పూలదండలతో, చందనంతో అలంకారము చేసుకొని బంగార స్తంభాలతో అలంకరించపబడిన పుష్పమాలలతో సుందరమైన చందనపు నీటితో తడపబడిన సభా భవనంలోకి వచ్చారు. రాజులు బంగారు ఆసనాలపై కూర్చున్నారు. తరువాత జూదంలో నేర్పు గలవాళ్ళు బలరాముని పిలిచారు. అతడు అంగీకరించాడు.

దక్షిణదేశపు రాజులు మణులు, ముత్యాలు, బంగారం వేల సంఖ్యలో తెచ్చారు. తరువాత జూదం ప్రారంభించారు. రుక్మి బలరాములు ఆడుతుండగా రుక్మి బలరాముని జయించాడు. రెండవ మారు కూడ జయించాడు. బలరాముడు మాటిమాటికీ ఓడిపోవుటచే కోపించాడు. ఆయన ఒక్కమారుగా ఒక కోటి బంగారు నాణాలు పందెంగా పెట్టాడు. కుటిలుడైన రుక్మి ఈ పందెం కూడ నేనే గెలిచానని బలరాముని పరిహాసం చేశాడు. కళింగరాజు ఆమాట విని పెద్దగా నవ్వాడు. అప్పుడు బలరాముడికి కోపం వచ్చింది. ధైర్యంతో మనస్సును నిగ్రహించి పదికోట్ల

నాణాలు పందెం కాసి ధూళి గల ఈ ప్రదేశంలో పాచికలను వేయుము అని పిలిచాడు. ఈ మారు నాలుగు అంకె గల పాచికలు దుమ్ములో పడటంచేత రుక్మి ఓడిపోయాడు.

బలరాముడే మీమాట్లాడలేదు. కాని రుక్మి నాలుగు అంకెను తొమ్మిదని దెబ్బలాడటం మొదలెట్టాడు. అతని అబద్ధం మాటలు విని కోపించి నా బల రాముడు మాట్లాడలేదు. ఆకాశవాణి బలరాముడు ఓడినట్లు పలికింది. అప్పుడు మితిమీరిన కోపంతో బలరాముడు లేచి ఎనిమిదికోళ్ళు గల బంగారు పీటతో కపటవ్యసనం గల రుక్మిని కొట్టి చంపాడు. ఆ కోపంలో కళింగరాజు జయత్సేనుడి దంతాలు విరగ్గొట్టాడు. సింహంలా గర్జించాడు. తరువాత చేతితో ఖడ్గం పట్టుకొని అక్కడ ఉన్న రాజులనందరినీ భయపెట్టాడు. బలరాముడంతటితో శాంతించక ఆ సభలోని బంగారు స్తంభాన్ని పెకలించి సభా భవనం నుంచి బయటకు వచ్చాడు. అతన్ని కైశిక దేశరాజులు చూచి భయపడ్డారు.

ఈవిధంగా రుక్మిని చంపి శత్రువులను భయపెట్టి శిబిరానికి వెళ్ళి జరిగిన దంతా కృష్ణుడికి చెప్పాడు. కృష్ణుడు రాముణ్ణి ఏమీ అనలేదు. మనస్సును నిగ్రహించి కష్టం చేత కన్నీరు కార్చాడు. రుక్మి మరణానికి వృష్ణులు, యాదవులు, అంధకులు కలత చెందిన మనస్సు కలవారయ్యారు. రుక్మిణి దీనురాలై దుఃఖిస్తుండగా శ్రీకృష్ణుడామెను ఓదార్చాడు. ఈ విధంగా రుక్మికి యాదవులకు గల విరోధము రుక్మి మరణము వినిపించారు. రాజా! తరువాత అక్కడ నుండి ఎక్కువ ధనం తీసుకొని బలరాముడు కృష్ణుడు ద్వారకకు వెళ్ళారు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలభాగంశమైన హరివంశ విష్ణుపర్వంలో
రుక్మివధ వృత్తాంతము అను అరవై రెండవ అధ్యాయము

☆☆☆

# అరవై మూడవ అధ్యాయము

## బలరాముని మాహాత్మ్యము

రాజు జనమేజయుడిలా అడిగాడు.

ఓ బ్రహ్మర్షీ! బలరాముని మహాత్మ్యం (గొప్పతనం) ఇంకా వినగోరుతున్నాను. పురాణవేత్తలు అతన్ని జయింపరాని తేజోరాశిగా అతని గుణాలను గానం చేస్తు

న్నారు. ప్రపంచంలోని జనము అతన్ని ఆదిదేవునిగా నాగరాజనే పేరుతో పిలుస్తు న్నారు. కాబట్టి మీరు అతని గొప్పతనాన్ని గూర్చి విషయమంతా వివరించి చెప్పండి.

వైశంపాయనుడిలా చెప్పాడు

మహారాజా! ఆయన పురాణాల్లో నాగరాజని, ధరణీధరుడనీ, శేషుడనీ, తేజోనిధియని, పురుషోత్తముడనీ, జయింపరానివాడని (అజేయుడు), యోగాచార్యుడనీ, మహావీర్యుడనీ, దేవ(మంత్రముఖుడనీ), ప్రముఖుడనీ, బలి అనే పేర్లతో ప్రసిద్ధి పొందియున్నాడు.

గదాయుద్ధంలో అతడు జరాసంధుని జయించాడు. కానిచంపలేదు. భూమండలంలో చాలరోజులు జరాసంధునితో కలిసి యుద్ధరంగంలో పాల్గొని అందరూ ఓడిపోయారు. భీముడి శరీరంలో పదివేల ఏనుగులబలం ఉంది. కాని అతడుకూడ బాహుయుద్ధంలో బలరామునిచేతిలో చాలామార్లు ఓడిపోయాడు. జాంబవతిపుత్రుడు సాంబుడు దుర్యోధనుని కన్యను అపహరించినప్పుడు చాలా మంది రాజులు అతన్ని చుట్టుముట్టారు.

ఈ మాటవిని బలరాముడు అతన్ని విడిపించటానికి వచ్చి ఎక్కడనూ కన వడక వాళ్ళతో అద్భుతమైన యుద్ధంచేశాడు. చివరలో బ్రహ్మమంత్రంతో అభిమంత్రింపబడిన నాగలినిఎత్తి ప్రాకారంమీద పెట్టి కౌరవుల నగరాన్ని గంగలో విసిరి వేయబోయాడు. ఆ ఆపదను చూచి దుర్యోధనుడు తన కన్యతో సాంబుని విడిచిపెట్టాడు. మరియు గదాయుద్ధాన్ని దుర్యోధనుడు బలరాముని వద్ద నేర్చుకున్నాడు.అప్పటినుండి హస్తినాపురం గంగవైపు వంగినట్లు కనిపిస్తుంది.

పూర్వం భాండీరవనంలో బలరాముడు తన పిడికిలితో ప్రలంబుని కొట్టి చంపాడు. ధేనుకుడనే రాక్షసుణ్ణి కొండమీదికి విసిరేశాడు. వాడు మరణించి గాడిద రూపంతో క్రీడింపబడ్డాడు. యమునానది నగరానికి ఎదురుగా నాగలితో త్రిప్ప బడింది. బలదేవుని గొప్పతనం నీకు చెప్పాను. అతడనంతడు, గొప్పమహిమ కలవాడు, భూమిని ధరించినవాడు. ఇంకా బలరాముని గొప్పతనాన్ని పురాణాల వలన తెలుసు కొనుము.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి విష్ణుపర్వంలో
బలరాముని మాహాత్మ్యము అను అర్వై మూడవ అధ్యాయము

☆☆☆

# అరవై నాల్గవ అధ్యాయము

## ఇంద్రుడు ద్వారకకు వచ్చుట

జనమేజయుడు మళ్ళీ ఇలా అడిగాడు.

ఓ మునిశ్రేష్ఠా భీష్మకపుత్రుడైన రుక్మి మరణించిన తరువాత శ్రీకృష్ణుడు ద్వారకలో చూపిన లీలను వినిపించవలసినదిగా కోరుచున్నాను.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చి రాజకార్యాలను పరిశీలించాడు. విదర్భనగరంలో తనకు ప్రాప్తించిన ధనాన్ని రాక్షసులకు చిక్కకుండా నివారించాడు. విఘ్నం కలుగజేసిన రాక్షసులను చంపాడు. తరువాత నరకాసురుడు దేవతలకు భయం కలిగిస్తూ విజృంభించాడు. దేవతలకు, ఋషులకూ విరుద్ధంగా ప్రవర్తించాడు.

ఒకప్పుడు ఆ రాక్షసుడు ఏనుగురూపం ధరించి విశ్వకర్మ కుమార్తె పద్నాల్గేళ్ళ వయస్సు కలదాని తన తొండంతో పట్టుకొని తీసుకుపోయాడు. అజ్ఞానంచేత ఆ పిల్లకు భయంగాని, సిగ్గుగాని కలుగలేదు. ప్రాగ్జోతిషపురానికి రాజై దైత్య దానవ రాక్షసులను పిలిచి ఈ రోజునుండి దేవలోక, భూలోకములలో నేలపైగాని, సముద్రంలోగాని కనపడిన ధనాన్ని, రత్నాలను అన్నిటినీతెచ్చి నాయెదట పెట్టాలి అని శాసించాడు. దాన్నిబట్టి రాక్షసులద్వారా ధనరత్నవస్త్రభూషణాలను హరించాడు. కాని ఏ వస్తువుమీదనూ తన అధికారాన్ని చూపలేదు.

తరువాత అసుర గంధర్వకన్యలను, మనుష్యకన్యలను, అప్సరసలను అపహరించాడు. ఈ విధంగా మొత్తం పదహారువేల కన్యలను అపహరించి తెచ్చాడు. వాళ్ళందరూ అతన్ని సేవిస్తున్నారు. నరకాసురుడు ఆ కన్యల నివాసానికి అలకాపురం నడుమనున్న మణిపర్వతంపై ఒక అందమైన నగరాన్ని నిర్మించాడు. ఆ కన్యలు 'మురుడు' అనే రాక్షసుని పదిమంది పుత్రులు, నరకాసురుని ఆజ్ఞను పాలిస్తున్నారు.

భూదేవి కుమారుడైన నరకాసురుడు కుండలాల కొరకు దేవతల తల్లియైన అదితిని కొట్టాడు. హయగ్రీవుడు నిసుమ్భుడు, పంచనదుడు, వీరుడు, ఈ నలుగురు రాక్షసులూ అతని ద్వారపాలకులు. వరాలు పొందిన మురుడనే రాక్షసుడు తన

వెయ్యిమంది పుత్రులతో కలిసి ఆకాశమార్గాన్ని ఆవరించాడు. పుణ్యాత్ములకు చెప్పలేనంత భయం కలిగింది. వరములను పొంది మదించిన అతన్ని చంపటానికి విష్ణుమూర్తి వృష్ణివంశంలో దేవకీ వసుదేవులకు జన్మించాడు. ఆ భగవంతుని నివాసం కోసం దేవతలు ద్వారకాపురాన్ని నిర్మించారు. ఆ పట్టణం ఇంద్రుని అమరావతి నగరం కంటే అందమైంది.

ఆ పట్టణ విస్తారానికి సముద్రం స్థలమిచ్చింది. ఆ పట్టణంలో ఐదు పర్వతాలున్నాయి. బంగారుతోరణంగల 'దాశార్హి' అనే మహాసభ ఉంది. ఈ సభ విస్తారం ఒక ఆమడ. కృష్ణ బలరాములు, వృష్ణి, అంధక, యాదవ వంశీయులు అ సభాభవనంలో కూర్చుని రాజకార్యాలను నడుపుతూ ఉంటారు.

ఒకరోజున వాళ్ళు సభలో కూర్చునిఉండగా సువాసనలతో కూడిన మెల్లనిగాలి వీచింది. ఆకాశంనుండి పువ్వులవర్షం కురుస్తోంది. తరువాత ధ్వని వినిపించింది. ఆకాశంలో విశాలమైన కాంతిపుంజము కనిపించింది. క్షణం తరువాత ఆ కాంతి భూమిమీదికి దిగింది. ఆ కాంతిపుంజం మధ్య తెల్లని ఏనుగుమీద ఇంద్రుడు దేవతలతో చుట్టబడి కనిపించాడు. అప్పుడు బలరామకృష్ణులు ఉగ్రసేనుడు, వృష్ణి అంధక వంశీయులు ఆయనకు స్వాగతం పలికి పూజ చేశారు. తరువాత దేవరాజు ఐరావతంనుండి దిగాడు. కృష్ణబలరాములను ఉగ్రసేన, ఆహుక వృష్ణి వీరులను కౌగలించాడు. తరువాత బలరాముడు పూజించగా వాళ్ళు దాశార్హసభకు వెళ్ళారు. ఇంద్రుడు ఆ సభను అలంకరిస్తూ కూర్చున్నాడు. అర్ఘ్యపాద్యాదులను స్వీకరించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఇంద్రుడు ద్వారకకు వచ్చుట అను అరవై నాల్గవ అధ్యాయము

☆☆☆

# అరవై ఐదవ అధ్యాయము

## నరకాసుర వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత దేవరాజు ఇంద్రుడు శ్రీకృష్ణుని ముఖాన్ని ప్రేమతో తాకుతూ దేవకీనందనా! నేను వచ్చిన పని చెప్పుతాను విను.

నరకుడనే రాక్షసుడు బ్రహ్మవరం వల్ల గర్వించి అదితి యొక్క కుండలాలను అపహరించాడు. దేవతలకు, ఋషులకు నిత్యమూ కష్టం కలిగే పనులు చేస్తున్నాడు. ఓ దేవా! అవకాశం చూచుకొని అతన్ని నీవు చంపాలి. గరుత్మంతుడు నిన్ను ఆ ప్రదేశానికి తీసుకువెళ్తాడు. ఆ నరకాసురుడు ఏ ప్రాణికీ చంపదగినవాడు కాడు. నీవాతని త్వరగా సంహరించి రమ్ము. కేశవుడా మాటలు విని నరకాసురుని చంపుటకు ప్రతిజ్ఞ చేశాడు. తరువాత శంఖచక్రాది ఆయుధాలను ధరించి సత్యభామను వెంట బెట్టుకొని ఇంద్రునితో కూడ గరుత్మంతుని పై బయల్దేరాడు.

ఇంద్రుడు ఏనుగు మీద కృష్ణుడు గరుత్మంతుని మీద ప్రయాణించారు. యాదవవీరులు చూచుండగనే ఏడు వాయుస్కంధాల పైకి ఆకాశంలోకి వెళ్ళాడు. కృష్ణునితో కూడానే ఉన్నాడు ఇంద్రుడు. ఇంద్ర శ్రీకృష్ణులు ఆకాశంలో సూర్య చంద్రులవలె ప్రకాశించారు. అంతరిక్షంలో గంధర్వులు, అప్సరసలు స్తోత్రం చేయు చుండగా క్రమంగా అంతర్ధానం చెందారు. చేయవలసిన పనిని పూర్తి చేసుకుని యింద్రుడు ఇంటికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిష నగరానికి వెళ్ళాడు. గరుత్మం తుని రెక్కలచే కొట్టబడి వాయువు ఎదురుగా వీచింది. ఆకాశంలో సంచరించే జంతువులు భయంకరమైన ధ్వనిగల మేఘాలతో తిరుగుతున్నాయి. వెంటనే భగవంతుడు అక్కడకు చేరాడు. ఆకాశంనుండి రాక్షససమూహాన్ని చూచాడు. అటువైపే వెళ్ళాడు. మెల్లమెల్లగా దగ్గరకు వెళ్ళగా ద్వారందగ్గర ఏనుగులు, గుర్రాలు, రథాలు, సైన్యమూ కనిపించాయి. కత్తివంటి పదునుగల మురదైత్యుడు నిర్మించిన పాశాలను ఆరువేల సంఖ్యకలవాటిని చూచాడు కృష్ణుడు.

భగవంతుడు శంఖచక్రగదలనే ఆయుధాలను పట్టుకొని మేఘంవలె నల్లని శరీరం కలవాడై పీతాంబరం ధరించి వనమాల నలంకరించుకొని శ్రీవత్సం భూష ణంగా కలవాడై నాల్గుభుజములతో కూడినవాడై ధనుష్టంకారం చేశాడు. అది పిడుగు పడినంత ధ్వని చేసింది. రాక్షసులు విష్ణుమూర్తి స్వయంగా వచ్చాడని గ్రహించారు. మురుడనేవాడు కోపంచే ఎర్రబారిన కన్నులు కలవాడై శక్తి అనే ఆయుధాన్ని పట్టుకొని వేగంగా ఎదురు పరుగెత్తాడు. ఆ శక్తిని జనార్దనునిపై విసిరాడు. శ్రీకృష్ణుడు దానిని ఒకబాణంతో రెండుముక్కలు చేశాడు. తరువాత మురుడు గొప్పగదను విసిరాడు. ఆ గదను మధ్యలోనే ఛేదించి మరొకబాణంతో ఆ రాక్షసుని శిరస్సును కృష్ణుడు ఖండించాడు. భగవంతుడు పాశాలనన్నిటినీ ఛేదించి బంధువులతోసహా మురుని చంపి మహాబలవంతులైన గొప్పరాక్షసులను

సంహరించి శిలాసమూహాన్ని దాటి రాక్షససైన్యాన్ని, గొప్పబలశాలియైన నిసుందుడనువాడిని చూచాడు. హయగ్రీవుడు అనే రాక్షసుని, ఇతరులనుకూడ చూచాడు.

నిసుందుడు తనసేనతో ముందుకు నడుస్తూ భగవంతుని మార్గాన్ని అడ్డగించి ధనుస్సు తీసుకొని పదిబాణాలతో కృష్ణుని కొట్టాడు. కేశవుడుకూడ దెబ్బైబాణాలతో ఆకాశంలోనే ఆబాణాలను ఖండించాడు. సైనికులందరు కృష్ణుని చుట్టుముట్టారు. మధుసూదనుడు వాళ్ళనుచూచి కోపించి బాణవర్షం కురిపించాడు. ఆబాణాల బాధకు తట్టుకొనలేక భయపడి ఆసైనికులు పారిపోయారు. సేన పారిపోవటంచూచి నిసుందుడు తానే యుద్ధరంగంలోకి వచ్చాడు. కేశవుని తన బాణవర్షంతో కప్పి వేశాడు. అప్పుడు సూర్యుడు, దిక్కులూ కనబడలేదు. పురుషోత్తముడు సావిత్రమనే అస్త్రాన్ని తీసుకొని రాక్షసుని బాణాలనన్నిటినీ వ్యర్థంచేశాడు. మరొకబాణంతో నిసుందుని గొడుగును, మూడుబాణాలతో గుఱ్ఱాలను పడగొట్టాడు.

ఐదుబాణాలతో అతని సారథిని, ఒకబాణంతో ధ్వజాన్నీ నరికి చివరికి మిక్కిలి పదునైన బాణంతో నిసుందుని శిరస్సును ఖండించి పడగొట్టాడు. నిసుందుడు మరణించుట చూచి హయగ్రీవుడనే రాక్షసుడు పర్వతమంతటి రాతిని ఎత్తి శక్తికొలది దానిని కృష్ణునిపై విసిరాడు. శ్రీకృష్ణుడు దివ్యమైన వాయవ్యాస్త్రంతో ఆవిశాలశిలను ముక్కలు చేశాడు. అది వ్యర్థమై నేలమీద పడింది. తరువాత భగవంతుని శార్ఙ్గమనే ధనుస్సునుండి భయంకరమైన బాణవర్షం ప్రారంభమైంది. మెల్లమెల్లగా ఆ యుద్ధం దేవదానవయుద్ధంలా భయంకరమైంది. భగవంతుడు గరుత్మంతునిపై కూర్చుని బాణవర్షంతో గొప్పరాక్షసులను సంహరించాడు. కొందరు ఖడ్గంచేత మరణించారు. మరికొందరు భగవంతుని చక్రాగ్నిలో బూడిదయై క్రిందపడ్డారు.

భగవంతుని బాణవర్షంచేత రాక్షసుల శరీరాలు ఛిన్నాభిన్నమై రక్తం సరస్సుగా తయారైంది. ఆ సమయంలో విచిత్రయుద్ధం చేసే రాక్షసులు భయపడి పలు దిక్కులకూ పారిపోయారు. రాక్షసులు పారిపోవుట చూచి హయ గ్రీవుడి కళ్ళు ఎఱ్ఱబడ్డాయి. అతడొక పెద్దచెట్టు పెరికి వేగంతో భగవంతునివైపు పరుగెత్తాడు. బలంతో దాన్ని శ్రీకృష్ణునిపై విసిరాడు. భగవంతుడు వెయ్యిబాణాలతో దాన్ని వెయ్యిముక్కలు చేశాడు. తరువాత హయగ్రీవుడి వక్షస్థలానికి తగిలేట్లు ఒక

బాణాన్ని కృష్ణుడు ప్రయోగించాడు. అది హయగ్రీవుని హృదయం చీల్చి బయటకు వచ్చింది. భగవంతుడు హయగ్రీవుని చంపి నేలపై పడవేశాడు.

తరువాత లోహితగంగ అనే ప్రదేశంలో వికటాక్షుడనేవాణ్ణి ఎనిమిదివేల రాక్షసులనూ చంపి పాపాత్ముడైన పంచజనుడు మొదలగు ఇతర రాక్షసులను సంహరించి నరకాసురుని సుందరమైన ప్రాగ్జ్యోతిషపురంలో ప్రవేశించాడు. వెంటనే యుద్ధం ప్రారంభమైంది. శ్రీకృష్ణుడు తన పాంచజన్యమైన శంఖాన్ని పూరించాడు. దానిధ్వని ప్రళయకాల మేఘగర్జనవలె ముల్లోకాలకూ వ్యాపించింది. ఆ ధ్వని వినగానే నరకాసురుని కన్నులు కోపంతో ఎర్రబడ్డాయి. నరకాసురుడు దివ్యమైన రథంమీద సంధ్యాకాల సూర్యునివలె ప్రకాశించాడు. అతనితోపాటు ధూమ్రవర్ణుడు మొదలైన వాళ్ళు సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు అనేకవిధాలైన ఆయుధాలు ధరించి ఉన్నారు. కొందరు ఏనుగులమీద, కొందరు గుర్రాలమీద, మరికొందరు రథాలమీద నగరం వెలుపలకు వచ్చారు. అప్పుడు వెయ్యి భేరీ శంఖ మృదంగ పణవాదివాద్యాల ధ్వని మిన్నుముట్టింది. అప్పుడు రాక్షసులు నలువైపులనుండి వచ్చి కృష్ణుని ఎదుట నిలి చారు. వాళ్ళు నలువైపులనుండి యుద్ధం చేయమొదలెట్టారు.

వాళ్ళు ప్రయోగించిన ఆయుధాలతో ఆకాశం కప్పబడింది. అప్పుడు కృష్ణుడు రాక్షసులపై బాణవర్షం కురిపించాడు. దానితో రాక్షసగణం మిక్కిలి పీడింపబడ్డారు. అనేకవిధాలుగా మర్దింపబడి రథములు గుర్రాలు మనుష్యులు రూపుమాసిన సమయంలో నరకాసురునితో కృష్ణునకు యుద్ధం జరిగింది. మధువను రాక్షసుడిలా భగవంతునితో యుద్ధం చేశాడు. కేశవుడు ఇంద్రధనుస్సువంటి ధనుస్సు నెక్కుపెట్టి సూర్యకిరణంవంటి బాణాని చేతపట్టాడు. దానితో నరకాసురుని రథాన్ని కొట్టాడు. నరకాసురుడు ఒక గొప్పశస్త్రాన్ని శక్తికొలది భగవంతునిపై విసిరాడు. ఆ భయంకర శస్త్రాన్ని శ్రీకృష్ణుడు తన చక్రాయుధంతో ముక్కలు చేశాడు. తరువాత ఒకబాణంతో సారథిని, పదిబాణాలతో రథాన్ని జెండాను గుర్రాలనుకూడ నేలపై కూల్చాడు. రాక్షసుడు కవచాన్ని రక్షించుకోలేకపోయాడు.

ఆయుధాలూ, రథమూ అన్నీ ధ్వంసమైన తరువాత ఒకశూలాన్ని భగవంతుని పై విసిరాడు. ఆ శూలాన్ని క్షురప్రమనే ఆయుధంతో ముక్కలు చేశాడు. ఈవిధంగా కొంతసేపు భగవంతునకూ నరకాసురునకూ ఘోరయుద్ధం జరిగింది. తరువాత భగవంతుడు చక్రాయుధంతో నరకాసురుని రెండుముక్కలుగా నరికి నేల

కూల్చాడు. ఈసమయంలో భూదేవి తన పుత్రుని మరణం చూచి కుండలాలు చేతిలో పట్టుకొని భగవంతునివద్దకు వెళ్ళి ఓ గోవిందా! నీవల్లనే ఈ పుత్రుడు కలిగాడు. నీవే తీసుకున్నావు. పిల్లవాడు బొమ్మలతో ఆడినట్లు నీవు ప్రాణులతో ఆడుకుంటావు. ఇప్పుడు అతని రత్నాలను అంతఃపురస్త్రీలను ఈ రెండు కుండలాలను తీసుకో. ప్రజలను రక్షించుము అన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
నరకాసుర వధ అను అరవై ఐదవ అధ్యాయము

☆☆☆

# అరవై ఆరవ అధ్యాయము

## స్వర్గము నుండి పారిజాత వృక్షమును తెచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు నరకాసురుని చంపి అతని యింటిని చూచాడు. అతని కోశాగారంలో తరగని ధనము అనేకవిధములైన రత్నాలు, మణులు, ముత్యాలు, పగడాలు, వైఢూర్యమణులు మరకత చంద్రకాంత సూర్యకాంతాదులను విలువైన శయ్యలను సింహాసనాలను చంద్రుని వంటి పెద్ద గొడుగును ఇంకా విలువైన చిత్రవిచిత్ర వస్తువులను చూచాడు. వరణుని వద్ద నుంచి తెచ్చిన వస్తువులని వినికిడి. దిక్పాలకుల యిండ్లలో ఎక్కడనూ అటువంటి వస్తువులు కనబడవు. ధనగృహ రక్షకులు నరకాసురుడు మరణించిన తరువాత ఆ రత్నాలను అంతఃపురాన్నీ కేశవునకు తెచ్చి యిచ్చారు. ఆ రాక్షసులు ఇలా అన్నారు.

అనేకములైన ఈ మణిరత్నాలు భయంకరములైన ఏనుగులు, చిత్ర విచిత్రము లైన అంకుశాలు, ఆడ ఏనుగులు, మేలుజాతి గుర్రాలు కావలసినని ఆవులు వీటిని వృష్ణి అంధక యాదవుల యిండ్లకు పంపుతాం. స్వర్గమనుష్య పాతాళలోకాలలో ఎంత ధనం ఉంటుందో అంత ధనం నరకాసురుడి యింటి యందు ఉంది. ఆసనాలను శయనములను చూడటానికి ఇంటిపైన పక్షులను, కలిగినవి అతని ఇళ్ళు. వాటినన్నిటినీ శ్రీకృష్ణుడు పరీక్షించి ద్వారకానగరానికి తెప్పించాడు. వరుణదేవుని నుండి తెచ్చిన తెల్లని గొడుగును స్వయంగా విప్పి గరుత్మంతుని పై కూర్చున్నాడు.

తరువాత మణిపర్వతం మీదికి వెళ్ళాడు. అక్కడ పవిత్రమైన గాలులు వీచుతున్నాయి. అక్కడ వైడూర్యమణులను శ్రీకృష్ణుడు చూచాడు. గంధర్వుల యొక్క అసురుల యొక్క ప్రియురాండ్రను కుమార్తెలను కొండగుహలో నిర్బంధింపబడిన వాళ్ళను చూచాడు. వాళ్ళందరూ నరకాసురునిచే తేబడినవాళ్ళే. వాళ్ళందరూ కృష్ణుని చుట్టునూ చేరారు. వాళ్ళు వ్రతాలచేత, ఉపవాసాలచేత కృశించిన శరీరాలు కలవాళ్ళు. శ్రీకృష్ణుని దర్శనం కోరుతున్నారు. అందరూ కృష్ణునకు నమస్కారం చేశారు. నరకాసురుడు మొదలగు రాక్షసవీరులు మరణించారని తెలుసుకొని కృష్ణుని చుట్టూ నిలిచారు. వాళ్ళకు రక్షకులుగా ఉన్న వృద్ధరాక్షసులు చేతులు జోడించి నమస్కరించారు.

ఆ స్త్రీలు అందరూ శ్రీకృష్ణుని చూచి భర్తగా భావించారు. వాళ్ళు శ్రీకృష్ణుడు నరకాసురుని చంపి మీకు భర్త కాగలడని నారదుడు చెప్పాడని ఆతనికి విన్న వించారు. చాలాకాలం క్రిందట విన్న ఇష్టమైన వ్యక్తిని యిప్పుడు చూస్తున్నాము. మహాత్ముడవైన నీ యొక్క దర్శనంచేత కృతార్థులమయ్యాము. అని శ్రీకృష్ణునికి చెప్పారు. ఉపేంద్రుడు ఆ స్త్రీలను ఊరడించాడు. ఆ స్త్రీల నందరనూ చూచి మాధవుడు తగినట్లు వాళ్ళను గౌరవించి సేవకులతో మీరీ స్త్రీలను ఇక్కడ నుండి తీసువెళ్ళండి. అని చెప్పాడు.

పల్లకీలను మోసేవాళ్ళ సందడి పెద్దదైంది. తరువాత మణిపర్వత శిఖరాన్ని చేతులతో పెకలించి గరుత్మంతుని మీద పెట్టాడు. ఆ మణిపర్వతశిఖరాన్ని భార్యతో కూడిన జనార్దనుని గరుత్మంతుడు తేలికగా మోశాడు. అతడు సూర్య చంద్రుల మార్గాన్ని దాటి వేగంగా వెళ్తున్నాడు. క్రమంగా ఇంద్రుడి భవనం కని పించింది. అక్కడ గరుత్మంతుని నుండి దిగి ఆభవనంలో ప్రవేశించాడు కృష్ణుడు. దేవరాజు ఈతన్ని చూడగానే లేచి నిలబడ్డాడు. సంతోషంతో కృష్ణుని మెచ్చు కొన్నాడు. అప్పుడు భార్యతో కూడియున్న భగవంతుడు కుండలాలను రెండింటిపీ దేవరాజుకు ఇచ్చాడు. మహారాణియైన సత్యభామను ఇంద్రాణి (ఇంద్రుని భార్య) తగిన సత్కారం చేసింది.

ఈ విధంగా దేవేంద్రునిచే సత్కరింపబడి శ్రీకృష్ణుడు వాళ్ళందరితో దేవ మాత అయిన అదితి యొక్క భవనానికి వెళ్ళాడు. అక్కడ దేవమాతను అప్సరసలు సేవిస్తున్నారు. ఆమె కనబడగానే ఇంద్రుడు, కృష్ణుడు, ఇంద్రాణి సత్యభామ దగ్గరకు వెళ్ళి నమస్కారం చేశారు. తరువాత ఇంద్రుడు తల్లికి కుండలాలు ఇచ్చాడు.

కృష్ణుని యెదుట నిలబడి ఇతడే ఈ కుండలాన్ని తెచ్చినవాడు అని తల్లికి చెప్పాడు. అదితి మిక్కిలి సంతోషించి కుమారులనిద్దరినీ కౌగలించుకొని మెచ్చుకొంటూ శ్రీకృష్ణునికి ఆశీర్వాదం చేసింది. వత్సా! నీవు ఏ ప్రాణిచేతనూ చంపబడనివాడవు. జయింపశక్యం కానివాడవు అవుతావు. నా కుమారుడైన ఇంద్రునివలె మూడు లోకాలకు పూజింప తగినవాడవు. నీ ప్రియురాలైన సత్యభామకు స్థిరమైన పడుచు తనం గలదిగా ఉంటుంది. ఇలా అదితి ఆశీర్వదించి వీడ్కోలు పలికింది.

తరువాత భగవంతుడైన మధుసూదనుడు ధనరత్నాదులచే ఇంద్రుడు పూజించగా అతని అనుమతి పొంది సత్యభామతో గరుత్మంతుని పై వెళ్తూ నందన వనాన్ని దాటి పోతూ అతిమనోహరమైన పారిజాత వృక్షాన్ని చూచాడు. ఆ చెట్టు వద్దకు వచ్చిన ప్రాణులు పూర్వజన్మలోని మాటలనన్నిటినీ గుర్తు తెచ్చుకో గలుగు తారు. దేవతలు మిక్కిలి శ్రద్ధతో దాన్ని రక్షిస్తూ ఉంటారు. భగవంతుడు చూడగానే బలంతో ఆ వృక్షాన్ని పెకలించి గరుత్మంతుని వీపు మీద పెట్టాడు. తరువాత శ్రీకృష్ణుడు సత్యభామ అప్సరస్త్రీల నివాసం చేరారు. తరువాత ద్వారకానగరానికి చేరాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
స్వర్గము నుండి పారిజాత వృక్షమును తెచ్చుట అను అరవై ఆరవ అధ్యాయము

☆☆☆

# అరవై ఏడవ అధ్యాయము

## పారిజాతహరణ వృత్తాంతము

జనమేజయుడు ఓ మునిశ్రేష్ఠా! శ్రీకృష్ణుని మధురలోని నీ లీలలు వింటుంటే తృప్తి కలుగుటలేదు. ఆయన వివాహమైన తర్వాత ద్వారకాపురంలో ఉండగా ప్రదర్శి ంచినలీలలను అన్నిటినీ నేను వినాలని కోరుతున్నాను అని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ రాజేంద్రా! అతడు వివాహం అయిన తరువాత చేసిన పనులనన్నిటినీ చెపుతున్నాను విను.

మహాప్రతాపవంతుడైన కృష్ణుడు వివాహమైన పిమ్మట మహారాణి రుక్మిణితో రైవతకపర్వతం మీదికి వెళ్ళాడు. రుక్మిణీదేవి తన వ్రతం ఉద్యాపన సందర్భంగా

బ్రాహ్మణులకు తృప్తి కలిగించాలని అక్కడకు వెళ్ళింది. భగవంతుడు నారదుని ఆజ్ఞననుసరించి సోదరులను, పుత్రులను ముందే అక్కడకు పంపాడు. ఇతర పదహారువేల భార్యలునూ వచ్చారు.

వ్రతసమాప్తి దినమందు గొప్పవంశంలో పుట్టినట్టి, విద్వాంసులైన ధర్మ పరాయణులు మేలు పలుకునట్టివారై ధనవాంఛకల బ్రాహ్మణులను వారుకోరిన ధనమిచ్చి సంతోషింపచేశాడు. తరువాత జ్ఞాతులను, బంధువులను బాగా తృప్తి పరచాడు. ఈ విధంగా రుక్మిణీదేవి వ్రవతం పూర్తికాగానే ప్రియురాలైన రుక్మిణీ దేవిని గౌరవించాడు. రుక్మిణితో భగవంతుడు సుఖసంభాషణ చేయుచుండగా నారదమహర్షి అక్కడకు వచ్చాడు. రాగానే కృష్ణుడతన్ని పూజించాడు. నారదుడు పూజను స్వీకరించి అతనిచేతిలో ఒక పారిజాతపుష్పాన్ని ఉంచాడు. భగవంతుడు ఈ పువ్వును రుక్మిణికి ఇవ్వాలనుకున్నాడు.

ఆమెవద్దకు వెళ్ళి ఆ పుష్పాన్ని ఆమెకిచ్చాడు. ఆ పుష్పాన్ని తీసుకొని తలలో పెట్టుకుంది. అప్పుడు రుక్మిణి వెనుకంటే రెట్టింపు అందంగా ప్రకాశించింది. ఈ పుష్పం పతివ్రతవైన నీకే తగునమ్మా అన్నాడు నారదుడు. నీవల్ల పుష్పానికి శోభ కలిగింది. ఈ పుష్పంవల్ల నీకు శోభ కలిగింది. ఈ పుష్పం ఎప్పటికీ వాడదు. కావలసిన సువాసనను ఇస్తుంది. చల్లదనాన్ని, వేడిని ఇస్తుంది. కావలసిన పువ్వులను ఇస్తుంది. రాత్రిపూట దీపంలా ప్రకాశిస్తుంది. ఏదికావాలంటే దాన్ని ఇస్తుంది. సంవత్సరం పూర్తిఅయిన తరువాత నీ దగ్గరనుంచి చెట్టువద్దకు వెళ్ళుతుంది. ఇది పారిజాతంపుష్పం యొక్క పని, ఈ పుష్పాన్ని పార్వతి, శచిదేవి, అదితి, లక్ష్మీదేవి, దేవతల భార్యలు ధరిస్తారు.

వాసుదేవునకు నీవు ప్రియురాలవు, ఈ పుష్పంవల్ల నీకు సౌభాగ్యము, కీర్తి లభిస్తుంది. శ్రీకృష్ణుడు నీకు మందారపుష్పాన్ని యిచ్చాడు. సత్యభామ తాను సౌందర్యవతినని గర్విస్తూ ఉంటుంది. ఈవేళ ఆమె గర్వం రూపుమాసిపోతుంది. భగవంతుని జీవితం నీవే అని ఈవేళ తెలిసింది అన్నాడు. సత్యభామ పంపిన దాసీలు అక్కడే ఉండి నారదుని మాటలన్నీ విన్నారు.

తరువాత పరిచారికలు అంతఃపురానికి వెళ్ళి నారదుని మాటలు సత్యభామకు చెప్పారు. భగవంతుని యితర భార్యలు రుక్మిణి సౌభాగ్యాన్ని విని ఆనందించారు.

వాళ్ళు సత్యభామ ఈ మాటలను సహించలేదనుకొన్నారు. పరిచారికలు చెప్పిన మాటలు విని సత్యభామ కోపంతో ఎఱ్ఱబడిన ముఖం కలద్దైంది. ఈర్ష్యతో మండి పోతూ కోపించి క్రోధగృహంలో ప్రవేశించింది. ముఖానికి రోషంగుర్తుగా తెల్లనిగుడ్డ కట్టింది. దాసీల మాటలనే మాటిమాటికి తలుస్తూ రోషంతో శిరస్సును కంపింపచేస్తూ కూర్చున్నది. మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తూ చేతిలో పద్మాన్ని గోళ్ళతో ముక్కలు చేసింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పారిజాతహరణ కృత్తాంతము అను అరవై ఏడవ అధ్యాయము

☆☆☆

# అరవై ఎనిమిదవ అధ్యాయము

## సత్యభామ ప్రణయకోపము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నారదమహర్షి రుక్మిణీతో మాట్లాడుచుండగా నారదుని సేవించే పని ప్రద్యుమ్ననకు వప్పచెప్పి సర్వజ్ఞుడైన భగవంతుడు ఏదో పనిమిషతో అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తరువాత సత్యభామ కోపించిందని విని సత్యభామ యింటికి వెళ్ళాడు. సారథిని ద్వారం దగ్గర ఉంచి ప్రియురాలైన సత్యభామ కోపాన్ని తలుచు కొని నిశ్శబ్దంగా శంకిస్తూ భవనంలో ప్రవేశించాడు.

కోపగృహంలో మాటిమిటికీ నిట్టూర్పులు విడుస్తూ పరిచారికలా ఉన్న ప్రియురాలిని చూచాడు. కాలితో నేలరాస్తూ చెంపన చెయ్యిపెట్టి మాటిమాటికి పక్కమీదలేచి పడుతూ ముఖాన్ని కప్పుకొని తలగడమీద ఉంచింది. ఇదే అవకాశమని పరిచారికలకు సంజ్ఞచేసి మెల్లమెల్లగా సత్యభావ వద్దకు వెళ్ళాడు. విసనకఱ్ఱ తీసుకొని ప్రక్కన నిలిచి మెల్లగా గాలి సోకచేస్తూ కొంచం నవ్వాడు. పారిజాతపుష్పాన్ని తాకటంచేత దివ్యమైన సువాసనగలవాడయ్యాడు.

ఆ సువాసనకు ఆశ్చర్యపడి ముఖంమీది గుడ్డను తొలగించి ఇదేమిటని ప్రశ్నించింది. ఆమె లేచి వెనుకనున్న భగవంతుని చూడక, సేవకురాళ్ళను సువాసన నెక్కడిదని ప్రశ్నించింది. వాళ్ళు మాట్లాడక మోకాళ్ళ నేలపై ఆనిచారు, ముఖాలు వంచి నమస్కరించారు. ఎక్కడిదీ సువాసన అని నలువైపుల చూడగా కేశవుడు

కనిపించాడు. కన్నీరు కారుస్తూ రోషంతో అదురుచున్న పెదవులు గలదై నిట్టూర్పు విడిచి ముఖం వంచుకున్నది.

బొమముడిపాటుతో చేతిలో ముఖమునంచి హరిని బాగా శోభిస్తున్నావు అన్నది. ప్రణయకోపంవల్ల కన్నీరు కార్చింది. ముఖంనుండి జారిపడిన ఒకకన్నీటిని కృష్ణుడు చేతులలో పట్టుకున్నాడు. తరువాత ప్రియురాలి ముఖమందలి కన్నీటిని తుడిచి సుందరి! కన్నీరు ఎందుకు కారుచున్నది? ఎర్రనివస్త్రాన్ని విడిచి తెల్లనివస్త్రం ధరించావేమి? ఈ వేళ అలంకారములులేని నీ శరీరమును చూడవలసి వచ్చిన దేమి? ఇలా ఉండటం బాగాలేదు. గ్రహ నక్షత్రాలు లేని ఆకాశంలా అలంకారాలు లేని నీ శరీరం అందంగాలేదు. వెనుకటివలె మాట్లాడవేల? నేను నీవాడినని లోకానంతకూ తెలుపు. నేను నీ దాసుడను, ఆజ్ఞాపించవేమి? ప్రేమ, గౌరవము నీయందేకాని మరొక స్త్రీ యందు నాకు లేదు. ఇలా మాట్లాడుచున్న జనార్దుని చూచి సత్యభామ కన్నీటిని తుడుచుకొని మెల్లగా ఇలా అన్నది.

నీవు నావాడవని నిత్యమూ నాభావం, సామాన్యప్రేమయే నా మీద అని ఈ వేళ తెలిసింది. పదిమాటలెందుకు? నీ హృదయం తెలిసింది. మాటలలోనే మాధుర్యం, తిన్నని స్వభావం గల నన్ను అవమానిస్తున్నావు. నీదంతా కపటం అని పలికి మళ్ళీ కన్నీరు కార్చింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
సత్యభామ ప్రణయకోపము అను అరవై ఎనిమిదవ అధ్యాయము

★★★

# అరవై తొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు సత్యను ఊరడించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

అభిమానవతి ప్రణయ కోపంతో కూడినదైన సత్యభామను గూర్చి శ్రీకృష్ణుడిలా చెప్పాడు.

ఓ కమలనయనా! నీ దుఃఖాన్ని చూచి నా శరీరం మండిపోతున్నది. ఓ సుందరి! నేను వివదగినవాడనైతే చెప్పటానికి బాధలేదు. నా ప్రాణాల మీద ఒట్టు పెట్టుకొని అడుగుతున్నా నీ దుఃఖానికి కారణమేమిటి? అప్పుడు సత్యభామ

తలవంచుకొని కన్నీరు కారుస్తూ దేవ! పూర్వం నీవే నా సౌభాగ్యాన్ని లోకంలో ప్రసిద్ధి చెందించావు. దానిచే నేను గర్వించాను. స్త్రీలందరిలో మెప్పు పొందాను. ఆ నేను ఈవేళ సవతులకు జనానికి అపహాస్యం చేయబడే దానిని అయ్యాను. అని పరిచారికలు చెప్పారు. నారదుడిచ్చిన పారిజాత పుష్పాన్ని నీకిష్టమైన వ్యక్తికి ఇచ్చావు. నన్ను విడిచిపెట్టావు. శ్రేష్ఠమైన వస్తువును ఇవ్వటంచేత ఆమె యందు స్నేహము అభిమానం నీకు ఎక్కువ ప్రకటించావు.

ఆమెను స్తోత్రం చేసే సందర్భంలో ఈ దౌర్భాగ్యురాలి ప్రసక్తి ఎందుకు? మొదట ప్రేమరసాన్ని ఇచ్చి తరువాత సంతాపం కలుగుజేసే యెడల నేను తపస్సు చేసుకుంటాను అనుగ్రహించి అనుజ్ఞ ఇమ్మా. స్వప్నంలో కనిపించినా నమ్మను. నారదమహర్షి తన యిష్టం వచ్చినట్లు పొగడవచ్చు నాకేమీ అభ్యంతరం లేదు. నీ సమక్షంలో పొగడటం వల్ల నాకు కోపం వచ్చింది. సత్పురుషులు గౌరవం కొరకు జీవిస్తారని నీవే చెప్పావు. కనక గౌరవం లేనిదానినై జీవించ తలచుటలేదు. నన్ను రక్షించిన వాని నుండి భయపడుతున్నాను. అతడే యిప్పుడు రక్షించుటలేదు. దేవ! నీవు విడిచిపెడితే నాగతేమి?

ఈ విధంగా ఈర్ష్యతో అభిమానవతియైన సత్యభామను భగవంతుడు బ్రతిమాలుతూ ప్రాణేశ్వరి! ఇలా పలుకవద్దు. ఎక్కువ మాటలెందుకు నన్ను నీవాడనుగా గ్రహించు. ఆ పారిజాతపుష్పాన్ని నారదుడు ఆమెకు నాయెదుట ఇచ్చిన మాట వాస్తవమే. నాయీ ఒక్క తప్పును క్షమించు. పారిజాతపుష్పాలు నీకు కావలిస్తే నేను తెచ్చియిస్తాను. స్వర్గం నుంచి పారిజాతవృక్షాన్ని తెచ్చిన యింట్లో స్థాపిస్తాను. అని శ్రీహరి మాట్లాడగా శ్రీకృష్ణుని ప్రియురాలు అలా అయితే ఆ చెట్టును ఇక్కడకు తీసుకురమ్మా. నా కోపం తుడిచి వేసినవాడవౌతావు. అప్పుడు స్త్రీలందరిలో గొప్పదాననౌతాను అన్నది. శ్రీకృష్ణుడు అలాగే అగుగాక అని పలికాడు.

ఆమె సంతోషానికి హద్దు లేకుండా పోయింది. తరువాత జగన్నాథుడు స్నానం చేసి నిత్యకర్మను పూర్తిచేసి నారదుని తలుచుకొన్నాడు. నారదుడు సముద్రంలో స్నానం చేసి తరువాత వచ్చాడు. అతనికి సత్యభామ తానూ యథావిధిగా పూజ చేశారు. సత్యభామ కృష్ణుడు నీళ్ళు పోస్తుండగా మహర్షి పాదాలు కడిగింది. తరువాత నారదుడు ఆనందంగా ఆసనం మీద కూర్చొని ఉన్నాడు. శ్రీకృష్ణుడు అతనికి పాయసం వడ్డించాడు. నారదుడు స్తిమితంగా భోజనం చేశాడు. సత్యభామ అతనికి తలవంచి నమస్కారం చేసింది. నారదుడు శ్రీకృష్ణుని

ఆశీర్వదించాడు. అప్పుడు దేవర్షి కుడిచేతితో నీళ్ళు తీసుకొని దేవి! ఇప్పుడు నీవు పతిభక్తి కలిగి ఉన్నట్లే ముందు కూడ భర్తకు ప్రియురాలివై ఉంటావు. నా తపోబలం వల్ల నీకిట్టి అదృష్టం కలుగుతుంది.

ఇప్పటి నుండి నీ సౌభాగ్యం వృద్ధి చెందుతుంది. నారదుడిలా మాట్లాడగానే సత్యభామ ఆనందంలో మునిగిపోయింది. శ్రీకృష్ణుడు నారదుని అనుమతితో మిగిలిన అన్నం భోజనం చేశాడు. తరువాత సత్యభామ శ్రీకృష్ణుని అనుమతితో భోజనానికి వెళ్ళింది. భోజనం చేసిన తరువాత బయటకు వచ్చి దేవర్షికి నమస్కారం చేసి కృష్ణుని ప్రక్కన నిలబడింది. కొంచంసేపు అయిన తరువాత దేవర్షి కృష్ణునితో దేవా! నీవు ఆజ్ఞ ఇస్తే ఇప్పుడు నేనిక్కడ నుండి ఇంద్రలోకానికి వెళ్తాను. అక్కడ గంధర్వులు, అప్సరసలు శివునకు నమస్కరించి గానం చేస్తారు. ప్రతివెలలోనూ ఇంద్రుని భవనంలో శివుని పూజ సందర్భంగా నృత్యగీతాలు జరుగుతాయి. పూజ్యురాలైన పార్వతి తన పరివారంతో కూడి శంకరునకు కనబడకుండా యింద్రుని పూజను స్వీకరించటం చూస్తుంది.

దేవేంద్రుడు నాకు పారిజాత పుష్పమిచ్చి స్వీకరించమన్నాడు. దాన్ని నీ కోసం తెచ్చాను. ఇది దేవతలు అనుభవించే పుష్పం. పుణ్యం, సౌభాగ్యం వృద్ధి చెందటానికి ఈ వృక్షాన్ని అదితి కశ్యపునికి శచీదేవి ఇంద్రునికి రోహిణి చంద్రుడికీ బుద్ధి కుబేరుడికీ దానం ఇచ్చి అభివృద్ధి పొందారు. పారిజాతం ఇలాంటి సౌభాగ్యాన్ని యిచ్చే వృక్షము. ఈ పుష్పానికి పారిజాతమనీ, మందారమనీ, కోవిదారమనీ పేర్లు న్నాయి. ఆ వృక్షం దివ్యవృక్షంగా తెలియబడుచున్నది. ఆ వృక్షానికి సంబంధించినది ఈ పుష్పం. అని చెప్పాడు!

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు సత్యను ఆరాధించుట అను అరవై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# డెబ్భై యవ అధ్యాయము

## నారద శ్రీకృష్ణ సంవాదము

రాజేంద్రా! దేవర్షి నారదుడు సెలవు తీసుకొనుచుండగా భగవంతుడైన విష్ణువు ధర్మస్వరూపం తెలిసిన ఓమహర్షీ! నీవు స్వర్గానికివెళ్ళి శివుని సభలోనివాళ్ళనుచూచి

తరువాత నా సందేశాన్ని ఇంద్రునకు ఈ విధంగా చెప్పండి. ఇంద్రుడు నాకు సోదరుడు. ఆ సోదరభావాన్ని తలుస్తూ అతనితో ఇలా చెప్పండి.

పూర్వం కశ్యపుడు దేవమాత అదియొక్క సౌభాగ్యంకోసం పారిజాతవృక్షాన్ని సృష్టించాడు. దాన్ని దానం చేస్తే పుణ్యము, సౌభాగ్యము వృద్ధిచెందుతాయి. అని నేను విన్నాను. అదితి మొదలగువారు ఈవృక్షాన్ని దానం చేశారు. మీకు ఆ వృక్షం దానంచేస్తే మళ్ళీ తిరిగియిచ్చేశారు. దాని మహిమవిని నా భార్యలు ఆ వృక్షాన్ని దానం చెయ్యాలని కోరుతున్నారు. మీరు ఆ పారిజాతవృక్షాన్ని అక్కడకి పంపండి. నా భార్యలు దానం చేసిన తరువాత మరల స్వర్గానికి తీసుకువెళ్ళవచ్చు. ఓ పూజ్యుడా! ఈ విధంగా ఇంద్రునికి చెప్పవలెను. దేవరాజు కల్పవృక్షాన్ని యిచ్చేటట్లుగా ప్రయత్నించవలెను. మీ ద్వారా అన్ని పనులూ సిద్ధిస్తాయని నాకు గౌరవముంది.

శ్రీకృష్ణుని మాటలువిని నారదమహర్షి కొంచెం నవ్వి ఓ యదుపుంగవా! ఇంద్రుడికి నీ సందేశం వినిపిస్తాను. కాని అతడు ఏవిధంగానూ పారిజాతవృక్షాన్ని యివ్వడనీ నా ఉద్దేశం. పూర్వం దేవతలు, రాక్షసులు సముద్రాన్ని తరచి పారిజాత వృక్షాన్ని పొందారు. తరువాత శంకరుడు ఆ వృక్షాన్ని తెచ్చుటకు ప్రమథగణాన్ని పంపాడు. అప్పుడు దేవేంద్రుడు శివుడి దగ్గరకు వెళ్ళి ఓ పూజ్యుడా! పారిజాత వృక్షాన్ని ఇంద్రాణికి (నాభార్యకు) క్రీడావృక్షంగా చేద్దామనుకొంటున్నాను. దయచేసి ఈ వృక్షాన్ని నాకు ఇచ్చేయండి అన్నాడు. శంకరుడు 'తథాస్తు' అని అతని మాటను మన్నించాడు. తరువాత తన భార్య ఉమను సంతోషపెట్టాలని, మందరపర్వత గుహలోనే రెండువందల క్రోసుల దూరం ప్రత్యేకంగా పారిజాత వనాన్ని సృష్టించాడు.

అది సూర్యకిరణాలు, చంద్రకిరణాలు పడనంతటి దట్టమైనది. అక్కడ పార్వతి యిష్టాన్ని బట్టి చల్లదనం, వేడి ఉంటుంది. అక్కడ పార్వతి మహాదేవుడు, ప్రమథ గణం, నేనూ తప్ప ఏ వ్యక్తికీ ఏ విధంగానూ ప్రవేశంలేదు. ఆ వనంలోని వృక్షాలవల్ల నలువైపులా అనేకవిధాలైన కోరినరత్నాలు వర్షంలా పడుతూ ఉంటాయి. ఇంద్రునికి పారిజాతవృక్షంకంటే అక్కడి పారిజాతవనంయొక్క గుణం, సువాసన. శోభ, కొన్నిరెట్లు ఎక్కువ. ఆ వృక్షాలు శరీరాలు ధరించి శంకరుని అతని ప్రమథ గణాల్ని సేవిస్తూ ఉంటాయి.

ఆ మందరపర్వతంమీద ఎన్నో పారిజాతవృక్షాలున్నాయి. అవి అన్నీ శివుని ప్రభావంవల్ల ఎల్లప్పుడూ సుఖంగా ఉంటాయి. పార్వతి వాటిని ఎక్కువగా ప్రేమిస్తుంది. ఒకమారు పరాక్రమవంతుడైన అంధకుడనే రాక్షసుడు ఆ వనంలో ప్రవేశించాడు. వాడు వృత్రాసురునికంటే పదిరెట్లు బలం కలవాడు. కాని మందార వనంలో ప్రవేశించటంచేత శంకరుడతన్ని చంపివేశాడు. కాబట్టి మీకు పారిజాత వృక్షం పొందటం కష్టమని నా మనస్సు చెపుతోంది. కష్టపడి పొందిన వృక్షాన్ని దేవరాజు ఎప్పటికీ ఈయడని సత్యం చెపుతున్నాను. అది ఇంద్రాణికి బాగా ఇష్టమైనది. దానిద్వారా ఇంద్రుడు అతని భార్య తమ కోరికలను తీర్చుకొంటున్నారు. అన్నాడు.

నారదుని మాటలు విని ఓ మునిరాజా! ఇంద్రుని భార్య గురించే శంకరుడు ఆ వృక్షాన్ని తీసుకువెళ్ళలేదు. అది అతనికి తగినపని. అని నా నమ్మకం. నేను ఇంద్రుడికి తమ్ముణ్ణి, తన పుత్రుడైన జయంతునివలె ప్రేమతో నన్ను చూస్తాడు. అదికాక ప్రపంచంలో మీరు చేయలేని పనిలేదు. ఏదోఒక ఉపాయంద్వారా నా ఉద్దేశాన్ని నెరవేర్చగలరు. పుణ్యసాధనకై స్వర్గంనుండి పారిజాతవృక్షం తెస్తానని సత్యభామకు ప్రతిజ్ఞ చేసి చెప్పాను.

ఓ తపోధనా! నా ప్రతిజ్ఞను ఎలా అసత్యం చేసుకుంటాను? నేనెప్పుడూ అసత్యం పలకలేదు. లోకానికి ధర్మమార్గంచూపే నేను అసత్యం ఎలా పలకను? నేను అసత్యం పలికితే ప్రపంచంలో విప్లవం ఏర్పడుతుంది. నా ప్రతిజ్ఞను ఎప్పుడూ. భగ్నం చెయ్యలేదు. మీరు చెప్పినా ఇంద్రుడు పారిజాతవృక్షాన్ని ఇవ్వకపోతే ఇంద్రాణి గంధంపూసే అతని రొమ్ముపై నా గదాప్రహారం తప్పదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
నారద శ్రీకృష్ణ సంవాదము అను డెబ్బైయవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఒకటవ అధ్యాయము

## ఇంద్రుని మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత దేవర్షి నారదుడు ఇంద్రభవనానికి వెళ్ళాడు. ఆ రాత్రి అక్కడనే ఉండి మహోత్సవాన్ని చూచాడు. దేవతలలో ఎన్నిగణాలు ఉన్నవో అవి

అన్నీ అక్కడ చేరాయి. వాళ్ళందరిమధ్యలో ఎత్తైన సింహాసనంపైన శంకరుడు, అతని పరివారమూ కూర్చున్నారు. ఆత్మజ్ఞానులు, మునులు, దేవర్షులు, గంగాది నదులు సమావేశమయ్యారు. గంధర్వరాజు చిత్రరథుడు దేవవాద్యాలను సంతోషంతో వాయించాడు. తుంబురుడు మొదలగువాళ్ళు గానం చేశారు. ఊర్వశి మొదలైన అప్సరసలు నృత్యాదుల ద్వారా రంజింపచేశారు. ఇంద్రుని సేవలను శంకరుడు సంతోషంతో స్వీకరించాడు. తరువాత అక్కడనుండి వెళ్ళిపోయాడు. ఇంద్రుడు రాజర్షి సమూహాన్ని దేవతలను అందరినీ పూజించిన తరువాత తమ తమ స్థానాలకి వెళ్ళారు. ఇలా అందరూ వెళ్ళిన తరువాత ఇంద్రుడు నిశ్చింతగా తన సభ్యులతో కూర్చొని ఉన్నాడు.

అప్పుడు నారదుడు అతని దగ్గరకు వెళ్ళాడు. అతన్ని చూడగానే దేవరాజు ఆసనంమీద నుంచి లేచి నిలబడ్డాడు. నారదుని గౌరవించి దర్భాసనంమీద కూర్చొన బెట్టాడు. తరువాత నారదుడు ఇంద్రుడికి నేను శ్రీకృష్ణుని దూతగా నీవద్దకు వచ్చా నన్నాడు. ఒక పనిమీద నన్ను నీదగ్గరకు పంపాడు. అతని పని పూర్తిచేయటం నీవు చేయదగినది. అనగా సంతోషంతో ఇంద్రుడు ఓ మునివరా! మహాత్ముడైన కృష్ణుడు చాలాదినముల తరువాత నన్ను తలచాడు. ఇప్పుడు ఆయన ఏంచెప్పి మిమ్మ్ము ఇక్కడకు పంపాడు? త్వరగా చెప్పండి అని అడిగాడు.

నారదుడు దేవేంద్రా! నీ సోదరుడైన కృష్ణుని కలుసుకోవటానికి నేను ద్వారకకు వెళ్ళాను. అప్పుడు శ్రీకృష్ణుడు రుక్మిణితో రైవతకపర్వతం మీద వెలుగొందుతు న్నాడు. అక్కడికి వెళ్ళేటప్పుడు ఒక పారిజాత పుష్పాన్ని తీసుకుపోయాను. అతని భార్యలను ఆశ్చర్యపరచటానికి ఆ పుష్పాన్ని భగవంతుని చేతిలో పెట్టాను. ఆ పుష్పాన్ని చూచి అతని భార్యలు ఆశ్చర్యపడ్డారు. అప్పుడు నేను భగవంతుడైన కశ్యపుడు పారిజాత వృక్షాన్ని సృష్టించటం, దాని గుణాలను, మొత్తం వృత్తాంతం చెప్పి వినిపించాను. అదితి శచీదేవివ్రతం చేసి ఆ వృక్షాన్ని దానంచెయ్యటం చెప్పగా సత్య పుణ్యసంచయ వ్రతం చెయ్యటానికి కల్పవృక్షం కావాలని శ్రీకృష్ణుని అడిగింది. నీసోదరుడు ఆమె కోరికను విని సరే అన్నాడు. తప్పక ఆ వృక్షాన్ని అడిగి తెస్తా అన్నాడు. తరువాత అతడు నాకు చెప్పినదానిని తెలియజేస్తా విను.

నీ సోదరుడు వినయపూర్వకంగా ఓ దేవరాజా! నేను నీకు తమ్ముణ్ణి కాబట్టి నన్ను నీవు పాలించాలి. నీ మరదలు సత్యభామ ధర్మాన్ని ఆచరించటానికి పారిజాత

వృక్షాన్ని కోరింది. ఆవిడ కోరికతీరే ఉపాయం చూడవలసింది. ఈ మనుష్య లోకంలో శుభము సాధ్యంకానిది. నా ప్రభావంచేత మానవులుకూడ దేవలోక సంపదను దర్శించాలని కోరుతున్నాను. నారదుని మాటలు విని ఇంద్రుడు ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నీవు చెప్పింది విన్నాను. మీరు కూర్చోండి. నేను శ్రీకృష్ణునకు సమాధానం పంపుతా అని తన బలపరాక్రమాలను ఆలోచించి మహర్షీ శ్రీకృష్ణుడికి నా క్షేమం తెలిపి యీవిధంగా చెప్పండి ఈ ప్రపంచాన్ని నావలె నీవు కూడ పోషించేవాడవు. పారిజాతవృక్షం స్వర్గంలోని అన్ని శ్రేష్ఠవస్తువుల మీద నాకున్నట్లే నీకూ ప్రభుత్వం ఉంది. భూభారాన్ని తగ్గించటానికి మనుష్యుడుగా మనుష్య లోకంలో ఉన్నావు. తన ప్రతిజ్ఞను నెరవేర్చి తిరిగి తన స్థానానికి తిరిగివస్తావు. నీ ప్రతిజ్ఞను పూర్తి చేసికొని మళ్ళీ నీవు స్వర్గానికి వచ్చిన తరువాత నీ భార్య యొక్క కోరికను తీర్చగలను.

ఓ కేశవ! స్వర్గానికి సంబంధించిన శ్రేష్ఠవస్తువులను తీసుకువెళ్ళవద్దు. స్వర్గంలోని వస్తువులను మానవలోకంలోకి తీసుకువెళ్ళకూడదని నియమము. ఆ నియమాన్ని పాటించకపోతే ప్రజాపతులు నన్నేమంటారు? బ్రహ్మ ఏర్పరచిన నియమాన్ని హేలనచేసి యేపనైనాచేస్తే ఆయన నన్ను శపిస్తాడు. నేను హద్దును మీరితే తక్కిన దేవతలు, దైత్యులుకూడ నియమాల్ని పాటించరు. హద్దుమీరి నేను ఒక స్త్రీకోసం ఇక్కడనుండి పారిజాతవృక్షాన్ని తీసుకుపోతే స్వర్గంలో నివసించేవాళ్ళ మనస్సు కష్టపడుతుంది. బ్రహ్మ మానవుల ఉపయోగంకొరకు నిర్దేశించిన వస్తువులను మాత్రమే నా తమ్ముడు దేశకాలపరిస్థితులనుబట్టి అను భవించాలి. స్వర్గంలో నా ఉపయోగంకొరకు నిర్దేశింపబడిన వస్తువులిక్కడ ఉండాలి. శ్రీకృష్ణుడు ధర్మాన్ని అతిక్రమిస్తే పాపాన్ని పొందుతాడు.

మహాత్ముడైన కృష్ణుడు స్త్రీకి వశుడైతే అతనికి లోకంలో అపకీర్తి కలుగుతుంది. ఇది నా విశ్వాసము. మానవుడుగా ఉన్న కృష్ణుడు ఇంద్రుడనైన నేను చేసిన నియమం ప్రకారం ప్రవర్తించాలి. ఇప్పుడు స్వర్గంనుండి పారిజాతవృక్షం పోయిందంటే నాకు అవమానం కలుగుతుంది. కాబట్టి మీరు వెళ్ళి శ్రీకృష్ణునికి పారిజాతవృక్షం తీసుకు వెళ్ళటం ఏవిధంగానూ యుక్తియుక్తం కాదు అని నాపై అతనికి ప్రసన్నత కలుగు నట్లు ప్రయత్నించండి. పారిజాతవృక్షంతప్ప ఏ వస్తువునైనా కావలసినదానిని ఇక్కడినుండి తీసుకువెళ్ళవచ్చు. అంతేకాని స్వర్గ కార్యములకు విఘ్నం

కలిగించటం తగినపని కాదు. కనుక ఓ మహర్షీ! వస్త్రమణి, భూషణములలో కావలసినవాటిని ఇచ్చుటకు సిద్ధంగా ఉన్నాను. కాని దేవతలకు అతిముఖ్యమైన కల్పవృక్షాన్ని ఏ విధంగానైనమా నేను ఇవ్వలేనని చెప్పండి అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
ఇంద్రుని మాటలు అను డెబ్బై ఒకటవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై రెండవ అధ్యాయము

## ఇంద్ర నారద సంవాదము

మహారాజా! నారదుడు ఇంద్రుని మాటలు విని ఓ మహాత్మా! నేను తప్పక కృష్ణునికి నీ కష్టాలను తెలియజేస్తా. నీ అభిప్రాయం ఊహించి మొదట అనేక కారణాలు చూపిస్తూ చెప్పాను. దేవరాజు శంకరుడడిగితే ఇయ్యలేదని చెప్పాను. నేను తమ్ముణ్ణి కనుక ఇంద్రుడు నాపై ప్రేమతో ఇస్తాడనీ అలా కాకపోతే నా గద అతని వక్షస్థలంపై పడుతుందనీ నా ప్రతిజ్ఞను ఎవరూ భంగం చెయ్యలేరనీ చెప్పాడు. మహాత్మా ఈ విధంగా నీ తమ్ముడి అభిప్రాయం నీకు చెప్పాను. నీ అభిరుచిని బట్టి వివేచన చేసి పనిచెయ్యి అని పలికాడు.

అప్పుడు దేవేంద్రుడు ఓ తపోధనా! శ్రీకృష్ణుడి అన్న నిరపరాధి. అయినా ఇలా చేయదలుచుకొంటే నేనేం చేయగలను? వెనుకనే ఎన్నోమార్లు నన్ను అవమానించాడు. తమ్ముడు కదా అని సహించాను. పూర్వం ఖాండవదహనం కాల్చివేసే సమయంలో మేఘాలను పంపితే వాటిని పారద్రోలాడు. గోవర్ధనపర్వతం ఎత్తి నన్ను అవమానించాడు. ఇలా ఎన్నో అతనివల్ల అవమానాలు కలిగాయి. అన్నిటినీ సహించాను. ఒకవేళ గదాప్రహారం చేస్తానంటే శచీదేవి దుఃఖిస్తుంది. అంతకంటే ప్రయోజనం ఉండదు. నా తల్లిదండ్రులిక్కడలేరు. నా సోదరుడు జితేంద్రియుడైనా రజోగుణ, తమోగుణాలతో కప్పబడి ఉన్నాడు. ఆడదానిమాట విని చిన్న పెద్ద తారతమ్యాన్ని మరచిపోయాడు. నా తమ్ముడు కదా అని ప్రేమతో నాకు చెందే యజ్ఞభాగాన్ని కూడా అతనికి ఇచ్చాను.

ఓ మహర్షీ! ప్రతియుద్ధంలోనూ నేను మొదట ఎదుర్కొంటా కాని ఈ యుద్ధంలో ఇలా చేయను. మొదట అతడే ఎదుర్కోవాలి. మునివర! అన్ని

అవతారాలలో నా శరీరంలాగా అతన్ని ప్రయత్నపూర్వకంగా రక్షిస్తున్నా. నేనతనికి శత్రువుగా ఉన్నాను. నేను అతనిపై చూపిన ప్రేమంతా వ్యర్థమైంది. సరే! నారద! వెళ్ళిరా! యుద్ధానికి పిలిస్తే వెనుదీయనని చెప్పు. యుద్ధమే ఇష్టమైతే రా. భార్య చేతిలో కీలుబొమ్మా! నీవే ముందు యుద్ధం ప్రారంభించాలి. జనార్దన! గరుత్మంతునిపై కూర్చుని చక్రం, ధనుస్సు, గద, ఖడ్గమూ ధరించి దృఢంగా రమ్ము. నీవు కొట్టితేనే నేను కొడతాను. చక్రహస్తుడైన కృష్ణుడు నన్ను జయించేదాకా పారిజాతవృక్షాన్ని ఇవ్వను. చిన్నవాడు, నన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు. స్త్రీకి ఓడిపోయిన అతన్ని నేను సహించను.

పూజ్యుడా! కృష్ణుడు పాలించే ద్వారకకు నేడే వెళ్ళు. వాగ్వాదం చేసేవాడు అజ్ఞాని, అని చెప్పు, నీవు జయిస్తే తప్ప పారిజాతముయొక్క ఆకులో సగభాగం కూడా ఇవ్వను. ఇది నా మాటగా కృష్ణునికి చెప్పు. మాయతో తీసుకువెళ్ళవద్దు. యుద్ధమే జరుగనిమ్ము. కుటిలంగా ప్రవర్తించటం నిందింపదగినది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఇంద్ర నారద సంవాదము డెబ్బై రెండవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై మూడవ అధ్యాయము

## నారదుడు స్వర్గము నుండి ద్వారకకు వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు

మహారాజా! దేవర్షి నారదుడు ద్వారకకు చేరి భగవంతుడు సత్యభామతో ఆనందంగా ఉండటం చూచాడు. పారిజాతవిషయంలో చర్చ నడుస్తూ ఉంది. ఆయన తన మాటలనేర్పుతో సత్యభామను సంతోషపెడతున్నాడు. నారదుని చూడగానే లేచి నిలబడ్డాడు. అతనికి శాస్త్రప్రకారం పూజచేశాడు. నారదుడు కొంచంసేపు విశ్రాంతి తీసుకున్నాడు. తరువాత భగవంతుడు పారిజాత విషయం అడిగాడు. నారాయణునకు నారదుడు తనకు ఇంద్రునకు మధ్య జరిగిన సంభాషణను తూచా పోకుండా చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు ఓ ధర్మమూర్తీ! రేపు ఉదయం ఇంద్రుని రాజధాని అమరావతికి వెళ్తాను. అనిచెప్పి నారదునితోపాటు సముద్రం ఒడ్డుకు వెళ్ళాడు.

అక్కడ ఏకాంతంలో నారుదునితో ఓ తపోధనా! మీరీవాళే ఇంద్రుని వద్దకు వెళ్ళండి. నా తరపున నమస్కరించి యుద్ధంలో ఎప్పుడూ నా యెదుట నిలబడలేవు. నేను స్వర్గంనుండి పారిజాతవృక్షం తీసుకుపోతా అన్నాడు. నారదుడు ఇంద్రుని వద్దకు వెళ్ళాడు. ఉన్నదున్నట్లు భగవంతుని సందేశం అతనికి వినిపించాడు.

ఇంద్రుడు బృహస్పతి వద్దకు వెళ్ళి విషయమంతా చెప్పాడు. అప్పుడాయన ఇంద్రుని తిడుతూ నేను కొంచం సమయం బ్రహ్మలోకానికి వెళ్ళాను. ఇంతలో నీవు ఇంతకష్టం తెచ్చిపెట్టావు. నాకు చెప్పకుండా నీవిలాంటిపనిలో ఎందుకు వేలు పెట్టావు. దైవం చేయదలచింది చేస్తుంది. నీ తప్పేముందిలే. చిన్నపనైనా వెంటనే చేయటం తగదు. ఈ పనివలన చివరకు ఓడిపోక తప్పదు. అన్నాడు. దేవరాజు పూజ్యుడా! జరగాల్సింది జరిగిపోయింది. ఇప్పుడు నేను చేయవలసింది చెప్పండి అన్నాడు.

మూడులోకాల విషయం తెలుసుకొనే బృహస్పతి క్షణకాలం ముఖం వంచుకొని తరువాత దేవరాజా! ఈ సమయంలో నీవు నీ పుత్రుడు అతనితో యుద్ధం చెయ్యండి. న్యాయం జరిగేటట్లు చేస్తాను అని పలికి క్షీరసముద్రం దగ్గరకి వెళ్ళాడు. అక్కడ కశ్యపునికి పరిస్థితి అంతా చెప్పాడు. కశ్యపుడు కోపించి బృహస్పతితో ఇది తప్పక ఇలా జరగవలసి ఉంది. అతనికి దోషశాన్తి కలగాలని నేను ఉదవాసవ్రతం స్వీకరించాను. ఐనా ఇంద్రుని రక్షించలేకపోయాను. నేను అదితో వెళ్ళి మధ్యస్థులుగా ఉండి యుద్ధం జరుగకుండా చూస్తాను. ఐనా దైవం అనుకూలించకపోతే నేను మాత్రం ఏం చేయగలను? అన్నాడు.

బృహస్పతి కశ్యపునితో మంచి సమయంచూచి అక్కడకు వెళ్ళండి అన్నాడు. కశ్యపుడు సరే అన్నాడు. బృహస్పతిని వీడ్కొని అదితో శంకరుని పూజకై వెళ్ళాడు. తరువాత వరం పొందటానికి కశ్యపుడు భార్యతో మహదేవుని పూజించాడు. తరువాత మంత్రాలతో స్తోత్రం చేశాడు. ఈ స్తోత్రానికి శంకరుడు ప్రసన్ను డైయాడు. కశ్యపునికి దర్శనం ఇచ్చాడు.

ఓ ప్రజాపతీ! ఎందుకు వీవీ స్తోత్రం చేశావో నాకు తెలుసు. ఇంద్రుడు, ఉపేంద్రుడు పూర్వస్థితిని పొందుతారు. శ్రీకృష్ణుడు కల్పవృక్షాన్ని తీసుకుపోతాడు. పూర్వం తపశ్శాలియైన దేవశర్మ భార్యను కామించాడు. ఆ తపోధనుడు ఇతన్ని

శపించాడు. అందుచేత ఓడిపోవుట తప్పదు. కాబట్టి అదితోపాటు ఇంద్రుని భవనానికి వెళ్ళండి. మీ యిద్దరి పుత్రులకు శుభం కలుగుతుంది. కశ్యపుడు శంకరుని మాటవిని మిక్కిలి సంతోషించాడు. శంకరునికి నమస్కరించి దేవ లోకానికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు విష్ణుపర్వంలో
నారదుడు స్వర్గము నుండి ద్వారకకు వచ్చుట అను డెబ్బై మూడవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై నాల్గవ అధ్యాయము

## కశ్యపుడు శివుని స్తుతించుట

కశ్యపుడు చేసిన శివస్తోత్రము

శ్లో॥ ఉరుక్రమం విశ్వకర్మాణమీశం జగత్ప్రస్తారం ధర్మదృశ్యం వరేశమ్
స సత్వాం ధృతిమద్దామదివ్యం విశ్వేశ్వరం భగవంతం నమస్యే॥
యో దేవానామధిపః పాపహర్తా తం తం విశ్వం యేన జగన్మయత్వాత్
ఆపోగర్భం యస్య శుభ్రాభధరిత్ర్యో విశ్వేశ్వరం తం శరణం ప్రపద్యే॥
శాలావృకాన్ యో యతిరూపో నిజఘ్నేచ తానింద్రేణ ప్రణుదో హితానామ్
విరూపాక్షం సుదర్శనం పుణ్యయోనిం విశ్వేశ్వరం శరణం యామి మూర్ధ్నా॥
భుక్త్వేయ ఏకో విభుర్జగతో విశ్వమగ్ర్యం ధామ్నాం ధామసుకృతిత్వా న్నధృష్యః
పుష్యాత్ సమాం సహసా శాశ్వతేన సోమపానాం మరీచిపానాం వరిష్ఠః॥
అథర్వాణం సుశిరసంభూతయోనిం కృతినం వీరం దానవానాంచ బాధమ్
యజ్ఞేహుతిం యజ్ఞియం సంస్కృతం వై విశ్వేశ్వరం శరణం యామి దేవమ్॥
జగజ్జాలం వితతం యత్రవిశ్వం విశ్వాత్మానం ప్రీతిదేవం గతానామ్
య ఊర్ధ్వగం రథమాస్థాయ యాతి విశ్వేశ్వర స్సుమనా మేస్తు నిత్యమ్॥
అన్తశ్చరం రోచనం చారుశాఖం మహాబలం ధర్మనేతార మీడ్యమ్
సహస్రనేత్రం శతవర్మానముగ్రం మహాదేవం విశ్వసృజం నమస్యే॥
శుచిం యోగం శంసనం శాన్తపాపం సర్వం శంభుం శంకరం భూతనాథమ్
ధురం ధరం గోపతిం చంద్రచిహ్నం హృషీకాణామయనం యామి మూర్ధ్నా॥

ఆశుః శిశానం వృషభం రోరువాణం కృతం ధర్మం వితథం చాశుశేషమ్
వసుంధరం సమృజీకం సమం త్వాం ధృతవ్రతం శూలధరం ప్రపద్యే॥
అనంతవీర్యం ధృతకర్మాణమాద్యం యజ్ఞాశేషం యజతాంఛియోజ్యమ్
హవిర్భుజం భువనానాం సదైవజ్యేష్ఠం ద్విజం ధర్మభృతాం ప్రపద్యే॥
పరం గుణేభ్యః పృశ్నిగర్భస్వరూపం యశ్శృంగం వ్యూహసంకాన్తరూపమ్
శుద్ధాత్మానం పురుషం సత్యధామ సమ్మోహనం దుష్కృతినాం నమస్యే॥
యుక్తోంకారం స్వశిర సంచారుకర్మ ధృఢవ్రతం ధృఢధన్వానమాజిమ్
శూరం నేతారం ధనుషోస్త్రాతిరేకం పతిం పశూనాం శమనం నమస్యే॥
ఏకోరాతిశ్చైవ భూతం భవిష్యం సర్వా తిథిర్యోహి జుషత్యరిఘ్నః
అరిస్తుదోనుత్తమ స్సంవిభాగే విభాజుకో మాం భగవాన్ పాతు దేవః॥
య ఏకోయాతి జగతాం విశ్వమీశో య ఏకోదాన్మరుతాం ప్రాణమగ్ర్యమ్
యేనాన్నశం స్యాచ్ఛాశ్వతంసామజుష్టంసమాంజుష్యాత్సుకృతిశ్రేయసేఽద్య॥
బ్రహస్పృజిద్యో భువనోత్తమోత్తమం తృప్తో విద్వాన్ బ్రాహ్మణః షడ్గుణస్య
సృష్ట్వార్థసంఖ్యావ్యాహృతిస్థంసమగ్రంసమాంపాయాద్ధిహబహురూపోరిహోంగైః॥
వ్యంజనోఽజనోఽథ విద్వాన్సమగ్రః స్పృశిః శంభు ప్రాణదః కృత్తివాసాః
రసోధ్రువః సవమానస్య భర్తా సపత్నీశః శంకర స్సారథితా॥
త్ర్యంబకం పుష్టిదం వోబ్రువాణం ధర్మం విప్రాణాం వరదం యజ్వానాంచ
వరాధ్వరం రణజేతార మీశం దేవం దేవానాం శరణం యామి రుద్రమ్॥
అనద్భుతం యజ్ఞకర్తారమంతం మధ్యంచాద్యం యజ్ఞకృతాం సామ్యరూపమ్
వేదవ్రతేషు బహుధా గీతమీశ మభిత్రివిష్టపం శరణం యామి రుద్రమ్॥
మహాజనం వ్రతినం మేఖలాలం సుతోషణం క్రోధధవం విపాపమ్
భూతం క్షేత్రజ్ఞం గుణినంవా కపర్దినం నతోస్మీశం వందనం వందనానామ్॥
దేవం దేవానాం పావనం పావనానాం కృతింకృతీనాం మహతోమహాన్తమ్॥
శతాత్మానం సంస్తుతం గోపతీనాం పతిం దేవం శరణం యామి రుద్రమ్॥
అంతశ్చరం పురుషం గుహ్యసంజ్ఞం ప్రభాస్వంతం ప్రణవం విప్రదీపమ్
హేతుం పరం పరమస్యాక్షరస్య శుభం దేవం గుణినం సన్నతోస్మి॥

ప్రసూతి రుభయోర్న ప్రసూతాశ్చ సూక్ష్మః పృథగ్భూతేభ్యో నపృథశ్చైక భూతః
స్వయంభూతః పాతుమాం సర్వసాదః ప్రదస్వాదః సమ్మదః పాతు రత్నం॥
ఆసన్న స్సన్నతర స్సాధనానాం శ్రద్ధావతాం శ్రాద్ధవృత్తి ప్రణీతా
పతిర్గణానాం మహతాం సత్కృతీనాం పాయాన్మేషః పూరణ షడ్గుణానాం॥
అంతర్బహిర్వా నానాంనిహన్తా స్వయంకర్తా భూతభావీ వికుర్వన్
ధృతాయుధః సుకృతినా ముత్తమేజాః ప్రణుద్యాన్మే వృజినం దేవదేవః॥
యేనోద్ధృతాస్త్రైః పురా మాయినోపై దగ్ధాఘోరేణ వితథాన్తాశ్వరేణ
మహత్కుర్వంతో వృజినం దేవతానాం జ్యాయానీశః పాతు విశ్వోదధాతా॥
భాగీయసాం భాగమతోస్తమిచ్ఛన్ మఖోదాక్షో యేనకృతో న్వధావత్
విద్వాన్ యజ్ఞస్యాది రథాస్తః సదేవః పాయాదీశో మాం దక్షయజ్ఞాన్త హేతుః॥
అవ్యోధన్యః సంస్కృతశ్చోత్తమశ్చ జగత్ సృష్ట్వా యోత్తి సర్వాతిగుహ్యః
సమాం ముఖప్రముఖే పాతు నిత్యం విచిన్వానః ప్రథమ షడ్గుణానామ్॥
గుణత్రైకాల్యం యస్య దేవన్యనిత్యం సత్వోద్రేకో యస్య భావాత్ప్రసూతః
గోప్తా గోప్తౄణాం నన్దదోదుష్కృతీనామాద్యో విశ్వస్య బాధమానస్యక్రుద్ధః॥
ధామ్నో యస్య హరిరగ్రోథ విశ్వో బ్రహ్మే పుత్రైస్సహితశ్చ ద్విజాశ్చ
పరాభూతా భవనీయస్య సోమో జుషత్వేష శ్రేయసే సాధుగోప్తా॥
యస్మాద్భూతానాం భూతిరంత్యోథ మధ్యం ధ్రుతిర్భూతిర్యశ్చ గుహో శ్రుతిశ్చ
గుహోభిభూతస్య పురుషేశ్వరస్య మహాత్మనః సంమృద్వేద్యస్య తస్య॥
యల్లింగాంకం త్ర్యంబకస్సర్వ మీశో భగలింగాఙ్కం యద్యుమా సర్వధాత్రీ
నాన్యత్తృతీయం జగదీహాస్తి కించిత్ మహాదేవాత్ సర్వ సర్వేశ్వరో సౌ॥

కశ్యపకృత శివస్తోత్రము సమాప్తము.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు భిష్యపర్వంలో
కశ్యపుడు శివుని స్తుతించుట అను డెబ్బై నాల్గవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై అయిదవ అధ్యాయము

## ఇంద్ర కృష్ణుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజేంద్రా! సూర్యోదయం అయిన తరువాత శ్రీకృష్ణుడు వేటనెపంతో రైవతక పర్వతంవైపు వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు సాత్యకిని తనరథంపై కూర్చొనపెట్టుకున్నాడు. ప్రద్యుమ్నునితో నీవుకూడ వెనక రమ్మన్నాడు. రైవతకపర్వతంమీదికి వెళ్ళిన తర్వాత సారథితో ఇక్కడనే రథం ఆపి గుర్రాలకు విశ్రాంతి ఇమ్ము. మధ్యాహ్నం వరకూ నాకోసం ఎదురుచూడు. తిరిగి మళ్ళీ రథంమీదనే ద్వారకకు వెళ్తాను. సారథియైన దారుకుడికిలా చెప్పి జయించాలనే కోరికతో సాత్యకితోపాటు గరుత్మంతునిపై కూర్చున్నాడు. కృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు మరొక రథంమీద శ్రీకృష్ణుని వెనుక వెళ్తున్నాడు. ఇలా బయల్దేరి అరనిమిషంలో ఇంద్రుని ఉద్యానవనంలో ప్రవేశించాడు.

అక్కడ శ్రీకృష్ణుడు శస్త్రాస్త్రములు పట్టుకొని ఎదిరింపరాని దేవయోధులను చూచాడు. వాళ్ళ ఎదుటనే పారిజాతవృక్షాన్ని పెకలించి గరుడుని వీపుపై పెట్టాడు కృష్ణుడు. అప్పుడు పారిజాతము రూపము ధరించి ఒణుకుతూ భగవంతుని యెదుట నిలిచింది. భగవంతుడు దానిని ఓదారుస్తూ నీవు భయపడవద్దు అని పలికాడు. వెళ్ళుతున్న పారిజాతవృక్షాన్ని చూచి శ్రీకృష్ణుడు అమరావతీపురానికి ప్రదక్షిణం చేశాడు. నందవనం కాపలావాళ్ళు పారిజాతము అపహరింపబడు తున్నదని మహేంద్రునికి చెప్పారు. ఇంద్రుడు ఐరావతమనే తన ఏనుగునెక్కి బయల్దేరాడు. తన కుమారుడు జయంతుడు రథంమీద వెనక అనుసరించి వస్తున్నాడు. తూర్పుద్వారం దగ్గర శ్రీకృష్ణుని చూచి ఇంద్రుడు మధుసూదనా! ఎందుకిలా చేశావని అడిగాడు.

కృష్ణుడు అతనికి నమస్కరించి మీవదిన పుణ్యకార్యమును జరిపించుటకు పారిజాతం తీసుకువెళ్ళవలసివచ్చిందని చెప్పాడు. అప్పుడు ఇంద్రుడు నీవు యుద్ధం చేయకుండా పారిజాతాన్ని ఇక్కడనుంచి తీసుకువెళ్ళలేవు అన్నాడు. కేశవ! మొదట నీవే నా వక్షస్థలంమీద గదను విసురు. దానితో నీ ప్రతిజ్ఞ పూర్తి అవుతుంది అన్నాడు. కృష్ణుడు నవ్వుతూ మొదటగా వజ్రా యుధంతో సమానమైన పదునైన బాణాన్ని ప్రయోగించి ఇంద్రుని ఏనుగును కొట్టాడు. ఇంద్రుడు తనబాణాలతో

గరుత్మంతుని కొట్టి తనబాణాలతో శ్రీకృష్ణుని బాణాలను ముక్కలు చేశాడు. శ్రీకృష్ణుడు కూడ ఇంద్రుని బాణాలను ఖండించాడు. తరువాత శ్రీకృష్ణుని ధనుస్సు ధ్వనిని, ఇంద్రుని ధనుస్సు ధ్వనిని విని స్వర్గంలో జనులు మూర్ఛపోయారు. వాళ్ళ యిద్దరకూ యుద్ధం జరుగుతుండగా గరుత్మంతునిపైనున్న పారిజాతాన్ని జయన్తుడు తీసుకుపోవుటకు సిద్ధపడ్డాడు.

శ్రీకృష్ణుడు అడ్డగించమని ప్రద్యుమ్నునికి చెప్పాడు. ప్రతాపవంతుడైన ప్రద్యుమ్నుడు జయంతుని అడ్డగించాడు. జయంతుడు రథంమీద కూర్చుని ప్రద్యుమ్నుడు గదచే బాణాలచే కొట్టుచున్ననూ నవ్వుతూ తానుకూడ అతన్ని కొట్టాడు. ప్రద్యుమ్నుడు సర్పములవంటి బాణాలతో జయంతుని బాధించాడు. ఆ యుద్ధం సంకులమైంది. ఇంద్రోపేంద్రుల యుద్ధమును దేవతలు, మునులూ ఆశ్చర్యపడి చూచారు. తరువాత ప్రవరుడను దేవదూత పారిజాతాన్ని తీసుకు పోవాలని చూచాడు. అతడు వస్తూండగా చూచి కృష్ణుడు సాత్యకిని ఇక్కడి నుంచియే బాణాలతో అతన్ని అడ్డగించు అన్నాడు. దయారహితంగా మాత్రం బాణాలను ప్రయోగించకు. బ్రాహ్మణ చపలత్వం సహించవలెగదా!

తరువాత ప్రవరుడు అర్ధచంద్రబాణాలతో గరుడునిమీద ఉన్న సాత్యకిని కొట్టాడు. సాత్యకి అతని ధనుస్సును ఖండించి బ్రాహ్మణుని చంపకూడదు నిలునిలు అన్నాడు. ప్రవరుడు నవ్వి శూరుడా! జాలి చూపవద్దు. యుద్ధం బలంగాచెయ్యి. నేను పరశురాముని శిష్యుణ్ణి. ఇంద్రునకు మిత్రుడను. నాపేరు ప్రవరుడు. శ్రీకృష్ణునిపై గౌరవంతో దేవతలు ఈసమయంలో యుద్ధం చేయుటకు ఇష్టపడుట లేదు. ఈవేళ నేను ఇంద్రుని మిత్రఋణం తీర్చుకుంటాను అన్నాడు. తరువాత సాత్యకి ప్రవరులమధ్య యుద్ధం తీవ్రరూపం దాల్చింది. అప్పుడు స్వర్గము, పర్వతాలు కూడా కదిలిపోయాయి. ప్రద్యుమ్న జయంతులలో ఏ ఒక్కడూ తీసి పోవటంలేదు. ప్రయోగించు బాణాల్ని అని ఒకరినొకరు పలుకుతూ విజయ కాంక్షతో యుద్ధం చేయసాగారు.

మొదట జయన్తుడు ప్రద్యుమ్నునిమీద దివ్యాస్త్రం ప్రయోగించాడు. దానిని ప్రద్యుమ్నుడు బాణవర్షంతో మధ్యలోనే స్తంభింపచేశాడు. ఆ దివ్యాస్త్రం మండి పోతూ నేలపై కూలిపోయింది. కాని ఆ బాణాగ్నిలో అతనిరథం తగలబడి పోయింది. ప్రద్యుమ్నుడు మండుతున్న రథంనుండి క్రిందికి దిగాడు. ప్రద్యుమ్నుడు ఆకాశానికి ఎగిరి ధనుస్సు ధరించి జయంతునితో ఓమహేంద్రపుత్రా! ఇలాంటి దివ్యాస్త్రాలు

వన్ను చంపలేవు. ప్రయత్నంతో నీనేర్పును చూపించు. నీబలం చూచి ఇప్పుడు నేను భయపడటం లేదు. ఇప్పుడు నీవు ఈ పారిజాతాన్ని మనస్సుతో తాకి అడగవచ్చు. చేతులతో మాత్రం తాకలేవు. నేను నా మాయా బలంతో ఇటువంటి రథాలను వేలకొలది సృష్టించగలను అన్నాడు.

తరువాత జయంతుడు తన తపస్సుచే సిద్ధించిన ఒక దివ్యాస్త్రాన్ని మహా వేగంతో వచ్చేదాన్ని ప్రయోగించగా ప్రద్యుమ్నుడు బాణసమూహంతో నివారించాడు. తరువాత జయంతుడు అతనిపై నాలుగుబాణాలు ప్రయోగించాడు. ఆ అస్త్రాలు అన్నిదిక్కులను ఆకాశమందలి ప్రద్యుమ్నుని స్తంభింపచేశాయి. జయన్తుడు ప్రయోగించిన అస్త్రాలనన్నిటినీ ప్రద్యుమ్నుడు నివారించాడు. పదునైన బాణాలతో జయన్తుని బాధపెట్టాడు. తరువాత దేవతలు ప్రద్యుమ్నుని స్థిరత్వము, శీఘ్రత చూచి పెద్దధ్వని చేశారు. అటు సాత్యకి ప్రవరునియొక్క ధనుస్సును చేతి తొడుగును వాడిబాణంతో నరికివేశాడు.

అతడు వెంటనే మహేంద్రుడిచ్చిన శ్రేష్ఠమైన ధనుస్సును పట్టుకొన్నాడు. ఆ ధనుస్సుతో బ్రాహ్మణోత్తముడు అనేక విధాలైన తీవ్రబాణాలను ప్రయోగించాడు. సాత్యకి యొక్క ధనుస్సును ముక్కలు చేశాడు. బాణాలతో శరీర మందంతటా సాత్యకిని బాధించాడు.సాత్యకి మరొకధనుస్సు పట్టుకొని ప్రవరుణ్ణి కొట్టాడు. ప్రవరుడు శ్రేష్ఠమైన బాణంతో మళ్ళీ సాత్యకి ధనుస్సును ఖండించి మూడబాణాలతో కొట్టాడు. అప్పుడు సాత్యకి నవ్వుతూ ఖడ్గాన్ని చేతితొడుగును పట్టుకొన్నాడు. తరువాత వందలాది బాణాలను ప్రవరుడు ప్రయోగించాడు. సాత్యకిని వ్యాకులత చెందిన వాడివిగా గ్రహించి అతని ఖడ్గాన్ని ఛేదించి వాడి బాణాలతో నొప్పించి శక్తి అనే ఆయుధంతో హృదయం మీద కొట్టి గర్జించాడు.

సాత్యకి బాధపడుతున్నట్లు గ్రహించి ప్రవరుడు గరుత్మంతుని వద్ద రథంమీద నిలిచాడు. గరుడుడు అతన్ని తనరెక్కల గాలిచే విసిరివేయుగా అతడు రథంతోసహా రెండుక్రోసుల దూరంలో పడ్డాడు. మూర్ఛపోయాడుకూడా. జయంతుడు పడిపోయిన బ్రాహ్మణుని ఊరడించి తన రథంమీద కూర్చొన బెట్టాడు. మాటి మాటికీ పడుతూ మూర్ఛపోతున్న సాత్యకిని ప్రద్యుమ్నుడు ఓదారుస్తూ కౌగిలించుకున్నాడు. మధుసూదనుడు అతన్ని చేతితో తాకాడు. భగవంతుని చేతి స్పర్శచేత సాత్యకి బాధ లేనివాడయ్యాడు.

యుద్ధంలో ఆరితేరిన సాత్యకి ప్రద్యుమ్నులిద్దరూ పారిజాతవృక్షానికి రెండు ప్రక్కలా నిలిచిఉన్నారు. జయంతుడు ప్రవరుడూ దగ్గరకు రాగా ఇంద్రుడు వారితో నవ్వుతూ గరుత్మంతునిదగ్గర ఉన్నవానిమీదికి వెళ్ళవద్దు. వినతపుత్రుడైన గరుత్మంతుడు చాలాబలం గలవాడు. ఆయుధాలను పట్టుకొని నాకు రెండు ప్రక్కలా ఉండి యుద్ధం చేస్తున్న నన్ను చూడండి. అప్పుడు వాళ్ళిద్దరూ ఇంద్రునకు రెండుప్రక్కలా నిలిచి యుద్ధం చేస్తున్న ఇంద్రుని, ఉపేంద్రుని చూస్తున్నారు.

అప్పుడు ఇంద్రుడు వజ్రాయుధంవంటి బాణాలతో మహాస్త్రములతోనూ గరుడిని బాధిం చాడు. అతడా బాణాలను లెక్కచేయక ఇంద్రుని ఏనుగుమీదికి వెళ్ళాడు. గొప్పబలం గల ఏనుగు పక్షి యుద్ధం ప్రారంభించాయి. ఐరావతమనే ఇంద్రుని ఏనుగు దంతాలతో తొండంతోను కుంభస్థలంతోకూడ గరుత్మంతుని కొట్టి ఘీంకారం చేసింది. గరుత్మంతుడు రెక్కలతో ఇంద్రుని ఏనుగును కొట్టాడు. క్షణకాలం రెంటికీ లోకానికి ఆశ్చర్యకరంగాను, చూపరులకు భయంకరంగాను యుద్ధం సాగింది. గరుడుడు ఇంద్రుని ఏనుగును తలమీద కొట్టాడు. అంకుశాల వంటి గోళ్ళుగల కాలితో దెబ్బతిని ఏనుగు పడిపోయింది.

జంబూద్వీపంలోని పారియాత్రమనే పర్వతంమీద పడింది. పడిపోతున్న ఏను గును ఇంద్రుడు విడిచిపెట్టలేదు. ప్రేమతో, దయతోడను దాన్ని అనుసరించాడు. కృష్ణుడతని వెనుకనే వెళ్ళాడు. పారిజాతం గరుడిపైనే ఉంది. ఇంద్రుడు పారియాత్ర మనే పర్వతమందు నిలిచి ఐరావతగజమును ఊరడించాడు. మళ్ళీ యుద్ధం ప్రారంభమైంది. ఇంద్రకేశవులకు గొప్పయుద్ధం జరిగింది. ఇంద్రుడు గరుత్మంతుని పై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. పక్షిరాజు ఆ దెబ్బలను సహించాడు. ఇతడు చావడని గ్రహించి ఇంద్రుడు విడిచిపెట్టాడు. ఇంద్రునిపై గౌరవంతో వజ్రాయుధం తనపై పడినప్పుడల్లా ఒక్కొక్క ఈక వదిలివేశాడు గరుత్మంతుడు.

చివరలో గరు త్మంతుని యొక్క శ్రీకృష్ణునియొక్క బరువుతో ఆ పర్వతం క్రమంగా భూమిలోకి పోయింది. కొంచం మిగిలిఉంది. అప్పుడా పర్వతాన్ని విడిచి ఆకాశంలో గరుడుని మీద కృష్ణుడున్నాడు. అప్పుడు కృష్ణుడు ప్రద్యుమ్నునితో నీవు త్వరగా ద్వారకకు వెళ్ళి రథంతో సహాదారుకుని త్వరగా ఇక్కడకు తీసుకురా. బలరామునికి, ఉగ్రసేన మహారాజుకు కూడా రేపు నేను ఇంద్రుని జయించి

ద్వారకకు వస్తాను అని చెప్ప మన్నాడు. ప్రద్యుమ్నుడు తండ్రి ఆజ్ఞప్రకారం సెలవు తీసుకొని త్వరగా ద్వారకకు వెళ్ళాడు. బలరాముడికీ, ఉగ్రసేనునికి అక్కడ పరిస్థితి చెప్పి గంటలో మళ్ళీ తిరిగి వచ్చాడు. దారుకుడు తోలుతున్న రథంమీదనే ప్రద్యుమ్నుడు తండ్రివద్దకు వచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకమందలి విష్ణుపర్వంలో
పారిజాతాపహరణమున ఇంద్ర కృష్ణుల యుద్ధమనే డెబ్బై అయిదవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఆరవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు శివుని స్తుతించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అప్పుడు శ్రీకృష్ణుడు రథం పై కూర్చొని ఆ పారియాత్ర పర్వతం మీదికి వెళ్ళాడు. అక్కడ దేవేంద్రుడు ఐరావతం మీద కూర్చుని ఉన్నాడు. శ్రీకృష్ణుడు ఎప్పుడు రథం మీద కూర్చొని యుద్ధానికి బయల్దేరాడో అప్పుడు తన వీపు మీద పారిజాతవృక్షాన్ని తీసుకుపోతూ గరుత్మంతుడు అతని వెనుక వడిచాడు. ప్రద్యుమ్నుడు సాత్యకి గరుత్మంతుని మీద కూర్చన్నారు. పారిజాతవృక్షాన్ని రక్షిస్తున్నారు. అప్పుడు సూర్యుడు అస్తమించాడు రాత్రి అయింది. దేవేంద్రునికీ కృష్ణునికీ మళ్ళీ యుద్ధం ప్రారంభమయింది. ఐరావతం బాగా దెబ్బతినడం చేత కృష్ణుడు దేవరాజుతో మీ యేనుగు గరుడుని దెబ్బలకుడస్సిపోయింది. రాత్రి కూడా అయింది. కాబట్టి యుద్ధం ఆపు చేయండి. రేపు ఉదయం మళ్ళీ యిష్ట ప్రకారం యుద్ధం చేయవచ్చు అన్నాడు.

అలాగే కానిమ్మని దేవరాజు పుష్కరతీర్థ సమీపానికి వెళ్ళాడు. అక్కడ రాళ్ళతో నివాసస్థానం ఏర్పరచుకొని అందులో ఉన్నాడు. అక్కడ బ్రహ్మ, కశ్యపుడు, అదితి, దేవతలు, మునులు, ఆదిత్య, రుద్ర, వసుగణములు వచ్చియున్నారు. ఇటు నారాయణుడు, ప్రద్యుమ్నుడు, సాత్యకి వీళ్ళతో కలిసి పారియాత్ర పర్వతం మీద ఆనందంగా ఉన్నారు. శ్రీకృష్ణుడు పారియాత్ర పర్వతం చేసిన ఉపకారానికి వరమిచ్చి శంకరుడికి నమస్కారం చేసి, ఉత్తమనదియైన గంగను ధ్యానం చేశాడు. ధ్యానం చెయ్యగానే గంగ శ్రీకృష్ణుని ఎదుట నిలిచింది. ఆయన గంగకు పూజ

చేసి స్నానం కూడ చేశాడు. తరువాత కృష్ణుడు గంగాజలాన్ని, మారేడుఆకును తీసుకొని శంకరుని ఆవాహనం చేశాడు. అప్పుడు సోమమూర్తి శివుడు ప్రత్యక్ష మయ్యాడు. ఆ మారేడుదళం మీద, గంగా జలంమీద ప్రకాశించాడు. తరువాత కృష్ణుడు పారిజాత పుష్పాలతో పూజించాడు. తరువాత మహాదేవుని స్తోత్రం చేశాడు.

శ్లో॥ రుద్రో దేవత్వం రుదనాద్రావణాచ్చ రోరూయమాణో ద్రావణాచ్చాతి దేవః
భక్తం భక్తానాం వత్సలం వత్సలానాం కీర్త్యాయుంక్ష్యేశాద్య ప్రభవామ్యస్తరేణ॥
గ్రావర్యారణ్యానాం త్వం పతిస్త్వం పశూనాం ఖ్యాతో దేవః పశుపతిః సర్వకర్మా
నామ్యస్త్వతః పరమో దేవదేవ జగత్పతి స్సురవీరారి హన్తా॥
యస్మాదీశో మహతా మీశ్వరాణాం భవ్యాద్యః ప్రీతిదః ప్రాణదశ్చ
తస్మాద్ధిత్వామీశ్వరంప్రాహురాశంసన్తో విద్వాంసః సర్వశాస్త్రార్థతజ్ఞాః॥
భూతం యస్మాజ్జగ దత్యన్తధీర! త్వత్తోవ్యక్తాత్ అక్షరాదక్షరేశ
తస్మాత్త్వా మాహుర్భవ ఇత్యేవ భూతం సర్వేశ్వరాణాం మహతామవ్యుదారమ్॥
యస్మాజ్జితై రభిషిక్తోసి సర్వై ర్దేవాసురైః సర్వభూతైశ్చ దేవ!
మహేశ్వరం విశ్వకర్మాణ మాహుస్త్వాంవై సర్వే తేన దేవాతిదేవమ్॥
పూజ్యోదేవః పూజ్యసేనిత్యదావై శశ్వచ్ఛ్రేయఃకాంక్షిభిః వరదామోఘవీర్యః
తస్మాద్విఖ్యాతో భగవాన్ దేవదేవః సతామిష్ట స్సర్వభూతాత్మభావీ॥
భూమిత్రయాణాం దేవ! యస్మాప్రత్సవిష్టో పునర్లోకానాం భావనామేయకీర్తిః
త్ర్యంబకేతి ప్రథమం తేన నామతవాప్రమేయ
త్రిదశేశనాథ! శర్వశ్శత్రూణాం శాసనా దప్రమేయః॥
తథాభూయ శ్శాసనాచ్చేశ్వరేణ సర్వవ్యాపిత్వా
చ్ఛంకరత్వాచ్చ సద్భిః శబస్యేశానః శ్రీకరార్యాగ్ర్యతేజాః॥
సంసక్తానాం నిత్యదాయత్కరోషి శమం భ్రాతృవ్యాన్ యద్యనైషీ స్సమస్తాన్
తస్మాద్దేవః శంకరోస్య ప్రమేయః సద్భిర్ధర్మజ్ఞైః కథ్యసే సర్వనాథః॥
దత్తఃప్రహారః కులిశేన పూర్వం తవేశాన! సురరాజ్ఞాతివీర్య
కంఠేనైల్యం తేనతే యత్ప్రవృత్తం తస్మాత్ఖ్యాతః త్వం నీలకంఠేతికల్పః॥
యల్లింగాంకం యచ్చలోకే భగాంకం సర్వం సోమత్వం స్థావరం జంగమంచ

ప్రాహుర్విప్రా స్త్వాం గుణినం తత్త్వవిజ్ఞాస్తథా ధ్యేయా మంబికాం లోకధాత్రీమ్॥
వేదైర్గీతా సాహిత్త్వం ప్రసూతా యజ్ఞోదీక్షాణాం యోగినాం చాతిరూపః
నాత్యద్భుతం త్వత్సమం దేవభూతం భూతం భవ్యం భవ దేవాథ నాస్తి॥
అహంబ్రహ్మ కపిలో యోప్యనన్తః పుత్రాస్సర్వే బ్రహ్మణశ్చాతివీరాః
త్వత్త స్సర్వే దేవదేవ ప్రసూతా ఏవంస్సర్వేశఃకారణాత్మా త్వమీడ్యః॥

కృష్ణుడు చేసిన శివస్తుతి సమాప్తము.

ఈశ్వరుడు ఇలా స్తోత్రం చేయబడుతూ కుడిచేతిని చాచి నారాయణునితో దేవోత్తమా! నీకోరిక తీరుతుంది. పారిజాతాని తీసుకువెళ్తావు. మనస్సులో బాధ పడకు. నీవు మైనాకపర్వతం మీద తపస్సు చేసినప్పుడు నీకు వరం ఇచ్చాను. దాని తలచుకొని ధైర్యంతో ఉండు. నీవు చంపబడనివాడవు, జయింపరానివాడవు. నాకంటే కూడా బలవంతుడవు అవుతావు. నేను నీకు చెప్పిన యీ మాటవ్యర్థం కాదు. నీవిప్పుడు చేసిన స్తోత్రాన్ని చదివే మనుష్యుడు తప్పక ధర్మాత్ముడౌతాడు. అతడు ప్రపంచంలో గౌరవింపబడతాడు. యుద్ధంలో విజయం సాధిస్తాడు. నేటి నుండి నేను 'బిల్వోదకేశ్వరుడు'గా నీకు ప్రసిద్ధి యేర్పడుతుంది. నన్ను పెట్టినచోట ఉండి జనులందరి కోర్కెలను తీర్చుతూ ఉంటాను.

ఇక్కడ మూడు రాత్రులు ఉపవాసం చేసి భక్తితో ఆరాధించినవాళ్ళు తాము కోరిన లోకాలను తేలికగా పొంద గలుగుతారు. ఈ గంగ కూడ ఇక్కడ అవింధ్య అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది. మంత్రం పఠించి గంగను స్మరిస్తే గంగాస్నాన పుణ్యం కలుగుతుంది. ఓ జనార్దనా! ఇక్కడ భూమి లోపల షట్పురమనే రాక్షసుల పట్టణముంది. మహాబలవంతులైన రాక్షసులు, దేవతలకు బాధ కలిగిస్తూ ఈ పర్వతం చరియలలో దాగి ఉంటారు. బ్రహ్మవరం చేత ఎవరూ వాళ్ళను చంపలేక పోతున్నారు. మనుష్యరూపంలో ఉన్న నీవే వీళ్ళని చంపాలి అని ఈశ్వరుడు వెళ్ళిన తరువాత తెల్లవారిన పిమ్మట గోవిందుడు పర్వతంతో ఓపర్వతశ్రేష్ఠమా! నీక్రింద గొప్ప రాక్షసులు దేవతలచే చంపబడనివారై బ్రహ్మవర ప్రభావంచేత అందరినీ బాధిస్తున్నారు.

అందుచేత లోకక్షేమం కొరకు నాచేత అడ్డగింపబడి పైకి రాలేరు. ద్వారం మూసివేస్తే లోపలనే నశించిపోతారు. ఓ పర్వతమ! నేను నీయందు ఉంటాను. రాక్షసుల వినాశం కోసం మనం చిరకాలం కలిసిఉంటాము. ఈపర్వతం మీదికి

ఎక్కి నన్ను దర్శించినవాడు వెయ్యి ఆవులను దానం చేసిన పుణ్యం పొందుతాడు. ఇక్కడి రాతితో నా బొమ్మను తయారుచేసి పూజించినవాడికి నాలోకం ప్రాప్తిస్తుంది. వరదాతయైన కృష్ణుడీవిధంగా పర్వతంపై దయచూపి అక్కడ నిత్యనివాసం చేస్తున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పారిజాతపహరణమున శ్రీకృష్ణుడు శివునిస్తుతించుట అను డెబ్బై ఆరవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఏడవ అధ్యాయము

## పారిజాతమును ద్వారకకు తెచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత కృష్ణుడు బిల్వోదకేశ్వరుడైన శివునకు నమస్కారం చేశాడు. గొప్ప ‾న రథంపై యుద్ధానికి వెళ్ళాడు. ఇక్కడ పుష్కరతీర్థందగ్గర ఉన్న ఇంద్రుని యుద్ధానికి పిలిచాడు శ్రీకృష్ణుడు. దేవేంద్రుడు అతని కుమారుడు జయంతుడు రథాలమీద యుద్ధానికి సిద్ధపడ్డారు. ఇంద్రునకు ఉపేంద్రుడికి పారి జాతం కొరకు యుద్ధం సాగింది. అప్పుడు శ్రీకృష్ణుడు ఇంద్రుని సైన్యాలను బాణసమూహములతో చంపాడు. సమర్థులైనా ఒకరినొకరు కొట్టుకొనుటకు ఇంద్ర కేశవులు ప్రయత్నించలేదు. కొంతసేపైన తరువాత జనార్దనుడు తనబాణాలతో ఇంద్రుని ఒక్కొక్కగుర్రాన్ని పదేసిబాణాలతో కలత చెందించాడు. దేవేంద్రుడు శైబ్యము మొదలైన కృష్ణుని గుర్రాలను బాణాలతో కప్పివేశాడు. కృష్ణుడు వేలాది బాణాలను ఏనుగుమీద వర్షించాడు. ఇంద్రుడు గరుత్మంతునిపై బాణప్రయోగం చేశాడు. దేవరాజు నారాయణుడు దారుణమైన యుద్ధంచేశారు.

నీటిలో నావవలె భూమి కంపించింది. దిక్కులు తగలబడుతున్నట్లు కనిపిం చాయి. కొండలు కదిలాయి. వందలకొలది చెట్లు నేలకు ఒరిగాయి. గాలులు విపరీతంగా వీచాయి. తోకచుక్కలు పడ్డాయి. పిడుగులు పడ్డాయి. ఇటువంటి అనేకములైన అపశకునములను చూచి మునులు లోకానికి మేలు జరగాలని మంత్రాలను జపం చేశారు. తరువాత బ్రహ్మ కశ్యపుని నీవు భార్యతో వెళ్ళి పుత్రులిద్దరి యుద్ధాన్ని ఆపుచేయమని చెప్పాడు. అతడలాగే అని రథంమీద

యుద్ధస్థలానికి వెళ్ళాడు. వచ్చి నిలుచున్న కశ్యపుని, అదితినీ చూచి మహాబల శాలురైన ఆ యిద్దరూ రథాల నుండి నేలమీదికి దిగారు. ఆయుధాలను విడిచిపెట్టి ఇద్దరూ నమస్కరించారు. అదితి ఇద్దరినీ చేతులతో పట్టుకొని అన్నదమ్ములు కానట్లు ఒకరినొకరు చంపుకొనుటకు కోరుతున్నారేమి? చిన్నవిషయమునుగూర్చి అతిదారుణమైన యీ యుద్ధం తగిందికాదు. తల్లిదండ్రుల మాట వినదగినదైతే ఆయుధాలను విడిచిపెట్టి నా మాటప్రకారం చెయ్యండి అన్నది.

అప్పుడు వాళ్ళిద్దరూ అలాగే అని గంగలో స్నానానికి మాట్లాడుకుంటూ వెళ్ళారు. ఇంద్రుడు పద్మదళములవంటి నేత్రాలు కలవాడా! నువ్వు ప్రభువు. లోకాలను సృష్టించినవాడవు. స్వర్గరాజ్యమందు నన్ను స్థాపించావు. అలాంటివాడవు నన్నవమానిస్తావేమి? నీవు అన్నవై ఉండి నన్నెందుకు చంపచూస్తున్నావు? అన్నాడు. గంగానదిలో స్నానంచేసి యిద్దరూ తిరిగివచ్చారు. తల్లిదండ్రులను ఇంద్రో పేంద్రులు కలుసుకున్న స్థలానికి ప్రియసంగమనమని పేరువచ్చింది. శ్రీకృష్ణుడు ఇంద్రుడికి అభయమిచ్చాడు.

అప్పుడు దేవతలందరితో వాళ్ళు స్వర్గానికి వెళ్ళేందుకు ప్రారంభించారు. దేవతలు తగిన విమానాలలో స్వర్గంవైపు వెళ్ళారు. అదితికశ్యపులు ఇంద్రో పేంద్రులు ఒకేవిమానంలో కూర్చొని స్వర్గానికి వెళ్ళారు. అక్కడ ఇంద్రుని భవనంలో ప్రవేశించి నలుగురూ ఒకేచోట కూర్చున్నారు. ఇంద్రుని భార్య శచీదేవి తొందర పాటుతో పరమోపకారం చేసిన అదితికశ్యపులకు పూజచేసింది. ఆ రాత్రి తెల్లవారిన తరువాత ధర్మతత్త్వమును తెలుసుకున్న అదితి సర్వప్రాణులకు మేలుచేసే మాటను పలికింది.

ఉపేంద్రా! ద్వారకకు పారిజాతాన్ని తీసుకువెళ్ళు. కోడలి హృదయంలో ఉన్న పుణ్యకవ్రతం పూర్తిచేయించు. ఆ వ్రతమైన పిమ్మట ఈవృక్షాన్ని తెచ్చి నందన వనంలో తగినస్థానమందు స్థాపించుము. ఇలాగే కానిమ్మని శ్రీకృష్ణుడు దేవ మాతకు చెప్పి తల్లికి తండ్రికీ నమస్కరించి ఇంద్రునకు శచీదేవికి కూడ నమస్కారం చేసి ద్వారకానగరానికి వెళ్ళాడు. దేవతలచేత పుణ్యాత్ములచేత పూజింపబడుతూ శ్రీకృష్ణుడు పుత్రుని, సాత్యకిని వెంటబెట్టుకొని రైవతకపర్వతం చేరాడు.

అక్కడ పారిజాతాన్ని ఇంద్రునిదగ్గరనుండి తెచ్చాను అని ఈవిషయం అందరికీ చెప్పమన్నాడు. ఈనాడు పారిజాతాన్ని ద్వారకానగరంలో ప్రవేశపెడ తాను. నగరాన్ని బాగా అలంకరించండి అని చెప్పాడు. సాత్యకి వెళ్ళి అలాగేచెప్పి

తిరిగివచ్చాడు. శ్రీకృష్ణుని కుమారులు, పౌరులు అందరూ వచ్చారు. శ్రీకృష్ణుడు రథంపై కూర్చున్నాడు. గరుడునిమీద పారిజాతాన్ని ఉంచి ప్రద్యుమ్నుడు ముందుగా పట్టణంలో ప్రవేశించాడు. తరువాత సాత్యకి, సాంబుడు శ్రేష్ఠమైన రథంమీద వెళ్ళారు. ఇతర వృష్ణివంశ పెద్దలు అనేకవిధాలైన వాహనాలమీద వెళ్ళారు. మహాత్ములైన కృష్ణుని ఘనకార్యాన్ని మెచ్చుకొంటూ సంతోషించారు. సాత్యకి ద్వారా జరిగిన విషయాన్ని విస్తరంగా విని గొప్ప ఆశ్చర్యమును పొందారు. దివ్య పుష్పాలుగల ఆ వృక్షాన్ని చూచి ఆనర్తదేశీయులు అత్యధికంగా సంతోషించారు. ఆ వృక్షాన్ని చూచి వృద్ధులు యువకులయ్యారు. గ్రుడ్డివాళ్ళు దివ్యదృష్టి కలవాళ్ళయ్యారు. రోగులు ఆరోగ్యవంతులయ్యారు.

ఆ వృక్షంమీద కూర్చున్న తెల్లకోకిలలు మధురంగా కూస్తుంటే విన్న లోకుల ఆశ్చర్యానికి హద్దులేదు. వాళ్ళు మాటిమాటికీ శ్రీకృష్ణుడికి నమస్కారం చేశారు. ఆ వృక్షానికి సమీపంలో ఉన్నవాళ్ళు అనేకవిధాలైన వాద్యధ్వనులను మధురమైన గానాన్ని విన్నారు. ఎవడెవడు ఏయేసువాసనను కోరుకుంటే ఆ సువాసన వెంటనే అది ప్రాప్తించేది. శ్రీకృష్ణుడు అందమైన ద్వారకలో ప్రవేశించి వసుదేవుని దేవకినీ చూచాడు. ఉగ్రసేనుని బలరాముని యాదవులలో పెద్దలను కలుసుకొని వాళ్ళందరినీ వీడ్కొని తన భవనానికి వెళ్ళాడు.

ఇంట్లోకి వెళ్తూనే కృష్ణుడు పారిజాతవృక్షంతోపాటు మొట్టమొదట సత్యభామ ఇంట్లోకి వెళ్ళాడు. సత్యభామ పరమానందంతో కృష్ణునికి ధన్యవాదం చెప్పింది. పారిజాతవృక్షాన్ని స్వీకరించింది. అప్పుడొక ఆశ్చర్యకరమైన సంఘటన ఒకటి జరిగింది. ఆ పారిజాతవృక్షం కోరికనుబట్టి చిన్నదౌతుంది. కావాలంటే పెద్ద దౌతుంది. ఇది గొప్ప ఆశ్చర్యం. ఒకప్పుడు ద్వారకానగరాన్నంతనీ కప్పివేస్తుంది. మరొకప్పుడు చేతితో పట్టుకొనేవిధంగా చిన్నదౌతుంది. సత్యభామ తనకోరిక తీరినదని సంతోషించింది. పుణ్యకవ్రతానికి కావలసినవి సేకరించ మొదలు పెట్టింది. జంబూద్వీపంలో ఆ వ్రతానికి కావలసిన సామగ్రిని ఎక్కడ ఉన్నా తెచ్చి యిచ్చాడు. తరువాత నారదమహర్షిని స్మరించాడు. ఆ చెట్టును దానం పుచ్చుకోవటానికి శ్రీకృష్ణుడు చెప్పినట్లు ఉత్తమవ్యక్తి కావాలి గనుక నారదుని స్మరించుట జరిగింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో పారిజాతమును ద్వారకకు తెచ్చుట అను డెబ్బై ఏడవ అధ్యాయము

★★★

# డెబ్బై ఎనిమిదవ అధ్యాయము

## పారిజాతమును స్థాపించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! భగవంతుడు తలుచుకోగానే నారదుడు ప్రత్యక్షమయ్యాడు. రాగానే ఆయనకు తగినట్లు పూజచేసి దానం తీసుకొనుటకు ప్రార్థించారు. సమయంలో సత్యభామతోపాటు శ్రీకృష్ణుడు నిర్మలహృదయంతో స్నానం చేసి వచ్చిన నారదునికి సువాసనగల పువ్వులదండను అలంకరించి గంధం పూశాడు. తరువాత అనేకవిధాలైన వంటలను అర్పించారు.

తరువాత మహారాణి సత్యభామ శ్రీకృష్ణునికి ఒక పుష్పమాల ధరింపచేసింది. పారిజాతవృక్షానికి కృష్ణుని కట్టింది. కేశవుని అనుమతితో నీళ్ళు వదులుతూ నారదుడికి అర్పించింది. వెయ్యిఆవులను బంగారం, వెండి, మాణిక్యాలు, నువ్వులు, అన్నము, మొదలైన వస్తుసమూహాన్ని దేవర్షి నారదుడికి ఇచ్చింది. దాన మిచ్చిన వస్తువులనన్నిటినీ నారదుడు స్వీకరించాడు.

పరమసంతోషంతో కట్టువిప్పి కృష్ణునితో కేశవ! మహారాణి సత్యభామ నిన్ను నాకు దానం చేయగానే నీవు నావాడవయ్యావు. ఇప్పుడు నేనేదిచెపితే అదినీవు చెయ్యాలి. ఇప్పటినుంచి నీవు నావెంట తిరిగేవాడవు అయ్యావు. అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఓ తపోధనా! నీవు చెప్పిన పనిచేస్తా. అని నారదునివెంట నడవ మొదలు పెట్టాడు. అప్పుడు నారదుడు వేళాకోళానికి ఆగు అంటే ఆగాడు. కొంచం తరువాత 'నడు' అంటే నడిచాడు. ఇలా పరిహాసంచేసి తన కంఠమందున్న పుష్పమాలను తీసి కపిలగోవును దూడతోసహా నిన్ను విడిపించుకోటానికి ఇవ్వాలి. జింకచర్మం నువ్వులతో బంగారాన్ని ఇవ్వాలి. ఇది శివుడు విధించిన విడిపించు పద్ధతి. అలాగే అని కృష్ణుడు అట్లే చేశాడు.

మధుసూదనుడు నవ్వి నీకు కావలసిన వరం కోరుకోమన్నాడు. నాకు చాలా సంతోషం కలిగింది కనుక వరమిస్తున్నాను అన్నాడు. నారదుడు నీవెప్పుడూ నా యెడల ప్రసన్నుడవై ఉండాలి. ఇది ఒక్కటే కావలసింది, నీ అనుగ్రహం వల్ల నీ లోకంలో ఉండే అదృష్టాన్ని పొందుతాను. వచ్చే జన్మలో బ్రాహ్మణుడనౌతాను అని కోరాడు. భగవంతుడట్లే కాగలదని పలికాడు. నారదుడు సంతోషించాడు.

సత్యభామాదేవి భగవంతుని పదహారువేల రాణులనూ తనయింటికి ఆహ్వానించింది. శచీదేవి పంపిన వస్త్రభూషణాదులను ఆ రాణులకు సత్యభామ ఇచ్చింది. పారిజాతవృక్షం ద్వారకానగరంలో ఉండి తన మహిమను ప్రదర్శించింది. శ్రీకృష్ణుడు నారదుడు ఎవర్ని పిలిచారో వాళ్ళు అక్కడకు వచ్చి పారిజాతం మహిమల చూచి ఆశ్చర్యపోయారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు పంచపాండవులను, కుంతీద్రౌపదులను, సుభద్ర, శ్రుతశ్రవ పుత్రులతో సహా భీష్ముని ఇంకా ఇతర బంధువులను ఆహ్వానించగా వాళ్ళందరూ ద్వారకకు వచ్చారు. వాసుదేవుడు అర్జునునితో కలిసి ఆనందించాడు. వచ్చినవాళ్ళందరూ పారిజాతమహిమలను చూచి ఆశ్చర్యపోయారు.

ఒక సంవత్సరం తర్వాత శ్రీకృష్ణుడు పారిజాతాన్ని తీసుకొని మళ్ళీ స్వర్గానికి వెళ్ళాడు. అక్కడ ఇంద్రునితో కలిసి అతనితో సహా తల్లిని తండ్రినీ చూడటానికి వాళ్ళ యింటికి వెళ్ళాడు. తల్లికి కృష్ణుడు పాదాభివందనం చేశాడు. అప్పుడు అదితి వత్సా! మీ అన్నదమ్ములిద్దరూ ప్రేమతో కలిసి ఉండండి అన్నది. నీ కోరిక పూర్తి అయింది. నా కోరిక తీర్చు అన్నది. కృష్ణుడు 'తథాస్తు' అన్నాడు. అదితి కశ్యపులను వీడ్కొని శ్రీకృష్ణుడు ఓ దేవ! శివుడు-పారియాత్ర పర్వతం క్రింద చాలామంది రాక్షసులున్నారు. వాళ్ళను సంహరించేభారం నీది అని నామీద పెట్టాడు. పదిరోజుల లోపల వాళ్ళను నశింపచెయ్యాలనుకుంటున్నాను. అందుకు జయంతుని, ప్రవరుణ్ణి పంపాలి. మానవరూపంలో ఉన్న దేవతలే వాళ్ళను చంపాలి. కనుక మేము మానవ రూపంతో వాళ్ళను వధిస్తాం. ఇంద్రుడతనిని సమర్థిస్తూ కౌగలించుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పారిజాతమును స్థాపించుట అను డెబ్భై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై తొమ్మిదవ అధ్యాయము

## పుణ్యకవిధి విమర్శ

జనమేజయుడు పుణ్యకవ్రతము యొక్క పుట్టుకకు సంబంధించిన చరిత్రను వినిపించుమని యడగగా వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! పూర్వం పార్వతిద్వారా ఈవ్రతం ఎలా పుట్టిందీ చెపుతున్నాను విను.

శ్రీకృష్ణుడు పారిజాతవృక్షాన్ని ద్వారకకు తీసుకువెళ్ళినప్పుడు నారదుడుకూడా అక్కడకు వచ్చాడు. తరువాత శివుని ఆజ్ఞప్రకారం దేవతలకూ, రాక్షసులకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో షట్పుర సంహారం జరిగింది. తరువాత ఒక రోజున నారదమహర్షి శ్రీకృష్ణునితో కూడా ఉన్నాడు. జాంబవతి, సత్యభామ మొదలైన కృష్ణుని భార్యలు అక్కడ ఉన్నారు. అప్పుడు రుక్మిణి దేవర్షి నారదుణ్ణి ఓ మునివరా! పుణ్యకవ్రతం యొక్క పుట్టుక ఎట్లేర్పడింది? దాని నియమాలేమిటి? ఏ సమయంలో దానిని ప్రారంభించాలి? ఏయే దానం చేయాలి? ఆ వ్రతంవల్ల ఫలిత మేమిటి? ఈ విషయాలు తెలుసుకోవాలని మిక్కిలి కోరిక ఉంది. ఈ విషయం విస్తారంగా చెప్పండి అని అడిగింది. నారదుడు ఇలా చెప్పాడు.

పార్వతి ఈ వ్రతం చేసి తన చెలికత్తెలను ఆహ్వానించింది. వాళ్ళలో అదితి మొదలైన దక్షుని కుమార్తెలందరూ, శచీదేవి, రోహిణి, ఫాల్గుని, పూర్వ, రేవతి, శతభిః మఘ మొదలగువాళ్ళున్నారు. ఈ దేవతలు పూర్వం ఉమాదేవిని గొప్పగా పూజించారు. వీళ్ళుకాక గంగ, సరస్వతి, వేణి, గోదావరి, వైతరణి, గండకి మొదలైన నదులు, లోపాముద్ర మొదలగు పతివ్రతలు, గిరిరాజపుత్రికలు, అగ్నికన్యలు, అగ్నిపత్ని స్వాహ, సావిత్రి, కుబేరుని భార్య ఋద్ధి, వరుణుని భార్య, యముని భార్య, వసు భార్య, శ్రీహ్రీ, ధృతి, కీర్తి, ఆశ, మేధ, త్రీతి, మతి, ఖ్యాతి మొదలైన పతివ్రతలు, వీళ్ళందరినీ పిలిచి వాళ్ళందరికీ పూజచేసింది.

తరువాత ఆమె వాళ్ళకు, అందరికీ నువ్వులపర్వతాన్ని, రత్నపర్వతాన్ని, అగ్ని పర్వతాన్ని, అనేకవిధాలైన వస్త్రాలను దానం చేసింది. పార్వతి యిచ్చిన వస్తువులను స్వీకరించి ఒకచోట కూర్చొని వాళ్ళు కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ కబుర్లలో ఈ వ్రతప్రసక్తి వచ్చింది. వాళ్ళలో అరుంధతి పార్వతిని పుణ్యకవ్రతం గూర్చి విస్తృతంగా చెప్పమని కోరింది. అప్పుడు పార్వతి పుణ్యకవిధానాన్ని చెప్పటం ప్రారంభించింది. ఆ సమయంలో నేనుకూడ అక్కడ ఉన్నాను. అంతకుముందే పార్వతీదేవి ఆ వ్రతసామగ్రిని అంతనీ నాకు బ్రాహ్మణునికీ దానం చేసింది. తరువాత వ్రతవిధానం అడగబడింది. అప్పుడు పూజ్యురాలైన పార్వతి వాళ్ళకు పూర్వం నేను చూచువట్లు వ్రతవిధానాన్ని చెపుతున్నాను వినండి అన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పుణ్యకవిధి విమర్శ అను డెబ్బై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఎనభైయవ అధ్యాయము

## పుణ్యక వ్రత విధానము

ఉమ (పార్వతి) ఇలా చెప్పింది.

నేను నా భర్తయొక్క దయచేత వ్రతంయొక్క విధానాన్ని తెలుసుకున్నాను. అతని ఆజ్ఞప్రకారం ఈవ్రతం చేశాను. పతివ్రతా ధర్మంనుండి తొలగనివాళ్ళే ఈ వ్రతం చేయటానికి అధికారం కలవాళ్ళు. పతివ్రతలు కానివాళ్ళు దానము, ఉపవాసము మొదలైనవి చేస్తే ప్రయోజనమేమి ఉండదు. పతివ్రతయైన స్త్రీ తన భర్త యెటువంటివాడైనా అతన్ని తరింపచేస్తుంది. భర్తయొక్క అభిప్రాయాన్ని అనుసరించే ఏ స్త్రీ అయినా వ్రతం చెయ్యాలి. స్త్రీ ఏదైనా వ్రతం లేదా ఉపవాసం భర్త అనుమతితోనే చేయాలి. ఓ తపోధనురాలైన అరుంధతీ! స్త్రీలకు భర్త ఒక్కడే దేవత. భర్తను సంతోషపెడితే అన్ని ధర్మాలనీ ఆచరించినట్లవుతుంది. పతివ్రతలైన స్త్రీలు చేసిన వ్రతానికే వాస్తవమైన ఫలం ప్రాప్తిస్తుంది. నేను తపఃప్రభావంచేత చూచిన పుణ్యక వ్రతవిధానాన్ని చెపుతున్నాను వినండి.

ప్రొద్దునేలేచి వ్రతంకాని ఉపవాసంకాని చేయదలిస్తే మొట్టమొదట తన భర్త అనుమతి పొందాలి. తర్వాత అత్తమామలకు నమస్కారం చేసి దర్భలు అక్షతలు నీటిపాత్ర చేతితో పట్టుకొని చేతితో నీళ్ళు తీసుకొని భర్త శిరస్సుమీద తన శిరస్సుమీద చల్లుకోవాలి. మంచంమీద పడుకోకూడదు. చేతితో కాళ్ళు కడుక్కోవాలి, ఆరోజున కోపం,దెబ్బలాట, ఏడ్వడం చేయకూడదు. ఆరోజున స్వచ్ఛంగా తెల్లగా ఉన్న వస్త్రాలను ధరించాలి. వ్రతదినంనాడు కాటుక, గంధం, పువ్వులు ధరించరాదు. పళ్ళు తోముకునేపుల్ల, తలారస్నానం, నలుగుబెట్టుకొనటం పనికిరాదు. శుచిగా ఉండటానికి మట్టి ఉపయోగించాలి. పాదాలకుగాని, శరీరానికి గానిచమురు రాయకూడదు. ఎద్లబండిమీద, ఒంటెలమీద, గాడిదలమీద ప్రయాణం తగదు. దిగంబరంగా స్నానం చేయటం, వ్రతమందు, ఉపవాసదిన మందుకూడదు. స్నానానికి నదీజలంగాని, కొండలనుండి పడునట్టి నీటినిగాని లేకపోతే మంచి చెరువులో, విశాలమైన దిగుడుబావియందు స్నానం చేయదగినది. శక్తి లేకపోతే బిందెనీళ్ళతో స్నానం చేయవచ్చు. శిరస్స్నానం తపస్సుయొక్క ఫలాన్ని ఇస్తుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పుణ్యక వ్రత విధానము అను ఎనభైయవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఒకటవ అధ్యాయము

## పుణ్యకవ్రత నియమము

ఉమ ఇలా చెప్పింది.

పతివ్రతలైన స్త్రీలు వెనుక చెప్పినవిధంగా అన్నిపనులూ చేస్తూ ఒకసంవత్సరం లేక ఆరుమాసాలు, లేదా ఒకనెల వ్రతం పట్టవచ్చు. తరువాత పదకొండుమంది స్త్రీలను పిలవాలి. ఇచ్చేదానం నీళ్ళతోను ఆచార్యునకి ఈయవలెను. తిరిగి ఆచార్యుని నుండి కొనుక్కోవాలి. ఆయన ఆమెభర్తను ఆమెకు ఇస్తాడు. ఒకనెల గడిచాక శుక్లపక్ష నవమినాడు శాస్త్రప్రకారం వ్రతాన్ని పూర్తిచేయాలి. వ్రతం సిద్ధించ టానికి మొదటిరోజున చివరిరోజున ఉపవాసం తప్పక చెయ్యాలి. ఆరోజున భర్త క్షౌరం చేయించుకోవాలి. వివాహంలోవలె స్నానంచెయ్యాలి. అలంకారములు, పూలమాల ధరించాలి. బిందెలతో స్నానం చేయించబడుతూ పతివ్రత భర్త పాదా లకు మనస్సుతోకాని, వాక్కుతోకాని నమస్కరించి,

"ఆపోదేవ్య ఋషీణాం హి విశ్వధాత్ర్యో దివ్యామదన్యో యాశ్శంకరా ధర్మధాత్ర్యః। హిరణ్య వర్ణాః పావకా శివతమేనరసేన శ్రేయసో మాంజుషన్తు। అపామేష స్మృతో మన్త్రః సర్వత్రాన్యత్ర మేశృణు। మంత్రాః పురాణవిహితాః స్త్రీణాం సర్వాంగశోభనే। శుభావ్యయా గణినీ యుక్తధర్మా భర్త్రాసాకం మమ దాస్యా వరేణ। మా కర్మణా మనసావాపి వాచా భర్తుర్భవేయం రుషతిస్యాం వశంగా। సపత్నీనామధి నిత్యం భవేయం సపుత్రాస్యాం సుభగా చారురూపా। సంపన్నహస్తా గుణవాదినీ చ సర్వాత్మనాస్యామ దరిద్రా భవేయమ్। పతిశ్చ మే స్యాత్ సుముఖో మత్ప్రతీక్షో నిత్యం మద్భక్తః స్యాన్మన్మతి ర్మద్గతిశ్చ। ప్రీతిశ్చ నౌ సాత్ చక్రవాకానురూపా మనోవిరాగో న భవేత్సాధు వత్స్యాత్। లోకాన్ సాధ్వీనాముత్తమానాం వ్రజేయం। యాభిస్సర్వం ధార్యతే విశ్వరూపమ్। ఉభేకులే యాశ్శుభాః పావయన్తి పితుర్భర్తుశ్చ పతిభక్త్యోర్జితాశ్చ। భూమిర్వాయుర్జల మాకాశమగ్నిరన్తః క్షేత్రజ్ఞః ప్రకృతిర్యో మహాంశ్చ। అహంకారశ్చ మమసాక్ష్యే నియుక్తాః స్మరేయుర్మే నిశ్చయంచ వ్రతంచ। మైరారబ్ధో దేహినాం భౌతికోయం। విధిసత్వాద్యైః భూతయుక్తైః స్వబీజైః। సం త్వేతేమే సాక్షిణః సర్వసంస్థా। వ్రతేచాస్మిన్ నిశ్చయేచాపి నిత్యమ్। చంద్రాదిత్యౌ పుణ్యసాక్షీయమశ్చ। దిశస్సర్వా దశ చాత్మాచ మేయమ్। సంత్వే తేమే సాక్షిణః సర్వస్థా వ్రతేచాస్మిన్ నిశ్చయే చాపి నిత్యమ్।"

ఈ పురాణమంత్రాలతో అన్నివస్తువులను అభిమంత్రించటం. ఇలా స్నానం చేసి భర్తకు మంచివస్త్రాలను ఇవ్వాలి. శుచియైన తెల్లని వస్త్రం ఇవ్వాలి. తరువాత పరిశుద్ధుడు, ఇంద్రియనిగ్రహము కలవాడు, జ్ఞానవిజ్ఞానపండితుడు అయిన బ్రాహ్మణుడికి, తనభర్తకు యథాశక్తిగా భోజనం పెట్టాలి. బ్రాహ్మణుడికి కూడ రెండువస్త్రాలు ఇవ్వాలి. శయ్య, వాహనం, ఇల్లు, సేవకులను శక్తికొలది అలంకారం, రత్నరాశిని ఇవ్వాలి. అన్నంతో నువ్వులు కలిపి ఇవ్వాలి. అనేకవర్ణాలు గల వస్త్రాల నివ్వాలి. సమర్థత ఉంటే ఏనుగును గుర్రాన్ని మొదలైనవాటిని కూడ ఇవ్వవలెను. శక్తిలేకపోతే గోదానం చేయుట తప్పనిసరి.

ఉప్పు, మీగడ, బెల్లం, తేనె, బంగారం, అన్నివిధాలైన సుగంధద్రవ్యాలు, అనేక విధాలైన పండ్లు వీటితో శంకరుని శిలామూర్తికి పూజచేసి పంచామృతస్నానం చేయించాలి. దేశకాలాదులనుబట్టి గుర్రాలను దానం చేయాలి. నువ్వులుమాత్రం భర్త అనుమతితో ఇవ్వాలి. కపిలగోవు, కంచుపాత్ర, లేడిచర్మం, నువ్వులు, వస్త్రం, అద్దం వీటిని ఇచ్చి సమస్తములైన కోరికలను పొందవచ్చును. సంతానవతి, సౌభాగ్యవతి, సౌందర్యవతి, సంపన్నురాలు మంచిస్వభావం కలవాళ్ళు అవుతారు. ఓ అరుంధతీ! నేనే మొట్టమొదట ఈ వ్రతంచేశాను. కాబట్టి ఉమావ్రతమని కూడ దీనికి పేరువచ్చింది. ఇదియే స్త్రీలకు ఉత్తమమైన వ్రతము. అందువల్ల ఆచరించాలి. ఈ చెప్పిన దానాలవల్ల అన్ని కోరికలు తీరుతాయి.

శివుని పూర్వం నా సంతోషంకోసం అభిషేకం చేశాను. నాకోరికలు తీరాయి. వ్రతం పూర్తి అయిన తర్వాత ఇతరస్త్రీలకు భోజనం పెట్టి దేశకాలాదులనుబట్టి, కోరికను బట్టి సామగ్రిని దానం చేయాలి. ఒక్కొక్క బ్రాహ్మణుడికి ఒక్కొక్కవస్త్రము ఇచ్చి పాయసం, పూరీలతో భోజనంపెట్టి దక్షిణ ఇవ్వాలి. ఇది పురాణాలలో చెప్ప బడింది. వ్రతం నడుస్తున్న రోజులలో ప్రాణిహింస ఎప్పుడూ చేయకూడదు. ఓ అరుంధతీ! మహాదేవుని దయచే నేను రెండవవ్రతం కూడా చేశాను. దాన్ని చెప్తున్నాను విను.

సంతానంకోరే స్త్రీలు వెనక చెప్పినట్లు ఆవుకొమ్ములు కడిగిన నీళ్ళతో స్నానం చేసి నీటితోనిండిన పాత్రను దానం చెయ్యాలి. జ్యేష్ఠ, ఆషాఢమాసాలు ఈ వ్రతం చెయ్యటానికి శ్రేష్ఠమైనవిగా తలచబడుచున్నాయి. తరువాత రెండు నెలలు లేదా ఒకనెల దాటాక పంచదారనీళ్ళు, నెయ్యి, పెరుగు, పాలు, తేనె నీటితోనిండిన

చిందె ఇంద్రియాలను జయించిన జ్ఞానవృద్ధుడైన బ్రాహ్మణుని చేతిలో సమర్పించాలి. ఇలాచేసే ప్రతిస్త్రీకి పుత్రసంతానం కలుగుతుంది. కన్యక కావాలను కుంటే కన్యక పుడుతుంది. ఈ వ్రతంలో గోదానం, సువర్ణదానం ఉత్తమ మైనవిగా తలచబడుచున్నాయి. సమర్ధత లేకపోతే వస్త్రదానం తప్పక చెయ్యాలి. బ్రాహ్మణుడికి యజ్ఞోపవీతం యివ్వాలి. రోజుకు ఒకమారే భోజనం చెయ్యాలి. ముందు బ్రాహ్మణుడికి ఇచ్చి తరువాత భర్తకియ్యాలి.

ఇలా సంవత్సరంచేస్తే సౌందర్యవతి, గుణవతి, పుణ్యస్త్రీగా, ధనానికి అధికారిణిగా స్త్రీ ప్రకాశిస్తుంది. వ్రతంచేసిన సంవత్సరంలో వంకాయ తినగూడదు. కుందేలుమాంసాన్ని, లేడిమాంసాన్ని తినకూడదు. ఆనపకాయ తినరాదు. ఒక సంవత్సరం పాటు రాత్రి భోజనం చేయకూడదు. దరిద్రుడు, యోగ్యుడు అయిన బ్రాహ్మణుడికి పండ్లు, పువ్వులు, పిండివంటలు ఇవ్వాలి. శక్తికొలది బంగారాన్ని ఇవ్వాలి. ఇలా వ్రతనియమా లను పాటించిన స్త్రీ అన్నికోరికలను తీర్చుకున్నదగును. రూపవతి, సౌభాగ్యవతియు అగును.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
పుణ్యకవ్రత నియమము అను ఎనభై ఒకటవ అధ్యాయము

☆☆☆

# ఎనభై రెండవ అధ్యాయము

## ఉమా వ్రత విధానము

పార్వతి ఇలా చెప్పింది.

ఓ అరుంధతీ! వ్రతంచేత సౌందర్యాన్ని పెంచుకోదలచినస్త్రీలు ఈ విధి విధానాన్ని అనుసరించాలి. ఒక సంవత్సరం కృష్ణపక్షం అష్టమినాడు పరిశుద్ధురాలై తెల్లనివస్త్రం ధరించి దేవతాపూజ చేస్తూ పండ్లనే ఆహారంగా తీసుకొని ఒక బ్రాహ్మణునికి భోజనం పెట్టి, దక్షిణ ఇస్తే ఆమెకు తలవెంట్రుకలు వంపులతో పడుము వరకు వ్రేలాడతాయి. అందువల్ల భర్తకు మిక్కిలి ప్రియురాలౌతుంది. తల నిర్మాణం మార్పును కోరే స్త్రీ కృష్ణపక్షం చతుర్దశినాడు ఆవుపేడ, ఉసిరిగ, మారేడుతో శిరస్నానం చెయ్యాలి. ఆమెకు శిరోరోగం రాదు. అందమైన ముదురును కోరే స్త్రీ ప్రతి పాడ్యమినాడు ఒక్కపూటే భోజనం చెయ్యాలి. ఒక సంవత్సరంపాటు. కనుబొమలు అందంగా ఉండాలంటే సంవత్సరంపాటు ప్రతి పాడ్యమినాడు ఉప

వాసం చేసి విదియనాడు శాకాహారం తీసుకోవాలి. చెవులు అందంగా ఉండాలంటే శ్రవణ నక్షత్రం రోజున మాత్రమే భోజనం చెయ్యాలి.

అందమైన కళ్ళు కావాలంటే పాలు లేక నేయి భోజనం ఒక సంవత్సరం చెయ్యాలి. పెదవులు అందంగా ఉండాలంటే సంవత్సరపాటు అడగకుండా దొరికిన అన్నం తినాలి. అందమైన దంతాలకు సంవత్సర శుక్లపక్ష అష్టమినాడు ఉపవాసం చెయ్యాలి. అందమైన ముఖకాంతికి సంవత్సరం పూర్ణిమనాడు స్నానం చేశాక క్షీరాన్నం బ్రాహ్మణుడికి దానమివ్వాలి. తాటికాయల వలె అందమైన స్తనాలకోసం దశమినాడు మౌనంగా ఉండి అడగకుండా వచ్చిన అన్నం తినాలి. పొట్టతగ్గాలని కోరే స్త్రీ రోజుకు ఒకేసారి భోజనం చేస్తూ పంచమి తిథియందు ఉపవాసం చెయ్యాలి. మధురంగా మాట్లాడదలచుకుంటే ఒక సంవత్సరం ఉప్పుమానాలి. అందమైన పాదాలకోసం ప్రతిపత్తి యందు నీళ్ళు పోసుకుని అన్నం తినాలి. అగ్నిని గాని, బ్రాహ్మణునిగాని పాదంతో తాకరాదు. ఈ నియమాలను పాటించి వెండి తాబేళ్ళను బ్రాహ్మణుడికి దానం ఇవ్వాలి. శరీరమంతా అందంగా ఉండాలంటే నేతిని ఉప్పును బ్రాహ్మణులకు ఇవ్వాలి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఉమా వ్రతవిధానమనే ఎనభై రెండవ అధ్యాయము

☆☆☆

# ఎనభై మూడవ అధ్యాయము

## ఉమావ్రత విధాన సమాప్తి

ఉమ ఇలా చెప్పింది.

ఓ పూజ్యురాలైన అరుంధతీ! తన పరివారాన్ని గుణవంతులనుగా చేయగోరే స్త్రీ సంవత్సరం పొడుగునా సప్తమతిథియందు మాత్రమే ఒక్కమారే భోజనం చెయ్యాలి. సంవత్సరం పూర్తి అయ్యాక బ్రాహ్మణునికి బంగారుచెట్టా దక్షిణా ఇవ్వాలి. కరంజవృక్షం క్రింద దీపదానంచేస్తే బ్రాహ్మణుడికి బంగారుదీపం దానం చెయ్యాలి, ఆమె అందరినీ సంతోషపెడుతుంది. ఇంట్లో అందరూ భోజనం చేసిన తర్వాత తాను భోజనంచేస్తూ ఎవనికికష్టం కలుగజేయకుండా భర్తనే దేవతగా తలుస్తూ మధురంగా మాట్లాడుతూ, అత్తమామల సేవలో ఆసక్తి కలదై ధర్మమందు

ఆసక్తిగల స్త్రీ ఏ విధమైన వ్రతంగాని, ఉపవాసంగాని చేయనక్కరలేదు. దైవికంగా భర్త పోయిన స్త్రీకి పురాణాల్లో చెప్పిన వ్రతాలు చెపుతున్నాను విను.

విధవ అయిన స్త్రీ భర్తయొక్క పటాన్ని ఎల్లప్పుడూ పూజచేస్తూ ఉండాలి. వ్రత, ఉపవాస, భోజనములు మొదలైన అన్నిపనులు భర్తరూపంయొక్క అనుమతితో చెయ్యాలి. ఇలా చెయ్యటంచేత భర్తయొక్క లోకాన్ని పొందుతుంది. ఓ అరుంధతీదేవి! ఇవేళ మొదలుకొని దేవతాస్త్రీలు పుణ్యకవిధానమును గుర్తిస్తారు. నారదునికిగూడ తెలుస్తుంది.

అదితి, ఇంద్రాణి, మీరందరూ ప్రచారం చేస్తారు. మీరే వ్రతవిధానాన్ని బాగా ఉపదేశించేవాళ్ళు అవుతారు. ఇంతకంటే ఎక్కువగా భగవంతుని అవతారం విషయం శ్రీకృష్ణుని భార్యలకు విశేషంగా తెలుస్తుంది. పతిభక్తి మొదలైన సద్గుణాలు గల స్త్రీ శ్రేష్ఠురాలుగా లెక్కించబడుతుంది.

నారదుడు చెపుతున్నాడు.

ఆ పతివ్రతలు ఈ విధంగా పార్వతినుండివిని సంతోషించినవారై పార్వతికి నమస్కరించి వెళ్ళిపోయారు. తరువాత అదితి ఆ వ్రతం చేసింది. కశ్యపుని పారి జాతానికి కట్టి నాకు దానం చేసింది. సావిత్రి ఆ వ్రతాన్నే చేసింది. సత్యభామ ఆ వ్రతానికి 'అది తివ్రతకం' అనే పేరు పెట్టింది. ఆ వ్రతం చేస్తే భర్తవంశము, తండ్రి వంశము, తాను కూడా తరిస్తారు. ఆ వ్రతాన్నే ఇంద్రాణి చేసింది. వెనుక వ్రతవిధానాన్ని విన్న పతివ్రతలందరూ వ్రతం చేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఉమావ్రతకథన సమాప్తి అను ఎనభై మూడవ అధ్యాయము

☆☆☆

# ఎనభై నాల్గవ అధ్యాయము

## షట్పురవధ వృత్తాంతము

జనమేజయుడు తపోధనుడైన వైశంపాయన మహర్షీ! పారిజాతకథా ప్రసంగంలో 'షట్పురాన్ని'గూర్చి పలికారు. షట్పురవాసులైన జయింపశక్యం కాని రాక్షసులను అంధకాసురుని సంహరించిన వృత్తాంతాన్ని చెప్పండి అని అడిగాడు.

అప్పుడు వైశంపాయనుడిలా చెప్పాడు

రాజా! భగవంతుడైన రుద్రుడు త్రిపురాసంహారానికి యుద్ధంచేసినప్పుడు చాలామంది రాక్షసులు యుద్ధభూమిలోకి వచ్చారు. శంకరుడు త్రిపురాసురుని తప్ప ఏ రాక్షసునీ తన బాణాగ్నిచేత దగ్ధం చేయలేదు. అక్కడకు చేరిన రాక్షసుల సంఖ్య ఆరులక్షలమంది వాళ్ళు. వాళ్ళందరూ తమ బంధువైన త్రిపురాసురుని మరణంవల్ల మిక్కిలి దుఃఖపడుతూ బ్రహ్మదేవుని స్తోత్రం చేస్తూ వాయుభక్షకులై సూర్యునివైపు ముఖంపెట్టి వెయ్యిసంవత్సరాలవరకు కఠోరమైన తపస్సు చేశారు. వాళ్ళు వేదమంత్రాలను ఉచ్చరిస్తూ బ్రహ్మను పూజించారు. బ్రహ్మ వరమివ్వ టానికి అక్కడకు వెళ్ళాడు. మీ తపస్సుకు సంతోషించాను వరం కోరుకోండి అన్నాడు.

ఓ పూజ్యుడా! రుద్రుడు మాకు పెద్ద అపకారం చేశాడు. ఆ వైరానికి బదులు చెప్పి బంధువుల ఋణం తీర్చుకొనటంకంటే వేరే కోరికలేదు.అన్నారు రాక్షసులు. బ్రహ్మ ఓ రాక్షసులారా! శివుడు సృష్టికర్త లయకర్తకూడా. అతన్ని హింసించటానికి ఎవడు పూనుకుంటాడు? మీ శ్రమవ్యర్థం అన్నాడు. శివునికి విరోధులైన, స్వర్గ సుఖాన్ని అనుభవించే రాక్షసులు బ్రహ్మ మాటలను అంగీకరించలేదు. శివుని పరాక్రమంతో పరిచయం కలవాళ్ళు అంగీకరించారు. అంగీకరించనివారితో బ్రహ్మ శివునికి కోపం తెప్పించటంకంటే వేరే వరం కోరుకోండి అన్నాడు.

ఆ దుర్మార్గులు ఓ మహాత్మా మాకీ వరమే కావాలని పట్టుబట్టారు. దేవతల వల్ల మాకు మరణం లేకుండునట్లు, మాకు భూమి క్రింద అరు పట్టణాలు నిర్మింప బడాలి. శంకరునివలన మాకు భయం లేకుండా ఉండాలి. అని అడిగారు. బ్రహ్మ ఓ అసురులారా! మీరు మంచి మార్గంలో నడిస్తే సజ్జనులు గౌరవించే బ్రాహ్మణు లను బాధించకుండా ఉంటే మహాదేవుడు వల్ల, ఇతర దేవతల వల్ల మీరు చంప బడరు. ఇలాకాక బ్రాహ్మణులకు చెడు తలపెడితే మీకు మరణం తప్పదు. బ్రాహ్మణులు ప్రపంచానికి ఆధారమైనవాళ్ళు. వాళ్ళను బాధిస్తే విష్ణువల్ల ఎల్లప్పుడూ భయం ఏర్పడుతుంది. ఎందుకనగా నారాయణుడు లోకానికంతకూ శుభం చేకూర్చేవాడు. అని ఈ విధంగా అసురులకు వరమిచ్చి వాళ్ళను వీడ్కోని బ్రహ్మ వెళ్ళిపోయాడు.

వాళ్ళలో శంకరునిపై అధికభక్తి కలవాళ్ళకు తెల్లనిఎద్దుపై శివుడు ప్రత్యక్ష మయ్యాడు. సజ్జనులను రక్షించే శివుడు ఓ అసురసమూహమా! మీరు

అహంకారము, ద్వేషము విడిచిపెట్టి నన్నాశ్రయిస్తే వరమిస్తాను. మీకు మంచి మార్గంలో నడిచేందుకు ప్రేరణయిచ్చిన బ్రాహ్మణులతోపాటు స్వర్గంలో మీరు నివసించండి. నేను మీ మంచినడవడికి మిక్కిలి సంతోషించాను. ఈ వెలగచెట్టు క్రిందకూర్చొని తపస్సుచేసిన వాళ్ళకు నాసాలోక్యముక్తి ప్రాప్తిస్తుంది. వానప్రస్థ ధర్మాన్ని అనుసరించి అమావాస్య, పూర్ణిమలలో ఇక్కడుండి నన్ను పూజించినచో వెయ్యిసంవత్సరాలు తపస్సు చేసిన ఫలం ప్రాప్తిస్తుంది.

ఇక్కడ నియమప్రకారం మూడురాత్రులు నా పూజచేసిన ప్రాణి కోరినదాన్ని పొందుతాడు. అర్కద్వీపంలో ఉంటూ వెనుకచెప్పినట్లు నన్ను పూజించినవాళ్ళు ఇక్కడికంటే రెండురెట్లు ఫలితాన్ని పొందుతారు. ఇతరప్రదేశాలలో పూజించేవాళ్ళు కొంచం లాభాన్నికూడా పొందరు. ఇదేమి అందరికీ వరదానము. 'శ్వేతవాహన' నామంతో పూజించినవాడు ఎటువంటి భయాన్ని పొందడు. చివరకు శివలోకం చేరతాడు. మేడి, రావి, మర్రి, వెలగచెట్లను, మునులను, బ్రాహ్మణులను విశేషంగా పూజించేవాళ్ళు కోరిన సద్గతిని పొందుతారు. ఇలా చెప్పి శ్వేతవాహన శంకర భగవానుడు ఆ అసురులతో పాటు రుద్రలోకానికి వెళ్ళిపోయాడు. జంబూమార్గానికి వెళ్తాను, జంబూమార్గమందు నివసిస్తాను. అని కోరుకున్నవాడుకూడా రుద్రలోకంలో పూజింపబడతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
షట్పురవధ వృత్తాంతము అను ఎనభై నాల్గవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఐదవ అధ్యాయము

## షట్పురమునకు శ్రీకృష్ణుని ప్రయాణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఆ సమయంలోనే నాలుగువేదాలు, ఆరువేదాంగాలు చదివిన మహర్షియైన యాజ్ఞవల్క్యుని శిష్యుడు బ్రహ్మదత్తుడనే బ్రాహ్మణుడు షట్పురంలో మునులతో కూడిన 'ఆవర్త' అనే నదిఒడ్డున సంవత్సరకాలంపట్టే అశ్వమేధయాగం చేస్తున్నాడు. వసుదేవుడు దేవకితోపాటు బ్రహ్మదత్తునివద్దకు వెళ్ళాడు. బ్రహ్మదత్తుని యజ్ఞంలో ఎంతపుష్కలంగా అన్నదానం చేయబడుతోందో అట్లే దక్షిణకూడ ఈయబడు

తోంది. చాలామంది మహాత్ములు, మునులు, అక్కడ ఉన్నారు. అక్కడ నేను, వేదవ్యాసుడు, యాజ్ఞవల్క్యుడు, సుమన్తుడు, జైమిని, ఛాగలి, దేవలుడు మొదలైన అనేకమునులు అక్కడకు చేరారు. ధర్మమందు ఆసక్తిగల దేవకి వసుదేవుని సంపద ననుసరించి అక్కడకు వచ్చినవాళ్ళకు కోరికలను తీరుస్తున్నది. అన్ని పనులలోనూ శ్రీకృష్ణుని మహిమయే ప్రధానంగా కనిపిస్తోంది. యజ్ఞకార్యము బహు సుందరంగా నడుస్తున్నది.

అదేసమయంలో షట్పురంలో ఉండే నికుంభుడు మొదలైన రాక్షసులు అక్కడకు చేరి అహంకారంతో మీరు మాకు యజ్ఞభాగాల్ని తప్పనిసరిగా ఇవ్వండి. మేముకూడ సోమరసం త్రాగుతాం. బ్రహ్మదత్తుడికి చాలామంది కన్యలున్నారని విన్నాం. వాళ్ళను మాకు ఇవ్వాలి. అలాకాకపోతే ఈ యజ్ఞాన్ని మీరు పూర్తి చేసు కోలేరు అని పలికారు. వాళ్ళమాటలు విని బ్రహ్మదత్తుడు ఓ అసురశ్రేష్ఠులారా! వేదాలలో మీకు యజ్ఞభాగం ఏర్పరచిలేదు. అలాంటప్పుడు మీకు యాజ్ఞభాగం ఎలా ఇవ్వగలుగుతాం? కావలెనంటే ఇక్కడ వేదార్థం తెలిసినవాళ్ళు చాలామంది ఉన్నారు. వాళ్ళని అడిగి తెలుసుకోండి.

ఇక కన్యాదాన విషయంలో వాళ్ళను అంతర్వేదియందు తగినవీరులకు ఇవ్వాలని ముందే నిశ్చయించియున్నాము రత్నాలు శాంతపద్ధతితో ఇస్తాను. బలాత్కరిస్తే మాత్రం ఇవ్వము. దేవకీపుత్రుడైన శ్రీకృష్ణుని ఆశ్రయించిన వాళ్ళము. షట్పురవాసులైన నికుంభుడు మొదలైనవాళ్ళు యజ్ఞాన్ని పాడుచేసి కన్యకలను అపహరించారు. ఈ పరిస్థితిలో వసుదేవుడు కృష్ణబలరాములను, గదుని స్మరించాడు. వెంటనే కృష్ణునికి అక్కడి పరిస్థితి తెలిసింది. అతడు ప్రద్యుమ్నునితో వత్సా! నీవు త్వరగా షట్పురానికి వెళ్ళి నీ మాయాబలంతో బ్రహ్మదత్తుని పిల్లలను రక్షించుము అని చెప్పాడు.

ప్రద్యుమ్నుడు తండ్రీ! నేను యాదవసైన్యాన్ని తీసుకువెళ్తున్నాను అని అతడప్పుడే వెళ్ళాడు. నిమిషంలో అక్కడకువెళ్ళి మాయకన్యలను అక్కడపెట్టి బ్రహ్మదత్తుని కన్యలను తెచ్చాడు. ఆ మాయకన్యలను తీసుకొని రాక్షసులు షట్పురంలో ప్రవేశించారు. సంతోషంతో ఉన్నారు. మిగిలిన యజ్ఞం సక్రమంగా పూర్తియింది. ఈ సమయంలో బ్రహ్మదత్తునిచే ఆహ్వానింపబడిన రాజులు జరాసంధుడు, దంతవక్త్రుడు, శిశుపాలుడు, పాండవులు, కౌరవులు, మాలవదేశ

రాజులు, రుక్మి, ఆహ్వృతి, నీలుడు, ధర్ముడు, విన్దానువిన్దులు, శల్యశకునులు, మహాత్ములైన ఇతరరాజులు షట్పురానికి కొద్దిదూరంలో మకాం ఉన్నారు. నారదుడిది చూచి నికుంభుడి యింటికి వెళ్ళాడు.

అక్కడ గౌరవింపబడి నికుంభునితో యాదవులతో విరోధం పెట్టుకొని సుఖంగా కూర్చున్నారేమి? బ్రహ్మదత్తుడు, కృష్ణుడూ మిక్కిలిమిత్రులు. వాళ్ళిద్దరి శరీరాలకూ ప్రాణం ఒకటే. భగవంతుడైన కృష్ణుని దయచేత బ్రహ్మదత్తుడికి ఐదువందలమంది స్త్రీలు ప్రాప్తించారు. ఈ ఐదువందలమందిలో రెండువందల మంది బ్రాహ్మణులు, వందమంది క్షత్రియులు, వందమంది వైశ్యులు, వందమంది శూద్రులు. ఆ స్త్రీలందరూ ధర్మాత్ముడైన దుర్వాసునికి సేవచేశారు. అతడు ప్రసన్నుడై వాళ్ళకు వరమిచ్చాడు. ఒక్కొక్క కుమారుడు, ఒక్కొక్కకన్య మీకు జన్మిస్తారు. ఆకన్యలు సమస్తపుష్పాల సువాసన కలిగిఉంటారు. ఎప్పుడూ యౌవనంలో ఉంటారు. అందరూ పతివ్రతలు. వాళ్ళు నృత్యగీతాలలో నేర్పు కలవాళ్ళు. పుత్రులు కూడా రూపవంతులు, శాస్త్రములు తెలిసినవాళ్ళు.

ఓ రాక్షసశ్రేష్ఠా! బ్రహ్మదత్తుడు ఆ కన్యలను యాదవులకు ఇచ్చాడు. వాళ్ళలో ఒకవందమందిని మాత్రమే నీవు తెచ్చావు. తక్కిన కన్యలగురించి నీవు యాదవులతో యుద్ధం చెయ్యాలి. అందుచేత ఇక్కడకు వచ్చిన రాజులను సహాయం అడుగు. బ్రహ్మదత్తుని కన్యలకొరకు రత్నాలు మొదలైనవి యిచ్చైనా వాళ్ళ సహాయం పొందగలవు అనిచెప్పాడు. అసురులు సంతోషంతో అలాగే చేశారు. ఆ రాజులు కన్యలను, అనేకవిధాలైన రత్నాలను పొంది వాటిని పంచుకున్నారు. నారదుడు వారించగా పాండవులు పంచుకున్నవారిలో చేరలేదు. రాజులందరూ సంతోషించి నీకు మేమే ఉపకారం చెయ్యాలో చెప్పమన్నారు.

అప్పుడు నికుంభుడు సంతోషించి ఓ రాజులారా! త్వరలోనే మాకు శత్రువులతో యుద్ధం ప్రారంభమౌతుంది. ఆ యుద్ధంలో మీరు అన్నివిధాలా నాకు సహాయం చెయ్యండి. పాండవులుతప్ప తక్కిన రాజులు నికుంభుని సమర్థించారు. బ్రహ్మదత్తుని భార్యలు యజ్ఞశాల యందున్నారు. ఆ రాజులు యుద్ధానికి సిద్ధపడ్డారు.ఇటు శ్రీకృష్ణుడు రాజ్యభారాన్ని ఆహుకునిపై ఉంచి సేనతో తాను షట్పురానికి వెళ్ళాడు. తనసేనతో నగరంలో ప్రవేశించాడు. పురజనుల క్షేమంకొరకు

వసుదేవుని సలహాతో యజ్ఞశాల సమీపంలో నివాసం కల్పించుకున్నాడు. శిబిరానికి నలువైపులా రక్షణకొరకు ప్రద్యుమ్నుని ఆజ్ఞాపించాడు. శిబిరం నలువైపులా ప్రద్యుమ్నుడు తిరుగుతూ కాపలా ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
షట్పురమునకు శ్రీకృష్ణుని ప్రయాణము అను ఎనభై ఐదవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఆరవ అధ్యాయము

## షట్పుర యుద్ధంలో రాజులను బంధించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! సూర్యోదయంకాగానే బలరాముడు కృష్ణుడు సాత్యకి మొదలైన వీరులు వేళ్లతొడుగులు మొదలైనవి కట్టుకొని యుద్ధవాంఛతో గరుడునిమీద ఎక్కి వెళ్ళారు. తరువాత రుద్రుని వరంవల్ల గంగరూపాన్ని పొందిన అనర్తనదిలో స్నానం చేసి బిల్వోదకేశ్వరుడైన శంకరుని దర్శనం చేసుకొన్నారు. ప్రద్యుమ్నుడు సేనకు ముందుభాగమున, పాండవులు యజ్ఞశాల రక్షణకు నియమింపబడ్డారు. తక్కిన వాళ్ళను సైనికులను గుహాద్వారమందు ఉంచి శ్రీకృష్ణుడు ఇంద్రపుత్రుడైన జయంతుని, ప్రవరుడనే బ్రాహ్మణుని తలుచుకున్నాడు. వెంటనే వాళ్ళిద్దరూ కృష్ణుని యెదుట నిలిచారు. ప్రద్యుమ్నునివలె వాళ్ళిద్దరూ ఆకాశమందే ఉండుటకు ఆజ్ఞాపింపబడ్డారు.

తరువాత కృష్ణుడు ఆజ్ఞాపించగా దుందుభి, మద్దెల మొదలైన వాద్యాలు మ్రోగసాగాయి. సాంబుడు, గదుడు మకర(మొసలి)వ్యూహాన్ని నిర్మించారు. సారణుడు, ఉద్ధవుడు, భోజుడు, వైతరణుడు, అనావృష్టి పృథు, విపృథు, కృతవర్మ, సుదంష్ట్రుడు, శత్రునాశనుడు, విచక్షువు అనేవాళ్ళు వ్యూహం మధ్య నిలిచి ఉన్నారు. సనత్కుమారుడు, చారుదేష్ణుడు, అనిరుద్ధుని సహాయం పొందుతూ వ్యూహం యొక్క చివరిభాగాన్ని రక్షిస్తున్నారు. రథములు, గుర్రాలు, ఏనుగులు, మనుషులతో యాదవసేన అంతా మకరవ్యూహ మధ్యభాగమున ఉంచబడింది. అటు యుద్ధ మదంతో కూడిన రాక్షసులుకూడా షట్పురంనుండి బయటకు బయలుదేరారు.

వాళ్ళలో కొందరు మేఘంవలె గర్జించేవాళ్ళు గాడిదలమీద, కొందరు ఏనుగులమీద, కొందరు గుర్రాలమీద, కొందరు దున్నపోతులమీద, కొందరు

రథాలమీద ఇంకా వేర్వేరు వాహనాలపై నగరం బయటకు బయల్దేరారు. వాళ్ళందరి చేతుల్లో ఆయుధాలు, అందరి తలలపై కిరీటాలు, భుజములమీద భుజకీర్తులు మొదలైన భూషణాలను ధరించి ఉన్నారు. ఒకవైపు వాద్యధ్వని మరొక వైపు రథచక్రాలధ్వని మేఘగర్జన వంటి శంఖధ్వని వినిపిస్తున్నది. తరువాత దేవసేనకు ఇంద్రుడు ముందున్నట్లు, నికుంభుడు రాక్షససేనకు ముందు నడిచాడు. ఆ రాక్షసులు అనేకవిధాల ధ్వనులు చేస్తూ ఆకాశాన్ని మారుమ్రోగేట్లు చేశారు.

చేదిరాజు మొదలగువారు అసురుల సహాయంకొరకు తమసేనతో ముందుకు నడిచారు. దుర్యోధనుని నూర్గురు సోదరులు విశాలరథాలపై ముందుకు సాగారు. రుక్మి, ఆహ్వృతి యుద్ధానికి నిశ్చ యించుకొని నిలిచారు. దేవతలతో అసురులవలె నికుంభుడు మొదలగువారు యాదవులతో యుద్ధం చేయ గోరు తున్నారు. అప్పుడు నికుంభుడు పర్వాలవంటి బాణాలతో యాదవసైన్యాన్ని మర్దించాడు. అనాధృష్టుడనే యాదవసేనాపతి అది సహించలేదు. ఘోరములైన బాణాలతో తాను కూడ శత్రుసైన్యాన్ని మర్దించాడు. అతని రథం, గుర్రాలు కనబడలేదు. ధ్వజంగాని, నికుంభుడు గాని కనిపించలేదు. అందరూ బాణాలతో కప్పబడ్డారు. నికుంభుడు మాయతో అనాధృష్టిని స్తంభింపచేశాడు. షట్పురమనే గుహలోకి తీసుకుపోయాడు. మాయాబలంతో అతన్ని అక్కడ నిరోధించి వెళ్ళి పోయాడు. మళ్ళీ నికుంభుడు కృతవర్మను, చారుదేష్ణుని, భోజుని, వైతరుణునికూడ తీసుకుపోయాడు. తన మాయాబలంతో భోజవంశీయులను, ఇతరులనుకూడ తీసుకుపోయాడు. మాయతో అతడు కనపడుటలేదు. అదిచూచి కృష్ణుడు, బల రాముడు, సాత్యకి కోపించారు.

అప్పుడు శ్రీకృష్ణుడు తన ధనుస్సును ఎక్కుపెట్టి రాక్షసులను అగ్ని ఎండు గడ్డిని వలె కాల్చివేశాడు. అప్పుడు రాక్షసులు ఈశ్వరుడైన కృష్ణుని దగ్గరకు పరుగెత్తారు. అనేకవిధాలైన ఆయుధాలతో ఎదిరించారు. కాని నారాయణుడనే అగ్ని వాళ్ళను నవ్వుతూ తగులబెట్టింది. రాక్షసుల బాణవర్షాన్ని శరత్కాల వర్షాన్నివలె భగవంతుడు సహించాడు. రాక్షసులు మాత్రం కృష్ణుని బాణాలను ఓర్చుకోలేక పోతున్నారు. రాక్షసులు కృష్ణుని యెదుట నిలబడలేకపోయారు. అతనిచే చంపబడి స్వర్గంచేరారు.

అప్పుడు వాళ్ళు ప్రాణభయంతో ఆకాశంలో ఎగురుతున్నారు. అక్కడ కూడ వాళ్ళకు సుఖంలేదు. ఇంద్రపుత్రుడైన జయంతుడు, ప్రవరుడు ఆకాశంలో

ఉండటంచేత ఆకాశంలో కూడ భయమేర్పడింది. వాళ్ళు ఇద్దరూ అగ్నిజ్వాలలవంటి బాణాలతో రాక్షసులను నశింపచేస్తున్నారు. తాటిపళ్ళవలె తలకాయలు రాలి భూమి మీద పడుతున్నాయి. ఇటు ప్రద్యుమ్నుడు మాయతో గుహను నిర్మించి అందులో శత్రురాజు లను నిర్బంధించాడు.

గదసారణ సాంబులు మొదలైనవాళ్ళు ప్రద్యుమ్నుడు నిర్మించిన గుహలో సురక్షితంగా ఉన్నారు. దుర్యోనాది మహావీరులనందరినీ మీ సంబంధాన్ని గురుత్వాన్ని గౌరవిస్తూ ఘోరమైన యీగుహలో ఉంచుతున్నాను. బిల్వోదకేశ్వరుడు నన్నా జ్ఞాపించాడు. అతని ఆజ్ఞప్రకారం మిమ్మల్ని గుహలో పెడుతున్నా అన్నాడు. శాంబరీ మాయతో నికుంభుడు గుహలో ఉంచిన యాదవులను విడిపిస్తాను అనగానే శిశుపాలుడు ప్రద్యుమ్నుని, భీమసంతతివారినీ తనబాణాలతో బాధించాడు. ప్రద్యుమ్నుడు బిల్వోదకేశ్వరునకు నమస్కరించి శిశుపాలుని బంధించుటకు ప్రయత్నించాడు.

తరువాత ప్రవరుడు నందీశ్వరుడు వేలాది పాశాస్త్రములను చేతపట్టుకొని అక్కడకువచ్చి ప్రద్యుమ్నునితో ఓ యదునందనా! రాత్రి నేను చెప్పిన విధంగా అంతాచెయ్యి. కన్యకలపై, రత్నాలపై ఆశగలవారినీ, ఈరాజుల్ని పాశాలతో బంధించు రాక్షసులను పూర్తిగా నశింపచెయ్యి. ఇలాగే జనార్దనుడికి చెప్పు. తరువాత అతడు భగదత్త, శిశుపాల, రుక్మి మొదలగు రాజులను శివుడిచ్చిన పాశాలతో బంధించాడు. మాయగుహలోకి త్రోశాడు. తరువాత ప్రద్యుమ్నుడు తన కుమారుని వాళ్ళకు కాపలాఉంచాడు. ఒక్కడినీ మిగల్చకుండా అందరినీ బంధించాడు. వాళ్ళగుర్రాలను, ఏనుగులను, రథాలను తన స్వాధీనం చేసు కున్నాడు. తొందరపడకుండా రాక్షసులను చంపమొదలెట్టాడు. సైనికవేషంలోనే బ్రహ్మదత్తుని వద్దకువెళ్ళి ఓ బ్రాహ్మణా! అర్జునుడు మీ దగ్గరకు వచ్చాడంటే మీరేమీ ఆలోచించవలసిన పనిలేదు. పాండవులు రక్షించేదాన్నిగూర్చి భయ పడనక్కరలేదు. మీపని చేసుకోండి రాక్షసులు నీ కన్యలను తాకలేరు. యజ్ఞ ప్రదేశంలో ఆ కన్యలను చూడగానే నా మాయాబలంతో వాళ్ళను రక్షించాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
షట్పుర యుద్ధంలో రాజులను బంధించుట అను ఎనభై ఆరవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఏడవ అధ్యాయము

## షట్పుర వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! సేవకులతోసహా రాజులు బంధింపబడిన తరువాత ఆ రాక్షసుల కలవరానికి హద్దులేదు. ఇటు శ్రీకృష్ణ బలరాములు మొదలగు యాదవులద్వారా చంపబడుతూ రాక్షసులు నలుదిక్కులకూ పారిపోయారు. అప్పుడు రాక్షసరాజు నికుంభుడు మిక్కిలి కోపించి పారిపోయే రాజులతో ప్రతిజ్ఞను విడిచి మీరు అజ్ఞానంతో భయపడి ఎందుకు పరిగెత్తుతున్నారు? ఇలాఐతే ఏ లోకంలోనూ మీకు స్థానముండదు. శత్రువులను ఓడించినప్పుడే వీరులకు విజయం వల్ల ఫలితం ప్రాప్తిస్తుంది. యుద్ధంలో చస్తే స్వర్గం లభిస్తుంది. పారిపోయి యింటికి వెళ్తే మీకు సుఖం, భోగమూ ఏమి ఉంటుంది? మీ భార్యలు అడిగితే ఏం చెపుతారు? అన్నాడు. నికుంభుని మాటలువిని ఆ రాజులు తిరిగివచ్చి వెనుకటికంటే రెట్టింపు ఉత్సాహంతో యాదవులతో యుద్ధం మొదలుపెట్టారు.

రక్తం ప్రహించిన నదిగా ఏర్పడింది. అర్జున, నకుల, సహదేవ, ధర్మరాజుల చేతికి చిక్కినవాళ్ళు బ్రతికి తిరిగిరాలేదు. ఆకాశంలోకి పారిపోయినవాళ్ళు జయన్త నిచేత, ప్రవరునిచేత మరణించారు. రక్తం నదిగా ప్రవహించింది. నికుంభుడు శత్రుబలం వృద్ధి చెందటం తన బలం నశించటంచూచి ఆకాశానికి ఎగిరాడు. అక్కడ ప్రవరుడు పరిఘతో కొట్టాడు. అతడు నేలపై కూలాడు. అప్పుడు జయంతుడు ప్రవరుడి దగ్గరకువెళ్ళి అతన్ని కౌగలించుకున్నాడు. జయంతుడు అతనిపై ఖడ్గాన్ని విసిరాడు. నికుంభుని శరీరం కంపించింది. అప్పుడు అతడు వీళ్ళు మనల్ని నశింపచేయటానికే వచ్చారు, జయంతునితో వ్యర్థంగా యుద్ధంచేసి శరీరాన్ని కష్టపెట్టుకుంటే లాభమేమిటి? అని తలచి నికుంభుడు మాయ మయ్యాడు. యుద్ధంకోసం మళ్ళీ శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళాడు.

శ్రీకృష్ణ నికుంభుల యుద్ధం చూడటానికి ఇంద్రుడు అక్కడికి ఐరావతం మీద వచ్చాడు. తన కుమారుని యుద్ధ నైపుణ్యంచూచి అతడు సంతోషించాడు. ధన్యవాదాలు చెప్తుతూ ప్రవరుని, జయంతునీ కౌగలించుకున్నాడు. జయన్తుని విజయానికి దుందుభులు మ్రోగాయి. తరువాత నికుంభుడు కృష్ణుడి దగ్గరకు వెళ్ళి యజ్ఞభూమి వద్ద అర్జునునితోపాటు నిలుచున్న వాళ్ళను చూచాడు. వెంటనే

పక్షిరాజు గరుత్మంతుడు, బలరాముడు, సాత్యకి, శ్రీకృష్ణుడు, అర్జునుడు, భీమ, యుధిష్ఠిర, నకుల, సహదేవ, వసుదేవ, సాంబ, ప్రద్యుమ్నులమీద తన పరిఘను ప్రయోగించాడు. తరువాత ఎంతటి మహారథులూ చూడలేనంతగా మాయా బలంతో యుద్ధం చేశాడు. ఉపాయమేమిలేక కృష్ణుడు బిల్వోదకేశ్వరుని తలుచు కున్నాడు. వెంటనే అందరికీ దివ్యదృష్టి ప్రాప్తించింది.

ఆ మాయావి నికుంభుడు అందరికీ కనిపించాడు. అతడు మాటిమాటికీ కృష్ణుని పిలుస్తున్నాడు. అప్పుడు అర్జునుడు ధనుస్సును ఎక్కుపెట్టి నికుంభుని శరీరముపైన అతని పరిఘాస్త్రంమీద బాణవర్షం కురిపించాడు. ఆ బాణాలన్నీ అతని శరీరానికి తగిలి క్రిందపడిపోతున్నాయి. అర్జునుడు ఆశ్చర్యపడి నా బాణాలకి కొండలు బ్రద్దలౌతాయి, ఈవేళ ఇలా అయిందేమిటి అని కృష్ణుని ప్రశ్నించాడు. కొంచం నవ్వి శ్రీకృష్ణుడు నికుంభునితో లోకంలో ఎవనికీలేని శక్తి ఉంది. అది విస్తరంగా చెపుతున్నాను విను.

పూర్వం ఈ రాక్షసుడు ఉత్తరకురు దేశానికి వెళ్ళి లక్ష సంవత్సరాలు కఠోర తపస్సు చేశాడు. శివుడు ప్రసన్నుడై వరమడగమన్నాడు. అప్పుడీ రాక్షసుడు దేవ, దైత్య, దానవులచే చంపబడకుండా ఉండాలని కోరాడు. అప్పుడు శంకరుడు 'తథాస్తు' అని నీవెప్పుడైనా బ్రాహ్మణులకు లేక విష్ణుమూర్తికి చెడుచేస్తే నారాయణుని చేతిలో మరణిస్తావు. నిన్నెవడూ చంపలేడు. అప్పుడు ఈ అసురుడు వరాలవల్ల మదించిపోయాడు. ఇతనికి అనేక అనేక శరీరాలున్నాయి. ఒక శరీరాన్ని పూర్వం నేను నశింపచేశాను. ఈ భయంకర శరీరం షట్పురంలో నివసించేది అని అతని చరిత్ర చెప్పాడు.

కృష్ణార్జునులు ఇలా మాట్లాడుకొనుచుండగా ఆ రాక్షసుడు షట్పురగుహలోకి వెళ్ళాడు. ఆ గుహ తనకాంతితోనే ప్రకాశిస్తూ ఉంటుంది. అక్కడ వేడి, చల్లదనము ఇష్టాన్నిబట్టి నడుస్తూ ఉంటాయి. అక్కడ ప్రవేశించి భగవంతుడు నిర్బంధింపబడిన రాజులను చూచాడు. ఘోరస్వరూపంగల నికుంభునితో యుద్ధంచేశాడు. బల రాముడు మొదలైన యాదవులు, పాండవులందరూ కూడా ఆ గుహలో ప్రవేశించారు. నికుంభుడు గుహలో నిర్బంధించినవాళ్ళనందరినీ శ్రీకృష్ణుని అను మతితో ప్రద్యుమ్నుడు విడిపించాడు. వాళ్ళందరూ సంతోషంతో కృష్ణుని దగ్గరకు వచ్చారు. తరువాత శ్రీకృష్ణుడు శత్రురాజులను కూడా విడిచిపెట్టమని ప్రద్యు మ్నునికి చెప్పాడు. అప్పుడతడు అందరినీ విడిచిపెట్టాడు.

ఆ రాజులు సిగ్గుతో తలవంచుకొని కాంతిహీనులుగా నిలబడ్డారు. ఆసమయంలో కృష్ణ, నికుంభుల మధ్య భయంకరయుద్ధం జరుగుతున్నది. నికుంభుడు సమయంచూచి భగవంతునిమీద పరిఘను ప్రయోగించాడు. శ్రీకృష్ణుడతన్ని గదతో కొట్టాడు. గట్టిదెబ్బలు తిని ఇద్దరూ మూర్ఛపోయారు. అదిచూచి యాదవులు, పాండవులు మిక్కిలి భయపడ్డారు. శ్రీకృష్ణుని క్షేమం కోరుతూ మునులు వేద మంత్రములు పఠిస్తూ స్తోత్రం చేశారు. వాళ్ళ యిద్దరికీ స్మృతి వచ్చిన తరువాత సింహ శిశువులు వలె మళ్ళీ యుద్ధం సాగించారు.

అప్పుడు ఆకాశవాణి! ఓ కృష్ణా! నీ చక్రంద్వారా ఈ రాక్షసుని త్వరగా చంపి వేయుము. ఇలా చేయటంవల్ల నీకు ధర్మం, కీర్తి కూడా ప్రాప్తిస్తాయి. ఈ దేవవాణి సాక్షాత్తు శంకరుని ముఖంనుండి వెలువడింది. అప్పుడు భగవంతుడైన కృష్ణుడు ఇలా అవుతుంది అని పలికి శంకరునికి నమస్కరించి తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. సూర్యతేజస్సుగల ఆ చక్రంయొక్క దెబ్బచేత కుండలాలతో అలంకరింపబడిన నికుంభ దైత్యుని తల తెగి నేలపై పడింది. మహారాజా! నికుంభుని మరణంచేత బిల్వోదకేశ్వరుడైన శివునికి అంతులేని ఆనందం ప్రాప్తించింది. ప్రపంచానికి శాంతి ఏర్పడింది. ఇంద్రుడు ఆకాశంనుంచి పుష్పవర్షం కురిపించాడు. దేవదుందుభులు మ్రోగాయి. మునులు ఆనందించారు.

తరువాత శ్రీకృష్ణుడు యాదవులకు కోట్లకొలది రాక్షసకన్యలను, ఇతర క్షత్రియులకు ధనరాశిని, వివిధ విచిత్ర వస్త్రాలను, పాండవులకు గుర్రాలతోకూడిన వెయ్యిరథాలను ఇచ్చాడు. బ్రహ్మదత్తుడికి షట్పురనగరం ఇచ్చివేశాడు. యజ్ఞం పూర్తిఅయ్యాక శంఖచక్రగదాధారియైన కృష్ణుడు ఇతరరాజులను, పాండవులను వీడ్కొన్నాడు. తరువాత బిల్వకేశ్వరుడైన శివుని కారణంగా ఒక ఉత్సవం ఏర్పాటు చేశాడు. అనేకవిధాలైన రుచికరపదార్థాలతో ప్రజలకు భోజనాలు పెట్టించాడు. తరువాత కుస్తీ పట్టేవాళ్ళను పిలిచి మల్లయుద్ధం చూశాడు. చివరలో అధికమైన ధనాన్నీ, అనేకవిధాలైన వస్త్రాలను దానం చేశాడు.

తరువాత బ్రాహ్మణులకు నమస్కరించి తల్లితండ్రులతో ప్రయాణం చేశాడు.సంతోషంతో బలిష్టులైన జనంతో నిండిన ద్వారకలో ప్రవేశించే సమయాన నగరవీధులన్నిటిలో పుష్పమాలలు అలంకరించి రాజమార్గంలో రెండువైపుల నిలిచి జనం అతనికి నమస్కారం చేశారు.

మహారాజా! జనమేజయా! భగవంతుడైన చక్రహస్తుని విజయాన్ని, షట్పుర వధనూ విన్నవాళ్ళు, చదివినవాళ్ళు, యుద్ధంలో జయం పొందుతారు. పుత్రులు లేనివాళ్ళకు పుత్రులు, ధనంలేనివాళ్ళకు ధనాన్ని, రోగి ఆరోగ్యాన్ని, బంధంలో ఉన్నవాడు బంధవిముక్తిని పొందుతారు. పుంసవనగర్భాధాన శ్రాద్ధ కార్యాలలో ఇది నాశరహితమైన మంత్రముయొక్క పనిని చేస్తుంది. ప్రఖ్యాత పరాక్రమంగల శ్రీకృష్ణుని యీ విజయగాధ పఠించినవారికి సంసారబాధలు తొలగి సద్గతి ప్రాప్తిస్తుంది. భగవంతునకు జయమగుగాక.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
షట్పుర వధ అను ఎనభై ఏడవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఎనిమిదవ అధ్యాయము

## అంధకాసురుని వృత్తాంతము

జనమేజయుడు మునివరా! అందమైన షట్పురవధ విన్నాను, అంధకవధను చెప్పుము. భానుమతిని అపహరించుట, నికుంభవధ వినవలెనని ఉత్సాహంగా ఉంది. అని వైశంపాయ మహర్షిని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! విష్ణువు చాలామంది అసురులను చంపగా 'దితి' తపస్సుచేసి తన భర్తయైన కశ్యపుని సేవిస్తున్నది. ఆమె సేవకు ప్రసన్నుడై కశ్యపుడు వరము అడిగితే ఇస్తానన్నాడు.

పూజ్యుడా! దేవతలు నా పుత్రులను అందరినీ చంపారు. కనుక దేవతలకు చంపశక్యముకాని పరాక్రమవంతుడైన పుత్రుని కోరుతున్నాను. అన్నది. కశ్యపముని దేవి! శంకరునివల్లనే తప్ప ఇతరదేవతల వల్ల చావని ఒక పుత్రుని కంటావు. మహాదేవునిమీద నాకు అధికారంలేదు. ఇందువల్ల శివునినుండి రక్షించుకోటానికి ప్రయత్నించాలి. ఇలాచెప్పి వ్రేలితో ఆమె పొట్టను తాకాడు. కొంచం సమయం తర్వాత ఆమె ఒక కుమారుని కన్నది. ఆ కుమారుడికి వెయ్యిచేతులు, వెయ్యి తలలు, వెయ్యి కళ్ళు, వెయ్యి కాళ్ళు ఉన్నప్పటికీ అహంకారంవలె గుడ్డివానివలె నడిచేవాడుజ కాబట్టి అంధకుడని లోకం పిలిచింది.

మూడులోకాలలోనూ తనను చంపేవాడు లేడని అందరినీ బాధింపసాగాడు. అతడు ప్రజల నుండి ధనాన్ని రత్నాలనూ, హఠాత్తుగా లాక్కొనేవాడు. చాలామంది అప్సరసలను అపహరించి తన యింట్లో ఉంచాడు. అతడు పాపాత్ముడు, భయంకరుడు, నిత్యమూ పరస్త్రీ, పరధన, పరరత్నములను అపహరించేవాడు. కొంతకాలం తరువాత ఇతర అసురులతో కలిసి మూడులోకాలను జయించటానికి బయల్దేరాడు.

దేవరాజు ఇదివిని కశ్యపుడి దగ్గరకు వెళ్ళాడు. అంధకాసురుడు అన్నీ పాడు పనులు చేస్తున్నాడు. ఇప్పుడు మేము ఏమి చేయాలి? అని అడిగాడు. తమ్ముడికి ఇలాంటి చెడుపనులు నచ్చవు. తల్లి దితికి అతనిమీద మిక్కిలి ప్రేమ. ఇప్పుడు నేను అంధకుని చంపితే ఆమెకు నాపై మరింతకోపం వస్తుంది. అన్నాడు. ఆ మాటలు విని కశ్యపుడు వత్సా! నీవు వెళ్ళు. నేనతన్ని వద్దని చెపుతా. అని చెప్పి దితి వద్దకు వెళ్ళాడు. అక్కడ దితి, కశ్యపుడు, దితి ఇద్దరూ మిక్కిలి దుఃఖపడుతూ అంధకునితో నాయనా! నీవు ముల్లోకాలనూ జయించేపని మానుకో, అన్నారు. అతడు తల్లితండ్రులు వద్దన్నా చెడుపనులను మానలేదు. దేవతలను, ఇతరులను ఏడిపిస్తూనే ఉన్నాడు.

ఇంద్రుని ఉద్యానవనంలో చెట్లను విరిచివేశాడు. తల్లితండ్రులు వద్దన్నా దేవతలను బాధిస్తున్నాడు. ఉచ్చైశ్రవమనే గుర్రం పిల్లల్ని బలాత్కారంగా స్వర్గం నుండి తీసుకుపోయాడు. దిగ్గజాల సంతానాన్నికూడా తీసుకుపోయాడు. అతని ఇష్టాన్నిబట్టి గాలి వీస్తోంది. సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు. బ్రహ్మాదులైన ఋషులు అతని చావును గూర్చి ఆలోచించారు. బృహస్పతి, రుద్రుడు తప్ప మరొకడు ఇతన్ని చంపలేడు. రుద్రుడే ఇతని సంహారానికి ఉపాయం చెపుతాడు. అతన్ని పూజించి ఉపాయం తెలుసుకుందాం అని పలుకుతుండగా ఆకాశంలో దేవర్షి నారుదుడు కనిపించాడు.

దేవతలు అతడికి పూజలు చేసి ఓ పూజ్యుడా! నీవు త్వరగా కైలాసానికి వెళ్ళి అంధకునివధను గూర్చి శివునకు విన్నవించుము. అతడలాగే అన్నాడు. నారదుడు ఆ వనంలో ఒకరాత్రి ఉండి శివుని అనుమతిపై మళ్ళీ స్వర్గానికి వచ్చాడు. నారదుని మెడలో మందారపుష్పాలమాల ఉత్తమమైన సువాసన వెదజల్లుతూ

ఉంది. బలంచే గర్వించిన అంధకుడు అక్కడకు వచ్చాడు. నారదుణ్ణి చూచాడు. అతి ఉత్తమమైన సువాసనను పీల్చాడు. ఎక్కడిదీ పుష్పమాల? దీనిరంగు, సువాసన నన్ను ఉద్రేక పరుస్తున్నాయి. ఈ వృక్షం ఎక్కడిది? ఎవడు దీన్ని తీసుకురాగలడు? చెప్పు అని అడిగాడు.

నారదుడు నవ్వుతూ అతని కుడిచేయి పట్టుకుని మందరపర్వతంమీద ఒక అందమైన తోట ఉంది. ఈ పుష్పం ఆ వనంలోది. శంకరుడు స్వయంగా దీన్ని సృష్టించాడు. మహాదేవుని అనుమతి లేకుండా ఆ వనంలో ఎవనికీ ప్రవేశము ఉండదు. అనేకవిధములైన శస్త్రాస్త్రాలను, విచిత్రవస్త్రాలను ధరించిన ప్రమధ గణములు ఎల్లప్పుడూ కాపలాకాస్తూ ఉంటారు. శివుని అనుగ్రహంవల్ల ఆ గణాలు ఎవరి చేతిలోనూ చావరు. శివుడు ప్రమధగణాలతో నిత్యమూ అక్కడ ఉంటాడు. ఆ మందారవృక్షాన్నుండి ఏది కావలసినా పొందవచ్చు. కావలసిన భోజన పదార్థాలను పొందవచ్చు. అక్కడ ఆకలిదప్పులు, అలసట ఏమి ఉండదు. ఆ ప్రదేశము స్వర్గానికి స్వర్గము. ప్రపంచంలో అంతసుఖం కలిగించే ప్రదేశం మరొకటిలేదు అని చెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
అంధకాసురుని వృత్తాంతము అను ఎనభై ఎనిమిదవ అధ్యాయము

★★★

# ఎనభై తొమ్మిదవ అధ్యాయము

## శంకరుడు అంధకుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

అంధకుడు నారదుని మాటలువిని మందరపర్వతానికి వెళ్ళాలని అనుకున్నాడు. అసురులను వెంటబెట్టుకుని మందరపర్వతానికి వెళ్ళాడు. ఆ పర్వతం మేఘంచే ఆవరింపబడింది. గొప్ప ఓషధులుగలది, సిద్ధులు, మహర్షులు కలది, మధురమైన పక్షికూతలు కలది, సింహాలు కలది, అటువంటి పర్వతాన్ని ఆకారంతో ఎదుట ఉన్నదాన్ని ఉద్దేశించి ఓ పర్వతమా! నేను వరదానంచేత ఎవరికీ చంప శక్యంకాని వాడను, ప్రపంచం అన్ని జీవరాసులు నాకు వశమై ఉన్నాయి. ఎవడూ నాతో యుద్ధం చెయ్యలేదు.

ఓ మహాపర్వతమా! నీ చరియమీద పారిజాతవనం ఉన్నది. అది అన్ని కోరిక లను తీర్చే పుష్పాలతో అలంకరింపబడినది. ఆ వనాన్ని అనుభవిస్తాను. నా మనస్సు తొందరపెడుతున్నది. నన్ను నువ్వు ఏం చేస్తావు? నేను బాధిస్తే నిన్ను రక్షించేవాళ్ళు లేరు. ఇలా అన్నాడు.

వెంటనే ఆ మందారపర్వతం మాయమైంది. అప్పుడతడు కోపించి పెద్దగా గర్జించి నేను నిన్ను కోరుతుంటే నన్ను గౌరవించటంలేదు కనుక నిన్ను చూర్ణం చేస్తా నా బలంచూడు. అని కొండశిఖరాన్ని పెకలించి చూర్ణం చేశాడు. ఇతర రాక్షసులు కూడా అట్లే చేశారు. రుద్రుడు పగలకొట్టబడుచున్న పర్వతాన్ని అను గ్రహించాడు. ఆపర్వతం వెనుకటివలె ప్రకాశించింది. పెకిలించి విసిరివేసిన పర్వత శిఖరాలు రాక్షసులను చంపినాయి. సుఖంగా ఉన్న అసురులను మందరపర్వత శిఖరాలు చంపివేశాయి. తన సేనను మర్దింపబడినదానిగా చూచి కోపించిన అంధ కుడు పెద్దగా గర్జించి పారిజాతవనం ఉన్న ప్రదేశాన్ని యుద్ధానికి రమ్మని పిలిచాడు.

ఓ పర్వతమా! కపటంతో నా వాళ్ళను ఎందుకు చంపుతావు? అని పలికాడు. అంధకుడిలా మాట్లాడగానే ఈశ్వరుడు ఎద్దుమీద శూలం పట్టుకొని అంధకుని చంపదలచి అక్కడకు వచ్చాడు. అతని చుట్టూను ప్రమథగణాలున్నాయి.శివుడు కోపించటంతో ముల్లోకాలు కంపించాయి. నదులు ఎదురు ప్రవహించాయి. పర్వతాలు కదిలాయి. చెట్లు తమంతటతామే క్రిందపడి భస్మమయ్యాయి. జగత్తుయొక్క విపరీతస్థితినిచూచి భగవంతుడు మండుచున్న అగ్నివంటి శూలాన్ని ప్రయోగించాడు.

ఆ శూలం అంధకాసురుని రొమ్ముపై పడింది. సజ్జనులకు కంటకంగా ఉన్న అంధకాసురుని ఆ శూలం బూడిదగా చేసింది దేవగణములు, మునులు శంకరుని స్తోత్రం చేశారు. దేవదుందుభులు మ్రోగాయి. పుష్పవర్షం కురిసింది. మూడులోకాలు సుఖపడ్డాయి. దేవతలు, గంధర్వులు గానం చేయగా అప్సరసలు నృత్యం చేశారు. బ్రాహ్మణులు వేదాలను జపంచేశారు. యజ్ఞాలు చేశారు. దిక్కులు ప్రసన్నములైనవి. మందరపర్వతం మళ్ళీ ప్రకాశించింది. పారిజాతవనంలో శివుడు క్రీడించాడు. దేవతలు సంతోషించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శంకరుడు అంధకుని చంపుట అను ఎనభై తొమ్మిదవఅధ్యాయము

☆☆☆

# తొంభై యవ అధ్యాయము

## శ్రీకృష్ణుని జలక్రీడ

జనమేజయుడు ఓ మహర్షీ! వినదగిన అంధకవధ విన్నాను. మహాదేవుడు మూడులోకాలకూ శాన్తి చూకూర్చాడు. చక్రపాణియైన శ్రీకృష్ణుడు నికుంభుని రెండవ శరీరాన్ని ఎందుకు నాశం చేశాడు? ఎలా నాశం చేశాడు? అనే విషయాన్ని చెప్పవలసిందిగా కోరుతున్నాను. అని వైశంపాయనుని అడిగాడు.

వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

అమితపరాక్రమంగల శ్రీకృష్ణుడు ద్వారకలో ఉంటుండగా సముద్రయాత్ర సందర్భంగా పిండారకక్షేత్రం వెళ్ళాలని కోరిక కలిగింది. ఈ తీర్థయాత్ర గూర్చి ఉగ్రసేన, వసుదేవులకు రాజ్యరక్షణభారం వప్పచెప్పబడింది. మిగిలిన యాదవులు భగవంతుడైన కృష్ణునితో బయల్దేరారు. వాళ్ళలో బలరాముడు, లోకనాయకుడగు శ్రీకృష్ణుడు ఇతర కుమారసమూహాము స్వతంత్రంగా వేర్వేరుగా వెళ్ళారు.

శ్రీకృష్ణుని కుమారులతో వేలాది వేశ్యలు కూడ బయల్దేరారు. అందరిలో గొప్పవాడైన బలరాముడు రేవతియందు మాత్రమే ప్రేమ కలవాడై మద్యపానంచేసి అందమైన వనమాలను ధరించి రేవతితో కూడా జలక్రీడ ప్రారంభించాడు. ఇటు కృష్ణుడు కూడా తన పదహారువేల స్త్రీలతో జలవిహారం చేయసాగాడు. అతని భార్యలందరి కోరికలు నిండాయి. ప్రతిస్త్రీ కూడా నేనే ప్రియురాలనని పొగడు కొన్నది. వాళ్ళందరూ కృష్ణనామాన్ని పలుకుతూ అతని గుణాల్ని గానం చేయటం ప్రారంభిం చారు.

ఆ స్త్రీలందరితోనూ శ్రీకృష్ణుడు స్వచ్ఛమైన సముద్రపు నీటిలో క్రీడించాడు. సముద్రం స్వచ్ఛము, అన్ని సువాసనలతో కూడిన నీటిని ధరించింది. వాసుదేవుని ఆజ్ఞచేత నీరు ఉప్పగాలేదు. మడమలవరకూ, మోకాళ్ళవరకూ, తొడలవరకూ లోతు కలిగిఉంది. ఆ స్త్రీలు రొమ్ములవరకూ నీరుండాలని కోరారు. కృష్ణునిమీద నీళ్ళు చిమ్మారు. అట్లే కృష్ణుడుకూడా వాళ్ళపై నీళ్ళు చిమ్మాడు. కొందరు పడి పోతున్నాను కౌగలించుకో అన్నారు. కొందరు కర్రల తెప్పలతో దాటుతున్నారు. సముద్రజలంలో కృష్ణుని సంతోషపెడుతూ క్రీడించారు. శ్రీకృష్ణుడు రుక్మిణితో నీటిలో సంతోషంగా క్రీడించసాగాడు. ఆయా స్త్రీ భావాన్ని అనుసరించి వాళ్ళను

తనవశం చేసుకున్నాడు. స్త్రీలందరూ అతన్ని గౌరవించారు. యదువంశ కుమార సమూహంకూడా స్త్రీలతో జలవిహారం చేశారు. సముద్రజలానికి అలంకార మేర్పడింది. అక్కడకు వచ్చిన వేశ్యల నృత్య గీత దాక్షిణ్యగుణాలతో కుమార సమూహం అలరింపబడింది.

ఈ సమయంలో కృష్ణుడు తన విశ్వరూపప్రతాపంతో గొప్ప అప్సరసస్త్రీలను అక్కడకు పిలిపించాడు. వాళ్ళు వచ్చి భగవంతునిముందు నిలిచారు. అప్పుడు కృష్ణుడు వాళ్ళను నృత్య, గీత, వాద్యాలతో మీ నేర్పును చూపిస్తూ యాదవులతో విహరించండి. ఇలా చేస్తే మీ కోరికలు అన్నీ తీరేటట్లు చేస్తా అన్నాడు. ఆ అప్సరసలు కృష్ణుని ఆజ్ఞచేత యాదవులతో జలక్రీడలు చేశారు. తెల్లనినావలచేత ఆ సముద్రం మిక్కిలి ప్రకాశించింది.

విశ్వకర్మ అక్కడ స్వర్గంలోని నందనవనంగా ఆ ప్రదేశాన్ని మార్చాడు. వనాలలో పక్షులు మధురంగా ధ్వనిచేశాయి. తెల్లనిమేడలపై నెమళ్ళు నృత్యం చేశాయి. తుమ్మెదల మధురధ్వనులు మనస్సును ఆకర్షించాయి. అత్యంత సుఖకరంగా గాలి వీచింది. అక్కడివాళ్ళకు ఆకలిదప్పులుగాని, అలసటగాని, చింతగాని, దుఃఖంగాని లేవు. శ్రీకృష్ణుని స్త్రీలకు ఒక్కొక్కతెకు ఒక్కొక్క మణిరత్న భూషితమైన గృహం నిర్మింపబడింది. ఆ ఇళ్ళు అన్ని ఋతువులలో ఉండే పూలతో అన్నివిధాలైన సువాసనలతో నిండిఉన్నాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని జలక్రీడ అను తొంభై యవ అధ్యాయము

☆☆☆

# తొంభై ఒకటవ అధ్యాయము

## ఛాలిక్య సంగీతము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఇటు బలరాముడుకూడా మధ్యపానంచేసి రేవతితో పరిహాసా లాడుతూ ఆనందిస్తున్నాడు. శరీరమంతటా చందనం పూశాడు. అతడు నల్లని వస్త్రాలు ధరించాడు. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. శరీరకాంతి చంద్రకిరణాలవలె తెల్లనిది. ఒక చెవికి కుండలము, రెండవ చెవికి అందమైన పద్మము అలంకారముగా ఉన్నాయి. ముఖం చాలా అందంగా ఉంది. ఆయన రేవతితో

జలవిహారం చేస్తున్నాడు. శ్రీకృష్ణుని ఆజ్ఞచే అప్సర స్త్రీలు రేవతిని చూడటానికి ఆనందంతో అలంకారాలు ధరించి సముద్రం ఒడ్డుకు చేరి రేవతీ బలరాములకు నమస్కారం చేశారు. తరువాత నాట్యం కొందరు చేశారు, కొందరు గానం చేశారు. కొందరు అప్సరసలు కృష్ణుడు కంసుని చంపుట, బలరాముని పరాక్రమము యొక్క వృత్తాంతాన్ని, ఇంకా ఇతరములైన కృష్ణబలరాముల లీలలను అనుకరిస్తూ వారి కిష్టమైన గానాన్ని వినిపించారు. బలరాముడు తనభార్య రేవతితో వాద్యం వాయిస్తూ గానం చేశాడు. గానం చేస్తున్న అతన్నిచూచి శ్రీకృష్ణుడు మిక్కిలి ఆనందించి సత్యభామతో అక్కడకు వచ్చాడు. తానుకూడా గానం చేయసాగాడు.

అర్జునుడు కూడ కృష్ణునితోపాటు గానం చేయసాగాడు. గద ప్రద్యుమ్న, సాంబాదులు, అక్రూరుడు మొదలైనవాళ్ళు అందరూ కలిసి నృత్యగానం ప్రారంభించారు. కృష్ణుని ప్రభావంచేత నావలు వచ్చాయి. నావలనిండా జనం ఎక్కారు. అందరూ ఆనందంతో మునిగితేలుతున్నారు. సత్యభామ, శ్రీకృష్ణుడు, అర్జునుడు, సుభద్ర, బలదేవుడు, రేవతి, అప్సరసల భావభంగిమలను చూచి నవ్వుతూ తాము కూడా నృత్యంచేశారు. సత్యభామ మొదలైనవాళ్ళు వాళ్ళ నృత్యం చూసి నవ్వును ఎంత ప్రయత్నంచేసినా ఆపుకోలేకపోయారు.

నారదమహర్షికూడా వాళ్ళను అనుకరిస్తూ నవ్వసాగాడు. నవ్వగా నవ్వగా వాళ్ళ కళ్ళల్లో నీళ్ళు కనిపించాయి. సత్యభామ మొదలైన యువతులు మిక్కిలి గొప్పవైన వస్త్రాలను, రత్నాలను, పారిజాతపుష్పాలమాలలు మొదలైన అనేక వస్తువులను ఇవ్వనారంభించారు. ఇలా కార్యక్రమం పూర్తికాగా కృష్ణుడు నారదుని చేయి పట్టుకొని సత్యభామ, అర్జునులతో కలిసి నీటిలోనికి దూకాడు. తరువాత నవ్వుతూ సాత్యకితో, రా, మనమందరం రెండుగుంపులుగా విడిపోయి యువతులతో వేరువేరుగా జలవిహారం చేద్దాం అన్నాడు.

బలరాముడు రేవతితో ఒకప్రక్క నాయకుడయ్యాడు. యాదవుల రెండవ భాగానికి ఆయన కుమారుడు నాయకత్వం వహించాడు. ఇంకొక భాగానికి బలరాముని పుత్రుడు తాను నాయకులయ్యారు. అప్పుడు కృష్ణుడు సముద్రునితో నీవు నిర్మలము, సువాసనగల నీటితో కూడి మొసళ్ళు లేకుండా ఉండాలి, నీ ఒడ్డు అందంగా ఉండాలి. రత్నాలతో అలంకరింపబడాలి. ఎవరికి ఏ వస్తువు కావలిస్తే ఆ వస్తువు వెంటనే ఇవ్వాలి. నీ నీళ్ళు మధురంగా ఉండాలి. అందరికీ కావలసిన అన్ని వస్తువులనూ సమకూర్చాలి. అని చెప్పి జలవిహారం ప్రారంభించారు.

శ్రీకృష్ణుడు అర్జునునితో జలవిహారంచేస్తూ, సత్యభామను నారదునిపై నీళ్ళు చల్లమని సంజ్ఞ చేశాడు. సత్యభామ అట్లేచేసింది. బలరాముడు రేవతి చేయి పట్టు కొని నీటిలోకి దిగాడు. కృష్ణుని పుత్రులు యాదవముఖ్యులు బలరామునితో గంతు లు వేస్తున్నారు. మద్యపానంచే వాళ్ళ కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అందరూ పిచ్చెత్తి నట్లు బిగ్గరగా గొంతెత్తి సమయానికి తగిన పాటలు పాడారు. తరువాత కృష్ణుడూ, నారదుడూ, బలరాముని పక్షంవాళ్ళపై నీళ్ళు చల్లారు. అలాగే బలరాముని పక్షంవాళ్ళు శ్రీకృష్ణుని పక్షంవాళ్ళమీద నీళ్ళు చల్లారు. ఆ నీళ్ళు చల్లుకొనుట మితిమీరిపోగా కృష్ణుడు వాళ్ళను నివారించాడు. తానుకూడ మానివేశాడు. దేవర్షి యైన నారదునకు చందనం యిచ్చాడు. తరువాత అందరూ వస్త్రాలు ధరించి కృష్ణుని ఆజ్ఞననుసరించి భోజనస్థానం చేరారు.

క్రమంలో కూర్చుని ఇష్టానుసారం భోజనం చేశారు. అనేకవిధాలైన భోజన పదార్థాలలో ఇష్టానుసారంగా భుజించారు. వివిధములైన పానీయములను సేవించారు. కొందరు పాటలు పాడారు. నారదుడు వీణ వాయించాడు. రంభయొక్క అభినయం శ్రీకృష్ణుని పరవశం చేసింది. తరువాత ఊర్వశి, హేమ, తిలోత్తమ, మేనక మొదలగువారు నాట్యం చేస్తూ గానం చేశారు. శ్రీకృష్ణుడు వాళ్ళ నృత్య గానాలకు మిక్కిలి సంతోషించాడు. వాళ్ళను అభినందించాడు. తమతమ నేర్పును ప్రదర్శించినవాళ్ళు శ్రీకృష్ణుని నుండి తాంబూలాన్ని పొందారు. స్వర్గం నుండి వచ్చిన అప్సరసలు శ్రీకృష్ణునికి నమస్కరించి వీడ్కొన్నారు. భగవంతుడు కృష్ణుడు కూడ నవ్వుతూ వాళ్ళను సాగనంపాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఛాలిక్య సంగీతము అను తొంభై ఒకటవ అధ్యాయము

☆☆☆

# తొంభై రెండవ అధ్యాయము

## నికుంభ వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! యాదవులు ఆటలలో ఒళ్ళు తెలియకుండా ఉన్నారని గ్రహించి తన వినాశనాన్ని కోరుకుంటూ నికుంభుడనే రాక్షసుడు తన మాయాజాలంతో 'భాను'కుమార్తెయైన భానుమతిని అపహరించాడు. ఇంతకుపూర్వం ప్రద్యుమ్నుడు

ఇతని సోదరుడైన వజ్రనాభుని చంపి అతని కుమార్తె ప్రభావతిని బలాత్కారంగా అపహరించాడు. ఆ పగ తీర్చుకోవడానికి నికుంభుడిలా చేశాడు. నికుంభుడు అవకాశం వెతుకుతూ 'భాను'యొక్క ఉద్యానవనంలో ఉంటున్నాడు. ఈ సమయంలో పట్టణం శూన్యంగా ఉందనిచూచి కన్యను అపహరించాడు. ఆ కన్య ఏడ్పుధ్వనితో అంతఃపురం ప్రతిధ్వనించింది.

అంతఃపురంలో ధ్వనులు విని వసుదేవుడు ఆహుకి కవచాలు ధరించి బయటకు వచ్చేటప్పటికి వాడు ఎక్కడ కనపడలేదు. అప్పుడు వాళ్ళిద్దరూ కృష్ణుని దగ్గరకు వెళ్ళారు. కృష్ణుడు వాళ్ళ ద్వారా విషయం తెలుసుకొని అర్జునునితో గరుడుని మీద ప్రయాణమయ్యాడు. ప్రద్యుమ్నుడు వెనుక రథంమీద వచ్చునట్లు ఆజ్ఞాపించాడు. గరుడునితో త్వరగా నడువుము. అని బయల్దేరాడు. నికుంభుడు తన వజ్రపురంలో ప్రవేశిస్తుండగానే కృష్ణార్జునులు, ప్రద్యుమ్నుడు వాడిపై దాడి చేశారు. మాయావి నికుంభుడు వాళ్ళనుచూచి మూడు రూపాలు ధరించాడు. శ్రమ లేకుండా మూడురూపాలతో ఒకేసారి యుద్ధం చేయనారంభించాడు. ఎడమ చేతిలో భానుమతి ఉంది. కుడిచేతలోని గదతో ముగ్గురినీ కొట్టనారంభించాడు. కాని వాళ్ళ ముగ్గురూ కలిసి కొట్టటంతో కన్యకు దెబ్బ తగులుతుందని కొంచంసేపు కొట్టకుండా ఆగారు.

అర్జునుడు తన నైపుణ్యంతో అతనిపై బాణప్రయోగం చేశాడు. కృష్ణుడు, ప్రద్యుమ్నుడూ కూడా కన్యకు దెబ్బ తగలకుండా అతనిపై బాణాలు ప్రయోగించారు. అప్పుడు రాక్షసుడు తనమాయతో కనపడకుండాపోయాడు. ఇది ఎవరూ తెలుసుకొనలేకపోయారు. ఆ రాక్షసుడు హరితపక్షిరూపం ధరించి అక్కడనే ఉన్నాడు. అర్జునుడు మళ్ళీ బాణాలతో కన్యకు దెబ్బ తగలకుండా యుద్ధం చేశాడు. ఆ రాక్షసుడు ఆ వీరులు వెంటాడుతుండగా భూమండలంఅంతా తిరిగాడు. గోకర్ణపర్వతంపైన గంగానది ఒడ్డున కన్యతోసహా పడ్డాడు. మహాదేవుని ప్రభావంచేత ఎవ్వడూ గోకర్ణాన్ని దాటి వెళ్ళలేడు.

ప్రద్యుమ్నుడీ అవకాశం చూచి భానుమతిని పట్టుకొన్నాడు. కృష్ణార్జునుల బాణాలకు తట్టుకోలేక ఉత్తరగోకర్ణం విడిచి దక్షిణంగా వెళ్ళాడు. గరుత్మంతుని మీద అతన్ని వెంబడిస్తూ ఇద్దరూ వెళ్ళారు. ఆ రాక్షసుడు తన బంధువులకు నివాసస్థానమైన షట్పురంలో ప్రవేశించాడు. కృష్ణార్జునులిద్దరూ రాత్రి అక్కడ ఉండిపోయారు. ప్రద్యుమ్నుడు కృష్ణునిమాటమీద భాను కుమార్తెను ద్వారకకు

సంతోషంతో తీసుకువెళ్ళాడు. మళ్ళీ షట్పురానికి వచ్చాడు. అక్కడ గుహద్వారంలో భయంకర పరాక్రమంగల కృష్ణార్జునులను చూచాడు.

వాళ్ళిద్దరూ షట్పురద్వారాన్ని ఆక్రమించియున్నారు. ఇంతలో నికుంభుడు యుద్ధం చెయ్యటానికి బయటకు వచ్చాడు. అర్జునుడు తన బాణాలతో అన్ని వైపులా మార్గాన్ని మూసివేశాడు. ఆ రాక్షసుడు ముళ్ళు కలిగినట్టి గదతో అర్జునుని నెత్తిమీద కొట్టాడు. అర్జునుడు మూర్ఛపోయాడు. రక్తం కక్కుతూ మూర్ఛపోయిన పార్థునిచూచి నవ్వి ప్రద్యుమ్నుని కొట్టాడు. ఊహించకుండా తగిలిన ఆ దెబ్బకు ప్రద్యుమ్నుడు మూర్ఛపోయాడు. అర్జునుడు, తన కుమారుడు మూర్ఛపోవటం చూచి శ్రీకృష్ణుడు వేగంగా రాక్షసునికి ఎదురువెళ్ళాడు.గదాగ్రజుడు తన కౌమొదకి అనే గదను తీసుకొని నికుంభునివైపు పరుగెత్తాడు.

నికుంభుడు కూడా కృష్ణునికి ఎదురువెళ్ళాడు. ఇద్దరకూ ఘోరయుద్ధం జరిగింది. దేవతలు కూడా ఆ యుద్ధం చూడటానికి వచ్చారు. రెండు ఆబోతుల వలె, రెండు ఏనుగులవలె వాళ్ళిద్దరూ యుద్ధం చేశారు. నికుంభుడు గదతో శ్రీకృష్ణుని కొట్టాడు. కృష్ణుడు కూడా గిరగిరా త్రిప్పి గదను నికుంభుని శిరస్సుపై వేశాడు. ఇద్దరూ మూర్ఛిల్లి క్రిందపడ్డారు. ఇంద్రుడు ఆకాశగంగ యొక్క చల్లని సువాసనతో కూడిన నీటిని శ్రీకృష్ణుని ముఖం మీద చల్లాడు. కొంచంసేపటికి ఇద్దరూ తెప్పరిల్లారు. అప్పుడు కృష్ణుడు చక్రాయుధాన్ని తీసుకొని దుర్మార్గుడా! సిద్ధంగా ఉండు అన్నాడు.

నికుంభుడు రెండవశరీరంతో లేచి నిలబడ్డాడు. ఈ విషయం తెలియక యుద్ధభూమిలో పడిపోయిన శత్రువును కొట్టుట తగదని శ్రీకృష్ణుడు ఉపేక్షించి నిలబడ్డాడు. ఇంతలో ప్రద్యుమ్నార్జునులిద్దరూ తెప్పరిల్లి శ్రీకృష్ణుని వద్దకు వచ్చారు. నికుంభుని చంపాలని ఆలోచిస్తూ నిలబడ్డారు. అప్పుడు తండ్రీ! నికుంభుడిక్కడ లేడు, దుర్మార్గుడు ఎక్కడికో పారిపోయాడు, అనగానే అతని శరీరం కనపడలేదు. శ్రీకృష్ణుడు, అర్జునుడు నవ్వారు. ఆ సమయంలో పదివేల నికుంభ శరీరాలు ఆకాశంలో నేలమీద నలువైపుల సంచరిస్తూ కనపడ్డాయి. అలాగే ఇటువైపుకూడా వెయ్యిమంది కృష్ణులు, వెయ్యిమంది అర్జునులు, వెయ్యిమంది ప్రద్యుమ్నులు కనపడ్డారు.

అది చాలా ఆశ్చర్యం కలిగించింది. రాక్షసుడు ఒక శరీరంతో అర్జునుని అపహరించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు దివ్యజ్ఞానంతో యదార్థ నికుంభుని చూచి

చక్రాయుధంతో అతని శిరస్సును అందరూ చూచుచుండగా ఖండించాడు. రాక్షసుడు అర్జునుని విడిచిపెట్టి మొదలు తెగిన చెట్టువలె క్రింద పడ్డాడు. ఆకాశం నుండి పడుతున్న అర్జునుని ప్రద్యుమ్నుడు పట్టుకున్నాడు. నికుంభుడు నేలపై పడిపోగా ధనుంజయుని ఓదార్చి శ్రీకృష్ణుడు అతనితో కలిసి ద్వారకకు వెళ్ళాడు. నారదుడికి నమస్కరించాడు.

నారదుడు 'భాను'తో ఓ యదువర! నీ కన్యను గూర్చి మనస్సులో బాధపడ వద్దు. శాపవశంవల్ల ఇలా జరిగింది. ఈమెను పాండవులలో సహదేవునికి ఇమ్ము. నారదుని మాటలపై అందరికీ విశ్వాసం ఏర్పడింది. శ్రీకృష్ణుడు హస్తినా పురం నుండి మాద్రి పుత్రుడైన సహదేవుని పిలిపించాడు. 'భాను' తన కన్యను అతనికి ఇచ్చాడు. ఇలా వివాహ కార్యక్రమం చక్కగా పూర్తి అయిన పిమ్మట సహదేవుడు తన భార్యతో హస్తినాపురం వెళ్ళాడు. శ్రద్ధతో భగవంతుడైన కృష్ణుని యీ విజయ గాధను చదివినవాడు, విన్నవాడు అన్నిపనులలోనూ విజయం సాగిస్తాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
నికుంభ కథ అను తొంభై రెండవ అధ్యాయము

☆☆☆

# తొంభై మూడవ అధ్యాయము

## వజ్రనాభుని మాటలు

ఇంత కథ విని జనమేజయుడు మునివరా! నీదయవల్ల భానుమతిని అపహరించుట శ్రీకృష్ణుని విజయము, జలవిహారము మొదలైన ఆశ్చర్యకర వృత్తాంతాన్ని విన్నాను. నికుంభకథ ప్రసంగంలో వజ్రనాభవధను సూచించారు. ఇప్పుడు వజ్రనాభుని కథను వినిపించండి అని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఇప్పుడు వజ్రనాభవధ, సాంబ, ప్రద్యుమ్నుల విజయాలను చెపుతా విను.

వజ్రనాభుడనే రాక్షసుడు మేరుపర్వతగుహలో తపస్సు ప్రారంభించాడు. కొన్నాళ్ళు తపస్సుచేయగా బ్రహ్మ ప్రసన్నుడైవాడి దగ్గరకు వెళ్ళి వరమడగమన్నాడు. అతడు దేవతలచే చావకుండుట, సమస్తరత్నములతో అలంకరింపబడిన

వజ్రపురం, ఆ పట్టణంలో అతని అనుమతిలేనిదే వాయువుకూడ ప్రవేశించ కుండుట, శ్రమలేకుండా అన్ని సుఖసాధనాలు కలిగిఉండుట, పట్టణానికి నలు వైపులా ఉపనగరములు(వేశ్యావాటికలు) లక్షల కొలది ఉద్యానవనాలు, కావాలని అడిగాడు. బ్రహ్మ అలాగే అని అంతర్ధానం చెందాడు. రాక్షసుని కోరికలన్నీ తీరాయి. ఆనందంగా వజ్రనగరంలో నివసిస్తున్నాడు.

నలువైపులనుండి కోట్లకొలది రాక్షసులు అతని రక్షణలో వజ్రపురంలో నివసించారు. కొందరు ఉపనగరాలలోను, ఉద్యానవనాలలోను, నివసింపజొచ్చారు. రాక్షసులందరూ సంతోషంతో బలంగా ఉన్నారు. అతడు గర్వించి అందరినీ బాధించటం మొదలుపెట్టాడు. ఒకనాడు అతడు ఇంద్రుడివద్దకు వెళ్ళాడు. నేను మూడులోకాలకు రాజు కాదలుచుకున్నాను, నా మాటకిష్టపడకపోతే యుద్ధానికి రా అన్నాడు. అప్పుడు బృహస్పతితో ఆలోచించి ఇంద్రుడు ఓ బుద్ధిమంతుడా! మన తండ్రి కశ్యపుడు, ఇప్పుడు యజ్ఞదీక్షలో ఉన్నాడు, యజ్ఞం పూర్తి అయిన తరువాత ఆయన తగినదని చెప్పిన పని చేద్దాం అన్నాడు.

రాక్షసుడు తన తండ్రియైన కశ్యపుని వద్దకు వెళ్ళాడు. అతడు వత్సా! ఇప్పుడు నేను యజ్ఞదీక్షలో ఉన్నాను, నువ్వు వెళ్ళి వజ్రపురంలో సుఖంగా ఉండు, యజ్ఞం పూర్తిఅయిన తరువాత ఏది బాగుంటే అది చేస్తానన్నాడు. తండ్రి మాటవిని రాక్షసుడు ఇంటికి తిరిగివెళ్ళాడు. ఇటు దేవరాజు రహస్యంగా ద్వారకకు వెళ్ళి వజ్రనాభుని విషయం సమస్తమూ చెప్పి వినిపించాడు. భగవంతుడు దేవరాజా! త్వరలోనే వసుదేవుడు అశ్వమేధయాగం ప్రారంభించబోతున్నాడు. ఆ యజ్ఞంలోనే రాక్షసుణ్ణి చంపుతాను. అయితే బ్రహ్మవరం వ్యర్థం కాకుండా వజ్రపురంలో ప్రవేశించే ఉపాయం ఆలోచించాలి అన్నాడు.

ఇలా మాట్లాడి ఇంద్రుడు దేవలోకానికి వెళ్ళాడు. ఇక్కడ వసుదేవుని యజ్ఞం ప్రారంభమైంది. వసుదేవుని యజ్ఞం మిక్కిలి అందంగా పూర్తయింది. ఆ సమయంలో భద్రుడనే ఒక నటుడు నృత్యంచేసి అందరినీ సంతోషపెట్టాడు. అప్పుడు ఋషులు నటుణ్ణి వరం అడగమన్నారు. ఆ సమయంలో ఇంద్రోపేంద్రుల ఆజ్ఞచే సరస్వతి అతని కంఠంలో కూర్చుంది. నటుడు, నాకు ఆకాశంలో వెళ్ళటానికి ఏ బాధా ఉండకూడదు, ఏ ప్రాణివల్లా మృత్యువు రాకూడదు, ఏ ప్రాణి రూపాన్నైనా ధరించి ఎక్కడికైనా వెళ్ళాలి, ముసలితనం రాకూడదు, మునులు, ఇతర ప్రాణులు నావైపు అనుగ్రహంతో ఉండాలి అని అడిగాడు.

బ్రాహ్మణులు అట్లేయని వరమీయగా అతడు భూమండలంఅంతా తిరిగి రాక్షసుల పట్టణాన్ని చూశాడు. ఆ నటుడు ద్వారకలో కూడా ప్రవేశించ బోయాడు. ఆ సమయంలో ఇంద్రుడు ధృతరాష్ట్రుని పుత్రులైన హంసలను పిలిచి ఓ హంస గణమా! మీరు కశ్యపుని సంతానం కనుక మాకు సోదరులు, దేవపక్షులు. ఇప్పుడు శత్రునాశం గూర్చి దేవతలకు ఒక ప్రత్యేకమైన పని యేర్పడింది. ఆ పని మీ ద్వారా పూర్తి కావలసి ఉన్నది. ఈ విషయం ఎవరికీ చెప్పరానిది. ఓ హంసరాజమా! దేవతల ఆజ్ఞను పాటించకపోతే శిక్ష తప్పదు. మీరు అన్నిచోట్లకు వెళ్తారు. ఇప్పుడు నేను దేవతల పనిని చెపుతున్నాను - వినండి.

మీరు వజ్రనాభుని పట్టణానికి వెళ్ళి అక్కడ అంతఃపురం దిగుడుబావులలో సంచరించండి. అతనికి ఒక రత్నంలాంటి కన్యక ఉంది. ఆమెపేరు ప్రభావతి, ఆమె సౌందర్యానికి సాటిలేదు. ఆమె తల్లికి వరదానంవల్ల పుట్టినదని విన్నాను. ఆ కన్యకు బంధువులు స్వయంవరం చేయాలని నిశ్చయించారు. మీరు ఆమెవద్ద ప్రద్యుమ్నుని రూపగుణశీలాదులను వర్ణించండి. ఆ వజ్రనాభుని కుమార్తె ప్రద్యుమ్నుని పై మోహం కలదిగా మీరు చేయాలి, మీరిక్కడికివచ్చి సమాచారం చెప్పాలి. ప్రద్యుమ్నుని అభిప్రాయం కూడా తెలుసుకోవాలి.

ఇది మాకిప్పుడు చేయాల్సిన ఉపకారము, మా పని ఎలా నెరవేరుతుందో అలా మీరు తప్పకుండా ప్రయత్నించాలి, ప్రద్యుమ్నునికి ఆమెపై అనురాగం కలిగేటట్లు ఆమెపై ప్రద్యుమ్నునికి అనురాగం కలిగేటట్లు చెయ్యాలి. ప్రతిదినం ద్వారకాపురంలో సమాచారాన్ని శ్రీకృష్ణునకు చేరవేయాలి. ప్రభావతిని పెండ్లి చేసుకొనుటక ప్రద్యుమ్నునికి కూడా ఉత్సాహం కలిగించాలి. దేవతలనుండి వరాలు పొందిన వజ్రనాభుడు, ప్రద్యుమ్నుడు మొదలైన దేవాంశలో పుట్టినవాళ్ళచేతనే చంపబడతాడు. భద్రుడనే నటుడు ప్రద్యుమ్నుడు మొదలైన యాదవుల వేషంతో వజ్రనాభుని పట్టణంలో ప్రవేశించగలడు. ఓ సోదర సంఘమా! నేను మీకు చెప్పినట్లు చేస్తూ ఏదేని విరుద్ధమైన పరిస్థితి తటస్థించినా దానిని తొలగించి పనినంతనూ పూర్తి చెయ్యాలి. వజ్రనాభుని అనుమతి ఉంటేనే ఎవడైనా అక్కడ ప్రవేశింప గలుగుతాడు. మేము అతనికి శత్రువులము, కనుక మాకు అక్కడకు వెళ్ళే అవకాశం లేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
వజ్రనాభుని మాటలు అను తొంభై మూడవ అధ్యాయము

☆☆☆

# తొంభై నాల్గవ అధ్యాయము

## ప్రద్యుమ్నాదులు వజ్రపురానికి వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఆ హంసలు ఇంద్రుని మాటలువిని వజ్రపురానికి వెళ్ళాయి. అక్కడ బంగారు పద్మాలతో నిండిన అందమైన దిగుడుబావులలో దిగాయి. మధురమైన ధ్వనిని చేస్తున్నాయి. ఆ హంసలు స్వర్గలోకంలో ఉన్నా వాటిపై వజ్రనాభుడికి మిక్కిలి ప్రేమ. అందుచేత మీరు స్వర్గలోకంలో ఉన్నా ఇక్కడ ఏదైనా ఉత్సవసమయం వస్తే అప్పుడు తప్పక రావాలి అని వాటితో ఇది మీ యిల్లు అన్నాడు వజ్రనాభుడు. హంసలు అలాగే అని అంగీకరించాయి. పట్టణంలో ప్రవేశించి ఉంటున్నాయి. ఆ హంసలు మనిషి మాటలు మాట్లాడటం అంతఃపుర స్త్రీలకు బాగా సంతోషం కలిగించింది. హంసలు అక్కడ సంచరిస్తూ అందమైన చిరునవ్వుగల ప్రభావతిని చూచాయి. ఆమెను పరిచయం చేసుకున్నాయి.

శుచిముఖి అనే హంసను రాజపుత్రి స్నేహితురాలినిగా చేసుకుంది. ఒకనాడు మాటల సందర్భంలో శుచిముఖి రాజకుమార్తెను అడిగింది ఓ ప్రభావతి! నీవు మూడులోకాలలోనూ అందకత్తెవని నేనెరుగుదును. నీకు యౌవనం గడుస్తున్నది, స్త్రీలకు కామసుఖం కంటే ఎక్కువది మరొకటిలేదు. నేను పరిహాసం చేయటంలేదు. మీ తండ్రినీకు స్వయంవరం ఏర్పరచాడు. నీవు ఎవనిని వరించలేదు, రూప వంతుడు, గుణవంతుడు, బలవంతుడు అయిన రుక్మిణీదేవి పుత్రుడు ప్రద్యు మ్నుడు ఉన్నాడు. అతనితో సమానుడు మూడులోకాలలో ఎవ్వడూలేడు. అతని ముఖం చంద్రబింబం వంటిది, కళ్ళు కమలాలవంటివి, సింహంవంటి నడక కలవాడు, చిన్నతనంలోనే శంబరాసురుని సంహరించాడు.

ప్రపంచంలో అతనికి తెలియని మాయ లేదు, అతని స్వభావం కోపటంలేనిది, ప్రపంచంలో సౌందర్యసారాన్ని తీసుకొన్ని విష్ణువు అతన్ని సృష్టించాడు. సమస్త సద్గుణాలకు అతడు గని అని చెప్పింది నువ్వు ప్రతి రాజకుమారుడిని హేళన చేస్తే గుణవంతుడైన ప్రద్యుమ్నుడిక్కడికి ఎలా వస్తాడు? అని శుచిముఖి మాట్లాడింది. అప్పుడు ప్రభావతి సఖి! భగవంతుడైన కృష్ణుడు ఇప్పుడు భూలోకంలో

నివసిస్తున్నాడని నారదుడు మా తండ్రికి చెప్పగా విన్నాను. అతడు శంఖచక్రాది అయుధాల ప్రభావంతో అసురవంశాన్ని నశింపచేస్తాడని, అతడు దైత్యులకు శత్రువని విన్నాను, అయితే స్త్రీ తన తండ్రివంశంకంటే తన భర్త వంశం బలం కలదిగా ఉండాలని కోరుకుంటుంది.

కాబట్టి నీవు ఎదైనా ఉపాయంతో ప్రద్యుమ్నుని ఇక్కడకు తీసుకురాగలిగితే చాలా నాపై దయచూపినదానవుఔతావు. నా తండ్రివంశం పవిత్రమౌతుంది, నువ్వు నా ఆలోచనను సమర్థిస్తూ సమాధానం చెప్పు. యాదవవంశంలో జన్మించిన ప్రద్యుమ్నునితో నాకు వివాహం జరిగే ఉపాయం ఏముంది? అతని తండ్రి రాక్షసులకు శత్రువు, రాక్షసులను చంపేవాడు, ప్రద్యుమ్నుడు ఎలా జన్మించాడు? శంబరాసురుని అతడెలా సంహరించాడు? అనే ఆ వృత్తాంతాన్ని అంతనీ వృద్ధ రాక్షసస్త్రీల ద్వారా విన్నాను, ఆ విషయం విన్నది మొదలు అయన నా మనస్సులో నిలిచి పోయాడు, అతన్ని కలుసుకొనే ఉపాయం ఏమి కనపడటంలేదు, నీవు దూతికగా ఉండి అతనితో నన్ను కలుపుము.

తరువాత శుచిముఖి ప్రభావతిని ఊరడిస్తూ నేను దూతికగా వెళ్తాను, నీ అనురాగాన్ని వినిపించి అతడిక్కడకు వచ్చే ప్రయత్నం చేస్తాను, నీ కోరిక తీరితే నీవు సాక్షాత్తు మన్మధుని భార్యవవుతావు. ప్రద్యుమ్నుడిక్కడకు వచ్చే ప్రయత్నం చేస్తాను. నీవు తండ్రివద్దకు వెళ్ళి నా మాటల నేర్పును చెప్పుము అన్నది. తరువాత ప్రభావతి తండ్రివద్దకు వెళ్ళి హంసయొక్క మాటలనేర్పును వినిపించింది. హంస మాటలు విన్నాక వజ్రనాభుడు అంతఃపురంలో శుచిముఖి వద్దకు వెళ్ళి ఆశ్చర్యకర వృత్తాంతం ఏమైనా చూడనిది ఉంటే చెప్పుమని అడిగాడు. ఆ హంస ఇలా చెప్పింది.

నేను శాండిలి అనే పతివ్రతను చూచాను, ఆమె మేరుపర్వతం ప్రక్క ఆశ్చర్యకరమైనపని చేస్తూ ఉంది. కౌసల్య అనే పర్వతకన్య ఆమెకు ప్రియ స్నేహితురాలు. ఒక నటుణ్ణి కూడా చూచాను. ఒక ముని వరప్రభావంచేత ఎక్కడికైనా వెళ్ళగలడు, ఏ రూపమైనా ధరించగలడు, నృత్యాభినయంలో నేర్పరి, అతని నృత్యాన్ని, గానాన్ని, దేవతలాశ్చర్యంతో మెచ్చుకుంటారు అన్నది. అదివిని వజ్రనాభుడు ఓ హంసా! కొద్దిరోజుల క్రిందట నేను సిద్ధ చరణాదులనుండి నటుని విషయంలో చాలా మాటలు విన్నాను. అతన్ని చూడాలని మనస్సులో చాలా ఉత్సాహంగా ఉంది,

కాని అతనితో పరిచయంలేదు. నువ్వు నా గుణాలను చెప్పితే విని స్వయంగా అతడు వచ్చేటట్లు చెయ్యాలి అన్నాడు.

రాక్షసరాజా! అతడు గుణవంతుని వద్దకు స్వయంగా వెళ్తాడు. రాక్షసోత్తమా! నీ గుణాలను విని అతడు ఇక్కడకు తప్పక వస్తాడు అన్నది. వజ్రనాభుడు నా నగరంలోకి అతడు వచ్చేటట్లుచెయ్యి అని చెప్పి హంసకు వెళ్ళమని ఆజ్ఞ ఇచ్చాడు. ఆ హంస ఇంద్రుడి దగ్గరకు, కృష్ణుడి వద్దకు సమాచారమంతా చెప్పి వినిపించింది. ఇదివిని కృష్ణుడు ప్రభావతిని వివాహం చేసుకోటంతో పాటు వజ్రనాభుని వధను కూడా ప్రద్యుమ్నునకు వప్పజెప్పాడు. తరువాత అతడు దేవమాయతో యాదవులకు నటవేషం వేసి వజ్రనాభపురం పంపాడు. ఆ నట సమూహానికి నాయకుడుగా ప్రద్యుమ్నుని, సాంబుని విదూషకునిగాను, గదుడు మొదలైన ఇతరులను ప్రక్కనుండువారినిగా చాలామంది వేశ్యలను నటీవేషంలోనూ సిద్ధంచేసి పంపించాడు.

కృష్ణుని ద్వారా భద్ర నటుడు అతని సహచరులూ సిద్ధమైన తరువాత వాళ్ళు ప్రద్యుమ్నుని ద్వారా నిశ్చయింపబడిన రథంమీద కూర్చొని దేవతల కార్యసిద్ధి కొరకు వెళ్ళారు. ఆ నటుల వేషం ధరించిన యాదవులు సాటిలేని సౌందర్యం కలవాళ్ళు, వాళ్ళ కంఠస్వరం, శరీరలావణ్యమూ, స్త్రీలకు తగినట్లుగా ఉన్నాయి. వాళ్ళు వెళ్ళి రాక్షసులతో నిండిన వజ్రనాభపురంలో వేశ్యవాటిక అయిన 'సుపురా'ము నందు ఉన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నాదులు వజ్రపురానికి వెళ్ళుట అను తొంభై నాల్గవ అధ్యాయము

☆☆☆

# తొంభై ఐదవ అధ్యాయము

## ప్రభావతీ వివాహ కథ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత వజ్రనాభుడు 'సుపురం'లో ఉండే అసురులకు ఉత్తమమైన ఇల్లు ఇవ్వండి అని ఆజ్ఞ ఇచ్చాడు. వీళ్ళకు ఆతిథ్యమివ్వండి. అనేక రత్నాలు కానుకగా ఇవ్వండి. విచిత్రములైన వస్త్రాలు ఇవ్వండి అని ఆజ్ఞాపించాడు. రాజు మాట ప్రకారం అలాగే చేశారు. పూర్వం వినియున్న నటుడు ఉత్సాహం

కలిగించాడు. నటుడికి దైత్యులు మిక్కిలి సంతోషంతో సత్కారం చేశారు. చాలా రత్నాలిచ్చారు. తరువాత వరాలు పొందిన నటుడు నృత్యం చేశాడు. ఆ 'సుపురం' లో ఉండేవాళ్ళు ఆనందించారు. రామాయణ కథ నాటకంగా ప్రదర్శింప బడటానికి రావణుని వినాశం కోసం విష్ణువు జన్మించటం రోమపాదుడు, దశరథుడు, ఋశ్యశృంగముని, రామలక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వీళ్ళ వేషాలు ధరించి నటులందరూ రంగస్థలం మీదికి వచ్చారు.

రామావతార సమయం వాడొక వృద్ధుడు (రాక్షసుడు) ఆ నటులను చూచి మిక్కిలి ఆశ్చర్యపోయాడు. అచటి ప్రేక్షకులందరూ వాళ్ళ వేళభాషాభినయములను చూచి మిక్కిలి ఆశ్చర్యపోయారు. అసురులు సంతోషించి వస్త్రాలను, కంఠాలంకారములను, కంకణాలను, హారాలను, నటులకు సత్కారంగా ఇచ్చారు. తరువాత ఉపనగర మందుండే రాక్షసులు నేర్పరియైన ఆ నటుని యొక్క రాకను వజ్రనాభునకు వినిపించారు. వజ్రనాభుడు సంతోషించాడు. ఆ నటుణ్ణి త్వరగా నా పట్టణంలోకి తీసుకురండి అని చెప్పాడు.

ఉపనగరవాసులు వెంటనే నటవేషం ధరించిన వారిని వజ్రపురానికి పంపారు. పట్టణంలో వాళ్ళకు విశ్వకర్మ నిర్మించిన భవనం ఉండటానికి ఇచ్చారు. వాళ్ళకు కావలసిన సామగ్రినంతనూ ఇచ్చారు. మిక్కిలి సంతోషంతో ఉన్న రాక్షసరాజు రుద్రమహోత్సవ నిమిత్తంగా తన సైనికులను నాట్యం చూడటానికి పిలిచాడు. అక్కడ నటులు చక్కగా విశ్రాంతి తీసుకున్నారు. రత్నాలు మొదలైనవాటిని కానుకగా ఇచ్చి నాటకం ప్రారంభించండి అని ఆజ్ఞయిచ్చాడు. అంతఃపురస్త్రీలకు తగినవ్యవస్థ కల్పించి వజ్రనాభుడు తన బంధువులతో అభినయం చూడటానికి సభామధ్యంలో కూర్చున్నాడు. యాదవులు శృంగారం చేసుకొని రంగస్థలానికి వచ్చి నృత్యం చేయ నారంభించారు. వాళ్ళు రాకముందే అనేకవిధాలైన వాద్యాలు చెవులకింపుగా మ్రోగించారు. తరువాత యాదవులతోపాటు వచ్చిన వేశ్యలు అమృతసమానమైన విధంగా గానం చేశారు. ఆ సంగీతం విని దానవులు ఆనంద సముద్రంలో మునిగితేలారు. ప్రద్యుమ్నుడు, గదుడు, సాంబుడు ఈముగ్గురూ నాందీవాద్యాలు మ్రోగించారు.

తరువాత ప్రద్యుమ్నుడు అభినయంతో గంగావతరణ కథకు సంబంధించిన శ్లోకాలను పాడాడు. తరువాత మనోవతి అనే వేశ్య రంభవేషం ధరించింది. ప్రద్యుమ్న, సాంబ, నలకూబరులు విదూషకులయ్యారు. ప్రద్యుమ్నుడు మొదలైన

యాదవులు తమ మాయాప్రభావంతో కైలాసపర్వతాన్ని సృష్టించారు. తరువాత నలకూబరుడు కోపించాడు. రావణుడికి శాపమిచ్చి రంభను ఊరడిస్తున్నాడు. ఆ విషయం యాద వులు అభినయించటం ప్రారంభించారు. ఈసందర్భంలో నారదమహర్షి పనులను కూడా అభినయించారు. వాళ్ళ సాటిలేని నృత్యాన్ని చూచి యాదవులపై దానవులు మిక్కిలి సంతోషం ప్రకటించారు. సంతోషసూచకంగా రత్నమణిహారాది వస్తువులను కొల్లలుగా ఇచ్చారు. రాక్షసుల భార్యలు తమ వద్దనున్న విలువైన వస్తువులను యాదవులకు ఇచ్చారు. ఈసమయంలో శుచిముఖి ప్రభావతి దగ్గరకు వెళ్ళి రాజపుత్రి! నేను ద్వారకకు వెళ్ళాను. అక్కడ ఏకాంతంలో ప్రద్యుమ్నుని కలుసు కున్నాను. అతనికి నీ అనురాగం తెలియజేశాను. అతడు మిక్కిలి సంతోషించాడు. ఇవేళ సాయంకాలం నిన్ను కలుసుకోటానికి సమయం నిశ్చయించాడు అన్నది.

ప్రభావతి మిక్కిలి సంతోషించి నీవు దగ్గరఉండగా ప్రద్యుమ్నుని చూస్తాను. నీవు నావద్ద ఉంటే యేశంకా ఉండదు అన్నది. అందుకు శుచిముఖి అంగీ కరించింది. అప్పుడు ఇద్దరూ విశ్వకర్మ నిర్మించిన మేడమీద ప్రద్యుమ్నుని రాకకు ఉపయోగించే వస్తువులను సమకూర్చుతున్నారు. తరువాత శుచిముఖి ప్రద్యుమ్నుని తీసుకువచ్చుటకు వెళ్ళింది. రంగస్థలంలో నటవేషంతో ఉన్న ప్రద్యుమ్నునికి పూజ్యుడా! ఈనాడు సాయంకాలం ప్రభావతి నిన్ను కలుసుకోవటానికి ఎదురు చూస్తూ ఉంటుంది అని చెప్పింది. ప్రద్యుమ్నుడు 'తథాస్తు' అని అందుకు అంగీ కరించాడు. శుచిముఖి తిరిగివచ్చి ప్రభావతితో రాజకుమారి! ప్రద్యుమ్నుడు వస్తున్నాడు. చింతించవలసిన పనిలేదు. ధైర్యంగా ఉండు అన్నది. ప్రద్యుమ్నుడు ప్రభావతి గుమ్మందగ్గరకు వచ్చాడు. ఒకస్త్రీ ప్రభావతికి పూలదండను తీసుకు వెళ్ళటం చూచాడు. ఆ పూలదండ మీద తుమ్మెదలగుంపు ఉంది. అప్పుడు తాను తుమ్మెదరూపంలో దాక్కున్నాడు. తరువాత పరిచారిక తుమ్మెదలతో నిండిన మాలతో ప్రభావతివద్దకు వెళ్ళింది. దాసీలు ఆ మాలను రాజకుమారివద్ద ఉంచారు.

సాయంకాలం అయ్యేటప్పటికి తుమ్మెదలు తమతమ స్థానాలకు వెళ్ళాయి. ప్రద్యుమ్నుడు కనపడకుండా ప్రభావతి చెవికి అలంకారమైన కలువపువ్వులోకి వెళ్ళి దాగి ఉన్నాడు. అప్పుడు ప్రభావతి హంసతో సఖీ! చంద్రుడు ఉదయించటం

చూచి నా శరీరమంతా మండిపోతోంది. నా హృదయం ఆతురతతో ఎందుకిలా ఉంది? పూర్ణచంద్రుని చూడగా అనురాగం రెట్టింపు అవుతున్నది. ఇంతవరకు అతన్ని చూడలేదు. అతని విషయం వినటంచేతనే మోహం కలదాననయ్యాను. నా హృదయంలో ఉన్నవ్యక్తిని పొందలేకపోతే కుముద్వతివలె దుఃఖాన్ని పొందు తాను. మన్మథుడనే సర్పంచేత కాటువేయబడ్డాను. సహజంగా చల్లనైన చంద్ర కిరణాలు నా శరీరాన్ని ఎందుకు కాల్చివేస్తున్నాయి? పుప్పొడితోకూడిన చల్లనిగాలి దావాగ్నిలా మండిస్తున్నది. నామనస్సు ధైర్యాన్ని కోల్పోతోంది. ఎప్పుడైనా మూర్ఛ పోవచ్చు. నా హృదయం కంపిస్తూ ఉంది. చూపు తిరుగుతూ ఉంది. ఈశరీరం నశిస్తుందేమో అనిపిస్తున్నది అన్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రభావతీ విరహ కథ అను తొంభై ఐదవ అధ్యాయము

☆☆☆

# తొంభై ఆరవ అధ్యాయము

## ప్రభావతీ ప్రద్యుమ్నుల పెండ్లి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ప్రద్యుమ్నుడు ఈ బాల నాపై పూర్తిగా ఆసక్తి కలిగి ఉన్నదని చూచి సంతోషంతో శుచిముఖీ! నేను తుమ్మెదలలో ఒక తుమ్మెదనై ఆమె వద్దకు వెళ్ళాను. ఇప్పుడు ఆమెకు దాసుడనని చెప్పు. ఆమె యిష్టప్రకారం చేస్తాను. అని ప్రభావతికి చెప్పు. అని హంసతో అన్నాడు. తన వాస్తవరూపాన్ని చూపించాడు. అతన్ని చూడగానే ఆమె ప్రేమసముద్రం పొంగింది. కాని సిగ్గుతో తలవంచుకొని క్రీగంట చూస్తూ మౌనంగా కూర్చున్నది. అప్పుడు ప్రద్యుమ్నుడు ఆమె గడ్డం పట్టుకొని చాలా శ్రమపడి ఈనాడు నీ ముఖం చూచాను. నీవు ముఖం వంచుకొని మౌనంగా కూర్చున్నావేమి? భయపడి ముఖకాంతిని తగ్గించుకోవద్దు.

నీకు భయమెందుకు? నీకు దాసుడను నేను. నేను భయపడుతున్న నిన్ను క్షణం కూడా చూడజాలను. కనుక భయపడవద్దని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు గాంధర్వ వివాహం చేసుకొని నన్ను కాపాడుము. ఇలా పలికి ప్రద్యుమ్నుడు మణియందున్న అగ్నిని ఆచమన పూర్వకంగా పుష్పాలతో హోమం చేసి మంత్రాలను చదువుతూ

ఆభరణములతో అలంకరింపబడిన ఆ చేయిపట్టుకొన్నాడు. మణియందలి అగ్నికి ప్రదక్షిణం చేశాడు. శుచిముఖిని ద్వారంలో ఉండి మమల్ని రక్షించుమన్నాడు. హంస తన కర్తవ్యమును నెరవేర్చుటకు వెళ్ళిపోయింది. తరువాత ప్రద్యుమ్నుడు ప్రభావతి కుడిచేతిని పట్టుకొని శయ్యమీదికి తీసుకువెళ్ళాడు.

తొడమీద కూర్చొన బెట్టుకొని ఊరడించి చెక్కిలిని ముద్దు పెట్టుకొన్నాడు. క్రమంగా కౌగిలించుకొన్నాడు. ఏకాంతమందు ఆమెను రమింపచేశాడు. సూర్యోదయ సమయాన నటుల నివాసానికి వెళ్ళాడు. ప్రభావతి ఇష్టంలేకయే ఎట్లో అతన్ని విడిచిపెట్టింది. నటవేషంలో ఉన్న యాదవులు ఇంద్రకేశవుల మాటకు ఎదురుచూస్తూ అక్కడనే ఉండిపోయారు. కశ్యపుని యజ్ఞం పూర్తికాలేదు. దేవతలకు, దానవులకు ఏకష్టమూ రాలేదు. వజ్రనాభుడు త్రిలోక విజయానికి ఎదురు చూస్తున్నాడు. అదే సమయంలో అందమైన వర్షకాలం వచ్చింది. హంస సమూహం రాత్రింబవళ్ళు కుమారుల వృత్తాంతాన్ని ఇంద్రకేశవులకు అందజేస్తూన్నది. హంసలచే రక్షింపబడుతూ ప్రద్యుమ్నుడు ప్రభావతితో సంభోగ సుఖ మనుభవిస్తూ ఉన్నాడు. ఇంద్రుని ఆజ్ఞచేత హంసలు వజ్రపురంలో ఉండటంచేత యాదువులను ఎవడూ గుర్తించలేకపోయాడు.

తరువాత ప్రద్యుమ్నుడు తన బొమ్మను నాట్యశాలలో పెట్టి మెల్లమెల్లగా పగలు కూడా ప్రభావతి భవనంలో వస్తూ పోతూ ఉన్నాడు. ఈ భేదోపాయం దానవులెవళ్ళూ గుర్తించ లేకపోయారు. యాదవుల యొక్క సద్గుణ సంపదచే రాక్షసులు మిక్కిలి సంతోషంగా ఉన్నారు. యాదవ స్త్రీల రూపలావణ్యాది గుణాలకు దానవకాంతలు సంతోషించారు. వజ్రనాభుడికి సునాభుడనే ఒక సోదరుడున్నాడు. అతనికిద్దరు కన్యలు. ఒకరి పేరు చంద్రవతి, రెండవ దానిపేరు గుణవతి. ఇద్దరూ అందగత్తెలే. నిత్యమూ ప్రభావతి భవనానికి వస్తూపోతూ ఉంటారు. ప్రభావతి యొక్క భోగాసక్తిని చూచి ఆమెను అడిగారు.

ఆమె నావద్ద ఒక విద్య ఉన్నది. అది పఠిస్తే కోరిన పతిని తీసుకు వస్తుంది. వెంటనే తీసుకుపోతుంది. సౌభాగ్యాన్ని కూడ ఇస్తుంది. ఆవిద్యా ప్రభావం చేత దేవకుమారుడైన ప్రద్యుమ్నుని పిలిచి అతని భర్తగా చేసికొని సంభోగానందాన్ని అనుభవిస్తున్నాను. అన్నది! రూపయౌవనములతో కూడిన ప్రద్యుమ్నుని చూచి వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు. ప్రభావతి మరల దేవతలు, ధర్మమందు ఆసక్తి

కలవాళ్ళు. దానవులు అసత్య విషయాలపై ఆసక్తి కలవాళ్ళు. ధర్మమున్నచోటనే జయం ఉంటుంది. మీరుకూడ దేవపుత్రులను వరించండి. ఆవిద్యను మీకు చెపుతాను. మీరు కోరగానే వాళ్ళిక్కడకు వస్తారు. ఇదివిని అక్కాచెల్లెళ్ళిద్దరూ అంగీకరించారు. ప్రభావతి ప్రద్యుమ్నునికీ విషయమంతా చెప్పి ముందు చేయదగిన పనిని అడిగింది. అతడు తన పినతండ్రులైన గదుడు, సాంబుడు అనువాళ్ళను రూపవంతులనీ, గుణవంతులనీ, యుద్ధనిపుణులనీ, మంచి స్వభావం కలవాళ్ళనీ చెప్పాడు.

అప్పుడు ప్రభావతి తన విద్యను వాళ్ళకు ఇచ్చింది. వాళ్ళు గద, సాంబులను కోరి ధ్యానం చేశారు. కొంచెంసేపట్లో గదసాంబులతో ప్రద్యుమ్నుడక్కడ ప్రత్యక్ష మయ్యాడు. ప్రద్యుమ్ముని మాయాబలంవల్ల ఎవరికీ ఈవిషయం తెలియలేదు. తరువాత మంత్రోచ్చారణ పూర్వకంగా వివాహం జరిగింది. గదుడు చంద్రావతిని, సాంబుడు గుణవతినీ భార్యలుగా చేసుకున్నారు. వాళ్ళు ఇంద్రునియొక్క, కృష్ణుని యొక్క ఆజ్ఞకు ఎదురుచూస్తూ దానవకన్యలతో ఆనందంగా కాలం గడుపు తున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రభావతీ ప్రద్యుమ్నుల పెండ్లి అను తొంభై ఆరవ అధ్యాయము

☆☆☆

# తొంభై ఏడవ అధ్యాయము

## ప్రద్యుమ్నుని సంభాషణ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! మెల్లమెల్లగా భాద్రపదమాసం వచ్చింది. ఆకాశం మేఘ సమూహం చే ఆవరింపబడింది. అప్పుడు ప్రద్యుమ్నుడు ప్రభావతితో సుందరి! నీ ముఖం ముందు చంద్రుడు సుందరంగా కనపడటంలేదు. నీ తలవెంట్రుకలతో సమానమైన మేఘమండలం వర్షధారలను విస్తరింపచేస్తోంది. సుందరాంగి! మేఘాల ధ్వని విని నెమళ్ళగుంపు సంతోషంతో పురివిప్పి ఆడుతోంది. వాయువుకదంబవృక్ష పుష్ప వాసనలతో మెల్లగా వీస్తున్నది. సంభోగసుఖం తరువాత శ్రమను పోగొట్టు సువాసనగల వాయువుకంటే గొప్పసుఖం మరొకటిలేదు. హంసలు ఇక్కడి బురద

నీటిని విడిచి మానసరోవరానికి వెళ్ళిపోయాయి. గాలి లేకుండా ఉంటే వర్షాకాలం వాకు ఇష్టంగా ఉంటుంది. పరుండిన విష్ణుమూర్తికి నిద్ర ప్రాప్తించింది. చంద్రుడు మేఘాలచే కప్పబడి కనపడకపోవటం వర్షాకాలం యొక్క దోషము. గరుడధ్వజుడైన పురుషోత్తముడగు మామగారికి దేవి! నమస్కరించు అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నుని సంభాషణ అనే తొంభై ఏడవ అధ్యాయము

☆☆☆

# తొంభై ఎనిమిదవ అధ్యాయము

## వజ్రనాభునితో ప్రద్యుమ్నుని యుద్ధం

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! కశ్యపుని యజ్ఞం పూర్తయిన తరువాత దేవతలూ, రాక్షసులూ తమఇళ్ళకు వెళ్ళిపోయారు. అప్పుడు దానవరాజు వజ్రనాభుడు తనతండ్రి కశ్యపుని వద్దకు చేరి తన మూడులోకాల విజయాన్నిగూర్చిన కోరికను ప్రకటించాడు. అప్పుడు కశ్యపుడు వత్స! వజ్రనాభ! నీవు నామాట వినతగినదిగా తలిస్తే చెపుతాను. నీవు నీవాళ్ళతో ఆనందంగా ప్రశాంతంగా నీ నగరంలో నివసించు. ఇంద్రుడు సహజంగా నీకంటే బలవంతుడు. వేదం తెలిసినవాడు, కృతజ్ఞత కలవాడు, నీకంటే పెద్దవాడు, మంచిగుణాలు కలవాడు. కాబట్టే మూడులోకాలకూ రాజయ్యాడు. ఆతడు మూడులోకాలకూ రాజై అందరి క్షేమాన్ని కోరేవాడు. నీవు ఏవిధంగానూ ఆతన్ని జయించలేవు. అతనికి కోపంతెప్పించి నీవు నష్టపోతావు అన్నాడు. వజ్రనాభుడు ఈమాటలు విని వాటిపై దృష్టి పెట్టలేదు. ఆ దుర్బుద్ధి వజ్రనాభుడు కశ్యపునికి నమస్కారం చేశాడు. అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తరువాత దుర్బుద్ధి అయిన ఆ రాక్షసుడు మూడులోకాలనూ జయించుటకు ఆలోచింపసాగాడు. బంధువులను మిత్రులను చాలామందిని తీసుకుని స్వర్గాన్ని జయించటానికి బయల్దేరాడు.

ఇటు ఇంద్రుడు, భగవంతుడైన కృష్ణుడు వజ్రనాభుని చంపదలచి హంసలను వజ్రపురానికి పంపారు. ఆ హంసలు తిరిగివచ్చాక యాదవులు అక్కడి సమాచారాన్ని అంతనూ విని మిక్కిలి చింతించారు. ఈనాడే ప్రద్యుమ్నునిద్వారా వజ్రనాభుడు చంపబడతాడని వాళ్ళు ఒకరితో ఒకరు చెప్పుకొనసాగారు. పతివ్రతలైన

వజ్రనాభుని కుమార్తెలు గర్భవతులై ఉన్నారు. వాళ్ళు ప్రసవించే సమయం దగ్గర పడింది. ఈ విషయాన్ని ఇంద్రునకు, కృష్ణునకు, హంసలద్వారా తెలియచేద్దాం, తరువాత చేయదగిన పనిని వాళ్ళిద్దరే నిశ్చయిస్తారు. అని నిశ్చయించి ఇంద్రుడి దగ్గరకు, కృష్ణుడి దగ్గరకు హంసలను పంపారు. హంసలు సమాచారాన్నంతటినీ వాళ్ళ యిద్దరికీ చెప్పాయి.

అప్పుడు దేవరాజు, కృష్ణుడు ఆ హంసలతో మీరువెళ్ళి యాదవులకు భయ పడవలసిన అవసరం ఏమీలేదని చెప్పండి. ఆ కోడళ్ళకు పుట్టే కుమారులు గుణ వంతులు, సుందరులూ అవుతారు. గర్భంలో ఉండగానే వాళ్ళు వేద వేదాంగాలను తెలిసినవారౌతారు. వాళ్ళకు తెలియని విషయం ఉండదు, భూమిపై పడుతూనే వాళ్ళు యువకులూ, విద్వాంసులు ఔతారు అన్నారు. దేవరాజు నవ్వుతూ వెళ్ళి పోయాడు. ఇంద్రోపేంద్రుల మాటలువిని హంసలు వజ్రపురం వెళ్ళి అక్కడ యాదవులకు ఇంద్రుడు, కృష్ణుడు చెప్పిన మాటలను చెప్పాయి. తరువాత ప్రభావతికి ఒక పుత్రుడు కలిగాడు. ఇంద్రోపేంద్రుల ఆశీర్వాదంచేత పుడుతూనే యువకుడై అన్నీ తెలిసినవాడై తండ్రివలె గుణవంతుడయ్యాడు. ఒక నెల తరువాత చంద్రావతి ఒక కుమారుని కన్నది. అతనిపేరు చంద్రప్రభుడు, అతడు పుట్టగానే యువకుడు, అన్నీ తెలిసినవాడు, తండ్రివలె గుణవంతుడయ్యాడు. గుణవతికి కూడా పుత్రుడు కలిగాడు. అతనిపేరు గుణవంతుడు. అతడుకూడా వెనుకటి ఇద్దరు సోదరులవలెనే యువకుడు, అన్నీ తెలిసినవాడు అయ్యాడు.

ఒకరోజున రాజభవనంమీద ఆకాశరక్షకులైన దానవులు ఆ యువకులైన యాదవులను చూచి ఆశ్చర్యపోయారు. వజ్రనాభుడికి ఆ వృత్తాంతాన్ని చెప్పారు. మహారాజా! ఇది ఇంద్రోపేంద్రులయొక్క నేర్పు. ఇందులో సందేహంలేదు అని చెప్పారు. వజ్రనాభుడు నాయింటికి ద్రోహంచేసే వీళ్ళని చంపుదాం పట్టుకోండి అని పలికాడు. తరువాత సైన్యాన్ని ఆజ్ఞాపించాడు. అన్నిదిక్కులా కన్యాభవనానికి ఆవరణ ఏర్పరచాడు. ఆ సమయంలో అన్ని వైపులనుండి 'పట్టుకోండి' 'చంపండి' అనే మాటలు వినపడ్డాయి.

ఈ మాటలు విని పిల్లలతల్లు ఏడ్వ మొదలుపెట్టారు. వాళ్ళను ఊరడించి ప్రద్యుమ్నుడు మేము బ్రతికున్నంతవరకు మీకు భయమేమిలేదు, ఈ రాక్షసులు మమ్మల్ని ఏం చేయగలుగుతారు? అన్నాడు. తరువాత కలత చెందిన మనస్సుగల ప్రభావతితో పితండ్రి, పినతండ్రి, సోదరుడు, బంధువులు అందరూ చేతితో

గద పట్టుకొని నిలిచిఉన్నారు. నిన్నుబట్టి వీళ్ళందరూ నాకు గౌరవింపదగినవాళ్ళు. ఇప్పుడు కష్టకాలం వచ్చింది. ఇప్పుడు ఏం చెయ్యాలో చెల్లెళ్ళను అడుగు, పెద్ద వాళ్ళని ఊరుకొనక యుద్ధంచేస్తే మేము తప్పక జయిస్తాం, వీళ్ళు నలువైపులా ముట్టడించి మమ్మల్ని చంపటానికి సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడేం చెయ్యాలి? అన్నాడు.

ప్రభావతి దుఃఖిస్తూ ఆర్యపుత్ర! మీరు ఆయుధాలు ధరించి ఆత్మరక్షణ చేసుకోండి. అలాచేస్తే భార్యాపుత్రులను చూడగలుగుతారు. ఇప్పుడు మీరు రుక్మిణీదేవిని అనిరుద్ధుని తలుచుకొని ఈ కష్టంనుంచి బయటపడే ఉపాయం చెయ్యండి. పూర్వం దుర్వాసమహర్షి సుమంగళివి, భర్తకు ప్రియురాలవు, జీవించి ఉండే పుత్రుడు కలదానవవుతావని ఆశీర్వదించాడు. దుర్వాసునిమాట అసత్యం కాదు. కనుక ఖడ్గం తీసుకుని వెళ్ళండి. మీకు జయమగుగాక అని పలికి ప్రద్యుమ్నుని చేతిలో పదునైన ఖడ్గాన్ని ఉంచింది. ప్రద్యుమ్నుడు ప్రసన్నమైన మనస్సుతో ప్రియురాలిచ్చిన ఖడ్గం తీసుకున్నాడు.

ఇట్లే చంద్రావతీ, గుణవతులు కూడా చేశారు. అప్పుడు ప్రద్యుమ్నుడు హంసకేతువనువానిని నీవిప్పుడు సాంబుడు మొదలైన యాదవులతో ఇక్కడేఉండి యుద్ధం చెయ్యండి. నేను ఒక్కడినే ఆకాశంలో అన్నిదిక్కులనూ యుద్ధంచేస్తాను అని తన మాయాబలంతో రథాన్ని నిర్మించాడు. వెయ్యిశిరస్సులుగల శేషుడు ఆ రథానికి సారథి. ఆ రథాన్నిచూచిన ప్రభావతి సంతోసానికి హద్దులేదు. ఎండుగడ్డిలో అగ్నివలె ప్రద్యుమ్నుడు దానవశత్రువుల మధ్య నిర్భయంగా సంచరించడం మొదలుపెట్టాడు.

అనేకములైన ఆయుధములతో దానవసైన్యం మర్దింపబడుతోంది. రాక్షసులుకూడా ప్రాణాలొడ్డి ప్రద్యుమ్నునిమీద బాణవర్షం కురిపించారు. ప్రద్యుమ్నుడు నరికినచేతులు, కాళ్ళు, శిరస్సులు, మొండెములు యుద్ధభూమిని కప్పివేశాయి. అప్పుడు భయంకరమైన ఆ యుద్ధాన్ని ఇంద్రుడు ఆకాశంనుండి చూచాడు. సాంబుడు మీదికి వెళ్ళిన రాక్షసులు తిరిగిరావటంలేదు. ఆ భయంకర యుద్ధం చూచి ఇంద్రుడు గదుని వద్దకు రథాన్ని పంపాడు. మాతలి కుమారుడు సారథిగా ఉన్నాడు. ఐరావతాన్నికూడా పంపాడు. సాంబుడి కొరకు. ఆ ఏనుగు మావటివాడు విప్రవరుడు ప్రద్యుమ్నునికి సహాయంగా జయంతుని పంపాడు.

లోకులు నలువైపులనుండి ఈ వజ్రనాభుడు మరణిస్తాడు. అన్ని ప్రాణులు సుఖపడతాయి. అన్నారు. ప్రద్యుమ్న, జయంతులు అసురసేనలను నశింపచేస్తూ బాణాలను వర్షించారు. వజ్రనాభుని భవనంమీదికి వెళ్ళారు. ప్రద్యుమ్నుడు గదునితో ఈ రథాన్ని ఇంద్రుడు నీ కొరకే పంపాడు. మాతలిపుత్రుడు దీనికి సారథి. సాంబుని కోసం ఏనుగు వచ్చింది. విప్రవరుణుడు దానికి మావటివాడు. ఈవేళ ద్వారకాపురంలో రుద్రునికి పూజ జరగాల్సి ఉంది. అందుచే కృష్ణుడు రాలేదు. పూజ పూర్తయినమీదట రేపు ప్రొద్దున్న ఆయన కూడా ఇక్కడకు వస్తాడు. ఆయన వచ్చాక ఆజ్ఞ ప్రకారం సపరివారంగా వజ్రనాభుని నశింపచేస్తాం కనుక ఇతని వధకు మనమేమి ఉపాయం ఆలోచింపనక్కరలేదు.

భగవంతుడు స్వయంగా ఇతన్ని చంపడు. కనుక మనం ప్రయత్నించాలి, వీరుడు స్త్రీలను రక్షించాలి అని ప్రద్యుమ్నుడు గద, సాంబులతో చెప్పి మాయా బలంతో కోట్లకొలది రూపాలు ధరించాడు. రాక్షసులు సృష్టించిన చీకటిని ప్రద్యుమ్నుడు నశింపచేశాడు. ఇంద్రుడతని నేర్పును చూచి అమిత సంతోషాన్ని పొందాడు. ప్రద్యుమ్నుడు ఒకే సమయంలో అందరితో యుద్ధం చేశాడు. ఇలా రాత్రి గడిచింది. మూడువంతులు రాక్షసులు నశించారు. ప్రద్యుమ్నుడు యుద్ధం చేసే సమయంలో జయన్తుడు మందాకినీ నదిమీదికి వెళ్ళి సంధ్యావందన చేశాడు. జయంతుడు యుద్ధం చేసేటప్పుడు ప్రద్యుమ్నుడు ఆకాశగంగలో సంధ్యావందనం చేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
వజ్రనాభునితో ప్రద్యుమ్నుని యుద్ధం అను తొంభై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# తొంభై తొమ్మిదవ అధ్యాయము

## ప్రద్యుమ్నుడు వజ్రనాభుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత సూర్యుడు ఉదయించిన కొంచంసేపటికి గరుత్మంతునితో కృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు. ఆకాశంలో ఇంద్రుని దగ్గర నిలిచాడు. రాక్షసులకు భయం కలిగించే పాంచజన్యమనే శంఖాన్ని పూరించాడు. ఆ ధ్వనికి

ప్రద్యుమ్నుడక్కడకు వచ్చాడు. శ్రీకృష్ణుడు వజ్రనాభుని చంపు, త్వరగా, గరుత్మంతుని మీద వెళ్ళు అన్నాడు. అతడు దేవతాశ్రేష్ఠులైన వారిద్దరికీ నమస్కరించి మనోవేగంతో గరుత్మంతుని మీద వెళ్ళాడు. గరుత్మంతునిపై కూర్చుని ప్రద్యుమ్నుడు వజ్రనాభుని గదతో వక్షస్థలంమీద కొట్టాడు. ఆ దెబ్బకు వజ్రనాభుడు మూర్ఛపోయాడు. రక్తం కక్కుకొని స్మృతిలేనివాడయ్యాడు. ప్రద్యుమ్నుడు అతన్ని ఊరడించాడు.

తెప్పరిల్లి ప్రద్యుమ్నునితో ఓ యాదవ! కొనియాడదగిన పరాక్రమం కల వాడవు. ఓ బలశాలీ! నేను ఎదురుదెబ్బ కొడుతున్నాను. నిలు అని పలికి పెద్దగా గర్జించాడు. అనేకములైన ముళ్ళుగల గదను వేగంగా విసిరాడు. నుదుటిపై దెబ్బతిని ప్రద్యుమ్నుడు నెత్తురు కక్కుకుని మూర్ఛపోయాడు. అదిచూచి కృష్ణుడు పుత్రుని ఓదార్చే పాంచజన్యమనే శంఖం ధ్వనిని వినిపించాడు. పాంచజన్య ధ్వనికి తెప్పరిల్లిన ప్రద్యుమ్నుని చూచి అందరూ సంతోషించారు. యింద్ర, కేశవులును సంతోషించారు.

తరువాత కృష్ణుని అభిప్రాయ ప్రకారం ప్రవర్తించే చక్రాయుధం ప్రద్యుమ్నునిచే విడువబడి దేవేంద్రునకు, కృష్ణునకు నమస్కరించి వజ్రనాభుని శిరస్సును కత్తిరించింది. రాక్షసులందరూ చూస్తూనే ఉన్నారు. గదుడు, సునాభుని చంపాడు. సాంబుడు యుద్ధరంగంలోని రాక్షసులను వాడి బాణాలతో సంహరించాడు. నికుంభుడు వజ్రనాభుడు చావగానే నారాయణునకు భయపడి షట్పురానికి పోయాడు. శత్రువైన గొప్ప రాక్షసుడు వజ్రనాభుడు మరణించగా ఇంద్ర, కృష్ణులు వజ్రపురంలో అడుగుపెట్టారు.

భయపడిన బాలురను, వృద్ధులను ఓదార్చారు. ఇంద్రోపేంద్రులిద్దరూ ఆలోచించి, వజ్రనాభుని రాజ్యం నాలుగుభాగాలుగా విభజించి శ్రీకృష్ణ వంశీయులకు ముగ్గురకూ మూడుభాగాలు, ఇంద్రవంశానికి ఒకభాగం ఇచ్చిపట్టాభిషేకం చేశారు. నీవు మాటిమాటికీ వీళ్ళ రక్షణ విషయం చూస్తూండాలని ఇంద్రుడు జయంతునకు చెప్పాడు. యాదవులు స్వర్గానికి వస్తూపోతూ ఉండవచ్చు. ఐరావత శిశువును, ఉచ్చైశ్రవ శిశువును విశ్వకర్మ నిర్మించిన రథాన్నీ వీళ్ళకు ఇమ్ము అని ఈ విధంగా జయంతునికి చెప్పి ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళాడు.

శ్రీకృష్ణుడు ద్వారకానగరానికి వెళ్ళాడు. గద ప్రద్యుమ్న సాంబులు ఆరు మాసాలు అక్కడ ఉండి, రాజ్యం స్థిరపడిన తర్వాత ద్వారకకు వెళ్ళారు. నేటికీ ఆ రాజ్యాలు మేరు పర్వతంప్రక్కన, ఉత్తరదిక్కునా ఉన్నాయి. మునలయుద్ధంలో వృష్ణివంశీయులు స్వర్గస్థులుకాగా గద, ప్రద్యుమ్న, సాంబులు వజ్రపురానికి వెళ్ళారు. తరువాత తమ పుణ్యకర్మలచేత, శ్రీకృష్ణుని అనుగ్రహంచేతను స్వర్గానికి చేరారు. మహారాజా! ఈ విధంగా ప్రద్యుమ్నుని గొప్పతనం విస్తృతంగా నీకు చెప్పాను. ఈ కథను వినటంచేత కీర్తి, ఆయుస్సు, వంశవృద్ధి, సుఖం, ఆరోగ్యం, ధనసంపద ప్రాప్తిస్తుంది. శత్రువులు నశిస్తారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నుడు వజ్రనాభుని చంపుట అను తొంభై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూరవ అధ్యాయము

## విశ్వకర్మ ద్వారకాపుర నిర్మాణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు వజ్రపురమునుండి గరుడునిపై బయలుదేరి ద్వారకకు వచ్చాడు. గరుత్మంతునిపైనుండి ద్వారకానగరాన్ని చూచాడు. ఆ నగరం అమరావతిలా ఉంది. ఎల్లప్పుడూ ఆనందధ్వనులతో నలుదిశలు మార్మోగుతూ ఉన్నాయి. ఒకచోట మణిపర్వతం, ఇంకొకచోట స్నానయంత్రము, క్రీడాగృహము, దివ్యమైన ఉద్యానవనము, ఉపవనము, అనేక విశేషములతో ఆ నగరం ప్రకాశిస్తున్నది.

భగవంతుడక్కడ ప్రవేశించినప్పుడు ఇంద్రుడు విశ్వకర్మను పిలిచి ఓ శిల్పివర! నాకు ఇష్టమైన పని చెయ్యాలనుకుంటే శ్రీకృష్ణునికి సేవచెయ్యి. నీవు ద్వారకకు వెళ్ళు. ఆ పట్టణంలో లెక్కలేనన్ని ఉద్యానవనాలుండాలి. మా స్వర్గ పట్టణంతో సమానంగా తయారుచెయ్యి. మూడులోకాలలో ఉన్న శ్రేష్ఠవస్తువులను అక్కడ స్థాపిం చుము. శ్రీకృష్ణుడు మనందరి పనులకొరకు ఎల్లప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటాడు. భయానక యుద్ధాలలో సహాయం చేస్తాడు. కనుక త్వరగా వెళ్ళి నా ఆజ్ఞప్రకారం అన్నిపనులూ పూర్తిచెయ్యి అన్నాడు.

విశ్వకర్మ వెంటనే ద్వారకకు వెళ్ళి ఆ పట్టణాన్ని అమరావతివలె ప్రకాశించు నట్లు చేశాడు. విశ్వకర్మ అలంకరించిన పట్టణాన్ని చూచి అందులో నివసించటానికి శ్రీకృష్ణుడు సిద్ధపడ్డాడు. పట్టణానికి నలువైపులా పెద్దకందకా లున్నాయి. అక్కడ నీటిలో హంసలు మొదలైన పక్షులు, పద్మాలు మొదలైన పుష్పాలు ఎల్లప్పుడూ శోభ కలిగిస్తూ ఉంటాయి. నలువైపుల చెట్లగుంపు ఉంది. ఆ పట్టణానికి చుట్టునూ బంగారుప్రాకారం ఉంది.

ఇంద్రుని నందనవనం కుబేరుని చైత్రరథమనే ఉద్యానవనంతో సమానమైన ఉద్యానవనాలతో ద్వారకానగరము అమిత శోభ కలదై యున్నది. నగరం తూర్పు దిక్కున మణులతో, బంగారంతో నిర్మించబడిన వెలుపులిద్వారం, సుందరమైన రైవతకపర్వతం ఉన్నాయి. రైవతక పర్వతం మీద విచిత్రమైన రంగులు కల వనాలు న్నాయి. అన్ని ఋతువులలో పుట్టే అనేకవిధాలైన వృక్షాలున్నాయి. అనేక వనాలున్నాయి.

రైవతకపర్వత గుహలలో అనేక దేవతలు, గంధర్వులు ఉంటారు. ఒక మహా నది ద్వారకానగరంలో ప్రవహిస్తూ పట్టణానికి అలంకారంగా ఉంటుంది. అనేక దివ్యభవనాలున్నాయి. ఎత్తైన జండాలతో అమరావతి నగరంలా ప్రకాశిస్తూ ఉంటుంది. ఎనిమిదివేల రథాలు కలిగి ఎనిమిది ఆమడల వెడల్పు గలిగినది. ఆ నగరంలో స్త్రీలుకూడా యుద్ధం చేయగలవాళ్ళు.

ఇక యాదవుల సంగతి చెప్పేదేముంది? ఈ పట్టణంలోని యాదవుల యొక్క మహాభవనములను చూచి సంతోషించాడు. అచటి యిండ్లకు మెట్లు బంగారంతో మణులతో చేయబడ్డాయి. విశ్వకర్మ భగవంతుడైన శ్రీకృష్ణునకు నిర్మించిన భవనం నాలుగు ఆమడల దూరం వ్యాపించి ఉన్నది, వైశాల్యంకూడా అంతే. రుక్మిణీదేవి భవనం బంగారంతో తయారైనది, శ్రేష్టమైనది. సత్యభామ భవనం తెల్లని జండాలతో అలంకరింపబడినదియు, జాంబవతీ భవనం ఇతర భవనాల్ని ప్రకాశింప చేసే టట్లుంది.

భవనములనన్నిటి మధ్యలో మిక్కిలి మనోహరమైన మరొక భవనముంది. దానిపేరు 'సుమేరు'. గాంధారరాజు కుమార్తె 'గాంధారి' అందులో ఉంటుంది. మేరుపర్వతపు బంగారు శిఖరాన్ని విశ్వకర్మ ద్వారకలో ప్రతిష్టించాడు. దానిమీదనే శ్రీకృష్ణుడు పారిజాతవృక్షాన్ని స్థాపించాడు. ఆ నగరంలో అనేక పుష్కరిణులు,

సరస్సులు, పుష్పాలతో కన్నులపండవగా ఉంటాయి. ఆ పట్టణానికి బంగారు ప్రాకరమున్నది. ఆ నగరంలో ఏనుగుల గుంపులు, గోవులు, దున్నపోతులు నివసించుటకు ప్రత్యేకస్థానాలున్నాయి. గొప్ప పర్వతాలు, నదులు, సరస్సులు, వనములు, ఉపవనములు ఆ నగర శోభను ఇనుమడింపచేస్తూ ఉంటాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
విశ్వకర్మ ద్వారకాపుర నిర్మాణము అను నూరవ అధ్యాయము

☆☆☆

# నూట ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు ద్వారకలో ప్రవేశించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈ విధంగా శ్రీకృష్ణుడు ద్వారకాపుర శోభను చూస్తూ అనేక భవనములతో కూడిన తన భవనంవైపు చూపును ప్రసరింపచేశాడు. అతని యింటిలో వేలకొలది మణులతో తయారైన స్తంభాలుండటంచేత చీకటికి తావు లేదు. బంగారు అరుగులతో బంగారుభవనం మణులతో, పగడాలతో, వెండితో నిర్మించిన బంగారు వెలుపలిద్వారంచేత మిక్కిలి ప్రకాశిస్తున్నది ఆ భవనం. స్ఫటికములతో నిర్మింపబడిన స్తంభాలు, దిగుడుబావులు, మదించిన నెమళ్ళు, కోకిలలు కలిగి శోభిస్తున్నది.

అక్కడ విశ్వకర్మ నిర్మించిన క్రీడాపర్వతము ఉన్నది. ఇంద్రభవనంతో సమానమైన శ్రీకృష్ణుని ప్రాసాదము రెండుక్రోసులు పొడవుంది. అది తెల్లనిమేడ. గరుత్మంతునిపై కూర్చుని సంతోషంతో కృష్ణుడు శంఖం ఊదాడు. ఆ ధ్వనికి సముద్రాలు చలించాయి. ఆకాశమంతా ధ్వనించింది. అందరూ ఆశ్చర్యపడ్డారు. కుకుర, అంధక వంశీయులు శ్రీకృష్ణుని పాంచజన్య ధ్వనిని విని గరుడునిచూచి సంతోషించారు. పౌరులందరూ గరుడునిపైనున్న కృష్ణునిచూచి ఆనందపరవశులయ్యారు. తరువాత మంగళవాద్య ధ్వనులు పురవాసుల సింహనాదాలు మిన్నుముట్టాయి. మధుసూదను ని చూచి అందరూ వచ్చారు.

ఉగ్రసేనుడు శంఖముల యొక్క వాద్యములయొక్కధ్వనులతో వాసుదేవుని ముందుంచుకొని వసుదేవుని యింటిలో ప్రవేశించాడు. దేవకీదేవి ఆనందంతో

ఇళ్ళలో ఉపచారం చేసింది. రోహిణి, యశోద, ఆహుకునిస్త్రీలు శ్రీకృష్ణునికి ఆదరంతో ఉపచారాలు చేశారు. తరువాత కృష్ణుడు గరుత్మంతునితో తన నివాస భవనానికి వెళ్ళాడు. పక్షిరాజు గరుడుడు తన స్థానంలో నిలిచిఉన్నాడు. గరుత్మంతుని మీది నుంచి దిగి భగవంతుడు వచ్చిన యాదవులకందరకూ అభినందనలు తెలిపాడు. యాదవులకు పూజ చేశాడు.

బలరాముడు, ఆహుకుడు, గదాక్రూరులు, ప్రద్యుమ్నుడు మొదలగువారిచే ప్రతి పూజను స్వీకరించి శ్రీకృష్ణుడు తన యింటిలో ప్రవేశించాడు. శిఖరంతో కూడిన మణిపర్వతాన్ని, దానిమీద పారిజాతవృక్షాన్నీ, వృష్ణివంశీయుల ద్వారా ఇంటిలోపల చేర్పించాడు. తరువాత విశ్వకర్మ నిర్మించిన తన యింటికి వెళ్ళాడు. ఆ వృక్షాన్ని ఉత్తమస్థానమందుంచాడు.

తరువాత కృష్ణుడు బంధువులను వీడ్కొనే సమయంలో నరకాసురుడపహరించి తెచ్చిన వస్త్ర,భూషణ, దాసీజన, ధన. చంద్రహారాది వస్తువులను దానం చేశాడు. వసుదేవుడు, దేవకి మొదలైనవాళ్ళు అభినందనలు తెలియచేశారు. సత్యభామ పారిజాతం ప్రాప్తించటంచేత స్త్రీలందరిలో సౌభాగ్యవతిగా లెక్కింపబడింది. రుక్మిణీదేవి కుటుంబానికి యజమానురాలైంది. తక్కినస్త్రీలకు తగిన మేడలు అనేకవిధాలైన కానుకలను కృష్ణుడు ఇచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు ద్వారకలో ప్రవేశించుట అను నూట ఒకటవ అధ్యాయము

☆☆☆

# నూట రెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుని సభా ప్రవేశము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత శ్రీకృష్ణుడు గరుత్మంతుని సోదరునివలె గౌరవించి, అతనిని తన నివాసానికి వెళ్ళుటకు అనుమతిచ్చాడు. గరుడుడు నమస్కరించి ఆకాశంలో తనకిష్టమైనదిక్కుకు వెళ్ళాడు. అతని రెక్కలగాలికి సముద్రం క్షోభించింది. అతడు అక్కడనుండి తూర్పుదిక్కునందలి సముద్రానికి వెళ్ళాడు. అతడు వెళ్ళిన తరువాత భగవంతుడు శ్రీకృష్ణుడు తన తండ్రి వసుదేవుడు, రాజు ఉగ్ర

సేనుడు, బలరాముడు, సాత్యకి, గురువైన సాందీపని, బ్రాహ్మణశ్రేష్ఠుడైన గార్గ్యుడు, వృష్ణి, అంధక, భోజ వంశీయులైన యాదవులు, వీరందరితో కలిపి యుద్ధంలో సంపాదించిన రత్నరాసులను వాళ్ళకు సత్కారపూర్వకంగా అర్పించాడు.

రాక్షసులు చనిపోయిన పిమ్మట అంధక, వృష్ణివంశ యాదవులు ఆపదలేని వాళ్ళయ్యారు. భగవంతుడైన మధుసూదనుడు యుద్ధంలో జయించి కుశలంగా ద్వారకకు తిరిగివచ్చాడని ద్వారకాపురమంతటా సాటింపు జరిగింది. తరువాత మొట్టమొదట శ్రీకృష్ణుడు గురువైన సాందీపనికి పాదాభివందనం చేశాడు. తరువాత బలరామునకు, వృష్ణిరాజైన ఆహుకునికి, ఆనందబాష్పాలతో నిలుచున్న తండ్రి వసుదేవుడికీ వినయంతో నమస్కరించాడు. తరువాత పేరు పేరున యాదవుల వద్దకు వెళ్ళి నమస్కరించాడు. తరువాత వసుదేవుడు మొదలగు వాళ్ళందరూ సభాభవనంలోకి వెళ్ళారు.

అందరూ రత్నాలతో నిర్మించిన ఎత్తైన ఆసనాల మీద కూర్చున్నారు. అప్పుడు భగవంతు ని ఆజ్ఞప్రకారం యుద్ధంలో ప్రాప్తించిన ధనరాశి అంతా అక్కడ ఉంచ బడింది. యాదవుల సమ్మానాన్ని సూచిస్తూ దుందుభులు మ్రోగాయి. శ్రీకృష్ణబల రాములు ఒక బంగారు ఆసనం మీద కూర్చున్నారు. వాళ్ళకు ఎదురుగా ఉగ్రసేనుడు మొదలగు భోజవంశీయులు, వృష్ణివంశీయులు కూర్చున్నారు. అందరూ తమ తమ ఆసనాలమీద సుఖంగా కూర్చుని ఉండగా శ్రీకృష్ణుడు వాళ్ళందరితో ఇలా అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని సభా ప్రవేశము అను నూట రెండవ అధ్యాయము

☆☆☆

# నూట మూడవ అధ్యాయము

## నారదుడు శ్రీకృష్ణుని స్తుతించుట

పవిత్రమైన కీర్తిగల ఓ మహాత్ములారా! నేను మీ తపోబలంచేత పాపాత్ముడైన నరకాసురునిచంపి మణిపర్వతము పైనున్న స్త్రీలను నిర్బంధము లేనివాళ్ళనుగా చేసి మణిపర్వత శిఖరాన్ని ఇక్కడికి తీసుకురావటంలో సమర్థుడనయ్యాను. మనకు స్వాధీనమైన ఈ ధనరాశిని ఇక్కడకు తీసుకువచ్చాను. ఇప్పుడీ ధనరాశికి మీరే ప్రభువులు. తగినవిధంగా దీనిని ఉపయోగించండి.

ఈ మాటలువిని భోజ, వృష్ణి, అంధక వంశీయులైన యాదవులు గగుర్పొడిచిన శరీరాలు కలవాళ్ళయ్యారు. భగవంతునికి లెక్కలేనన్ని ధన్యవాదాలు చెపుతూ చేతులు జోడించి వాళ్ళు నీవు దేవతలకు సాధ్యంకాని పనిచేసి గొప్ప ధనరాశిని మాకు ఇస్తూ మమ్మల్ని పరిపాలిస్తున్నావు. ఇలా మాట్లాడటం నీ విషయంలో ఆశ్చర్యం ఏమికాదు. అన్నారు.

తరువాత యాదవుల యొక్క ఆహుకుని యొక్క భార్యలు, భగవంతుడైన వాసుదేవుని చూచుటకు వచ్చారు. దేవకి మొదలైన ఏడుగురు, రోహిణి అక్కడకు వచ్చి కృష్ణబలరాములు అక్కడ ఉండటం చూచారు. వాళ్ళను చూడటంతో కృష్ణ బలరాములు లేచి నిలుచున్నారు. ముందుకు నడిచి వాళ్ళిద్దరూ మొదట రోహిణికి తరువాత దేవకికి పాద నమస్కారం చేశారు. అప్పుడు దేవకీదేవి కృష్ణబలరాములతో కలిపి మిత్రావరుణలతో అదితివలె శోభించింది.

అదేసమయంలో శ్రీకృష్ణుని పెంచినట్టి యోగమాయరూపమైన యశోద బలరామకృష్ణుల ఎదుట వచ్చింది. ఆమె రాగానే కృష్ణుడు ప్రియమైన స్నేహితురాలిని వలె కుడిచేతితోను, బలరాముడు ఎడమచేతితోను పట్టుకొని తలను మూర్కొన్నారు. అక్కడకు యాదవ వృద్ధస్త్రీలు ఆమెను మహాలక్ష్మినిగా చూచి ఆమె తలపై అక్షతలు, పేలాలు, పువ్వులు, చల్లి తమ ఇళ్ళకు వెళ్ళారు. ఆసమయంలో అక్కడకు వెళ్ళిన యాదవులు భగవంతుని అద్భుతకార్యములను మెచ్చుకుంటూ తమతమ స్థానాలలో కూర్చున్నారు. శ్రీకృష్ణుడు కూడ ఆ యాదవులతో కలిసి ప్రకాశించాడు.

ఆ యాదవులు కూర్చుని అనేకవిధాలైన కథలను చెప్పుకుంటూ తన్మయులైయుండగా ఇంద్రుని ప్రేరణచే దేవర్షి నారుదుడు అక్కడకు వచ్చాడు. వెంటనే యాదవులందరూ లేచి నిలబడ్డారు. ఆయనకు పూజ చేశారు. నారదుడు శ్రీకృష్ణుని చేతిని తాకి ఉత్తమమైన ఆసనంమీద కూర్చున్నాడు.

తరువాత అక్కడ ఉన్న యాదవులను గూర్చి ఓ వీరులారా! ఇప్పుడు ఇంద్రుని ఆజ్ఞచే మీ వద్దకు వచ్చాను. ఓ రాజవర్యులారా! శ్రీకృష్ణుని పరాక్రమాన్ని చిన్నతనం నుంచి, అతడుచేసిన పనులను అట్లే బలరాముడు చేసిన పనులను చెపుతానని శటాసురభజనం మొదలు సమస్త ఘనకార్యాలను వినిపించాడు. ఇలాంటి ఘన కార్యాలను కేశవుడు తప్ప మరొకడెవడు చేయగలడు? పూర్వమెవ్వరివద్ద లేనంత ధనరాశిని మీకు తెచ్చి యిచ్చాడు. నరకాసురుని చంపి కుండలాలు తెచ్చాడు.

స్వర్గలోకంలో గొప్పకీర్తిని పొందాడు. శ్రీకృష్ణుని భుజబలాన్ని ఆశ్రయించి దుఃఖము, భయము, బాధలేనివారయ్యారు.

ఓ యాదవులారా! అనేకవిధములైన యాగాలు చెయ్యండి. దేవతలకు కృష్ణుడు ఘనకార్యం చేసిపెట్టాడు. ఈ ప్రియమైన విషయం మీకు చెపుతున్నాను. మీకు శుభమగుగాక! మీకిష్టమైన దానిని ఆలస్యంలేకుండా చేస్తాను, నేను మీవాడను, మీరు నావాళ్ళు, మీలో నేనున్నాను, అని చెపుతూ ఇంద్రుడు కృష్ణునికి ఇలా చెప్పాడు

లజ్జ ఉన్నచోట లక్ష్మి ఉంటుంది. లక్ష్మి ఉన్నచోట వినయం నివసిస్తుంది. మహాత్ముడైన నీయందు లజ్జ, నమ్రత, లక్ష్మి, మూడు కలిసిమెలసి ఉన్నాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
నారదుడు శ్రీకృష్ణుని స్తుతించుట అను నూట మూడవ అధ్యాయము

☆☆☆

# నూట నాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణుని పరాక్రమము

నారదుడిలా చెప్పాడు.

ఓ యాదవవీరులారా! 'మురొ' రాక్షసుని పాశాలను శ్రీకృష్ణుడే వ్యర్థంచేశాడు. ఇతడే 'నిసుంద' నరకాసురులను చంపి ప్రాగ్జ్యోతిషపుర మార్గాన్ని బాగుచేశాడు. ఇతని పాంచజన్య ధ్వనిని వినగానే శత్రురాజుల యొక్క హృదయాలు కంపిస్తాయి. రుక్మిణిని అపహరించి తెచ్చే సమయంలో రుక్మి మార్గమధ్యంలో అడ్డుతగిలినా అతనిని పీడించి రుక్మిణిని తన రథంమీద తీసుకువచ్చాడు.

జారూధీనగరంలో క్రథ, శిశుపాల, దంతవక్త్రాది వీరులు ఇతని చేతిలో ఓడిపోయారు. ఇంద్రద్యుమ్న, కాలయవన, సౌభపతి, సాల్వాదులు ఈతనిచే చంపబడ్డారు. చక్రాయుధంచేత వెయ్యి పర్వతాలను విసిరివైచి ద్యుమత్సేనుని సంహరించాడు. మహేంద్రపర్వతం శిఖరంమీద ఇరావతీనగరంలో 'గోపతి', 'తాలుకేతు'వులను చంపివేశాడు. ఇతని చూపుతో 'డింబో' 'హంస' పేర్లుగల రాక్షసులు భస్మమయ్యారు. ఇతడు కాశీనగరాన్ని భస్మం చేశాడు. కాశీనగరరాజును సంహరించాడు.

యుద్ధంలో మయుని జయించి, ఇంద్రసేనుని కుమారుని తీసుకువచ్చాడు. వరుణు ని జయించాడు. పారిజాత వృక్షాన్ని భూలోకానికి తెచ్చాడు. పండ్య, పౌండ్ర, కలింగ, మత్స్య, వంగరాజులను సంహరించి గాంధారి అనే కన్యను తీసుకు వచ్చాడు. అర్జునుని కుంతి ఎదుటనే జయించాడు. ద్రోణ, అశ్వత్థామ, కర్ణ, భీష్మ, సుయోధనులను యుద్ధంలో జయించాడు. సౌవీరరాజుకన్యను అపహరించి తెచ్చాడు. వేణుదారి కొరకు భూమండలాన్నంతనూ జయించాడు. పూర్వం బలి చక్రవర్తినుండి మూడులోకాలను తీసుకొన్నాడు. బాణాసురుడి తనచేతిలో పరా జయాన్ని చవిచూచాడు. అసిలోముడనేవానిని చంపాడు. జృంభ, రావణ, విరూపులనే వాళ్ళను చంపివేశాడు.

ఇలా కృష్ణుడు మనుష్యులలో ధర్మాన్ని స్థాపించి, అధిక దక్షిణలతో యజ్ఞాలు చేసి, తన స్థానం చేరుతాడు. అప్పుడు ద్వారక సముద్రంలో మునిగిపోతుంది. దేవతలలో కాని రాక్షసులలోకాని ఇంతటి సమర్థుడు లేడు. ఇతడే విష్ణువు, నారా యణుడు, సూర్యస్వరూపుడు, లోకానికి మేలుచేసి మరల తనలోకానికి వెళ్తాడు. జీవులతో క్రీడిస్తాడు. ఇతని మహిమ హద్దులేనిది, ఇతడు పరబ్రహ్మ స్వరూపుడు, వేదవ్యాసుడు దివ్యదృష్టితో చూచి కృష్ణబలరాముల చరిత్ర వర్ణించాడు. ఇంద్రుని ఆజ్ఞచే నారదుడు శ్రీకృష్ణుని ఈ విధంగా స్తుతించిన తరువాత యాదవులతనికి నమస్కారం చేశారు. తరువాత దేవర్షి నారదుడు వాళ్ళను వీడ్కొని దేవలోకానికి వెళ్ళాడు. తరువాత కృష్ణుడు జయించి తెచ్చిన సంపదను వృష్ణి, అంధక, యాదవు లకు పంచిపెట్టాడు. యాదవులు ఆ ధనం తీసుకొని అధిక దక్షిణలతో అనేక యజ్ఞాలు చేసి సుఖంగా ద్వారకానగరంలో నివసిస్తున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని పరాక్రమము అను నూట నాల్గవ అధ్యాయము

☆☆☆

# నూట ఐదవ అధ్యాయము

## శ్రీకృష్ణుని సంతానము

ఈ కథను విని జనమేజయుడు శ్రీకృష్ణునకు వెయ్యిమంది భార్యలలో ఎనిమిదిమంది ముఖ్యమైనవారుగా చెప్పబడ్డారు గదా! వాళ్ళకు పుట్టిన పుత్రుల యొక్క వృత్తాంతాన్ని వినగోరుచున్నాను దయతో చెప్పండి అని వైశంపాయనుని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

శ్రీకృష్ణుని ఎనిమిది రాణులు పుత్ర సంతానము కలవారే. ఆ పుత్రులందరూ వీరులు. రుక్మిణి, సత్యభామ, నాగ్నజాతి, సుదత్త, శైబ్య, లక్ష్మణ, చారుహాసిని, మిత్రవింద, కాలిన్ది, జాంబవతి, పౌరవి, మాద్రి, సుభీమ, వీళ్ళు ప్రధానరాణులు. వీళ్ళ పుత్రుల వృత్తాంతము చెపుతున్నా, విను.

వీరిలో రుక్మిణి శంబరాసురుని చంపిన ప్రద్యుమ్నుని కన్నది. రెండవకొడుకు చారుదేష్ణుడు, చారుభద్రుడు, చారుగర్భుడు, సుదేష్ణుడు, ద్రుముడు, సుషేణుడు, చారుగుప్తుడు, చారుబాహువు, చారువిందుడు ఈ పదిమంది పుత్రులు, చారుమతి అనే కన్యక వీరిని కన్నది. సత్యభామకు భానుడు, భీమరథుడు, క్షుపుడు, రోహితుడు, దీప్తిమంతుడు, జాలాన్తకుడు, తామ్రజాక్షుడు, ఈ ఏడుగురుపుత్రులు. భాను, భీమునిక, తామ్రపర్ణి, జలంధమ, అనే నలుగురు కన్యలు జన్మించారు. జాంబవతికి, సమరశోభి, సాంబుడు, మిత్రవంతుడు, మిత్రవిందుడు, మిత్ర బాహువు, సునోధుడు, ఈ పుత్రులూ, మిత్రవతీ అనే కన్యక జన్మించారు. నాగ్న జితికి భద్రాకారుడు, భద్రవిందుడు, అనే యిద్దరు పుత్రులు, భద్రవతీ అనే కన్య జన్మించారు.

సుదత్త, శైభ్య అనేవాళ్ళకు సంగ్రామజిత్తు, సేనజిత్తు, సపత్నజిత్తు అను నలుగురు పుత్రులు, సుభీమకు వృకాశ్వుడు, వృకనిర్వృతి, వృకదీప్తులు, జన్మించారు. లక్ష్మణకు గాత్రవంతుడు, గాత్రగుప్తుడు, గాత్రవిందుడు, అనే ముగ్గురు పుత్రులు, గాత్రవతి అనే కన్యక జన్మించారు. కాలిన్దికి అశ్రుతుడు, శ్రుత, సమ్మతుడు అనే ఇద్దరు పుత్రులు. ఈ యిద్దరిలో అశ్రుతుని శ్రుతసేన చేతికిచ్చి భగవంతుడు శ్రీకృష్ణుడు మనకు వీడు చాలాకాలం దాయాదడవుతాడు. అన్నాడు.

కృష్ణుని బృహతి అనే భార్యకు 'గదుడు', శైబ్యకు అంగదుడు, శ్వేతుడు, కుముదుడు, అను ముగ్గురు పుత్రులు, శ్వేత అనే కన్యక జన్మించారు. అగావ హకుడు, సుమిత్రుడు, శుచి, చిత్రరథుడు, చిత్రసేనుడు, వనస్తంబుడు, స్తంబుడు, స్తవనుడు, అనువాళ్ళు, 'సుదేవ' పుత్రులు. యేధిషిరి పుత్రుడు యుధిష్టిరుడు. తరువాత కపాలి, గరుడుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. వీళ్ళిద్దరూ విచిత్రంగా యుద్ధం చేసేవాళ్ళు. నేను చెప్పిన పుత్రులు కాక ఇతర పుత్రులు

చాలామంది ఉన్నారు. మొత్తం పుత్రులందరి సంఖ్య లక్ష ఎనభైవేలమంది. వాళ్ళలో అందరూ వీరులు, యుద్ధనైపుణ్యం కలవాళ్ళు.

ఈ విధంగా కృష్ణుని పుత్రుల వృత్తాంతం చెప్పాను. రుక్మవతీ, అనిరుద్ధుల పుత్రుడు అనిరుద్ధుడు. ఇతడు యుద్ధనైపుణ్యం కలవాడు, రేవతికి బలరాముని వలన 'నిశిర', ఉల్ముక, అనుపులు కలిగారు. సుతను, సుతార, అనే యిద్దరూ వసుదేవుని భార్యలు, సుతనుకు పౌండ్రకుడు, సుతారకు కపిలుడు జన్మించారు. పౌండ్రకు రాజ్యపాలన చేశాడు. కపిలుడు రాజ్యభోగాలను వదలి వనానికి వెళ్ళాడు.

వసుదేవుడికి శూద్రభార్య వలన 'జర' అనే పుత్రుడు జన్మించాడు. కాశ్య అను స్త్రీకి సాంబుడివల్ల సుపార్శ్వుడనే పుత్రుడు కలిగాడు. అనిరుద్ధుని పుత్రుడు సామవజ్రుడు. అతనికి ముందు వజ్రుడు పుట్టాడు. అతని కొడుకు ప్రతిరథుడు, అతని కుమారుడు 'సుబాహువు' అనమిత్రునికి శిని జన్మించాడు. శినికి సత్యవాక్కు, వత్యకుడు, అనే యిద్దరు పుత్రులు. సత్యవాక్కు పుత్రుడు యుయుధానుడు. ఇతని పుత్రుడు అసంగుడు, వీని పుత్రుడు మణి, వీని పుత్రుడు యుగంధరుడు, ఇతనితో ఈ వంశం పూర్తయిపోయింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుని సంతానము అను నూట ఐదవ అధ్యాయము

☆☆☆

# నూట ఆరవ అధ్యాయము

## శంబరుడు ప్రద్యుమ్నుని అపహరించుట

జనమేజయుడు ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! మొదట ప్రద్యుమ్నుడు శంబరాసురుని చంపినట్లు చెప్పారు. అతడు శంబరాసురుని ఎట్లు సంహరించాడు? ఈ విషయం దయతో చెప్పగోరుచున్నాను అని అడుగగా వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా!భగవంతుడైన కృష్ణునకు లక్ష్మీస్వరూపురాలైన భార్య రుక్మిణి. ఆమెకు శంబరాసురునకు శత్రువైన ప్రద్యుమ్నుడు జన్మించాడు. అతడు సాక్షాత్తు మన్మథుని అవతారం. అతడు పుట్టిన ఏడవరాత్రి శంబరాసురుడు పురిటినుండి

ఆ శిశువును అపహరించుకుపోయాడు. శ్రీకృష్ణునికి తెలిసినా అతన్ని చంపుటకు ప్రయత్నించలేదు.

ఆ పిల్లవానిని తీసుకొని అసురుడు తన పట్టణంలో ప్రవేశించాడు. అతనికి అందగత్తె అయిన మాయావతి అనే భార్య ఉంది. ఆమెకు సంతానం కలగలేదు. ఈ శిశువును తన పుత్రునిగా ఆ రాక్షసుడు భార్య చేతికిచ్చాడు. ఆ పిల్లవానిని చూచి ఆమె శరీరం అంతా గగుర్పాటు చెందింది. ఆ శిశువు ముఖాన్ని మాటి మాటికీ చూచింది. కొంతసేపటికి వెనుకటి జన్మలో తన భర్తయే ఈ శిశువని గుర్తు వచ్చింది. శంకరుడు కోపించి తన భర్తను శరీరంలేనివానినిగా చేశాడు. అతడే యీతడవటంచేత భార్యనైన నేను ఇతనికెలా పాలిస్తాను? పుత్రునిగా ఎలా పిలుస్తాను? అని ఆలోచిస్తూ ప్రద్యుమ్నుడిని దాదికి ఇచ్చింది. రసాయన ప్రయోగంచేత వెంటనే ఆ శిశువు పెద్దవాడయ్యాడు.

ప్రద్యుమ్నుడు దాదివలన విని మాయావతిని తల్లిగా తలచాడు. అతడు బాగా పెద్దవాడైన తరువాత అతనికి రాక్షసమాయలను నేర్పింది. అతడు అస్త్ర విద్యలో పండితుడు, స్త్రీలను మోహింపచేసే అందం గలవాడయ్యాడు. మాయావతి అతన్ని కామించింది. తన విలాసాలచేత మోహింపచేయసాగింది. అప్పుడు ప్రద్యుమ్నుడు తల్లివై యుండి ఇలా ప్రవర్తిస్తున్నావేమని అడిగాడు. నేను నీకు పుత్రుడనాకానా? వాస్తవం చెప్పమన్నాడు.

అప్పుడు కామంతో బాధపడుతూ నీవు నాకు పుత్రుడవు కావు. శంబరుడు నీకు తండ్రి కాడు. రుక్మిణీ కృష్ణుల పుత్రుడవు నువ్వు. పుట్టినేడోరోజున రాత్రి పురిటినుండి నా భర్త నిన్ను తెచ్చాడు. రుక్మిణీదేవి పిల్లవాడు కనపడక దుఃఖిస్తూ మిక్కిలి తపిస్తున్నది. ఇంద్రునికంటే గొప్పవాడగు నీ తండ్రి శ్రీకృష్ణుడు కూడా బాధపడుతున్నాడు. ఇక్కడకు నిన్ను తెచ్చినట్లు అతడెరుగడు. ఓ ప్రియుడా నీవు వృష్ణివంశీయుడవు కాని శంబర పుత్రుడవు కావు కాబట్టి నిన్ను కామిస్తున్నాను. నీవు నాకు పుట్టలేదు. నీ సౌందర్యంచూచి పరవశురాలనయ్యాను. నీవు నా కోరిక తీర్చుము. ఉన్న విషయమంతా నీకు చెప్పాను. అన్నది.

అప్పుడు మాయ తెలిసిన ప్రద్యుమ్నుడు కోపించాడు. శంబరాసురునితో ఓరీ! దురాత్మా! నీవు కృష్ణుని కుమారుని అపహరించావు, ఇప్పుడు నీ హృదయంలో భయం పుట్టిస్తాను. అని ఆలోచించి నా తీక్ష్ణమైన బాణాలతో ఇతని ధ్వజాన్ని ముక్కలు చేస్తానని తన పదునైన బాణాలతో ధ్వజాన్ని క్రింద పడవైచాడు.

శంబరాసురుడు కోపించి పుత్రులను పిలిచాడు. మీరు వెళ్ళి రుక్మిణి పుత్రుని చంపండి. అపకారియైన అతని ముఖం చూడబుద్ధి పుట్టటంలేదు అన్నాడు. తండ్రి ఆజ్ఞ వినడంతోనే చిత్రసేన, విశ్వక్సేన, గద, శ్రుతసేన, సుషేణ, సోమసేన, సేనాని, సైన్యహంత, సేనాహా, సైనిక, సేనస్కంధ, సేవక, జనక, సుత, వికల, శాంత, శాంతాంతకర, కుంభకేతు, సుదంష్ట్ర, కేశి మొదలగు పుత్రసమూహం చక్ర, తోమర, శూల, పట్టిస, పరశు, మొదలైన శస్త్రాస్త్రములను ధరించి మిక్కిలి కోపంతో ప్రద్యుమ్నుని నశింపచేయ్యాలని బయల్దేరారు. వారందరూ యుద్ధభూమికి వెళ్ళారు.

ఆ సమయంలో ప్రద్యుమ్నుడు రథంమీద కూర్చొని ధనుస్సు చేతపట్టుకొని యుద్ధరంగానికి వెళ్ళాడు. శంబరాసుర పుత్రులకు ప్రద్యుమ్నునకూ ఘోరయుద్ధం జరిగింది. దేవతలు మొదలగువారు విమానాలలో వచ్చి ఆ యుద్ధం చూచారు. అందులో ఒకగంధర్వుడు ఇంద్రునితో మహారాజా! ఒకప్రక్క శంబరాసురుని మూర్గురు పుత్రులు, రెండవవైపు ప్రద్యుమ్నుడొక్కడే అయ్యాడు. ఈసందర్భంలో ప్రద్యుమ్నుడెలా విజయం పొందగలడు? అన్నాడు. ఆమాటలు విని ఇంద్రుడు ప్రద్యుమ్నుని బలం వర్ణిస్తూ పూర్వం శివునినేత్రాగ్నికి భస్మమైన మన్మథుడే ప్రద్యుమ్నుడు. ఇతడు శ్రీకృష్ణునకు పుత్రుడుగా జన్మించి శంబరాసురుని చంపుతాడని మన్మథుని భార్యకు శంకరుడు చెప్పాడు. మన్మథుని భార్య మాయా వతిగా జన్మించి శంబరాసురునకు భార్య అయింది. ఇప్పుడు శంబరాసుర సంహారానికి సమయం వచ్చింది. కనుక ప్రద్యుమ్నుడు సపరివారంగా శంబరుని చంపి మాయావతితో ద్వారకకు వెళ్తాడు అని సమాధానం చెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శంబరుడు ప్రద్యుమ్నుని అపహరించుట అను నూట ఆరవ అధ్యాయము

☆☆☆

# నూట ఏడవ అధ్యాయము

## ప్రద్యుమ్నుడు శంబరుని సేనను వధించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత శంబరప్రద్యుమ్నులకు సంకులమైన యుద్ధం ప్రారంభ మయింది. రాక్షససమూహం మిక్కిలికోపంతో అనేకవిధాలైన ఆయుధాలను

ప్రయోగిస్తూ నలువైపులనుండి యుద్ధం చేశారు. ప్రద్యుమ్నుడుకూడ బాణవర్షం కురిపిస్తూ ఐదేసిబాణాలతో రాక్షసులయొక్క ఆయుధాలనన్నిటినీ ఖండించాడు. రాక్షసులు మిక్కిలికోపించి ప్రద్యుమ్నునిపై నలువైపులనుండి బాణవర్షం కురిపించారు. అప్పుడు ప్రద్యుమ్నుడు మరొక ధనుస్సు పట్టుకొని శంబరుని పదిమంది పుత్రులను సంహరించాడు. తరువాత కోపంతో భల్లాస్త్రంచేత చిత్రసేనుని తలను ఖండించాడు. తరువాత మిగిలిన రాక్షసులందరూ ఒక్క ఉమ్మడిగా అతనితో యుద్ధం చేశారు. వాళ్ళు బాణవర్షం కురిపిస్తూ అతని వైపు రాసాగారు. ప్రద్యుమ్నుడు తేలికగా తనబాణాలతో వందమంది రాక్షససోదరులనూ నేలగూల్చాడు. ఇంకా యుద్ధంమీద ఆసక్తితో యుద్ధరంగంలో నిలబడ్డాడు.

శంబరాసురుడు తన వందమంది పుత్రుల మరణంవల్ల మిక్కిలికోపించి సారథితో నాకు రథంతెమ్మని చెప్పాడు. సారథి నమస్కరించి వెంటనే రథాన్ని తెచ్చాడు. ఆ రథంమీద సింహం గుర్తుగల జెండా రెపరెపలాడుతోంది. ఆ రథం చూడటానికి చాలా అందంగా ఉంది. శంబరుడు బంగారు కవచం ధరించి బాణాలు, ధనుస్సు చేతపట్టుకొని యుద్ధభూమికి వచ్చాడు. అతనితోపాటు దుర్ధరుడు, కేతుమాలి, శత్రుహన్త, ప్రమర్దనుడు అను నలుగురు మంత్రులు, పదివేల ఏనుగులు, రెండువందల రథాలు, ఎనిమిదివేల గుర్రాలు, లక్షపదాతిబలం యుద్ధ భూమికి వచ్చాయి. అపశకునాలు చాలా కనిపించాయి. ఎడమకన్ను అదిరింది. ఎడమ బాహువు కంపించింది. కాకి నెత్తిమీద పడింది. ఆకాశం నెత్తురు కురిసింది. వేలాది తోకచుక్కలు పడ్డాయి. సారథి చేతిలోని కొరడా క్రిందపడింది. ఈ అపశకునాలను లెక్కచేయక శంబరుడు ప్రద్యుమ్నుని చంపాలని కోపంతో యుద్ధ భూమికి వెళ్ళాడు.

యుద్ధవాద్యాల ధ్వనికి భూమి కంపించింది. శంబరాసురుడు వెయ్యి బాణాలతో ప్రద్యుమ్నుని కొట్టాడు. ప్రద్యుమ్నుడు వాటినన్నిటినీ నేర్పుతో ఖండించాడు. ప్రద్యుమ్నుడు ధనుస్సుతో శరవర్షం కురిపించాడు. అతని బాణపుదెబ్బ తినని సైనికుడు లేడు. ప్రద్యుమ్నుని బాణవర్షానికి రాక్షససైన్యం వెన్నుచూపింది. తన సైన్యం పారిపోవుట చూచి శంబరుడు కోపించాడు. మంత్రులను ప్రద్యుమ్నుని చంపమని ఆజ్ఞ ఇచ్చాడు. మంత్రులాతని మాటను శిరసావహించి బాణవర్షం కురిపిస్తూ రథాలను త్వరగా తోలారు. ప్రద్యుమ్నుడు వాళ్ళనుచూచి ధనుస్సును

ఎక్కుపెట్టి ఎదురుగా నిలబడ్డాడు. ఇరవై అయిదు బాణాలతో దుర్ధరుని, కేతు మాలిని అరవైమూడు బాణాలతో, శత్రుహన్తను డెబ్బైబాణాలతో, ప్రమర్దనుణ్ణి ఎనభై రెండు బాణాలతోనూ ప్రద్యుమ్నుడు బాధించాడు. ఆ మంత్రులు ఒక్కొక్కడు అరవై అరవై బాణాలను ప్రద్యుమ్నుని పై విసరగా దగ్గరకు రాకుండగనే వాటిని ప్రద్యుమ్నుడు ఖండించాడు.

తరువాత అర్ధచంద్రాకార బాణంతో దుర్ధరుని సారథిని చంపాడు. తరువాత నాలుగు బాణాలతో గుర్రాలను, ఒక బాణంతో ధ్వజాన్ని, మరొకబాణంతో గొడుగును కూల్చివేశాడు. యుగచక్రాక్షుని అరవైబాణాలతో ఖండించాడు. తరువాత గ్రద్ధ ఈకలుగల బాణంతో దుర్ధరుడి హృదయాన్ని చీల్చాడు. అతడు మరణించి రథం నుండి క్రిందపడ్డాడు. తరువాత కేతుమాలి ప్రద్యుమ్నుని బాణాలతో ఎదుర్కొన్నాడు. నిలునిలు అని ఎదురువెళ్ళాడు. కృష్ణపుత్రుడు మిక్కిలి కోపించి బాణవర్షం కురిపించాడు. ఆ రాక్షసమంత్రి చక్రాన్ని ప్రద్యుమ్నునిపై ప్రయోగించాడు. ప్రద్యుమ్నుడు కూడ చక్రాన్ని ప్రయోగించాడు. ప్రద్యుమ్నుని చక్రం రాక్షసుని చక్రాన్ని ముక్కలుచేసి కేతుమాలి శిరస్సును అందరూ చూచు చుండగా ఖండించింది. అదిచూచి ఇంద్రుడు, దేవతలూ మిక్కిలి ఆశ్చర్యపడ్డారు. గంధర్వులు, అప్సరసలు పువ్వులు చల్లారు.

తరువాత శత్రుహంత. ప్రమర్దనుడు పెద్ద సైన్యంతో కామదేవుని వైపు పరుగెత్తారు. వాళ్ళు నలువైపుల నుండి అనేకములైన ఆయుధాలను ప్రయోగించారు. కృష్ణపుత్రుడు తన హస్తలాఘువాన్ని ప్రదర్శిస్తూ వాళ్ళ ఆయుధాల్ని అన్నిటినీ ఖండించాడు. వేలకొలది ఏనుగులను, వాటిపై కూర్చుని యుద్ధం చేసేవాళ్ళనూ సారథులతో సహా రథాల్నీ బాణాలతో కూలనేస్తూ యుద్ధం చేశాడు. దెబ్బతిననివాడు కనబడలేదు. ఇలా అన్ని సైన్యాల్నీ మథించాడు. రక్తం నదిగా ప్రవహించింది. ప్రద్యుమ్నుడు శత్రుహన్తను చంపుటకు ఒక "శక్తి" అనే ఆయుధాన్ని ప్రయోగించాడు అది శత్రుహన్త హృదయాన్ని బ్రద్దలుచేసి భయంకరమైన శబ్దం చేస్తూ భూమిపై పడింది. ఆ దెబ్బతో శత్రుహంత యొక్క శరీరం శిథిలమై రక్తం క్రక్కుతూ మరణించి నేలకూలాడు. శత్రుహన్త మరణించుటచూచి ప్రమర్దనుడు భయంకరమైన రోకలిని తీసుకొని నిలబడ్డాడు.

అతడు ప్రద్యుమ్నునితో ఓరీ! దుర్బుద్ధీ! సామాన్యులతో పనేముంది? నాతో యుద్ధంచెయ్యి. నీవు ఉండవు. నీవు వృష్ణివంశంలో పుట్టావు. మీ తండ్రి నాకు

శత్రువు. అతని కుమారుడవు నీవు. కాబట్టి మొదట నిన్ను చంపి తరువాత నీతండ్రిని చంపుతా. నీ తండ్రి మరణిస్తే దేవతలు నశిస్తారు. శత్రునాశనంవల్ల దైత్యులందరూ ఆనందంగా జీవనం సాగిస్తారు. నేడు నిన్ను చంపి నీరక్తంతో శంబరాసురుని చచ్చిన పుత్రులకు తర్పణంచేస్తా. నీతల్లి రుక్మిణి ఈవేళ నీ మరణంచేత దీనురాలుగా దుఃఖిస్తుంది. నీతండ్రి పుత్రదుఃఖం భరించలేక ప్రాణ త్యాగం చేస్తాడు. ఇలా పలు కుతూ ప్రమర్దనుడు పరిఘతో ప్రద్యుమ్నుని కొట్టాడు. దెబ్బతినిగూడ కృష్ణపుత్రుడు శత్రువు యొక్క రథాన్ని చూర్ణంచేశాడు. అప్పుడతడు రథంనుండి దూకి నేలపై నిలబడ్డాడు. కాముడు గదతో ప్రమర్దనుని మర్దించి సంహరించాడు. ప్రమర్దనుని మరణంచూచి భయపడి దానవసమూహం యుద్ధ భూమిని విడిచి పారిపోయింది. ఆ దానవసేన రక్తంతో తడిసిన వస్త్రాలుగలిగి జుట్టు విరబోసుకొని రజస్వల అయిన స్త్రీలాగ సంకోచాన్ని పొందింది. అక్కడ నిలవలేకపోయింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నుడు శంబరుని సేనను వధించుట అను నూట ఏడవ అధ్యాయము

☆☆☆

# నూట ఎనిమిదవ అధ్యాయము

## ప్రద్యుమ్నుడికి నారదుడు చెప్పిన సందేశం

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత శంబరుడు మిక్కిలి కోపించి సారథితో నీవు త్వరగా రథం తీసుకురా, శత్రువును నశింపచేస్తాను. అన్నాడు. సారథి వెంటనే బంగారు రథాన్ని తెచ్చాడు. ప్రద్యుమ్నుడు వస్తున్న రథాన్నిచూచి బంగారముతో అలంకరింప బడిన బాణం తీసి దానిని శంబరునిపై ప్రయోగించాడు. హృదయమందు దెబ్బతిన్న శంబరుడు స్మృతి తప్పి రథం ఆధారంగా ఒరిగాడు. వెంటనే తెప్పరిల్లి ధనుస్సు తీసుకొని ఏడు పదునైన బాణాలను ప్రద్యుమ్నునిపై విసిరి బాధించాడు.

ప్రద్యుమ్నుడు డెబ్బై బాణాలను శంబరునిపై ప్రయోగించాడు. మరల శరధారలు అంతటా వ్యాపించునట్లుగచేసి ఆకాశాన్ని అంధకారమయం చేశాడు. శంబరాసురుడు వైద్యుతాస్త్రంతో చీకటిని తొలగించి ప్రద్యుమ్నుని రథంపై బాణవర్షం కురిపించాడు. కృష్ణపుత్రుడు దానిని పదునైన బాణాలతో నశింపచేశాడు.

తరువాత శంబరుడు చెట్లవర్షం కురిపించాడు. ప్రద్యుమ్ను ఆగ్నేయాస్త్రంతో దానిని భస్మం చేశాడు.

తరువాత శంబరుడు తన మాయాబలంచేత సింహాలనూ, పెద్దపులులను, ఏనుగులను ఒంటెలను ప్రద్యుమ్నుని రథంపై మూగునట్లు చేశాడు. గాంధర్వాస్త్రం తో ప్రద్యుమ్నుడు ముక్కలుగా వాటిని ఖండించాడు. శంబరుడు మరొక మాయతో మావటివాళ్ళతో తోలబడే ఏనుగులగుంపును ప్రద్యుమ్నునిపైకి వస్తున్నట్లు చేశాడు. సింహమాయను సృష్టించి కృష్ణపుత్రుడు దానిని పారద్రోలాడు. తరువాత శంబరుడు మోహినీమాయను సృష్టించాడు. సంజ్ఞాస్త్రంతో ప్రద్యుమ్నుడు దాని ఆట కట్టించాడు.

అప్పుడు శంబరాసురుడు చిన్నవాడైననూ నన్నెదిరించి పోరుడు వీడిని ఎలా చంపటం? అని ఆలోచించి పూర్వం శివుడిచ్చిన పన్నగీమాయను ప్రయోగించాడు. ఆ మాయ రథాన్ని, సారథిని గుర్రాలనూ ప్రద్యుమ్నుని బంధించింది. అప్పుడు ప్రద్యుమ్నుడు గరుడుని మాయతో దానిని నశింపజేశాడు. దేవతలు అందరూ ప్రద్యుమ్నుని మెచ్చుకున్నారు. అప్పుడు అసురుడు తనకు పార్వతి పూర్వమిచ్చిన ముద్గరమనే ఆయుధాన్ని ప్రయోగిద్దామనుకున్నాడు. సర్వశత్రువినాశకరమైన ఆయుధం అది.

అప్పుడు ఇంద్రుడది కనిపెట్టి నారదునిద్వారా వైష్ణవాస్త్రాన్ని పంపాడు. ఛేదింపశక్యంకాని కవచాన్ని కూడా పంపాడు. నారదుడు వెంటనే వెళ్ళి కుమారా! ఇంద్రుడు నన్ను పంపాడు. నీవు పూర్వజన్మను తలుచుకో. పూర్వం శివునిచే భస్మం చేయబడి రుక్మిణీ గర్భమందు మళ్ళీ జన్మించావు. మాయావతి రతీదేవి, నీభార్య, నీవు వైష్ణవాస్త్రంతో శంబరుని చంపి మాయావతిని తీసుకొని ద్వారకా పురమునకు వెళ్ళు. ఈ వైష్ణవాస్త్రాన్ని, కవచాన్నీ తీసుకో. ఇంద్రుడు నీకు పంపాడు. మరొకమాట విను. ఈ ముద్గరమనే ఆయుధం పార్వతి ఇచ్చింది. దీనిని ఎవ్వరూ అడ్డగించలేరు. కాబట్టి ఆ అస్త్రం విఘాతంకోసం నీవు దేవిని తలుచుకో. ఆమెకు నమస్కరించి స్తోత్రం చెయ్యాలి అని చెప్పి నారదుడు ఇంద్రుడున్న చోటికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నుడికి నారదుడు చెప్పిన సందేశం అనునూట ఎనిమిదవఅధ్యాయము

☆☆☆

# నూట తొమ్మిదవ అధ్యాయము

## శంబరాసుర వధ- మాయావతి కలయిక

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత శంబరాసురుడు కోపించి భయంకరమైన ముద్గర ఆయుధాన్ని పట్టుకున్నాడు. అప్పుడు పన్నెండుగురు సూర్యులు ఉదయించారు. పర్వతాలు కదిలాయి, భూమి కంపించింది, సముద్రాలు క్షోభించాయి (కల్లోల మయ్యాయి) రక్తవర్షం కురిసింది. ఇలాంటి అపశకునాలనుచూచి ప్రద్యుమ్నుడు త్వరగా రథంనుండి దిగి చేతులు జోడించి పార్వతిని తలుచుకున్నాడు. శిరస్సుతో నమస్కరించి యీ విధంగా స్తోత్రం చేశాడు.

ఓం నమః :- కాత్యాయన్యై గిరీశాయై నమోనమః

శ్లో॥ నమస్తే లోక్యమాయాయై కాత్యాయన్యై నమోనమః।
నమ శ్శత్రువినాశిన్యై నమోగౌర్యై శివప్రియే॥
నమస్యే శుంభమథనీం నిశుంభ మథనీమపి।
కాలరాత్రి! నమస్తుభ్యం కౌమార్యైచ నమోనమః॥
కాంతారవాసినీందేవి నమస్యామి కృత్వాంజలిః।
వింధ్యాధివాసినిం దుర్గాం రణదుర్గాం రణప్రియామ్॥
నమస్యామి మహాదేవీం జయాంచ శత్రునాశినీమ్।
ఘంటాహస్తాం నమస్యామి, ఘంటామాలాకులాంతథా॥
అపరాజితాం నమస్యేహం అజితాం శత్రునాశినీమ్।
త్రిశూలినీం నమస్యామి మహిషాసురఘాతినీమ్॥
సింహాసనాం నమస్యామి సింహప్రవర కేతనామ్।
ఏకానంశాం నమస్యామి గాయత్రీం యజ్ఞసత్కృతామ్॥
సావిత్రీం చాపి విప్రాణాం నమస్యేహం కృతాంజలిః।
రక్షమాందేవి సతతం సంగ్రామే విజయంకురు॥

ఈ విధంగా కామునిచే స్తోత్రం చేయబడి సంతోషించినదై దేవి ఓ రుక్మిణీ నందన! వరం కోరుకో నా దర్శనం వ్యర్థం కాదు అని పలికింది. దేవి మాటలువిని గగుర్పొడిచిన శరీరంతో శిరస్సువంచి నమస్కరిస్తూ ఓ దేవీ! శత్రువు లందరినుండి జయం కోరుతున్నాను. శంబరునికి నీవిచ్చిన ముద్గరమనే ఆయుధం నా

శరీరాన్నితాకి పద్మాలమాల అగుగాక. అని ప్రద్యుమ్నుడు వరం కోరాడు. దేవి 'తథాస్తు' అని అంతరార్థం చెందింది.(కనపడలేదు)

ఇలా స్తోత్రం చేసి రథమెక్కాడు. శంబరుడు ముద్గరాన్ని త్రిప్పి ప్రద్యుమ్నుని వక్షస్థలం మీదికి విసిరాడు. అది మన్మథునివద్దకు వెళ్ళి పద్మాలమాలయై ప్రద్యుమ్నుని కంఠమందు ప్రకాశించింది. అప్పుడు సిద్ధులు, గంధర్వులు, మహర్షులు బాగుబాగని శ్రీకృష్ణపుత్రుని అభినందించారు. తరువాత వైష్ణవాస్త్రం పట్టుకొని ప్రద్యుమ్నుడు నేను రుక్మిణీ కేశవుల పుత్రుడనైతే ఓ అస్త్రమా! శంబరుని సంహరించు అని పలికి విసిరాడు. అది శంబరుని హృదయంచీల్చి భూమిపై పడ్డది.

ఈ విధంగా శంబరుడు మరణించగా దేవతలు గంధర్వులు సంతోషించారు. అప్సరసలు నాట్యం చేశారు. దేవేంద్రుడు సంతోషించి పుష్పవర్షం కురిపించాడు. దేవతలు శత్రువు నశించినందుకు ప్రద్యుమ్నుని స్తోత్రం చేశారు. ప్రద్యుమ్నుడు యుద్ధంవల్ల బడలికను పొందినవాడై తన నగరం వైపు ప్రయాణమయ్యాడు. త్వరగావెళ్ళి భార్యయైన రతీదేవిని చూచాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శంబరాసుర కథ- మాయావతి కలయిక అను నూట తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూట పదవ అధ్యాయము

## ప్రద్యుమ్నుడు మాయావతితో ద్వారకకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శంబరాసురుడు పరమ మాయావి, ప్రతాపవంతుడు కాని ఈ సమయాన అతని మాయ పనిచేయలేదు. అతడు అష్టమితిథియందు మరణించాడు. ప్రద్యుమ్నుడీవిధంగా ఋక్షవంతనగరంలో శంబరాసురుని చంపి మాయావతితో పాటు ఆకాశమార్గాన తండ్రి ప్రభావంచేత సురక్షితుడై ద్వారకాపురం చేరాడు. సుందరుడైన ప్రద్యుమ్నుడు మాయావతితో శ్రీకృష్ణుని అంతఃపురానికి వెళ్ళాడు. అతన్నిచూచి శ్రీకృష్ణుడు అంతఃపురస్త్రీల మనస్సులలో భయము, ఆశ్చర్యము, సంతోషమూ మూడు ఒకేసారి కలిగాయి. ఆ స్త్రీలు రతితో కూడిన మన్మథునివలె అతన్నిచూస్తూ ఆనందించారు.

రుక్మిణిదేవి దుఃఖిస్తూ సవతులతో కూడియున్నదై ఈవాడు వేకువజామున ఒకస్వప్నం చూచాను. భగవంతుడు శ్రీకృష్ణుడు నన్ను ఒడిలో పెట్టుకొని చంద్ర కిరణములవంటి ముత్యాలహారాన్ని నా కంఠానికి అలంకరించాడు. రెండవక్షణం లోనే ఒక సౌందర్యవతి నావైపు చూస్తూ చేతితో పద్మమాలను పట్టుకొని యింటిలోకి ప్రవేశించింది. ఆమె నన్ను స్నానం చేయించింది. నా తల మూర్కొని ఆ పుష్పమాల నాకిచ్చింది. ఇలా కలలో విషయాన్ని చెపుతూ సంతోషంతో కుమారుని మాటి మాటికీ చూస్తూ నేను ధన్యురాలను. అందగాడైన నా పుత్రుడు దీర్ఘాయువై యువకుడయ్యాడు.

మేఘంవలె నల్లనైన భార్యతో ఎందుకిక్కడకు వచ్చావు? నీవు నా పుత్రుడవే. విష్ణుపుత్రుడనే గుర్తులను బట్టి గ్రహించాను. చక్రంలేని జనార్దనుడవు నీవు. నారాయ ణుని ముఖమే నీది. అదే జుట్టు, కాళ్ళు, వక్షస్థలం, చేతులు బలరాముని వాటివలె ఉన్నాయి. వృష్ణివంశాన్ని ప్రకాశింపచేస్తున్న నీవెవడవు? ఆహా! నీశరీరం నారాయణ శరీరాన్ని పోలిఉన్నది ఇలా అంటూ ఉండగానే హఠాత్తుగా కృష్ణుడు వచ్చాడు. శంబరాసురుని వధనుగూర్చి నారదమహర్షిద్వారా విని మన్మథలక్షణాలుకల తన పెద్ద కొడుకును చూచాడు. కోడలు మాయావతినికూడ చూచాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు రుక్మిణీతో దేవి! ఇదుగో నీ కుమారుడు ధనుస్సు ధరించివచ్చాడు. అతడు శంబరా సురుని సంహరించాడు. ఈమె మన కుమారుని భార్య. మాయావతిగా ప్రసిద్ధి చెందింది. ఈమె నా పుత్రుని భార్య, నీకోడలు. ఈమెను ఇంట్లోకి తీసుకువెళ్ళు. చాలకాలం కనిపించని కుమారునికూడ లోపలకు తీసుకువెళ్ళు. శ్రీకృష్ణుని ఈమాటలు విని రుక్మిణీదేవి అమితానందం పొంది ఆహా! నేను ధన్యురాలను. వీరుడైన పుత్రుని చూడగలిగాను. నాకోరిక ఇప్పుడు ఫలించింది. ప్రియురాలితోకూడ చిరకాలం కనపడని నాపుత్రుడు నేడు కనబడ్డాడు. కుమారా! భార్యతో రా, ప్రవేశించు ఇంటిలో అన్నది. ప్రద్యుమ్నుడు గోవిందునకు, తల్లికి పాదాభివందనం చేసి మహాబలశాలియైన బలరాముని పూజించాడు. శ్రీకృష్ణుడు కుమారుని లేవదీసి కౌగలించుకొన్నాడు. రుక్మిణి కోడల్ని కౌగలించు కొన్నది. శచీదేవిని ఇంద్రుని అదితి వలె కోడలినీ కొడుకునూ ఇంట్లోకి తీసుకు వెళ్ళింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ప్రద్యుమ్నుడు మాయావతితో ద్వారకకు వెళ్ళుట అను నూట పదవ అధ్యాయము

☆☆☆

# నూట పదకొండవ అధ్యాయము

## ఆహ్నిక స్తోత్రము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈ ప్రసంగంలో బలరాముడు చెప్పిన ఆశ్చర్యకరమైన. రక్షారూపమైన ఆహ్నికమంత్రమును చెపుతున్నాను.

బలరాముడీ మంత్రం చెప్పిన తరువాత మహాత్ముడైన కృష్ణుడు, ధర్మాత్ము లైన మునులు, ఋషులు కూడా ఈ మంత్రాన్ని పఠించారు. సాయంకాలం ఈ మంత్రాన్ని జపంచేస్తే శరీరం పవిత్రమౌతుంది. ఒకప్పుడు రుక్మిణీ కుమారుడు ప్రద్యుమ్నుడు బలరాముని వద్దకు వెళ్ళి చేతులు జోడించి ఓ మహానుభావా! కృష్ణాగ్రజా! రోహిణీపుత్ర! ఎల్లప్పుడూ నిర్భయంగా ఉండటానికి ఏదైనా ఒక స్తోత్రం చెప్పండి అని అడిగాడు.

అప్పుడు బలరాముడు ఇలా చెప్పాడు.

శ్లో॥ సురాసురగురుర్బ్రహ్మా పాతు మాంజగతః పతిః
అథోంకారవషట్కారే సావిత్రీవిధయస్త్రయః॥
ఋచోయజూంషిసామాని ఛందాస్యాథర్వణానిచ
చత్వారస్త్వఖిలావేదాస్సరహస్యాస్సవిస్తరాః॥
పురాణమితిహాసశ్చఖిలాన్యుపఖిలానిచ
అంగాన్య పాంగానితథా వ్యాఖ్యాతానిచ పాయమామ్॥
పృథివీవాయురాకాశం ఆపోజ్యోతిశ్చ పంచమయమ్
ఇంద్రియాణిమనోబుద్ధి స్తథాసత్వం రజస్తమః॥
వ్యానోదానేసమానశ్చ ప్రాణోపానశ్చ పంచమః
వాయవస్సప్త చేవాన్యే యే ష్వాయత్తమిదంజగత్॥
మరీచిరంగిరా త్రిశ్చ పులస్త్యః పులహః క్రతుః
భృగుర్వసిష్ఠో భగవాన్ పాంతుతేమాం మహర్షయః॥
కశపాద్యాశ్చ మునయశ్చతుర్దశ దిశోదశ
నరనారాయణీ దేవే సగణే పాంతుమాం సదా॥

రుద్రాశ్చైకదశప్రోక్తా ఆదిత్యా ద్వాదశైవతు।
అష్టేచవసవో దేవా అశ్వినౌ ద్వౌప్రకీర్తితౌ॥
హ్రీః శ్రీ ర్లక్ష్మి స్స్వధా మేధా తుష్టిపుష్టి స్మృతిర్ధృతిః।
అదితిర్ద తిర్దనుశ్చైవ సింహికాదైత్యమాతరః॥
హిమవాన్ హేమకూటశ్చ నిషధః శ్వేతపర్వతః
ఋషభః పారియాత్రశ్చ వింధ్యో వైదూర్యపర్వతః॥
సహ్యోదయశ్చ మలయో మేరుమందర దర్దురాః
క్రౌంచకైలాస మైనాకాః పాంతుమాం ధరణీధరాః॥
శేషశ్చ వాసుకిశ్చైవ విశాలాక్షశ్చ తక్షకః
ఏలపాత్రః శుక్తి కర్ణః కంబలాశ్వతరా వుభే॥
హస్తిభద్రః పితరకః కర్కోటక ధనంజయే
తథా పూరణకశ్చైవ నాగశ్చ కరవీరకః॥
సుమనాస్యో దధిముఖ స్తథా శృంగారపిండకః
మణినాగశ్చ భగవాన్ త్రిషులోకేషు విశ్రుతః॥
నాగరాడధి కర్ణశ్చ తథా హారిద్రకో పరః
ఏతే చాన్యేచ బహవో యే చాన్యే నానుకీర్తితాః॥
భూధరా స్సత్యధర్మాణః మాంతు మాం భుజగేశ్వరాః
సముద్రాః పాంతు చత్వారో గంగాచ సరితాం వరా॥
సరస్వతీ చంద్రభాగా శతద్రుర్దేవికా శివా
ఇరావతీ విపాశాచ సరయూర్యమునా తథా॥
కల్మాషీచ రథోష్మాచ బాహుదాచ హిరణ్యదా
ప్లక్షా చేక్షుమతీచైవ స్రవన్తీచ బృహద్రథా॥
ఖ్యాతాచ ర్మణ్వతీచైవ పుణ్యాచైవ వధూసరా
ఏతాశ్చాన్యాశ్చ సరితో యాశ్చాన్యానానుకీర్తితాః॥
ఉత్తరా పథగామిన్య స్సలిలై స్స్నపయన్తు మామ్
వేణీ గోదావరీ సీతా కావేరీ కోంకణావతీ॥
కృష్ణా వేణా ముక్తిమతీ తమసా పుష్పవాహినీ
తామ్రపర్ణీ జ్యోతిరథా ఉత్పలో దుంబరావతీ॥

నదీ వైతరణీ పుణ్యా నదశ్శోణశ్చ విశ్రుతః
ఏతాశ్చాన్యాశ్చ వైనద్యో యాశ్చాన్యా నతుకీర్తితాః॥
దక్షిణాపథవాహిన్య స్సలిలై స్స్నాపయన్తు మామ్
క్షిప్రా చర్మణ్వతీ పుణ్యా మహీ శుభ్రవతీ తథా॥
సింధు ర్వేత్రవతీచైవ భోజాన్తా వనమాలికా
పూర్వభద్రా పరాభద్రా ఊర్మిలాచ వరద్రుమా॥
ఖ్యాతా వేత్రవతీచైవ చాపదా సీతిశ్రుతా
ప్రస్థావతీ కుండవదీ నదీపుణ్యా సరస్వతీ॥
చిత్రఘ్నీ చేందుమాలాచ తథా మధుమతీ నదీ
ఉమా గురువదీచైవ తాపీచ విమలోదకా॥
విమలా విమలోదాచ మత్తగంగా పయస్వినీ
ఏతాశ్చా న్యాశ్చవై నద్యో యాశ్చాన్యానానుకీర్తితాః॥
తా మాం సమభిషించంతు పశ్చిమా మాశ్రితాదిశమ్
భాగీరథీ పుణ్యజలా ప్రాచ్యాం దిశి సమాశ్రితా॥
సా వై దహతు మే పాపం కీర్తితా శంభునా ధృతా
ప్రభాసంచ ప్రయాగంచ నైమిషం పుష్కరాణిచ॥
గంగాతీర్థం కురుక్షేత్రం శ్రీకంఠం గౌతమాశ్రమమ్
రామహ్రదం వినశనం రామతీర్థం తథైవచ॥
గంగాద్వారం కనఖలం సోమో వై యత్రచోత్థితః
కపాలమోచనం తీర్థం జంబూమార్గంచ విశ్రుతమ్॥
సువర్ణబిందు విఖ్యాతం తథా కనకపింగలమ్
దశాశ్వమేధికంచైవ పుణ్యాశ్రమ విభూషితమ్॥
బదరీచైవ విఖ్యాతా నరాయణాశ్రమః
విఖ్యాతం ఫల్గునీతీర్థం తీర్థం చంద్రవటుం తథా॥
కోకాముఖం పుణ్యతమం గంగాసాగరమేవచ
మగధేషు తపోదశ్చ గంగో ద్భేదశ్చ విశ్రుతః॥
తీర్థాన్యేతాని పుణ్యాని సేవితాని మహర్షిభిః
సూకరం యోగమార్గంచ శ్వేతద్వీపం తథైవచ॥

బ్రహ్మాతీర్థం రామతీర్థం వాజిమేధ శతోపమమ్
ధారాసంపాత సంయుక్తా గంగా కిల్బిషనాశనీ॥
గంగా వైకుంఠకేదారం సూకరో ద్భేదనం పరమ్
మాం పాపమోచనం తీర్థం పునంత్వేతాని కిల్బిషాత్॥
ధర్మార్థ కామవిషయో యశఃప్రాప్తి శ్శమోదమః
వరుణశ్శోథ ధనదో యమో నియమ ఏవచ॥
కాలోనయస్సన్నతిశ్చ క్రోధో మోహః క్షమాధృతిః
విద్యుతో భ్రాణ్యథౌషధ్యః ప్రమోదోన్మాద విగ్రహాః॥
యక్షాః పిశాచా గన్ధర్వాః కిన్నరా స్సిద్ధచారణాః
నక్తంచరాః ఖేచరిణో దంష్ట్రిణః ప్రియవిగ్రహాః॥
లంబోదరాశ్చ బలినః పింగాక్షా విశ్వరూపిణః
మరుతస్సహ పర్జన్యాః కలా త్రుటిలవాః క్షణాః॥
నక్షత్రాణి గ్రహాశ్చైవ ఋతవశ్శిరాదయః
మాసాహో రాత్రయశ్చైవ సూర్యాచంద్రమసౌ తథా॥
ఆమోదాశ్చ ప్రమోదాశ్చ ప్రహర్ష శ్శోక ఏవచ
రజస్తమస్తప స్సత్యం శుద్ధిర్బుద్ధి ర్ధృతిశ్రుతిః॥
రుద్రాణీ భద్రకాళీచ భద్రా జ్యేష్ఠాతు వారుణీ
భాసేచ కాలికాచైవ శాండిలీచేతి విశ్రుతాః॥
ఆర్యా కుహూ శ్శినీవాలీ భీమా చిత్రరథీ రతిః
ఏకానంశాచ కూష్మాండా దేవీ కాత్యాయనీచ యా॥
లోహిత్యా జనమాతాచ దేవకన్యాస్తు యా స్స్మృతాః
గోనందా దేవపత్నీచ మాం రక్షన్తు సబాంధవమ్॥
నానాభరణవేషాశ్చ నానారూపాంకితాననాః
నానాదేశ విచారిణ్యో నానా శాస్త్రోపశోభితాః॥
మేదో మజ్జాప్రియాశ్చైవ మద్యమాంస వసాప్రియాః
మార్జారద్వీపి వక్త్రాశ్చ గజసింహ నిభాననాః॥
కంక వాయుగృధ్రాణాం క్రౌంచతుల్యాననా స్తథా
వ్యాలయజ్ఞోపవీతాశ్చ చర్మప్రావరణా స్తథా॥

క్షతజోక్షిత వక్త్రాశ్చ ఖరభేరీ సమస్వనాః
మత్సరాః క్రోధనాశ్చైవ ప్రాసాదా రుచిరాలయాః॥
మత్తోన్మత్త ప్రమత్తాశ్చ ప్రహరన్త్యశ్చధిష్ఠితాః
పింగాక్షాః పింగకేశాశ్చ తతో న్యాలూనమూర్ధజాః॥
ఊర్ధ్వకేశ్యః కృష్ణకేశ్యః శ్వేతకేశ్య స్తథాపరాః
నాగాయుత బలాశ్చైవ వాయువేగా స్తథాపరాః॥
ఏకహస్తా ఏకపాదా ఏకాక్షాః పింగలామతాః
బహుపుత్రాల్ప పుత్రాశ్చ ద్విపుత్రాః పుత్రమండికాః॥
ముఖమండీ చిడాలీచ పూతనా గంధపూతనా
శీతవాలోష్ణవేతాలీ రేవతీగ్రహ సంజ్ఞితాః॥
ప్రియహాస్యాః ప్రియక్రోధా ప్రియవాసాః ప్రియంవదాః
సుఖప్రదాశ్చా సుఖదాః సదా ద్విజజనప్రియాః॥
నక్తంచరా సుఖోదర్కాః సదాపర్వణి దారుణాః
మాతరో-మాతృవత్పుత్రం రక్షన్తు మమ నిత్యశః॥
పితామహ ముఖోద్భూతాః రౌద్రా రుద్రాంగసంభవాః
కుమారస్వేదజాశ్చైవ జ్వరాద్యై వైష్ణవాదయః॥
మహాభీమా మహావీర్యా దర్పోద్భూతా మహాబలాః
క్రోధనా క్రోధనాః క్రూరా స్సురవిగ్రహ కారిణః॥
నక్తంచరాః కేసరిణో దంష్ట్రిణః ప్రియవిగ్రహాః
లంబోదరాజఘనినః పింగాక్షా విశ్వరూపిణః॥
శక్త్యృష్టి శూల పరిఘ ప్రాసచర్మాసి పాణయః
పినాక వజ్ర ముసల బ్రహ్మదండాయుధ ప్రియాః॥
దండినః కుండినశ్చూరా జటామకుటధారిణః
వేదవేదాంగ కుశలా నిత్యయజ్ఞోపవీతినః॥
వ్యాలాపీడాః కుండలినో వీరాః కేయూరధారిణః
నానావసనసంవీతా శ్చిత్రమాల్యానులేపనాః॥
గజోష్ట్రాశ్వరక్ష మార్జార సింహవ్యాఘ్ర నిభాననాః
వరాహోలూక గోమాయు మృగాఖు మహిషాననాః॥

వామనా వికటాః కుబ్జాః కరాలాలూన మూర్ధజాః
సహస్రశతశ శ్చాన్యే సహస్రజటధారిణః॥
శ్వేతాః కైలాస సంకాశాఃకేచిద్దివకరప్రభాః
కేచిజ్జలదవర్ణాభా నీలాంజన చయోపమాః॥
ఏకద్విపాదాశ్చతథా ద్విశిర సోదరీ
నిర్మాంసా స్థూలజాంఘాశ్చ వ్యాదితాస్యా భయంకరాః॥
వాపీ తటాక కూపేషు సముద్రేషు సరస్సుచ
శ్మశాన శైల వృక్షేషు శూన్యాగార నివాసినః॥
ఏతే గ్రహాశ్చ సతతం రక్షన్తు మమ సర్వతః
మహాగణపతిర్నందీ మహాకాలో మహాబలః॥
మహేశ్వరో వైష్ణవశ్చ జ్వరేలోకభయావహే
గ్రామణీశ్చైవ గోపాలో భృంగిరిటీర్గణేశ్వరః॥
దేవశ్చ వామదేవశ్చ ఘంటాకర్ణః కరం ధమః
శ్వేతామోదః కపాలీచ జంభకశ్శత్రుతాపనః॥
మజ్జ నోన్యజ్జినే చోభే సంతాపన విలాపన్
నిజఘాసో ఘనశ్చైవ స్థూణాకర్ణః ప్రశోషణః॥
ఉల్కామాలీ ధమదమోజ్వాలా మాలీ ప్రమర్దనః
సంఘట్టన స్సంకటనః కాష్టభూతశ్మి వంకరః॥
కూష్మాండః కుంభమూర్ధాచరోచనోవైకృతోగ్రహః
అనికేతస్సురా రిఘ్న శివశ్చాశివ ఏవచ॥
క్షేమకః పిశితా శీచ సురారిర్హరి లోచనః
భీమకోగ్రా హకశ్చైవ తథైవోగ్రా మయోగ్రహః॥
ఉపగ్రహోర్య కశ్చైవ తథాస్కంధగ్రహో2పరః
చపలో సమవే తాస్తామసః సుమహాకపిః॥
హృదయోద్వర్తనశ్చండః కుండాశీ కంకణప్రియః
హరిశ్మశ్రుర్గరుత్మన్తో మనో మారుతరంహసః॥
పార్వత్యా రోష సంభూతాః సహస్రాణి శతానిచ
శక్తిమంతో ధృతిమంతో బ్రహ్మణ్యా స్సత్య సంగరాః॥

సర్వకామ సహస్రారో ద్విషతాంచ మృధేమ్మృధే
రాత్రావహని దుర్గేషు కీర్తితాస్సకలైర్గుణైః॥
తేషాం గణానాం పతయస్స గణాః పాంతు మాంసదా
నారదః పర్వతశ్చైవ గంధర్వాప్సరసాంగణాః॥
పితరః కారణం కార్యమాధయో వ్యాధయస్తదా
అగస్త్యో గాలవోగార్గ్యః శక్తిర్ధౌమ్యః పరాశరః॥
కృష్ణాత్రేయశ్చ భగవానసితో దేవలో బలః
బృహస్పతి రుతథ్యశ్చ మార్కండేయ శ్రుతశ్రవాః॥
ద్వైపాయనో విదర్భశ్చ జైమినిర్మాఠరః కఠః
విశ్వామిత్రో వసిష్ఠశ్చ లోమశశ్చ మహామునిః॥
ఉత్తంకశ్చై వరైభ్యశ్చ పౌలోమశ్చ ద్వితస్త్రితః
ఋషిస్త్రైకాలవ్యక్షీయో మునిర్మేధా తిథిస్తథా॥
సారస్వతో యవక్రీతిః కుశికో గౌతమస్తథా
సంవర్త ఋష్యశృంగశ్చ స్వస్త్యాత్రేయో విభాండకః॥
ఋచీకో జమదగ్నిశ్చ తథోర్వస్తపసాం నిధిః
భరద్వాజ స్థూలశిరాః కశ్యపః పులహః క్రతుః॥
బృహదగ్ని ర్హరి శ్మశ్రు ర్విజయః కణ్వ ఏవచ
వైతండీ దీర్ఘతాపశ్చ వేదగాథోంశుమాన్ శివః॥
శునశ్శేఫ శ్శునః పుచ్ఛః శునోలాంగూల ఏవచ
అష్టావక్రో దధీచిశ్చ శ్వేతకేతు స్తథైవచ॥
ఉద్దాలకః క్షీరపాణిః శృంగీ గౌరముఖ స్తథా
అగ్నివేశ్య శ్శమీకశ్చ ప్రముచు ర్ముముచు స్తథా॥
ఏతేచాన్యేచ ఋషయో బహవశ్శంసితవ్రతాః
మునయ శ్శంసితాత్మానో యే చాన్యేనానుకీర్తితాః॥
క్రతవః శ్లాఘినశ్శాన్తాః శాన్తి కుర్వన్తు మే సదా
త్రయోగ్నయ స్త్రయో వేదాస్త్రై విద్యా కౌస్తుభోమణిః॥
ఉచ్చైఃశ్రవా హయశ్శ్రీమాన్ వైద్యో ధన్వంతరిర్హరిః
అమృతంగౌ స్సుపర్ణశ్చ దధిగౌరాశ్చ సర్పపాః॥

శుక్లా స్సుమనసః కన్యాః శ్వేతచ్ఛత్రం యవాక్షతాః
దూర్వా హిరణ్యం గంధాశ్చ వాలవ్యజన మేవచ॥
తథా ప్రతిహతం చక్రం మహోక్షశ్చందనం విషమ్
శ్వేతోవృషః కరీమత్తః సింహో వ్యాఘ్రో హయోగిరిః॥
పృథివీ చోద్ధృతా లాజా బ్రాహ్మణా మధుపాయసమ్
స్వస్తికో వర్ధమానశ్చ నంద్యావర్తః ప్రియంగవః॥
శ్రీఫలం గోమయం మత్స్యో దుందుభిః పటహస్వనః
ఋషిపత్న్యశ్చ కన్యాశ్చ శ్రీమద్భద్రాసనం ధనుః॥
రోచనా రుచకశ్చైవ నదీనాం సంగమోదకమ్
సుపర్ణా శతపత్రాశ్చ చకోరా జీవజీవకాః॥
నందీముఖో మయూరశ్చ వజ్ర ముక్తామణీ ధ్వజాః
ఆయుధాని ప్రశస్తాని కార్యసిద్ధి కరాణిచ॥
పుణ్యంవై విగతక్లేశం శ్రీమద్వై మంగలాన్వితమ్
రామేణోదాహృతం పూర్వం ఆయుశ్శ్రీ జయకాంక్షిణా॥
య ఇదం శ్రావయే ద్విద్వాన్ తథైవ శృణుయాన్నరః
మంగళాష్టశతం స్నాతో జపన్పర్వణి పర్వణి॥
వధ బంధ పరిక్లేశం వ్యాధిశోక పరాభవమ్
నచ ప్రాప్నోతి వైకల్యం పరత్రేహచ శర్మదమ్॥
ధన్యం యశస్య మాయుష్యం పవిత్రం వేదసమ్మితమ్
శ్రీమత్ స్వర్గ్యం సదా పుణ్యమపత్య జననం శివమ్॥
శుభం క్షేమంకరం నృణాం మేధాజననముత్త ముత్తమమ్
సర్వరోగప్రశమనం సుకీర్తి కులవర్ధనమ్॥
శ్రద్ధధానో దయోపేతో యః పఠేదాత్మనా న్నరః
సర్వపాప విశుద్ధాత్మా లభతేచ శుభాం గతిమ్॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఆశ్చర్యక స్తోత్రము అను నూట పదకొండవ అధ్యాయము

★★★

# నూట పన్నెండవ అధ్యాయము

## ధన్యోపాఖ్యానము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శంబరాసురుడు ప్రద్యుమ్నుని దొంగిలించిన సమయంలోనే జాంబవతికి సాంబుడు జన్మించాడు. బలరాముడు సాంబుని చిన్నప్పటినుండీ శస్త్రవిద్యలో నిపుణుని చేశాడు. అందుచే వృష్ణివంశ యాదవులు సాంబుని రెండవ బలరామునిగా చెప్పుకొనేవాళ్ళు. సాంబుడు జన్మించిన తరువాత శ్రీకృష్ణుడు ఇంద్రునితో సమానంగా ద్వారకలో ఆనందంగా ఉన్నాడు. దేవేంద్రుడు ద్వారక వైభవంచూచి ఈర్ష్య కలవాడయ్యాడు. ఇతరరాజులు శ్రీకృష్ణునకు భయపడుతూ ఉన్నారు. కొంతకాలం గడిచాక హస్తినాపురంలో దుర్యోధనుని యజ్ఞంకొరకు అనేకదేశాల రాజులు ఒకచోట చేరారు. అక్కడ దూతలద్వారా భగవంతుడైన శ్రీకృష్ణుని ఐశ్వర్యం, సముద్రమధ్యంలో ద్వారకాపురం నిర్మించి సపరివారంగా అక్కడ ఉండటం విని అతనిని కలుసుకొనేందుకు అక్కడికి వెళ్ళసిద్ధమయ్యారు. ధృతరాష్ట్రపుత్రులైన దుర్యోధనాది వీరులు పాండవులు, ధృష్టద్యుమ్నుడు మొదలగురాజులు, ఇతర దేశాలకు సంబంధించిన రాజులు పద్దెనిమిది అక్షౌహిణీల సైన్యంతో శ్రీకృష్ణుని అతని బంధువులను చూడటానికి ద్వారకానగరం వచ్చారు.

శ్రీకృష్ణుడు వాళ్ళను చూడటానికి పెద్దలైన యాదవులతో పట్టణంవెలుపలకు వచ్చాడు. ఆ రాజులమధ్యలో శరత్కాల సూర్యునివలె ప్రకాశించాడు. వచ్చినవారిని తగినట్లు గౌరవించి బంగారుసింహాసనంపై కూర్చున్నాడు. ఆ రాజులు కూడ తగిన ఆసనాలపై కూర్చున్నారు. ఆ సమావేశము దేవతలతో కూడిన బ్రహ్మదేవుని సభవలె ఉంది. ఆ రాజులందరూ ఒకచోట చేరి ఏవేవో మాట్లాడుకొనుచున్నారు. శ్రీకృష్ణుడు వాళ్ళ మాటలు వింటూ కూర్చున్నాడు. ఆ సమయంలో ఒక్కసారిగా పెద్దగాలి వీచింది. మెరుపులు పిడుగులూ కూడ కనిపించాయి. ఆ వాతావరణాన్ని మార్చివేస్తూ వీణా పాణి నారదుడు అక్కడకు వచ్చాడు. ఆ సభలో దేవర్షి నారదుడు భగవంతుడగు శ్రీకృష్ణునితో ఓ పురుషోత్తమా! నీవు దేవతలకు ఆశ్చర్యం కలిగించే వాడవు. నీవు ధన్యుడవు. ఈ ప్రపంచంలో నీతో సమానుడులేడు అన్నాడు. శ్రీకృష్ణుడు చిరునవ్వుతో దక్షిణలచేతనే నేను ఆశ్చర్యం కలిగించేవాడినయ్యాను అన్నాడు. ధన్యుడను కూడ అయ్యాను అన్నాడు.

ఇప్పుడు మరేమీ చెప్పవద్దు. మంచిది. నేను వెళ్తాను అని బయలుదేరుతున్న నారదుని చూచి రాజులు శ్రీకృష్ణునితో చెప్పిన రహస్యమైన విషయం మాకు అర్థంకాలేదు. మీకు అభ్యంతరం లేకపోతే మేం వినగోరుతున్నాం అన్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు మీరు వినటంవల్ల నష్టమేమీ లేదు. నారదుడున్నాడుకదా అతడు మీకు స్పష్టంగా చెపుతాడు అని నారదునితో మునీంద్రా! ఇప్పుడు మనమిద్దరం మాట్లాడుకొన్న మాటల తాత్పర్యం ఈరాజులకు తెలియజేయండి అన్నాడు. దేవర్షి నారదుడు బంగారుపీఠం మీద కూర్చుని భగవంతుని మాహాత్మ్యాన్ని చెప్పటం ప్రారంభించాడు.

ఓ రాజులారా! మీప్రశ్నకు సమాధానం చెప్పుతున్నాను వినండి. నేను ఈ భగవంతుని మహిమను ఎలా అంతుచూచినదీ చెపుతా. ఒకప్పుడు నేను గంగానది ఒడ్డున ఉండి మూడుసార్లు స్నానంచేసే వ్రతాన్ని పాటిస్తున్నా. ఒకనాడు సూర్యోదయ సమయాన రెండు తలలు గలిగి రెండు క్రోసులు పొడవ, క్రోసు వెడల్పు, నాలుగు కాళ్ళు గల ఒక తాబేలును చూచాను. దానిని తాకి ఓ తాబేలా! నీ శరీరం మిక్కిలి ఆశ్చర్యంగా ఉంది కాబట్టి నీవు ధన్యురాలవు, నిర్భయంగా, స్వేచ్ఛగా సంచరిస్తున్నావు అన్నాను.

అప్పుడా తాబేలు మనిషి మాటలతో మునీంద్రా! నాలో ఆశ్చర్యమేముంది? ధన్యుడను కావటానికి? నదీరూపంగా ఉండే గంగానది ధన్యురాలు, ఆశ్చర్యకరమైనది. ఎందుకంటే దాని ఒడిలో నావంటి లెక్కలేనన్ని జీవులు సంచరిస్తున్నాయి అన్నది. అప్పుడు గంగానది వద్దకు వెళ్ళి ఓ నదీశ్రేష్ఠమా! నీవు ధన్యురాలవు, నీ నీటిలో విశాల శరీరంగల అనేక జీవులు సంచరిస్తున్నాయి కాబట్టి మునుల ఆశ్రమాలను రక్షిస్తూ సముద్రంలో కలుస్తున్నావు కనుక నీవు ధన్యురాలవు, ఆశ్చర్యకరమైన దానివి, అన్నాడు. గంగానది రూపాన్ని ధరించి నారదునితో మునిరాజా! నేను ధన్యురాలను, ఆశ్చర్యకరమైనదానిని కాను, అన్నిటికంటే ఆశ్చర్యకరమైనది ధన్యమైంది సముద్రం. దానిలో లక్షలకొలది నదులు కలుస్తున్నాయి. అన్నది.

తరువాత సముద్రం దగ్గరకు వెళ్ళి ఓ సముద్రమా! నీవు ఆశ్చర్యకరమైన దానవు, ధన్యమైనదానవు, నీవు నీటికి గనివి. అందుచేత నమస్కరింపబడతావు, పవిత్రమైన దానవు, నదులు భార్యలై నీలో కలుస్తాయి, కాబట్టి ధన్యత, ఆశ్చర్యం

నీలో ఉన్నాయి. అన్నాడు. అప్పుడు నీటినుండి సముద్రమూర్తి బయటకువచ్చి బ్రాహ్మణోత్తమా! ధన్యత, ఆశ్చర్యం నాకేమి లేవు. నిజానికి ఆశ్చర్యకరమైనది, ధన్యమైనది, ఈ భూమి. దీని మీద ఉన్నాను. లోకంలో భూమికంటే ఆశ్చర్యకర మైనది వేరొకటిలేదు అన్నది. అప్పుడు భూమిని నీవు చాలా ఓర్పుగలదానవు, స్వర్గంలో జనులకు నీ దయవల్లనే పనులన్నీ పూర్తవుతున్నాయి. కాబట్టి నీవు ధన్యురాలవు, ఆశ్చర్యమయురాలవు అన్నాను. అప్పుడు భూమి నేను ధన్యులను ఆశ్చర్యమయురాలను కాను, పర్వతాలది ధన్యత అన్నది భూమి. పర్వతాలనిలాగే పొగడితే అని బ్రహ్మర్షీ! మేము ధన్యులము కాము. ఆశ్చర్యమయులము కాము.

ప్రజాపతి, బ్రహ్మదేవుడు నువ్వు చెప్పిన లక్షణాలు కలవాడు అన్నారు. బ్రహ్మకు నమస్కరించి నీవే ధన్యత, ఆశ్చర్యము కలవాడవన్నాను. బ్రహ్మ నీవన్నది సమం జసం కాదు. నాలుగువేదాలూ నాకు ఆధారమైనవి నేను వాటికి ఆధారమైన వాడను అన్నాడు. ఆ వేదాలు యజ్ఞాలు గొప్పవన్నాడు. యజ్ఞాలు విష్ణువే ఆశ్చర్య మయుడు, ధన్యుడు అన్నాయి. ఆయనే మాకు ఆధారం అన్నాయి. యజ్ఞాలు ఆ మాటవిని భగవంతుని వెతుకుతూ భూమిలోనికి వచ్చాను. తరువాత ఆయన మీ సభలో విరాజిల్లుచున్నట్లు చూచాను. ఇందువల్ల నీవే ఆశ్చర్యమయుడవు, ధన్యుడవు అన్నాను. భగవంతుడు 'దక్షిణతో' అన్నాడు. ఓ రాజులారా! మీ ప్రశ్నకు సమాధానం చెప్పాను. ఇకనేను వెళ్ళి వస్తానన్నాడు. నారదుడు. నారదుడు వెళ్ళిన తరువాత రాజులు చాలా ఆశ్చర్యపోయారు. కొంచంసేపు ఉండి తరువాత తమ సేనలతో, వాహనాలతో తమ రాజధానులకు వెళ్ళారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ధన్యోపాఖ్యానము అను నూట పన్నెండవ అధ్యాయము

☆☆☆

# నూట పదమూడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు బ్రాహ్మణ బాలుని రక్షణకు అర్జునుని పంపుట

ఇంతవరకు విని జనమేజయ మహారాజు ఓ బ్రాహ్మణోత్తమా! జగత్పతి పురాణపురుషుడైన శ్రీకృష్ణుని చాలా చరిత్రలు విన్నాను. నాకు తృప్తి తీరలేదు. ఆ మహాత్ముని గొప్పతనాన్ని ఇంకా చెప్పండి. అని వైశంపాయనమహర్షిని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నేను వందసంవత్సరాలలో భగవంతుడైన కృష్ణుని మహాత్యాన్ని పూర్తిగా వినిపింపలేను. అయినా అతనికి సంబంధించిన ఆశ్చర్యకరమైన విషయం చెపుతా విను. అంపశయ్యమీద పరుండిన భీష్మపితామహుడు ప్రోత్సహించగా అర్జునుడు భగవంతుని మహత్యమును రాజసభలో కూర్చునియున్న తన పెద్దన్న ధర్మరాజుకు ఇలా చెప్పాడు.

ఒకమారు బంధువులను చూచుటకు ద్వారకకు వెళ్ళాను. అక్కడ యాదవుల గౌరవాన్ని పొందుతూ కొన్నాళ్ళున్నాను. అప్పుడు శ్రీకృష్ణుడు శాస్త్రప్రకారం ఏకాహ వ్రతదీక్ష పట్టాడు. ఆ సమయంలో ఒక బ్రాహ్మణుడు 'నన్ను రక్షించండి' అని పలుకుతూ అతని వద్దకు వచ్చాడు. ఓ ప్రభూ! రక్షణచేసే అధికారం మీకుంది. కాబట్టి మీరు నన్ను రక్షించాలి, రక్షించినవాడికి రక్షింపబడినవాడి పుణ్యంలో నాల్గవవంతు ప్రాప్తిస్తుంది అని పలికాడు.

శ్రీకృష్ణుడు ఓ బ్రాహ్మణోత్తమా! నేను నిన్ను రక్షిస్తాను. నీవు ఎవనినుండి భయపడుతున్నావు? నీకు అపకారం ఎవడు చేశాడో నిర్భయంగా చెప్పు నిన్ను రక్షించుట ఎంత కష్టమైనా పూర్తిచేస్తా అన్నాడు. బ్రాహ్మణుడు పరమాత్మా నాకు పుత్రుడు కలిగినవెంటనే అపహరింపబడుతున్నాడు. ఇప్పటికి మూడుమార్లు పుత్రులను కోల్పోయాను. నాల్గవపుత్రుని మీరు రక్షించాలి. నా భార్య ప్రసవించే సమయమయింది. కాబట్టి ఈ పుత్రుని మీరు రక్షించే ఉపాయం చూడండి.

బ్రాహ్మణుని మాటలనువిని కృష్ణుడు నాతో యజ్ఞదీక్షలో ఉన్నాను. ఎలాగైనా బ్రాహ్మణుని రక్షించటం తప్పనిసరిగా చేసి తీరాలి. అన్నాడు. భగవంతుని మాటలు విని నేను గోవిందా! ఈ పని నాకు వప్పచెప్పండి. నేను వెళ్ళి ఆ బ్రాహ్మణుని ఆపద తొలగిస్తాను. అనగా చిరునవ్వుతో ఈ పని చేయగలవా? అన్నాడు కృష్ణుడు. నేనా మాటవిని సిగ్గుపడ్డాను. నేను సిగ్గుపడుతున్నట్లు గ్రహించి నీవు ఈతన్ని రక్షించగలిగితే వెళ్ళు అన్నాడు. కృష్ణుడు వృష్ణివంశీయులు, అంధకవంశీయులైన యాదవులు నీకు సహాయంగా వస్తారు. కేవలం బలరాముడు, ప్రద్యుమ్నుడు నా వద్ద ఉంటారు అనికూడా చెప్పాడు. అప్పుడు పెద్దసైన్యాన్ని తీసుకొని బ్రాహ్మణుని వెంట నడిచాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు బ్రాహ్మణ బాలుని రక్షణకు అర్జునుని పంపుట నూట పదమూడవ అధ్యాయము

☆☆☆

# నూట పద్నాలుగు అధ్యాయము

## అర్జునుడు శ్రీకృష్ణునితో ఉత్తరదిక్కుకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఒక్కక్షణంలో ఆ బ్రాహ్మణుని గ్రామంచేరి వాహనాలకు విశ్రాంతినిచ్చి మకామున్నాం. నేను గ్రామం మధ్యలో ఉన్నాను. నావెంట పెద్దసైన్యముంది. కొద్ది క్షణాలలో పక్షులు, మృగాలూ క్రూరంగా అరిచాయి. సూర్యుడు కాంతి హీనుడయ్యాడు. తోకచుక్కలు కనపడ్డాయి. భూమి కంపించింది. ఈ అపశకునాలను చూచి జాగ్రత్తగా సిద్ధంగా ఉండండి అని తోటివారికి చెప్పాను. యుయుధానుడు మొదలైన మహారథులు సిద్ధంగా ఉన్నారు. నేనుకూడా జాగరూకుడనై ఉన్నాను. అర్ధరాత్రి అయింది. బ్రాహ్మణుడు భయపడుతూ మా దగ్గరకు వచ్చి భయంతో నా భార్య ప్రసవించే సమయమైంది. మీరు మోసం జరుగకుండా సిద్ధంగా ఉండండి అన్నాడు.

క్షణంలోనే శిశువు అపహరింపబడుతున్నది అన్నాడు. అపహరింపబడ్డది అనే దీనమైన ఏడ్పు వినిపించింది. తరువాత ఆకాశంలో అపహరింపబడుతున్న శిశువు ఏడ్పు వినిపించింది. రాక్షసుడు కనపడలేదు. అప్పుడు మేము బాణవర్షంతో అన్నిదిక్కులు మూసివేశాం. పిల్లవాడు మాత్రం అపహరింపబడ్డాడు. ఆ బ్రాహ్మణుని దీనధ్వని చేసి నన్ను కఠినంగా మాట్లాడాడు. వృష్ణివంశీయులు నిరాశపాలైయారు. నాకు స్మృతిలేదు, ఆ బ్రాహ్మణుడు రక్షిస్తానని చెప్పానేగాని రక్షించలేదు. ఓ దుర్బుద్ధీ! అసాధరణ బుద్ధిశ్రీమంతుడైన కృష్ణునితో నిత్యమూ పోటిపడతావు, గోవిందుడే ఇక్కడుంటే ఇటువంటి పని జరిగేదికాదు, రక్షించినవాడు నాల్గవవంతు పుణ్యాన్ని పొందినట్లే, రక్షించనివాడు పాపంలో నాల్గవవంతు పొందుతాడు, మూఢుడా! రక్షిస్తాను అన్నావు, రక్షించలేకపోయావు. నీయీ గాండీవమనే ధనుస్సు వ్యర్థం.

నీ పరాక్రమం, కీర్తి వ్యర్థమైనవి, అని ఘాటుగా తిట్టాడు. ఏమీ మాట్లాడక అక్కడనుండి బయల్దేరివచ్చాను. నాతో వృష్ణి అంధక వంశీయులుకూడా వచ్చారు. శ్రీకృష్ణుని చూచి సిగ్గుపడి, దుఃఖంతో తపించుతున్న నన్ను గోవిందుడు బుజ్జ

గించాడు. ఆ బ్రాహ్మణుడు సిగ్గుపడిన నన్నుచూచి కృష్ణుని ఎదుట నిందిస్తూ ఇతని మూర్ఖత చూడండి నేను ఈ నపుంసకుని ఆత్మస్తుతిని నమ్మాను. ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, బలరాముడు, శ్రీకృష్ణుడు రక్షించలేకపోతే మరొక డెవడు రక్షించేవాడు? ఇతని గర్జించటాన్ని ఆత్మస్తుతి చేసుకునే వీని ధనుస్సును నిందిస్తున్నాను. ఈ మూర్ఖుడు విధివిధానము తెలియ శక్యంకాని ఈ పని చేయటానికి ముందుకు వచ్చాడు.

ఆ బ్రహ్మర్షి ఈ విధంగా తిడుతుంటే వైష్ణవవిద్య నవలంబించి యముడుండే సంయమనీ నగరానికి శ్రీకృష్ణుడు వెళ్ళాడు. అక్కడ బ్రాహ్మణ పుత్రుడు కనపడక అమరావతికి అగ్నిదిక్కుకు, నైఋతికి ఉత్తరదిక్కుకు, పడమరదిక్కుకూ, పాతాళానికీ ఇతరస్థలాలికి కూడా వెళ్ళాడు. ఎక్కడా బ్రాహ్మణ బాలకుడు కనపడలేదు. తన ప్రతిజ్ఞ వీగిపోయిందని అగ్నిప్రవేశం చేయబోగా అర్జునుని కృష్ణుడు, ప్రద్యుమ్నుడు నివారించారు. నీవు బాధపడవద్దు, బ్రాహ్మణబాలకుని నేనే తీసుకుని వస్తా. దీనివల్ల నీకు ప్రపంచంలో గొప్ప కీర్తి ప్రాప్తిస్తుంది అని పలికి ప్రేమతో నన్ను ఊరడించి ఆ బ్రాహ్మణుని కూడా ఊరడించి గుర్రాలను కట్టి నా రథం సిద్ధం చెయ్యి అని కృష్ణుడు సారథిని ఆజ్ఞాపించాడు. ఆ బ్రాహ్మణుని రథంమీద కూర్చొనబెట్టి నన్ను (అర్జునుని) రథం తోలమని సారథిని వెళ్ళమన్నాడు. ఈ విధంగా కృష్ణుడు బ్రాహ్మణుడు నేను ముగ్గురం రథంమీద ఉత్తరంగా ప్రయాణించాం.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
అర్జునుడు శ్రీకృష్ణునితో ఉత్తరదిక్కుకు వెళ్ళుట అను నూట పద్నాలుగవ అధ్యాయము

☆☆☆

# నూట పదిహేనవ అధ్యాయము

## బ్రాహ్మణ బాలకుని తెచ్చుట

తరువాత పర్వత సమూహాలను, నదులను, వనాలను దాటి సముద్రాన్ని చూచాను. సముద్రుడు జనార్దుని పూజించి లేచి నిలబడి ఏం చెయ్యమంటారు అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు నీవు నా రథానికి మార్గమివ్వాలి అన్నాడు. అప్పుడు సముద్రుడు ఇలా అడక్కు, ఇతరుడు కూడా ఇలా వెళ్తానంటాడు, నీవే

వన్నిలా అగాధంగా ఉంచావు, కనుక ఆలోచించి తగినట్టు చేయుము అన్నాడు. ఒక బ్రాహ్మణుని కొరకు, నా కొరకు మాత్రమే ఇలాచెయ్యి. మరొకడెవడూ నిన్ను బెదిరించడు అని కృష్ణుడన్నాడు.

అప్పుడు సముద్రుడు శాపమిస్తావేమో అని భయపడుతున్నాను, సరే ఇలాగే అగుగాక, నీటిని ఇంకింపచేస్తాను. ఆ మార్గాన నీవు వెళ్ళగలవు, జెండాతో, సారథితో కూడిన రథం వెళ్ళవచ్చు. అన్నాడు. నీవు ఇంకవని వరమిదివరకు ఇచ్చాను కనుక నీటిని స్తంభింపచేస్తే నేను రథంమీద వెళ్తాను అని శ్రీకృష్ణుడన్నాడు. సముద్రుడలాగే అనగా నీటిమీదుగా వెళ్ళాం. తరువాత ఉత్తర, కురుదేశములను, గంధమాదన పర్వతాలన్నీ దాటివెళ్ళాం. తరువాత కృష్ణుని వద్దకు ఏడుపర్వతాలు వచ్చాయి. అవి స్తోత్రంచేసి గోవిందుని ఏం చెయ్యమంటావు? అని అడిగాయి. శ్రీకృష్ణుడు మీకు రంధ్రమేర్పడి నాకు రథమార్గాన్ని యివ్వాలి అన్నాడు.

ఆ పర్వతాలు అట్లే అని మార్గమిచ్చాయి. తరువాత రథం అడ్డులేకుండా సముద్రాలతో కూడినఏడు దీవులను, ఏడుపర్వతాలను లోకాలోక పర్వతాన్నికూడా దాటి కటికచీకటిలో ప్రవేశించాం. తరువాత గుర్రాలు ఆ చీకటిలో ఆగిపోయాయి. అప్పుడు గోవిందుడు తనచక్రంచేత చీకటిని చీల్చి ఆకాశాన్ని రథమార్గాన్ని కని పింపచేశాడు. ఆ చీకటిని దాటాక నాభయం పోయింది. అప్పుడు ఆకాశమార్గంలో పురుష శరీర రూపం ధరించి దిక్కుల చివరవరకు వ్యాపించిన తేజోరాశి కని పించింది. దానినిచూచి భగవంతుడు రథంనుండి దిగాడు. ఆ తేజోరాశిలో లీన మయ్యాడు. ఇక రథంమీద నేను ఆ బ్రాహ్మణుడు ఇద్దరమే ఉన్నాం.

కొంచం సమయం తరువాత భగవంతుడు తనతో నలుగురు బ్రాహ్మణ బాలకులను తెచ్చాడు. తేజోరాశినుండి బయటకు వచ్చి రథం ఎక్కాడు. ఆ నలుగురు పిల్లలను ఆ బ్రాహ్మణుడికి ఇచ్చాడు. కుమారులను సంపాదించుకొన్న బ్రాహ్మణుని ఆనందానికి అవధుల్లేవు. భగవంతుని కార్యకలాపం చూచి నేను ఆశ్చర్యపడి నన్ను నేను మరచిపోయాను. వెంటనే అమితమైన ఆనందం కూడా కలిగింది. తరువాత మమ్మల్ని, ఆ బ్రాహ్మణుని, అతని పిల్లలను వెంటబెట్టుకొని మధ్యాహ్నం దాటకుండా భగవంతుడు ద్వారకాపురంలో ప్రవేశించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి విష్ణుపర్వంలో
బ్రాహ్మణ బాలకుని తెచ్చుట అను నూట పదిహేనవ అధ్యాయము

☆☆☆

# నూట పదహారవ అధ్యాయము

## శ్రీకృష్ణార్జున సంవాదము

తరువాత భగవంతుడైన శ్రీకృష్ణుడు ఋషులతో సమానులైన లక్ష బ్రాహ్మణులకు భోజనం పెట్టి వృష్ణిభోజులతో, నాతో కలిసి భోజనంచేసి విచిత్రములైన దివ్యకథలను చెప్పాడు. కథలు పూర్తయ్యాక నేను జనార్దనునిచేరి నేను చూచిన వాటిని గూర్చి అడిగాను. పద్మములవంటి నేత్రాలు కలవాడా! సముద్రాన్ని ఎలా స్తంభింపచేశావు? పర్వతాలకు రంధ్రం ఎలా చేయబడింది? ఘోరమైన చీకటిని చక్రంతో ఎలా చీల్చివేశావు? ఆ మహాతేజస్సును ఎలా ప్రవేశించావు? ఆ పిల్లలు ఎందుకపహరింపబడ్డారు? దీర్ఘమైన మార్గం ఎలా తక్కువదిగా చేయబడింది? స్వల్పకాలంలో వెళ్ళిరావటం ఎలా సాధ్యమయింది? ఇదంతా ఉన్నదున్నట్లు నాకు వివరించుము అని శ్రీకృష్ణుని అడిగాను.

వాసుదేవుడిలా చెప్పాడు.

నా దర్శనంకోసమే పిల్లల్ని అపహరించాడు మహాత్ముడు. బ్రాహ్మణుని కోసం వస్తాడు కాని వేరే కారణంచేత కృష్ణుడు రాడని బ్రాహ్మణబాలకులను అపహరించటం జరిగింది. దివ్యమైన మహాతేజస్సు, బ్రహ్మతేజోమయము. నేనే ఆ మహాతేజస్సు. అది సనాతనమైన పరమప్రకృతి, అది వ్యక్తము, అవ్యక్తము అయి యున్నది. ఆ పరప్రకృతిని ప్రవేశించిన యోగులు మోక్షము పొందినవాళ్ళు. సాంఖ్యులకు, యోగులకు అదియే గతి.

సమస్త జగత్తును విభజించే పరబ్రహ్మ స్థానమిదియే. నన్ను ఆ తేజస్సునుగా తెలుసుకో. సముద్రాన్ని నేనే స్తంభింపచేశాను. ఆ ఏడుపర్వతాలు నేనే. గాఢాంధకారాన్ని నేనే తొలగించినవాణ్ణి నేను కాలస్వరూపుడను, సనాతనధర్మ స్వరూపుడను. నాలుగుదిక్కులూ నా స్వరూపాలే. నాలుగు వర్ణాలూ, నాలుగు ఆశ్రమాలూ నేనే సృష్టించాను. చంద్రుడు, సూర్యుడు, పర్వతాలు, నదులు, నా స్వరూపాలే. అవి.

నేనే నీకు నమస్కారం చేస్తున్నాను. నేను నిన్ను తెలుసుకోవాలని ఆసక్తి కలిగిఉన్నాను. అని పలుకగా వాసుదేవుడు, బ్రహ్మబ్రాహ్మణులు తపస్సు, సత్యము నేనే అని తెలుసుకో, నీకు నేను ప్రియుడను, నీవు నాకు ప్రియుడవు. కనుక చెపుతున్నాను. యజుర్వేదం మంత్రాలు, సామవేదము, ఋగ్వేదము,

అధర్వవేదము, ఋషులు, దేవతలు, యజ్ఞాలు, నా తేజస్సే, భూమి, ఆకాశము, వాయువు, నీరు, జ్యోతిస్సు, చంద్రసూర్యులు, అహోరాత్రములు, పక్షాలు, మాసాలు, ఋతువులు, ముహూర్తాది రూపమైన కాలము, శాస్త్రములు, విద్యలు, నానుండి పుడుతున్నాయి. సృష్టి, ప్రళయం, నా స్వరూపమే, సత్తు, అసత్తు, సదసత్తు, సర్వము నేనే. అని చెప్పాడు. శ్రీకృష్ణుడు నాపై ప్రేమతో ఇలా చెప్పాడు.

నా మనస్సు నిత్యము అతని మీదనే ఉంటుంది. కేశవునియొక్క మహాత్మ్యం ఈ విధంగా నేను విన్నాను, చూచాను. ఇదివిని ధర్మరాజు గోవిందుని పూజించాడు. సోదరులు తాను ఆశ్చర్యభరితులయ్యారు. అచట కూర్చున్న రాజులు కూడా ఆశ్చర్యపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణార్జున సంవాదము అను నూట పదహారవ అధ్యాయము

☆☆☆

# నూట పదిహేడవ అధ్యాయము

## శ్రీకృష్ణ మహిమ

జనమేజయుడు ఓ బ్రాహ్మణోత్తమా! యదుసింహుడైన శ్రీకృష్ణునియొక్క అమితమైన పనులను ఇంకా వినాలనిపిస్తున్నది. అతనిపనులు, అద్భుతమైనవి, లెక్కకందనివి, ఆ మహాత్ముని పనులను విని తృప్తి చెందేవరకూ చెప్పవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అని వైశంపాయన మహర్షిని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓ మహారాజా! నేను అనేకములైన ఆశ్చర్యం కలిగించే చరిత్రలను నీకు వినిపించాను. పూర్తిగా భగవంతుని గుణాలను కాని ఘనకార్యాలను కానీ చెప్పటం నాకు సాధ్యంకాదు. నాకు తెలిసినంతవరకు చెపుతాను విను. నీవు సావధానంగా విను.

శ్రీకృష్ణుడు ద్వారకలో ఉంటుండగా మహాత్ములైన రాజులయొక్క అనేక రాష్ట్రాలు కల్లోలమైనాయి. విచిత్రకుడనే యాదవులలో లోపాలను వెతికేవాడు అతన్ని భగవంతుడు సంహరించాడు. తరువాత ప్రాగ్జోతిష్యపురం వెళ్ళి నరకాసురుని చంపాడు. యుద్ధరంగంలో ఇంద్రుని జయించి పారిజాతవృక్షాన్ని

తెచ్చాడు. వరుణదేవుని లోహితహ్రదమనే ఒకచోట ఓడించాడు. దక్షిణాపథంలో దంతవక్త్రుని సంహరించాడు. శిశుపాలుని వధించాడు. బలిచక్రవర్తి కుమారుడైన బాణాసురుని దయ తలచి బ్రతికించాడు. పర్వతమధ్యంలో అగ్నిదేవుడు జయింప బడ్డాడు. సాల్వుని ఓడించాడు. సౌభుని చంపాడు. భగవంతుడు సముద్రం కల్లోలంగాచేసి పాంచజన్యాన్నిచే జిక్కించుకున్నాడు. హయగ్రీవుని వధించాడు. ఇతర రాజులను చాలామందిని ఓడించాడు. జరాసంధుని చంపి, అతడు బంధించిన చాలామంది రాజులను రక్షించాడు. చాలామంది రాజులను ఓడించి, గంధర్వరాజు కుమార్తెను వివాహం చేసుకున్నాడు. రాజ్యం పోగొట్టుకొన్న పాండవు లను దయతో రక్షించాడు.

ఇంద్రుని ఖాండవవనాన్ని భస్మం చేశాడు. ఇందుకు సంతోషించి అగ్నిదేవుడు అర్జునునికి గాండీవమనే ధనుస్సు ఇచ్చాడు. ఈ పనిలో ముఖ్య సహాయకుడు భగవంతుడైన కృష్ణుడే. మహాభారతయుద్ధ ప్రారంభంలో పాండవులకు దూత అయ్యాడు. అతడే యదువంశమును విస్తరింపచేశాడు. మహాభారతయుద్ధం పూర్తి అయిన తరువాత నీ కుమారులను నీ చేతికి వప్పగిస్తానని కుంతిః ప్రతిజ్ఞ చేశాడు. నృగమహారాజును శాపవిముక్తుని చేశాడు. కాలయవనుని అతడే చంపాడు. మైందద్వివిదులనే వానరులు యుద్ధమందు ఈతని చేతిలో ఓడిపోయారు. జాంబ వంతుని జయించాడు. నీ తండ్రి పరీక్షిత్తును సాందీపని కుమారుని భగవంతుడైన కృష్ణుడే మరల జీవింపచేశాడు. ఇంకా చాలామంది రాజులు అతనిచేతిలో ఘోరంగా సంహరింపబడ్డారు. ఆ విషయాలనన్నిటినీ వర్ణించి నీకు చెప్పియే యున్నాను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణ మహిమ అనునూట పదహారవ అధ్యాయము

☆☆☆

# నూట పద్దెనిమిదవ అధ్యాయము

## బాణాసురుడు శివుని వరమడుగుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

జనమేజయ మహారాజు మహర్షీ! భగవంతుని ఘనకార్యాలను విన్నాను. పూర్వము బాణాసురుని గూర్చి చెప్పావు. దాన్ని విస్తరంగా చెప్పు. రాక్షసుడు శంకరుడికి పుత్రుడెలా అయ్యాడు? అతన్ని రక్షించేవాడు శంకరుడు కుమారస్వామి

సహాయకుడు అయ్యారు కదా! అతడు బలిచక్రవర్తికి పెద్ద కొడుకు. అతన్ని శ్రీకృష్ణుడు యుద్ధంలో ఎలా ఓడించాడు. అతడు ఎలా ప్రాణాలతో విడవబడ్డాడు? అని వైశంపాయనుని అడిగాడు. రాజా! శ్రీకృష్ణునికి బాణునితో ఎలా యుద్ధం జరిగిందీ చెపుతా విను.

ఒకరోజున శంకరుని వనంలో కుమారస్వామి ఆడుకుంటున్నాడు. అప్పుడు బలిచక్రవర్తి పుత్రుడు బాణాసురుడు అతని శరీరసౌందర్యంచూచి ఆశ్చర్య పోయాడు. నేను కఠోరమైన తపస్సుచేసి శంకరునికి పుత్రుడవౌతాడని ఆలో చించాడు. అలా తపస్సులో నిమగ్నమయ్యాడు. పార్వతి శివులకు అతనిపై సంతోషం కలిగింది. ఓ దానవా! నీకు కావలసినది కోరుకో అన్నాడు శివుడు. బలిపుత్రుడు మీ దంపతులకు నేను పుత్రుడను కావాలి అని కోరాడు. శంకరుడు 'తథాస్తు' అని పార్వతితో ఈవేళ నుండి కుమారస్వామికి ఇతడు తమ్ముడౌతాడు. ఇతన్ని తీసుకెళ్ళు అన్నాడు. కుమారస్వామి అగ్నినుండి ఎక్కడ జన్మించాడో శోణితపురమనే ఆ స్థలం బాణాసురునకు రాజధాని అయింది. ఆ పట్టణాన్ని నేను రక్షిస్తాను ఎవడు అతనిమీదికి యుద్ధం కొరకు రాకుండా చేస్తాను అన్నాడు శివుడు.

బాణుడు శోణితపురంలో రాజ్యం చేస్తున్నాడు. దేవతలందరూ అతనికి భయపడేవాళ్ళు. వెయ్యిచేతులు కల అతడు మిక్కిలి మదించి యుద్ధం చేయ్యాలనే ఆసక్తి కలవాడయ్యాడు. యుద్ధానికి అవకాశం వెతుకుతున్నాడు. ఒకరోజున కుమార స్వామి సంతోషించి అతనికి అగ్నివలె ప్రకాశించే జెండాను, వాహనంగా పెద్ద నెమలినీ ఇచ్చాడు. శంకరుని ప్రభావంవల్ల అతని ముందు దేవదానవ గంధర్వు లెవ్వరూ నిలువలేకపోయారు. అతడు ఎల్లప్పుడూ యుద్ధం చెయ్యాలనే ఆసక్తితో ఉండేవాడు.

ఒకనాడు శంకరుని వద్దకు వెళ్ళాడు. ఆచారప్రకారం నమస్కారం చేసి ఓ ప్రభూ నేను మీ దయ వలన అందరినీ జయించాను. దేవతలు ఓడిపోయి నిరాశ చెంది స్వర్గంలో ఉంటున్నారు. నాకిప్పుడు యుద్ధం చేసే అవకాశం కనపడటంలేదు. యుద్ధం లేకపోతే నేను జీవించటం, వేయి భుజాలు ధరించడం ఎందుకూ? యుద్ధంవల్లనే నాకు తృప్తి, నాకు యుద్ధంచేసే అవసరం ఎప్పుడు వస్తుందో చెప్పండి అని శంకరుడు నవ్వుతూ వత్స! నీ రథంమీది జెండా విరిగి నేలపై పడినప్పుడు శ్రమపడనక్కరలేకుండా యుద్ధంచేసే అవసరమొస్తుంది అన్నాడు. మహాదేవుని

మాటలు విని సంతోషించి ఆనందబాష్పాలు రాల్చాడు. ఐదువందల నమస్కారాలు ఒకేసారి చేసి తిరిగి వెళ్ళిపోయాడు.

ఓ ప్రభూ! భాగ్యవశంవల్ల వెయ్యిచేతులు ధరించటం సార్థకమయ్యింది. ఇప్పుడు యుద్ధరంగంలో ఇంద్రుని ఓడిస్తానని ఆశ ఏర్పడింది. అని శంకరునికి పూజచేసి అతని అనుమతి పొంది తన ధ్వజం ఉండే యింట్లోకి వెళ్ళాడు. అక్కడ రాజసిహాసనంమీద కూర్చొని తన మంత్రియైన కుంభాండునితో మంత్రీ! నేను మీకు అనుకూలమైన సమాచారం వినిపిస్తున్నాను అనగానే ఆశ్చర్యంతో వికసించిన కన్నులతో కుంభాండుడు రాజా! మీరు నాకేమి సంతోషవార్త వినిపించబోతున్నారు? అని అడిగాడు.

అప్పుడు బాణాసురుడు కుంభాండ! చాలాకాలంనుంచి యుద్ధం లేకుండా ఉన్నాను. ఓ దేవా! మనస్సుకు సంతోషం కలిగించే యుద్ధం కావాలని శంకరుని కోరాను అన్నాడు. మంత్రి రాజా మీమాట బాగాలేదన్నాడు. నీ యిష్టప్రకారం గొప్ప యుద్ధం తటస్థిస్తుంది. మయూరధ్వజం విరిగిపడటం దానికి గుర్తు అని శంకరుడు చెప్పాడని తెలిపాడు. బాణుడు. ఇలా వీళ్ళిద్దరూ మాట్లాడుతుండగానే ఇంద్రుని వజ్రాయుధం దెబ్బకు ధ్వజం విరిగిపడింది. అప్పుడు రాక్షసుడు అమితా నందాన్ని పొందాడు. భూమి కంపించింది, కన్నాలలో పందికొక్కులు గర్జించాయి. రక్తవర్షం కురిసింది, తోకచుక్కలు కనిపించాయి, నలువైపులా నేలపై పడ్డాయి. నక్షత్రాలు రాలాయి.

ఇలా అనేక అపశకునాలను చూస్తూ కూడా బాణుడు రాబోయే పరాజయాన్ని గ్రహించలేదు. యథార్థాన్ని గుర్తించిన మంత్రి కుంభాండుడు మిక్కిలి దుఃఖపడి ఈ రాజ్యం నశిస్తుందని నిశ్చయించాడు. ఒకప్రక్క బాణాసురుడు దానవస్త్రీలతో కూర్చొని మద్యపానం చేస్తున్నాడు. కుంభాండుడు చింతాక్రాంతుడయ్యాడు. అతడు రాజభవనంలో కూర్చొని యుద్ధమొక్కటే ఈతనికి ఇప్పుడు మనో వినోదానికి తగిన వస్తువైంది. రాక్షసనాశనానికి పెద్దయుద్ధం తప్పక జరుగుతుంది. అని ఆలోచిస్తూ చివరకు దేవతలతో విరోధం పెట్టుకొన్నవాళ్ళు బలిచక్రవర్తిలాగా నశిస్తారని నిశ్చయించుకున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
బాణాసురుడు శివుని వరమడుగుట అను నూట పద్దెనిమిదవ అధ్యాయము

★★★

# నూట పందొమ్మిదవ అధ్యాయము

## ఉషా విరహము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఒకనాడు మహాదేవుడు పార్వతిని వెంటబెట్టుకొని అందమైన ఒక నది ఒడ్డున విహరిస్తున్నాడు. అతనికి నలుప్రక్కల లక్షలకొలది అప్సరసలు, గంధర్వులు క్రీడిస్తున్నారు. పారిజాత పుష్పముల సువాసనతో నదిఒడ్డు అంతా ఘుఘుమలాడుతున్నది. శంకరుడు వేణు వీణామృదంగాది వాద్యముల ధ్వనులను, అప్సరసల గానమును వింటున్నాడు. అప్సరస్త్రీలు ఎర్రనివస్త్రం ధరించి పుష్ప మాలతో అలంకరింపబడిన నీలకంఠుని పార్వతినీ తమ కళానైపుణ్యంతో సంతోష పెడుతున్నారు. చివరకు వాళ్ళందరూ వందిమాగధులవలె ఆ యిద్దరినీ స్తోత్రం చెయ్యడం మొదలుపెట్టారు.

అప్పుడు చిత్రలేఖ అనే అప్సరస పార్వతి ఆజ్ఞచే శివుని వేషంతో అభినయం ప్రారంభించింది. అప్పుడు పార్వతి తక్కిన అప్సరసలూ నవ్వారు. వాళ్ళ నవ్వులతో ఆ ప్రదేశం మార్మ్రోగింది. శంకరుని ఆనందానికి హద్దులేదు. ఆ సమయంలో బాణాసురుని కుమార్తె 'ఉష' పార్వతిని రంజింపచేయటానికి అభిలాష కలదైంది. ఆమె పార్వతి వద్దకు వెళ్ళి తమ భర్తలతో ఇలా విహరించే స్త్రీలు ధన్యురాళ్ళు అన్నది. పార్వతి ఉష కోరికను గ్రహించి ఓ ఉషా! ఏ విధంగా నేను మహాదేవునితో విహరిస్తున్నానో ఆ విధంగా నీవుకూడా త్వరలో తగిన భర్తతో విహరిస్తావు అన్నది. ఉష ఎన్నాళ్ళకి తన మనోకోరిక సిద్ధిస్తుందో తెలుసుకోవాలనుకుంది. పార్వతి ఆమె మనస్సును గ్రహించి భవాని నవ్వుతూ ఓ ఉషా! వచ్చే వైశాఖమాసం ద్వాదశి నాటి రాత్రి మేడపై పరుండి ఉండగా స్వప్నంలో ఎవనితో కలిసిఉంటావో అతడే నీకు తగిన భర్త. అవుతాడు. అన్నది.

అదివిని ఉష ఆనందంతో ఆడింది. ఆమె చెలికత్తెలు అందరూ చప్పట్లు చరుస్తూ పార్వతిమాట అసత్యం కాదు, త్వరలో నీకు తగిన భర్త దొరుకుతాడు. అన్నారు. ఉష చెలికత్తెల మాట విని మనస్సులో తలుచుకుంటూ భర్త కొరకు చింతిస్తూ ఉన్నది. మెల్లమెల్లగా రోజులు గడిచాయి. శివపార్వతుల విహారం

పూర్తయింది. పార్వతి మాయమైంది. అక్కడకు వచ్చిన కన్యలు తమ తమ వాహనాలపై వెళ్ళిపోయారు. కొందరు ఆకాశంలోనే ఆగారు. అప్పటినుండి ఉష కామబాధ కలదైంది. పార్వతి మాటలను తలుచుకొని భర్త కొరకైన చింతతో కాలం గడుపుతోంది. విరహబాధతో కృశించింది. పరిచారికలు, చెలికత్తెలు ఆమె బాధకు కారణం అడిగారు.

ఉష యొక్క భవనంలోని కోలాహలం విని ఆమె తల్లి పరుగెత్తుకు వచ్చింది. అప్పుడు చెలికత్తెలు విడివిడిగా వృత్తాంతాన్ని అంతా చెపుతూ మహారాణి! రాజ కుమారి జలవిహారానికి వెళ్ళి వచ్చినది మొదలు ఏమి మాట్లాడటంలేదు. ఈమె ఆరోగ్యానికి వైద్యులను పిలిపించండి, సుకుమారమైన ఈమె శరీరం వ్యాధిని ఎలా సహించగలుగుతుంది? ఆ మాటలు విని మహారాణి త్వరగా ఉష దగ్గరకు వచ్చి కుమార్తె ముఖం నిమురుతూ కళ్యాణి! నీ కష్టమేమిటి? వైద్యులు నీ పరిస్థితిని అడుతుతున్నారు అనగా వైద్యులు మహారాణి! రాజకుమారి చెలికత్తెలతో జల విహారానికి వెళ్ళింది. అక్కడ పార్వతిని సంతోషింపచేయటానికి ఎక్కువగా ఆడి అలసి ఉంటుంది, భయపడనక్కరలేదు అన్నారు.

మహారాణి వైద్యులారా! శైత్యోపచారాలు ఎన్ని చేసినా తాపం శాన్తించుటలేదు, ఆకలిదప్పులు లేవు, రాత్రింబవళ్ళు ఏడుస్తూ ఉంటుంది. మీరు శాస్త్రదృష్టితో విచారించి కారణం చెప్పండి అని అడిగింది. వైద్యులు అమ్మా! ఈమె అందమైన కన్యక అగుటచేత దృష్టిదోషం తగిలి ఉంటుంది. రక్షామంత్రం ఉచ్చరించి పచ్చని ఆవాలతో కలిపిన నీళ్ళతో స్నానం చేయించండి, శాంతిస్తుంది అని చెప్పి వైద్యులు వెళ్ళిపోయారు.

తరువాత ఉష తల్లితో నాకు భోజనం తినాలనిలేదు. దేనిమీద ఇష్టం లేదు. ఎల్లప్పుడూ హృదయంలో తాపం మండిపోతూంది. అని చెప్పి ఊరుకుంది. అక్కడకు వచ్చిన స్త్రీలు ఈ పిల్ల వివాహానికి తగిన వయస్సులో ఉంది. తల్లి తండ్రుల అనుగ్రహంతో తగిన వరుడు దొరకాలి అన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
ఉషా విరహము అనునూట పందొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై యవ అధ్యాయము

## చిత్రలేఖ ద్వారకకు వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత వైశాఖ శుద్ధ ద్వాదశినాడు ఉష చెలికత్తెలతో మేడమీద నిద్రపోతోంది. ఆ నిద్రాసమయంలో ఒక పురుషుడు వచ్చి కౌగలించుకున్నాడు. స్వప్నంలో ఇలా కౌగలించిన తరువాత ఆమె రజస్వల ఐంది. ఏడుస్తూ వెంటనే లేచింది. ఆమె చెలికత్తె చిత్రలేఖ ఓ ఉషా! భయపడకు ఎందుకు ఏడుస్తూ తాపాన్ని పొందుతున్నావు? అని అడిగింది. అప్పుడు ఉష తన స్వప్న వృత్తాంతం చెప్పి నేను గొప్ప కులంలో పుట్టి పరపురుషుని పొంది ఎలా జీవించను? మా తండ్రితో ఏమని చెప్పను? నావల్ల కులానికి మచ్చ ఏర్పడితే జీవించే అవసరమేముంది? ఇప్పుడు మరణించుటే మంచిది. స్వప్నంలో కనిపించిన అతడు వెళ్ళిపోయాడు. అని చెప్పి దుఃఖిస్తూ కూర్చున్నది.

చెలికత్తులు ఓ రాజ రాజకుమారీ! దుష్టమైన మనస్సుతో చేసిన పని చెడు ఫలితాన్నిస్తుంది. నీ మనస్సులో ఎట్టి దుష్టభావమూ లేదు. దైవికంగా ఒక పురుషుడు స్వప్నంలో సంభోగం చేసినంత మాత్రాన నీ కన్యావ్రతానికేమీ భంగం కలగదు. ఇది వ్యభిచారంగా లెక్కింపబడదు. విశేషమేమిటంటే భూలోకంలో స్వప్నంలో చేసిన తప్పు తప్పు కాదు, నీవు పతివ్రతవే. ఈ విధంగా చెలికత్తెలు సర్దిచెప్పారు. ఐనా ఆమె శాన్తించలేదు. ఆమె కన్నీరు కారుస్తూనే ఉంది.

ఈ పరిస్థితిని చూచి కుంభాండుని కూతురు నువ్వు దుఃఖపడకు, నీవు ఏ దోషము లేనిదానివి, పార్వతీదేవి నీకు చెప్పినట్లే జరిగింది కదా! స్వప్నంలో కనిపించినవాడే నీ భర్త, అని చెప్పింది. అది వినగానే దుఃఖమంతా దూరమై పోయింది. పార్వతి చెప్పిన భర్త ఎవరు? అది తెలుసుకోవటానికి ఏదైనా ఉపాయం చూడు అని ఉష అడిగింది. ఉష మాటలు విని కుంభాండుని పుత్రి సఖి! అతడు సామాన్యుడు కాడు, బాణాసురుని తలమీద కాలుపెట్టి శోణితపురంలో ప్రవేశించాడు. అతడు ఇక్కడివాళ్ళకంటే పందరెట్లు బలవంతుడై వుంటాడు. ఇలాంటి పరాక్రమవంతుడు భర్తగా లేకపోతే జీవితం వ్యర్థం. నీవు ధన్యురాలవు, ఇటువంటి భర్త గలదానవు గనుక అన్నివిధాల అనుగ్రహింపబడ్డావు? ఇప్పుడు నీకొక ఉపాయం చెపుతా విను.

ఆ ఉపాయంతో అతడు ఎవని కుమారుడు? ఏ వంశంలో జన్మించాడు? అతని పేరేమి? అనే ప్రశ్నలకు జవాబు వస్తుంది. అన్నది. అప్పుడు కామాతురాలైన ఉష నేను నా చేయదగిన పనిని నిర్ధారణ చేయలేకపోతున్నాను. ఈ సమయంలో నీవు ఏదేని ఉపాయంచూడు, దానివల్ల నా ప్రియుని విషయం తెలుసుకొనగలుగుతాను అన్నది. అప్పుడు కుంభాండుని కూతురు 'రమ' ఓ సఖీ! ఉషా! నీ చెలికత్తె చిత్రలేఖ అనే అప్సరస సంధివిగ్రహాది నీతిశాస్త్రంలో మంచి నేర్పరి. ఆమెకు మూడు లోకాలలోని విషయాలు తెలుసు. కనుక వెంటనే ఈ విషయంలో ఆమెతో ఆలోచించు అని సలహా ఇచ్చింది. వెంటనే మిక్కిలి సంతోషంతో, ఆశ్చర్యంతో నూ చిత్రలేఖను పిలిపించింది.

చేతులు జోడించి ఆమెకు విషయమంతా చెప్పింది. చిత్రలేఖ ఉషను ఊరడించింది. అప్పుడు ఉష చనువువలన ఈవేళ నీవు నా ప్రియుని తీసుకు రాకపోతే వెంటనే నేను ప్రాణాలు విడిచిపెడతాను అన్నది. చిత్రలేఖ ఉషను సంతోషపెట్టుతూ సఖీ! ఈ విషయం తెలుసుకోవటానికి శక్యమైంది కాదు. దేవలోకంలోకాని, భూలోకంలోకాని, సౌందర్యంచేత, గొప్పవంశంచేత ప్రసిద్ధులైన వాళ్ళ చిత్రాలను తయారుచేసి ఒక వారంరోజుల్లో నీ దగ్గరకు తెస్తాను. వాళ్ళలో నీ ప్రియుణ్ణి గుర్తించుము. అన్నది! ఎలా బాగుంటే అలా చెయ్యి అని ఉష చెప్పగా అప్సరస తన తెలివి తేటలతో నేర్పుతోను వారంరోజుల్లో చిత్రాలు వ్రాయుట అనే పని పూర్తి చేసింది.

ఆ చిత్రాలనన్నిటినీ ఉష వద్దకు తెచ్చి ఒక్కొక్క చిత్రంలోని వ్యక్తిని గూర్చి పరిచయం చేసింది. ఈ చిత్రాలలో నీ ప్రియుని గుర్తించమన్నది. వరసగా చిత్రాలనూ చూస్తూ చూస్తూ అనిరుద్ధుని చిత్రం కనపడగానే ఇతడే ఆ దొంగ, ఆరోజున స్వప్నంలో నన్ను కలిసిన వ్యక్తి యితడే. ఇతడెక్కడ ఉన్నాడు? ఇతని కులశీల సౌందర్యాలు ఎటువంటివి? ఇతని పేరేమిటి? అంతా సరిగా చెప్పు. తరువాత చేయదగిన పని చేయవచ్చు. అని ఉష పలికింది! అప్పుడు చిత్రలేఖ ఇతడు మూడులోకాలకు ప్రభువైన శ్రీకృష్ణుని మనుమడు. ప్రద్యుమ్నుని పుత్రుడు. ఇతని పేరు అనిరుద్ధుడు. మూడులోకాల్లో ఇతనితో సమానుడైన వీరుడు లేడు. నీవు ధన్యురాలవు కాబట్టి పార్వతీదేవి నీకిట్టి వరుని ప్రసాదించింది.

అప్పుడు ఉష నీవు చాలామంచి చెలికత్తెవు. నీవు తప్ప నాకు వేరేగతి లేదు. నీవు ఉపాయం చెప్పటంలోనూ, శిల్పంలోనూ గొప్ప నేర్పరివి. ఎలా అయినా సరే

త్వరగా నీవు నా ప్రియుణ్ణి యిక్కడకు తీసుకురా. నీవు ఆకాశ సంచారంలోనూ కావలసిన రూపం ధరించుటలోనూ, సమర్థురాలవు. యోగినివి. ఇందుచేత నీవు ఏదో ఒక ఉపాయంతో నా పని పూర్తి చేసి తిరిగి రావాలి. ఆపదలో సహాయం చేసినదే వాస్తవంగా మిత్రురాలు. నేనిప్పుడు కామంచేత దీనస్థితిలో ఉన్నాను. కనుక నా ప్రాణాలు కాపాడు. ఈనాడు అతన్ని నీవు తీసుకు రాకపోతే తప్పక నేను ప్రాణత్యాగం చేస్తాను అన్నది. చిత్రలేఖ సఖి! నీవు ధైర్యంతో నామాట విను.

ద్వారకానగరం ఇతరులు ప్రవేశించుటకు శక్యంగాని రక్షణ కలది. కాబట్టి నిన్ను నన్ను మీ తండ్రిని కూడ నీవు రక్షించాలి అన్నది. అప్పుడు ఉష సఖి! నీవు యోగబలంచేత అక్కడ ప్రవేశించగలవు. నీకు చెప్పవలసిందే మున్నది? నేను త్వరగా ప్రియుని చంద్రుని వంటి ముఖాన్ని చూడకపోతే తప్పక మరణిస్తాను. నా జీవితాన్ని కాపాడు నా పనిలో ప్రవర్తించు అన్నది. చిత్రలేఖ నేను నీ పనిని పూర్తి చేయటానికి కట్టుబడి ఉన్నాను. నేనిప్పుడే ద్వారకాపురానికి వెళ్తున్నాను. ఈ వేళనే నీ ప్రియుని అనిరుద్ధుని తీసుకు వస్తాను అని పలికి మనోవేగంతో వెళ్ళిపోయింది. అప్పుడు ఉష చింతతో చెలికత్తెల మధ్య కూర్చుని ఎదురు చూస్తున్నది. చిత్రలేఖ తన చెలికత్తెకు ఉపకారం చేయాలని మూడు నిముషాలలో శోణితపురం నుండి బయటకు వెళ్ళింది. రమణీయమైన ద్వారకాపురంలో ప్రవేశించింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
చిత్రలేఖ ద్వారకకు వచ్చుట అను నూట ఇరవై అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై ఒకటవ అధ్యాయము

## బాణాసురునితో అనిరుద్ధుని యుద్ధం

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! చిత్రలేఖ ద్వారకలో భగవంతుడైన శ్రీకృష్ణుని ద్వారం దగ్గరకు చేరి అనిరుద్ధునికి ఉష వృత్తాంతం ఎలా తెలియజేయాలి? అని ఆలోచించింది. ఆ సమయంలో ఒక సరస్సు ఒడ్డున నారదుడు భగవంతుని ధ్యానిస్తూ కనపడ్డాడు. అతన్ని చూడగానే ఆనందంతో చిత్రలేఖ దగ్గరకు వెళ్ళి నమస్కరించి నిలబడింది.

మహర్షి ఆశీర్వదించి ఓ అప్సరా! నీవేం పనిమీద ఇక్కడికి వచ్చావో? నేను బాగా తెలుసుకోవాలనుకుంటున్నాను. చిత్రలేఖ పూజ్యుడా! నేనిపుడు దూతగా వచ్చాను. అనిరుద్ధుని తీసుకువెళ్ళటానికి వచ్చాను. కారణమేమిటంటే శోణితపురంలో బాణాసురునకు 'ఉష' అనే అందమైన కన్యక ఉంది. పార్వతీదేవి ఆ కన్యకు ప్రద్యుమ్నుని పుత్రుడైన అనిరుద్ధుడు భర్తవుతాడని చెప్పింది.

ఉష అతనిపై మిక్కిలి ఆసక్తితో ఉంది. కాబట్టి అతన్ని తీసుకువెళ్ళటానికి వచ్చాను నేనీపనిలో సఫలురాలనయ్యేటట్లు ఏదైనా ఉపాయం చెప్పండి అన్నది. నేనతన్ని శోణితపురానికి తీసుకు వెళ్ళిన తరువాత భగవంతుడైన శ్రీకృష్ణునకు ఈ విషయం చెప్పండి. ఈ పరిస్థితిలో రాక్షసరాజైన బాణానితో యుద్ధం రావచ్చు. రాక్షసరాజు యుద్ధంలో అసాధ్యుడు. కాబట్టి ఒంటరిగా అనిరుద్ధుడతన్ని ఓడించ లేకపోవచ్చు. చివరకా రక్షసుడు శ్రీకృష్ణుని చేతిలోనే ఓడిపోతాడు. ఈ సమయంలో భగవంతునకు ఈ సమాచారం ఎలా వినిపించును? ఈ విషయం తెలుసుకో టానికి మీవద్దకు వచ్చాను. మీరు దయతో ఈ వృత్తాంతాన్ని ఆయన చెవిని వేస్తే నాభయమంతా తొలగిపోతుంది.

ఆయనకీ విషయం తెలియకుండా అనిరుద్ధుని ఎలా తీసుకువెళ్ళగలను? ఉషకు ఇష్టమైన భర్త ప్రాప్తించటానికి ఉపాయం చెప్పండి. నాకు భయంలేకుండా చెయ్యండి అన్నది. శ్రీకృష్ణునికి తెలియకుండా అనిరుద్ధుని తీసుకువెళ్తే ఆయన నన్ను శపించవచ్చు. అని పలుకగా నారదుడు. నీకేం భయం లేదు. ఉపాయం చెప్తున్నాను విను. అనిరుద్ధుని ఉష అంతఃపురానికి తీసుకువెళ్ళు. అప్పుడు యుద్ధం వచ్చేటట్లుంటే నన్ను తలుచుకో. యుద్ధం చూడాలని నాకు పెద్ద కోరిక. ఇప్పుడు నీకు లోకమోహిని అనే తామసవిద్య నిస్తున్నాను తీసుకో అన్నాడు. చిత్రలేఖ తామస విద్యను స్వీకరించి మహర్షికి నమస్కరించి ఆకాశానికి ఎగిరివెళ్ళింది. ద్వారకా నగరం మధ్యలో ప్రద్యుమ్నుని భవనం. దాని ప్రక్కనే అనిరుద్ధుని భవనం.

అందులో ప్రవేశించింది. ఆ దివ్యభవనంలోకి వెళ్ళి సుందర స్త్రీల మధ్య కూర్చున్న అనిరుద్ధుని చూచింది. అతడు నక్షత్రాల మధ్య చంద్రునిలా ఉన్నాడు. ఆ స్త్రీలు సేవ చేస్తుండగా గొప్ప ఆసనం మీద కూర్చుని ప్రకాశిస్తున్నాడు. మాటి మాటికీ మద్యపానం చేస్తున్నాడు. ఒక ప్రక్క మృదువైన స్వరంలో సంగీతం వినిపి స్తోంది. అనేక వాద్యాలు మ్రోగుతున్నాయి. కొందరు కాంతలాతని ముందు నృత్యం చేస్తున్నారు. అతనికి దేనిమీదా ఇష్టం కనపడలేదు. అతడేదో ఆలోచిస్తున్నాడు.

చిత్రలేఖ యితనికి స్వప్నంలో వచ్చి ఉంటుంది. అందువల్ల దేనిమీద ఇష్టం చూపటం లేదని నమ్మకం కలిగింది.

ఆమెకు మొదట కలిగిన భయం పారిపోయింది. స్త్రీల మధ్యలో కూర్చొని ఉన్న వీనితో నా పని ఎలా కుదురుతుంది? నారదుడిచ్చిన విద్యా ప్రభావంతో ఎవరికే కనబడకుండా ఆ మేడ పైకి వెళ్ళింది. ఆమెను ఎవ్వరూ చూడలేదు. చిత్రలేఖ తన తామసవిద్యతో తక్కినవాళ్ళను తెలియని వాళ్ళనుగా చేసి అనిరుద్ధునికి మాత్రమే కనిపిస్తూ ఆ స్త్రీల మధ్యకు వచ్చింది. మధురమైన కంఠస్వరంతో వీరవర్యుడా! మీరు క్షేమంగా ఉన్నారు. రాత్రింబవళ్ళూ సుఖంగా గడుస్తున్నాయి. ప్రద్యుమ్నపుత్రా! నేను మీకు కొంచం చెప్పవలసిన విషయం ఉంది చెప్పుతున్నా వినండి అని మీరు ఎవతెను స్వప్నంలో చూచి ఆమెను భార్యగా చేసుకొన్నారో ఆమె "ఉష" నిన్ను మనస్సులో చూస్తూ జీవిస్తున్నది. నీవు కనపడకపోతే తప్పక మరణిస్తుంది. దేవి ఆమెకు నిన్ను పతిగా చేసింది. ఆమె కులశీలాలను విను!

శోణితపుర రాజుకుమార్తె నిన్ను కోరుతున్నది. నీ సమాగమం వల్లనే ఆమె జీవిస్తుంది. ఆమె తండ్రి బాణాసురుడు బలిచక్రవర్తి కుమారుడు. అని చెప్పింది! ఆ మాటలు విని అనిరుద్ధుడు చిత్రలేఖా! ఆమెను నేను స్వప్నంలో చూచింది మొదలు ఆమె రూపలావణ్య, గమన, సంయోగ, దుఃఖాదులను ఆలోచిస్తూ రాత్రింబవళ్ళూ నేను అజ్ఞానిని అయ్యాను. నాపై నీకు అనుగ్రహం ఉంటే వెంటనే నన్ను ఆమెవద్దకు తీసుకువెళ్ళు. నేను ఆమెను చూడటానికీ బ్రతికిఉన్నాను. నీకు నమస్కారం చేస్తున్నాను. నాకలను నిజం చెయ్యి. చిత్రలేఖ అతని అభిప్రాయం గ్రహించి మిక్కిలి సంతోషించింది. స్త్రీల మధ్యలో ఉన్న అతన్ని మాయం చేసి తనతోపాటు అతన్ని తీసుకొని ఆకాశంలోకి ఎగిరింది.

శోణితపురానికి వచ్చి తన మాయాబలంతో అతన్ని కనబడకుండా చేసి ఉష వద్దకు తెచ్చింది. విచిత్ర ఆభరణాలను, విచిత్రాయుధాలను ధరించిన అనిరుద్ధుని చూచి ఉష ఆశ్చర్యపోయింది. చిత్రలేఖ వాళ్ళిద్దరినీ ఇంటిలోపలికి తెచ్చింది. అక్కడ అనిరుద్ధుడికి ఉష పూజ చేసి చిత్రలేఖను కౌగిలించుకొని ఈతన్ని ఎలా దాచి ఉంచేది? అలాకాకపోతే ప్రాణ సంకటం ఏర్పడుతుంది అని పలికి తన ప్రియునితో భవనంలో ఏకాంత ప్రదేశానికి వెళ్ళింది. భయంతో అక్కడ కూర్చున్నది. అప్పుడు చిత్రలేఖ సఖీ! మనుష్యుడు చేసిన దానిని దైవం నాశం

చేస్తుంది. దేవి అనుగ్రహం అనుకూలమైతే నేను చేసినపనిని ఎవ్వరూ ఎరగకుందురు గాక అన్నది. ఉష ఊరడిల్లింది.

అప్పుడు అనిరుద్ధునితో దైవానుకూల్యంచేత స్వప్నమందలి దొంగభర్త కని పించాడు. అతని కొరకు ఎంతో కష్టపడ్డాను. ఓ మహాబాహూ! అంతటా కుశల మేనా? స్త్రీల హృదయం మృదువైనది అనగా యాదవవీరుడైన అనిరుద్ధుడు ప్రియురాలి కన్నీటిని తుడిచి నవ్వుతూ ప్రియురాలా! నీ అనుగ్రహంవల్ల అంతా కుశలమే. ఈ దేశాన్ని ఎప్పుడూ చూడలేదు. ఒకరోజు రాత్రి కలలో నీ దర్శన మయింది. భవాని వరం అసత్యంకాదు. శరణాగతుడనైన నాపై ప్రసన్నురాలవగుము అన్నాడు. తరువాత భయపడుతూ ఉష ప్రియుని తీసుకొని ఏకాంతస్థలానికి వెళ్ళింది. అక్కడ యథావిధిగా ఇద్దరికీ గాంధర్వవివాహం జరిగింది. తరువాత ఉష అనిరుద్ధుడు పగటిపూట చక్రవాకపక్షులవలె క్రీడించారు. ఉష భర్తతో ఆనందంగా ఉంది. ఒకరోజున దివ్యమైన వస్త్రములను, ఆభరణాలను ధరించి అనిరుద్ధుడు ఉషతో కలిసి యుండటం అంతఃపుర రక్షకులకు తెలిసింది. వాళ్ళు వెళ్ళి రాక్షసరాజుకు తాము చూచిన విషయమంతా చెప్పారు.

బాణాసురుడు వెంటనే సైన్యానికి ఆ దుష్టుని చంపిరండని ఆజ్ఞయిచ్చాడు. ఇతడు నా వంశచరిత్రను మంటగలిపాడు. ఉష చెడిపోతే వంశం చెడినట్లే. నేను ఇయ్యని కన్యను స్వయంగా దుష్టురాలను చేశాడు. ఏమి ధైర్యము? ఏమి పొగరు బోతుదనము? నా పురంలో ప్రవేశించి యింటిలోకూడా చేరాడు. మూర్ఖుడు అని సైనికులను పంపాడు. వాళ్ళు అతని ఆజ్ఞచేత యుద్ధసంసిద్ధులై వెళ్ళారు. అనిరుద్ధుడు ఉన్నచోటికి వచ్చారు. వాళ్ళు అనేకాయుధాలు ధరించి అనిరుద్ధుని చంపాలని భయంకరులైన రాక్షసులు వచ్చారు. బాణుని కూతురు అనిరుద్ధుని చంపుతారని భయపడి ఏడ్చింది. వణుకుచున్న ఉషతో అనిరుద్ధుడు నేనుండగా నీకు భయమెందుకు? ఇది సంతోషించదగిన సమయం. భయానికి కారణమేమీ లేదు. బాణుని సైనికులందరూ వచ్చినా నేను చింతించుటలేదు. ఈనాడు నా పరాక్రమం చూడు అని ఆ సైన్యధ్వని విని అనిరుద్ధుడు వెంటనే లేచాడు.

ఇంటిని చుట్టుముట్టి నిలిచియున్న సైన్యాన్ని చూచాడు. ఆ సైన్యందగ్గరకు వచ్చాడు. యుద్ధంచేయ సిద్ధపడ్డాడు. యుద్ధం చెయ్యటానికి వచ్చిన బాణుని పుత్రులను చూచి చిత్రలేఖ దేవతలను, దేవర్షి నారదుని తలుచుకొన్నది. వెంటనే

నారదుడు అక్కడకు వచ్చాడు. అతడాకాశంలోనే నిలబడి ఓ వీరుడా! నువ్వు భయపడవద్దు. నేను వచ్చాను అన్నాడు. అనిరుద్ధుడు అతనికి సంతోషంతో నమస్కరించాడు. యుద్ధానికి సిద్ధపడ్డాడు. మేడమీదినుండి దిగివస్తున్న అనిరుద్ధుని చూచి ఆ సైనికులు భయంతో కొందరు పారిపోయారు. అనిరుద్ధుడు సైనికులపై పరిఘ అనే ఆయుధాన్ని విసిరివేశాడు. రాక్షసులు అనేక ఆయుధాలు విసిరినా అనిరుద్ధుడు చలించకుండా నిలిచిఉన్నాడు. అప్పుడు సంతోషిస్తూ నారదుడు అనిరుద్ధుని బాగు బాగని మెచ్చుకున్నాడు. పరిఘ అనే ఆయుధంతో దెబ్బలుతిని ఆ రాక్షసులు పారిపోయారు. రాక్షసులను పారద్రోలి సంతోషంతో నిలిచి యుద్ధరంగంలో సింహనాదం చేశాడు అనిరుద్ధుడు. పారిపోయే రాక్షసులను నిలవండి, నిలవండి అని హెచ్చరించాడు. అందరినీ చంపివేశాడు కూడా.

అనిరుద్ధునిచే దెబ్బలుతిని భయపడిన రాక్షసులు యుద్ధానికి వెన్నుచూపి బాణుడు ఉన్నచోటికి వెళ్ళారు. బాణుని సమీపంలో నెత్తురుకారుతూ, రొప్పుతూ భయంతో కలతచెందారు. బాణుడు భయపడకండి అని వురికొల్పాడు. నపుంసకులవలె పారిపోతున్నారేమి? అనేకయుద్ధాలలో పేరు పొందినవాళ్ళు మీరిలా భయపడతగదని పలికి నాకు మీ సహాయం అక్కరలేదు అని వాళ్ళను నిందించి శూరులైన ఇతరులను పదివేలమందిని ఆజ్ఞాపించాడు. ఆసైనికులచే ఆకాశం నిండిపోయింది. కొందరు భూమిమీద, కొందరు ఆకాశంలో గర్జించారు. అనిరుద్ధుడు ఒక్కడే ఇంతమంది నెదిరించటం ఆశ్చర్యం కలిగించింది. అనిరుద్ధుని బాణాలకు బాధపడి మళ్ళీ ఆ సైనికులు పరుగెత్తారు. భయంతో బాణాసురుని చాటుకు చేరారు. తరువాత బాణాసురుని కూడ విడిచి పారిపోయారు. ఆకాశమందు నిలిచి నారదుడు బాగుబాగని అనిరుద్ధుని మెచ్చుకొంటూ సంతోషంతో నృత్యచేశాడు.

అప్పుడు మిక్కిలి కోపించినవాడై బాణాసురుడు కుంభాండుడు తెచ్చిన రథమునెక్కి కత్తిపట్టుకొని రథమందున్నవాడై అనిరుద్ధుని సమీపించాడు. వెయ్యిచేతులతో అనేక ఆయుధాలను ధరించి సింహనాదంచేస్తూ ధనుస్సును ఎక్కుపెట్టి కోపంతో నిలునిలు అని పలికాడు. అనిరుద్ధుడు బాణాసురుని ముఖం చూచి నవ్వుతూ మరింత పరాక్రమం నింపుకొన్నాడు. బాణాసురుని రథానికి వెయ్యి గుర్రాలు కట్టబడ్డాయి. ఖడ్గం పట్టుకొని కాలినడకన యుద్ధంచేయు

అనిరుద్ధుని చూచి మిక్కిలి సంతోషించాడు. ఖడ్గమొక్కటి చేతిలో ఉంది. కవచం లేదు. అటు వంటి యాదవవీరుని జయింపశక్యము కానివానిగా తలచి యుద్ధానికి సిద్ధపడ్డాడు. బాణుడు పట్టుకో, కొట్టు అన్నాడు ప్రద్యుమ్నపుత్రుని. అనిరుద్ధుడు భయపడి ఏడుస్తున్న ఉషను ఓదార్చి నిలుచున్నాడు. బాణుడు బాణసమూహాన్ని అనిరుద్ధుని చంపదలచి ప్రయోగించగా వాటిని ప్రద్యుమ్నపుత్రుడు ఖండించాడు. బాణాసురుడు బాణాలను నివారించుకొంటూ ఉదయకాలపు సూర్యునివలె అనిరుద్ధుని ఎదుట నిలిచాడు.

అనిరుద్ధుడు కూడా ఏనుగు ఎదుట సింహంలాగా నిర్భయంగా నిలిచాడు. తరువాత బాణుడు తనవాడియైన బాణసమూహంతో అనిరుద్ధుని నొప్పించాడు. అనిరుద్ధుడు ఖడ్గచర్మముల ధరించి ఆ బాణాలను లెక్కచేయక బాణునిమీదికి ఉరికాడు. బాణాసురుని బాణాలతో శరీరమంతా అనిరుద్ధునికి రక్తంతో తడిసి పోయింది. అనేకములైన ఆయుధాలతో కొట్టబడినా అతడు చలించలేదు. కోపించి అనిరుద్ధుడు బాణాసురుని రథంఇరుసును విరగ్గొట్టాడు. ఖడ్గంతో గుర్రాలను నరికాడు. బాణుడు బాణవర్షంతో అనిరుద్ధుని కనపడకుండా చేశాడు. రాక్షస సమూహాలు అనిరుద్ధుడు చచ్చాడని పెద్దగా అరిచారు. అనిరుద్ధుడు ఎగిరి అతని రథందగ్గర నిలిచాడు. తరువాత బాణాసురుడు కోపించి ఘోరమైన మంటలతో కూడిన 'శక్తి' అనే ఆయుధాన్ని అనిరుద్ధుని పై ప్రయోగించాడు. అనిరుద్ధుడు తనపైకి వస్తున్న 'శక్తి'ని చేతితో పట్టుకొని దానినే బాణునిపై విసరగా అది అతని శరీరాన్ని ఛేదించి భూమిలో ప్రవేశించింది. ఆ దెబ్బలో ధ్వజదండముపై ఒరిగాడు.

మూర్ఛపోయిన వానినిచూచి కుంభాండుడు మహారాజా! ఇటువంటి ప్రబల శత్రువును ఎందుకు ఉపేక్షిస్తారు? మీరితన్ని యుద్ధంలో జయించలేరు. కాబట్టి మాయతో యుద్ధం చెయ్యండి. లేకపోతే ఇతన్ని సంహరించటం కష్టం. కనుక ఇతన్ని మాయాయుద్ధంతో జయించి మమ్మల్ని అందరినీ రక్షించండి. ఇప్పుడు ఉపేక్షిస్తే రాక్షసులనందరినీ చంపి 'ఉష'ను తీసుకుపోతాడు అనిచెప్పాడు. అప్పుడు బాణాసురుడు మాయాబలంచేత కనపడనివాడై తీక్ష్ణమైన బాణవర్షం కురిపించాడు. అనిరుద్ధుడు శత్రువు కనపడక అన్ని దిక్కులు చూచాడు. అప్పుడు బాణాసురుడు తీక్ష్ణమైన బాణాలను ప్రయోగించాడు.

వెంటనే అనిరుద్ధుడు సర్పరూపములైన బాణాలతో చుట్టబడ్డాడు. అప్పుడు నిశ్చేష్టుడయ్యాడు. ఆ స్థితిలో కూడా అతడేమి బాధపడలేదు. అప్పుడు బాణుడు

కోపంతో కుంభుడా! కులానికి మచ్చతెచ్చే యీతనిని వెంటనే చంపివెయ్యి. ఈ చెడునడవడివాడు నా వంశానికి మచ్చ తెచ్చాడు. అప్పుడు కుంభాండుడు రాజా నేనొకమాట చెప్పదలుచుకున్నాను. అది తగినట్లుంటే స్వీకరించండి. ముందు ఇతడు ఎవరికి సంబంధించినవాడు? ఎక్కడనుండి వచ్చాడు? ఎవడిక్కడ వీణ్ణి తెచ్చాడు. అనే విషయాన్ని తెలుసుకోండి. ఇతడు ఇంద్రునితో సమ్మానమైన పరాక్రమం కలవాడు, ఆటలాడుకుంటునట్లు మహాయుద్ధం చేస్తున్నాడు. బలం గలవాడు అన్ని శాస్త్రాలలో పండితుడు, అత్యంత సుందరుడు. ఇతడు చంప తగినవాడు కాడు. నీ కుమార్తె ఇతన్ని గాంధర్వ వివాహంతో భర్తగా చేసుకుంది.

ఈ సమయంలో నీ కుమార్తెను విడిచిపెట్టటంకాని లేక ఇంట్లోనే ఉంచు కొనటంగాని రెండు తగినపనులు కావు. మీరు మొదట బాగా ఆలోచించి అతన్ని చంపటం మంచిదా? పూజించటం మంచిదా? తేల్చుకోండి. ఇతన్ని చంపటం దోషం, రక్షించటం అనేక శుభాలకు కారణం. ఇతడు పూజింపదగినవాడని నా విశ్వాసం. ఇతడు సమస్త సద్గుణసంపన్నుడు. శత్రుసంహారకుడైన బాణాసురుడు కుంభాండుడు చెప్పిన విషయాన్ని పరిశీలించి అంగీకరించాడు. తరువాత రక్షక భటులకు అతన్ని రక్షించే భారాన్ని వప్పచెప్పి బలిచక్రవర్తి కుమారుడైన బాణా సురుడు తన యింటికి వెళ్ళాడు.

మునిశ్రేష్ఠుడైన నారదుడు అనిరుద్ధుడు మాయచే కట్టబడ్డాడని చూచి ద్వారకానగరానికి వెళ్ళాడు. అనిరుద్ధుడు నారదుడు వెళ్ళటంచూచి యుద్ధం తప్పక జరుగుతుంది. ఈ రాక్షసుడు నశిస్తాడు. కృష్ణుడికి విషయమంతా నారదుడు తెలియజేస్తాడు అని తలచాడు. సర్పాలచే చుట్టబడిన అనిరుద్ధునిచూచి ఉష దీనురాలై దుఃఖించింది. అప్పుడు అనిరుద్ధుడు ఆమెతో ఎందుకు ఏడుస్తావు? నీవు భయపడవద్దు. చూడు ఇప్పుడు శ్రీకృష్ణుడు వస్తాడు. అతని శంఖధ్వనిని, బలరాముని బాహుశబ్దాన్నివిని దానవులు నశించిపోతారు. రాక్షసస్త్రీలకు గర్భపాతం జరుగుతుంది. అని ఓదార్చాడు. ఉష అనిరుద్ధుని మాటలచే ఊరడిల్లింది. క్రూరుడైన తండ్రిని గూర్చి విచారించింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
బాణాసురునితో అనిరుద్ధుని యుద్ధం అను నూట ఇరవై ఒకటవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై రెండవ అధ్యాయము

## అనిరుద్ధుడు ఆర్యాదేవిని స్తుతించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బాణాసురుడు ఉషను అనిరుద్ధుని బందీలుగా చేశాడు. అప్పుడు అనిరుద్ధుడు తన రక్షణ కొరకు కోటవతీదేవికి శరణాగతిచేసి పఠించిన స్తోత్రాన్ని చెపుతున్నాను విను.

మొట్టమొదట అనిరుద్ధుడు అనంతుడు, నాశరహితుడు, దివ్యుడు, ఆదిదేవుడు, సనాతనుడు అయిన విష్ణువునకు నమస్కరించి ఋషిగణ, దేవగణ, హరి, అనే నామాలను ఉచ్చరించి దేవతలందరిచే నమస్కరింపబడినదియు, సమస్త దేహస్థ, వరాలిచ్చునది, దేవి కాత్యాయనీ, ఆర్య అయిన భగవతిని స్తోత్రం చేశాడు. అనిరుద్ధుడు చేసిన స్తోత్రము-

శ్లో॥ మహేంద్ర విష్ణుభగినీం నమస్యామి హితాయవై
మనసా భావశుద్ధేన శుచిః స్తోష్యే కృతాంజలిః॥
గౌతమీం కంసభయదాం యశోదానందవర్ధినీమ్
మేధ్యాం గోకులసంభూతాం నందగోపస్య నందినీమ్॥
ప్రజ్ఞాం దక్షాం శివాం సౌమ్యాం దనుపుత్ర విమర్దినీమ్
తాం దేవీం సర్వదేహస్థాం సర్వభూత నమస్కృతామ్॥
దర్శనీం పూరణీం మాయాం వహ్ని సూర్యశశి ప్రభామ్
శాంతిం ధ్రువాంచ జననీం మోహినీం శోషణీం తథా॥
సేవ్యాం దేవైస్సర్షిగణాం సర్వదేవ నమస్కృతామ్
కాలీం కాత్యాయనీం దేవీం భయదాం భయనాశినీమ్॥
కాలరాత్రిం కామగమాం త్రినేత్రాం బ్రహ్మచారిణీమ్
సౌదామినీం మేఘరవాం వైతాలీం విపులాననామ్॥
యూధ స్యాద్యాం మహాభాగాం శకునీం రేవతీం తథా
తిథీనాం పంచమీం షష్ఠీం పూర్ణమాసీం చతర్దశీమ్॥
సప్తవింశతి ఋక్షాణి నద్య స్సర్వాదిశోదశ
నగరోప వనోద్యాన ద్వారాట్టాలక వాసినీమ్॥

హ్రీం శ్రీం గంగాంచ గంధర్వాం యోగినీం యోగదాం సతామ్
కీర్తిమాశాం దిశం స్వర్శాం నమస్యామి సరస్వతీమ్॥
వేదానాం మాతరంచైవ సావిత్రీం భక్తవత్సలామ్
తపస్వినీం శాంతికరీం ఏకానంశాం సనాతనీమ్॥
కౌటీర్యాం మదిరాం చండామిలాం మలయవాసినీమ్
భూతధాత్రీం భయకరీం కూష్మాండీం కుసుమప్రియామ్॥
దారుణీం మదిరావాసాం వింధ్య కైలాసవాసినీమ్
వరాంగనాం సింహరథీం బహురూపాం వృషధ్వజామ్॥
దుర్లభాం దుర్జయాం దుర్గాం నిశుంభ భయదర్శినీమ్
సురప్రియాం సురాం దేవీం వజ్రపాణ్యానుజాం శివామ్॥
కిరాతీం చీరవసనాం చోరసేనా నమస్కృతామ్
ఆజ్యపాం సోమపాం సౌమ్యాం సర్వపర్వత వాసినీమ్॥
నిశుంభ శుంభ మథనీం గజకుంభోప మస్తనీమ్
జననీం సిద్ధసేనస్య సిద్ధచారణ సేవితామ్॥
చరాం కుమారప్రభవాం పార్వతీం పర్వతాత్మజామ్
పంచాశద్దేవ కన్యానాం పత్నీ దేవగణస్యచ॥
కద్రుపుత్ర సహస్రస్య పుత్రపౌత్ర వరస్త్రియః
మాతాపితా జగన్మాన్యాదివి దేవాప్సరోగణైః॥
ఋషిపత్నీ గణానాంచ యక్షగంధర్వ యోషితామ్
విద్యాధరాణాం నారీషు సాధ్వీషు మనుజాసుచ॥
ఏవమేతాసు నారీషు సర్వభూశ్రయాహ్యసి
నమస్కృతాసి త్రైలోక్యే కిన్నరోద్గీత సేవితే॥
అచింత్యా హ్యప్రమేయాసి యాసియాసి నమోస్తుతే
ఏభిర్నామభి రన్యైశ్చ కీర్తితాహ్యసి గౌతమి॥
త్వత్ప్రసాదా దవిఘ్నేన క్షిప్రం ముచ్యేయ బంధనాత్
అవేక్షస్వ విశాలాక్షి పాదౌ తే శరణం వ్రజే॥
సర్వేషామేవ బంధానాం మోక్షణం కర్తుమర్హసి
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ చంద్రసూర్యాగ్ని మారుతాః॥

అశ్వినౌ వసవశ్చైవ ధాతా భూమిర్దిశో దశ
మరుతా సహ పర్జన్యో ధాతా భూమిర్దిశో దశ॥
గావో నక్షత్రవంశాశ్చ గ్రహానద్యో హ్రదాస్తథా
సరిత స్సాగరాశ్చైవ నానావిద్యాధరోరగాః॥
తథా నాగా స్సుపర్ణాశ్చో గంధర్వాప్సరసాం గణాః
కృత్స్నం జగదిదంప్రోకం దేవ్యానా మానుకీర్తనాత్॥
దేవ్యాస్త్స్తవమిమం పుణ్యం యః పఠేత్సు సమాహితః
సా తస్మై సప్తమేమాసి వరమగ్ర్యం ప్రయచ్ఛతి॥
అతస్త్వమి తాం దేవీం వరదే వామలోచనే
నమోస్తుతే మహాదేవి సుప్రీతా మే సదాభవ॥
ప్రయచ్ఛ త్వం వరంహ్యాశు పుష్టించైవ క్షమాం ధృతతిమ్
బంధనస్థో విముచ్యేయం సత్యమేతద్భవేదితి॥

ఈవిధంగా స్తోత్రంచేసిన తర్వాత బంధమందున్న అనిరుద్ధుడికి దుర్గ ప్రత్యక్ష మైంది. బాణాసురపురంలో ఉన్న వీరుడైన అనిరుద్ధుని బంధంనుండి విడిపించింది, ఓదార్చింది కూడా. ప్రతాపవంతుడైన అనిరుద్ధుడు ఆమెను పూజించాడు. అనుగ్రహంతో కూడిన ఆ దేవి ఓ అనిరుద్ధా! చక్రాయుధుడైన శ్రీకృష్ణుడు నిన్ను విడిపిస్తాడు. బాణాసురుని వెయ్యిచేతులను నరికి నిన్ను ద్వారకా పురానికి తీసుకు వెళ్తాడు. కొంచంకాలం ఓపికపట్టు అన్నది. దుర్గాదేవిని అనిరుద్ధుడు మరల ఇలా స్తోత్రం చేశాడు.

శ్లో॥ నమోస్తుతే దేవి వరప్రదే! శివే నమోస్తుతే దేవి సురారినాశిని!
నమోఽస్తుతే కామచరే! సదాశివే! నమోస్తుతే సర్వహితైషిణి ప్రియే॥
నమోస్తుతే భీతికరి ద్విషాం సదా నమోఽస్తుతే బంధనమోక్షకారిణి
బ్రహ్మేనింద్రాణి రుద్రాణి భూతభవ్య భవే శివే॥
త్రాహిమాం సర్వభీతిభ్యో నారాయణి నమోస్తుతే
నమోఽస్తుతే జగన్నాథీ ప్రియేదాంతే మహావ్రతే॥
భక్తిప్రియే జగన్మాతః శైపుత్రి వసుంధరే
త్రాహిమాం త్వం విశాలాక్షి నారాయణి నమోస్తుతే॥
త్రాయస్వ సర్వదుఃఖేభ్యో దానవానాం భయంకరి
రుద్రప్రియే మహాభాగే భక్తానామార్తినాశని॥

నమామి శిరసా దేవీం బంధనస్థో విమోక్షితః
ఆర్యాస్తవమిమం పుణ్యం యః పఠేత్సు సమాహితః॥
సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకం సగచ్ఛతి
బంధనస్థో విముచ్యేత సత్యం వ్యాసవచోయధా॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
అనిరుద్ధుడు ఆర్యాదేవిని స్తుతించుట అను నూట ఇరవై రెండవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై మూడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు శోణితపురానికి వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అటు ద్వారకాపురంలో అనిరుద్ధుని యింటియందు అతని స్త్రీలు తమ ప్రియుడు కనపడక దుఃఖించారు. శ్రీకృష్ణుడువంటి మహాప్రభువు ఉండికూడ మనం భయపడి అనాథలవలె ఏడ్వాల్సివచ్చింది. ఆదిత్యగణ, మరుద్గణాది దేవతలు అతని నాశ్రయించి ఆనందంగా స్వర్గంలో నివసిస్తున్నారు. మూడులోకాలలోని ప్రాణులు అతనికి భయపడుతూ ఉంటారు. అలాంటివాడికి భయమేర్పడింది. మహావీరుడైన అతని మనుమణ్ణి ఎవరెత్తుకుపోయారో తెలియదు. వాళ్ళు భగవంతుని క్రోధాగ్నికి ఆహుతికాక తప్పదు. యదుసింహానికి ఇట్టి అపకారం చేసినవాడు ఎలా జీవించగలడు? మేము భర్తలేనివాళ్ళమయ్యాము. విచారించదగినవాళ్ళము అయ్యాము. పతివియోగంచేత యమునికి వశమయ్యాం.

ఇలా పలుకుతూ మాటిమాటికీ దుఃఖిస్తూ కన్నీరు కార్చారు. వేలాది స్త్రీలు పెద్దగా దుఃఖించుచున్న ధ్వని విని తమ తమ ఇండ్లనుండి యాదవవీరులు బయటకు వచ్చారు. ఆ పురుషులు అనిరుద్ధుని యింటిలో ఎందుకింత ధ్వని వినిపిస్తున్నది? శ్రీకృష్ణుడు మనను రక్షిస్తుండగా మనకు భయమెందుకు వచ్చింది? అని ఒకరితో ఒకరు పలుకనారంభించారు. అప్పుడు శ్రీకృష్ణుని సన్నాహ భేరి ధ్వని వినిపించింది. అందరూ అక్కడకు చేరారు.

ఈ సంఘటన ఎలా జరిగింది? అని ఒకరినొకరు అడుగుతున్నారు. తరువాత వాళ్ళకు అసలు విషయం తెలిసింది. యాదవులందరి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

విపృథుడను యాదవుడు చింతతో మాటిమాటికీ దీర్ఘంగా విశ్వసిస్తున్న శ్రీకృష్ణునితో నీవెందుకు చింతిస్తావు? నిన్నాశ్రయించి యాదవులు సుఖంగా ఉన్నారు. ఇంద్రుడు కూడా నీపై భారంమోపి సుఖంగా నిద్రపోతున్నాడు. నీ బంధువులందరూ దుఃఖ సముద్రంలో పడి ఉన్నారు. నీవొక్కడవే వాళ్ళను ఉద్ధరించగలవాడవు అన్నాడు. అప్పుడు కృష్ణుడు నిట్టూర్పు విడుస్తూ బృహస్పతివలె ఇలా మాట్లాడాడు.

విపృథూ! నేనీవిషయాన్ని ఆలోచించాను. ఈ స్థితిని ఎదుర్కొవటానికి ఉపాయం నిశ్చయంచలేకపోయాను. అందుకని నేనేమి సమాధానం చెప్పలేదు. దాశార్హులందరిమధ్యలో చెపుతున్నా. యాదవులారా! వినండి. నేను విచారంలో మునిగాను. వీరుడైన అనిరుద్ధుడు అపహరింపబడుటచే రాజులందరూ మనల్ని అసమర్థులుగా భావిస్తారు. పూర్వం సాల్వుడు ఆహుకుని అపహరించాడు. అప్పుడు దారుణమైన యుద్ధంచేసి అతన్ని తెచ్చాను. నా కుమారుడైన ప్రద్యుమ్నునికూడ శంబరుడు అపహరించాడు. రుక్మిణీ పుత్రుడతన్ని చంపి వచ్చాడు. ఇది చాలా కష్టము. అనిరుద్ధుని ఎవరు తీసుకువెళ్ళారు? ఎక్కడకు తీసుకువెళ్ళారు? వాళ్ళను యుద్ధంలో సంహరించి తీరుతాను. అని కృష్ణుడు మాట్లాడాడు. తరువాత సాత్యకి అనిరుద్ధుని వెతకటానికి గూఢచారుల్ని పంపించు. భూమండలమంతా వెతకాలి అన్నాడు.

అతని మాటలు విని శ్రీకృష్ణుడు చిరునవ్వుతో వెలుపల బయటా వెతుకుటకు చారులను ఆజ్ఞాపించమన్నాడు. అతడు ఆజ్ఞాపించగా చారులు, ఆ సమయంలో సేనాపతి అనాధృష్టుడు భయపడుతూ నా మాట నీకిష్టమైతే విను. అని మహా మహులైన వీరులను జయించావు, పారిజాతాపహరణమున ఇంద్రుని జయించావు, అతడు ఆ వైరం మనస్సులో పెట్టుకొని అనిరుద్ధుని అపహరించి యుండవచ్చు. అన్నాడు. అప్పుడు కృష్ణుడు నిట్టూర్పు విడుస్తూ దేవతలిట్టి నీచపు పనులు చేయరు. నావల్ల చాలా ఉపకారాలను పొందియున్నారు. నీవు తెలియక మాట్లాడుతున్నావని పలికి బహుశ జారిణి ఎవతో అపహరించి ఉంటుందని అభిప్రాయపడుతున్నాడు. మహాత్ముడైన కృష్ణుడు పలికిన మాటలు విని అక్రూరుడు, దేవతలు మనవల్ల ఉపకారాన్ని పొందుతున్నవాళ్ళు కనుక ఇది వాళ్ళ పని కాదని నిశ్చయించినాడు. రాక్షసస్త్రీ మాయతో ఈతన్ని తీసుకువెళ్ళి ఉంటుంది అని శ్రీకృష్ణుడన్నాడు.

తరువాత గూఢచారులు భూమండలమంతా వెతికి ఎక్కడా అనిరుద్ధుడు కనపడక తిరిగివచ్చారు. శ్రీకృష్ణునకు తమ ప్రయత్నం ఫలించలేదని విన్నవించి

ఇంకేమైనా చేయవలసినది ఉంటే ఆజ్ఞాపించమన్నారు. యాదవులు కోపంతో ఒకరినొకరు చూచుకున్నారు. స్తిమితంలేని మనస్సుతో రాత్రి అంతా గడిపారు. తెల్లవారింది. సూర్యోదయం కాగానే నారదుడు నవ్వుతూ సభలో ప్రవేశించాడు. యాదవులందరితో కలిసియున్న కృష్ణునిచూచి 'జయ'శబ్దంతో మాధవుని గౌరవించాడు. అశాంతితో కూడిన మనస్సుకలవాడై లేచి నారదునకు మధుపర్కాల, గోవును ఇచ్చి సత్కరించాడు.

సుఖాసనముపై కూర్చున్న నారదుడు ఏమిటిది? అందరూ నిరుత్సాహంతో చింతిస్తూ నపుంసకులవలె కూర్చున్నారెందుకు? అని అడిగాడు. వాసుదేవుడు పూజ్యుడా! రాత్రిపూట ఎవడో అనిరుద్ధుని అపహరించి తీసుకుపోయాడు, అతని కోసం మేమంతా చింతతో వ్యాకులమైన మనస్సుగలవాళ్ళమై ఉన్నాము. ఈ విషయం మీకు తెలిసి ఉంటే మహాత్మా చెప్పండి అని అడిగాడు. అప్పుడు నారదుడు నవ్వి మధుసూదనా! విను.

ఒక్కడైన అనిరుద్ధునకు బాణాసురునితో మహాయుద్ధం జరిగింది. బాణాసురుడికి 'ఉష' అనే కూతురుంది. ఆమెకోసం చిత్రలేఖ అనే అప్సరస అనిరుద్ధుని అపహరించి తీసుకువెళ్ళింది. అక్కడ బాణాసురునకు, అనిరుద్ధునకూ మహాదారుణమైన యుద్ధం జరిగింది. అద్భుతమైన ఆ యుద్ధాన్ని మేము తిలకించాం, బాణాసురుడతన్ని జయించలేక మాయాయుద్ధం ద్వారా నాగు పాములతో బంధించి తరువాత అతన్ని చంపమని ఆజ్ఞ ఇచ్చాడు. కాని అతని మంత్రి కుంభాండుడు అడ్డగించాడు. ఇప్పటికి నాగపాశాలతో కట్టబడి ఉన్నాడు అనిరుద్ధుడు. ఇప్పుడు నీవు కీర్తినీ, విజయాన్నీ పొందటానికి త్వరగా, లే, విజయం కోరేవాళ్ళు ఉపేక్షించే సమయం కాదిది. ప్రాణసంకట సమయంలో వీరుడైన అనిరుద్ధుడు ధైర్యంతో ఉన్నాడు. అని చెప్పాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు యుద్ధానికి కావలసిన వస్తువులను సిద్ధం చెయ్యమని ఆజ్ఞాపించాడు. జనారుధనుడు చందనంతో కూడిన పేలాలు చల్లుచుండగా బయల్దేరాడు. నారుదుడు మహాబాహూ! గరుత్మంతుని తలుచుకో, ఆ ప్రదేశానికి వెళ్ళటం శక్యం కాదు. పదకొండువేల యోజనాలు దూరంలో ఉంది శోణితపురం. అక్కడ ఉన్నాడు అనిరుద్ధుడు. మనోవేగం గల గరుత్మంతుని తీసుకువెళ్తాడు అక్కడికి, అతన్ని పిలువుము. ఒక్కక్షణంలో బాణాసురుని చూడగలుగుతావు. అన్నాడు

శ్రీకృష్ణుడు తలవగానే ప్రత్యక్షమైన వైనతేయుడు పద్మనాభ! నన్నెందుకు పిలిచావు? నీ పని ఏమిటో వినగోరుచున్నాను. ఎవని పట్టణాన్ని రెక్కల దెబ్బలచే నాశనం చేయ్యాలి? గోవిందా! నీ ప్రభావంవల్ల నా బలం ఎవనికీ తెలియదు. నీ గదావేగాన్నీ, చక్రాయుధం మంటలను ఎరుగని ఆ మూఢుడు ఎవడు? ఎవడు సపరివారంగా యముని యింటికి వెళ్ళగోరుచున్నాడో అన్నాడు. వాసుదేవుడు బాణాసురుడు ఉష కారణంగా అజేయుడైన అనిరుద్ధుని శోణితపురంలో నాగపాశాల చేత బంధించాడు. కామార్తుడైన అనిరుద్ధుని విడిపించుటకు నిన్ను పిలిచాను. నీ వేగంతో సమానమైన వేగమెవ్వడికీ లేదు. మరొకసాధనంతో వెళ్ళదగిన మార్గం కాదు, కనుక అనిరుద్ధుడున్నచోటుకు త్వరగా నన్ను తీసుకువెళ్ళు. మూడు లోకాలలో నీతో సమానమైన పరాక్రమవంతుడు లేడు. ఓ మహాభాగ! అనిరుద్ధుని విషయంలో సహాయము చేయుము అని పలికాడు.

అప్పుడు గరుత్మంతుడు నీవు స్తోత్రం చేయదగినవాడవు, అందుకు విపరీతంగా నన్ను స్తోత్రం చేస్తున్నావు. గోవర్ధనపర్వతాన్ని యెత్తటం మొదలైన ఎన్నో అద్భుతకార్యాలను చిన్నప్పటినుండి ప్రదర్శించినవాడవు నీవు. నీ చేతిలో మరణించినవాళ్ళందరూ స్వర్గానికి వెళ్ళారు. దుష్టుల నెంతమందినో చంపావు. ఈ నేను నీకు స్వాధీనుడను. నీ శాసనానికి బద్ధుడను. అని జయజయధ్వనితో ఇదిగో నేను సిద్ధంగా ఉన్నాను మహాబలశాలీ అధిష్టించుము అన్నాడు. మాధవుడు అతన్ని కౌగలించుకొని మిత్రమా శత్రువినాశం కొరకు సత్కారమును స్వీకరించ మని సత్కరించి శంఖచక్రగదాఖడ్గాలను ధరించి సువర్ణునిపై అధిరోహించాడు. అత్యధిక సౌందర్యం కలిగి వందిమాగధులు స్తోత్రం చేస్తుండగా ఋషులచే ప్రశంసింపబడుచూ ద్వారకలో చేయవలసిన పనులను ఆజ్ఞాపించి ప్రతాపవంతు డైన వాసుదేవుడు బయల్దేరాడు. ముందు శ్రీకృష్ణుడు వెనుక బలరాముడు, అతని వెనుక ప్రద్యుమ్నుడూ గరుడునిపై కూర్చున్నారు. ఓ మహాబాహూ! బాణాసురుని జయించు. యుద్ధరంగంలో నీకెదురు ఎవ్వడుమా నిలువలేడు. నీ అనుగ్రహించే లక్ష్మి ప్రాప్తిస్తుంది. యుద్ధంలో సైనికులతో సహా శత్రువును జయించుతావు అని సిద్ధచారణ సంఘాలు, మహర్షులు పలుకుతుండగా కేశవుడు యుద్ధానికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు శోణితపురానికి వెళ్ళుట నూట ఇరవై మూడవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై నాల్గవ అధ్యాయము

## అగ్నితో యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత నలువైపుల నుండీ వాద్యధ్వనులు, శంఖధ్వనులు, వందిమాగధుల స్తోత్ర పాఠాలు ఆరంభమయ్యాయి, అప్పుడు భగవంతుని శరీరము సూర్యచంద్రులవలె ప్రకాశించుతున్నది. భగవంతుని తేజస్సుతో ఎగరబోతున్న గరుడుని శోభ సాటిలేనిదై ఉంది. ఆ సమయంలో భగవంతుడైన కృష్ణుడు ఎనిమిది భుజాలను ధరించాడు. అతని శరీరం పర్వతంవలె విశాలమైంది. ఆయన అప్పుడు బాణాసురుని సంహరించే యుక్తులను ఆలోచిస్తున్నాడు. కుడివైపున ఖడ్గం, చక్రం, గద, బాణము, ఎడమవైపున డాలు, ధనుస్సు, శంఖం చేతులలో ఉన్నాయి. అప్పుడు వేయి శిరస్సులను ధరించాడు.

బలరాముడు కూడా వెయ్యిరూపాలను ధరించాడు. అతని చేతులలో తెల్లని ఆయుధాలున్నాయి. ప్రద్యుమ్నుని శోభ, సనత్కుమారుని శోభతో సమానంగా ఉంది. గరుడుడు ఆకాశాన్నంతనూ ఆక్రమించి నడుస్తున్నాడు. అతని రెక్కలగాలికి చాలా పర్వతాలు కదిలిపోయాయి. ఆ సమయంలో బలరాముడు శ్రీకృష్ణునితో ఇప్పుడు మనం కాంతిలేనివాళ్ళం ఎందుకు అవుతున్నాం, పూర్వం ఎప్పుడూ ఇలా కాలేదు అన్నాడు. భగవంతుడు బాణాసురుని నగరం దగ్గరలో ఉన్నదని తలుస్తున్నాను. నగరరక్షణకు ప్రజ్వలిస్తున్న అగ్ని బయల్దేరింది. ఆ ఆహవనీయాగ్ని ప్రభావంచేత మన శరీరకాంతి తగ్గినది. అన్నాడు. అప్పుడు బలరాముడు నగర సమీపానికి రాగానే మనం ఇలా అయ్యాం, కాబట్టి ఈ సమయంలో మనం చేయ దగిన పనిని నీవే నిశ్చయించాలి, నీ ఆలోచన తెలుసుకొని మేం చేయదగిన పని స్థిరం చేస్తాం అన్నాడు.

ఇష్టమైన రూపం ధరించగల గరుడుడు వెయ్యిముఖాలు ధరించాడు. తరువాత వాళ్ళు ఆకాశగంగ దగ్గరకు వెళ్ళారు. గంగాజలాన్నిత్రాగి పైనుండి బాణుని నగరంపైన నీటిని వర్షించారు. దానితో ఆహవనీయాగ్ని చల్లారిపోయింది. ఆకాశ గంగాజలంతో అగ్ని ఆరిపోవుటం చూచి గరుత్మంతుడు మిక్కిలి ఆశ్చర్య పోయాడు. అగ్ని ఆరిపోయిన తరువాత గరుత్మంతుడు కృష్ణ బలరామ, ప్రద్యుమ్న లను తీసుకొని బయల్దేరాడు. అతనిరెక్కల విసురునకు పెద్ద భయంకరధ్వని

ఏర్పడింది. రుద్రుని పరిచారకులైన అగ్నిసమూహము గరుడునిపై భయంకర స్వరూపాలుగల వీళ్ళెవరు? ఇక్కడికెందుకు వచ్చారు? అని చాలాసేపు ఆలోచించినా మందబుద్ధులైన అగ్నిగణము నిర్ణయించలేకపోయారు.

తరువాత అగ్నిరూపం ధరించిన రుద్రసేవకులు ఈ ముగ్గురితో యుద్ధం ప్రారంభించారు. పెద్దకోలాహల ధ్వని ఏర్పడింది. ఆ ధ్వని విని బాణాసురుడు ఓ దూతను పిలిచి నీవు త్వరగా యుద్ధభూమికి వెళ్ళి అక్కడవిషయమంతా చూచి త్వరగా తిరిగిరా అన్నాడు. దూత యుద్ధభూమికి వెళ్ళాడు. అక్కడ వాసుదేవునితో అగ్నిగణాలు ఘోరమైనయుద్ధం జరుగుతోంది. అన్ని విధాలైన అగ్నులూ యుద్ధం చేస్తున్నాయి. వారిలో ఒకడైన అంగిరసుడు తీక్ష్ణములైన బాణాలతో యుద్ధం చేయటంచూచి ఓ అనలగణమా క్షణమాగండి, మీరు నా బాణాలదెబ్బకు నలు దిక్కులకూ పారిపోతారు అన్నాడు కృష్ణుడు.

తరువాత అంగిరసుడు మండుతున్న త్రిశూలం తీసుకొని వేగంగా భగ వంతునివైపు పరుగెత్తాడు. శ్రీకృష్ణుడు అర్ధచంద్రాకార బాణంతో అతని త్రిశూలాన్ని ఖండించాడు. తరువాత స్థూణాకర్ణమనే బాణంతో అంగిరసుని శరీరమంతా రక్తంతో తడిసిపోయింది. అతడు స్వాధీనం తప్పి నేలకూలాడు. తరువాత బ్రహ్మకు పుత్రులైన నాలుగు అగ్నులు దైత్యరాజైన బాణాసురుని పట్టణంలోకి పారిపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
అగ్నితో యుద్ధము అను నూట ఇరవై నాల్గవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై ఐదవఅధ్యాయము

## శ్రీకృష్ణ శివ- జ్వరాల యుద్ధం

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత భగవంతుడు బాణాసురుని నగరమైన శోణితపురం సమీపానికి చేరాడు. దూరంనుండే చూచియే నారదుడు ఓ కృష్ణా! ఇదే శోణితపురం, శంకరుడు బాణాసురునికి శుభంకోరి అతని రక్షణకొరకు పార్వతీ కుమారస్వాముల తో కూడా ఇక్కడ నివసిస్తాడు. అన్నాడు. భగవంతుడు మునివర! మీరు మాకు శుభం కలగాలని కోరండి బాణుని రక్షించటానికి శంకరుడు స్వయంగా యుద్ధానికి వస్తే నా శక్తికొలది అతనితో యుద్ధంచేస్తా. అని మాట్లాడుతుండగనే ఒక్కక్షణంలో

గరుడుడు శోణితపురానికి వచ్చాడు. అప్పుడు భగవంతుడు పాంచజన్యశంఖాన్ని పూరించాడు. ఇలా శంకధ్వనితో భయం కలిగిస్తూ భగవంతుడు శోణితపురంలో ప్రవేశించాడు. ఆ శంఖధ్వని విని భేరీధ్వనులతో బాణాసురునిసేన నలువైపుల నుండి సంసిద్ధమైంది.

వాళ్ళలో కింకరులనే సైన్యసమూహం యుద్ధానికి ఆజ్ఞపొంది మిక్కిలి తీక్ష్ణమైన శస్త్రాస్త్రములతో దళమంతా బయటకు వచ్చింది. లెక్కలేనంతసైన్యం ఒకచోటకు చేరింది. ఆ సైనికులలో శంకరుని ప్రమథగణం కూడా ఎక్కువగానే ఉంది. ఆ సైన్యం యుద్ధభూమికి వచ్చి యుద్ధం ఆరంభించింది. వాళ్ళు అగ్నితో సమానమైన తేజస్సు కలిగిఉన్నారు. యక్ష, రాక్షస, దానవగణములు నలువైపుల నుండి వచ్చి నలుగురు వీరుల యొక్క రక్తాన్ని త్రాగనారంభించారు. అప్పుడు మహాబలవంతుడైన బలరాముడు ఆ సేన మధ్యలో నిలిచి శ్రీకృష్ణునితో ఈ సైనికులకు త్వరగా భయం కలిగేటట్లు చెయ్యి అన్నాడు.

శ్రీకృష్ణుడు ఆగ్నేయాస్త్రంతో వాళ్ళను భయపెట్టి క్రవ్యాదాస్త్రంతో దూరం పరుగెత్తేటట్లు చేశాడు. వాళ్ళు అనేకవిధాలైన ఆయుధాలను ధరించిన సైనికదళం వద్దకు చేరారు. ఆ యోధులు పర్వతాల వలె, మేఘాలలాగా భయంకరమైన ఆకారాలతో ఉన్నారు. అనేకవిధాలైన వాహనాలపై కూర్చొని ఉన్నారు. తరువాత ఆ రాక్షససేన అనేక ఆయుధాలను ధరించి యుద్ధభూమిని కప్పివేసింది. అప్పుడు బలరాముడు కృష్ణునితో మహాబాహూ! ఈ దానవసైన్యంతో నాకు యుద్ధం చెయ్యాలని కోరికగా ఉంది అన్నాడు. నాకూ ఇదే కోరిక ఉందన్నాడు కృష్ణుడు. నేను తూర్పుముఖంగా యుద్ధం చేస్తాను, నాకు ముందు గరుత్మంతుడుంటాడు, ప్రద్యుమ్నుడు ఎడమవైపున, కుడివైపున నీవు ఉండండి. ఇలా అయితే ఒకరినొకరు రక్షించుకోగలుగుతాము అన్నాడు వాసుదేవుడు.

వాళ్ళిలా మాట్లాడుకొని గరుత్మంతుని వీపుపై కూర్చున్నారు. బలరాముడు పర్వతశిఖరం వంటి గదను, రోకలిని, నాగలిని పట్టుకొని యుద్ధం ప్రారంభించాడు. ఆ సమయంలో అతని ఆకారం భయంకరంగా ఉంది. అతడు నాగలితో దగ్గరకు లాగి శత్రువులను వధిస్తున్నాడు. యుద్ధరంగంలో నిర్భయంగా సంచరిస్తున్నాడు. మహాబలవంతుడైన ప్రద్యుమ్నుడు భయంకర బాణవర్షం కురిపించి రాక్షసులను నివారిస్తున్నాడు. శంఖచక్రగదాధారి శ్రీకృష్ణుడు మాటిమాటికీ శంఖాన్ని ఊదుతూ యుద్ధం చేస్తున్నాడు. ఇటు గరుడుడు తనరెక్కల విదిలింపుచేత గోళ్ళతో చీల్చటం

వల్ల ముక్కుతో పొడవటంచేతా లెక్కలేనంతమందిని యమదర్శనానికి పంపాడు. ఆ రాక్షససైన్యం మిక్కిలి బాధచెంది వెన్నుచూపి పారిపోవనారంభించింది.

అప్పుడు అసురసైన్యాన్ని రక్షించటానికి శివజ్వరం వచ్చింది. దానికి మూడు కాళ్ళు, మూడుతలలు, ఆరుచేతులు, తొమ్మిదికళ్ళు, భస్మాస్త్రంతో వెయ్యి మేఘాల ఉరుములవంటి కంఠధ్వని కలిగి మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తున్నది. ఆవలిస్తూ నిద్రతోనున్నది. ఆ జ్వరం కోపంతో బలరాముని నిందిస్తూ ఏం బలరామా! మదించి ఉన్నావు? యుద్ధరంగంలో నావైపు చూడటంలేదు నిలు నిలు, నేను బ్రతికుండగా నిన్ను విడిచిపెట్టను. అని బలరాముని మీదికి వచ్చింది. బలరాముని వక్షస్థలంపై భస్మాస్త్రం ప్రయోగించింది. ఆ అస్త్రం అతని వక్షస్థలం తాకక మేరుపర్వతంపై పడింది. సుమేర్వతం బ్రద్దలైంది. ఆ భస్మాస్త్రం అంశ బలరాముని శరీరంపై అంటుకున్నది. అది ప్రజ్వలించింది. దానివలన బలరాముడు నిద్రకు వశుడు కాబోయాడు, వ్యాకులుడయ్యాడు.

అప్పుడు నా శరీరం మండి పోతోంది కృష్ణా శాంతి ఎలా ప్రాప్తిస్తుంది అని అడిగాడు. కృష్ణుడు నవ్వుతూ భయపడకు అని కౌగలించుకున్నాడు. అప్పుడు మండిపోవటం శాంతించింది. అప్పుడు వాసుదేవుడు కోపించి శివజ్వరంతో ఓ జ్వరమా! రా, రా, నీ శక్తికొలది యుద్ధంచెయ్యి, నీ పౌరుషం ప్రదర్శించు అన్నాడు. అప్పుడు జ్వరము రెండుచేతులతో భస్మాస్త్రాన్ని కృష్ణునిపై విసిరింది. క్షణకాలం బాధించి ఆ అస్త్రం శాంతించింది. తరువాత సర్పాకారంగల మూడుచేతులతో మెడమీద ఒకచేతితో రొమ్ముమీద గుద్దాడు. వాళ్ళిద్దరికీ తీవ్రయుద్ధం జరిగింది. తరువాత శ్రీకృష్ణుడు తనభుజాలతో జ్వరాన్ని పీడించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణ శివ- జ్వరాల యుద్ధం అను నూట ఇరవై ఐదవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై ఆరవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు శంకరునితో యుద్ధము చేయుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణుడు జ్వరం చచ్చిపోయిందని తలచి భూమిమీద విసిరి వేశాడు. అది కృష్ణుని శరీరంలోకి ప్రవేశించింది. దానివల్ల తొట్రుపడుతూ ఆవలిస్తూ

నిద్రకులోనౌతు శ్రీకృష్ణుడు ధైర్యం తెచ్చుకొని ఈ జ్వరాన్ని నాశనంచేసే మరొక జ్వరాన్ని సృష్టించాడు. ఆ వైష్ణవజ్వరం సమస్తప్రాణులకు భయం కలిగించేది. శ్రీకృష్ణుడు సృష్టించిన జ్వరం అతని శరీంలోకి ప్రవేశించి లోపల ఉన్న శివజ్వరాన్ని బయటకులాగి నేలపై కొట్టి ముక్కలు ముక్కలు చేద్దామనుకొనుచుండగా ఓ మహాబాహు! శైవజ్వరాన్ని నశింపజేయకు. దాన్ని రక్షించు అని ఆకాశవాణి పలుకగా జగన్నాధుడు దానిని విడిచిపెట్టాడు.

అప్పుడు శైవజ్వరం భగవంతుని పాదాలపై తలమోపి శరణాగతినిచేసి ఓ యదునందనా! నేను చెప్పేమాట వినుము. నా కోరిక తీర్చు, లోకంలో నేనొక్క జ్వరమే. మరొకజ్వరం లేదు. రెండవజ్వరం ఉండకూడదు, ఇదే నేను కోరుతున్న వరము అన్నది. నీవు శరణాగతిచేసి కోరావు కనుక నీ కోరిక ప్రకారమే జరుగు తుంది అని భగవంతుడు వరమిచ్చాడు. మొదట నీవు ఒంటరిగా ఉన్నట్లే ఉంటావు. నా శరీరంనుండి పుట్టిన వైష్ణవజ్వరం నా శరీరంలోనే విలీనమవుతుంది అన్నాడు భగవంతుడు. మరియూ ఓ జ్వరమా! నీవు లోకంలో ఎలా పంచరించవలసినది చెపుతా విను.

నీవు మూడు విభాగాలయి మొదటిభాగం నాలుగుకాళ్ళు గల పశువులలోను, రెండవభాగం కదలని ప్రాణులయందు, మూడవవిభాగం మనుష్యులయందు పంచరించాలి. వృక్షాలలో, పురుగురూపంతో, తెల్లనిఆకుల రూపంలోను, పండ్లలో ఆతుర్యంగానూ, పద్మమందు మంచుగాను, భూమిలో ఎడారిగాను, పర్వతాలపై ఎర్రమట్టిగాను, నా అనుగ్రహంతో ఉంటావు. చూడటంచేత, తాకటంచేతనూ, వశిస్తావు. దేవతలు, మనుష్యులు తప్ప ఇతరులు నిన్ను సహించలేరు. భగవంతుని మాటలువిని ఆ జ్వరం సంతోషించింది. నమస్కరించి మహానుభావా నేను శివునిచే సృష్టించబడ్డాను. యుద్ధంలో నీవు నన్ను జయించావు. దేవా నేను నీ సేవచేయు వ్యక్తిని, ధన్యత కలిగింది. నీకిష్టమైన పని యేం చేయమంటావు అని అడిగింది. భగవంతుడు యుద్ధరంగంలో మన యిరువురి పరాక్రమాన్ని నమస్కార పూర్వకంగా పఠించినవాడు జ్వరం లేనివాడవుతాడు. అన్నాడు. శైవజ్వరం శ్రీకృష్ణునికి శిరస్సుతో నమస్కరించి యుద్ధభూమినుండి తొలగిపోయింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శ్రీకృష్ణుడు శంకరునితో యుద్ధము చేయుట నూట ఇరవై ఆరవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై ఏడవ అధ్యాయము

## శివ శ్రీకృష్ణుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత ఆ ముగ్గురూ మూడగ్ను లాగా గరుత్మంతునిపై కూర్చొని యుద్ధం చేస్తున్నారు. వాళ్ళ బాణవర్షంలో దైత్యసేనను ముంచెత్తారు. సుదర్శనచక్రము, నాగలి, బాణవర్షమూ దానవ సైన్యాన్ని పీడించాయి. శ్రీకృష్ణుని బాణాగ్ని సైన్యమనే ఎండుగడ్డిని కాల్చి మిక్కిలి ప్రజ్వరిల్లింది. వేలాది సైనికు లందులో భస్మమయ్యారు. ఇట్లు అనేకవిధాల తన సైన్యం మర్దింపబడుటచూచి దైత్యరాజు బాణాసురుడు అక్కడకు వచ్చాడు. పారిపోవద్దని సూచిస్తూ ఓ సైనికులారా! నీచులులాగా పారిపోతారేమి? కవచచర్మాదులను, అనేక విధములైన శస్త్రాస్త్రములను విడిచి ఆకాశానికి పారిపోతే ప్రయోజనమేముంది? మీ వంశ గౌరవమును బట్టి మీ ప్రభావమునుబట్టి శంకరుడు మీ దగ్గర ఉంటున్నాడు. ఈ మాటలను గుర్తుంచుకోండి.

చూడండి నేనొక్కడనే యిక్కడ నిలబడ్డాను. అనే దైత్యరాజు మాటలువిని క్షణమాలోచించి తిరిగి వచ్చారు. మిగిలిన ప్రమథగణాలతోపాటు రాక్షససేన మరల యుద్ధానికి సిద్ధమైంది. ఆ సమయంలో బాణాసురుడి మంత్రి కుంభాండుడు ఓ సైనికులారా! బాణాసురుడు, స్వయంగా శంకరుడు, కుమారస్వామి వీళ్ళంతా యుద్ధరంగంలో నిలిచారు. మీరెందుకు పారిపోవటం? అన్నాడు. కాని భగవంతుని చక్రాగ్నికి మిక్కిలి భయపడి నలుదిక్కులకూ పారిపోయారు.

ఇలా శ్రీకృష్ణుని తేజస్సుచే సైన్యమంతా ఛిన్నాభిన్నమవటం చూచి కళ్ళెర్ర చేసి శివుడు యుద్ధం చేయటానికి సిద్ధపడ్డాడు. బాణాసురుని రక్షించటానికి అగ్నితో సమానమైన తేజస్సు కలవాడై రథంమీద ఎక్కాడు. కార్తికేయుడు, నంది రథంమీద కూర్చున్నారు. శివుడు పళ్ళు కొరుకుతూ శ్రీహరివైపు నడిచాడు. అతని రథం పూర్ణిమనాటి చంద్రునివలె ఉంది. అనేకరూపాలుగల వేలాది గణములతో చుట్టబడి రథంమీద ఉన్న రుద్రునిచూచి శ్రీకృష్ణుడు గరుడిపై కూర్చుని రుద్రుని మీదకు వెళ్ళాడు. శ్రీకృష్ణునిచూచి కోపంతో శివుడు వందలాది బాణాలాతనిపై ప్రయోగించాడు.

శ్రీకృష్ణుడు పర్జన్యాస్త్రం చేతపట్టగానే భూమి కంపించింది, పర్వతాలు పడి పోయాయి, నక్కలు కూశాయి, గంధర్వవిద్యాధరాదులు చూస్తూ ఆకాశంలో నిలిచి ఉన్నారు. ఆ అస్త్రం మండుతూ రుద్రుని మీదికి వెళ్ళింది. శివుని రథం ఉన్నవైపున వందలకొలది వేలకొలది బాణాలు అన్నివైపులనుండి వచ్చిపడ్డాయి. అప్పుడు రుద్రుడు కోపంతో ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడు నలుగురూ చీల్చ బడిన శరీరాలు కలవాళ్ళయ్యారు. బాణాలచేత కప్పబడి అగ్నిచే కాలిపోతూ కనపడ లేదు. రాక్షసులందరూ సింహనాదాలు చేశారు. ప్రతాపవంతుడైన హరి వారు ణాస్త్రాన్ని ప్రయోగించాడు. దానితో ఆగ్నేయాస్త్రం చల్లబడింది. అప్పుడు శివుడు పైశాచ, రాక్షస. రౌద్ర, అంగిరసములనే అస్త్రాల్ని ప్రయోగించాడు. వాటిని నివారించ టానికి శ్రీకృష్ణుడు వాయువ్య, సావిత్ర, వాసవ, మోహనాస్త్రాలను ప్రయోగించాడు.

శంకరుని నాలుగు అస్త్రాలు శాంతించాయి. తరువాత శ్రీకృష్ణుడు భయం కరమైన వైష్ణవాస్త్రాన్ని ప్రయోగించాడు. దానితో అసుర, యక్ష, భూతాలు మొదలైన బాణాసురుని సైన్యమంతా భయంతో నాలుగువైపులకూ పారిపోయింది. ప్రమథ గణాలు, రాక్షససేన చీల్చివేయబడగా బాణాసురుడు స్వయంగా మిక్కిలి త్వరగా యుద్ధానికి ముందుకొచ్చాడు. మహాబలవంతులైన దైత్యులనేక శస్త్రాస్త్రములతో పెద్దపెద్ద రథాలమీద దేవతలు, ఇంద్రుని వెంట వెళ్ళినట్లు అతనివెంట బయల్దేరారు. బ్రాహ్మణులు జపాలు, మంత్రపాఠాలు, ఆశీర్వాదాలు చేశారు. వాళ్ళకు ధనమూ, వస్త్రాలు మొదలైనవి దానంచేసి, ధనుస్సు ధరించి రథంపై కూర్చున్నాడు. పైన జెండా ఎగురుతున్నది. అతనివెంట సముద్రంలా దానవసైన్యం వచ్చి ముందు నిలిచింది. అసురరాజైన బాణాసురుడు వాళ్ళవెనుక నిలబడ్డాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శివ శ్రీకృష్ణుల యుద్ధము అను నూట ఇరవై ఏడవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై ఎనిమిదవ అధ్యాయము

## హరిహరాత్మక స్తోత్రము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఆ సమయంలో ప్రపంచమంతా చీకటి ఏర్పడింది. రుద్రుడు, నంది, రథం ఏమీ కనిపించటంలేదు. శివుడు బ్రహ్మబాణం ఎక్కుపెట్టాడు.

మహాత్ముడైన వాసుదేవుడదిది గ్రహించాడు. పురుషోత్తముడు జృంభణమనే అస్త్రం పట్టుకొన్నాడు. మహాబలశాలి కృష్ణుడు ఆ అస్త్రంతో శివుని స్తంభింపచేశాడు. బలమత్తుడైన బాణాసురుడు మాటిమాటికీ శివుని ప్రోత్సహించాడు. శివుడు స్మృతి తప్పి కాంతిహీనుడయ్యాడు. అప్పుడు శ్రీకృష్ణుడు శంఖం పూరించాడు. పాంచ జన్యధ్వనిచేత శార్ఙ్గమనే ధనుస్సు ధ్వనిచేతనూ సమస్త ప్రాణులు భయపడ్డాయి. ఈ మధ్యలో శంకరుని గణాలు మాయాయుద్ధంలో ప్రద్యుమ్నుని ఎదుర్కొన్నాయి. కాని మకరకేతనుడు తన శస్త్రబలంచేత అందరినీ విద్రపోయినవారిగా చేశాడు. బాణసమూహంతో రాక్షసులను సంహరించాడు.

తరువాత ఆవులిస్తున్న శివుని నోటినుండి భయంకరమైన అగ్నిజ్వాల పుట్టింది. అది పదిదిక్కులను కాల్చివేస్తున్నట్లున్నది. అప్పుడు భూదేవి ఆ మహాత్ముల సంఘర్షణచే పీడింపబడి వణుకుతూ బ్రహ్మ దగ్గరకు వెళ్ళింది. ఓ దేవదేవ! శ్రీకృష్ణ రుద్రదేవుల పరాక్రమానికి భయపడుతున్నాను. వీళ్ళ యిద్దరిచే ఆక్రమింపబడి నశిస్తావనిపిస్తోంది. నేను ఎక్కువ భారాన్ని సహించలేను. నా భారం తగ్గించమని కోరుతున్నా అన్నది.

అప్పుడు పితామహుడు ఓ భూదేవి క్షణకాలం ధైర్యంపట్టు. తరువాత తేలిక పడతావు. తరువాత బ్రహ్మ రుద్రుని వద్దకు వెళ్ళి ఓ ప్రభూ! ఈ మహారాక్షసుని వధ విధానం పూర్వమే నిర్ణయించావు. ఇప్పుడు అతన్ని ఎందుకు రక్షిస్తున్నావు? శ్రీకృష్ణునితో యుద్ధం చేయటం నీకు ఎప్పుడూ తగింది గాదు. అతడు నీ రెండవ ఆత్మయే అన్నాడు. బ్రహ్మమాట విని శంకరుడు శ్రీకృష్ణుని శరీరంలోకి ప్రవేశించాడు. బాణాసురవధ నిర్ణయాన్ని విస్మరించాడు. బ్రహ్మకేమి సమాధానం చెప్పలేదు. యుద్ధంనుండీ పూర్తిగా తప్పుకున్నాడు.

శివుడు కృష్ణ శరీరంనుండి బయటకు వచ్చాడు. నేను కృష్ణునితో ఇప్పుడు యుద్ధం చెయ్యను. భూమికి భారం తొలగింది. ఇది బాగుంది అన్నాడు. తరువాత రుద్రదేవుడు, కృష్ణుడూ కంఠం కౌగలించుకొని కలిసిపోయారు. పరమానందంతో యుద్ధభూమి నుండి తిరిగి వెళ్ళిపోయారు. బ్రహ్మ ఒక్కడే వాళ్ళిద్దరూ కలిసిపోవడం చూచాడు. ఆయనకు చాలా ఆశ్చర్యం కలిగి దగ్గర నారదునితో కూడా ఉన్న మార్కండేయునితో మహాత్మా! నేను రాత్రి కలగన్నాను. అదేమంటే-

మందరపర్వతం దగ్గర పద్మవనంలో విష్ణువు శంకరుని రూపం ధరించి త్రిశూలం, పట్టిశం, పులిచర్మం ధరించాడు. శంకరుడు గరుడునిపై కూర్చొనగా

విష్ణువు ఎద్దుపై కూర్చున్నాడు. నాకు మిక్కిలి ఆశ్చర్యమైంది. మీరా స్వప్నంయొక్క యదార్థ కారణాన్ని చెప్పండి అని అడిగాడు. అప్పుడు మార్కండేయుడు ఓ పితామహా! శివ విష్ణువులకు భేదంలేదు. వాళ్ళిద్దరూ ఎల్లప్పుడూ అందరికీ శుభాలను కలగజేస్తారు. వాళ్ళకు ఆది మధ్య అంతము అనేవి లేవు. వాళ్ళు నశించరు. నిత్యులు, హరిహరస్వరూప విషయంలో కొంచం చెపుతా విను.

విష్ణువే బ్రహ్మ, శివుడు, ఒకే మూర్తినుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పుట్టారు. వీళ్ళ ముగ్గురూ లోకకర్తలు, లోకనాథులు, వరాలిచ్చేవాళ్ళు, స్వయంగా జన్మించినవాళ్ళు. ఒకప్పుడు అర్థనారీశ్వర స్వరూపంతోనూ, అర్థపురుష స్వరూపంతోనూ వీళ్ళ ముగ్గురూ ఘోరతపస్సు చేశారు. విష్ణువు రుద్రశరీరంలో ప్రవేశిస్తే రుద్రరూపుడౌతాడు. శివుడు విష్ణు శరీరంలో ప్రవేశించి విష్ణురూపుడౌతాడు. రుద్రుడు, అగ్ని, విష్ణువు, సోముడు(చంద్రుడు) ఈ ప్రపంచమంతా అగ్నిసోముల స్వరూపమే.

వీళ్ళు సృష్టికర్తలు, సంహారకర్తలు, వీళ్ళు జరిగినదాన్ని, జరగబోయేదాన్ని జరుగుతున్నదాన్నీ తెలుసుకోగలరు. బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు మేఘరూపంతో వర్షిస్తారు. సూర్యరూపంతో కిరణాలను విస్తరిస్తారు, వాయురూపంలో వీస్తారు. ఓ పితామహా! నీ దగ్గర ఈ రహస్య విషయం స్పష్టం చేశాను. ఈ చెప్పబోయే స్తోత్రాన్ని ఎవడు నిత్యమూ పఠిస్తాడో లేక వింటాడో వాడు చివరకు రుద్రదేవుని యొక్క విష్ణువుయొక్క దయతో గొప్ప స్థానాన్ని పొందుతాడు.

నేను శివ బ్రహ్మ విష్ణు స్తోత్రం చేస్తున్నాను. శివకేశవుల ఆత్మ ఒక్కటే. శరీరం మాత్రమే రెండుగా ఉంది, విష్ణువుగాని, విష్ణువు లేకుండా శివుడుకాని ఉండడు. ఇందుచేతనే పూర్వం ఇద్దరూ కలిసిపోయారు. అలా కలిసినట్టి శివ కేశవులకు నమస్కరిస్తున్నాను.

## హరిహరాత్మక స్తోత్రము

శ్లో॥ నమో రుద్రాయ కృష్ణాయ నమస్సంహతచారిణే।
నమషడర్ధ నేత్రాయ సద్వినేత్రాయవై నమః॥
నమః పింగలనేత్రాయ పద్మనాభాయవై నమః।
నమః కుమార గురవే ప్రద్యుమ్న గురవే నమః॥

నమో ధరణీధరాయ గంగాధరాయవై నమః।
నమో మయూర పిచ్ఛాయ నమః కేయూర ధారిణే॥
నమః కపాల మాలాయ వనమాలాయవై నమః।
నమస్త్రీ శూలహస్తాయ చక్రహస్తాయవై నమః॥
నమః కనకదండాయ నమస్తే బ్రహ్మదండినే।
నమశ్చర్మ నివాసాయ నమస్తే పీతవాసవే॥
నమోస్తు లక్ష్మీపతయే ఉమాయా పతయే నమః॥
నమః ఖట్వాం గధారాయ నమో ముసలధారిణే॥
నమో భస్మాంగరాగాయ నమః కృష్ణాంగధారిణే।
నమః శ్మశానవాసాయ నమస్సాగర వాసినే॥
నమోస్త్వనేక రూపాయ బహురూపాయవై నమః॥
నమః ప్రలయ కర్త్రేచ నమస్త్రైలోక్యధారిణే।
నమోஉస్తు సౌమ్యరూపాయ నమోభైరవరూపిణే॥
విరూపాక్షాయ దేవాయ నమః సౌమ్యేక్షణాయచ।
దక్షయజ్ఞ వినాశాయ బలేర్నియమనాయచ॥
నమః పర్వతవాసాయ నమస్సాగరవాసినే।
నమస్సుర రిపుఘ్నాయా త్రిపురఘ్నాయావై నమః॥
నమోஉస్తు నరకఘ్నాయ నమఃకామాంగనాశినే।
నమస్త్వం ధకనాశాయ నమః కైటభనాశినే॥
నమ సహస్రహస్తాయ నమోஉ సంఖ్యేయబాహవే।
నమ సహస్రశీర్షాయ బహు శీర్షాయవై నమః॥
దామోదరాయ దేవాయ ముంజుమేఖలినే నమః।
నమస్తే భగవన్ విష్ణో! నమస్తే భగశ్చవ।
నమస్తే భగవన్ దేవ! నమస్తే దేవపూజిత॥
నమస్తే కర్మణాం కర్మ నమోஉమిత పరాక్రమ।
హృశికేశ నమస్తేஉస్తు స్వర్ణకేశ నమోஉస్తుతే॥
ఇమంస్తవం యోరుద్రస్య విష్ణోశ్చైవ మహాత్మనః।
సమేత్య ఋషిభిస్సర్వైః స్తుతా స్తౌతి మహర్షిభిః॥

వ్యాసేన వేద విదుషా నారదేనచ ధీమతా।
భరద్వాజేన గార్గ్యేణ విశ్వామిత్రేణ వైతథా॥
అగస్త్యే నపులస్త్యేన దౌమ్యేనతు మహాత్మానా।
యా యిదం పఠతే నిత్యం స్తోత్రం హరిహరాత్మకమ్।
అరోగో బలవాంశ్చైవ జాయతే నాత్ర సంశయః।
శ్రియంచలభతేనిత్యం నచ స్వర్గాన్నివర్తతే।
అపుత్రో లభతే పుత్రం కన్యా విందతి సత్పతిమ్।
గుర్విణీశ్రుణుతే యాతు వరం పుత్రం ప్రసూయతే।
రాక్షసాశ్చ పిశాచాశ్చ విఘ్నానిచ వినాయకః।
భయం తత్ర నకుర్వంతి యత్రాయం పఠ్యతేస్తవః॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
హరిహరాత్మక స్తోత్రము నూట ఇరవై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవై తొమ్మిదవ అధ్యాయము

## కోటవీదేవి కుమారస్వామిని రక్షించుట

జనమేజయుడు మహాత్మా! మహాదేవుడు వెళ్ళిపోయిన తరువాత కృష్ణ బాణాసురులకు ఎలా భయంకరంగా యుద్ధం జరిగింది అని అడుగగా మహర్షియైన వైశంపాయనుడిలా చెప్పాడు.

కుంభాండుని రథంపై కూర్చుని కుమారస్వామి శ్రీకృష్ణబలరామ ప్రద్యుమ్నుల వైపు వెళ్ళాడు. కార్తికేయుడు మిక్కిలి రోషంతో భయంకరంగా గర్జిస్తూ ఆ ముగ్గురు మహాపురుషులమీద ఒక్కసారిగా వందబాణాలు గుప్పించాడు. ఆ బాణాలకు రక్తంతో తడిసిన శరీరాలు కలవాళ్ళై కార్తికేయునితో యుద్ధం చేయమొదలు పెట్టారు. ఆ ముగ్గురు యోధులు ఒకేసారి వాయువ్య, ఆగ్నేయ, పర్జన్యాస్త్రాలతో కార్తికేయుని బాధించారు.

అప్పుడు కుమారస్వామి తన మూడు అస్త్రాలతో వాళ్ళమూడు అస్త్రాలనూ వ్యర్థం చేశాడు. అంతేకాక వాళ్ళపై శైల, వారుణ, సావిత్రాస్త్రాలను ప్రయోగించాడు. కృష్ణుడు మొదలైన ఆ ముగ్గురు ఆ మూడు అస్త్రాలనూ వ్యర్థం చేశారు. కార్తికే

యుడికి మిక్కిలి కోపం వచ్చింది. అతడు యమునివలె భయంకరుడై బ్రహ్మ శిరోనామ కాస్త్రాన్ని సంధించాడు. లోకనాశకరమైన ఆ ఆయుధం ప్రయోగించగానే అందరూ అయ్యోఅయ్యో అంటూ నాలుగువైపులకు పరుగెత్తారు. ఈ పరిస్థితిలో శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ఎత్తాడు.

ఆ చక్రాయుధ ప్రభావంచేత కార్తికేయుని బ్రహ్మశిరోనామకాస్త్రం ఒక్క సారిగా కాంతిహీనమైంది. కార్తికేయునికి మరీ కోపం హెచ్చిపోయింది. అప్పుడు శత్రునాశంచేసే శక్తి అనే బంగారు ఆయుధాన్ని కోపంతో ప్రయోగించి భయం కరంగా గర్జించాడు. ఆ శక్తి ఆకాశాన్నంతనీ ప్రకాశింపచేస్తూ బయల్దేరింది. ఇంద్రాది దేవతలు దానినిచూచి మిక్కిలి దుఃఖపడ్డారు. ఆ శక్తి దగ్గరకు రాగానే శ్రీకృష్ణుడు హుంకారంతో దాన్ని వ్యర్థం చేసి నేలమీద విసిరివేశాడు. అందరూ కృష్ణునకు ధన్యవాదాలు చెప్పారు.

ఇంద్రాదిదేవతలు అందరూ సంతోషంతో సింహనాదాలు చేశారు. శ్రీకృష్ణుడు దైత్యులను వశింపచేసే చక్రాన్ని ప్రయోగించేటప్పటికీ శివుడు చెప్పినట్లు కార్తికేయుని రక్షించటానికి దిగంబర అయని కోపినీదేవి దివ్యరూపాన్ని ధరించి అక్కడకు వచ్చింది. యుద్ధరంగంమధ్య నిలబడింది. ఈ దేవత పార్వతి యొక్క అంశ. శ్రీకృష్ణుడు పెడముఖంపెట్టి పోపో నిన్ను నిందిస్తున్నాను, నిశ్చయింపబడిన వధకు విఘ్నం కలిగిస్తున్నావేమి? అన్నాడు. కుమారస్వామిని రక్షించటానికి వస్త్రం ధరించలేదు.

శ్రీకృష్ణుడు నీవు కుమారస్వామిని యుద్ధభూమినుండి తీసుకుపోలేకపోతే బాగుండదు. నాతో ఎవడు యుద్ధంచేస్తే వాడితో పోరాడుతాను. అని పలికి తన చక్రాయుధాన్ని తీసుకున్నాడు. కార్తికేయుని తీసుకొని దేవిశంకరుని వద్దకు వెళ్ళింది. ఈ విధంగా దేవిద్వారా కుమారస్వామి రక్షణ జరుగగా మిక్కిలి భయంకర మైన వాతావరణం ఏర్పడింది. అప్పుడు బాణాసురుడు స్వయంగా యుద్ధరంగానికి వచ్చాడు. కార్తికేయుడు వెళ్ళాక బాణాసురుడు కొంచంసేపు ఆలోచించి ఇప్పుడు నేను స్వయంగా మధుసూదనుడితో యుద్ధంచేస్తా అని నిశ్చయించుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
కోటవీదేవి కుమారస్వామిని రక్షించుట అను నూట ఇరవై తొమ్మిదవఅధ్యాయము

☆☆☆

# నూట ముప్పై అధ్యాయము

## శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! కార్తికేయుడు ఓడిపోగా భూతాలు, యక్షగణాలు, బాణాసురుడి సైనికులు భయపడి నలుదిక్కులకూ పారిపోయారు. అప్పుడు బాణాసురుడు అతి త్వరగా యుద్ధభూమికి వచ్చాడు. మహావీరులైన భయంకర రాక్షసులు శస్త్రాస్త్రాలతో సిద్ధమయ్యారు. రథాలపై కూర్చుని అతనితో బయల్దేరారు. బాణాసురుని పురోహితుడు ఆశీర్వదించాడు. స్వస్తిమంత్రాలు చదివాడు, తరువాత వాద్య, యుద్ధవాద్యాలు మ్రోగాయి. వీరులు సింహగర్జనలు చేస్తున్నారు. ఆ సమయంలో బాణాసురుడు శ్రీకృష్ణుని మీదికి వెళ్ళాడు. యుద్ధభూమికి బాణాసురుడు రావటంచూచి శ్రీకృష్ణుడు గరుడునిపై కూర్చున్నాడు. తనవైపు వస్తున్న కృష్ణుని చూచి బాణాసురుడు మిక్కిలి కోపంతో ఓ కృష్ణా ఆగు. ఇప్పుడు బ్రతికి వెళ్ళలేవు. నిన్ను ద్వారకావాసులు చూడలేరు, నీవు వాళ్ళను చూడలేవు. ఓ మాధవా! నీ వీవేళ జీవించవు. ఓ గరుడధ్వజా! వెయ్యి భుజాలున్నాయి. నీకు ఎనిమిది భుజాలున్నాయి. కనుక భయపడుతూ నీవేమి యుద్ధం చేయగలవు? అనేక ఆయుధాలతో అలంకరింప నా వెయ్యిచేతుల్ని చూస్తున్నావా? అన్నాడు.

ఇటు నారదుడు బాణాసురుని అహంకారపు మాటలువిని చేతులు చరిచి నవ్వసాగాడు. ప్రపంచంలో సంచరిస్తూ ఉండే నారదుడు ఆ యుద్ధం చూడటానికి యోగాసనంమీద కూర్చున్నాడు. బాణాసురుని మాటలు విని శ్రీకృష్ణుడు నువ్వు ఎందుకు వ్యర్థంగా గర్జిస్తావు? వీరులిలా మాట్లాడరు. మాటలతో పనేముంది? రా యుద్ధం చెయ్యి. నన్ను ఓడించు లేదా నీవు స్వయంగా ఓడిపో. క్షణకాలంలో దీనుడవై నేలపై శయనిస్తావు అని పలికి తీక్ష్ణములైన బాణాలను బాణాసురునిపై ప్రయోగించాడు. బాణాసురుడు చిరునవ్వుతో కృష్ణునిపై అమోఘములైన బాణాల్ని విసిరాడు.

తరువాత వేయిచేతులతో తేలికగా కృష్ణునితో యుద్ధం చేయసాగాడు. బ్రహ్మ నిర్మించిన దివ్యమైన అస్త్రాన్ని బాణుడు ప్రయోగించాడు. అప్పుడు ప్రపంచమంతా చీకటి అయింది. రాక్షసులు బాణాసురుని మెచ్చుకున్నారు. తరువాత బాణవర్షాలు

ప్రారంభమయ్యాయి. శ్రీకృష్ణుడు పర్జన్యాస్త్రంతో రాక్షసుని అస్త్రాన్ని వ్యర్థం చేసి నప్పుడు బాణుడు అనేకాయుధాల్ని బాణవర్షాన్ని కురిపించాడు. కేశవుడు నవ్వుతూ వాటినన్నిటినీ వారించాడు. తరువాత తన పదునైన బాణాలతో అతని రథాన్ని గుర్రాలు, ధ్వజము, జెండాలు కలదాన్ని నువ్వులంత ముక్కలుగా చేశాడు. కవచాన్ని ఛేదించి కిరీటాన్ని తల నుండి భూతలంపై పడవేశాడు. శ్రీకృష్ణుని బాణపుదెబ్బకు బాణుడు మూర్ఛపోయాడు. నారదుడదిచూచి సంతోషంతో గంతులు వేశాడు. తరువాత ఇద్దరి వాహనాలు యుద్ధం చేశాయి.

గరుత్మంతుడు రెక్కలతో కొట్టి, ముక్కుతో పొడిచి అనేక విధాల బాధించగా స్మృతితప్పి మయూరం పడిపోయింది. దానితోపాటు బాణాసురుడుకూడా నేలపై పడ్డాడు. స్మృతి తప్పి నేలపై పడియున్న బాణాసురుని గూర్చి శివుడు చాలా విచారించాడు. తరువాత నందీశ్వరునితో నీవు నా సింహధ్వజంగల రథంపై కూర్చొని బాణాసురుని వద్దకు వెళ్ళు. ఈ రథాన్ని అనికి ఇమ్ము. అక్కడ ఉండి యుద్ధం నడిపించు. ఇప్పుడు నేను సేనతో వెళ్ళను. ఈరథం రాగానే బాణాసురుడు యుద్ధమందు సమర్థుడౌతాడు. కాబట్టి ఆలస్యం చేయకు. నీవు త్వరగా వెళ్ళి బాణాసురుని రక్షణయందు శ్రద్ధ వహించుము. అని చెప్పాడు.

నందీశ్వరుడు త్వరగా బాణాసురుని దగ్గరకు వెళ్ళి దైత్యేంద్రా! ఈ రథంపై కూర్చో. తరువాత కృష్ణునితో యుద్ధం చెయ్యమన్నాడు. బాణుడు మహాదేవుని రథం ఎక్కాడు. అప్పుడు మిక్కిలి రౌద్రమైన బ్రహ్మశిరోనామాస్త్రాన్ని పట్టుకొన్నాడు. ఆ అస్త్రం మంటలకు లోకాలన్నీ కలత చెందాయి. కృష్ణుడా అస్త్రాన్ని చక్రా యుధంతో నిర్వీర్యంచేసి బాణాసురా! వెనుక పలికిన ప్రగల్భాలేమయ్యాయి? ఇప్పుడు పొగడుకోవేమి? ఇదుగో నేను యుద్ధానికి నిలబడ్డాను. మగవాడివి కమ్ము. పూర్వం వెయ్యి భుజాలుగల కార్తవీర్యార్జునుణ్ణి పరశురాముడు రెండు భుజాలు కలవాణ్ణిగా చేశాడు. ఇదిగో నీ అహంకారాన్ని నశింపచేస్తాను. ఈ వేళ నిన్ను విడిచిపెట్టను. అన్నాడు.

ఆ యుద్ధంచూచి నారదుడు నృత్యం చేశాడు. మహాత్ముడైన ప్రద్యుమ్నుడు శివగణాల్ని అన్నిటినీ ఓడించాడు. బాణాసురుని చంపుటకు శ్రీకృష్ణుడు చక్రా యుధాన్ని చేత పట్టుకొన్నాడు. అప్పుడు శివుడు భార్యతో మూడులోకాలకూ జయింపశక్యంకాని చక్రాయుధాన్ని కృష్ణుడు విడువబోతున్నాడు. అతడు దాన్ని

విడువకముందే దేవీ! నీవు బాణాసురుని రక్షించాలి అన్నాడు. పార్వతి లంబాదేవిని బాణాసురుని రక్షించమని కోరింది. ఆమె కనపడకుండా శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి బాణుని రక్షించటానికి శ్రీకృష్ణునికి ఎదురుగా దిగంబరంగా నిలచింది. అప్పుడు కృష్ణుడు నీవు బాణుని రక్షించటానికి వచ్చావు కాని ఎలా అయినా బాణాసురుని చంపుతాను అన్నాడు.

అప్పుడు దేవి నీవు సృష్టికర్తవు, ఇది నాకు తెలుసు. బాణాసురుని చంపవద్దు. నేనితనికి వరమిచ్చాను. కనుక ఇతన్ని రక్షించు. నీవు నా శ్రమను వ్యర్థం చేయవద్దు అని కోరింది. అప్పుడు శ్రీకృష్ణుడు బాణాసురుడు తనకు వెయ్యిచేతులున్నాయని విర్రవీగుతున్నాడు. అతనికి రెండు బాహువులు మాత్రమే ఉంచి తక్కనవాటిని ఖండించి చంపకుండా విడిచిపెడతానన్నాడు. తరువాత బాణాసురునితో నీవు మాటిమాటికీ యుద్ధభూమికి కోటవీదేవినెందుకు పంపిస్తున్నావు? నీ పౌరుషం నిందింపదగినది. అని పలికి చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ చక్రము బాణాసురుని చేతులను ఒకదాని తరువాత మరొక దానిని ఛేదించింది.

ఆ చక్రాయుధం అతన్ని రెండేచేతులు కలవానిగా చేసి మరల శ్రీకృష్ణుని చేతిలోనికి వచ్చింది. ఆ మహా రాక్షసుడు చేతులు తెగి రక్తంతో తడిసిన శరీరం గలవాడై మేఘంలా గర్జింపసాగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు కోపించి మరల చక్రాన్ని ప్రయోగించటానికి సిద్ధపడ్డాడు. శంకరుడు కార్తికేయునితో వచ్చి ఓ పురుషోత్తమా! నేను బాగా ఎరుగుదును. నీవు మధుకైటభులను చంపినవాడవు. ఈ ప్రపంచానికి గతియైనవాడవు, ఏ లోకంలోనూ నిన్ను జయింపగలవాడు లేడు. ఈ చక్రాయుధాన్ని విడువవద్దు. బాణాసురునికి నేను అభయమిచ్చాను. నా ఆశీర్వాదాన్ని వ్యర్థం చేయవద్దని క్షమించమని ప్రార్థిస్తున్నాను అన్నాడు. శ్రీకృష్ణుడు బాణుడు జీవిస్తాడు. చక్రాన్ని మరలించాను. ఓ దేవా! నీవు దేవతలకు అసురలకు కూడా గౌరవింపదగినవాడవు. నీకు నమస్కారము. నేను నిశ్చయించిన పని పూర్తయినది. నాకు అనుమతినివ్వండి. నేనిక్కడినుండి వెళ్తాను. అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమునందలి విష్ణుపర్వంలో

శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధము అను నూట పదునైదవ అధ్యాయము

☆☆☆

# నూట ముప్పై ఒకటవ అధ్యాయము

## శివుడు బాణాసురునకు వరమిచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! శ్రీకృష్ణపరమాత్మ గరుడునిపై కూర్చుని అనిరుద్ధుడు పాశము లతో కట్టబడి పడి ఉన్నచోటికి చేరాడు. ఇటు కృష్ణుడు వెళ్ళాక నంది బాణా సురునితో నువ్వు ఈ గాయాలతో శంకరుని ఎదుటకు వెళ్ళి నిలుచో అని చెప్పి తన రథంపై కూర్చొనబెట్టుకొని శంకరుని వద్దకు తీసుకువెళ్ళాడు. అక్కడ మహా దేవుని ఎదుట నాట్యంచేస్తే అతడు నీకు శుభం కలుగజేస్తాడని చెప్పాడు. బాణా సురుడు రక్తంతో కూడిన తన శరీరంతోనే నాట్యం చేశాడు. కష్టస్థితిలో నాట్యం చేస్తున్న బాణాసురునిపై దయ గలిగి శంకరుడు పరిస్థితినిచూచి జాలిపడు తున్నాను. నీకు కావలసిన వరం కోరుకోమన్నాడు.

ఓ ప్రభూ! అని బాణుడు నాకు ముసలితనం, మరణం లేకుండా చెయ్య మన్నాడు. శివుడు అలాగే జరుగుతుందని యింకా ఏమైనా కోరిక ఉంటే అదీకూడా అడుగమన్నాడు. బాణాసురుడు ఆహారంలేకుండా, ఓర్పు. సత్యము కలిగి నృత్యం చేసినవానికి పుత్రుడు కలగాలని కోరాడు. మూడవ వరం కూడా కోరుకోమని శివుడనగా బాణుడు పూజ్యుడా! చక్రాయుధం దెబ్బలకు శరీరముమీద ఏర్పడిన గాయాలవల్ల నాకు బాధలేకుండా చెయ్యి అన్నాడు. అప్పుడు శంకరుడు నీకు గాయాలవల్ల బాధ ఉండదు. ఆరోగ్యవంతుడవు, బలవంతుడవు అవుతావు. ఇక నాల్గవ వరం ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నాను. నీ కోరిక తెలియజెయ్యి అన్నాడు.

ఓ ప్రభూ! నేను మీ ప్రమథగణంలో ప్రధానుడనై చిరకాలం మహాకాలుడనే ప్రసిద్ధి పొందాలి అని కోరగా శంకరుడట్లే యగునని చెప్పాడు. గాయాలుపోయి నీకు దివ్యరూపం వస్తుందని, దేనివల్లనూ భయముండదనీ పలికి ఐదవ వరంకూడా ఇస్తానన్నాడు. బాణాసురుడు నా బాహువులు తెగిపోయి రెండే ఉండటంవల్లకూడా సుందరుడుగా ఉండాలి అని కోరాడు. అప్పుడు శంకరుడు నీవు కోరినదల్లా నీకు సిద్ధిస్తుంది. నీవు నాకు గొప్ప భక్తుడవు అని ఈ విధంగా పలికిన శంకరుడు అందరూ చూస్తుండగనే గణాలతో కనపడకుండా పోయాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వంలో
శివుడు బాణాసురునకు వరమిచ్చుట అను నూట ముప్పై ఒకటవ అధ్యాయము

☆☆☆

# నూట ముప్పై రెండవ అధ్యాయము

## ఉష- అనిరుద్ధుల పెళ్ళి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈ విధంగా చాలా వరాలను పొంది బాణాసురుడు మిక్కిలి ఆనందంతో ఉన్నాడు. శంకరునితో కలిసి వెళ్ళిపోయాడు. ఇక్కడ కృష్ణుడు నారదుని మహర్షీ! నాగపాశాలతో బంధింపబడిన అనిరుద్ధుడు ఎక్కడ ఉన్నాడు అని తెలుసుకొనగోరుతున్నాను. నా మనవ్పుతనిపై మిక్కిలి ప్రేమ కలిగిఉంది. అనిరుద్ధుని అపహరించుటవల్ల ద్వారకావాసులందరూ క్షోభించిపోయారు. ఇతన్ని విడిపించటానికే ఇక్కడకు మేం వచ్చాం. త్వరగా బంధవిముక్తుడైన అతన్ని నిరాటంకంగా చూడాలని కోరుతున్నాను.

ఓ పూజ్యుడా! మా పిల్లవాడు ఎక్కడ ఉన్నాడు? ఆ ప్రదేశం మీకు తెలిసి ఉండవచ్చు. అని ప్రశ్నించాడు. నారదుడు మాధవా! నాగపాశాలచే బంధింపబడిన అనిరుద్ధకుమారుడు ఉషయొక్క అంతఃపురంలో ఖైదీగా ఉన్నాడు. ఆ సమయం లోనే ఉష చెలికత్తె చిత్రలేఖ అక్కడికి వచ్చింది. ఆమె రాక్షసరాజైన బాణాసురుని అంతఃపురంలో స్వేచ్ఛగా మీరు ప్రవేశించవచ్చు అన్నది. తరువాత బలరామ, గరుడ, శ్రీకృష్ణ, ప్రద్యుమ్నులు దేవర్షి నారదుడు వీరందరూ అనిరుద్ధుని బంధ విముక్తుని చేయటానికి అంతఃపురంలోకి వెళ్ళారు.

ఆ సమయంలో బాణాలరూపంలో పెద్దపెద్ద సర్పాలు అనిరుద్ధుని చుట్టుకొని బంధించి ఉన్నాయి. ఆ సర్పాలు గరుడుని చూడగానే అతని శరీరాన్ని విడిచిపెట్టి పారిపోయాయి. భగవంతుడైన కృష్ణుడు అనిరుద్ధుని చూస్తూనే అతని వద్దకు వెళ్ళాడు. అతని శరీరాన్ని ప్రేమతో నిమిరాడు.

అప్పుడు అనిరుద్ధుడు చేతులు జోడించి శ్రద్ధతో భగవంతునికి నమస్కరిస్తూ ఓ దేవదేవ! మీరు ఎల్లప్పుడూ అన్ని యుద్ధాలలో విజయం పొంది వస్తున్నారు. ఇంద్రుడుకూడ యుద్ధంలో మీ ముందు నిలవలేడు. అని పలికి మహాబల వంతుడైన బలరామునికి నమస్కరించాడు. మళ్ళీ ఒకసారి శ్రీకృష్ణునకు, గరుడు నకు నమస్కారంచేసి విచిత్రమైన బాణాలను ధరించిన తన తండ్రి ప్రద్యుమ్నుని

వద్దకు వెళ్ళాడు. పాదాలు తాకి నమస్కరించాడు. అతని వెనుక ఉష కూడ తన చెలికత్తెలతో సిగ్గుపడుతూ వచ్చి అనిరుద్ధుడు నమస్కరించిన వారందరికీ ప్రణామం చేసింది.

తరువాత ఇంద్రుని ఆజ్ఞానుసారం దేవర్షి నారదుడు నవ్వుతూ శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళాడు. మరియు వాసుదేవా! ఈరోజు నీకు సౌభాగ్యదినం. అనిరుద్ధుడు వచ్చాడు గనుక, తరువాత శ్రీకృష్ణుడు అనిరుద్ధుడు మొదలైనవారితో కలిసి నారదునకు పాదవందనం చేశాడు. అందరికీ తగిన ఆశీర్వాదంచేసి పూజ్యుడా! ఈవేళ ఇక్కడనే ఉషతో అనిరుద్ధునికి వివాహం పూర్తికావాలి. వివాహసమయంలో వధువువైపు స్త్రీల (తిట్లతో కూడిన) మాటలను వినాలని నాకు మిక్కిలి గొప్పకోరిక ఉంది. అన్నాడు. అతని మాటలువిని అందరూ నవ్వారు. తరువాత కృష్ణుడు వివాహానికి ఇప్పుడు ఆలస్యమేమి లేదు. మీరీ శుభకార్యాన్ని పూర్తిచేయించండి అన్నాడు.

ఇంతలో కుంభాండుడు వివాహసామగ్రి అంతటితో అక్కడకు వచ్చాడు. రాగానే కృష్ణునికి నమస్కారం చేశాడు. నేను మీకు శరణాగతి చేసిన సేవకుణ్ణి. మీరు ప్రసన్నులై నాకు అభయమివ్వండి. అన్నాడు. భగవంతుడు అభయమివ్వాలని పూర్వమే సంకల్పించాడు. ఈ సమయంలో ఆయన ఓ కుంభాండుడా! మంత్రులతో నీవు శ్రేష్ఠుడవు. నీ విషయంలో నేను ప్రసన్నుడను. నీవు శోణితపురానికి రాజువై బంధువులతో ఆనందంగా జీవనం గడుపుము. నీవు చిరంజీవివి అవుతావు.

ఈ విధంగా కుంభాండు రాజ్యం నప్పచెప్పి ఉషతో అనిరుద్ధునికి వివాహం చేయించుటలో నిమగ్నమయ్యాడు. ఆ సమయంలో అగ్నిదేవుడు స్వయంగా అక్కడికి వచ్చాడు. తర్వాత శుభనక్షత్రంలో ఉష అనిరుద్ధులకు వివాహం జరిగింది. చాలామంది అప్సరసలు వినోదకార్యక్రమాలు జరపటానికి వచ్చారు. ఉషానిరుద్ధులు స్నానంచేసి ఉత్తమ వస్త్రభూషణాలను ధరించారు. గంధర్వులు, విద్యాధరులు ఆ సమయాన అతిమధురంగా గానం చేశారు. అప్సరసలు నృత్యం చేశారు. ఈ విధంగా శ్రీకృష్ణుడానందంతో అనిరుద్ధునికి వివాహకార్యాన్ని పూర్తి చేశాడు.

ఇది శ్రీమహాభారతంలో ఖిలవంశమందలి విష్ణుపర్వంలో
ఉష- అనిరుద్ధుల పెళ్ళి అను నూట ముప్పై రెండవ అధ్యాయము

★★★

# నూట ముప్పై మూడవ అధ్యాయము

## శ్రీకృష్ణానిరుద్ధులు ద్వారకకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అనిరుద్ధుని వివాహం పూర్తయిన తరువాత శ్రీకృష్ణుడు శివ పార్వతుల యొక్క, కుమారస్వామి యొక్క అనుమతితో ద్వారకాపురం వెళ్ళుటకు ఉత్సాహం కలవాడయ్యాడు. అప్పుడు కుంభాండుడు చేతులు జోడించి పుండరీ కాక్ష! నేను మీకు చెప్పవలసింది కొంచముంది వినండి. బాణాసురుని గోవులు కొన్ని వరుణదేవుని అధికారంలో ఉన్నాయి. వాటి చన్నుల నుండి అమృతంలాంటి పాలు వెలువడుతాయి. ఆ పాలు త్రాగినవాళ్ళు బలవంతులు, జయింపశక్యం కానివాళ్ళవుతారు. అని చెప్పాడు.

ఆ మాటలువిని శ్రీకృష్ణుడు వరుణలోకానికి వెళ్ళ నిశ్చయించాడు. తరువాత బ్రహ్మ శ్రీకృష్ణుని అభినందించి తన పరివారంతో బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ఇంద్రుడు దేవతలతో ద్వారకానగరంవైపు బయల్దేరాడు. శ్రీకృష్ణుని మెచ్చుకోనే శోణితపురవాసులు అందరూ ద్వారకానగరంవైపు నడిచారు. బాణాసురుని భార్య అనేకమంది చెలికత్తెలతో ఉషని, మయూర(నెమలి) వాహనంమీద కూర్చొనబెట్టి ద్వారకకు సాగనంపింది. చివరలో మహాబలవంతుడైన బలరామ, కృష్ణ, ప్రద్యుమ్నులు అనిరుద్ధుడు గరుత్మంతునిపై కూర్చున్నారు. వాళ్ళందరూ కూర్చున్న తరువాత గరుత్మంతుడు ఎగరగానే ఆ వేగానికి చెట్లు పడిపోయాయి, భూమి కంపించింది. ఆకాశం దుమ్ముతో నిండిపోయింది.

ఈ విధంగా ఆ ఉత్తమపురుషులు బాణాసురుని జయించి గరుడునిపై కూర్చుని ఉత్తరదిశగా వెళ్ళేటప్పుడు ఒకచోట సముద్రం ఒడ్డుమీద వేలకొలది రంగురంగుల ఆవులు కనిపించాయి. అక్కడ అవి మేత మేస్తున్నాయి. ఆ గోవులను చూచి కృష్ణుడు గరుడునితో వైనతేయ! అటుచూడు అమృతంలాంటి పాలనిచ్చే బాణాసురుని ఆవులు మేస్తూ సంచరిస్తున్నాయి. సత్యభామ ఈ ఆవులు కావా లన్నది. అధర్మం కాకపోతే వాటిని తీసుకునిరా అన్నాడు. అప్పుడు గరుడుడు, నేను బాణాసురుని ఆవుల్ని చూచాను. కాని అవి నన్ను చూడగానే సముద్రంలో దూరిపోతాయి. అప్పుడు నేనేం చెయ్యను? అన్నాడు.

తరువాత తన రెక్కలగాలికి సముద్రాన్ని కల్లోలంచేసి అందులో దూరి పోయాడు. వేగంగా వరుణుని యింటికి చేరాడు. అదిచూచి వరుణదేవుని సైనికులు శస్త్రాస్త్రములు తీసుకొని శ్రీకృష్ణుని ఎదుర్కొన్నారు. గరుడికి, వరుణ సైనికులకు యుద్ధం జరిగింది. శ్రీకృష్ణుడు వరుణసైనికులను ఛిన్నాభిన్నం చేశాడు. శ్రీకృష్ణుని దెబ్బలకు భయపడి వాళ్ళు ఇళ్ళకు వెళ్ళిపోయారు. కాని మరొకవైపున ఆరువేల రథికులు అరవైవేల రథాలపై వచ్చారు. వాళ్ళదగ్గర విచిత్రములైన దివ్యాస్త్రా లున్నాయి. వాళ్ళు ఎదటికి రాగానే వీరుడైన బలరాముడు, శ్రీకృష్ణుడు, ప్రద్యుమ్నా నిరుద్ధులు, గరుడుడు అనేక విధాలైన తీక్ష్ణ బాణాలతో వాళ్ళను చెల్లాచెదురు చేశారు. సైనికుల అపజయాన్ని చూచి కోపించిన వరుణుడు వెంటనే శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు.

ఋషులు, దేవతలు, గంధర్వులు అతన్ని స్తోత్రంచేస్తూ వెనుక నడుస్తున్నారు. అతని శిరస్సుపై నీటిధారలను వర్షించే తెల్లనిగొడుగు, చేతిలో గొప్పవిల్లు ఉన్నాయి. వరుణుడు కోపంతో తన కొడుకులు, మనుమలు వెంటరాగా ధనుష్టంకారంతో యుద్ధంకొరకు ఆహ్వానించాడు. తరువాత తన పాంచజన్య శంఖాన్ని పూరిస్తూ బాణవర్షం కురిపించాడు. అతని భయంకర బాణవర్షానికి దిక్కులు వ్యాకుల మయ్యాయి. వరుణుడు శ్రీకృష్ణుని బాణాలచేత బాధింపబడుతూనే మాటిమాటికీ యుద్ధం చెయ్యసాగాడు. ఆ సమయంలో తన వైష్ణవాస్త్రాన్ని మంత్రించి ఓ వరుణ దేవా! నిన్ను నశింపచేయటానికి ఈ అస్త్రం ప్రయోగిస్తున్నాను. నీవు బాగా సిద్ధంగా ఉండు అన్నాడు.

అప్పుడు బలవంతుడైన వరుణుడు వైష్ణవాస్త్రాన్ని వారించటానికి తన వారుణాస్త్రాన్ని ఎక్కుపెట్టి గర్జించాడు. వారుణాస్త్రంనుండి భయంకర జలధారలు వెలునద్దాయి. కాని వైష్ణవాస్త్రం ముందు శక్తి చాలక వారుణాస్త్రం క్షీణించింది. మహాశక్తివంతమైన వైష్ణవాస్త్రానికి భయపడిన వరుణుడు కృష్ణునితో ఓ మహాత్మా! ఈ ప్రపంచాన్ని నీవే సృష్టించావు. నీవు జయింపశక్యంకానివాడవు. నేను రక్షింప తగినవాడను. నన్ను రక్షించు. నీవు ఆదికర్తవు. ఓ మహాదేవా! పిల్లవాడు ఆటబొమ్మ లతో ఆడుకున్నట్లు నీవు ఆడుకుంటున్నావు. నీవు మమ్మల్ని ఎందుకు మోహింప చేస్తావు?

వరుణుడిలా మాట్లాడగా శ్రీకృష్ణుడు సంతోషించి ఓవరుణుడా నాకు గోవులను ఇమ్ము. దానితో నేనుశాంతిస్తాను అన్నాడు. అప్పుడు వరుణుడు బాణాసురినితో నేను ప్రతిజ్ఞ చేసి ఉన్నాను. ఈగోవులను నీకిస్తే ప్రతిజ్ఞాభంగం చేసిన వాడనౌతాను. కాబట్టి నేను బ్రతికుండగా గోవులను ఇవ్వనన్నాడు. కావలంటే నన్నుచంపి గోవులను తీసుకువెళ్ళు అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతని ప్రతిజ్ఞకు భంగంకలిగించుట తగదని నీశుభం కొరకు గోవులను విడిచిపెడుతున్నాను. నిన్నుకూడ నిర్బంధించ కుండా విడిచి పెడుతున్నాను అనిచెప్పాడు.

తరువాత వరుణదేవుడు వాద్యధ్వనులతో శ్రీకృష్ణునకు పూజచేశాడు. బలరాముని తాను పూజించాడు. వాసుదేవుడు వరణునకు అభయమిచ్చి ఇంద్రునితోపాటు ద్వారకకు బయలుదేరాడు. దేవతలు విజయం పొందిన శ్రీకృష్ణుని ఆకాశంలో అనుసరించారు. నారదుడుకూడ ద్వారకకు బయల్దేరాడు. శ్రీకృష్ణుడు దూరంనుండి ద్వారకనుచూచి పాంచజన్యాన్ని పూరించాడు. ఆశంఖ ధ్వని విని ద్వారకావాసులు సాటిలేని సంతోషాన్ని పొందారు. పూర్ణకుంభాన్ని పేలా లను పుష్పమాలలను సిద్ధం చేశారు. ఇంకా అనేక మంగళ ద్రవ్యాలను ప్రదర్శిం చారు. పట్టణాన్ని రత్నమాలలతో అలంకరించారు. బ్రాహ్మణులు స్వస్తిసూక్తము పఠించారు. వంది మాగధులు స్తోత్రం చేశారు.

గరుడుని పై కూర్చుని నీలపర్వతంలా ఉన్న శ్రీకృష్ణుని జయజయధ్వనులతో పూజించి నమస్కరించారు. ద్వారకానగరమందలి ఉద్యానవనంలో ఋషులు దేవతలు గంధర్వులు చారణులు నలువైపులనుండి స్తోత్రంచేశారు. విజయోత్సవం చూచిన ద్వారకావాసుల ఆనందానికీ ఆశ్చర్యానికీ హద్దులేదు. మనకృష్ణుడు బాణాసురుని ఓడించివచ్చాడని చెప్పుకొని ప్రజలు మిక్కిలి సంతోషమను భవించారు. ఇలా ద్వారకావాసులు చెప్పుకొనుచుండగనే దేవతలు వాసుదేవుని యింటిలో ప్రవేశాంచారు. గరుత్మంతుని మీదనుండిదిగి వాసుదేవుడు బలదేవుడు ప్రద్యుమ్నానిరుద్ధులు ఇండ్లలో ప్రవేశించారు. అప్పుడు ఆకాశంలో దేవతల విమానాలు నిలిచి ఉన్నాయి.

అప్పుడు శ్రీకృష్ణుడు ప్రద్యుమ్నుడు మొదలగు కుమారులకు మీరందరూ రుద్రుడు మొదలైన వారికి నమస్కరించడి అనిచెప్పగా వారట్లేచేశారు. దేవత

లందరినీ చూచి పౌరులు ఆశ్చర్యపోయారు. పౌరులుదేవతలను గంధమాల్యాదు లతో పూజించారు. ఇంద్రుడు సాత్యకిని ఉల్ముకుని విపృథుని అక్రూరుని నిషధుని కౌగలించుకొని ఓయాదవులారా! శ్రీకృష్ణుడు అనిరుద్ధుని విడిపించి శంకరుడు కుమారస్వామీ చూస్తుండగా బాణాసురుని వెయ్యిచేతులను రెండుచేతులుచేసి తనపట్టణానికి వచ్చాడు. మనుష్యుడుగా జన్మించిన పనిని పూర్తి చేశాడు. ఇతని భుజబలంచేత అందరూ సుఖంగా విహరిస్తారు. అని

ఇలా కృష్ణునిస్తుతించి అను మతినడిగి దేవతలతో స్వర్గానికి వెళ్ళాడు. అక్కడకు వచ్చి ఋషులు ఆశీర్వాదం చేసి తమతమ ఆశ్రమాలకు వెళ్లారు. యక్షరాక్షసకిన్నరులు భగవంతునికి నమస్క రించి వెళ్లారు. ఇంద్రుడు వెళ్ళినతరువాత శ్రీకృష్ణుడు అందరినీ క్షేమమడిగాడు. తరువాత అక్కడజనం వేలాదిమంది ఆశ్చర్యంఅని గద్గదకంఠంతో శ్రీకృష్ణుని మిక్కిలి సుందరమైన ముఖాన్ని చూడసాగారు. ఈవిధంగా ద్వారకచేరి యాదవు లతో కూడి అనేకవిధాలైన ఆనందాన్ని అనుభవించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వములో
శ్రీకృష్ణానిరుద్ధులు ద్వారకకు వెళ్ళుట అను నూటముప్పైమూడవ అధ్యాయము

☆☆☆

# నూటముప్పైనాల్గవ అధ్యాయము

## ద్వారకలో ఉత్సవము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత తేజశ్శాలియైన ఆహుకుడు కృష్ణునితో యదునందనా! అనిరుద్ధుడు తిరిగిరావటానికి సంబంధించి ఉషచెలికత్తెలతో అనిరుద్ధునికూడి విహరించుటకు సంబంధించి ఉత్సవంచెయ్యటం అవసరం. కుంభాండుని కూతురు ఆమెకుచెలికత్తె ఆమెకు సాంబునితో వివాహం జరగాలి. ఉషయొక్క యితర చెలికత్తెలు ఇతర యాదవకుమారులను వివాహంచేసుకుంటారు. ఈవేళ అనిరుద్ధుడికీ నీకూ మనస్సులో ఉత్సవం జరుగుతూఉంది. అంతఃపురస్త్రీలు చాలా మంది ఆనందంతో వాద్యాలువాయిస్తూ కొందరు నాట్యం చేస్తూ కొందరూ సంగీతం ఆలపిస్తూ కొందరు ఆడుకుంటూ ఉన్నారు.

పార్వతీదేవి నెమలితో కూడిన రథంమీద కూర్చోబెట్టి ఉషను చెలికత్తెలతో ఇక్కడకు పంపింది. ఆమెను మీరు స్వీకరించండి. ఉష గొప్ప కులంలో పుట్టిన అందమైనపిల్ల. ఇప్పుడామెను మీయింట్లో ప్రవేశపెట్టండి. తరువాత దేవకి రుక్మిణి, రేవతి మొదలైన స్త్రీలు మంగళకృత్యములు పూర్తిచేసి అనిరుద్ధుని భవనంలోకి పంపుతారు. అనిరుద్ధుని చూచిన ఆస్త్రీలకు కళ్ళనుండి ఆనందబాష్పాలు ధారగా కారినాయి. తరువాత రేవతి, రుక్మిణి, ఉషను ప్రధానభవనంలోకి తీసుకువెళ్ళి పుత్రి! నీవు చిరకాలం అనిరుద్ధుని చూస్తూ సుఖంగా ఉండు. మంగళమగుగాక అన్నారు. మంగళవాద్యాలు మ్రోగాయి. మంగళ కృత్యాలు ప్రారంభమయ్యాయి. ఇట్లు ఉష రాజభవవనంలో ప్రవేశించి అనిరుద్ధునితో ఉంటూ ఐశ్వర్యానికి తగినట్లు సుఖాలను అనుభవిస్తున్నది. చిత్రలేఖ ఉషను ఆమెచెలికత్తెలను వీడ్కొని స్వర్గ లోకానికి వెళ్ళింది. చెలికత్తెలు వెళ్ళిన తరువాత ఉష మెట్టమొదట మాయావతి భవనానికి ఆహ్వానింపబడి అక్కడకు వెళ్ళింది. తరువాత మెల్లమెల్లగా శ్రీకృష్ణుని భార్యలందరూ పిలిచి వస్త్రభోజనాదులద్వారా సత్కరించారు.

మహారాజా! యుద్ధంలో బాణాసురుడు ఓడిపోవుట శ్రీకృష్ణుడు అతన్ని చంపకుండా విడిచి పెట్టుట అనే విషయమంతా నీకు వినిపించాను. తరువాత ద్వారకలో ఉంటూ యాదవులతో ప్రతాపంచేత భూమండలాన్నిశాసిస్తూ సాక్షాత్తు విష్ణువు దేవకీవసుదేవులకు జన్మించి వాసుదేవుడనే పేరుతో ప్రసిద్ధిచెందాడు. నీవడిగిన ప్రశ్నకు సమాధానంచెప్పాను. భగవంతుని ఇతరలీలల చరిత్రకూడ నీకు చెప్పాను. లోకంలో భగవంతుడు తప్ప వేరొక ఆశ్చర్యకర విషయంలేదు. అన్ని కల్పాలలోనూ ఆశ్చర్యకర విషయము అతడొక్కడే. భగవంతుడు వాసుదేవుడే ధన్యులలో ధన్యుడు. దేవ దానవులలో కూడ అతనికంటే ధన్యుడు వేరొకడులేడు. ప్రపంచమంతా ఆతని రూపమే. లోకమును అతడే సృష్టించువాడు. నీవతనికి నమస్కరించు. అతడు సనాతననారాయణుడు.

ఇదివినుటచే నీవంశం గొప్పకీర్తిని పొందుతుంది. బాణాసురుని యుద్ధకథ భగవంతుని మహిమ విన్నవాడు అధర్మం చెయ్యడు. ఈ పర్వమునంతనూ విన్నవాడు అన్ని పాపాలు నశించినవాడవుతాడు. అతనికి విష్ణులోకం ప్రాప్తిస్తుంది. నిత్యమూ నియమంతో ప్రాతఃకాలంలేచి ఏకాగ్రమైన మనస్సుతో బాణాసుర

యుద్ధాన్ని చదువువాడికి ఈ లోకంలో పరలోకంలోనూ పొంద రానిది ఉండదు. దీన్ని పఠించే బ్రాహ్మణుడు అన్నివేదాలూ తెలిసినవాడవుతాడు. క్షత్రియుడు విజయం పొంది రాజవుతాడు. దీనిని చదివిన వైశ్యుడు ధనవంతు డవుతాడు. శూద్రుడైతే అన్ని కోరికలు తీరినవాడౌతాడు. అతనికి ఎప్పుడూ అశుభం రాదు. దీర్ఘాయుర్దాయం ప్రాప్తిస్తుంది. జనమేజయుడు వైశంపాయనుని నుండి హరి వంశకథను విని సంతోషంపొందాడు. ఇప్పుడు నేను కూడ నీకాకథను వినిపించాను. ఇక ఇప్పుడేం వినగోరుతున్నావు? చెప్పు అని సూతమహర్షిపుత్రుడు శౌనకుని అడిగాడు-

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి విష్ణుపర్వములో
ద్వారకలో ఉత్సవము అను నూటముప్పై నాల్గవ అధ్యాయము

☆☆☆

హరివంశంలో విష్ణుపర్వం సమాప్తము.
శ్రీకృష్ణార్పణమస్తు

## శ్రీహరివంశ పురాణములో మూడవదైన

# భవిష్యపర్వము

## మొదటి అధ్యాయము

### జనమేజయుని సంతతి

శౌనకుడు జనమేజయుడికి ఎంతమంది కుమారులు? ఏపుత్రునివలన పాండవ వంశం నిలిచింది? ఈవిషయం వినాలని నాకు మిక్కిలి ఉత్సాహంగా ఉన్నది. కనుక ఇప్పుడు ఆవృత్తాంతాన్ని చెప్పవలసిందిగా కోరుతున్నాను అని సౌతిని అడిగాడు. అతడిట్లు బదులు పలికాడు-

ఓమునివరా! జనమేజయుడికి 'కాశ్య'యన భార్యయందు ఇద్దరు పుత్రులు జన్మించారు? ఒకడు చంద్రాపీడుడు రెండవవాడు సూర్యాపీడుడు. రెండవవాడు మోక్షమార్గం అవలంబించాడు. చంద్రాపీడుడు రాజయ్యాడు. చంద్రాపీడుడికి వందమంది మహాధనుర్ధరులైన పుత్రులు కలిగారు. వాళ్లద్వారా జనమే జయునివంశం లోకంలో స్థిరపడింది. ఆనూరుమందిలో పెద్దవాడు సత్యకర్ణుడు హస్తినాపురరాజ్య సింహాసనముపై కూర్చున్నాడు. అతడు అధికంగా దక్షిణలిచ్చి యజ్ఞాలుచేశాడు. అతని తమ్ముడు శ్వేతకర్ణుడు గొప్పబలవంతుడు, ధార్మికుడు కూడా. అతనికి పుత్రులు లేరు. ఇందుచేత తనభార్య మాలినితో అరణ్యానికి వెళ్ళాడు. కొంత కాలానికి మాలిని గర్భవతి అయింది.

గర్భోత్పత్తికాగానే శ్వేతకర్ణుడు తనపూర్వులవలె మహాప్రస్థానం చేశాడు. తనభర్త వెళ్ళటంచూచి పతివ్రతమాలిని అతనిని అనుసరించింది. మార్గమధ్యంలో ఆమెకు అందమైన కుమారుడు జన్మించాడు. పుట్టినకుమారుని అక్కడేవిడిచిపెట్టి తనభర్తవెంటనే నడిచింది. రాపుత్రుడు కొండపాదలో ఏడవసాగాడు. నలువైపుల నుండి మేఘాలు ఆశిశువుకు నీడ కల్పించాయి. తరువాత 'శ్రవిష్ఠ' ఇద్దరుపుత్రులు పిప్పలాద కౌశికులను వాళ్ళు అక్కడకు వచ్చారు. ఆపిల్లవానిని చూడగానే దయ గలిగి ఆపిల్ల వానిని ఎత్తుకుని నీళ్ళతోకడిగారు కాని ప్రక్కలందున్న రక్తమును రాతి మీదరాచారు. కనుక ఆపిల్ల వానిని ప్రక్కలు నల్లబడ్డాయి. అతనికి అజపార్శ్వు డని పేరువచ్చింది. పిప్పలాద కౌశికులిద్దరూ అజపార్శ్వుని వేమకుడనే మహర్షి

యింటికి తెచ్చారు. వేటుకునిభార్య ఆపిల్లవానిని తనపుత్రునివలె లాలనచేస్తూ పెంచింది. పిప్పలాద కౌశికులు అతనికి మంత్రులయ్యారు. ఆముగ్గురి పుత్రులు మనుమలు ఏకకాలంలో జీవించారు. వాళ్ళద్వారా పౌరవవంశంగా పాండవవంశం ప్రసిద్ధిచెందింది. పూర్వం నహుషపుత్రుడైన యయాతి ముసలితనం ఇచ్చాక సంతోషంలో సూర్యచంద్ర గ్రహములతోకూడిన భూమియున్నంతవరకూ పురువంశం ఉంటుందని గానంచేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
జనమేజయుని సంతతి అను మొదటిఅధ్యాయము

☆☆☆

# రెండవ అధ్యాయము

## జనమేజయ వ్యాస సంవాదము

శౌనకుడు పూర్వం వ్యాసశిష్యుడు వైశంపాయనుడు చెప్పినట్లు హరివంశ కథను మీరు కూడ చెప్పారు. దీనివల్ల మిక్కిలి ఆనందించాను. ఇప్పుడు జనమే జయుడు సర్పయజ్ఞంచేసి ఈ చరిత్ర విన్న తరువాత ఏం చేశాడో విన గోరుతున్నారు.

అనగా సూతపుత్రుడిలా చెప్పాడు.

మునివరా! సర్పయాగానంతరం జనమేజయుడు అశ్వమేధయాగం చెయ్యా లనే ఆలోచనతో యజ్ఞానికి కావలసిన వస్తువులను సమకూర్చమని ఆజ్ఞాపించాడు. యజ్ఞాశ్వాన్ని విడిచిపెట్టమన్నాడు. ఇతని కోరికను గ్రహించి వ్యాసమహర్షి హఠాత్తుగా వచ్చాడు. జనమేజయుడు శాస్త్రప్రకారమాతని పూజించాడు. వాళ్ళిద్దరూ కూర్చుని అనేకవిధాలైన చిత్రవిచిత్రములైన సంహితలలోని విషయాలను మాట్లాడుతూ చివరకు జనమేజయుడు వ్యాసునితో పూజ్యుడా! అన్ని విషయాలతో నిండిన మహా భారతాన్ని ఒక సంవత్సరమంతా విన్నాను. కథ ఆనందదాయకం కావటంవల్ల సంవత్సరమూ ఒకనిమిషంగా గడిచి పోయింది. మీరుమిక్కిలి ఉత్తమమైన భారతం రచించారు. నాకు తృప్తితీరక ఇంకా వినాలనిపిస్తోంది. కురువంశం ఎందుకు నశించింది. ఒక్క రాజసూయయాగం యుద్ధంకోసం ఏర్పరచబడింది.

పూర్వంచంద్రుడు ఈయజ్ఞం ప్రారంభించాడు. దాని చివర తారకాసుర యుద్ధం జరిగింది. తరువాత వరుణదేవుడీ యాగం చేశాడు దానిచివర దేవాసుర

సంగ్రామం జరిగింది. హరిశ్చంద్రడీయాగంచేశాక ఆడీబకమనే క్షత్రియనాశకరమైన యాగం జరిగింది. ధర్మరాజు రాజసూయంచేశాక మహాభారతసంగ్రామం జరిగింది. మీరు మాపూర్వులకు తాతగారు. అన్నీ తెలిసివారు. లోకనాశకరమైన మహా యుద్ధానికి కారణమైన ఆరాజసూయయాగాన్ని ఎందుకు మీరుఆపలేదు? అని అడిగాడు. వేదవ్యాసుడు నాయనా! మీతాతలు కాలవంశంచేత చెడుమార్గంలో నడిచే వారయ్యారు. వాళ్లు భవిష్యత్తును గూర్చి ఎప్పుడూ ఏకొంచమూ నన్ను అడగలేదు. అడగందే నేనేమీ చెప్పను. అదిగాక జరుగబోయేదాన్ని ఆపగలశక్తి కూడా నాకులేదు.

కాలగమనాన్ని ఎవడూ అడ్డుకొనలేడు. నీవడిగితే రాబోయేది చెపుతాను. కాలం మిక్కిలి బలంకలది. వినికూడ ఆచరించవు. రాజులకు అశ్వమేధ యాగము మిక్కిలిశేష్ఠంగా చెప్పబడింది. ఇంద్రుడు దానికి విఘ్నం కలిగించవచ్చు. లేదా మరొక అపరాధం జరగవచ్చు. అన్నీ సక్రమంగాఉన్నా కాలగమనము అతిక్రమింప రానిది. ఇది ప్రధానకారణము. కాలవశంచేతనే యజ్ఞంలోపం జరుగుతుంది. ఈ విఘ్నాన్ని భగవంతుడు ముందే నిర్ణయించిఉంటాడు. ప్రపంచమంతాచేసే సమస్తములైన పనులూ కాలంమీద ఆధారపడిఉంటాయి అన్నాడు. అప్పుడు జన మేజయుడు ఓమహానుభావా! అశ్వమేధయాగంలో వచ్చేవిఘ్నాలకు మీరు కారణాలు చెప్పితే వాటిని తొలగించుటకు ఉపాయం చేస్తాను అన్నాడు.

వ్యాసమహర్షి నాయనా! అశ్వమేధం నెరవేరకపోవటంలో బ్రాహ్మణకోపం కారణం. ఇది తొలగించుకోటానికి ప్రయ త్నించుము నీకు శుభంకలుగుగాక. నీచేసిన అశ్వమేధంలాంటిదాన్ని భూమి ఉన్నంత వరకూ ఏక్షత్రియులూ చేయబోరు. అనగా జనమేజయుడు మునివరా! బ్రహ్మణ శాపాగ్ని యొక్క తేజస్సుచే అశ్వమేధ యాగము పూర్తికాకపోవుటకునే దానికి కారణం నేనేఅని తీవ్రమైన భయం కలుగు తోంది. ఈయజ్ఞం మరలచేయబడటం తెలియజేసినన్ను ఊరడించుమని పలికాడు. వ్యాసుడు ముందుకలియుగంలో భూగర్భంనుండి కశ్యప వంశంవాడు సేనానాయకుడైన యోగిపుడతాడు. అతడు మరల ప్రపంచంలో మరల అశ్వమేధ యాగాన్ని నిలబెడతాడు. ఆయోగివంశంలో పుట్టి ఎవడో మహాత్ముడు అశ్వమేధ యాగాన్ని మళ్ళీప్రచారంలోకి తెస్తాడు.

ఆసమయంలో ఈయజ్ఞంచేసిన వాళ్ళు తమశ్రద్ధనుబట్టి శ్రమలేకుండా తగిన ఫలాన్ని పొందియుగాంతాన్ని గూర్చి విచారిస్తారు. ఆసమయంలో ఇంద్రి

యాలు పూర్వపు స్వభావాన్ని విడిచిపెడతాయి. మానవసమాజం ఆచారము లేనిదవుతుంది. దాన మూలంగా ధర్మాన్ని ఆచరించటం శక్యంకానిదౌతుంది. ఆరోజులలో మిక్కిలి సామాన్య ధర్మాచరణవల్లనే చాలా గొప్పఫలం ప్రాప్తిస్తుంది. పలువైపులా ధర్మం పడిపోతుంది. మానవుడు చిన్నతపస్సుచేసియే సిద్ధి పొందుతాడు. ఆయుగాన్త సమయంలో కొంచమైనా ధర్మానుష్ఠానం చేయగలిగినవాడు ధన్యుడుగా లెక్కింపబడుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వంలో
జనమేజయ వ్యాస సంవాదము అను రెండవ అధ్యాయము

☆☆☆

# మూడవ అధ్యాయము

## వ్యాసుడు కలియుగాన్ని వర్ణించుట

జనమేజయుడు ఓబ్రాహ్మణోత్తమా! మోక్షంప్రాప్తించే సమయం సమీపంలో ఉన్నా దూరంలోఉన్నా అది నాకేమీతెలియదు. కొద్దిశ్రమతో గొప్పపుణ్యం ప్రాప్తిస్తుంది అనే ఆశతో నేనుకలియుగంలో జన్మించాను అన్నాడు. శౌనకుడు ఓధర్మం తెలిసినవాడా! ఈసమయంలో జనుల మనస్సులలో కలవరంకలిగించే ధర్మాన్ని నశింపచేసే కలియుగం వచ్చింది. కనుకనే మీరు కలియుగ వృత్తాంతానే నాకుచెప్పండిఅని అడిగాడు అప్పుడు సౌతియిలా చెప్పాడు.

ఓకులపతీ! జనమేజయమహారాజు ఈవిధంగా రాబోయేవిషయాలను అడగగా వేదవ్యాసుడిలా చెప్పాడు- తండ్రీ! కలియుగంలో రాజులు ఇంద్రియాలకు దాసులై ప్రజలనురక్షించుట, యజ్ఞాలుమొదలైన మంచిపనులుచేయుట విషయంలో ఆసక్తిలేనివారుగా ఉంటారు యధార్థంగా రాజులైనవాళ్ళకు సింహాసనాధికారం ఉండదు. బ్రాహ్మణులు శూద్రుల జీవనవిధానం కలిగిఉంటారు. శూద్రులు బ్రాహ్మణాచారాలను అవలంబిస్తారు. బ్రాహ్మణులు ధనుర్బాణాలను పట్టుకొని క్షత్రియవృత్తిని స్వీకరిస్తారు. హవిర్యజ్ఞాలు పంచయజ్ఞాలు లేనివారే వారు పంక్తిభేదం అనేమాట ఉండదు. అందరూ కలిసి భోజనం చేస్తారు. శిల్పంవల్ల బ్రతికేవాళ్ళు అసత్యం మాట్లాడతారు. ప్రతి మానవుడూ మద్యమాంసాల కిష్టపడతాడు.

కలియుగంలో జనులు మిత్రుని స్త్రీతో సంభోగానికి వెనుదీయుడు. రాజులు దొంగతనం వృత్తిగా చేసుకుంటారు. దొంగలు రాజులౌతారు. ధనానికి గౌరవం

ప్రాప్తిస్తుంది. సజ్జనుల ప్రవర్తన పూజింపబడదు. సజ్జనులు హీనంగాచూడబడతారు. పాపాత్ములకు ఏ మాత్రమూ నింద ఉండదు. ప్రతిమానవుడూ ధర్మం తెలియని వాడే వితంతువులు సన్యాసులు కలిపి సంతానం కంటారు. మానవజీవితం పదహారు ఏళ్ళకు కూడా తక్కువ అవుతుంది. గ్రామవాసులు అన్నం అమ్ముకునే వాళ్ళవు తారు. బ్రాహ్మణులు వేదాన్ని అమ్ముకుంటారు. స్త్రీలు యోని విక్రయం చేస్తారు. పామర జనులు మొదలుకొని సాధారణ జనులవరకూ వేదాన్తం చెప్పుతూ కర్మ భ్రష్టులౌతారు. యజ్ఞయాగాదులు చేసేవారుండరు. శూద్రులు గౌరవంగా పిలవబడతారు.

బ్రాహ్మణులు తపస్సును యజ్ఞాలఫలితాన్నీ అమ్ముకుంటారు. ఋతు ధర్మాలు మారుతాయి. శూద్రులు సూక్ష్మబుద్ధులు కాషాయవస్త్రధారులై బౌద్ధమతం అవలంబిస్తారు క్రూరజంతువులు వృద్ధిచెందుతాయి గోజాతి తగ్గిపోతుంది. ప్రజలు నీచమార్గంలో నడుస్తూఉంటారు. వస్తువుల రుచితగ్గుతుంది. వాగలిదున్నే ఎద్దులు బలంలేనివి అవుతాయి. మేఘం చిత్రంగా వర్షిస్తుంది. ఎవరూ ధర్మం చెయ్యరు. అందరూ వ్యాపారంచేసే వాళ్ళౌతారు కలియుగం చివర భార్యతప్ప మరొక గతి ఉండదు. పురుషులు తక్కువై స్త్రీలు ఎక్కువసంఖ్యలో ఉండటం యుగలక్షణం. ఆలోచించకుండా ఇతర వర్ణంవాళ్ళనుండి దానం పుచ్చుకొంటారు.

రాజులవల్ల/దొంగలవల్ల|అగ్నివల్ల|శిక్షలవల్లనూ/ జనంనశిస్తారు. పైరులు ఫలించవు. గాలి దుమ్ములు ఎక్కువగా ఉంటాయి. పరలోకం విషయంలో సందేహం కలిగిఉంటారు జనులు. తనను గొప్పవానినిగా తలచుకుంటారు. రాజులు వైశ్యుల వలె ధనధాన్యాలతో జీవిస్తారు. సంతోషానికి ఫలముండదు. క్రోధానికి ఫలిత ముంటుంది. పెద్దలను సేవింపక అందరూ అన్నీ తెలుసునంటారు. యుగాన్తంలో కవిగానివాడు ఉండడు. రాజులు దొంగలౌతారు. బ్రహ్మవాదులు మద్యపానం చేస్తారు. అనర్హులచేత యజ్ఞాలు చేయిస్తారు. తినగూడని వాటిని తింటారు. బ్రాహ్మణులు ధనాశకలవారౌతారు. వేదశాస్త్రాలను చదవరు. దిక్కులు తగల బడుతున్నట్లు కనిపిస్తాయి. పుత్రులు తల్లిదండ్రులను, కోడళ్ళు అత్తలనూ పను లందు ప్రేరేపిస్తారు. గురువులను శిష్యులు భయపెడతారు. స్త్రీ పురుషులు వ్యభిచార పరులౌతారు. రోగం లేనివాడు/మనస్తాపం లేనివాడు ఉండడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వ్యాసుడు కలియుగాన్ని వర్ణించుట అను మూడవఅధ్యాయము

☆☆☆

# నాల్గవ అధ్యాయము

## వ్యాసుని కలియుగ వర్ణనము

జనమేజయుడు పూజ్యుడా! కలియుగంలో జనులందరూ కాలబలం వల్ల ఎలా కలుషితులౌతారు? అనే విషయం విన్నాను. ఇప్పుడు వాళ్ళు ఎట్టిఆహార, విహార, చేష్టా, చరిత్రలను, కలిగిఉంటారు? వాళ్ళకు పూర్తి ఆయుస్సు ఎన్ని సంవత్సరాలు? వాళ్ళను ఎవళ్ళు రక్షిస్తారు? ఎన్నిదినాల తరువాత సత్యయుగం వస్తుంది? అని ప్రశ్నించాడు. వ్యాసుడిలా చెప్పాడు.

మహారాజ! కలియుగంలో అధర్మంపెరిగి జలంతా అధార్మికులవౌతారు. కనుకనే వాళ్ళ ఆయుస్సు మెల్లమెల్లగా తగ్గిపోతుంది. బలంక్షీణిస్తుంది. రంగు మారుతుంది. వ్యాధులు కష్టాలూ ఎక్కువౌతాయి. నిరాశపెరుగుతుంది. నిస్పృహ చేత ఆత్మవత్త్వ జ్ఞానం కలుగుతుంది. అప్పుడు ధర్మం ప్రచారంలోకి వస్తుంది. ఇలా ధర్మంవృద్ధి చెందాక సత్యయుగం వస్తుంది. కొందరు కొంచం ధర్మ పరాయణులుగా ఉండి మధ్యస్థవృత్తిని ఆశ్రయించి మరికొందరు తమ వివేకశక్తితో ఊహచేస్తారు. కొందరు ప్రత్యక్షమును రెంటినే ప్రమాణాలుగా స్వీకరిస్తారు.

మరికొందరు ప్రత్యక్షమే తప్ప రెండవదాన్ని ప్రమాణంగా అంగీకరించరు. చాలామంది వైదికమతాన్ని విడిచి పెడతారు. స్త్రీలు ధర్మం చెప్పేవాళ్ళవుతారు. నడవడిలో మాత్రం ధర్మం శూన్యం. మేమే పండితులమనుకునే వాళ్ళ వల్ల నాస్తికుల వల్లను ధర్మలోపం ఏర్పడుతుంది. ప్రత్యక్షమే ప్రమాణమనేవాళ్ళకు శాస్త్రజ్ఞానం కొంచమైనా ఉండదు. ఈ విధంగా ధర్మం సమాప్తిచెందగా కొద్దిమంది మాత్రమే ధర్మపరాయణులు ఉంటారు. వాళ్ళు మాత్రమే దయగల మనస్సుతో కొంచం దానము సత్యము ఆశ్రయిస్తారు. అన్నిటినీ తినేవాళ్ళు సిగ్గులేనివాళ్ళు దయలేని వాళ్ళు ఇంద్రియాలను జయించనివాళ్ళు అవుతారు. క్షత్రియులు మొదలైన ఇతర వర్ణాలవాళ్ళు బ్రాహ్మణవృత్తినవలంబిస్తారు

అప్పుడు పాపం పూర్తిగా అభివృద్ధి పొందుతుంది. అప్పుడు శాస్త్రజ్ఞానం ఆత్మతత్త్వ జ్ఞానం పూర్తిగా లోపిస్తాయి. వైరాగ్యంవల్ల కొంచం ప్రయత్నంచేతనే సిద్ధి పొందుతారు. ప్రపంచంలో యుద్ధాలు, భయంకరవర్షాలు, భయంకర పరిస్థితులు వచ్చినప్పుడు పూర్తిగా దోషముతోకూడిన ప్రపంచ మేర్పడుతుంది. రాక్షసులు బ్రాహ్మణరూపంలో సమస్తాన్ని పొట్టన పెట్టుకుంటారు. ఆ రోజుల్లో

అందరూ మూర్ఖులూ స్వార్థపరులూ లోభులూ, నీచులూ, ఇతరులధనాన్ని అప హరించేవాళ్ళు పరస్త్రీల నపహరించేవాళ్ళు కపటంచేసేవాళ్ళు సాహసం చేసే వాళ్ళు అవుతారు. మహాత్ముల ఉపదేశాలను పాటించరు. ధన్యవాదాలు మాత్రం తెలుపు తారు. అన్నం దొంగిలించేవాళ్ళు, వస్త్రాలను దొంగిలించేవాళ్ళు, ఆవులను అప హరించే వాళ్ళు, దొంగలుకూ దొంగలనుండి వస్తువులను రక్షించుకోలేరు. దొంగలు దొంగలను చంపటం చేత ప్రపంచానికి కొంతఉపకారం జరిగినట్లు కనిపిస్తుంది.

ధనం, సంధ్యావందనాది కార్యాలూ వర్ణభేదమూ లేక పన్నులభారంతో పీడింప బడి జనులు నగరాల నుండి అడవులలోకి వెళ్తారు. అక్కడే నివసిస్తారు. పుత్రుడు తండ్రిమీద, స్త్రీలు, తమ అత్తగార్లనూ ఆజ్ఞాపిస్తారు. శిష్యులు తమ మాటలచే గురువు లను బాధిస్తారు. యజ్ఞయాగాదులు లోపిస్తాయి. అప్పుడు రాక్షసులు క్రూర జంతువులు కష్టాలు కలుగజేస్తాయి. కడుపునిండా అన్నం దొరకదు. రక్షకులే లోకభక్షకు లౌతారు. పిల్లలను భుజాలమీదవేసుకొని పరివారంతోసహా కౌశికీనది దాటి వెళ్తారు.

మానవులు మ్లేచ్ఛగణాలతో అరణ్యాలలో నివసిస్తారు. తేనెకూరలు పండ్లు దుంపలు ఆహారంగా కలవాళ్ళౌతారు. మునులవలె నారవస్త్రాలు ధరిస్తారు. మేకలను గొర్రెలను పోషిస్తారు. కాలం యొక్క ప్రేరణచే మిక్కిలి ఆపదలతో జీవనం గడుపుతారు. ఆయుస్సు ముప్పైసంవత్సరాలు మాత్రమే ఉంటుంది. సాధువు దర్శించాలనే ఆసక్తి కలవారౌతారు. బ్రహ్మ ఏర్పరచిన విధానంగానే అంతా నడు స్తుంది. యుగాలు మారుతూ ఉంటాయి. జీవుడు క్షణకాలమైనా ఒక నిశ్చయంలో ఉండడు. జనన మరణాలలో కొట్టుమిట్టాడుతూ ఉంటాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వ్యాసుని కలియుగ వర్ణనము అను నాల్గవఅధ్యాయము

☆☆☆

# ఐదవ అధ్యాయము

## జనమేజయుని యజ్ఞమునకు విఘ్నము

సూతుడిలా చెప్పాడు.

మహర్షి వేదవ్యాసుడు ఈవిధంగా జరిగిన, జరుగబోయేటి విషయాలనుచెప్పి జనమే జయమహారాజును ఊరడించాడు. సభలోని జనులు ఈవిమర్శనువిని

అమృతపానం చేసినట్లుంది. వ్యాసమహర్షి మధుర వాక్కులరసాన్ని ఆస్వాదించడం అని పలికారు. తరువాత వ్యాసమహర్షి సభకు ప్రదక్షిణంచేసి సభ్యులను వీడ్కొని మళ్ళీ ఎప్పుడైనా మీదర్శనంచేస్తా అని వెళ్ళిపోయాడు. ఆసభలోని తపశ్శాలురు, ఋత్విక్కులు కొంతదూరం వరకూ ఆయన వెనుకవెళ్ళి సెలవడిగి నమస్కరించి మళ్ళీ తమ స్థానానికి తిరిగివచ్చారు.

జనమేజయమహారాజు ఘోరవైరాన్ని వదిలి కోపం లేనివాడై అక్కడనుండి వెళ్ళిపోయాడు. ఆస్తీకముని కూడా తక్షకుని రక్షించి తన ఆశ్రమానికి తిరిగివెళ్ళాడు. జనమేజయుడు తను కూడా ఉండి వారితో హస్తినాపురంచేరి ఆనందంగా రాజ్య పాలన చేస్తున్నాడు. ప్రజలు తమరాజును చూచి మిక్కిలి సంతోషంతో ఉన్నారు. కొంతకాలం తరువాత జనమేజయుడు శాస్త్రప్రకారంగా అశ్వమేధయజ్ఞానికి దీక్ష పూనాడు. తరువాత యజ్ఞాశ్వం మరణించిన తరువాత కాశీరాజపుత్రియైన రాజు పట్టమహిషి మరణించిన అశ్వంవద్ద కూర్చున్నది. ఇంద్రుడు సర్వాంగ సుందరియైన రాజపత్నిపై మోహంతో సూక్ష్మరూపం ధరించి గుర్రం శరీరంలో ప్రవేశించాడు. రాజపత్ని వపుష్టమతో సంగమం చేశాడు. రాజు ఇలాంటివికారం ఏర్పడినట్లు తెలుసుకొని భార్యతో ఈగుర్రం మరణించలేదు నీవు నశించుము అన్నాడు అప్పుడు పురోహితుడు జ్ఞానదృష్టితో ఇంద్రుని చెడ్డపనిని తెలుసుకొని జనమేజయు నకు విషయమంతా చెప్పాడు. అప్పుడు చపలస్వభావుడు అని శపించాడు.

అప్పుడు మిక్కిలి కోపించి జనమేజయుడు ఓ ఋత్విక్కులారా! మీ అజాగ్రత్త వల్లనే నాయజ్ఞానికి విఘ్నం వచ్చింది. కాబట్టి మీరు నారాజ్యంలో ఉండవద్దు. ఇప్పుడే మీపరివారంతో నారాజ్యం నుండి వెళ్ళిపొండి అన్నాడు. ఋత్విక్కులు కోపంతో అక్కడ నుండి వెళ్ళిపోయారు. తరువాత రాజు అంతఃపురానికి వెళ్ళాడు. అక్కడ రోషంతో తన భార్యలను శాసిస్తూ మీరందరూ నా ఆజ్ఞచే కులట అయిన ఈ వపుష్టమను ఇంటి నుండి వెడలగొట్టండి. ఈమె దుమ్ముతో కూడిన పాదాలను నానెత్తిమీద పెట్టింది. ఈమె చెడు నడవడి వల్ల నా అభిమానము, కీర్తి గౌరవమూ సమస్తమూ నశించిపోయింది. అనుభవింపబడిన పూలమాలవలె మర్దింపబడిన ఆమె ముఖం నేను చూడదలుచుటలేదు. ఇతరులచే అనుభవింపబడిన స్త్రీతో సంసారం చేసేవాడికి ఏసుఖమూ రుచించదు. కనుక తెలిసినవాళ్ళు కుక్క ముట్టుకున్న హవిస్సువంటి స్త్రీతో నివసించరు.

జనమేజయుడు కోపంతో ఇలా పలుకుతున్నప్పుడు గంధర్వరాజు విశ్వా వసువు వచ్చి రాజా! నీకు నూరుయజ్ఞాలు పూర్తికావటం ఇంద్రునికి ఇష్టంకాదు. కాబట్టి అతడు రంభఅనే తన అప్సరసను వపుష్టమగా చేసి నీకు భార్యను చేశాడు. నీభార్య వపుష్టమ పతివ్రతయే. సమయంచూచుకొని ఇంద్రుడు నీయజ్ఞానికి విఘ్నం కలిగించాడు. యజ్ఞాలు చేయుటలో నీవుఇంద్రునితో సమానుడవు. తన ఇంద్ర పదవి ఎక్కడపోతుందోఅని అతడు నీకు భయపడుతున్నాడు. అందుచే నీ యజ్ఞానికి విఘ్నం కలిగించాడు. నీవు వపుష్టమగా తలచే స్త్రీ రంభ. యజ్ఞానికి విఘ్నం కలుగజేయటానికి చచ్చినగుర్రం శరీరంలో ప్రవేశించి రంభతో సంభోగ మనుభవించాడు ఇంద్రుడు. కాలంయొక్క బలాన్ని ఎవడూ త్రోసివేయలేడు. నీవు సుఖపడదలిస్తే దేవేంద్రునికి అనుకూలంగా సమస్తకార్యములూ, చెయ్యి. నీటివేగాన్ని అడగించుటవంటిది ఇంద్రుని ప్రతిఘటించుట కనుక నీవు మానసిక బాధను దూరం చేసుకొని కళంకంలేని వపుష్టమతో సుఖంగా ఉండు. సూర్యకాంతి, అగ్నిజ్వాల, అగ్నితోవేసే ఆహుతికి సమానురాలైన స్త్రీ పరపురుషుని సాంగత్యముచే చెడునది కాదు. తెలిసినవాడు ఆమెను స్వీకరించిఏలుకోవాలి అని జనమేజయు నకు నచ్చ చెప్పాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
జనమేజయుని యజ్ఞమునకు విఘ్నము అను ఐదవఅధ్యాయము

☆☆☆

# ఆరవ అధ్యాయము

## ఈ గ్రంథమును చదువుట, వినుట వల్ల ఫలం

సూతుడిలా చెప్పాడు.

మహారాజైన జనమేజయుడు విశ్వావసువనే గంధర్వరాజు ద్వారా ఇట్లు ప్రార్థింపబడి వపుష్టమపై సందేహాన్ని విడిచిపెట్టాడు. అతని మనస్సు శాంతించింది. తరువాత కీర్తిని విస్తరింప చేసుకోవాలని చక్కగా రాజ్యపాలన చేశాడు. వపుష్టమ కూడ వెనకటి మాటలను మరచిపోయి సంతోషంతో ఉన్నది. అప్పటినుండి జనమే జయుడు బ్రాహ్మణపూజలో ఎటువంటిలోటూ చేయలేదు. దానాలు యజ్ఞాలు వెనకటిలాగే జరుగుతున్నాయి. దేశరక్షణలో కొంచంకూడా ఏమరుపాటులేకుండా ఉండేవాడు. ఇక ఎప్పుడూ వపుష్టమను ఏమీఅనలేదు. మహర్షి వేదవ్యాసుడు

మొదట చెప్పింది యథార్థం. దైవంవ్రాతను కాదని ఏమీ చేయజాలము అని ఆలోచించి తన మనస్తాపాన్ని దూరంచేసుకొన్నాడు. తరువాత రాజకార్యాలను చూస్తూ ఆనందంతో వపుష్టమనుకూడి విహరించసాగాడు.

మహర్షివ్యాసుని ఈమహాకావ్యాన్నీ ఇంద్రుని పాపవిమోచన చరిత్రను చదువుటచే మానవుడు పాపముక్తుడై జనుల ఆదరానికి పాత్రుడౌతాడు. అతనికి తీరని కోరిక ఉండదు. అంతేకాకుండా దీర్ఘాయుష్మకలవాడు. అంతయూ తెలిసిన వాడు ఆనందంతో జీవనంచేసేవాడై చివరకు భగవంతుని కూడ పొందుతాడు. దీనిని చదువుటవల్ల పుత్రులు లేనివాళ్ళకు పుత్రులు పదవినుండి తొలగినవాడికి మళ్ళీ పదవీప్రాప్తి సంసారవిముక్తి పుణ్యాకర్మలమును పొందుతాడు. ఇదివిన్న కన్యకు కోరిక సిద్ధిస్తుంది. పుత్రసంతానప్రాప్తి కలుగుతుంది. రాజు ఈగ్రంథాన్నివిని రాజ్యాన్ని పొందుతాడు. వైశ్యుడు గొప్ప ఐశ్వర్యాన్ని, శూద్రుడు మంచిగతిని పొందు తారు. దీనిని చదువుటవల్ల సద్బుద్ధికలిగి ఆనందంగా ఉంటాడు.

ఓపూజ్యుడా! ఈవిధంగా నేను వేదవ్యాస రచితమైన అద్భుతకార్యాలనూ మహాత్ముల ఆశ్చర్య చరిత్రలను విస్తరంగాచెప్పి వినిపించాను. ప్రశాంతమైన మనస్సుతో దీనిని మాటిమాటికీ తలుచుకొనుటవల్ల శ్రమలేకుండా మీరుసుఖంగా విహరించగలరు. ఇకమీరు ఏమి వినగోరుతున్నారో చెప్పండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఈ గ్రంథమును చదువుట, వినుట వల్ల ఫలం అను ఆరవఅధ్యాయము

☆☆☆

# ఏడవ అధ్యాయము

## విష్ణు మహిమ

జనమేజయుడు ఓపూజ్యుడా! భగవంతుడైన నారాయణుని మహిమను మాటిమాటికీ విన్నా తృప్తికలుగుటలేదు. కనుక దయతో మీరు పాలసముద్రంలో పరుండియున్న పరమాత్మ సృష్టి ఎలాచేశాడు? పూర్వం బ్రహ్మాండంలో దేవతలు ఋషులు ఎలాపుట్టారు? పురుషోత్తముడైన భగవంతుడు ఎంతకాలం వరకూ నిద్ర పోతాడు? దేనినుండి కాలం పుడుతుంది? భగవంతుడు కాలాన్ని ఆశ్రయించి ఎందుకునిద్రిస్తాడు? ఆయనెప్పుడు మేలుకొంటాడు? మేలుకొన్న తరువాత

ఏవిధంగా సమస్త ప్రపంచాన్నీ సృష్టిస్తున్నాడు? పూర్వము ప్రజాపతులు ఎవరెవరు? తానుఒక్కడే అయిఉండి బహురూపాలుగల ప్రపంచసృష్టిని ఎలాచేశాడు. ప్రళయ కాలంలో అంతా జలమయంకాగా ఆమహార్ణవగర్భంలో భగవంతుడు ఏవిధంగా ఏయోగాన్ని అవలంబిస్తాడు? ఓ బ్రాహ్మణోత్తమా! నేను శ్రద్ధగా వినగోరుతున్నాను. భగవంతుని యొక్క అవతారాలను మొదటినుండి వర్ణించండి అన్నాడు.

వైశంపాయనుడలా చెప్పాడు.

మహారాజ! నీమనస్సులో భగవంతుని మహిమను వినాలనే కోరికకలుగుట మీ వంశానికి తగిఉన్నది. మహాత్ములైన బ్రాహ్మణులద్వారా నేను వినట్లు కృష్ణ ద్వైపాయన మహర్షి తత్త్వజ్ఞానాన్ని పొంది నాకుచెప్పినదాన్ని నాశక్తికొలది నీకు చెప్పుతాను విను. నేను ఒకసామాన్యఋషిని భగవంతుని మహిమనువర్ణించేశక్తి నాకెక్కడిది? మీరు నన్నడిగినవిషయం నారాయణుని మహిమ తత్త్వజ్ఞానులకు మహర్షులకు కూడ రక్షించదగినది (దాచదగినది) ఆత్మతత్త్వం తెలిసినవాళ్ళు ధ్యానం చేసేదీ కర్మశ్రద్ధ గలవారు కర్మలలో ప్రవర్తించటానికి కారణమైనదీ అయిన దేవుని మహిమ మిక్కిలి ఆనందమునిచ్చునదిగా చెప్పబడింది.మొత్తంమీద ఆభగవంతుని మహిమకు ఆదిగాని చివరగాని మహర్షులకు తెలుసుకొనదగిన ఒకగొప్ప పదార్థము.

వేదంతెలిసినవాళ్ళు అతని మహిమను సత్యమైనదానినిగా కంటికి కనిపించే దానిగాను వర్ణిస్తున్నారు. మొత్తం మీద ఆయనే చేసేవాడు. చేయించేవాడు మనస్సు బుద్ధి జీవుడు మొదలగు వాటిని తెలియజేసేవాడు. ఐదుభూతాలను అతడే సృష్టించాడు. అతడు తన మాయాబలంచేత మరొకరూపాన్ని పొందుతాడు. ఆయన మనలను పనిలో ప్రవర్తింప చేస్తున్నాడు. అతని ద్వారానే వ్యాకులత కలుగుతున్నది. శాన్తంగా ఉన్నప్పుడు ఆయన యజ్ఞాన్ని ఆయన ప్రార్థనమూ చెస్తాం. మాట్లాడే వాడు మాటలు, మోక్షము, స్వర్గము, దేవతలు ఇవన్నీ నారాయణరూపములైనవి భూతులు, సత్యము, అసత్యము భూతభవిష్యద్వర్తమానాలు అన్నీ నారాయణ స్వరూపాలే.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
విష్ణు మహిమ అను ఏడవఅధ్యాయము

★★★

# ఎనిమిదవ అధ్యాయము

## యుగముల పరిమాణములు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! సత్యయుగం నాలుగువేలసంవత్సరాలు. ఎనిమిదివందల సంవత్సరాలకు యుగసంధి ఏర్పడుతుంది. ఈయుగంలో ధర్మానికి నాలుగు పాదాలు అధర్మానికి ఒకపాదం మాత్రమే ఉంటుంది. ఈసమయంలో మానవు లందరూ తమతమ ధర్మములపై ఆసక్తికలవారై తమపనులను నెరవేరుస్తూ ఉంటారు. అయుగంలో బ్రాహ్మణులు ధర్మమందు, రాజులుపాలనయందు, వైశ్యులు వ్యవసాయమందు శూద్రులు సేవాకార్యమందు ప్రవర్తిస్తుంటారు. ఈ సమయంలో సత్యము, తపస్సు, ధర్మంమీద గౌరవం వృద్ధిచెందుతాయి. ప్రజ లందరూ సజ్జనులు ఆచరించిన మంచిపనులను ఆచరిస్తారు. ప్రజలు స్వయంగానే మంచినడవడిని రక్షించుకుంటారు. ఇతరులకు మంచినడవడిని ఉపదేశిస్తూ కూడా ఉంటారు. సత్యయుగంలో అందరినడవడీ స్వచ్ఛంగా ఉంటుంది.

త్రేతాయుగం మూడువేలసంవత్సరాలు ఆరువందల సంవత్సరాలకు యుగసంధి. ఈయుగంలో ధర్మానికి మూడుపాదాలు, అధర్మానికి రెండుపాదాలు ఉంటాయి. ఈయుగంలో కూడా సత్యం ఉత్సాహం వృద్ధిచెందుతుంది. మానవులు ధర్మాసక్తిలో తటస్థులుగా ఉంటారు. నాలువర్ణాల ధర్మంలో వికారం ఏర్పడటం వల్ల మనుష్యులలో దుర్బలత్వం ఏర్పడుతుంది. ఇది త్రేతాయుగ పరిస్థితి. ద్వాపర యుగం రెండువేల సంవత్సరాలు. నాలుగువందల సంవత్సరాలకు సంధి యేర్పడు తుంది. ఈయుగంలో బ్రాహ్మణులకు ధనాశ జ్ఞానంకలవాళ్ళు రజోగుణం కలిగి ఉండుట కలుగుతుంది. ఇతరులు మోసగాళ్ళు రహస్యంగా అపకారం చేసేవాళ్ళు అవుతారు.

ఈసమయంలో ధర్మానికి రెండుపాదాలు అధర్మానికి మూడుపాదాలు ఉంటాయి. ధర్మము, వ్రతము, ఉపవాసమూ విడిచిపెట్టబడతాయి. బ్రాహ్మణ ధర్మం ఆస్తిక భావం మెల్లమెల్లగా క్షీణిస్తుంది. ప్రజలు ఉపవాసాలను, వ్రతాలను విడిచిపెడతారు. దీని తరువాత మిక్కిలి క్రూరమైన కలియుగం వస్తుంది. ఇది రెండువేల సంవత్సరాలు ఉంటుంది. ఒక వెయ్యి సంవత్సరాలకు సంధి ఈ యుగంలో ధర్మానికి ఒక్కపాదం మాత్రమే మిగులుతుంది. అధర్మానికి నాలుగు

పాదాలు ఉంటాయి. ఈ సమయంలో మనుష్యులు ఘోరమైన అజ్ఞానాంధకారంలో పడి కాముకులు ఔతారు. వ్రతం ఉపవాసం చేసేవాడు ఒక్కడూ ఉండడు. సత్యం చాలావరకు నశిస్తుంది.

ఆస్తికులు బ్రహ్మవాదులు సజ్జనులు కరువౌతారు. జనులందరూ అహంకార మదంచేత మదించి ఉంటారు. స్నేహబంధం శిథిలమౌతుంది. బ్రాహ్మణులు శూద్రుల ఆచారాన్ని అవలంబిస్తారు. శూద్రులు బ్రాహ్మణాచారాన్ని కలిగిఉంటారు. అందరూ ఆశ్రమధర్మాలను నిందిస్తారు. అప్పుడు వర్ణసంకర మౌతుంది. పరస్త్రీ సంగమం వేదవాక్యాలపై సందేహం, కలిగిఉంటారు. పన్నెండువేల సంవత్సరాలు ఒక దివ్యయుగమవుతుంది. ఇది డెబ్బైరెట్లైతే మన్వంతరం, మన్వంతరానికి పధ్నాలుగురెట్లు బ్రహ్మకు ఒకదినమౌతుంది. ఒకదినం పూర్తికాగానే శంకరుడు అందరినీ నశింపచేస్తాడు. శంకరుడు అగ్నిరూపంతో అంతనూ భస్మం చేస్తాడు. మేఘరూపంతో అంతాజలమయం చేస్తాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
యుగముల పరిమాణములు అను ఎనిమిదవఅధ్యాయము

☆☆☆

# తొమ్మిదవ అధ్యాయము

## పుష్కర జననము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! మహాయోగియైన నారాయణుడు ఏడు రూపాలుకల సూర్యుడుగా అయి తన మిక్కిలి ప్రకాశించే కిరణాలచేత సముద్రాల్ని ఇంకింపచేసి, అన్నిచోట్ల ఉన్న నీటినీ ఎండింపచేస్తాడు. భూమిని వెయ్యిముక్కలుచేసి వాటిని పాతాళానికి పంపుతాడు. పాతాళంలోని బలాన్ని అంతనీ త్రాగేస్తాడు. తరువాత మరొకనీటిని సృష్టిచేసి ఆకాల ప్రజలకు ఇస్తాడు. మళ్ళీ జీవుల్ని అందర్నీ సృష్టించటం జరుగుతుంది. మళ్ళీచివరిలో అంతనూతన శరీరంలోయం చేస్తాడు. తరువాత మహా మేఘమై అంతనూ జలమయంచేస్తాడు. ఈ దశలో భగవంతుడైన విష్ణువు అంతనూ తన స్వాధీనం చేసుకొని ఆశ్చర్యకరమైన యోగాన్ని అవలంబించి పదివేల సంవత్సరాలు గడుపుతాడు. ఆ మహాపురుషుని ఎవడూ స్పష్టంగా ఎరుగడు.

ఇంతవరకు విని జనమేజయుడు ఓ బ్రాహ్మణోత్తమా! ఏకార్ణవమైనప్పటి ప్రళయానికికూడ ఏదైనా హద్దు ఉందా? హద్దు ఉన్నట్లైతే సహజంగానే ముక్తి ప్రాప్తిస్తుంది కనుక ఇతర సాధానాల అవసరమేముంది? ఆ పరమపురుషుడెవడు? ఆ ఏకార్ణవయోగం ఎలాజరుగుతుంది? ఆసమయంలో యోగులు ఎవరుంటారు? అని అడగగా వైశంపాయనుడు ఓ మహారాజా! భగవంతుడైన నారాయణుని ఏకార్ణవ వ్యవస్థకు ఒకసమయమేమీ నిశ్చయింపబడిలేదు. దాన్ని లెక్కపెట్టే వాడెవ్వడూ లేడు. కొలిచేవాడు, చూచేవాడు, తెలుసుకునేవాడు, ప్రక్కనుండు వాడూ ఎవ్వడూ ఉండడు. కనక ఏవరికీ అతని విషయం తెలియదు. ఈపరిస్థితిలో భూమ్యాకాశాలను వేదాలకాధారమైన బ్రహ్మను మహామునులనూ శాసిస్తూ ఆపరమాత్మ శయనిస్తాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పుష్కర జననము అను తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# పదవ అధ్యాయము

## నారాయణ మార్కండేయ సంవాదము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఈవిధంగా ప్రపంచమంతా నీటిలోమునిగిపోగా నారాయణుడు సమస్తమునూ నీటిలోకప్పివేసి కర్మలకు ఫలమైన దేహము మొదలైన బంధనముల మధ్య శయనిస్తాడు. అతనికి దేహం మొదలైన ధర్మాలు ఉండవు. కనుకనే బ్రాహ్మణులు వాక్యరూపంగాను అక్షరరూపంగాను బ్రహ్మమును చెపుతున్నారు. ఆయన తపస్సును ఆధారంగా చేసుకొని మూడుకాలాలను వ్యాపించే నిద్రయొక్క ఆనందాన్ని అనుభవిస్తాడు. పురుషోత్తముడైన ఆప్రభువు యజ్ఞ స్వరూపడు జ్ఞాన స్వరూపుడును. పూర్వము బ్రహ్మపరాయణులు రాగద్వేషములు లేనివారును అయిన ఋత్విక్కుల సంఘము యజ్ఞంకొరకు అతనిశరీరంనుండి పుట్టారు. వాళ్ళలో బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుడు అనువాళ్ళు భగవంతుని ముఖము నుండి ప్రస్తోత, మైత్రావరణ, ప్రతిప్రస్థాత అనువాళ్ళు, బాహువులనుండి, ప్రతిహర్త పోత, అనువాళ్ళును పొట్టనుండి, అధ్యాపక, నేతలు తొడలనుండి, ఆగ్నీధ్ర,

సుబ్రహ్మణ్యులు, హస్తములనుండి, గ్రావస్తోత, ఉన్నేతా అనేవాళ్ళు భుజముల నుండి పుట్టారు.

వీళ్ళందరూ ఋత్విక్ సముదాయం, వేదవక్తయాజ్ఞికులనువారు మిక్కిలి గొప్ప బ్రాహ్మణులు. వీళ్ళు ప్రణవ, అర్థభావన, సత్యోక్తి ప్రాణజప, పూర్వస్మృతి, ఆచార, అపానవిజయ, భవిష్యద్దుంఖవిస్మృతి, ఈశ్వర పూజా, దాన, యోగోత్సాహ సాత్త్విక శ్రద్ధ, వేదాంత శ్రవణ, ఇంద్రియశౌర్య, తితిక్ష, యోగ, జ్ఞానములనే పదహారు విధములైన పనులలో దీక్ష తీసుకొనుటకు అధికారం కలవారు. ఒక్కవేదం ద్వారానే సృష్టికర్త అయిన పరమాత్మను పొందగలరు. వారి జ్ఞానానికి ఉపాయం కేవలం యజ్ఞమే. భగవంతుడు ఈశ్వరమయుడయినట్లు వేదము కూడ ఈశ్వరమయం. వేదాంగములు, ఉపనిషత్తులు, సమస్తవైదిక కార్యములూ ఈశ్వరుని స్వరూప ములు. భగవంతుడు ఏకార్ణవంలో శయనించి ఉన్నప్పుడు ఆశ్చర్యకరమైన సంఘటన ఒకటి జరిగింది. దాన్ని చెపుతున్నాను- ఏడుకల్పాలకాలం జీవించి ఉండే మార్కండేయుడు ముని కల్పాన్త సమయంలో భగవంతుని పొట్టలో నివసిస్తు న్నాడు. ఆ మునిశ్రేష్ఠుడికి ఇంత దీర్ఘాయుస్సు భగవంతుని అనుగ్రహంచేతనే కలిగింది.

ఒకమారు తీర్థయాత్ర సందర్భంగా మార్కండేయుడు నారాయణుని పొట్ట లోనే ఉన్న అనేక పుణ్యాశ్రమాలు, పుణ్యతీర్థాలు, అనేకదేశాలూ, చాలా రాజ్యాలూ మనోహర నగరాలను తిరుగతూ కఠోరమైన తపస్సు చేయాలనుకున్నాడు. భగవంతుని ముఖం నుండి బయటకు రాగానే పరమేశ్వరునిమాయచే అతనికి ఏమీ తెలియలేదు. అతనికి సమస్తమూ నీటి మయంగా కనిపించింది. నలువైపులా చీకటివ్యాపించి ఉన్నది. అది చూచి అతడు భయపడ్డాడు. తన జీవనం కూడా కష్టంగా కనిపించింది. తరువాత పాలసముద్రంలో పడుకొని ఉన్న భగవంతుని చూచి మిక్కిలి సంతోషపడ్డాడు. ఆశ్చర్యపోయాడు కూడా.

అతడు నాకు మోహం కలిగిందా? స్వప్నం చూచానా? నామనస్సులో ఏదేని వికారం ఏర్పడిందా? ఇక్కడ సూర్యచంద్రులుగాని భూమిగాని ఏదీ కనపడటం లేదు. ఇది ఏలోకం? అని ఇలా విచారించి సముద్రంలో నీటితోనిండిన మేఘంలా నల్లవర్ణంకలిగి గొప్ప తేజశ్శాలి శరీరంతో కూడిన పర్వతాకారంగ పెద్దమనిషి పడుకొని ఉన్నాడు. అతడు తేజస్సులచే తపింప చేస్తున్నట్లు కాంతివిశేషంచేత ప్రకాశిస్తునట్లు మేలుకొన్నట్లు బుసగొట్టుచున్న పాములవలె ఉన్నాడు. అదేవుని

నీవెవడవని అడగటానికి వస్తుండగానే పూర్వంలాగే మళ్ళీ ఆముని పొట్టలో ప్రవేశ పెట్టబడ్డాడు. మునిశ్రేష్ఠుడైన మార్కండేయుడు కడుపులో ప్రవేశించి మళ్ళీభూమిమీద పుణ్యతీర్థాలను పుణ్య క్షేత్రాలనూ చూడనారంభించాడు.

భగవంతుని కడుపులో క్రతువులు సంపూర్ణ దక్షిణలతో చేస్తున్న వందలకొలది బ్రాహ్మణులను చూచాడు. బ్రాహ్మణాది వర్ణములు నాలుగుఆశ్రమాలు మంచి నడవడిగలిగి ఉన్నాయి. మార్కండేయముని భగవంతుని కడుపులో లక్ష సంవత్సరాలు భూమి అంతటా తిరిగినా ఆపొట్టకు అంతు కనబడలేదు. తరువాత మళ్ళీ నోటినుండి బయటకు వచ్చాడు. మర్రిచెట్టు కొమ్మమీద నిద్రపోతున్న బాలుని చూచాడు. ఏఒక్క ఇతర జీవుడు కనబడలేదు. మార్కండేయుడు తానక్కడే ఉన్నాడు. అతని మనస్సులో భయం కలిగింది. ఏకార్ణవంలో కనిపించిన శిశువు వద్దకు వెళ్ళటానికి సాహసించలేకపోయాడు. ఆనీటిలోనే ఒకచోటనిలి ఆలోచింపసాగాడు.

నేను మొదట చూచినవాడేనా ఇతడువేరా? అని సందేహించాడు. అఖండ జలరాశిలో మార్కండేయుడు తేలుతూ ఉన్నాడు. అతని మనస్సుకు శాంతిలేదు. హంస స్వరూపుడైన భగవంతుడు నారాయణుడే తన యోగబలంచేత ఇలా బాలుడుగా ఉన్నాడని తలచాడు. కొంచం సమయం తర్వాత మేఘగంభీరధ్వనితో బాలుడు మార్కండేయ! భయపడకు. ఇక్కడకురా మార్కండేయమునీ! నీవు బాలుడవు శ్రమపడ్డావు. మార్కండేయ! అన్నాడు. ఎవడితడు నన్నుపేరుపెట్టి పిలుస్తున్నాడు? నా తపస్సును లెక్కచేయుటలేదు. నేను చాల వేల సంవత్సరాల ఆయుస్సుకలవాణ్ణి. బ్రహ్మ కూడ నన్ను దీర్ఘాయువు అంటాడు. అట్టి నన్నుపేరు పెట్టి మార్కండేయ అనిపిలిచి ఇతడు మృత్యుముఖం చూడదలచుచున్నాడు. మార్కండిలా కోపంతో మాట్లాడగానే భగవంతుడైన నారాయణుడు మళ్ళీ అతన్ని పిలిచి, నాయనా! నేను పురాతన పురుషుడైన నారాయణుడను. నీకు జన్మను అయుస్సును ఇచ్చినవాణ్ణి. తండ్రిని గురువును నీవిప్పుడు నాదగ్గరకెందుకు రావటం లేదు? నీతండ్రి అంగిరసుడు పుత్రుడుకావాలని కఠోర తపస్సు చేస్తూ నన్ను ఆరాధించాడు.

అందుచేత నేను నిన్ను అగ్నివంటి కాంతిగలవానినిగా ఘోరతపస్స చేసినవాని గాను మహర్షిగా దీర్ఘాయువుగాను చేశాను. ఇందువల్ల ఇప్పుడు యోగాన్ని అవలంబించి క్రీడిస్తూ ఏకార్ణవజలరాశిలో పరున్నాను. ఈసమయంలో నాఆత్మ

నుండి పుట్టినవాడు తప్ప మరొకడు నన్నుచూడలేడు అన్నాడు. ఈమాటలు విని మార్కండేయుడు ఆశ్చర్యంతో చేతులజోడించి తలవంచి నమస్కారం చేశాడు. మరియు ఓభగవంతుడా! సముద్రం తప్ప ఏమీ కనిపించుట లేదు. నీవొక్కడవే పిల్లవాని వేషంలో ఇక్కడపరున్నావు. ప్రపంచంలో నీకుప్రసిద్ధమైన పేరేమి? నీవు ఊహించరాని విభూతివిగా నాకుతోచుచున్నావు. ఎవరైనాకానీ మహామాయను తెలుసుకొనుటకు మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను అన్నాడు.

భగవంతుడు నేనే నారాయణుడను, బ్రహ్మను నేనే. నా వలననే జీవులు పుట్టుట నశించుట జరుగుచున్నది. దేవతలకు రాజుగా ఉన్నప్పుడు నన్ను ఇంద్రుడంటారు. వర్షర్తుస్వరూపుడను, సమస్తమూ నేనె అయిఉన్నాను. నేను సృష్టించిన ప్రపంచాన్ని పరీక్షిస్తూఉంటాను. నేను మహాయోగిని, కాలస్వరూపుడను. నీవుచూచేదీ వినేదీ నీవు అనుభవించేదీ అంతానానుండియే పుడుతున్నది. ప్రతి యుగంలోనూ జగత్తును సృష్టిస్తాను. బ్రహ్మ, దేవతలు ఋషిగణమూ వీళ్ళందరూ నాశరీరంలో నివసిస్తున్నారు అనిచెప్పాడు. పరమాత్మ ఆయా సమయాల్లో క్రమంగా సృష్టించే ఆలోచనచేస్తూ ఉంటాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
నారాయణ మార్కండేయ సంవాదము అను పదవఅధ్యాయము

☆☆☆

# పదకొండవ అధ్యాయము

## నారాయణుని నాభి నుండి కమలము పుట్టుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శ్రీవిష్ణుభగవానుడు 'ఆపవుడు' అనే మహర్షిగా అయి తపస్సు ప్రారంభించాడు. తరవాత అనంతశక్తిగల ఈశ్వరరూపాన్ని ధరించి, ఆకాశం మొదలైన పంచభూతాలసృష్టిని గూర్చి ఆలోచించాడు. ఆసమయంలో ప్రపంచ మంతా నీటితో నిండి ఉంది. తన తపోబలంచేత అహంకారతత్త్వాన్ని వృద్ధిచెందింది మహాసముద్రాన్ని చలింపచేశాడు. ఆ సంచలనంవల్ల చిన్నకన్నం తయారైంది. అదే ఆకాశంగా రూపొందింది. తరువాత భగవంతుడు శబ్దమయ స్వరూపంధరించి ఆకన్నంలో ప్రవేశించాడు. అతడే శబ్దమయస్వరూపుడైన వాయువు. భగవంతుడు వాయురూపంధరించి విస్తరించ సాగాడు. ఈవిధంగా ఆకాశం వాయువు సంక్షోభం

వల్ల జలరాశిమథింపబడి జ్వాలలతో కూడిన అగ్నిపుట్టింది. ఆఅగ్నివల్ల సముద్ర జలం ఎండిపోయింది. ఆకాశంవృద్ధి వృద్ధి చెందింది. మొత్తంమీద భగవంతుడు మొదట అమృతంవంటి నీటిని సృష్టించి దాని నుండి ఆకాశాన్ని, ఆకాశంనుంచి వాయువును, ఈమూడిటి సంఘర్షణవల్ల భూమిని సృష్టించాడు.

భగవంతుడైన నారాయణుడు పంచభూతాలనూ చూచి మిక్కిలి సంతోషిం చాడు. తరువాత లోకసృష్టికి కారణమైన బ్రహ్మపుట్టుకగూర్చి ఆలోచించాడు. పూర్వం తపస్సుచే పవిత్రులైన బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైన వానినిచూచి అతన్ని బ్రాహ్మణులను వేదములను జగత్తును రక్షించటానికి బ్రహ్మపదవియందు ఆజ్ఞా పించాడు. ఇలా బ్రహ్మనునియమించిన పిమ్మట మహా సముద్రంలో నిశ్చింతంగా ఉన్నాడు. బ్రహ్మదేవుడు ఎప్పుడో జీవసృష్టికార్యంలో నిమగ్నుడై తక్కిన సమయంలో నిశ్చింతంగా ఆనందిస్తున్నాడు. ఈ సమయంలో భగవంతుడు తనబొడ్డునుండి ఒక బంగారు కమలాన్ని పుట్టించాడు. ఆకమలం శరత్కాల సూర్యునిలా ప్రకాశి స్తుంది. అదిమంచి పరిమళం కలిగి వెయ్యిరేకులతో వెలుగొందుచున్నది. నారాయణుని నాభి కమలంశోభకు సాటిలేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి భవిష్యపర్వములో
నారాయణుని నాభి నుండి కమలము పుట్టుట అను పదకొండవఅధ్యాయము

☆☆☆

# పన్నెండవ అధ్యాయము

## నాభికమల స్వరూపము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత భగవంతుడైన నారాయణుడు యోగులలో జ్ఞానుల లోనూ గొప్పవాడైనట్టియు సమస్తప్రాణులను సృష్టించునట్టి చతుర్ముఖ బ్రహ్మను కూర్చుండ బెట్టాడు. ఈకమలం సూర్యునివంటి తేజస్సుకలది సువాసన కలది అన్నిసద్గుణములు కలదియు. పురాణవేత్తలు మహర్షులు దానిని నారాయణుని నుండి పుట్టినదానినిగా చెపుతారు. పద్మాసనమైన దేవిని పృథివిగా చెపుతారు. దానిగర్భమును పర్వతమని చెప్పుతారు. హిమవత్పర్వతం, మేరువు, నీలము, నిషధము, కైలాసము, ముంజవత్తము, గంధమాదనము, మందరము, వింధ్యము, ఉదయాస్తమయ పర్వతాలు, పవిత్రమైనవి కోరినఫలాన్ని ఇచ్చేవీకూడ. ఈ

పర్వతాలు దేవతలకు, సిద్ధులకు ఆశ్రమాలు. వీటిమధ్య ప్రదేశం జంబూద్వీపంగా ప్రసిద్ధి పొందింది. అది కర్మభూమి అక్కడ నుండి అమృతం వంటి నీటిని ప్రవహించే నదులు నలువైపుల నుండి వ్యాపిస్తున్నాయి.

భగవంతుని నాభికమలం చుటునుండు కింజల్కములు భూమిలోని ధాతు పర్వతాలు. ఆకమలంపై ఉన్న రేకులు పర్వతాలతో వ్యాప్తమైన మ్లేచ్ఛదేశ ప్రాంతము. ఆకమలం క్రిందిరేకులు వాటిలో కొన్ని దైత్యులు, కొన్ని సర్పాలూ నివసించే ప్రదేశాలు. ఆకమలం క్రిందిభాగం పాతాళంగా చెప్పబడుతుంది. పాతలం కంటే క్రింద ఉదకమనే పేరుగల ప్రదేశము దానిలో మహాపాపులైన జనులు మునిగి ఉంటారు. ఆకమలానికి నలువైపులా ఉన్న జలరాశిని ఏకార్ణవమంటారు. ఆ ఏకార్ణవానికి నలువైపుల ఉన్న జలరాశిని నాలుగుసముద్రాలుగా చెపుతున్నారు. అదే మహర్షినారాయణుని మహాపుష్కర ప్రాదుర్భావమని చెప్పబడుతున్నది. వేదార్థ జ్ఞానసంపన్నులైన పూర్వపుమహర్షులు ఈవిధంగా భగవంతుని నాభికమలము పుట్టుకను చెప్పుతున్నారు. భగవంతుడైన నారాయణుడు ఈనాభికమల ప్రణాలికను బట్టి పర్వతాలను నదులను వేర్వేరు దేశాలఉనికిని ఏర్పాటుచేశాడు. విష్ణువు మహా సముద్రంలో పరుండినసమయంలో జగత్తురూపమైన కమలాన్ని సృష్టించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
నాభికమల స్వరూపము అను పన్నెండవ అధ్యాయము

☆☆☆

# పదమూడవ అధ్యాయము

## బ్రహ్మ మధుకైటభులకు వరమిచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! వెయ్యియుగాలు గడిచాక తమోగుణంతో మధువను రాక్షసుడు రజోగుణంవల్ల కైటభుడను అతని తమ్ముడు ఈయిద్దరు రాక్షసులు పుట్టారు. వాళ్ళయిద్దరి స్వరూపం మిక్కిలి భయంకరమైనది. వాళ్ళు కావలసిన రూపం ధరించ గల సమర్థులు. ఇద్దరికళ్ళు పెద్దవి వికృతంగా ఉండేవి. ఎర్రనివి. వాళ్ళ వక్షస్థం బలమైంది. విశాలమైంది. భూజాలు విశాలమైనవి. పర్వతమంతటి శరీరం వాళ్ళద్దరిది. వాళ్ళ శరీరం నలుపురంగు గలది. ముఖం ఉదయిస్తున్న సూర్యునివలె ఎర్రనైంది. కళ్ళుమెరుపుతో కూడిన మేఘంలాంటివి.

ఒకడు నల్లనిబట్టను రెండవవాడు ఎర్రనివస్త్రాన్ని ధరించారు. ఇద్దరి దంతాలూ ప్రకాశిస్తూ ఉన్నాయి. తలపైకిరీటం చేతులకు భుజకీర్తులు కంకణాలు ప్రకాశిస్తు న్నాయి. వాళ్ళిద్దరూ గొప్పపరాక్రమం కలవాళ్ళు. వాళ్ళకాళ్ళచప్పుడు భగవంతుని కంపింపచేస్తున్నది. భయంకరులైన ఆయిద్దరురాక్షసులూ కమలందగ్గర విహ రిస్తున్నారు. బ్రహ్మదేవుడు భగవంతుని ఆజ్ఞచే దేవమానవాదిసృష్టికి సంకల్పించాడు. అదేసమయంలో ఆరాక్షసులిద్దరూ యుద్ధం చెయ్యాలనే కోరికతో బ్రహ్మవద్దకు వచ్చారు. ఎవడవు నీవు? కమలంమీద కూర్చున్నావు? మమ్మల్ని నీవు లెక్క చేయటం లేదు. రా, మాతోయుద్ధం చెయ్యి. మాముందునీవు నిలువ లేవు. నీవెవడవు. ఎవడు నిన్నిక్కడకు పంపాడు. నిన్నెవడు సృష్టించాడు? నీకు రక్షకుడెవడు? నేపేరేమి? అన్నారు.

అప్పుడు బ్రహ్మనేను బ్రహ్మను. మీరునన్నెరగరు. అన్నాడు. మధుకైటభులు - మాకంటె గొప్పవాళ్ళెవరూ లేరు. రజోగుణతమోగుణ ప్రభావంతో మేము ప్రపంచ మంతటా వ్యాపించిఉన్నాము. యోగులకు మేము దుఃఖలక్షణాలము. ప్రపంచంలో ప్రాణులు మాయయొక్క అంతుతెలియనివాళ్ళు. ప్రతియుగంలోనూ మేము ప్రపంచాన్ని మోహంలో పడవేస్తాం. అన్ని ప్రయోజనాలను నమకూర్చేయజ్ఞాలు మేమే. సమస్తమూ మేమిద్దరమే అన్నారు. అప్పుడు బ్రహ్మ ఓరాక్షసరాజా! పూర్వం నేను శ్రమపడినందుకు ఫలితంగా నారాయణుడు నన్ను సత్త్వగుణంలో ప్రతిష్ఠించాడు. రజోగుణము తమోగుణమూ కూడా నారాయణుని నుండియే పుట్టాయి. జీవులందరి పుట్టుకకు మూలకారణమైనవాడు ఆయనే. ఆయనే యుద్ధంలో మీయుద్ధమదాన్ని దూరంచేస్తాడు అన్నాడు.

తరువాత ఆరాక్షసులిద్దరూ సముద్రంపై శయనించియున్న భగవంతునివద్దకు వచ్చి నమస్కరించి ప్రపంచం నీనుండి పుట్టిందని మేమెరుగుదుం. నీవు పురుషోత్త ముడవు. మేమిక్కడకు నిన్ను ఉపాసించటానికి వచ్చాం. సత్యస్వరూపుడైన ఈశ్వరునిగా నిన్ను తెలుసుకొన్నాం. మీదర్శనం వ్యర్థంకాదని తెలుసు. ఈ కారణంగా అన్నివిధాలా మీదర్శనం చేయగోరుతున్నాం. మీరువరమిచ్చి మమ్మల్ని దయచూడండి. మీకు నమస్కారము అన్నారు.

భగవంతుడు ఓమధుకైటభులారా! మీకేం కావాలో త్వరగా చెప్పండి. నేను ఇచ్చిన ఆయుస్సుకంటే ఎక్కువకాలం ఆయుస్సు కోరుకుంటున్నారా? అలా ఐతే మీకోరిక సిద్ధిస్తుంది. అన్నాడు. మధుకైటభులు ఎవరూ ఎక్కడా మరణించని

చోట మరణించాలని కోరుకుంటున్నాం. ప్రభూ! నీకు పుత్రులమై పుట్టాలని కూడ కోరుకుంటున్నాం అన్నారు. భగవంతుడు మీరుకోరినట్లే వరమిస్తున్నాను. కల్పాంతమందు నాకు పుత్రులై జన్మిస్తారు. సందేహంలేదు. అని వరమిచ్చి కొంత సమయం తరువాత వారినిఇద్దరినీ తనతొడలపైపెట్టి మర్దించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బ్రహ్మ మధుకైటభులకు వరమిచ్చుట అను పదమూడవఅధ్యాయము

☆☆☆

# పద్నాల్గవ అధ్యాయము

## సమస్త ప్రాణుల జన్మ వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత వేదవేత్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మ నారాయణుని నాభి కమలమందే కూర్చుని చేతులెత్తి కఠోరమైన తపస్సు చేశాడు. అతడు సహజంగా తేజశ్శాలి, ఈ తపస్సు వలన అతని శరీరం మిక్కిలి ప్రకాశించింది. సనాతనుడైన నారాయణుడు రెండు భాగములై ఒకరూపంతో యోగాచార్యుడుగా రెండవ భాగంతో సాంఖ్యాచార్యుడుగా అయ్యాడు. వారిద్దరూ దేవర్షులచే స్తుతింపబడ్డారు. వాళ్ళు బ్రహ్మవద్దకు వెళ్ళి ఓ బ్రహ్మ! నీవు జగత్తు పాలించేవాడివి. అందరికంటే గొప్పవాడవు. సత్యమయుడవు, స్థూల, సూక్ష్మతత్త్వాలకు కారణమైనవాడవు అని స్తుతించగావిని, 'భూర్భువః' మొదలైన మూడు వేదమంత్రములను జపిస్తూ భూ మొదలైన మూడులోకాలను సృష్టించాడు. మొట్టమొదట ఆయన తన మనస్సుతో నాశరహితుడైన 'భూ' అనే ఒక పుత్రుణ్ణి పుట్టించాడు. ఆ పుత్రుడు పుట్టగానే బ్రహ్మ వద్దకు వచ్చి నేను మీకు ఏం సహాయం చెయ్యాలి? ఆజ్ఞ ఇవ్వండి అన్నాడు. బ్రహ్మవత్సా! యోగాచార్యుడైన నారాయణుడు, సాంఖ్యాచారుడైన కపిలుడు ఆజ్ఞాపించిన పని చెయ్యి అన్నాడు.

ఆ 'భూ' అనే పుత్రుడు సందేహిస్తూ నారాయణ కపిలదేవుల వద్దకు వెళ్ళాడు. అక్కడ చేతులు జోడించి మహాత్మా నేను మీసేవచేయుటకు ఇక్కడికి వచ్చాను. నేనేం చెయ్యాలో చెప్పండి అన్నాడు. తర్వాత యోగాచార్య నారాయణుడు సాంఖ్యా చార్య కపిలుడూ ఓబుద్ధిమంతుడా! నీవు సత్యస్వరూపుడు అమృత స్వరూపుడు పరాత్పరుడైన పరబ్రహ్మను స్మరించు అని బోధించారు. అతడు వారిద్దరి మాటలు

విని ఉత్తరదిశగావెళ్ళి జ్ఞానదృష్టి ప్రభావం చేత బ్రహ్మత్వాన్ని పొందాడు. తరువాత బ్రహ్మ 'భువః' అనే రెండవమానస పుత్రుణ్ణి సృష్టించాడు. అతడు కూడా పుట్టగానే బ్రహ్మవద్దకు వచ్చి నేను మీకేం చెయ్యాలి? అనిఅడిగాడు. బ్రహ్మ ఇతన్ని కూడ నారయణ కపిలుల వద్దకు పంపాడు. వీడు కూడ వెనుకటివాడి వలెనే వాళ్ళ దగ్గరకు వెళ్ళి పరమపదాన్ని పొందాడు.

తరువాత బ్రహ్మ మరొకపుత్రుణ్ణి సృష్టించాడు. ఈమూడవవాడిపేరు 'భూర్భువః' అని. వీడు వెనకటి ఇద్దరివలె పరమపదమును అలంకరించాడు. తరువాత నారాయణ కపిలదేవులు బ్రహ్మ యొక్క ముగ్గురుకుమారులను కూడా తీసుకువెళ్ళి పరబ్రహ్మలో లీనమయ్యారు. తరువాత బ్రహ్మదేవుడు మళ్ళీ ఘోర తపస్సు చేయసాగాడు. లెక్కలేనంతకాలం తపస్సు చేసి అలిసిపోయి బ్రహ్మ తన శరీరార్ధభాగంతో పుణ్యలక్షణాలు కల భార్యను పుట్టించాడు. ఆభార్య తపస్సు తేజస్సు మంచినడవడి మొదలైన అన్ని విషయాలలోనూ అతనికి తగినదీ లోకసృష్టి విషయంలో మిక్కిలి శక్తికలది కూడా. బ్రహ్మదేవుడు ఆమెతోరమించి ప్రజాపతు లను సముద్రాలను నదులను సృష్టిస్తూ మూడుపాదాలుగల వేదమాతయైనగా యత్రిని సృష్టించాడు.

దానినుండి నాలుగువేదాలను పుట్టించాడు. తరువాత తన సౌకర్యం కొరకు జనులను పుట్టించు పుత్రులను సృష్టించాడు. వాళ్ళు ప్రజాపతులుగా ప్రసిద్ధి పొందారు. తరువాత వాళ్ళద్వారా ప్రాణులజన్మ ఏర్పడింది. మొదటధర్మాన్ని సృష్టించాడు. దక్షుడు మరీచి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు, గౌతముడు, భృగువు, అంగిరసుడు మనువు అనువాళ్ళను పుట్టించాడు. వీళ్ళందరూ అథర్వవేదం తెలిసినవాళ్ళు బ్రహ్మర్షి పదవిచే అలంకరింపబడిన వాళ్ళను. ఈ బ్రహ్మర్షుల పధ్నాలుగుమంది కన్యల ద్వారా వాళ్ళవంశం విస్తరించింది.

అదితి మొదలైన పన్నెండుగురు ఇరవైఏడు నక్షత్రాలు, దక్షుని సంతానం. మరీచి పుత్రుడు కశ్యపుడు. దక్షుడు కశ్యపునికి పన్నెండుమంది కన్యలనిచ్చాడు. రోహిణి మొదలగు ఇరవైఏడుగుర్ని చంద్రుడి కిచ్చాడు. ఆ కుమార్తెలందరూ పవిత్రత కలవాళ్ళు ఇంతకు పూర్వం బ్రహ్మ తనకు పుట్టిన అయిదుగురు కన్యలను ధర్మునికి ఇచ్చాడు. తన అర్ధశరీరం నుండి పుట్టి కామరూపిణియైన భార్య సురభి అనే ఆవురూపం ధరించి బ్రహ్మవద్దకు వచ్చి నిలిచింది. అప్పుడు బ్రహ్మ గోజాతి వృద్ధి పొందటానికి సురభితోపాటు సంగమం చేశాడు.

అందువల్ల అతనికి పదకొండు మంది పుత్రులు కలిగారు. వాళ్ళందరూ ధర్మాత్ములు. వాళ్ళు అగ్నితోసమానమైన తేజస్సుకలవాళ్ళు. వాళ్ళు పుడుతూనే ఏడుస్తూ పరిగెత్తుతూ బ్రహ్మకు నలువైపులా తిరగనారంభించారు. ఇందుచే వాళ్ళకు రుద్రులనిపేరువచ్చింది. వాళ్ళందరికీ వేర్వేరుపేర్లు ఉన్నాయి. నిబ్రుతి, సర్వ, అజ, ఏకపాల్ మృగవ్యాధ, పినాకి, దహన, ఈశ్వర, అహిర్బుధ్న్య, కపాలి, అప రాజితుడైన సేనానిలని పదకొండుమంది ఆసురభియందే ఓషధులు జన్మించాయి. ధర్మునికి లక్ష్మి, కామదేవునకు సాధ్యగణం మొదలైనవాళ్ళు జన్మించారు.

సాధ్యునకు ఎనిమిదిమంది పుత్రులు, వీళ్ళందరూ ధర్మునిసంతతిగా చెప్పబడ్డారు. విశ్వయొక్క గర్భం నుండిపుట్టిన విశ్వేదేవగణం కూడ ధర్ముని పుత్రులుగా చెప్పబడుతున్నారు. దక్ష, మహాబాహువు మొదలగువాళ్ళు చాక్షుష మనువు యొక్క పుత్రులు. దేవమాత నుండి విశ్వేదేవగణం పుట్టింది. మరుత్వతి మరుత్వంతులు అనే దేవతలను కన్నది వాళ్ళు, అగ్ని, చక్షుమొదలైన వాళ్ళు. అదితి కశ్యపులకు ఇంద్రుడు, విష్ణువు ద్వాదశాదిత్యులు మొదలగువారు పుట్టారు. సరస్వతికి రూపశ్రేష్ఠుడు, బలశ్రేష్ఠుడు అనే ఇద్దరుపుత్రులు. అదితికి దేవతలు, దితికి దైత్యులు, దనుకు దానవులు, సురనకు సర్పాలు, కాల అనుదానికి కాల కేయగణం, ఖసకు రాక్షసగణం అనాయుషకు ఆధివ్యాధులు, సింహికకు రాహువు, మునికి గంధర్వులు జన్మించారు.

ప్రబాధకు అప్సరసలు, క్రోధకు భూతాలు పిశాచాలు యక్షులు సురభి సంతతితప్ప తక్కిన నాలుగుకాళ్ళ పశువులు పుట్టాయి. వినతకు గరుడుడు అరుణుడు పుట్టారు. కద్రువకు పర్వతాలు, సర్పాలూ పుట్టాయి. మహారాజ! భగవంతుడైన నారాయణుని నాభికమలం పుట్టుక వలన ఈవిధంగా ప్రపంచ జనాభా పెరిగింది. నేను విన్నవిధంగా భగవంతుడైన నారాయణుని నాభికమలము పుట్టుకను నీకు వినిపించాను. మహారాజా! ఏకాగ్ర మనస్సుతో బ్రహ్మాండము పుట్టుక శ్రద్ధగావిన్నవాడు సంసారంలో దుఃఖంలేనివాడై కావలసిన ఫలితాన్ని పొందుతాడు. పరలోకంలో అంతులేని స్వర్గసుఖం అనుభవించటానికి అధికారిఅవుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సమస్త ప్రాణుల జన్మ వర్ణనము అను పద్నాల్గవఅధ్యాయము

☆☆☆

# పదిహేనవ అధ్యాయము

## జనమేజయుడు భారతమును మెచ్చుకొనుట

జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! నేను పూర్వుల యొక్క గొప్పదైన చరిత్రను విన్నాను. దివ్యదృష్టి కలవాడు కూడ మహాభారతమును ఒకరోజులో వర్ణించలేడు. నేనిప్పుడు బ్రహ్మదేవుని దినముకు సంబంధించిన సంక్షిప్త విస్తారమును ఆయన యొక్క సంగ్రహ వృత్తాంతాన్నీ వినాలనే మిక్కిలి ఉత్సాహంతో ఉన్నాను. అని అడిగాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
జనమేజయుడు భారతమును మెచ్చుకొనుట అను పదిహేనవఅధ్యాయము

☆☆☆

# పదహారవ అధ్యాయము

## సనాతన బ్రహ్మ వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పారు.

మహారాజా! నీవు బ్రహ్మను గూర్చి వినవలెనని కోరికను వెల్లడించావు. ఇంద్రియములతోకూడిన మనస్సును నిర్మలంగాఉంచుకొని విను- స్థూల సూక్ష్మరూప జగత్తుకు మూలకారణము నాశములేనివాడు పరమపురుషుడని సాంఖ్యులంటారు. అతడెప్పుడూ పరిపూర్ణుడు. అతని నుండి అహంకారతత్త్వమైన బ్రహ్మజన్మించాడు. సమస్త ప్రాణులకు, సమస్త విషయాలకూ అతడు ప్రభువు. అతడు అంతనూ వ్యాపించి ఉండేవాడు. ఊహింపశక్యంకానివాడు, నాశరహితుడును. అతని ద్వారా యుగాలు పుడుతున్నాయి. అతడు జన్మలేనివాడు. అంతటా సమభావంతో ఉండేవాడు. ఈ కారణంచేత బ్రహ్మవేత్తలు వ్యాపకుడనీ నాశంలేనివాడనీ పరమ తత్త్వమనీ అతన్ని గూర్చి చెపుతున్నారు. అతనికి అన్నివైపులాచేతులూ, కాళ్ళూ, కళ్ళూ, తలలూ, చెవులూ ఉన్నాయి. అతడు ప్రపంచాన్ని అంతనూ వ్యాపించి ఉన్నాడు. సచ్చిదా నందములతో అతనికి సంబంధంలేదు.

అతడు చిదానందరూపమైన అవిద్య యొక్క కల్పనయే. అతడు వ్యక్తము కాని చిదానంద స్వరూపుడైన వ్యక్తమైన దేహమందుండి. నిత్యవిచారణ చేస్తుంటాడు.

ఎపుడూ ప్రత్యక్షంగా కనబడడు. అతడు చిదాత్మ, రూపంలేనివాడు పంచతన్మాత్ర లకు ఆధారమైన వ్యక్తరూపంలో ప్రకాశిస్తాడు. కర్రలో అగ్ని కనబడకుండా ఉన్నట్లు ఊహింపరాని రూపంకల చిదాత్మ జీవులందరిలో కనబడకుండా ఉంటున్నాడు. కనుక ఎవడికి అతడు కనపడడు. అతడు కాలము యొక్క భాగములైన భూత భవిషత్ వర్తమానముల రూపంలో పరిణమిస్తున్నాడు. అతడు జీవులందరకూ ప్రభువు. అతని నుండి అహంకారాతత్త్వము యొక్క సృష్టి జరిగింది. అవ్యక్తుడైనా బ్రహ్మయోగం ద్వారా వ్యక్తమౌతున్నాడు. నారాయణుని వల్ల పుట్టిన ఆత్మనుండి అహంకారతత్త్వం సృష్టించబడింది. నారాయణుడు సమస్త ప్రపంచానికీ ప్రభువు. అతన్నే జనులు బ్రహ్మ అంటున్నారు.

అతడే సృష్టి చేస్తున్నాడు. అతని శరీరంనుండి సమస్త ప్రజలు పుడుతున్నారు. అతడు సర్వవ్యాపకుడు జ్యోతిస్వరూపుడు. 'బ్రహ్మ' అని చెప్పబడుతున్నాడు. అంతటా వ్యాపించి ఉన్న భూమి మొదలైన వాటి సృష్టికి మూలకారణము. కనుకనే బ్రహ్మమొదట నీటినే సృష్టించాడు. నీటికంటే పూర్వం వాయువును సృష్టించాడు. బ్రహ్మ ఈశ్వరునకు లోబడినవాడు మరీచి మొదలైనవారందరిలో శ్రేష్ఠుడు. ప్రపంచంలో శమదమాది గుణములుకలవాడు త్వరగా మోక్షంపొందుతాడు. మొదట ప్రపంచం నీటిలో మునిగిఉంది. తరువాత బ్రహ్మకోరిక పై భూమి నీరు వేరుగా కనిపించాయి. నీటి నుండి పుట్టిన దేవత భూమి. నీటిలో మునిగి ఉన్న భూమి నన్ను ఉద్ధరించి నీటిమీద నుంచమని ప్రార్థించింది. అప్పుడు నారయణుడు మహా వరాహరూపంతో సముద్రంలో మునిగి ఉన్న భూమిని వెలుపలకు తెచ్చాడు. వెంటనే అంతర్ధానమయ్యాడు.

ఆజ్యోతి స్వరుప నారాయణుడే ఆకాశం. అతని నుండి బ్రహ్మజన్మించాడు. ఇప్పుడు కూడా బ్రహ్మయే ప్రాణులక్షేమం కొరకు భూమిని ధరిస్తున్నాడు. తరువాత సూర్యుడు భూమి యొక్క మధ్యభాగాన్ని బ్రద్దలు చేసి ఆకాశానికి వెళ్ళాడు. తరువాత సూర్యమండలం నుండి మరొక మండలం బయల్దేరింది. అతిసౌమ్యంగా ఉండటంవల్ల అతి సోమమండలంగా పిలవబడుతున్నది. ఆ సోమమండలం నుండి నిఃశ్వాస వాయువు వెడలింది. ఆనిశ్వాస వాయువు వర్ణ రూపమైన జ్యోతిస్సు కలది. ఆజ్యోతిస్సే వేదమనే పేరుతో ప్రసిద్ధమైంది. ఆజ్యోతిస్సు నుండి వేదానికి కారణమైన సనాతన పురుషుని సృష్టి జరిగింది. ఆసనాతన పురుషుని శరీరములోని ద్రవభాగము నీరు, గట్టిభాగము భూమి, రంధ్రం ఆకాశం జ్యోతిస్సు కన్ను అతని

శరీరము కదలికయే వాయువు. ఈ విధంగా ఆ పరమపురుషుని నుండియే పాంచభౌతిక శరీరం పుట్టింది. ఆపరమపురుషుడు అందరిలో సమానంగా ఉంటాడు. ఆ పరబ్రహ్మ యొక్క జ్ఞానము జీవులందరి బుద్ధిలో ఉంటూ ఉన్నది. యోగ సాధనద్వారా ఆ సత్యమైన జ్ఞానంపుడితే భగవంతునకూ భేదంలేదనే జ్ఞానం కలుగుతుంది.

మూఢులు జఠరాగ్నినే ఈశ్వరుడంటారు. మూఢులు బ్రహ్మజ్ఞానం లేనివారై జననమరణప్రవాహంలో పడుతున్నారు. జ్ఞానబలంచేత ఇంద్రియాల నవ శమందుంచుకొని యోగంలో సమర్థులైన వాళ్ళు శ్రమలేకుండా బ్రహ్మానందాన్ని అనుభవిస్తారు. కనుకనే జ్ఞానులు ఐహికసుఖాలను పనికిమాలినవాటిగా తలచి వాటిపై ఆసక్తిచూపించరు. వాళ్ళుముక్తికి ఉపాయం తెలుసుకుంటారు. లోక విషయాలపై ఆసక్తిగలవాళ్ళు మాటిమాటికీ జన్మిస్తూ మోక్షానికి దూరమౌతారు. బ్రహ్మవేత్తలైన వాళ్ళు వాసనలను (సంస్కారాలను) నిగ్రహిస్తారు. జ్ఞానబలంచేత కామాదివికారాల నుండి మనస్సును మరల్చినవాడు పరిశుద్ధమైన మనస్సు గలవాడు అవుతాడు. యధార్థమైన బ్రహ్మజ్ఞాని అవుతాడు. అటువంటి జ్ఞానం ప్రాప్తించిన తరువాత శరీరాత్మలబంధము విడిపోతుంది.

ఇది శ్రీమహాభారతంలో ఖిలంశమందలి భవిష్యపర్వములో
సనాతన బ్రహ్మ వర్ణనము అను పదహారవ అధ్యాయము

☆☆☆

# పదిహేడవ అధ్యాయము

## శుభాశుభకర్మల ఫలములు

వైశంపాయనుడిలా చెప్పాడు

మహారాజ! సూర్యుడు భూమి మధ్యభాగాన్ని చీల్చుకొని పైకి ఎగిరినప్పుడు ఏర్పడిన రంధ్రములో కదలికలేనిమైనాక పర్వతము, సుమేరుపర్వతమూ ఉంటాయి. 'పర్వ' అనే మాటకు కోరికలుతీర్చే కల్పకవృక్షము కామధేనువు మొదలై నవి అర్థం. అవినివసించేచోటు కనుక పర్వతమనిపేరు ఏర్పడ్డది. కదిలే సామర్థ్యం లేనిది కనుక అచలమని పేరు ఏర్పడ్డది. ఆ సుమేరుపర్వతము యొక్క విశాలమైన పీఠంమీద తేజోమయమైన పురుషాకృతి పరమాత్మనివసిస్తాడు. వేదాంతంలో చెప్పబడే బ్రహ్మమయ తేజస్సే పరమాత్మయొక్క జ్యోతిర్మయ పురుషవిగ్రహము.

ఆ పురుషుని ముఖము నుండి నాలుగుముఖాలుగల తేజస్సు వెలువడుతుంది. వాటినే నాల్గు ముఖాలంటారు.

బ్రహ్మయొక్క ముఖం నుండి జన్మించుటచే బ్రహ్మణులు పూజనీయులు. మేరుపర్వత శిఖరములనే బ్రహ్మలోకమంటారు. ఆశిఖరాలు నూరువేల ఆమడల యెత్తు నాలుగువేల యోజనాల వైశాల్యం గలవి. నాలుగు విశాల శిలా స్తంభాలతో చుట్టబడిన సుమేరుపర్వత ప్రదేశము అంతులేనిది. సాధారణంగా మూడులోకాలందలి జనులు బ్రహ్మను యజ్ఞముపై ఆధారపడినట్లు చెపుతారు. యోగులు తమ హృదయమందున్నట్లు భావిస్తారు. కర్మలవల్లకలిగే గొప్పలాభము పరబ్రహ్మలో ఒకభాగం మాత్రమే. అతడు కర్మలచే పొందబడని నిత్యసిద్ధమైన ఆత్మ స్వరూపము. అతని ప్రభావము అంతులేనిది. యజ్ఞము అతనిస్వరూపం.

స్త్రీపురుష రూపజగత్తును సృష్టించినవాడే తనమరొకరూపమైన స్త్రీతోకలిసి కశ్యపాది ప్రజాపతుల సహకారంతో గొప్ప భోగాలను సృష్టించి ఈ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాడు. బ్రహ్మయే అందరినీ నియమించేవాడు. పరమేశ్వరు నుండియే చంద్రుడు జన్మించాడు. తరువాత భగవంతుడు జలధారతో మహేశ్వరుని సమస్త జీవులకూ అధ్యక్షపదవియందు అభిషిక్తునిచేసి, గంభీరధ్వనితో గర్జించాడు. ఇలానాదం చేయటంచేత నీటిధారకు 'నది' అనే పేరు వచ్చింది. నారాయణ రూపమైన ఆనది బ్రహ్మలోకాన్ని పవిత్రంచేసి అడ్డుగా ఉన్న పర్వతాలను చీల్చుకుంటూ ఆకాశం నుండి భూమి మీదికి వచ్చింది.

ఇందువల్ల 'గంగ' అనే పేరు వచ్చింది. ఇక్కడ గంగ గోదావరి, మొదలైన ఏడు ధారలుగా విభజింపబడింది. తరువాత తన మహిమను విస్తరింప చేయుటకు గంగఎన్నో తీర్థాలరూపంలో ప్రసిద్ధిచెంది నేటికీ తనపేరును వ్యాప్తి చెందిస్తున్నది. గంగాజలంవల్ల ధాన్యాదులు నాజీవులు వృద్ధిచెందుతున్నారు. బ్రహ్మముఖంనుండి వెలువడిన నాల్గువేదాలు బ్రహ్మనుపొందటానికి ఉపాయము ఉపదేశముఐనవి. ఈవేదము జ్ఞానస్వరూపము పుణ్యానికి మూలకారణం కావటంచేత యజ్ఞము, బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుడు, నాలుగు పాదాలు గలిగి అంతులేనిదైంది. అనంతమైన యజ్ఞానికి బ్రహ్మ అధిపతి. స్వర్గం పొందటానికి ప్రధానసాధనమైన ధర్మానికి కూడ నాలుగు పాదాలున్నాయి.

ధర్మంతన నాలుగు పాదాలతో ఈప్రపంచాన్ని ధరిస్తోంది. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం మొదలైన నాలుగు ఆశ్రమాలూ ధర్మానికి గల నాలుగుపాదాలు. వాటిలో

గృహస్థాశ్రమం రెండవది. తపస్సు శ్రీ సా
ప్రాప్తికి సంబంధించిన విచారణధ్యానం
ధర్మానికి పాదాలైన ఈనాలుగు ఆశ్ర
కారణాలుగా చెప్పబడుతున్నాయి. శ్రవణవ
జ్ఞానం ప్రాప్తిస్తుంది. అజ్ఞానబలంచేత బ్ర
గొప్పదవుతుంది.

గృహస్థులు యోగంతో కూడినవారైతే
ఋషిసమూహము అగృహస్థుల కార్యకలా
చర్యం మొదలైన ఆశ్రమములందున్న
నిత్యమూ ఆధిక్యమును చూస్తూ మేఢ్రం పై
ఉంచి మోకాళ్ళపై గడ్డము నుంచి వీపునువ
కుంచించిన ఆసనముపై కూర్చుని అలో
ఆపస్తంబంధానికి సంబంధించిన నియమ
నిరోధిస్తూ జీవాత్మను నాసికా కమలొవ
స్వరూపుడైన విష్ణువును ధ్యానిస్తాడు.

ధ్యానమందు ఆసక్తి కలిగి మనప్పున
యోగంచేత శ్రమలేకుండా భగవంతుని
మధించినవాడు యోగిఐనా పరమానందమ

చేత ప్రాతస్సాయంకాల సమయములందు 'ధారణ' ధ్యానము మొదలగు మంచిపనులచే విఘ్నరూపములైన చెడుపనులు తొలగి పోతాయి. గర్వం లేనివాడై ఏకాగ్రమనస్సుతో బ్రహ్మకు తనమనస్సు అర్పించటం మోక్షంకోరేవాడికి అవసరం.

ఇలా చేస్తే విష్ణుపదప్రాప్తి కలుగుతుంది. మనస్సు ప్రసన్నంగా ఉండుటే కర్మలను త్రెంచుటకు పరమానంద ప్రాప్తికీ ప్రధానకారణము. మనస్సు వికారము లేనిదైతే తేలికగా బ్రహ్మ సాక్షాత్కారమౌతుంది. కర్మయోగ జ్ఞానయోగాల ద్వారా పొందబడేదే పరబ్రహ్మ స్వరూపము. వినయంకలిగి భోగవాంఛ లేక స్త్రీసంపర్కాన్ని నిందిస్తూ ఉండేవాడు. విష్ణువును తెలుసుకొనటానికి సమర్థుడు. ఇట్టివాళ్లకు మళ్ళీ పుట్టుక ఉండదు. ఫలంకోరకుండా పనిచేస్తే మోక్షం ప్రాప్తిస్తుంది. జీవుడు కోరికల చేతనే సంసారంలో బంధింపబడుతున్నాడు. అలా కోరికలేనివాడైతే మోక్షాన్ని పొందుతాడు. అతనికి మళ్ళీ జన్మించేపనిలేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శుభాశుభకర్మల ఫలములు పదిహేడవ అధ్యాయము

☆☆☆

# పద్ధెనిమిదవ అధ్యాయము

## సనాతన జగత్తు యొక్క ప్రమాణము

జనమేజయుడు ఓమునివర్యా! యోగినికి ఆటంకము, యోగరూపం, ధ్యానింపదగిన వస్తువు, సిద్ధి, సిద్ధిగుణం, ఈవిషయాలను గురించి స్పష్టంగా మీ నుండి వినగోరుతున్నాను. మనుష్యజన్మ మళ్ళీరాదు తేడా! అని అడిగితే వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నీవడిగిన ప్రశ్నలకు విస్తృతరూపంలో సమాధానం చెప్పుతాను విను- కళ్ళు చెవులు మొదలైన జ్ఞానేంద్రియాలను సిద్ధంచేసుకొనుటవల్లనే దూరదర్శన దూరశ్రవణాది జ్ఞానం ప్రాప్తిస్తుంది. ఇంద్రియాలకు సంబంధించిన రూపశబ్దాది గుణాలను విడిచి సనాతన బ్రహ్మవిషయమునందే మనస్సును లగ్నం చేసినవాడు గొప్పవైరాగ్యమును పొందకముందే యోగసిద్ధిని బాధించే అనేకవిధాలైన విఘ్నాలు వ్యాపిస్తాయి. తొమ్మిది రంధ్రాలు గల ఈశరీరంలో కామక్రోధాది ఆటంకాలు అనేకములున్నాయి. తన బుద్ధి శక్తిచేత ఆటంకాలను తెలుసుకొన్న మీదట శరీరంలో ఒకవిధమైన తేజస్సు పుడుతుంది.

ఆ తేజస్సు తలనుండి బయటకు వచ్చేటప్పుడు భయంకరమైన పొగలేస్తుంది. ఆపొగ అనేకరంగులలో ఆకాశమందు వ్యాపిస్తుంది. ఆపొగగట్టిపడి మేఘంగా మారుతుంది. దానినుండి వర్షం వస్తుంది. ఆవర్షపు నీరంతా భూమిలోకి పోతుంది. ఇలా పొగశాంతించిన తర్వాత భయంకరమైన అగ్ని ప్రజ్వలిస్తుంది. దాని అగ్ని కణాలు వందలువేలు అన్ని అవయవాలనుండి వ్యాపిస్తాయి. తరువాత జలధారలు అగ్నిజ్వాలలను ఆర్పివేస్తాయి. ఈరెండు విఘ్నాలు శాంతించిన తరువాత వాయువు వీచుతుంది. ఆవాయువు, నీరు, అగ్ని మొదలైన మహాభూతాలతో కలిసి ప్రాణమనే పేరును పొందుతుంది.

ఈవిధంగా జలం అగ్నివాయువు మొదలైన వస్తువులు ఒకచోటచేరి వేల రూపాలను ధరిస్తాయి. బ్రహ్మయే వీటికలియకకు కారణం. ఆసమయంలో యోగి యొక్క రెండుకళ్ళల్లో కనిపించే బ్రహ్మమనే వస్తువు మిక్కిలి సూక్ష్మంగా ఉండి 'విరాట్' అనుపేరుతో ప్రసిద్ధమైనది. ఆయోగియే స్థూల సూక్ష్మరూపమైన ప్రాణుల సమస్తవిద్యలకు ఆధారమైనవాడు ప్రళయం చేసేవాడు భగవంతుడైన విష్ణు రూపము అవుతాడు. ఆసమయంలో అతడే సనాతన మహాపురుషుడు. అతనివలన సూక్ష్మమైనట్టియు, విరాట్ స్వరూపమైన వస్తువుల సృష్టి జరుగుతుంది.

ఆసమయంలో జీవులందరూ ఈశ్వరుని ప్రేరణచేత యోగిశరీరంలో ప్రవేశిస్తాయి. ఈవిధంగా ఆయోగి సమస్త ప్రాణుల సమష్టి స్వరూపుడవుతాడు. బ్రహ్మసాక్షాత్కారం పొందిన యోగి తన స్థూలశరీరాన్ని విడిచిపెట్టి భగవంతుని రూపంపొందుతాడు. అన్నీ తెలిసినవాడౌతాడు. యోగులు కర్మబంధంనుండి, విడివిడి ఇంద్రియబంధం నుండి విడువబడుతున్నాడు. పండ్లనుండి రసం, రసం వల్ల ప్రాణాలు నిలుచుట జరుగుతుంది.

రసస్వరూపుడే బ్రహ్మ. బ్రహ్మస్వరూపం జీవులలో సంచరిస్తుంది. బ్రహ్మ కనుబొమ్మల మధ్య ప్రకాశిస్తూ ఉంటాడు. పదమూడువేలయుగాలు బ్రహ్మకు ఒకయుగం. అది మహాయుగం అనబడుతుంది. ఇలావెయ్యియుగాలు గడిచిన తర్వాత ప్రళయకాలం సమీపిస్తుంది. అంతా సంహరింపబడుతుంది. అప్పుడు అన్నివస్తువులు సూక్ష్మరూపాన్ని పొందుతాయి. ఈప్రపంచమంతా అప్పుడు సూక్ష్మ రూపాన్ని పొంది పరబ్రహ్మలో లీనమౌతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సనాతన జగత్తు యొక్కప్రమాణము అను పద్ధెనిమిదవ అధ్యాయము

★★★

# పందొమ్మిదవ అధ్యాయము

## కర్మఫల వర్ణనము

జనమేజయుడు మునివరా! బ్రహ్మస్వరూపం మీకు బాగాతెలుసు మీనుండి సత్యయుగ కలియుగాల గొప్పతనాన్ని విన్నాను. ఇప్పుడు తక్కిన రెండుయుగాల చరిత్రను విస్తరంగా వివగోరుతున్నానని అడిగాడు.

అప్పుడు వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! నీవడిగిన విషయాన్ని క్రమంగా చెప్పుతున్నాను ఏకాగ్రతమైన మనస్సుతో విను. భగవంతుడు బ్రహ్మరూపంలో అవతరించి యోగమందు ఆసక్తి కలవాడై కదలకుండా బ్రహ్మాసనంపై ప్రకాశిస్తున్నాడు. హఠాత్తుగా రజోగుణం వైపు ఆకర్షింపబడగానే జీవసృష్టి అధికం అవుతుంది. మోక్షము పొందుటకు అనేక విఘ్నాలున్నట్లు జ్ఞానమార్గం పొందటానికి కూడ అట్లే విఘ్నాలుంటాయి భగవంతుడు మోక్షపదముపై వలె జ్ఞానపదమందు కూడ ఆసక్తి కలిగి ఉంటాడు.

వేదంవల్ల బ్రహ్మయజ్ఞంచేసే బ్రాహ్మణుడికి గొప్పజ్ఞానం ఐశ్వర్యం ప్రాప్తిస్తాయి. ఆ ఐశ్వర్యాన్ని స్వార్థంకోసం కర్చుపెట్టక పరోపకారం కోసం ఇవ్వాలి. బ్రాహ్మణుడు వికారములు లేనివాడై పనియందు ప్రవర్తించేటప్పుడు అతనిలో ఆకాశజ్ఞానరూపమైన ఐశ్వర్యం పుడుతుంది. ఈఆకాశజ్ఞానమే పరిశుద్ధమైన బ్రహ్మపదార్థము. వేదాన్నిబాగా పరిశీలిస్తే బ్రహ్మవాది, యోగి, అట్లే యితరులు బ్రహ్మమందు లీనమైతున్నారు. బ్రహ్మయజ్ఞంచేయటంచేత ఆకాశరూపమైన ఐశ్వర్యజ్ఞానం కలిగిన తరువాత యోగులు అతన్ని వాయుస్వరూపునిగా చెబుతారు. ఇలాగే తైజసము మొదలగువికారములు పుడుతున్నాయి.

ఈవిధంగా అన్ని వికారాల నుండి దాటిన తరువాత బ్రాహ్మణునియందు పరబ్రహ్మజ్ఞానము పుడుతుంది. అప్పుడతడు సిద్ధ పురుషుడుగా చెప్పబడతాడు. వికారములను అరికట్టిన తరువాత ఆసిద్ధయోగి శరీరం నుండి బ్రహ్మస్వరూపం బయటకువచ్చి కనబడకుండా ఆకాశంలో సంచరిస్తాడు. కర్మలనన్నిటినీ విడిచి ఓం కారరూపమైన శద్ధచైతన్యమును యోగి చూడగలుగుతాడు. విద్వాంసులైన బ్రాహ్మణులకు ఓంకారమే బ్రహ్మస్వరూపం. ఈ ఓంకార చైతన్యం పరమాత్మ

తోపాటు జీవుల యొక్క అంతరాత్మయందు సంచరిస్తుంది. ఓంకారానికీ బ్రహ్మకీ కొంచం కూడా తేడా లేదని విద్వాంసులు చెపుతారు. ఇది నిత్యము సమస్త వర్ణము లను ప్రకాశింపచేసేది వాయు స్వరూపమైనది. ఇదే వైఖరీరూపాన్ని పొందుతూ ఉంది.

ఈ ఓంకార రూపమైన బ్రహ్మ సూక్ష్మరూపంతో జీవులందరిలో సంచ రిస్తుంది. దేనియందూ పూయబడదు. దానికోరిక స్వతంత్రమైనది. బ్రహ్మంలో తన్మయులయ్యే వాళ్ళు బ్రహ్మవల్ల పుట్టిన వాళ్ళు బ్రహ్మలోకం, విష్ణులోకం పొంద గోరేవాళ్ళే ఈ ఓంకారరూప బ్రహ్మమును ధ్యానించుటకు సమర్థులు. గొప్ప స్థానాన్ని పొందటానికి వాళ్ళు ప్రాణాలొడ్డి అనేకవిధాలైన కర్మలను చేస్తారు. వీళ్ళు జ్ఞానమనే కానుకనిచ్చా పరమాత్మైన విష్ణుని ఆరాధిస్తారు. బ్రాహ్మణులు వేద ప్రమాణమును బట్టి యోగాన్నీ విష్ణుపూజనీ రెంటినీ ఆచరిస్తారు. బ్రాహ్మణులు మోక్షం పొందాక సాక్షాత్కరించుకొనే స్వరూపమే పరబ్రహ్మము. ఇపుడు తామస విఘ్నములను చెపుతున్నావిను.

యోగసాధన సమయంలో అనేకవిధాలైన వికారములు కలిగి యోగుల మనస్సులో శంక కలిగించి దుఃఖం కలిగిస్తాయి. ఒకపుడు నీటిలో మునిగి పోతు న్నట్లు అనిపిస్తుంది. ఒకప్పుడు మిక్కిలి చల్లని, మిక్కిలి వేడితరంగాలచే కప్ప బడినట్లు సముద్రంలో మునిగిపోతున్నట్లు, ఇలాంటి అనేక ఉపద్రవాలు ప్రాప్తిస్తాయి. వీటినన్నిటినీ పనికిమాలిన వాటినిగా తలచి తనకార్యసాధనలో సమర్థుడైనవాడే ఈశ్వరత్వాన్ని పొంది సిద్ధ పురుషుడౌతాడు. అనేకవిధములైన వికారములను గట్టిగా అడ్డగించినవాడై శాశ్వతమైన ఐశ్వర్యాన్నిపొంది బ్రాహ్మణుడు సిద్ధు డవుతున్నాడు. యోగి శరీరాన్ని విడిచేలోపున దివ్యరూపాన్ని ధరించి, మోక్షం పొందిన పురుషులతో దివ్యమైన సుగంధాన్ని వాసనచూచుట, దివ్యార్థంతో కూడిన వాక్యాలను వినుట కలిగి సుఖాన్ని అనుభవిస్తాడు. శరీరం విడిచిన తరువాత కైవల్య స్థానాన్ని పొందుతాడు. అతడు అన్నిటికంటే ప్రధానమైనరూపంగామారి అనిటిలోనూ అంతర్యామిగా ఉంటాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
కర్మఫల వర్ణనము అను పందొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఇరవైవ అధ్యాయము

## బ్రహ్మ - మానస సృష్టి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! మానవులు సాధనచేసేయోగం విషయంలో వేర్వేరు మతాలు ఉన్నాయి. అవి స్వల్పఫలం కలిగి ఉండటం అనేక కష్టాలు సంభవించటంచూచి బ్రహ్మ మరొక యోగాన్ని అవలంబించి వెలుపలి యింద్రియాలను విడిచి ఆసనం మొదలు ధారణవరకు బ్రహ్మ యోగసాధన మొదలుపెట్టాడు. తరువాత సర్వాంగ ధారణ చేసి ఆ బ్రహ్మ యోగబలంతో ప్రజాసృష్టిని ప్రారంభించాడు. తర్వాత మొట్టమొదట అతని కళ్ళనుండి లోకోత్తర సౌందర్యవతులు అప్సరసలు ముక్కు చివరద్వారా విచిత్రములైన వస్త్రాలనుధరించి నృత్యగీతవాద్యనిపుణుడగు తుంబురుడు మొదలైన లక్షలకొలది, వేలకొలది గంధర్వులు పుట్టారు. తరువాత యోగవేత్తయైన స్వయంభువు (బ్రహ్మ) మనస్సులో బాగా ఆలోచించి తనయోగ బలంతో సుకేశి, చారువదన, సుభ్రు, కమలంమీద ప్రకాశిస్తున్న లక్ష్మీదేవినీ సృష్టించాడు.

గంధర్వులకొరకు గంధర్వశాస్త్రం బ్రాహ్మణులకు సామగానరూపమైన వేదాలనూ రచించాడు. తరువాత పాదాలనుండి లెక్కలేనంతమంది మనుష్యులను, కిన్నరులను, యక్షులను, రాక్షసులను, పిశాచాలను, సర్పాలను, ఏనుగులను, సింహాలను, పెద్దపులులను, మృగములను, అనేకవిధాలైన గడ్డిజాతులను సృష్టించాడు. భోజనంచేసే చేతులతో చేసే పనులను సృష్టించాడు. తరువాత బ్రహ్మజీవులకు ప్రాణముమొదలగు వాయువు పనులను సృష్టిచేశాడు. తరువాత బ్రహ్మఐదు ఇంద్రియాలను నియమించి, పరమాత్మను ధ్యానించాడు.

అప్పుడు అతని హృదయంనుండి గోవులు, భుజములనుండి పక్షులు అనేక విధాలైన జలచరములు సృష్టింపబడ్డాయి. మునియైన అంగిరసుడు అతని శరీరం నుండి పుట్టాడు. ఋషి శ్రేష్ఠుడైన భృగువు బ్రహ్మ కనుబొమల నుండి పుట్టాడు. కలహప్రియుడైన నారదుడు నుదుటి నుండి పుట్టాడు. శిరస్సునుండి సనత్కుమారుడు జన్మించాడు. చంద్రుని బ్రాహ్మణులకు రాజుగా చేశాడు. చంద్రుడు ఘోరతపస్సు చేసి లోకానికి కాంతిని ఇస్తూ ఆకాశంలో సంచరింపసాగాడు. తరువాత

సేవకూ పుట్టారు. కర్మకాండకువాళ్ళు అధికారులుకారు. కాబట్టి వాళ్ళకి ఉపనయనసంస్కారం వేదాధ్యయనమూలేవు.

దక్షుని సంతతి బ్రాహ్మణ వంశంవాళ్ళు. వాళ్ళు బలవంతులు శక్తి సంపన్నులు. ఒకపుడు దక్షప్రజాపతి. తన పుత్రులతో కుమారులారా! మీతల్లి బలాబలాలను మీనోటినుండి వినగోరుతున్నాను. ఆదివిని దుర్బలత్వం తెలిస్తే మిమ్మల్ని బలవంతులను చేస్తాను. క్షేత్రం గొప్పదైతే సంతానం గొప్ప లాభాన్ని పొంద గలుగుతుంది అన్నాడు. తండ్రి మాటలు విని పుత్రులు మాయయొక్క బలాన్ని తెలుసుకొనదలచారు. కాని మహాదేవి తనస్వరూపాన్ని తెలియనీయలేదు. గొప్ప కర్మానుష్ఠానం వల్ల ముక్తిమార్గంలో ఏ ఆటంకమూ ఉండదు. కనుక మాయయే విజ్ఞానంచే ప్రేరేపింపబడి, అండజ స్వేదజాది సూక్ష్మజీవులకు సూక్ష్మత్వమును విస్తారమును కలిగించుచున్నది.

ఇది మహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
క్షత్రధర్మ వివరణ అను ఇరవైఒకటవ అధ్యాయము

☆☆☆

# ఇరవై రెండవ అధ్యాయము

## ప్రకృత్యాత్మక యజ్ఞాదుల స్వరూపము

జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! త్రేతాయుగంయొక్క గొప్పధర్మాలను తెలిసికొనగోరుతున్నాను. సాంఖ్యశాస్త్రంచెప్పే పరమపురుషుని పొందగోరుతున్నాని అడిగాడు- అప్పుడు వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! దక్షప్రజాపతి యోగబలంచేత తనశరీరాన్ని రెండుభాగాలుచేసి, ఒకభాగం స్త్రీగా రెండవభాగం పురుషునిగా అయి సుమేరుపర్వతశిఖరంపై నివసింపసాగారు. దక్షుడు అందగత్తె అయిన ఆస్త్రీరూపంతో ఎంతోమంది కన్యలను కని స్త్రీరూపాన్ని విడిచిపెట్టాడు, కేవలం పురుషరూపాన్ని ధరించాడు. అతని పురుషరూపం కూడ మిక్కిలి అందమైంది. తరువాత బ్రాహ్మ విధానముతో బ్రాహ్మణులకు తన కన్యలను వివాహంచేశాడు. వాళ్ళలో ధర్ముడికి పదిమందిని, కశ్యపుడికి పదముగ్గురుని ఇరవై ఏడుగురుని చంద్రునికి ఇచ్చాడు. తాను పవిత్రమైన ఆధ్యాత్మిక బ్రహ్మయోగాన్ని అవలంబించి తపస్సులో లీనమయ్యాడు.

మృగాలమధ్య వనంలో నివసిస్తున్నాడు. కందమూలఫలాలతో జీవిస్తున్నాడు. రోజు రోజుకు తపస్సువృద్ధి చెందుతూంది. సహజవైరంగలజంతువుల స్నేహంతో మెలుగు తున్నాడు. బ్రాహ్మణసమూహం అతని తపస్సునుచూచి సంతోషించారు. ఘోరయుద్ధం చేసి మనస్సును జయించాక అంతయు తెలిసినవాడయ్యాడు. అప్పుడు కర్మకాండ మార్గాన్ని దివ్యదృష్టితో చూచాడు. బ్రహ్మను తనలో నిలుపు కున్నాడు. కనుక ఆదేహాన్ని బ్రహ్మక్షేత్రమన్నారు. బ్రహ్మంలో లీనమైనవాళ్ళు కూడ ప్రారబ్ధం వల్ల మళ్ళీ సంసారంలో పుడతారు స్వభావాన్ని మీరినడుచుట శక్యం కాదుకదా! యోగసాధనకు జనులు ప్రయత్నించాలి. ప్రపంచంలో జీవులందరి పుట్టుక దక్షుని కుమార్తెల వల్లనే జరిగింది. కశ్యపుడే వాళ్ళ జన్మకు కారణం. సూర్యుడు, వసుగణము రుద్ర విశ్వేదేవాదులు అందరూ మానసలోకంలో జన్మిస్తారు. స్వర్గంలో నివసిస్తారు. గృహస్థులు తపస్సిద్ధి గురు శుశ్రూషల వల్ల బ్రహ్మచర్యసిద్ధిని పొందుతారు. కష్టించి యోగసిద్ధిని పొందినవాళ్ళు ఉంఛవృత్తి నవలంబించి కఠోరవ్రతమును కొనసాగించే వాళ్ళూ కృతార్థులై స్వర్గానికి వెళ్తారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ప్రకృత్యాత్మక యజ్ఞాదుల స్వరూపము అను ఇరవైరెండవ అధ్యాయము

☆☆☆

# ఇరవై మూడవ అధ్యాయము

## బ్రహ్మ - మహాయజ్ఞము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! సుమేరుపర్వతం మధ్యభాగంలో విశాల సమతలక్షేముంది అక్కడ అనేకవిధాలైన వృక్షాలు మణిశిల మొదలైన శిలాఖండాలు ఉన్నాయి. ఎల్లపుడూ పంచమ స్వరంలో మూడువేదాలూ చదవబడుతూ ఉంటాయి. జడలను చర్మమును ధరించిన జితేంద్రియులు, మంత్రయజ్ఞపరాయణులు, బ్రహ్మో పాసకులూ అయిన బ్రాహ్మణ సమూహము ఆ మేరుపర్వతంమీద నివసిస్తుంటారు. మొదట ఒకటే అగ్ని, కార్యసిద్ధికొరకు నేతితో కూడిన స్వధాకార మంత్రాల సహాయంతో వృద్ధి పొందింపబడింది. బ్రహ్మదేవుడు దండచర్మ ఖడ్గములను శిఖనూ ధరించి సద్బుద్ధితో కమలంమీద యజ్ఞం మొదలుపెట్టాడు. వైదికవిధా

నానుసారంగా యజ్ఞంకొరకు నెయ్యి, పాలు, ధాన్యము మొదలైన సామగ్రిని పరమాత్మ పాదాలపై సమర్పించాడు.

అరణినిమథించి అగ్నిని పుట్టించాడు. అగ్నియందు మరొకఅగ్నిని ప్రవర్తింప చేశాడు. అగ్నిలో ఎటువంటి నేయి మొదలైన పదార్థాలను ఆహుతిచేస్తామో అటు వంటి ఫలమునే అగ్నిదేవుడు ఇస్తాడు. ఆహుతిగా ఇచ్చే ద్రవ్యాల హెచ్చుతగులను బట్టి ద్రవ్యాలను హోమం చేసే వ్యవస్థ చేయబడంది. విస్తీర్ణమైన ఆబ్రహ్మ యజ్ఞంలో స్వయంగా బృహస్పతి ఆరుమాసాల వరకు నాలుగు వేదాలను పఠించాడు. తరువాత అబృహస్పతి కంటే ఇతరులు స్వర్గాదులకు సాధనమైన మధురమగు నాలుగువేదాల పఠనమును చేశారు. ఆవేదపాఠశబ్దము (ధ్వని) బ్రహ్మయజ్ఞము రెండూ బ్రహ్మలోకంతో సమానంగా ప్రకాశించాయి. అయజ్ఞంలో సమస్త వస్తువులు బ్రహ్మకు సమర్పితములై వృద్ధిచెందాయి.

బ్రహ్మదేవుడు తేజస్స్వరూపాన్ని ధరించి, దేవతలతో పాటు ఉద్గీథము మొదలగు ఉపాసనావిధులతో సమిధను, నేయి మొదలగు సామగ్రిని, ఆహుతి ప్రదానంచేశాడు. ఆయజ్ఞానికి ఇతర యజ్ఞాలు సాటిరావు. సభ్యులు యజ్ఞ స్థలం నలువైపులా ప్రకాశిస్తున్నారు. అధ్వర్యుడు చమస మొదలైన పాత్రలకు సంబం ధించిన అనేక విధాలైన యజ్ఞ సంబంధమైన వార్తల యొక్క మధురమైన విమర్శ జరుపుతున్నాడు. ఋత్విగ్గణము శోభసాటిలేనిది. ఉచ్చైస్స్వరంతో వేదఘోష వేర్వేరు దేవతల రాక మేరుపర్వత పై భాగము రెండవ బ్రహ్మలోకంలా ఉంది. వేదపాఠకులు, ఇంద్రుడు చెప్పిన సామవేదమంత్రములను పఠిస్తున్నారు. అధ్వర్యుడు ఋత్విక్కు మొదలగువారు యజ్ఞమును యథావిధిగా ప్రవర్తింప చేస్తున్నారు. మునిసమూహం అయజ్ఞ విషయం విని అక్కడకు వచ్చారు. దేవతలకు గురువైన బృహస్పతి వేర్వేరు రూపాలు ధరించి బ్రహ్మ యొక్క పనులలో నియమింపబడ్డాడు.

యజమానుడు యజ్ఞం చివర ఆయజ్ఞఫలితాన్ని విష్ణుభగవంతునకు అర్పించాడు. ఆయజ్ఞానికి ఫలంగానే విష్ణువు అదితిగర్భాన పుట్టాడు. విష్ణువు యొక్క స్థానము అన్నిటికంటే శ్రేష్ఠము. గొప్పదైన విష్ణు(స్థానము) పదము నుండియే ఇంద్రుడు మొదలగువారి అనేక స్థానములు పుట్టాయి. ఇక ముందు కొన్ని పుడతాయి కూడా. ఇంద్రియ విషయములైన రూపాదులందు ప్రవర్తిస్తూ ఆకర్షింప బడనటువంటి వాళ్ళే మునులుగా చెప్పదగినవాళ్ళు. బ్రహ్మవాదియైన వాడు

ప్రణవోపాసనద్వారా తత్త్వజ్ఞానాన్ని పొంది దానిబలంచేత కామాది విషయా లలో చిక్కుకొనడు. సత్పురుషులకు స్వర్గమే తగినస్థానము.

యజ్ఞంచివరలో పర్వతశ్రేష్ఠమును ప్రభువు బ్రాహ్మణులకు ఇచ్చాడు. బ్రాహ్మణక్షత్రియాది వర్ణాభిమానంగల వాళ్ళకు దాన్ని భేదించుట శక్యం కాలేదు. వాళ్ళు అలసిపోయి మరల సంసారమార్గంలో సంచరింపసాగారు. అప్పుడు సుమేరు పర్వతం శాంతభావంతో నమస్కరించిన బ్రాహ్మణులకు మధురంగా ఓ యింద్రియములకు లోబడిన యజమానులారా! మీరు ఒకరితో ఒకరు విరోధిస్తూ ఉంటే ఈ పర్వతాన్ని బద్దలు చేయలేరు. సమాధిబలంతో అంతటా అభేద జ్ఞానం కలవాళ్ళైతే ఈ పర్వతాన్ని విభజించుటకు మర్థులౌతారు. రాగద్వేషాలు నశించాలి. అప్పుడే బ్రహ్మనిష్ఠ పెరుగుతుంది అని పలికింది. ఆ బ్రాహ్మణులు సుమేరుపర్వతం మాటలు విని నిశ్శబ్దంగా ఉండిపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బ్రహ్మ - మహాయజ్ఞము అను ఇరవైమూడవ అధ్యాయము

☆☆☆

# ఇరవై నాల్గవ అధ్యాయము

## బ్రాహ్మణ కర్మలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఆతపోనిరతులైన బ్రాహ్మణ గృహస్థులు పర్వతరాజు మాటలు విన్న తరువాత, బలి, హోమ, విష్ణుపూజ గురుదేవార్చన, మొదలగు పనులు ప్రారంభించారు. వాళ్ళలా చేయటంచేతనే భూమిమీద బలిహోమాదికార్యాలు వృద్ధిచెందాయి. తపస్సును కోరే బ్రాహ్మణులు సంసారులయొక్క పరిస్థితిని చూచి ఆటంకములేని సమిధలు, దర్భలు ఎక్కువ కలిగిన పవిత్ర వింధ్యా చలసమీపాన బ్రహ్మచర్యమును పాటిస్తున్నారు. ఒకప్పుడక్కడ బ్రహ్మయజ్ఞం జరిగింది. కనుక జనులు ఆస్థానాన్ని బ్రహ్మసదనమని పిలుస్తారు. పరిశుద్ధమైన మనస్సుగల గృహస్థ ధర్మపరాయణులు, సమస్తమూ విడిచిపెట్టిన సన్యాసులు, అడవిలోని పండ్లు మాత్రమే తింటూ కోపాన్ని జయించిన వానప్రస్థులు కూడా అక్కడ నివసించాలని

కోరుకుంటున్నారు. క్రమంగా బ్రహ్మ చర్యాది ఆశ్రమధర్మాలను పాటించేవాళ్ళు. వాళ్ళకే వేదసంస్కారం ప్రాప్తిస్తుంది. ఆశ్రమ ధర్మాలను సక్రమంగా పాటించనివాళ్ళు సన్యాసాశ్రమం స్వీకరించటం తగినదికాదు. గృహస్థాశ్రవ్రతం నిర్వహించినవాళ్ళు అన్ని ఆశ్రమాల ఫలితాన్ని తేలికగా పొందుతారు. వేదం నేర్చుకొనుట నేర్పుట యందు మనసును లగ్నం చేసినవాణ్ని రాజు తప్పక సమ్మానించాలి. ఔన్నత్యం కోరేవాడు బ్రాహ్మణుడు వేదం చదువుకొనుట పూర్తయిన పిమ్మటనే సంసార కార్యాలలో ప్రవర్తించాలి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బ్రాహ్మణ కర్మలుఅను ఇరవైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఐదవ అధ్యాయము

## మధు రాక్షసునితో విష్ణువు యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! వేదపారాయణచే పవిత్రదేహము గలిగిన యాగకర్త యజ్ఞస్థల మందలి బ్రాహ్మణాదిక్రమంగా బ్రహ్మను పూజించి మధురమైన వాక్కులతో స్తోత్రం చేయ మొదలుపెట్టాడు. భగవంతుడైన బ్రహ్మ వాళ్ళ యజ్ఞం చూచి స్తోత్రాన్ని విని, ప్రసన్నుడై భాగ్యవశంచేత మీకు ఈవిధంగా యజ్ఞంలో ప్రవర్తించటం సంభవించింది అని తరువాత కశ్యపమహర్షితో నీవుకూడ నీపుత్రులతో భూలోకానికి వెళ్ళి యజ్ఞం చేయవచ్చు. నీపుత్రులైన దేవతలు దైత్యులు వాళ్ళు స్వభావాన్ని బట్టి సంపూర్ణంగా యాగదక్షిణలిచ్చి యజ్ఞాన్ని నెరవేరుస్తారు అని పలికాడు.

తరువాత దేవతలూ దైత్యులూ మొదట నేను యజ్ఞం చేస్తానంటే నేను అని పోటీపడ్డారు. తరువాత జయించాలని బాహుయుద్ధం ప్రారంభించారు. వేద వేదాన్తములలో సమర్థులు అడ్డగించారు. అయినా రెండుపక్షాల వాళ్ళూ మాటవినక ఎద్దుల్లా యుద్ధంమ మొదలుపెట్టారు. ఆయుద్ధంలో చాలామంది దేవదానవులు మరణించారు. తరువాత కొందరు దానవులు ఘోరంగా గర్జిస్తూ ఒకడు రెండవవాని మార్గం అడ్డగించాడు. అప్పుడు పర్వతాలు బ్రద్దలయ్యాయి. నదులు

కల్లోమయ్యాయి. అందరు చావటానికి సిద్ధమయ్యారు. తరువాత విష్ణువునకు మధువను రాక్షసునితో ఘోరయుద్ధం జరిగింది. నారాయణుడు తన కపకారిదైన 'మధు' దైత్యుని యొక్క బలపరాక్రమాలను సమాప్తి చెందించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
మధు రాక్షసునితో విష్ణువు యుద్ధము అను ఇరవైఐదవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఆరవ అధ్యాయము

## విష్ణువు మధు రాక్షసుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! మహాబలపరాక్రమములు గల దితిపుత్రుడు మధువు బుద్ధి భ్రమవల్ల ప్రహ్లాదునిమాటవల్ల ఇంద్రపదమునుపొందే కోరికతో కఠినములైన పాశాలతో పర్వతాలమధ్య ఇంద్రుని బంధించాడు. కాలందగ్గరపడి విష్ణువును రుద్రునీ యుద్ధానికి ఆహ్వానించాడు. కశ్యపపుత్రులైన దైత్యులు మధుపక్షంతో మరికొందరు దేవతల పక్షంలోనూ చేరారు. వాళ్ళు రాళ్ళను గదలను తీసుకొని ఎదుర్కొన్నారు. గానంలో వాద్యాలలో నేర్పరులైన గంధర్వులు కిన్నరులు నృత్యం చేస్తూ గానం చేస్తూ నవ్వుతున్నారు. ఇంద్రుడు గాననాట్యాలతో దైత్యుల మనస్సును ఆకర్షించాడు. ఒక ప్రక్క 'మధువు' భయంకరంగా గర్జన చేస్తున్నాడు. కొన్ని క్షణాల తర్వాత అతని మనస్సుకూడ సంగీతంవైపు ఆకర్షింపబడింది.

ఇతర దైత్యులుకూడ సంగీత మాధుర్యంచే ఆకర్షింపబడ్డారు. భగవంతుడు, విష్ణువు 'మధు' మనస్సులో వికారాన్ని సృష్టించి మందరపర్వతంలో దాగి ఉన్నాడు. ఆసమయంలో మునిగణము బ్రహ్మతో సహా అంతర్ధానంచెందారు. మధువు భగవంతుని శంఖంమీద ఒక దెబ్బకొట్టాడు. అప్పుడు భగవంతుడు కదలలేదు. విష్ణువు కూడ అరచేతితో రాక్షసుని వక్షస్థలంమీద కొట్టగా అతడు రక్తం క్రక్కు కుంటూ నేలపై కూలాడు. క్రిందపడిన రాక్షసుని భగవంతుడు కొట్టలేదు. తరువాత దైత్యరాజు నేలనుండిలేచి భగవంతునివైపు కోపంతోచూచాడు. ఒకరితో మరొకరు వీరాలాపంచేస్తూ బాహుయుద్ధానికి సిద్ధమయ్యారు. ఘోరమైన యుద్ధంజరిగింది. ఇద్దరిశరీరాలూ రక్తంతో తడిసి పోయాయి. ఆసమయంలో ఆకాశం నుండి సిద్ధులు భగవంతుని స్తోత్రంచేస్తూ ఓనారాయణా! అనిసంబోధించి ఇలా పలికారు.

స్తుతించారు

## సిద్ధుల స్తోత్రము

శ్లో॥ శరీరం ధాతుసం యుక్తం సంయుక్తం చేతనేనచ।
తద్బ్రహ్మ ఇంద్రియైర్యుక్తం తేజోభూతం సనాతనమ్॥
ధ్రువం తిష్ఠన్తి భూతాస్తే సూక్ష్మేప్రలయతాంగతే।
పునశ్చోద్భవతే సూక్ష్మం బహురూపమనే కధా॥
ప్రబోధ్య భావంభూతానాం త్రిషులోకేషుకా మదః।
సరూపోబహురూపాంస్తాన్ లోకాన్ సంచరతేవశీ॥
మానసీం తనుమాస్థాయ బహుభిః కారణాన్తరైః॥
యోగాత్మాధారయన్మూర్తీం వాగాత్మానం దివంధరః॥
బ్రహ్మభూతంపరంచైవ సూక్ష్మేణాత్మాన మీశ్వరః।
బ్రాహ్మణవిప్రాన్వపతి యుద్ధేనైవచక్షత్రియాన్॥
ప్రదానకర్మణావైశ్యాన్ శూ ద్రాన్వంచరేణచ।
గావః క్షీర ప్రదానేన అశ్వాన్ యజ్ఞేషు ప్రోక్షణైః॥
పితరశ్చోష్మణా వేదహవిర్భాగేన దేవతాః।
చతుర్భిర్వ్యతిరిక్తాంగైః త్రిభిరన్యైశ్చ ధాతుభిః॥
సప్తభిః పితృభిర్నిత్యైః త్రీన్‌లోకాన్ పరిరక్షతి।
చంద్రసూర్యాత్మరం నిత్యం తద్రూపనిహితాత్మకమ్॥
ప్రకాశంచా ప్రకాశంచ నిగూఢం స్వేన తేజసా।
త్రయస్తు పితరోనిత్యం పిండాన్‌పశ్చాద్దదన్తితే॥
చత్వారోన్యేపితృగణాః సిద్ధాః పంచక ఆదదే।
త్వమేవపంచతాన్ ధర్మాన్ త్వమేవాపంచ తాన్‌విభో॥
సనాతనమయోదివ్యః శాశ్వతో బ్రహ్మసంభవః।
తస్మాత్త త్తేజాదత్తే అగ్నిర్వాయుశ్చ సర్వశః॥
అతస్త్వం కర్మణాతేన ఆదిత్యః సముపద్యత।
యదశ్నాసిజగత్సర్వం రశ్మిభిః ప్రదహన్నివ॥
యుగాన్తకాలే సంప్రాప్తే పరాంసిద్ధిముపాగతః।
పక్షసం సంధావమవస్యాంలోకం చరసిమానుషమ్॥

ఋషిభిస్సహ గూఢాత్మా సూర్యేందు వసుసంభవైః।
సఫలం కర్మకుర్వాణం యజతాం పుష్టివర్ధనమ్॥
హేతూనామవికారాయ మాభూత్కర్మవిపర్యయః।
వనస్పత్యేషధీశ్చైవ యుగపత్ప్రతి పద్యతే॥
బాలభావాయవసుధాం పక్షేపక్షే జనిస్తవ।
భూతానాం భువిభూతేశ! భావ్యర్థం వసుధాతలే॥
వసుయద్భువికించిచ్చ సర్వతత్త్వమయంవిభో।
త్వమేవ వివిధం ధర్మం శాశ్వతం వసుధాతలే॥
దేవయజ్ఞమత్ర వాక్యమాత్మయజ్ఞం సమానుషమ్।
ద్వివిధస్స్వర్గమార్గశ్చ సూరశ్చంద్రశ్చ నిర్మలః।
చంద్రమాః పిత్ృయానశ్చ దేవయానశ్చ భాస్కరః॥
త్వమేవవసుధాయుక్తో విశ్వంచరసిమాయయా॥
ఏకీకృత్యగుణాన్ సర్వాన్ సంక్షిప్యాముత్ర సంభవః।
ఏకస్త్వమసి సంభూతః పురాణ పురుషో విరాట్॥
అక్షయశ్చా ప్రమేయశ్చ కామకారకరో వశీ।
మూర్త స్త్రేబోసి సంభూతో వాయుః పర్యేతిఖేచరః॥
సప్తమీరూప సంస్థానైర్నిత్యమావృత్య తిష్ఠతి।
సాధనంచాపి నిర్మాణే సంహారేప్రలయేతథా॥
ధాతాధారణ కాలేచదిశశ్చ క్షుపిధారిణీ।
సేవ్యమానోముని గణైర్నిత్యం వగతకిల్బిషైః॥
హర్మభిస్సత్యమాపన్నైః సమరాగైర్జితేంద్రియైః।
స్తూయమానైశ్చవిభుధైః సిద్ధైర్మునివరైస్తథా॥
సస్మారవిపులందేహం హరిర్హయశిరోమహాన్॥

ఈవిధంగా దేవతలు సిద్ధులు మునులు స్తోత్రం చేసిన తరువాత భగవంతుడు తన విశాలహయగ్రీవ స్వరూపాన్ని తలుచుకున్నాడు. అలా తలుచుకోగానే అతనికి వేదమయమైన శరీరము, సర్వదేవమయమైన కాంతి ఏర్పడింది. ఆశరీరముయొక్క శిరస్సుపై మహాదేవుడు, హృదయమందు బ్రహ్మ, ప్రకా

శించారు. అగ్ని అతని నాలుకగాను వేదవాక్కు సరస్వతిగా అయ్యారు. మరుద్గణము వరుణదేవుడు అతని మోకాళ్ళమీద ఉన్నారు. దేవతలకు సహాయం కొరకు భగవంతుడు ఈవిధమైన భయంకరరూపాన్ని ధరించాడు. క్రోధంతో ఎర్రబడిన కన్నులుకలవాడై అసురశ్రేష్ఠుడైన మధువును సంహరించాడు (పీడించాడు) వాడి మేధస్సుచే భూమి నిండినదిగా కనిపించింది. అందుచే భూమికి మేదిని అనేపేరు వచ్చింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
విష్ణువు మధు రాక్షసుని చంపుట అను ఇరవైఆరవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఏడవ అధ్యాయము

## మధువు మరణము- దేవతలు సంతోషము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! పుష్కరతీర్థంలో మధురాక్షసుని నాశంచూచి ప్రతిజీవి అమిత సంతోషాన్ని పొందింది. ఆసంతోషంతో సమస్త జనులూ నలుదిక్కులా నాట్యం చేశారు. అన్నిటికంటే ఎత్తైన సుపార్శ్వమనే పర్వతంయొక్క బంగారుశిఖరాలు ఆకాశాన్ని చీల్చుకొనిపైకి వెళ్తున్నట్లు కనిపించాయి. ఇతర పర్వతాలు కూడ ఎత్తైన శిఖరాలతో మెరపులతో కూడిన మేఘపంక్తిలా శోభించాయి. 'మధు' రాక్షసుని చంపిన భగవంతుడు విష్ణువు మధువాహిని అనే నదిని సృష్టించాడు. పవిత్రమై అధికమైన నీరుగలది ఆనది. నిప్పువంటి ఇసుక కలది. పుష్ప సమూహంతో కూడినది. బ్రహ్మ యొక్క మాటచే ప్రేరేపింపబడి ఆనది పుష్కర ప్రదేశంలో ప్రవేశించింది. ఆనది కపిలగోరూపం ధరించి విశాలమైన బ్రహ్మ యజ్ఞం కొరకు మిక్కిలి మధురమైన పాలను ఇస్తోంది.

ఆనది సరస్వతీ నదినుండి పుట్టినదై అజ్ఞానాన్ని పోగొట్టే బ్రహ్మక్షేత్రం యొక్క మరుతీర్థంకంటే ముందుకు వెళ్ళి పుష్కరతీర్థంలో కలుస్తుంది. అది సుందరరూపం కలనది. హఠాత్తుగా అహంకార గంధంనుండి ఒక గొప్ప పర్వతం పుట్టింది. అది గురు ద్వారగుణాలతో కూడినది. శాశ్వతమైనది. ఆపర్వతం ఎల్లప్పుడూ సిద్ధులు లెక్కలేనంతమంది నివసిస్తుంటారు. ఆపర్వతం మెలకువగా ఉండుట కలగనుట

గాఢనిద్ర పోవుట అనే మూడు క్రీడాస్థలాలతో కూడినదై చిత్ర విచిత్రము లైన అరుగులు గలది. విశ్వకర్మ ఆపర్వతం నాలువైపులా నీరు విస్తారంగా ఉంచాడు. ఒకప్పుడు పర్వతరూపంలో ఉన్న మహాపురుషుడు, నేను ప్రపంచంలో నామనో బలంతో వేర్వేరు ప్రవర్తనలు గల జనులలో చైతన్యాన్ని ధర్మాన్ని ప్రవర్తింప చేస్తాను. నేను ఐదుఇంద్రియాల సహాయంతో అంతనూ తెలుసుకొంటాను.

ఐశ్వర్యవంతులైన పురుషులు దేనియందూ ఆసక్తిలేక వైరాగ్యసంపన్నులైన ప్రాణులే ఇంద్రియాలను మనస్సునూ నిగ్రహించటానికి అధికారులు ఇష్టమైన రూపాన్ని ధరించగల నన్ను కేవలంమనస్సు యొక్క సహాయంతో ఎవ్వడూ తెలుసు కొనలేడు. రామకృష్ణాది అవతారాలను ధరించే విష్ణువును ధ్యానిస్తూ కఠోర తపస్సు చేత మనోబలం నశింపచేసుకొన్న మహాపురుషులే నా అవ్యక్త స్వరూపాన్ని దర్శించ గలరు. ధర్మమార్గంలో నడుస్తూ నిత్యంనన్ను ధ్యానిస్తూ శాన్తులైన సత్పురుషులే నన్ను చూడగలరు. విషయేంద్రియాలతో ఘోరయుద్ధం చేస్తే వాళ్ళ మనస్సు అన్నివిధాలా నిర్మలమౌతుంది. యోగులు నిత్యమూ జ్ఞానవృత్తిలో ఉండుటచే బంధంనుండి విముక్తులౌతారు. ఇటువంటి ధర్మాత్ములు పరమేశ్వరుని ప్రేమను పొంది సంసార సముద్రాన్ని దాటుతున్నారు. దానయజ్ఞసంపత్తికంటే బ్రహ్మవిద్యా సంపత్తి శ్రేష్ఠమైనది. గౌరిదయతో సిద్ధిని సృష్టించింది. శుద్ధమైన మనస్సుతో దీన్ని సాధన చేసినవాడు ధర్మాచరణంలో నిష్ఫలత్వమును పొందడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
మధువు మరణము- దేవతలు సంతోషము అను ఇరవైఏడవ అధ్యాయము

☆☆☆

# ఇరవై ఎనిమిదవ అధ్యాయము

## దేవతల తపస్సు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! మిక్కిలి ధార్మికుడు, కమలలోచనుడైన నారాయణుడు మోక్షాన్ని కోరుతూ ఆత్మను ఆత్మకు అధీనం చేసి పుష్కరతీర్థ పవిత్ర పర్వతముపై పదివేల సంవత్సరాలు ఒకే పాదం మీద నిలబడి తపస్సు చేశాడు. ఈవిధంగా తపస్సు చేయటం లోకానికి బోధించటం కొరకు, లోకం యొక్క ఉన్నతి కొరకు మాత్రమే.

చంద్రుడు కూడ రూపరసాదులను అన్నింటినీ విడిచిపెట్టి మనస్సుతో యోగసాధన చేస్తూ తొమ్మిమ్మవేల సంవత్సరాలు గడిపాడు.

అప్పుడు సిద్ధిపొంది తనతపోబలంతో ఇతర నక్షత్రాలకూ గ్రహాలకూపైన ఉండి లోకానికి కాంతిని ఇస్తున్నాడు. అతడు తనప్రభావంతో అనేక విధాలైన రూపాలు ధరించి భూమండలాన్ని ఆకాశాన్ని స్వర్గాన్ని అన్నిప్రదేశాలలో కనిపిస్తూ ప్రకాశింప చేస్తున్నాడు. మహాయోగియైన శంకరుడు ఎద్దు రూపంధరించి కుడికాలు ఎత్తి నియమాన్నిబట్టి వాయువును మాత్రమే భక్షిస్తూ పదకొండువందల సంవత్సరాలు పుష్కరతీర్థంలో తపస్సు చేశాడు. వాయువు అతని శరీరంలో ప్రవేశించి గడ్డగట్టింది. తరువాత నురుగురూపంతో అతనినోటినుండి బయటకు వస్తోంది.

ఆసమయంలో జిగురుగా ఉండి తరువాత దోమతో సమానంగా ఆకాశంలో సంచరింప సాగింది. అప్పుడు వెనుకటిరూపాలను విడిచిపెట్టి ఆకాశంలో మేఘరూపంలో వ్యాపించింది. ఆమేఘం భూమిపై నీటిని విడిచిపెట్టింది. వాయు దేవుడుకూడా బ్రాహ్మణ శరీరం ధరించి వెయ్యిసంవత్సరాలు తపస్సుచేశాడు. అగ్నిదేవుడుకూడా జడలుధరించి నారవస్త్రందాల్చి ఆహారంమాని మౌనమును అవలంబించి నాలుగువేల సంవత్సరాలు దారుణమైన తపస్సుచేశాడు. తపస్సులో నిమగ్నుడైన అగ్నితేజస్సునుండి మరొక అగ్ని పుట్టింది. అలగ్నికి తమోనుదమని పేరు. పుష్పమిత్రుడనే యక్షుడు ఏకాగ్ర మనస్సుతో పుష్కరతీర్థమందు తపస్సు చేశాడు.

యక్షరాజైన పుష్పమిత్రుడు చాలాసంవత్సరాలు పుష్కరతీర్థంలో నివ సించాడు. వెయ్యిసంవత్సరాలు అతడు సూర్యోపాసన చేస్తూ రెప్పపాటులేకుండా సూర్యునిపై దృష్టినుంచి తపస్సుచేశాడు. తపస్సు యొక్క మహిమచే అతని యెదుట ప్రత్యక్షమయ్యాడు. విష్ణుమూర్తి తప్ప మూడు లోకాల్లో ఎవడూ ఇటు వంటివాడులేడు. సర్పరాజైన వాసుకి బ్రహ్మమీద మనస్సునుంచి మౌనంతో తపస్సు చేశాడు. వాసుకి వృక్షంమీదికి ఎక్కి శిరస్సు క్రిందికిపెట్టి తపస్సు చేశాడు. వెయ్యి సంవత్సరాలు ఆహారంమాని తపస్సుచేశాడు.

హిమవంతుడు పుష్కరతీర్థ మందు కుడిచేతినిఎత్తి వెయ్యినూటఒక్క సంవత్సరం తపస్సు చేశాడు. భూదేవి తపస్సు చేసింది. ఆకాశగంగ తపస్సు

చేసింది. సరస్వతి తపస్సు చేసింది. గంధర్వులు కిన్నరులు తపస్సు చేసి శరీరాలను శుష్కింపచేశారు. మహాయోగి విష్ణువు సిద్ధగణములు చుట్టూ ఉండగా తపస్సులో నిమగ్నుడౌతాడు. ఇదివిని జనమేజయ మహారాజు దేవతలు తపస్సు చేసి తరువాత ఏంచేశారు? తపస్సుకు పొందరానిది లేదుకదా! అని వినయంతో మహర్షియైన వైశంపాయనుని అడిగాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దేవతల తపస్సు అను ఇరవైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ఇరవైతొమ్మిదవ అధ్యాయము

## దేవతల ఆయుధాలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత బ్రహ్మస్వరూపులైన బ్రాహ్మణులుయజ్ఞానికి దీక్ష వహించి, పుష్కరతీర్థం నుండి సమస్త వస్తువులను స్వాధీనం చేసుకున్నారు. తరువాత శాస్త్రప్రకారం అగ్నిసంస్కారంచేసి మంత్రాలను ఉచ్చరిస్తూ నెయ్యి హవిస్సు మొదలైనవాటి ఆహుతులుగా ఇచ్చారు. ఇట్లు ఆఅగ్ని బ్రహ్మతేజస్సుతో వృద్ధి పొందింది. అది పురుషునిఆకారం స్వీకరించింది. ఆపురుషునిశరీరం పెద్ద తేజస్సు కలదైంది. తరువాత ఆపురుషునికి బ్రహ్మదండమనే పేరువచ్చింది. ఆరూపంలో నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు. ఆవిష్ణు మూర్తికి పదహారుచేతుల్లో ఖడ్గం, చర్మ, ధనుస్సు, ఈ ఆయుధాలు ప్రకాశిస్తున్నాయి. వరదేవునిచేతిలో రోకలి, నాగలి ప్రకాశించాయి.

ఇంద్రుడు వజ్రాయుధాన్ని రుద్రుడు శూలాన్ని పినాకమనే ధనుస్సురు, మృత్యువుదండాన్ని వరుణుడు పాశాన్ని, కాలుడు శక్తిని, త్వష్టగొడ్డలిని, కుబేరుడు గొడ్డలినీ ధరించారు. ఈ ఆయుధాలన్నీ దేవతలకు యోగబలం వల్ల ప్రాప్తించాయి. ఆదేవతలు ఇతర దేవతలతో కలిశారు. తరువాత త్వష్ట విశ్వకర్మ అనేకవిధాలైన శాస్త్రాలను ప్రస్తావించారు. తరువాత అగ్నిరూపంధరించిన విష్ణువు, ఇంద్రుడు, సూర్యుడు రుద్రుడికి రథం ఇచ్చారు. అనమయంలోనే త్వష్టదేవతలు చూపిన

మార్గంలో సైన్యాన్ని సేకరించాడు. విశ్వకర్మ అనేకవిధాలైన విమానాలు తయారు చేయటంలో నిమగ్నుడయ్యాడు. సత్యపరాక్రముడైన విష్ణువు తన పుష్కరమనే శరీరం నుండి అన్ని అంశలనూ వెలికితీసి, వాటి ద్వారా సైన్యసృష్టి చేశాడు. నక్షత్రాలకు స్థానం ఆకాశాన్ని కల్పించాడు. తరువాత దేవరాజు ఇంద్రుడు యుద్ధభూమిలో శత్రువులను చీల్చివైచాడు.

విష్ణువు దైత్యులను సంహరించుట తగినదని తలచి ప్రసన్నమైన మనస్సుతో అంగీకరించాడు. మరియు అంతర్ధానం చెంది ఐంద్ర, ఆగ్నేయ, వాయువ్య, రౌద్ర, ములనే అస్త్రాల్ని ధరించాడు. ఇటువైపు మహాబలవంతులైన రాక్షసులు కూడా తపస్సు శిక్షణ, అనేకవిధాలైన శస్త్రాస్త్రములు చతురంగ సైన్యంతో సంసిద్ధంగాఉండి కూడా దేవతల యొక్క భయంకరమైన దెబ్బలకు బాధపడి, యుద్ధభూమి నుండి పారిపోయాడు. మందరపర్వత సమీపంలో రథాలమీద సంచరించారు. ఇట్లు దైత్యుల యొక్క చతురంగ సైన్యాన్ని, అస్తవ్యస్తంచేసి మహాయోగియైన విష్ణువు భూమండలం పై సంచరించాడు అప్పుడు అసురగణములు చర్మాలను నార వస్త్రాలను ధరించి బ్రాహ్మణులతో దేవతలతోనూ కలిసి మరొక విధమైన తపస్సు చేయ నారంభించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దేవతల ఆయుధాలు అను ఇరువైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పైయవ అధ్యాయము
# సముద్ర మథనము

జనమేజయుడు ఓబ్రాహ్మణోత్తమా! చెడునడువడిని ప్రోత్సహించే మహా గ్రహాలుండగా ప్రజలకు మోక్షంపొందాలనే కోరిక ఎలా కలుగుతుంది? అని ప్రశ్నించగా మహర్షి వర్యుడగు దయాళువు వైశంపాయనుడిలా చెప్పాడు,

మహారాజా! ప్రజాధర్మమందాసక్తికల ప్రజాపతి ఋషిగణంతో కలిసి రాజ కార్యములు నిర్వహించుటకు వేనుని కుమారుడైన పృథువుకు రాజ్యాభిషేకం చేశాడు. త్రేతాయుగం వచ్చిన తరువాత ప్రజాసమూహం 'ఈయన అందరికంటే

మంచి రాజు' ఈయనపై మాకు ఎక్కువ ప్రేమకలదు. ఈయన మాకుజీవించ టానికి వృత్తి కల్పించాడు. ఇతనివల్ల మేముశిల్పకార్యంలో ప్రవర్తించాము. ఈశ్వరుని దయవల్ల ఈతడు మమ్మల్ని రక్షిస్తున్నాడు అని ఇలాఅన్నది ఇదే సమయంలో వసంతఋతువు వచ్చింది. దేవతలు తపస్సుచే శ్రమపడి అనేక విధాలైన వ్రతాలతో కృశించిపోయి గంధమాదనపర్వతం గుహలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

అప్పుడు వాయు ప్రసారంచేత వసంతకాల పుష్పాలను వాసనచేత మందించారు. ఆసమయంలో గొప్ప సువాసన మిక్కిలి సుఖకరమై మనస్సును ఆకర్షిస్తున్నది. దైత్యులందరూ ఆసువాసకు ఆశ్చర్యపడి మనము సముద్రంలో అనేక ఓషధులనువేసి మందరపర్వతంద్వారా మథిద్దాము. తరువాత ప్రాప్తించిన అమృతాన్ని పానంచేసి మనం చావులేనివాళ్ళం అవుదాం ఈపనిలో మహాబల వంతుడైన విష్ణువు మనకు ముందు నడుస్తాడు. అతని సహాయంతో శత్రువులతో పాటు మనం భూలోక భోగాలనూ, స్వర్గ భోగాలనూ అనుభవిద్దాం.

గంధమాదన పర్వతగుహలలోని వృక్షాలను శాఖా పత్రపుష్పము మొదలైన వాటిని తీసుకువెళ్ళాం అని యీవిధంగా దేవతలు దానవులు మాట్లాడుకొని తమ విశాలభుజాలనుచాపి మందరపర్వతాన్ని పెకలించ సాగారు. భూమి కంపించింది. మొదట దానవులు తామేపర్వతాన్ని పెకలించాలని ప్రయత్నించి కృతార్థులుకాలేదు. తరువాతవాళ్ళు బ్రహ్మను సమీపించి తమకోరికను చెప్పారు. మూడులోకాలక్షేమం కోరి ఆకాశవాణితో అతడు ఓదానవులారా! మీరు స్వయంగా ఈ పర్వతాన్ని పెకలించలేరు. దేవగణములతో కలిసి ప్రయత్నిస్తే పర్వతాన్ని పెకలించ గలుగు తారు అని చెప్పాడు.

అప్పుడు బాహుబలంగల దైత్యులు దేవతలతోకలిసి ఆపనిలో నిమగ్నుల య్యారు. ఆపర్వతంపైకి వచ్చింది. దానిని కవ్వంచెయ్యాలని నిశ్చయించారు. వెయ్యి సంవత్సరాలు సముద్రాన్ని మథిస్తూనే ఉన్నారు. అప్పుడు అమృతం పుట్టింది. అదిచూచి దైత్యులు ఆశపడ్డారు. దేవతలనుండి అమృతం లాక్కోవాలని ఊహించారు. ధన్వంతరి మొదలైనవాళ్ళు ఉచ్చైశ్రవమనే గుర్రం వెలువడిన తర్వాత అమృతం బయటపడ్డది. దేవతలు అమృతం త్రాగటానికి ప్రయత్నించారు.

దేవతలు అమృతం త్రాగేటప్పుడు వాళ్ళలో ఏరాక్షసుడూ దూరకూడదని నియమం చేశారు. దాన్నిబట్టే నారాయణుడు తన చక్రాయుధంతో రాహువు శిరస్సురు ఖండించాడు. అప్పుడు దేవతలు సనాతన ఋషిగణము అమృతాన్ని సేవించారు. భూదేవి బ్రహ్మ దేవుని మాటప్రకారం ప్రేరేపింపబడి ఇంద్రుని చేతి నుండి అమృతాన్ని అపహరించింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సముద్ర మథనము అను ముప్పైయవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఒకటవ అధ్యాయము

## విష్ణువు వామనుడుగా బలిని వంచించుట

జనమేజయుడు ఓమునివర్యా! విష్ణుపరాక్రమంచేత దైత్యులు ఓడిపోయి తమ శక్తితో ఏంచేద్దామని నిశ్చయంచేశారు? అనగా వైశంపాయనుడిలా చెప్పాడు.

ఓమహారాజ! అప్పుడు దైత్యులు దానవులు తమపరాక్రమంతో రాజ్య పరిపాలన చేస్తున్నారు. దేవతలు తపస్సులో నిమగ్నులయ్యారు. అనగానే మళ్ళీ జనమే జయ మహారాజు బ్రహ్మర్షీ! ఐశ్వర్యవంతుడైన బలిచక్రవర్తి దీర్ఘకాలం వరకూ ఎలా యజ్ఞం చేశాడు? అని ప్రశ్నించగా వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! దానవశ్రేష్ఠుడైనబలి అధికంగా బంగారం దానంచేసి రాజసూయ యజ్ఞం ప్రారంభించాడు. అలాంటి యజ్ఞం పూర్వమెవ్వడూ చేయలేదు. ఆ మహారాక్షసుని యజ్ఞం ప్రారంభంకాగానే వ్రతపారయణులు వేదవేత్తలయిన బ్రాహ్మణులు, యతులు, ఋషిగణం, బ్రాహ్మణగణం వేలకొలది అక్కడకు చేరారు. అనేక దేశాలనుండి అనేక దిక్కులనుండి తీసుకువచ్చిన విశాల ధనరాసులు ఖర్చుచేస్తూ ఆమహాయజ్ఞం నడిచింది. అగ్నితో సమానుడైన శుక్రాచార్యుడు తన పుత్రులు కూడ యజ్ఞకార్యాన్ని నడిపిస్తున్నారు. ఆసమయంలో విష్ణువు వామన రూపం ధరించి అక్కడకు వెళ్ళాడు. భిక్షపెట్టమని కోరాడు. బలిచక్రవర్తి నీకేం కావాలో కోరుకో కోరినదానిని ఇస్తానన్నాడు.

బలి యీ విధంగా అంగీకరించాడు. తరువాత వామనుడతన్ని మూడడుగులు భూమిని కోరాడు. బలి 'తథాస్తు' అనగానే వామనుడు దివ్యరూపాన్ని ధరించి

మూడులోకాలనూ వ్యాపించాడు. ఈవిధంగా రాజ్యమంతా భగవంతుడు హరించగా దైత్యులు పాతాళానికి వెళ్ళారు. అప్పుడు విష్ణువు ఆనందంతో ఇంద్రునికి త్రిలోకాధిపత్యాన్ని యిచ్చాడు. యింద్రుడు దేవతలను తృప్తిపరచాడు. బ్రహ్మ ఇంద్రుడికి అమృతం యిచ్చాడు. యింద్రుడు సుఖపడ్డాడు. అప్పుడు బ్రహ్మదేవుని శత్రుభయంకర శంఖం మ్రోగింది. ఆధ్వనిని యింద్రుడు దేవతలకు రాజయ్యాడని అందరూ ఆనందించారు. జనులు ఆగ్నేయస్త్రంతో తమ సంతోషాన్ని వ్యక్తీకరించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
విష్ణువు వామనుడుగా బలిని వంచించుట అను ముప్పైఒకటవ అధ్యాయము

☆☆☆

# ముప్పై రెండవ అధ్యాయము

## పుష్కర ప్రాదుర్భావము-దక్షయజ్ఞ వినాశము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఇలా సమృద్ధితో కూడిన రాజ్యం స్థాపించినతరువాత దేవతలు మనుష్యులు కలిసి ఉన్నారు. జనులందరూ కలిసికూర్చుని ఆత్మవిచారంచేస్తూ ఆనంద బాష్పాలు రాలుస్తున్నారు. ఆరోజుల్లో దేవతలు మనుష్యలచేతినుండి తమ భాగాన్ని తీసుకొనేవాళ్ళు. ఈసమయంలో బృహస్పతి ఋషులుచుట్టూ ఉండగా దక్షప్రజాపతికి అశ్వమేధయజ్ఞం చేయటానికి దీక్షయిచ్చాడు. దక్షుడు యజ్ఞంలో శంకరుడికి యజ్ఞభాగం ఇవ్వలేదు. అందుచేత రుద్రడు మిక్కిలి కోపించి నందితో వెళ్ళి దక్షుని నాశం చేయటానికి ప్రయత్నించాడు. నంది రుద్రుని వేరొక రూపమే. ఆ రుద్రదేవుడే వేదవాక్యాల ద్వారా సనాతన బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించాడు.

అప్పుడు శంకరుని ప్రభావంవల్ల అనేక వికటరూపాలు ధరించిన ప్రాణులు జన్మించారు. వాళ్ళు అనేకవిధాలైన వికృతరూపాలు ఆయుధాలు ధరించి ఉన్నారు. ఆసమయంలో శంకరుడు స్వయంగా పినాకమనే ధనుస్సును ధరించి యముడులా ఉన్నాడు. భయంకరాకారములు గల సేవకులతో దక్షయజ్ఞంలో ప్రవేశించి ఉప ద్రవం కలుగచేశాడు. తరువాత నంది శంకరుడూ ఆయజ్ఞాన్ని పాడుజేయ సాగారు.

శంకరుడు ప్రేరేపించుటచేత రాక్షసులైన శివగణము యూపస్తంభం పెకలించి, మునులను భయపెడుతూ ఇటూ అటూ పరుగెత్తసాగారు. కొందరు యజ్ఞంలోని నేతిని త్రాగారు. కొంతమంది పశువులను భక్షించారు. కొందరు పురోడాశం తినేశారు. ఇలా యజ్ఞం ధ్వంసమైంది.

అప్పుడు శంకరుడు ధనుస్సున బాణంతొడిగి యజ్ఞంపై ప్రయోగించాడు. ఆయజ్ఞం మృగ రూపాన్ని ధరించి అరుస్తూ పారిపోయింది. బ్రహ్మ దగ్గరకు చేరింది. బ్రహ్మ దానిని మృగశిర నక్షత్రంగా చేసి ఆకాశంలో నివసింపచేశాడు. దక్షునిపక్ష పక్షమందలి యోధులు శివునికి భయపడి పారిపోయారు. ఆసమయంలో మహా విష్ణువు శంఖచక్రగదా ధనుస్సులు ధరించి శంకరునిఎదుట నిలబడ్డాడు. ఆదిత్యాది దేవగణములు ఆయనకు నలువైపుల నిలబడిఉన్నారు. కొన్ని దేవగణములు శివ పక్షమున కొన్ని విష్ణుపక్షముననను నిలిచి లోకకల్యాణముకొరకు ప్రయత్నం చేశారు కాని యుద్ధంతప్పలేదు. మొట్టమొదట రుద్రుడు విష్ణువు హృదయమందు తీవ్రంగా కొట్టాడు. మహావిష్ణువు కొంచమైె చలించలేదు. అతని మనస్సులో రోషము కలుగలేదు.

తరువాత ఆయన బ్రహ్మ దండంతో సమానమైన బాణం శంకరుని మెడమీద తగిలేటట్లు ప్రయోగించాడు. శంకరుడు కొంచమూ చలించలేదు. ఇదిచూచి విష్ణువు ఎగిరి శివునికంఠం పట్టుకొన్నాడు. కాబటి శంకరుడు నీలకంఠుడయ్యాడు. అప్పుడు మహాదేవుడు నారాయణునితో దేవ! నీవు అది అంతములేనివాడవు ఓర్పు గలవాడవు ప్రాణులలో నివసిస్తూ వాళ్ళను అన్ని పనులలో ప్రవర్తింప చేస్తున్నావు. సమస్త ప్రాణులకు నారాయణుడు ప్రభువు అని స్తుతించాడు. అప్పుడు ఆకాశంలో సనాతనదేవా! నమస్కారము. అని సిద్ధులు ఆకాశం నుండి పలికారు. ఇటు రుద్రుని వల్ల పుట్టిన నందిధనుస్సు నెక్కుపెట్టి విష్ణుమూర్తి తలపై కొట్టబోయాడు.

అప్పుడు భగవంతుడు విష్ణువు పెద్దగా నవ్వాడు. నందికి నోటమాటరాలేదు. స్తంభించిపోయాడు. విష్ణువు మహాదేవునకు యజ్ఞభాగం నియమించాడు. శివ విష్ణువుల యుద్ధప్రారంభంలో ఉన్న ఇరుపక్షాల సైనికులు యుద్ధం చేశారు. ఆయుద్ధం దక్షయజ్ఞనాశక సంగ్రామంగా ప్రసిద్ధిచెందింది. దక్షుడు చివరకు యజ్ఞ ఫలాన్ని పొందాడు. మహారాజా! ఇదీ నారాయణుని పుష్కరప్రాదుర్భావ చరిత్రము.

మహర్షివేదవ్యాసుడు పురాణాల్లో వర్ణించినట్లు ఆసమస్త వృత్తాంతాన్ని చెప్పి వినిపించాను. ఈ కథను బ్రాహ్మణ సమక్షంలో చెప్పినవాడు సమస్తమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్నిపొంది దేవలోకంలో పూజింపబడతాడు. శ్రద్ధగా పురాణం విన్నవాడు ఈ లోకంలో కావలసిన సుఖం అనుభవించి పరలోకంలో స్వర్గసుఖాన్ని అనుభవిస్తాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పుష్కర ప్రాదుర్భావము-దక్షయజ్ఞ వినాశము అను ముప్పైరెండవ అధ్యాయము

☆☆☆

# ముప్పై మూడవ అధ్యాయము

## వరాహావతార వర్ణనము

జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! నేను పురాణాల్లో వర్ణింపబడిన విష్ణుమూర్తి అవతారాల్లో సజ్జనులనోటినుండి వరాహావతారం విన్నాను. కాని బాగా తనాకు తెలియదు. వరాహభగవానుని పనియెట్టిది? అతని చరిత్ర ఎట్టిది? ఆ అవతారం ధరించటానికి కారణం ఆయన ఏయేపనులు చేశాడు? ఆయన యజ్ఞ స్వరూపుడా? యోగస్వరూపుడా? అతని శరీరం ఎట్టిది? ఆశరీరాన్ని అధిష్ఠించిన దేవత ఎవరు? అనే విషయాలను విస్తరంగా వినగోరుచున్నానని అడుగగా మహర్షియైన వైశంపాయనడిలా చెప్పాడు.

మహారాజ! పూర్వం మహాత్ముడైన విష్ణువు వరాహరూపంధరించి దంతాల ద్వారా పాతాళంలో ఉన్న భూమిని పైకి తెచ్చాడు. శ్రీమహా వరాహచరిత్ర మిక్కిలి గొప్పది. వేదశాస్త్రాలచే అలంకరింపబడింది. శ్రీమహావిష్ణువు యొక్క పురాతనమైన వరాహ చరిత్రను చెప్పుతున్నా విను.

నీవు పరిశుద్ధుడవై ఇంద్రియజయంతో వినాలి. వేదప్రసిద్ధమైన పవిత్రమగు పురాతనకథను నాస్తికులకు ఎపుడూ చెప్పకూడదు. విద్వాంసులు ఈపురాతన నారాయణచరిత్రను సాంఖ్యయోగస్వరూపంగా చెప్పారు. దీనితాత్పర్యం తెలుసు కొనుటలో సమర్థుడైనవాడే యథార్థమైన మనిషి. అన్ని దేవగణములూ అన్ని జీవ గణములూ సమస్తమూ అతనియొక్క ఆత్మస్వరూపమై యున్నది. వెయ్యియుగాలు పూర్తికాగానే జీవులు సమాప్తిచెందుతారు. గొప్ప అపశకునాలు కనిపిస్తాయి. ఆసమయంలో భగవంతుడు విష్ణువు మూడుజ్వాలలు గల అగ్నిరూపం ధరించి

జీవులను శోషింపచేస్తాడు. వేదవేదాంగాది సమస్తమూ అతని తేజస్సుచే కాల్చబడి బ్రహ్మమొదలుగా ప్రపంచమంతా అతనిశరీరంలో లీనమవుతుంది.

సూర్యుడు నిత్యమూ ఉదయిస్తున్నట్లే సృష్టికూడా మరలమరల జరుగుతూనే ఉంటుంది. వెయ్యియుగాలు పూర్తయితే ఒకకల్పం పూర్తవుతుంది. ప్రళయ కాలంలో ఘోరమైన అంధకారం (చీకటి) తప్ప మరొకటేమీ ఉండదు. జీవుడెవ్వడూ కనబడడు. అప్పుడు భగవంతుడైన హృషీకేశుడు పడుకొనటానికి ప్రారంభిస్తాడు. అప్పుడతని మెడలో కమలములమాలపడి ఉంటుంది. మహాలక్ష్మి కూడ అతని శరీరంలోనే ప్రవేశించి నిద్రిస్తుంది. భగవంతుడు చెప్పశక్యంకాని నిద్రాయోగాన్ని పొంది వెయ్యిసంవత్సరాల వరకూ పడుకొని ఉంటాడు. వెయ్యి సంవత్సరాలు పూర్తికాగానే స్వయంగా మేల్కొంటాడు. లేవగానే అతని మనస్సులో సృష్టిఆలోచన ఏర్పడుతుంది. దేవతలు కోరినదానిని భగవంతుడే పూర్తిచేస్తాడు. భగవంతుడైన నారాయణుని విషయంలో దేవతలు కూడా ఏమీ ఎరుగరు. ఎవడూ అతని అంతుచూచినవాడు లేడు. వెయ్యిసంవత్సరాల తర్వాత ఒకగ్రుడ్డును పుట్టిస్తాడు. ఆగ్రుడ్డు నుండి ఈ జగత్తంతా జన్మిస్తున్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
వరాహావతార వర్ణనము అను ముప్పైమూడవ అధ్యాయము

☆☆☆

# ముప్పై నాల్గవ అధ్యాయము

## వరాహము భూమిని పైకి తెచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! వేదాలమబట్టి పూర్వమీజగత్తు బంగారపుగ్రుడ్డుగా ఉంది. వెయ్యి సంవత్సరాల తరువాత భగవంతుడు ఆగ్రుడ్డును పైకెత్తి రెండుభాగాలుగా విభజించాడు. ఆగ్రుడ్డుపై రంధ్రభాగం ఆకాశం కొంచంకాలమైనతర్వాత లోకాన్ని సృష్టించాలని ఆగ్రుడ్డును క్రిందికి త్రిప్పి ఎనిమిదిభాగాలు చేశాడు. తర్వాత అనేక భాగాలుగా విభజింపబడింది. ఆగుడ్డుపై రంధ్రం ఆకాశంఅయింది. సజ్జనులకు అదే ప్రధాన సాధనమైంది. ఆగ్రుడ్డు క్రిందిభాగం పాతాళం అయింది. భగవంతుడు దేవతలను సృష్టించటానికి నిర్మించిన గ్రుడ్డుకు నాలుగు ప్రక్కలా ఎనిమిదికన్నాలు తయారు చేశాడు. కన్నాలు దిశ, విదిశ అనే రెండు భాగాలుగా విభజింపబడ్డాయి.

ఆగ్రుడ్డును పగలగొట్టే సమయంలో వెలువడిన రెండుముక్కలు అనేకవిధాలైన రంగులగల మేఘాలుగా తయారయ్యాయి. అండంయొక్క తడిభాగం భూమికి నలువులా వ్యాపించింది. దానికి పూర్వం ఖండించబడిన బంగారు గ్రుడ్డు నుండి జలభాగం స్రవించి దానినుండి బంగారుపర్వతం పుట్టింది. మిగిలిన నీటి నుండి దిశ, విదిశ, అంతరిక్షస్వర్గ ఇంకా ఇతరప్రదేశాలు తడిశాయి. ఆ జలంపడిన ప్రతిస్థలమందూ పర్వతం పుట్టింది. భూమి పర్వతాలచేత, వనాలచేత నిండి ఎత్తు పల్లాలుగా అయింది. అనేకయోజనాలు విశాలంగాఉన్న అనేకపర్వతాలతో భారంచేత పీడింపబడింది. మెల్లమెల్లగా క్రిందికి పోవడం మొదలుపెట్టింది. అప్పుడు భగవంతుడు భూమి పాతాళానికి పోవటంచూచి తన తేజస్సుచే పైకి తేవాలని నిశ్చయించాడు.

అప్పుడు భూమి భగవంతునితో ఓపురుషోత్తమా! నీకు నమస్కారం. సమస్త జీవరాసులను ధరిస్తూ రక్షిస్తున్నావు. నీవు ప్రధానంగా ధరిస్తూ ఉంటే మేంకూడా ధరించేశక్తిని పొందుతున్నాం. ఓవీరుడా! లోకక్షేమంకోరి ప్రతియుగంలోనూ నాభారాన్ని తగ్గిస్తున్నావు. దురాత్ములైన రాక్షసులచే బాధింపడి నిన్నుశరణువేడాను. నేను నిన్ను శరణువేడుతున్నాను. నన్ను రక్షించు. నీకు శరణాగతిచేస్తే భయమంతా పోతుంది. భగవంతుడు దేవి! నీవు సందేహించకు నిశ్చింతగాఉండు. శాంతి పొందుము. ఇప్పుడే నిన్ను పాతాళంనుండి పైకి తీసుకువస్తాను. ఒకక్షణం ఆలోచించి జలక్రీడ మీది కోరికతో యజ్ఞవరాహరూపం ధరించి భూమినిపైకి తేదలచాడు. కొన్ని యోజనాల విస్తారమూ ఎత్తు ఉంది ఆరూపం.

యజ్ఞవరాహరూపం ధరించి భూమిని పైకితెచ్చుటకు పాతాళంలో ప్రవేశించాడు భగవంతుడు. నాలుగువేదాలూ పాదాలైనాయి. వేదాంగాలు యజ్ఞాంగాలు ఆవరాహమూర్తికి అవయవాలయ్యాయి. ఇట్టి యజ్ఞవరాహమూర్తి పాతాళంలో నీటితో కప్పబడిన భూమిని తనదంతాలచివర నిలిపిపైకి తెచ్చాడు. ఇలా భూమిని ధరించుటచేతనే భగవంతుడు 'ధరాధరుడు'గా పిలువబడుతున్నాడు. భూదేవికూడ నిశ్చింతగా సుఖంగా ఉంది. భూమిదేవాది దేవుడైన భగవంతునకు ప్రణామం చేసింది. మహారాజ! ఈవిధంగా భూదేవిని లోకక్షేమంకొరకు భగవంతుడు ఉద్ధరించాడు. తరువాత భగవంతుడు భూమిని అనేకభాగాలుగా విభజించాలని నిశ్చయించుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరాహము భూమిని పైకి తెచ్చుట అను ముప్పైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఐదవ అధ్యాయము

## వరాహమూర్తి నదులను సృష్టించుట

వైశంపాయనడిలా చెప్పాడు. మహారాజా! ఆసమయంలో భూమి జలరాశిమీద తేలుతూ విశాలమైన నావవలె కనిపించింది. శరీర విస్తారకారణంగా నీటిలో మరల మునుగలేదు. తర్వాత నారాయణుడు భూమిని ఎలా విభజించాలి. నలువైపులా పర్వతాలతో ఎత్తుచేయాలి అని విచారించాడు. నలువైపులా సముద్రాలను ఉంచి మధ్యలో బంగ్గారుమయమైన మేరుపర్వతాన్ని నిర్మించాడు. అదిచాలా విశాలమైన ఎత్తైనదీ కూడ/ ఆపర్వతంమీద ఫలపుష్పాలతో ప్రకాశించే అనేక వృక్షాలను స్థాపించాడు. దానికి కొంచందూరంలో తూర్పు ఉదయపర్వత నిర్మాణం చేశాడు. విశ్వకర్మ దానిమీద తన నివాసస్థానం ఏర్పరచుకొన్నాడు. తరువాత మంచురాశితో శోభించే హిమాలయమును సృష్టించాడు. దానిమీద బ్రాహ్మణగణం సేవించేనదీ ప్రవాహాన్ని నిర్మించాడు. దానిపేరు 'వసుధార'. ముత్యాలు శంఖాలూ కలిగి అమృత సమానమైన నీటితో ఒక పవిత్రనది తూర్పుదిక్కును ప్రకాశింపచేస్తూ ప్రవహిస్తుంది. ఆనది శోభవర్ణనాతీతం. తర్వాత దక్షిణదిక్కున రమణీయమైన పర్వతం స్థాపించ బడింది దానిలో సగభాగం బంగారం, సగభాగం వెండి, అది దక్షిణదిక్కునందే కావలసిన పండ్లను ఇచ్చేది. మనోహరమైన వృక్షాలతోనిండిన 'భానుమాన్' అనే పర్వతాన్ని నిర్మించాడు. తర్వాత బంగారు మయమైన కుంజరమనే పర్వతాన్ని, గంధపుచెట్లతో కూడిన ఋషభగిరిని, మలయపర్వతాన్ని, వింధ్యపర్వతాన్ని నిర్మించాడు. ఆదిక్కునందే 'పయోధర' అనేనదిని సృష్టించాడు. తర్వాత పడమర దిక్కుకు వెళ్ళాడు. అక్కడ అస్తమయపర్వతాన్ని నిర్మించాడు. ఈవిధంగా వరాహ స్వామి వేలాది పర్వతాలను స్థాపించి వరాహపర్వతమును కూడ స్థాపించాడు. పశ్చిమదిశయందు అనేక విధములైన పర్వతాలను స్థాపించిన తర్వాత ఉత్తర దిక్కున అనేక పర్వతాలను స్థాపించాడు. తర్వాత మందరపర్వత గంధమాదన గిరులను స్థాపించాడు. ఆపర్వతం మీద 'జంబూ'నది ప్రవహిస్తున్నది. తరువాత కైలాసమున శతముఖి అనేనది ప్రవహిస్తూ ఉంటుంది. ఈవిధంగా అన్నిదిక్కులా లోకకల్యాణంకొరకు అనేక పర్వతాలను స్థాపించి పవిత్రజలంతో కూడిన అనేకానేక నదులను ప్రవహింపచేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరాహమూర్తి నదులను సృష్టించుట అను ముప్పైఐదవ అధ్యాయము

☆☆☆

ఆగ్రుడ్డును పగలగొట్టే సమయంలో వెలువడిన రెండుముక్కలు అనేకవిధాలైన రంగులగల మేఘాలుగా తయారయ్యాయి. అండంయొక్క తడిబాగం భూమికి నలుపులా వ్యాపించింది. దానికి పూర్వం ఖండించబడిన బంగారు గ్రుడ్డు నుండి జలభాగం స్రవించి దానినుండి బంగారుపర్వతం పుట్టింది. మిగిలిన నీటి నుండి దిశ, విదిశ, అంతరిక్షస్వర్గ ఇంకా ఇతరప్రదేశాలు తడిశాయి. ఆ జలంపడిన ప్రతిస్థలమందూ పర్వతం పుట్టింది. భూమి పర్వతాలచేత, వనాలచేత నిండి ఎత్తు పల్లాలుగా అయింది. అనేకయోజనాలు విశాలంగాఉన్న అనేకపర్వతాలతో భారంచేత పీడింపబడింది. మెల్లమెల్లగా క్రిందికి పోవడం మొదలుపెట్టింది. అప్పుడు భగవంతుడు భూమి పాతాళానికి పోవటంచూచి తన తేజస్సుచే పైకి తేవాలని నిశ్చయించాడు.

అప్పుడు భూమి భగవంతునితో ఓపురుషోత్తమా! నీకు నమస్కారం. సమస్త జీవరాసులను ధరిస్తూ రక్షిస్తున్నావు. నీవు ప్రధానంగా ధరిస్తూ ఉంటే మేంకూడా ధరించేశక్తిని పొందుతున్నాం. ఓవీరుడా! లోకక్షేమంకోరి ప్రతియుగంలోనూ నాభారాన్ని తగ్గిస్తున్నావు. దురాత్ములైన రాక్షసులచే బాధింపడి నిన్నుశరణువేడాను. నేను నిన్ను శరణువేడుతున్నాను. నన్ను రక్షించు. నీకు శరణాగతిచేస్తే భయమంతా పోతుంది. భగవంతుడు దేవి! నీవు సందేహించకు నిశ్చింతగాఉండు. శాంతి పొందుము. ఇప్పుడే నిన్ను పాతాళంనుండి పైకి తీసుకువస్తాను. ఒకక్షణం ఆలోచించి జలక్రీడ మీది కోరికతో యజ్ఞవరాహరూపం ధరించి భూమినిపైకి తేదలచాడు. కొన్ని యోజనాల విస్తారమూ ఎత్తు ఉంది ఆరూపం.

యజ్ఞవరాహరూపం ధరించి భూమిని పైకితెచ్చుటకు పాతాళంలో ప్రవేశించాడు భగవంతుడు. నాలుగువేదాలూ పాదాలైనాయి. వేదాంగాలు యజ్ఞాంగాలు ఆవరాహమూర్తికి అవయవాలయ్యాయి. ఇట్టి యజ్ఞవరాహమూర్తి పాతాళంలో నీటితో కప్పబడిన భూమిని తనదంతాలచివర నిలిపిపైకి తెచ్చాడు. ఇలా భూమిని ధరించుటచేతనే భగవంతుడు 'ధరాధరుడు'గా పిలువబడుతున్నాడు. భూదేవికూడ నిశ్చింతగా సుఖంగా ఉంది. భూమిదేవాది దేవుడైన భగవంతునకు ప్రణామం చేసింది. మహారాజ! ఈవిధంగా భూదేవిని లోకక్షేమంకొరకు భగవంతుడు ఉద్ధరించాడు. తరువాత భగవంతుడు భూమిని అనేకభాగాలుగా విభజించాలని నిశ్చయించుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరాహము భూమిని పైకి తెచ్చుట అను ముప్పైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఐదవ అధ్యాయము

## వరాహమూర్తి నదులను సృష్టించుట

వైశంపాయనడిలా చెప్పాడు. మహారాజా! ఆసమయంలో భూమి జలరాశిమీద తేలుతూ విశాలమైన నావవలె కనిపించింది. శరీర విస్తారకారణంగా నీటిలో మరల మునుగలేదు. తర్వాత నారాయణుడు భూమిని ఎలా విభజించాలి. నలువైపులా పర్వతాలతో ఎత్తుచేయాలి అని విచారించాడు. నలువైపులా సముద్రాలను ఉంచి మధ్యలో బంగారుమయమైన మేరుపర్వతాన్ని నిర్మించాడు. అదిచాలా విశాలమైన ఎత్తైనదీ కూడ ఆపర్వతంమీద ఫలపుష్పాలతో ప్రకాశించే అనేక వృక్షాలను స్థాపించాడు. దానికి కొంచందూరంలో తూర్పు ఉదయపర్వత నిర్మాణం చేశాడు. విశ్వకర్మ దానిమీద తన నివాసస్థానం ఏర్పరచుకొన్నాడు. తరువాత మంచురాశితో శోభించే హిమాలయమును సృష్టించాడు. దానిమీద బ్రాహ్మణగణం సేవించేనదీ ప్రవాహాన్ని నిర్మించాడు. దానిపేరు 'వసుధార'. ముత్యాలు శంఖాలూ కలిగి అమృత సమానమైన నీటితో ఒక పవిత్రనది తూర్పుదిక్కును ప్రకాశింపచేస్తూ ప్రవహిస్తుంది. ఆనది శోభవర్ణనాతీతం. తర్వాత దక్షిణదిక్కున రమణీయమైన పర్వతం స్థాపించబడింది దానిలో సగభాగం బంగారం, సగభాగం వెండి, అది దక్షిణదిక్కునందే కావలసిన పండ్లను ఇచ్చేది. మనోహరమైన వృక్షాలతోనిండిన 'భానుమాన్' అనే పర్వతాన్ని నిర్మించాడు. తర్వాత బంగారు మయమైన కుంజరమనే పర్వతాన్ని, గంధపుచెట్లతో కూడిన ఋషభగిరిని, మలయపర్వతాన్ని, వింధ్యపర్వతాన్ని నిర్మించాడు. ఆదిక్కునందే 'పయోధర' అనేనదిని సృష్టించాడు. తర్వాత పడమర దిక్కుకు వెళ్ళాడు. అక్కడ అస్తమయపర్వతాన్ని నిర్మించాడు. ఈవిధంగా వరాహస్వామి వేలాది పర్వతాలను స్థాపించి వరాహపర్వతమును కూడ స్థాపించాడు. పశ్చిమదిశయందు అనేక విధములైన పర్వతాలను స్థాపించిన తర్వాత ఉత్తర దిక్కున అనేక పర్వతాలను స్థాపించాడు. తర్వాత మందరపర్వత గంధమాదన గిరులను స్థాపించాడు. ఆపర్వతం మీద 'జంబూ'నది ప్రవహిస్తున్నది. తరువాత కైలాసమున శతముఖి అనేనది ప్రవహిస్తూ ఉంటుంది. ఈవిధంగా అన్నిదిక్కులా లోకకల్యాణంకొరకు అనేక పర్వతాలను స్థాపించి పవిత్రజలంతో కూడిన అనేకానేక నదులను ప్రవహింపచేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
వరాహమూర్తి నదులను సృష్టించుట అను ముప్పైఐదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఆరవ అధ్యాయము

## జగత్తు -సృష్టి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! దేవదేవుడైన వరాహస్వామి జగత్తును సృష్టించేవిషయంలో విచారణచేస్తుండగా అతని ముఖంనుండి ఒక పుత్రుడు పుట్టాడు. 'నేనేంచెయ్యాలి' అని అడుగుతూ చేతులజోడించి భగవంతుని యెదుట నిలబడి ఉన్నాడు. వరాహ స్వామి కొంచం నవ్వి నిన్ను నీవు అనేక భాగాలుగా విభజించుకో అని చెప్పి అంతర్ధానమయ్యాడు. స్వామిచిహ్నాము ఏమీ అక్కడ కనబడలేదు. తరువాత ఆ పురుషుడు (బ్రహ్మ) భగవంతుని వాక్కును ఆలోచింపసాగాడు.

అప్పుడు ఆకాశంలో 'ఓం' అనేశబ్దం ఉచ్చరించబడింది. దేవాదిదేవుడైన నారాయణుడే స్వర్గంనుండి ఆశబ్దాన్ని పలికిఉంటాడు, తరువాత బ్రహ్మ 'ఓం' శబ్దాన్ని అభ్యాసం చేయసాగాడు. అలా అభ్యాసం చేస్తుండగా అతని హృదయం నుండి 'వషటార' శబ్దం పలకబడింది. తరువాత పవిత్రమైన మహావ్యాహృతులు (భర్భు వస్సువః) పుట్టినాయి. ప్రజాపతి పరదేవతనుస్మరించి ఇరవైనాలుగక్షరాల స్వరూపంలో ఉండే సావిత్రీదేవిని సృష్టించాడు. తరువాత ఋక్‌యజుస్సామ అథర్వ వేదాలను సృష్టించాడు. తరువాత బ్రహ్మయొక్క కోరికచే సనక, సనాతన, సనందన, సనత్కుమార, కపిల మహర్షులను ఆరుగురు జన్మించారు.

ఇంద్రియనిగ్రహంగల బ్రాహ్మణులు యోగతంత్రంలో బ్రహ్మను ఈ ఆరుగురు మహర్షులను స్తోత్రం చేస్తారు. తరువాత మరీచి, అత్రి, అంగిరసుడు పులస్త్య, పులహ, క్రతు, భృగువులను మనువును ఆయన కోరిక చేతనే జన్మించారు. ఈ ఎనిమిదిమంది అసురులు రాక్షసలతో కూడిన ప్రాణులన్నిటికీ తండ్రియై యున్నారు. ఈ మహర్షులందరూ వీళ్ళ ప్రజలూ వెయ్యి సంవత్సరాల తరువాత ముక్తిని పొందుతారు. మరల వెయ్యి సంవత్సరాల ప్రజలను సృష్టించే ఆదేవతలు మరలపుడతారు. పనిని బట్టి ఒక్కొక కల్పంలో దేవతలపేరు జన్మ వేరుగా ఉంటాయి. భగవంతుడైన నారాయణుడి బొటనవ్రేలినుండి దక్షప్రజాపతి, ఎడమ బొటనవేలు నుండి అతని భార్యపుట్టారు. వాళ్ళకు పుట్టిన కన్యలు లోకమాతలు అయ్యారు.

వాళ్ళసంతానం మూడులోకాల్నీ వ్యాపించింది. ఆదితి మొదలుగ కన్యలను కశ్యపునకిచ్చి వివాహంచేశాడు. తరువాత దక్షుడు, అరుంధతి, వసు మొదలగు పదిమంది కన్యలను బ్రహ్మపుత్రుడైన మనువుకు ఇచ్చాడు. తరువాత కమల మొదలగు కన్యలను ధర్మునికిచ్చి వివాహంచేశాడు. చంద్రుడికి రోహిణి మొదలగు ఇరవైఏడుగురు కన్యలను ఇచ్చాడు. ఆదక్ష కన్యలగర్భంనుండి కశ్యపుడును, ధర్మ అనేవాళ్ళు జన్మించారు. చంద్రునియొక్క పుత్రపౌత్రుల సమూహాన్ని గూర్చి చెపుతున్నా-అర్యమ వరుణాదులు కశ్యపునిపుత్రులు. వీళ్ళందరూ అదితికి జన్మించారు. దితికి హిరణ్యకశిపు, హిరణ్యాక్షుడు అనే యిద్దరు పుత్రులు జన్మించారు.

తపస్సులో కశ్యపునికి సమానులు. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు మొదలైన ఐదుగురు మహాబలవంతులు పరాక్రమవంతులైన పుత్రులు జన్మించారు. ప్రహ్లాదునకు విరోచనుడు జంభుడు సుజంభుడుఅను ముగ్గురు బలవంతులైన పుత్రులు జన్మించారు. విరోచనుని పుత్రుడు 'బలి'. అతని పుత్రుడు బాణాసురుడు. అతని పుత్రుడు వీరపురంజయుడు, దక్షకన్యదనువుకు అనేక పుత్రులు జన్మించారు. వారందరూ బలవంతులూ పరాక్రమవంతులూ. వాళ్ళలో విప్రచిత్తి రాజ్యపాలన చేశాడు, క్రోధకు చాలామంది పుత్రులు మనుమలు పుట్టారు. వాళ్ళందరూ క్రూర కర్ములు, చంద్రుడు, రాహువు సింహికపుత్రులు, కాలఅనే స్త్రీకి కాలేయగణం పుత్రులు.

శేషుడు, వాసుకి తక్షకుడు ఈముగ్గురూ కద్రూపుత్రులలో గొప్పవాళ్ళు. వీళ్ళులోకహితం చేసేవాళ్ళు కావలసిన రూపం ధరించగలవాళ్ళును. తార్క్ష్యుడు అరిష్టనేమి, గరుడుడు, అరుణుడు వినతకుమారులు, అనవద్య మొదలైన దక్షపు పుత్రికలు ప్రాధా అనుదానికి జన్మించారు. అలంబుస మొదలగు వాళ్ళు అప్సరసలు. అసిత మొదలగువాళ్ళు మునిఅని స్త్రీకి జన్మించినవాళ్లు. విశ్వావసు, భరణ్యా అనువాళ్ళు గంధర్వులనే పేరుపొందారు. మేనక మొదలైనవాళ్ళు పద కొండుమంది అప్సరసలుగా ప్రసిద్ధిచెందారు. అమృత, రుద్రగణం సురభి సంతతి, వెనుక చెప్ప బడినవాళ్ళు కశ్యపుని సంతానం. మునిపత్నికి నాగవీధి మొదలైన వాళ్ళు జన్మించారు.

లోకంలోఉండే విషమవస్తువలన్నీ మరుత్వతి సంతతి. సంకల్పకు సంకల్పఅనే కన్యజన్మించింది. కామదేవుడు లక్ష్మీపతియైన ధర్ముని పుత్రుడు. హర్షుడు,

యశుడు అనువాళ్ళు కామదేవుని పుత్రులు రోహిణికి చంద్రునివలన 'వర్చ' అను పుత్రుడు కలిగాడు. ఆపుత్రుని కారణంగానే ఊర్వశీపురూరవులకు కలియక జరిగింది. ఈవిధంగా వెయ్యిమంది పుత్రులు పుత్రికల పరస్పర సంబంధం వల్ల ప్రపంచ మేర్పడింది. వాళ్ళవల్లనే లోకప్రతిష్ఠ ఏర్పడింది. తరువాత భగవంతుడు ప్రజాపతిని శరీరాన్నిధరించి ప్రాణులకు రాజుగా ఉండనియమించాడు. ఆ భగవంతుడే అంతటికీ మూలకారణమైనవాడని సారాంశముగా గ్రహించాలి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
జగత్సు -సృష్టి అను ముప్పైఆరవ అధ్యాయము

☆☆☆

# ముప్పైఏడవ అధ్యాయము

## బ్రహ్మ వలన వేరువేరు అధికారాలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! భగవంతుడైన నారయణుడు ఇదంతాసృష్టించిన తరువాత అమిత తేజశ్శాలియైన ఇంద్రుని మూడులోకాలకూ, దేవతలకూ రాజుగా చేశాడు. అతడు అదితిగర్భంలో జన్మించినవాడు. అధ్వర్యులసమూహం ఇంద్రుని స్తోత్రం చేస్తుంది. పుట్టగానే అతన్ని బ్రాహ్మణులు దర్భలతో పట్టుకొన్నారు. అందుచే కౌశికుడను పేరు పొందాడు. బ్రహ్మమొదట ఇంద్రుని ముల్లోకాలకు పట్టాభిషిక్తునిచేసి ఇతర రాజ్యాలకు ఇతరులను రాజులుగాచేశాడు. యజ్ఞం తపస్సు గ్రహనక్షత్రాలు బ్రాహ్మణులు ఓషధులు వీటికి చంద్రుణ్ణి రాజుచేశాడు. దక్షుని ప్రజాపతిగాను, వరుణుని నీటికి రాజుగా పితృ దేవతలకు యముని, శరీరంలేని శబ్దం ఆకాశం మొదలైన అన్నిటిమీద వాయువును, రాజుగా నియమించాడు.

వ్యాధులు, ఈతి బాధలు, ప్రేతలు మొదలగువాటిపై శివునికి పట్టాభిషేకం చేశాడు. యక్షులు రత్న, ధన, రాక్షస గుహ్యాకులపై కుబేరుని అధిపతిగా చేశాడు. దంతాలు గల ప్రాణులపై పర్జన్యుడికి ప్రభుత్వం కల్పించాడు. బ్రహ్మదేవడీ విధంగా ఆయాప్రభుత్వాలను వారివారికి కట్టబెట్టాడు. సజ్జనులు తమ పుణ్య ఫలంచేత ఉత్తమస్థానాన్ని పొందుతారు. బ్రహ్మ ఈవిధంగా నియమించి విష్ణు

నాభికమలం మీదికి వెళ్ళిపోయాడు. దేవతలు ఇంద్రునిచే రక్షింపబడుతూ మిక్కిలి సుఖంగా ఉన్నారు. ఇంద్రుడు మొదలైన దేవతలు బ్రహ్మయొక్క ఆజ్ఞనుపాలిస్తూ గొప్పకీర్తిని యజ్ఞ భాగాలను అమితసంతోషాన్ని పొందుతూ స్వర్గంలో నివసిస్తున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బ్రహ్మ వలన వేరువేరు అధికారాలుఅను ముప్పైఏడవ అధ్యాయము

☆☆☆

# ముప్పై ఎనిమిదవ అధ్యాయము

## హిరణ్యాక్షుడు ఇంద్రుని స్తంభింప చేయుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఒకమారు భగవంతుని మాయచేత అసురులకు మిత్రులుగాఉన్న పర్వతసమూహం భూమినివిడిచి హిరణ్యాక్షుడు పాలించే పడమరదిశకు వెళ్ళి పోయాయి. అక్కడ గజరాజులవలె సరస్సులోమునిగినాయి. రెక్కలుగల ఆ పర్వతాలు దేవతలకు ప్రభుత్వం ప్రాప్తించినట్లు అసురులకు చెప్పాయి. ఆమాట విని రాక్షసులు యుద్ధ ప్రయత్నాలు ప్రారంభించారు. వాళ్ళుగదా ముసలాది ఆయుధాలను ధరించారు. వాళ్ళు భూమండలాన్ని అంతనీ తమచేతిలో పెట్టు కోవాలని కోరు తున్నారు. కవచాలుధరించి అనేక విధాలైన వాహనాలపై యుద్ధానికి తయారయ్యారు.

హిరణ్యాక్షుని నలువైపులా చుట్టి నిలబడి మహానందంలో ఇటూఅటూ తిరుగు తున్నారు. దేవతలు కూడ దైత్యుల యుద్ధప్రయత్నాలువిని తమ, చతురంగసేనను సిద్ధంచేశారు. దేవతలు ఐరావతంపై కూర్చున్న ఇంద్రుని వెనుక నడువసాగారు. వాద్యధ్వనులు భేరీధ్వనులు మిన్నుముట్టగా హిరణ్యాక్షుడు దేవరాజును ఎదు ర్కొన్నాడు. తరువాత ఘోరమైన బాణవర్షం ప్రారంభమయింది. తక్కిన మహా రాక్షసవీరులు అనేకవిధాలైన ఆయుధాలతో ఇంద్రుడు మొదలైన దేవతలమీద యుద్ధం సాగించారు. ఇంద్రాదిదేవతలు కూడా రాక్షస మహావీరులతోకూడిన హిరణాక్షునిపై నలువైపుల నుండి యుద్ధంచేశారు.

హిరణ్యాక్షుడు ముందుకు నడుస్తున్నాడు. పర్వతంలాంటి హిరణ్యాక్షుడు తమవైపురావటంచూచి భయపడి ధనుర్బాణాలతో పారిపోయి ఇంద్రుని వెనుక

నిలిచారు. దేవతలు ఇటు బంగారు కవచాలు ధరించిన రాక్షససేన శరత్కాల మేఘసమూహంలా ప్రకాశిస్తోంది. తరువాత రాక్షసులు దేవసైన్యమూ కలిసి ఘోరయుద్ధం చేశారు. రెండుపక్షాల బాణవర్షంచేత సూర్యుడు కనబడని పగలు ఏర్పడింది. రాక్షస సైన్యము చాలానష్టంకావటంచూచి హిరణ్యాక్షుడు కోపించాడు. అతనిముఖంనుండీ అగ్నివెలువడింది. హిరణ్యాక్షుడు అనేక విధములైన అస్త్రము లతో ఆకాశాన్ని కప్పివేశాడు.

హిరణ్యాక్షుని ఖడ్గందెబ్బలకు దేవతల తలకాయలు తెగిపడ్డాయి. వక్షస్థలం బ్రద్దలైంది. దేవతలు హిరణ్యాక్షుని దెబ్బలకు కదలలేకపోయారు. ఇంద్రుడు హిరణ్యాక్షుని అస్త్రంచేత స్తంభింప చేయబడి, భయపడి కదలలేకపోయాడు. దేవతలనందరినీ విడిచిపెట్టి హిరణ్యాక్షుడు ఇంద్రుని స్తంభింపచేసి జగత్తంతా తనచేతిలో ఉన్నట్లు తలచాడు. అపుడు హిరణ్యాక్షుడు నీటితోకూడిన మేఘంతో సమానంగా గర్జిస్తూ మదగజంలా అనేక ఉత్సాహచేష్టలుచేస్తూ మిక్కిలి వేగంతో ధనుష్టంకారం చేస్తున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
హిరణ్యాక్షుడు ఇంద్రుని స్తంభింప చేయుట అను ముప్పైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ముప్పై తొమ్మిదవ అధ్యాయము

## వరాహస్వామి హిరణ్యాక్షుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! దేవరాజు ఇతర్మఅయాదేవగణాలు ఓడిపోయినప్పుడు చక్రంగద, ధరించి వరాహభగవానుడు హిరణ్యాక్షుని సంహరించుటకు సంకల్పించాడు. భూమిని ఉద్ధరించిన నారాయణుడే ఇప్పుడు యుద్ధభూమిలోకివచ్చి శరత్కాల చంద్రునివంటి తనశంఖాన్ని పర్వతాకారమైన చక్రాయుధాన్నీ ధరించాడు. పవిత్రములకంటె పవిత్రుడు బ్రహ్మకు ప్రభువు జగత్పూజ్యుడుఅగు నారాయుడు రాక్షసులను మోహింప చేయుశంఖాన్ని ఊదిదైత్యుల జీవనశక్తిని అపహరించ సాగాడు. అప్పుడు కళ్ళెర్రజేసి హిరణ్యాక్షుడు రోషంతో ఎవడువీడు? అని నారాయణుని చూచాడు. తరువాత హిరణ్యాక్షుడు మొదలైన రాక్షసగణము ఖడ్గము మొదలైన ఆయుధాలతో వరాహ భగవానునికి ఎదురువెళ్ళారు.

గించాడు. దానితో అతని శిరస్సుతెగి క్రిందపడింది. ఈవిధంగా హిరణ్యాక్షుని మరణంచూచి దైత్యగణంభయంతో నలువైపులకూ పారిపోయారు. వరాహ భగవానుడు ప్రళయకాలయను ధర్మరాజులాగా చక్రాయుధాన్ని చేతబట్టి యుద్ధ భూమిలో నిలిచియున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరాహస్వామి హిరణ్యాక్షుని చంపుట అను మున్నైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నలభైయవ అధ్యాయము

## వరాహస్వామి అంతర్ధానమగుట

వైశంపాయనుడిలా చెప్పాడు

మహారాజ! పురుషోత్తముడైన వరాహభగవానుడు రాక్షసులనందరనూ పారద్రోలి బంధింపబడిన ఇంద్రాదిదేవతలను విడిపించాడు. అప్పుడు దేవతలు స్తిమితపడ్డారు. ఇంద్రుని ముందుంచుకొని నారాయణునివద్దకు వచ్చారు. ఓమహాబాహూ! నీదయచేత భుజబలంచేత మేము మృత్యుముఖంనుండి బయటపడ్డాం. నీశాసనంప్రకారం దేవతలు ఏంచెయ్యాలి? మేము నీపాదసేవ చేయగోరుతున్నాం అని దేవతలు పలుకగా భగవంతుడు ప్రసన్నుడై ఓదేవతలారా! ఇప్పుడు మీరు యజ్ఞభాగాలకు అధికారులయ్యారు. మీరు మీస్థానలకు వెళ్ళి పూర్వం చెప్పిన నియమాలను పరిపాలించండి.

దేవతలకు రాజునైన ఇంద్రుడా! మంచిచెడ్డల గూర్చి నీకునిర్ధారణ చేయబడినపనిని కొంచమైనా లోపంలేకుండా నిర్వర్తించుము. యజ్ఞతపోవ్రతములు చేసినవాళ్ళు తమకుతగిన ఫలమును అనుభవింతురుగాక. ధర్మపరులపై మంచి భావము వృద్ధి పొందాలి. పాపాత్ములు దుష్టులు నశించాలి. అన్ని ఆశ్రమాల

సజ్జనులూ, స్వర్గమును పొందాలి. సత్యశూరులు, దానశూరులు రణశూరులు ఈర్ష్యలేనివాళ్ళు స్వర్గఫలాన్ని అనుభవించటానికి అధికారులు. నాస్తికులు, కాముకులు నరకానికివెళ్ళాలి. ఓదేవతలారా నేను చెప్పినదానినే మీరు చేయాలి.

అలాచేస్తే మీకు ఎప్పుడూ అపజయము ఉండదు. శంఖచక్రగదాధారియైన విష్ణువు ఈరీతిగాచెప్పి అంతర్ధానమయ్యాడు. ఇదిచూచిన దేవతల ఆశ్చర్యానికి హద్దులేదు. వరాహభగవానుని అత్యద్భుతకార్యములనుచూచి అతనికి నమస్కరించి స్వర్గానికి వెళ్ళిపోయారు. తమతమపనులు సక్రమంగా నెరవేరుస్తున్నారు. ఇంద్రుడు పర్వతాలను వాటిస్థానమందే ఉంచి తన వజ్రాయుధంతో వాటిరెక్కలను నరికివేశాడు. మహారాజా! ఈఇతిహాసం శుభకరమైనది. దీన్ని విన్న వాళ్ళు పవిత్రులౌతారు. ఈరీతిగా వరాహ భగవానుని చరిత్ర వినిపించాను. మహా వరాహరూపం ధరించిన నారాయణునకు నమస్కరించండి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరాహస్వామి అంతర్ధానముగుట అను నలభైవ అధ్యాయము

☆☆☆

# నలభై ఒకటవ అధ్యాయము

## నరసింహావతార కథ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! వరాహావతారచరిత్ర వినిపించాను ఇప్పుడు విష్ణుభగవానుని నృసింహావతార చరిత్ర వినిపిస్తాను- దీనిలో భగవంతుడు నరసింహరూపం ధరించి హిరణ్యకశిపుని సంహరించాడు. పూర్వం సత్యయుగంలో రాక్షసులలో మొదటివాడు హిరణ్యకశిపుడు మిక్కిలి ఘోరమైన తపస్సు చేసాడు. మొదట మౌనంతో నీటిలో నివసిస్తూ పదకొండువేల సంవత్సరాల ఐదువందల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతని శమదమాదిగుణాలను బ్రహ్మచర్యాది నియమాలనుచూచి బ్రహ్మ ప్రసన్నుడైనాడు. విమానంపై అతనివద్దకు వచ్చాడు. దేవతలందరూ అతనితో కూడా వచ్చారు.

బ్రహ్మ ఓసువ్రత! నీవునాకు గొప్పభక్తుడవు. నీ కఠోరతపస్సునకు నేను మిక్కిలి సంతోషించాను. నీకు శుభమగుగాక నీకుకావలసిన వరము అడుగు అన్నాడు. అప్పుడు రాక్షసశ్రేష్టుడు నాకు ఎక్కడా ఒకనిచేత ఎప్పుడూ మరణం

ప్రాప్తించకుండా వరమిమ్మన్నాడు. ఒక్కచేతిదెబ్బతో నన్ను చంపగలవానిచేతనే నేను చంపబడేట్లు వరమిమ్మన్నాడు. నేనే సర్వదేవతా స్వరూపుడను కావాలి. అన్నిదివ్యాస్త్రాలూ నన్ను సేవించాలి అని వరంకోరాడు. బ్రహ్మదేవుడు వత్సా! నీవు కోరిన అద్భుతవరాలన్నీ నీకు సిద్ధిస్తాయి. త్వరలోనే నీకోరికలన్నీ పూర్తవుతాయి అనిపలికి బ్రహ్మ బ్రహ్మర్షులతో తనస్థానానికి వెళ్ళాడు. దేవతలు ఋషులు గంధర్వులు మొదలగు వారందరూ బ్రహ్మవద్దకు వెళ్ళారు.

ఓపూజ్యుడా! నీవిచ్చినవరాలతో ఆరాక్షసుడు మదించి మమల్ని అందర్నీ చంపేస్తాడు. కనుక నీవు ప్రసన్నుడవై వాడి మరణానికి కూడా ఉపాయంచూడాలి అని ప్రార్థించారు. అప్పుడు బ్రహ్మ ఊరడిస్తూ తపస్సుకి ఫలం తప్పదు. తపస్సుకు తగినఫలం ఇవ్వాలి, పుణ్యం తరిగిపోగానే భగవంతుడు విష్ణునే స్వయంగా వాణ్ణి వధిస్తాడు. బ్రహ్మమాటలకు సంతోషించి దేవతలు తమతమ స్థానాలకి వెళ్ళి పోయారు. ఇక హిరణ్యకశిపుడు వరాలచే మదించి సమస్త ప్రాణులను బాధింప సాగాడు. ముల్లోకాలనూ జయించి తనగుప్పిట్లో పెట్టుకున్నాడు. స్వర్గంలో నివసిస్తూ రాజ్యంచేయసాగాడు. దేవతలయజ్ఞభాగాలకు దైత్యుల్ని అధికారులుగా చేశాడు. ప్రపంచమంతా అతని దుష్టప్రవర్తనచే బాధపడుతున్నది.

అప్పుడు దేవతలందర్లూ విష్ణుమూర్తిని శరణువేడారు. పరమాత్మా! దేవతలకు పరదేవతవు. బ్రహ్మదులను సృష్టించిన వాడవు నీవే. ఓప్రభూ! వరములచే గర్వించిన హిరణ్యకశిపుని సంహరించుముఅని ప్రార్థించారు. అప్పుడు భగవంతుడు దేవతాలారా! నేను మీకు అభయమిస్తున్నాను. మళ్ళీ మీకు స్వర్గరాజ్యం వస్తుంది. హిరణ్యకశిపునీ వానిసైన్యాన్నీ నశింపచేస్తాను అని పలికాడు. దేవతలను వదలి వెళ్ళాడు. అక్కడనుండి విష్ణువు హిమాలయపర్వత సమీపానికి వెళ్ళాడు అక్కడ కూర్చొని ఏరూపంధరించి యీరాక్షసుని చంపవలెనాఅని ఆలోచించాడు. చాలా ఆలోచించి చివరకు నరసింహ రూపం ధరించటానికి నిశ్చయించాడు. ఓంకారాన్ని కూడాబెట్టుకొని భగవంతుడు హిరణ్యకశిపుని వద్దకువెళ్ళాడు. నృసింహదేవుడు హిరణ్యకశిపుని మనోహరమైన సభలో ప్రవేశించాడు. అది పరమాద్భుతమైన ప్రదేశము పరమమనోహరముగా నున్నది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
నరసింహావతార కథ అను నలభైఒకటవ అధ్యాయము

☆☆☆

# నలభై రెండవ అధ్యాయము

## హిరణ్యకశిపుని వైభవము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత నృసింహస్వామి ఆసభ మధ్యలో మెరిసిపోతున్న బంగారు కుండలాలుధరించిన రాక్షసరాజు హిరణ్యకశిపుడు ఉత్కృష్టమైన సూర్యునివంటి ప్రకాశంగల ఆసనంపై వెలుగొందుతున్నాడు. మిక్కిలి పవిత్రము, సువాసనగల వాయువు మెల్లమెల్లగా వీస్తున్నది. గంధర్వులు అప్సరసలు లయ బద్ధంగా గానం చేస్తున్నారు. హిరణ్యకశిపుడు దివ్యాలంకారములతో శోభిస్తున్నాడు. అతని వెయ్యిమంది భార్యలు నలువైపులా నిలబడి ఉన్నారు. తక్కిన దైత్యులు అతనిసేవలో నిమగ్నులైఉన్నారు. 'బలి' మొదలుగాగల దైత్యుల చెవులకు ప్రకాశించే కుండలాలు, కంఠమందు పుష్పమాలు మనోహరంగా ఉన్నాయి. వాళ్ళందరూ వరాలు పొందినవాళ్ళే. అచటి రాక్షసులందరూ దివ్యాభరణ దివ్యవస్త్రవిభూషితులే. కొందరు విమానాలలో కూర్చుని అటూ ఇటూ తిరుగుతున్నారు. వాళ్ళ వాహన ములు ధ్వజములు మొదలగునవి మిక్కిలి విచిత్రంగా కనిపిస్తున్నాయి. విశేషంగా భుజం మీది భుజకీర్తి ఇంద్రధనుస్సనే భ్రాంతిని కలిగి స్తున్నది. ఆ సభలో అరుగు లన్నీ బంగరు నిర్మితములే. నిర్మలమైన బంగారుహారం ధరించి సూర్యసమానమైన తేజస్సు గలిగి వేలాది దైత్యులచే సేవించ బడుచున్న దైత్యరాజు హిరణ్యకశిపుని చూచాడు

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హిరణ్యకశిపుని వైభవము అను నలభైరెండవ అధ్యాయము

☆☆☆

# నలభైమూడవ అధ్యాయము

## ప్రహ్లాదుడు నరసింహ శరీరంలో ముల్లోకాలను చూచుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! పూర్ణచంద్రుని వలె ఉన్న పొట్టిజుట్టు గల నృసింహ భగవానుని చూచి హిరణ్యకశిపు మొదలగు దానవసమూహం ఆకాశం వలె, మల్లెపూవువలె,

చంద్రుడులాగా ఉన్న ఈవిచిత్రరూపాన్ని మనమెప్పుడు చూడలేదుఅని అనుకున్నది. ఇలా వాళ్ళు మాట్లాడుకొనుచుండగానే భగవంతుని దృష్టిపడి వాళ్ళంతా నశించారు. హిరణ్యకశిపుని పుత్రుడు ప్రహ్లాదుడు ఆదివ్యమూర్తిని దివ్యదృష్టితో చూచి దేవుడు వచ్చాడని తలచాడు. బంగారుపర్వతంలాంటి శరీరంగల ఆస్వరూపాన్ని చూచి హిరణ్యకశిపుడు తక్కిన దానవులూ ఆశ్చర్యపోయారు. ప్రహ్లాదుడు మహారాజ! ఈ నరసింహశరీరం ఎప్పుడూ చూడనిది. రాక్షసులను అంతమొందించటానికి ఈస్వరూపం వచ్చిందని అను కొంటున్నాను అన్నాడు. ఈనృసింహదేవుని శరీరంలో సర్వప్రాణులనూ చూస్తున్నాను అనుకొన్నాడు. సమస్త లోకాలను చూస్తున్నాని తలచాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ప్రహ్లాదుడు నరసింహ శరీరంలో సర్వలోకాలను చూచుట అను నలభైమూడవ అధ్యాయము

☆☆☆

# నలభైనాల్గవ అధ్యాయము

## రాక్షసులు నరసింహస్వామిని యెదిరించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! దైత్యరాజైన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని మాటలువిని సేవకుల గూర్చి ఓదానవ సంఘమా! ఈక్రొత్తరకం సింహాన్ని పట్టుకోండి. ఏదైనా సంశయము ఉంటే వెంటనే చంపివెయ్యండి అన్నాడు. దైత్యరాజుమాటలకు సంతోషించి దానవగణం మిక్కిలి ఆనందించింది. తమశక్తితో ఆసింహరూపాన్ని భయపెట్టారు. నరసింహస్వామి సింహనాదం చేసి నోరు తెరచిన యమునివలె ఆసభనంతను ధ్వంసంచేశాడు. అప్పుడు హిరణ్యకశిపుడు రోషంతో సింహంపై అస్త్రాలను ప్రయోగించాడు. అతడు ప్రయోగించని మహాస్త్రాలు లేవు ఆమహాస్త్రాలన్నీ ప్రజ్వలించే అగ్నికి సమర్పించిన ఆహుతి అయ్యాయి. ప్రజ్వలిస్తున్న అస్త్రాలతో రాక్షసరాజు ఆవరించాడు. హిమవత్పర్వతంమీద సూర్యకిరణములు ఆవరించినట్లున్నది హిరణ్యకశిపుని పని. రాక్షససైన్యం అనేకా యుధాలతో సింహాన్ని ముంచెత్తినాయి. రాక్షసులందరూ చుట్టుముట్టి అనేక మహాయుధాలను సింహముపై ప్రయోగించారు. అందరూ కలిసి అతనిపై యుద్ధం చేసినా ప్రతాపవంతుడైన భగవంతుడు కదలలేదు. అగ్నివంటి నరసింహస్వామి తేజస్సుచేత తాపాన్ని పొంది భయంతో

గాలిచేకొట్టబడిన సముద్రపుకెరటాలవలె చలించిపోయారు. ఒకే స్థానమందు నిలుచుని వందధనుస్సులతో భయంకరములైన బాణాలను నరసింహ స్వామిపై ప్రయోగించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వము
రాక్షసులు నరసింహస్వామిని యెదిరించుట అను నలభైనాలుగవ అధ్యాయము

☆☆☆

# నలభైఐదవ అధ్యాయము

## నరసింహస్వామి ప్రతాపము

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజా! ఆసైనికులలో కొందరు గాడిద రూపం కలవాళ్ళు మొసలిముఖం కలవాళ్ళు సర్పముఖంకలవాళ్ళు కోతిముఖం కలవాళ్ళు మూడుతలలు కలవాడు ఇలా వికృతరూపంగల రాక్షసులు చాలామంది ఉన్నారు. వాళ్ళందరూ మదించి నృసింహ భగవానునిపై బాణవర్షం కురిపించారు. భగవంతునకు ఏమీ బాధ కలుగలేదు. ఆరాక్షసులు నృసింహభగవానుని శరీరంలో లీనమైపోయారు. నిష్ఫలంకాగా చక్రాయుధాలు ప్రయోగించారు. నృసింహస్వామి నోరుతెరిచి ఆచక్రాల నన్నిటినీ మింగివేశాడు. ఇదిచూచి హిరణ్యకశిపుడు ఒకగొప్ప 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. నృసింహభగవానుడు దాన్ని హుంకారంచేత ముక్కముక్కలు చేశాడు. అప్పుడు నృసింహదేవుడు తనధనుస్సు నుండి బాణవర్షం కురిపించాడు. తరువాత నృసింహస్వామి గర్జించగా భయపడి దైత్యసైన్యం పారిపోయింది. తరువాత వాళ్ళు ఆకాశంనుండి రాళ్ళను వర్షించారు. దానవ సమూహం ఈవిధంగా ఎన్నిప్రయత్నాలు చేసినా నృసింహదేవుని కదిలించ లేకపోయారు. రాళ్ళవర్షం తర్వాత జలవర్షం ప్రారంభమైంది. ఆకాశమంతా జలధారలతో నిండి పోయింది. అయినా నృసింహ భగవానుని శరీరాన్ని తాకలేదు. శిలాజల వర్షాలు రెండు వ్యర్థంకాగా దానవులు మాయాబలంతో అగ్నిని వాయువునూ సృష్టించారు. కాని అవీవ్యర్థమయ్యాయి. తరువాత చీకటిని సృష్టించారు. నృసింహదేవుడు తనతేజస్సుయొక్క ప్రభావంతో సూర్యునివలె కాంతినిధరించాడు. దానవులు భగవంతుని నుదుటిపై బొమముడిపాటును చూచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
నరసింహస్వామి ప్రతాపము అను నలభైఐదవ అధ్యాయము

☆☆☆

# నలభైఆరవ అధ్యాయము

## రాక్షసులకు అపశకునాలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! రాక్షసులు తమమాయలన్నియూ వ్యర్థములుకాగా అందరూ హిర్ణ్యకశిపుని శరణుపొందారు. అప్పుడు కోపంతో మండిపడుతూ హిరణ్యాకశిపుడు భూమిని కదిపివేశాడు. సముద్రాలు కల్లోములయ్యాయి. వనములతో కూడిన పర్వతాలు కదిలాయి. జగత్తంతా చీకటిఅయింది. ఆకాశంలో సంచరించు వాయువులు ఏడునూ కలతచెందాయి. గ్రహనక్షత్రాలతో కూడిన ఆకాశం మండి పోయింది. సూర్యుడు కాంతిలేనివాడయ్యాడు. ఇలా అనేకానేక అపశకునాలు కనిపించాయి. అప్పుడు దైత్యరాజైన హిరణ్యాకశిపుడు ఈఉత్పాతాలన్నీ ఒకసారిగా ఎందుకు బయలుదేరాయని గురువైన శుక్రాచార్యుని అడిగాడు. శుక్రాచార్యుడు ఓదైత్యరాజా! ఈ ఉత్పాతాలవల్ల రాజ్యం త్వరగానశిస్తుంది. లేదా రాజు బంధింప బడతాడు. కనుక ఈఉత్పాతాలు నశించేపని చెయ్యలేకపోతే పెద్ద ఆపద సంభ విస్తుంది. అనిచెప్పి నీకు శుభం కలుగుగాక అని ఇంటికి వెళ్ళిపోయాడు. హిరణ్యా కశిపుడు దీనుడై చాలాసేపు ఆలోచించి ఈఉత్పాతాలు నానాశానికీ దేవతల విజయానికే ఏర్పడ్డాయి. అని విచారించి కోపంతో దంతాలు పటపటా కొరుకుతూ గదతీసుకొని భూమిని కంపింపచేస్తూ పరుగెత్తాడు. లోకమంతా అల్లకల్లోల మయింది. రుద్రగణంకూడా అతని కోపానికి కంపించిపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
రాక్షసులకు అపశకునాలు అనునలభైఆరవ అధ్యాయము

☆☆☆

# నలభైఏడవ అధ్యాయము

## నృసింహుడు హిరణ్యాకశిపుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలో ఆదిత్యాది దేవగణాలు అందరూకలిసి నృసింహహ దేవుని సమీపానికి వచ్చారు. దేవతలు భయపడుతూ దైత్యనాశనుడవైన ఓదేవా! దుష్టునడువడిగల హిరణ్యాకశిపుని ఇతరదైత్యులతోకూడా సమూలనాశంచెయ్యండి.

నీవు తప్ప ఇతన్ని నశింపచేయగలవాడులేడు. లోకకల్యాణంకోసం వీనిని త్వరగా సంహరించుము. దేవతలమాటలువిని ఘోరమైన సింహనాదం చేశాడు. పెద్దపెద్ద రాక్షసులు గుండెలు బ్రద్దలై పడిపోయారు. కాలకేయాది రాక్షసగణం శూలాలతోరాగా మదించిన హిరణ్యకశిపుడు భగవంతునివైపు వేగంగా వెళ్ళాడు. అప్పుడు నృసింహ స్వామి పదునైనగోళ్ళతో ఓంకారసహాయంతో చీల్చబడి దైత్యరాజు మరణించాడు. దితిపుత్రుడైన హిరణ్యకశిపుని మరణంచేత సమస్తప్రపంచం సంతోషించింది. తపోధనులు అనేక స్తోత్రములు చేశారు. దేవతలు జ్ఞానలు యీనరసింహశరీరాన్నే పూజిస్తారు. మునులు నిన్ను 'మృగేంద్ర' అని గానంచేస్తారు. నీఅనుగ్రహంవల్ల మా స్థానాన్ని మేంపొందగలిగాం. అని పలికారు. దేవతలు బ్రహ్మదేవుడు మిక్కిలి సంతోషించి భగవంతుని స్తోత్రంచేశాడు.

బ్రహ్మ ఈవిధంగా స్తోత్రం చేశాడు.

శ్లో॥ భవానక్షరమవ్యక్తమచింత్యం గుహ్యముత్తమమ్।
కలాటస్థమకృతం కర్మ సనాతనమనామయమ్॥
సాంఖ్యయోగేచయ బుద్ధి స్తత్వార్థపరినిష్ఠితా।
భగవాన్వేదవిద్యాత్మాపురుష శ్శాశ్వతోధ్రువః॥
త్వంవ్యక్తశ్చతథాఽవ్యక్తస్త్వత్తస్సరమిదంజగత్।
భవస్మయోవయందేవ భవానాత్మాభవాన్ప్రభుః॥
చతుర్విభక్తమూర్తిస్త్వం సర్వలోకవిభుర్గురుః।
చతుర్యుగసహస్రేణ సర్వలోకాన్తకాన్తకః॥
ప్రతిష్ఠా సర్వభూతానాం అనంతబలపౌరుషః।
కపిలప్రభృతీనాంచ యతీనాంపరమాగతిః॥
అనాదిమధ్యనిధనః సర్వాత్మా పురుషోత్తమః।
స్రష్టాత్వం త్వంచసంహర్తా త్వమేకోలోకభావనః॥
భవాన్ బ్రహ్మచరుద్రశ్చ మహేంద్రోవరుణోయమః।
భవాన్కర్తా వికర్తాచ లోకానాంప్రభురవ్యయః॥
పరాంచ సిద్ధింపరమంచదేవం పరంభమంత్రం పరమంమనశ్చ।
పరంచధర్మం పరమంయశశ్చత్వామాహురగ్ర్యం పురుషంపరాణమ్॥
పరంచసత్యంపరమం హవిశ్చపరిపవిత్రం పరమంచమార్గమ్।
పరంచయజ్ఞం పరమంచహోత్రం త్వామాహురగ్ర్యం పురుషంపురాణం॥

పరంశరీరం పరమంచధామ పరంచియోగం పరమాంచవాణీమ్।
పరంరహస్యం పరమాంగతించ త్వామాహురగ్ర్యం పురుషంపురాణం॥
పరపరస్యావపరంచ యత్పరం పరంపరస్యాపి పరంచదేవమ్।
పరంపరస్యాపి పరంప్రభుంచత్వామాహు రగ్ర్యం పురుషంపురాణమ్॥
పరంపరస్యాపి పరంప్రధానం పరంపరస్సాపి పరంచతత్త్వమ్।
పరంపరస్యాపిపరంచధాతాత్వామాహురగ్ర్యం పురుషంపురాణమ్॥
పరం పరస్యాపి పరంరహస్యం పరం పరస్యాపి పరంపరంయగ్।
పరంపరస్యాపి పరంతపోయత్త్వామాహురగ్ర్యం పురుషంపురాణమ్॥
పరంపరస్యాపి పరంపరాయణం పరంచగుహ్యంచపరంచధామ।
పరంచయోగంపరమం ప్రభుత్వం త్వామాహురగ్ర్యం పురుషంపురాణం॥

ఈవిధంగా స్తోత్రంచేసి బ్రహ్మతన లోకానికి వెళ్ళాడు. తరువాత వాద్యాలు మ్రోగుతుండగా అప్సరసలు నాట్యంచేస్తుంటే భగవంతుడు క్షీరసముద్రం ఉత్తరపు ఒడ్డుకువెళ్ళాడు. నరసింహ శరీరాన్ని విడిచి పూర్వపురూపాన్ని ధరించి గరుడునిపై కూర్చుని వెళ్ళాడు. ఈవిధంగా హిరణ్యాకశిపువధ జరిగింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
నృసింహుడు హిరణ్యకశిపుని చంపుట అను నలభైఏడవ అధ్యాయము

☆☆☆

# నలభైఎనిమిదవ అధ్యాయము

## బలిచక్రవర్తి పట్టాభిషేకము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! విష్ణుభగవానుని నరసింహావతారకథ వినిపించాను. ఇప్పుడు భగవంతుడు వామనరూపం ధరించి మూడుఅడుగులతో బలినుండి మూడు లోకాల రాజ్యాన్ని ఇంద్రునికి తిరిగి ఇప్పించిన కథను చెపుతున్నాను. నువ్వు ఏకాగ్రతతో విను- అనగానే జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! సర్వసమర్థుడైన భగవంతుడు వామనరూపాన్ని ఎందుకు ధరించాడు? దేవతలకు అధినాయకుడైన మహాప్రభువు దేవమాతకు ఎట్లుజన్మించి ఎలా వాముడయ్యాడు? ఆమహాత్ముని జన్మ వృత్తాంతమంతా విస్తరంగా చెప్పండి అనిఅడిగాడు. అప్పుడు వైశంపాయను డిలా చెప్పాడు.

మహారాజా! పూర్వకవులు బ్రహ్మ బ్రాహ్మణసమూహము ఋషులూ చెప్పిన దివ్యకథను చెపుతున్నాను విను. జనమేజయరాజా! కశ్యపప్రజాపతికి దితి, అదితి అని ఇద్దరుభార్యలు. అదితికి ధాత, అర్యమ మొదలైనవాళ్ళు పుట్టారు. దితికి బలవంతులైన హిరణ్యాకశిపుడు, హిరణ్యాక్షుడు పుట్టారు. హిరణ్యాకశిపుడికి ప్రహ్లాదుడు మొదలైన ఐదుగురు పుత్రులు జన్మించారు. ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు, వాడికొడుకు బలి. తరువాత ఆతనివంశం పుత్రపౌత్ర క్రమంగా మిక్కిలి ప్రకాశమానంగా పెరిగింది. వాళ్ళసంఖ్య చెప్పశక్యమైనదికాదు. నృసింహ దేవునిచేత హిరణ్యాకశిపు చంపబడ్డాడని విని దైత్యులందరూ దేవతలను చంపటానికి విరోచనపుత్రుడైన బలిని రాజుగాచేశారు.

బలి అనేక సద్గుణములు కలవాడు. జితేంద్రియుడు. మహాప్రతాపశాలి. అతని గొప్పగుణాలనుబట్టి పట్టాభిషిక్తునిచేశారు. బ్రహ్మకూడ హిరణ్యాకశిపు స్థానంలో బలిని నియమించాడు. దైత్యులందరూ అతన్ని రాజైన పిమ్మట జయ జయధ్వానాలతో అభినందించారు. దానవులందరూ అతనికి నమస్కరించి దైత్యేంద్రా! మూడులోకాలూ హిరణ్యాకశిపుని చేతిలో ఉండేవి. అతన్ని చంపి విష్ణువుచే ఇంద్రునికి మూడులోకాలరాజ్యం ఇవ్వబడింది. కనుక తాత రాజ్యాన్ని తిరిగి నీవుపొందాలి. వేలాది రాక్షసులు ఎప్పుడూ నీకు సహాయంగా ఉంటారు. నీవు అమిత బలవంతుడవు కాబట్టి దేవతలనందరనూ ఇంద్రునికూడా ఓడించి నీగొప్పగుణముల చేత తాత హిరణ్యాకశిపుని స్థానాన్ని రక్షించు. అని బలికి తెలియచెప్పారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలిచక్రవర్తి పట్టాభిషేకము అను నలభైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# నలభైతొమ్మిదవ అధ్యాయము

## దేవతలపై యుద్ధానికి సన్నాహము

వైశంపాయనుడిలా చెప్పాడు,

మహారాజా! మహాబలశాలి బుద్ధిమంతుడు అగు బలియుద్ధం దురదగల రాక్షసుల మాటలువిని సంతోషించాడు. ఆక్షణంలో కోట్లకొలది రాక్షసులకు మీరంతా ఇప్పుడే సిద్ధమైరండి. అని ఆజ్ఞ ఇచ్చాడు. నేను త్వరగా మూడులోకాల

రాజ్యాన్నిజయిస్తాను అన్నాడు. రాక్షసులందరూ యుద్ధప్రయత్నంలో నిమగ్నులయ్యారు. బలవంతులైన నికుంభ మహాపద్మ కుంభకర్ణాది మరీచి సంతానమైన మహారాక్షసులు ఇంకా ఇతర రాక్షసులుకూడ యుద్ధంకొరకు బయల్దేరారు. వాళ్ళందరూ దివ్యవస్త్రాలు ధరించి గంధంపూసుకొని దివ్యకవచాలు తొడుకొని, దివ్యాస్త్రధారలయ్యారు. వాళ్ళ దివ్యములైన జండాలు ఆకాశంలో రెపరెపలాడుతున్నాయి. అందరూ పెద్దగా గర్జిస్తున్నారు. వాళ్ళరథాలు కదులుతూ ఉంటే భూమి కంపిస్తోంది.

వెయ్యి భుజాలుగల బలిపుత్రుడైన బాణాసురుడు కోటి రథికులైన సైనికులను తీసుకొని యుద్ధసంనద్ధుడయ్యాడు. అందరూ మాయావులు అస్త్రశస్త్ర నిపుణులు దేవసేనను సంహరించటానికి దైత్యరాజు బలిచక్రవర్తి ఎక్కిన రథం అంతా బంగారువెండితో తయారైనది. ఆరథం గరుడుని ఆకారంలో ఉంది. అనాయుషుడను మహారాక్షసుడు లక్షరథాలతో చుట్టబడి రథంమీద కూర్చున్నాడు. బలితలపై బంగారుకిరీటం మిక్కిలిశోభతో ఉంది. నముచి అనే రాక్షసునితో 60వేలమంది రథాలపై యుద్ధసంనద్ధులైయ్యారు. నముచిరథంరత్నాలతో అలంకరింపబడింది. దానియందు అనేక శస్త్రాస్త్రాలున్నాయి. సింహచిహ్నాంగల జండా రెపరెపలాడుతూ మనోహరంగా ఉంది. దానిపై బయటకు వచ్చాడు. మయుడుకూడ ఇంటినుండి బయటకు వచ్చాడు. అతని రథంబంగారంతో నిర్మింపబడి మణులతో అలంకరింపబడి సువిశాలంగా ఉంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దేవతలపై యుద్ధానికి సన్నాహము అను నలభైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఏభైయవ అధ్యాయము

## ప్రహ్లాద శంబరాదుల యుద్ధయాత్ర

వైశంపాయనుడిలా చెప్పాడు:

మహారాజ! పులోముడను మహారాక్షసుడు చీకటితో నిండిన గుహవంటి లోహ నిర్మితమైన రథంపై కూర్చున్నాడు. ఆరథంలో అన్నివిధాలైన ఆయుధాలు సిద్ధం చేయబడి ఉన్నాయి. ఆరథంమీద యుద్ధానికివచ్చాడు. అరవైరథాలు అతనికి సహాయంగా వెనుక యోధులతో వస్తున్నాయి. పులోముడు బంగారం పూతగల

ఒకమహాగదను చేతపట్టుకొన్నాడు. హయగ్రీవుడనే రాక్షసుడు లక్షమంది అసురులతో చుట్టబడి భయంకరరథంమీద యుద్ధానికి బయల్దేరాడు. అనేక యజ్ఞాలు చేసిన ప్రహ్లాదుడుకూడా యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఆరాక్షసులందరి కోలాహలము అకాలంలో ముసిరిన మేఘసమూహంలా భయంకరంగా ఉంది. వేలాదిరాక్షసులతో ప్రహ్లాదుడు దేవతలతో చుట్టబడిన బ్రహ్మవలె ప్రకాశించాడు. ప్రహ్లాదుడు యుద్ధానికి బయలుదేరగా లక్షలాది రాక్షసులు అతని వెనుకనడిచారు. అందరూ వాళ్ళు బంగారుకవచాలు ధరించారు. రత్నాలుపొదిగిన భూషణాలున్నాయి. ప్రహ్లాదుడు జితేంద్రియుడు. అగ్నివాయువులవంటి పరాక్రమంగలవాడు. సర్వ యుద్ధ విశారదుడు మాయావియైన శంబరాసురుడు ఒక దివ్యరథంపై బయల్దేరాడు. ఉజ్వలమైన కవచం ధరించాడు. విచిత్రమైన యుద్ధములలో నేర్పుగల రాక్షసులు అతని వెనకనడిచారు. తేజశ్శాలియైన అతడు రథమెక్కి బయల్వెడలాడు. ఆరథానికి నలువైపులా అనేక విధాలైన పక్షులచిత్రాలు ఉన్నాయి. ఆరథం యొక్క ధ్వనీ, వేగమూ భయంకరంగా ఉంది. ఆరథముపై శంబరాసురుడు మిక్కిలి ప్రకాశిస్తున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ప్రహ్లాద శంబరాదుల యుద్ధయాత్ర అను ఏభైయవ అధ్యాయము

☆☆☆

# ఏభైఒకటవ అధ్యాయము

## బలియుద్ధ ప్రయత్నము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత హిరణ్యకశిపుపుత్రుడు, శత్రునగరాలను జయించిన వాడుఅగు ఆప్రహ్లాదుడు యుద్ధమందు ఉత్సాహంతో రథంపై కూర్చుని బయల్దేరాడు. పర్వతాలతో వనాలతోకూడిన భూమి కంపించింది. పెద్దగాగర్జిస్తూ దైత్యసమూహములు అతనిని అనుసరించివెళ్ళాయి. వాళ్ళచేతుల్లో అనేకవిధాలైన ఆయుధాలు ప్రకాశిస్తున్నాయి. రథాలతో కవచాలతో మహారాక్షసులు యుద్ధానికి సిద్ధమయ్యారు. బలి యొక్కతండ్రి విరోచనుడు రథంపైకూర్చుని రెండవ మేరు పర్వతంవలె ప్రకాశించాడు. విరోచనుని తమ్ముడు కుజంభుడను రాక్షసుడు చాలా వేలరథాలతో చుట్టబడి మదబల గర్వితులైన రాక్షసులు అనేకవిధములైన

ఆయుధాలతో వెంటరాగా గొప్పకిరీటంలో ప్రకాశిస్తూ అన్నివిధాలైన రత్నాలు పొదిగిన కవచంధరించి చంద్రునిలా ప్రకాశిస్తూ తాటిచెట్టు జండాగుర్తుగా గలవాడై వేగంగా యుద్ధానికి వచ్చాడు.

అపిలోముడు దారుణమైనశరీరము ముఖమూకలిగి బండిచక్రాలంతటి కళ్ళతోకూడి కిరీటాన్నిధరించి వేలాదిదైత్యులతో కూడా వచ్చాడు. అనాయుష పుత్రుడైన వృత్రుడుఅనే రాక్షసుడు కిరీటాన్నిధరించి మాహామాయావియై వెయ్యి గుర్రాలతో కూడిన రథాన్నిఎక్కి యుద్ధాభిముఖుడైనాడు. ఆయుధాలతో ప్రకాశిస్తున్న చేతులుగల ఆరాక్షసులు రెక్కలతోకూడిన గొప్ప పర్వతాలవలె ఉన్నారు. హేమమాలి, సింహికాపుత్రుడైన రాహువు, విప్రచిత్తి, శంకుకర్ణుడు. ఇంకా ఎందరెందరో మహావీరులైన దైత్యులు యుద్ధానికి సంసిద్ధులయ్యారు. జపాలచేత మంత్రాలచేత ఓషదులచేతనూ శుభం కలగాలని వృద్ధులు కోరారు. బలి బ్రాహ్మణులకు ధనమిచ్చి కుబేరునివలె ప్రకాశించాడు. అతనిరథం అగ్నిలా ప్రకాశిస్తోంది. క్రిక్కిరిసిన వీరుల రథాలతో వేగంగా దేవతలను ఎదుర్కొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలియుద్ధ ప్రయత్నము అను ఏభైఒకటవ అధ్యాయము

☆☆☆

## ఏభైరెండవ అధ్యాయము

## ఇంద్రాది దేవతలు యుద్ధానికి సిద్ధపడుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! నీకు దైత్యసేనయొక్క విస్తారవృత్తాంతంబాగా చెప్పాను. ఇక ఇప్పుడు దేవసేనయొక్క విస్తారవిషయం చెపుతున్నాను విను. ఇటువైపు ఇంద్రుడు మరుద్గణ, ఆదిత్యగణ, విశ్వేదేవగణ, సాధ్యగణ మొదలగువారితో ఓమహాత్ములారా! మీరందరు దైత్యులను నాశంచెయ్యటానికి సిద్ధంకండి అనిచెప్పాడు. దేవతలు తయారవటం ప్రారంభించాడు. అనేకవిధాలైన కవచాలు ధరించి అనేకవిధాలైన ధ్వజాలతో శస్త్రాస్త్రము లను ధరించి, ఏనుగులమీద కొందరు, రథాలమీద కొందరు ఇంకా అనేకవిధాలైన వాహనాలపై కూర్చున్నారు. ఇంద్రుడు ఐరావతం గుర్తుగల రథంమీద కూర్చుని యుద్ధానికి బయల్దేరాడు. ఆరథంపూల దండలతో అలంకరింపబడింది. సూర్యునివంటి కాంతిగల కిరీటాన్ని బంగారు మాలను ధరించి

చిత్రమైన కవచంధరించి రథంపైకూర్చుని వజ్రాయుధాన్నిశక్తి మొదలగు దివ్యాయుధాలను తీసుకొని యుద్ధానికి బయల్దేరాడు.

ఇంద్రుడు ఒకవిచిత్రమైన పెద్దపులిచర్మాన్ని కూడా తెచ్చుకున్నాడు. అత్రి వసిష్ఠాది ఋషులు ఆశీర్వదించి స్తోత్రచేశారు. విశ్వేదేవాది గణములు ఆతని వెనుకనడిచాయి. ధనాధ్యక్షుడు కుబేరుడు గద తీసుకొని రథంమీద యుద్ధానికి నడువసాగాడు. గొప్ప గొప్పయక్షులు గదపట్టుకొని కుబేరుని రక్షిస్తున్నారు. యముడు వందగుర్రాలు పూన్చిన రథంపై కూర్చుని శస్త్రాస్త్రములు ధరించి ముందుకు నడిచాడు. ఈవిధంగా ధాత, అర్యమ మొదలగు దేవతలు రథాలపై కూర్చుని బయల్దేరారు. అశ్వినీకుమారులు బంగారురథంమీద యుద్ధానికి బయల్దేరారు. వసుగణము అనేకవిధాలైన వాహనాలమీద యుద్ధానికి కదిలారు. రుద్రగణం ఎద్దులమీదకూర్చుని కదిలారు సాధ్యదేవగణం ఆకాశమార్గంగా నడిచారు. ఇంద్రుడు వాళ్ళను పూజించాడు. మహారథులైన దేవతలు దేవరాజైన ఇంద్రునికి నలువైపులా సింహనాదాలుచేస్తూ అసురులవధకై యుద్ధానికి నడిచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఇంద్రాది దేవతలు యుద్ధానికి సిద్ధపడుట అను ఏభైరెండవ అధ్యాయము

☆☆☆

# ఏభైమూడవ అధ్యాయము

## సనకాది మునుల రాక

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత రెండుపక్షాలసేనలూ యుద్ధభూమికిచేరి ఆశ్చర్యకరమైన ఘోరయుద్ధం చేయసాగారు. అనేకములైన ఆయుధాలతో చెట్లతోనూ కొట్టుకుంటూ భయంకరంగా గర్జించసాగారు. తరువాత ద్వంద్వయుద్ధం ప్రారంభమయింది. సావిత్రుడు బాణునితో, ఏకవసువు బలునితో వాసుదేవుడు పులోమతో మూయు యుద్ధంచేశారు. ధరుడు నముచితో విశ్వకర్మమయునితో హయగ్రీవుడు పూషతో, శంబరాసుడు భగునితో యుద్ధంచేయసాగారు. విరోచనుడు విష్వక్సేనునితో కుజంభుడు అంశునితో యుద్ధంచేశారు. రాహువు అజైకపాదునితో బలుడు వృత్రాసురుని సోదరునితో కేశికుబేరునితో యుద్ధంచేశాడు. ప్రహ్లాదుడు తన కుమారులు కాలునితో బలిఇంద్రునితో మిగిలిన దేవతలు దానవులూ

పరస్పరం యుద్ధంచేశారు. గొప్పఅపశకునాలు కనిపించాయి. దేవతలకు అపజయం కనిపిస్తున్నది. బ్రహ్మదేవతలతోకూడి ఆయుద్ధాన్ని తిలకించాడు. ఆబ్రహ్మదేవుని పులహపుల స్త్యాదులు స్తోత్రం చేస్తున్నారు. అందరూ ఆయుద్ధంచూడటానికి ఉత్సాహంతో వెళ్ళారు. నారాయణుడు వరుడు ఇతరదేవతలూ కనబడకుండా ఆయుద్ధాన్ని చూస్తున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సనకాది మునుల రాక అను ఏభైమూడవ అధ్యాయము

☆☆☆

# ఏభైనాల్గవ అధ్యాయము

## సావిత్ర ధ్రువులు ఓడిపోవుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈప్రకారంగా రెండుపక్షాల సైన్యాలూ భయంకరంగా యుద్ధం చేశాయి. వీరసమూహంయొక్క సింహనాదాలతో మూడులోకాలూ కంపించి పోయాయి. యుద్ధవాద్యాలు మ్రోగుతున్నాయి. క్రమంగాయుద్ధం భయంకరమైంది. వీరులను సంతోషపెట్టే స్వర్గమందలి ధ్వనులు వినిపిస్తున్నాయి. దేవతలమృత శరీరాలతో ఆయుద్ధం భయంకరమైనయజ్ఞంలా వృద్ధిచెందింది. దానవులు ఆనందంతో గర్జిస్తూ సోమపానంచేసినట్లు రక్తపానంచేస్తున్నారు. దైత్యరాజైన బలిదేవతలను ఓడిస్తే అవబృథస్నానం చేసినట్లువుతుంది. రాక్షసులు ముల్లోకాలనూ తమవశంచేసుకోటానికి ప్రాణాలొడ్డి యుద్ధదీక్ష వహించారు. దేవదానవ దైత్యవీరుల భయంకరకోలాహం నలువైపులా మార్మోగింది. దేవదానవ సైనికులు రణరంగంలో చేసిన యుద్ధం వర్ణింప శక్యంకానిది. వృషభాక్షుడు దేవసేనముందు సంచరించు తున్నాడు. కాల్బలంయొక్క కాళ్ళనుండిలేచిన ధూళి ఆకాశాన్ని కప్పివేసింది.

కొద్దిక్షణాలతరువాత దేవదానవులు అనేకవిధాలైన ఆయుధాలతో యుద్ధం చేయసాగారు. రెండుపక్షాల యోధులూ బాణవర్షం కురిపించారు. ఆసమయంలో దైత్యరాజు బాణాసురుడు సావిత్రునిబాణాలతో కప్పివేశాడు. తరువాత అతన్ని చంపాలని ఒకబాణాన్ని చేతపట్టాడు. దానితో దేవసేనా సముద్రాన్ని శోషింప చేస్తున్నాడు. ఇటుసావిత్రదేవుడు బలిపుత్రుడైన బాణాసురునిపై గొప్ప 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. బాణాసురుడు దాన్ని క్షురప్రమనే బాణంతో

మధ్యలోనే ఖండించాడు. సావిత్రదేవుడు ఖడ్గంతో బాణాసురునకెదురుగా వెళ్ళాడు. బాణాసురుడు బాణవర్షంతో శత్రువను ముంచెత్తాడు. అప్పుడు యుద్ధభూమి నుండి సావిత్రుడు పారిపోయాడు. బాణాసురుడు రథంనుండిదిగి గదచేతబట్టి ధ్రువవసువును కొట్టగా వసువులు పారిపోయారు. దేవతలు భయపడ్డారు. బలాకుడనే రాక్షసునిచే ఓడింపబడి ధ్రువుడు రథం విడిచిపెట్టి భయంతో కనపడకుండా పోయాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సావిత్ర ధ్రువులు ఓడిపోవుట అను ఏభైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ఏభైఐదవ అధ్యాయము

## రాక్షస ప్రముఖుల పరాజయము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత ధరుడికి రాక్షసశ్రేష్ఠుడైన నముచికి భయంకరమైన యుద్ధం జరిగింది. ధరుడు విశాలమైన ధనుస్సు నెక్కు పెట్టి భయంకరమైన బాణ వర్షం కురిపిస్తూ ప్రాణాలొడ్డి యుద్ధంచేశాడు. నముచి నవ్వుతూ వేగంగా పదునైన బాణాల్ని ప్రయోగించాడు. నముచి, ధరుని బాణాలతో ముంచెత్తాడు. వాళ్ళ యుద్ధరీతిచూచి దేవతలు భయంతో కంపించారు. ఇద్దరూ గర్జించ నారంభించారు. తోకచుక్కలు కనిపించాయి. క్షణకాలం తర్వాత దేవతల యొక్క మరణించిన గుర్రాలతో ఏనుగులతో యుద్ధభూమిఅంతా నిండిపోయింది.

తరువాత నముచి వసువుపై ప్రజ్వలిస్తున్న చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ధరుడు చక్రాయుధంతో అతని రథము భస్మమైంది. అతడు పారిపోయాడు అప్పుడు నముచి గర్వానికి హద్దులేదు. ఆగర్వంతో దేవసేనపై పడ్డాడు. దేవశిల్పి విశ్వకర్మకు మహాయుద్ధనిపుడు మయుడికి యుద్ధం జరిగింది. త్వష్టవాడిబాణా లతో బలగర్వితుడైన మయుని బాధించాడు. మయుడుకూడ అట్లే త్వష్టను బాధించాడు. త్వష్టశక్తి అనేగొప్ప అస్త్రాన్ని దైత్యరాజుపై ప్రయోగించాడు. దానిని ఏడుబాణాలతో మయుడు ఖండించాడు. తరువాత త్వష్టబంగారు పిడిగల బాణాలను మయునిపైన ప్రయోగించగా అతడు బాధతో పెద్దగా అరచాడు. మరల మయుడనేక బాణాలను ప్రయోగించగా వాటిని త్వష్ట ఖండించాడు.

తరువాత మయుడు గదను విసరగా త్వష్టగుర్రాలు మరణించాయి. రెండు బాణాలతో త్వష్ట ధ్వజాన్ని ముక్కలుచేశాడు. అతని సారథినికూడ చంపివేశాడు.

తరువాత మయుడు తీవ్రములైన పధ్నాలుగుబాణాలను ప్రయోగించాడు. అందుకు ప్రతిగా త్వష్టకూడ పధ్నాలుగుబాణాలను ప్రయోగించాడు. తరువాత మూడుబాణాలు త్వష్టపై విడువగా త్వష్ట సిగ్గుపడి బాధపడుతూ యుద్ధభూమినుండి వెళ్ళిపోయాడు. విశ్వకర్మ కోరలుతీసిన పాములా మిక్కిలి విచారపడ్డాడు. మయుడు ఆనందించాడు. బలగర్వితుడైన పులోముడు యుద్ధభూమికి వచ్చాడు. మయునితో సమానుడైన వాయుదేవుడు అతనితో యుద్ధానికిదిగాడు. పులోముడు సూర్యుడుకూడ కనపడకుండునట్లు బాణాలు ప్రయోగించాడు. రోషంచే ఎర్రబడిన కన్నులతో వాయుదేవుడు బుసగొట్టే సర్పంలాగా ప్రకాశించాడు. పులోముడు ప్రయోగించిన బాణాలన్నీ వ్యర్థమయ్యాయి. వాయుదేవుడు పులోమునిపై తొమ్మిది బాణాలను శక్తికొలది విసిరాడు.

వాయుదేవుని వీరత్వమునుచూచి పులోముని సైనికులు మిక్కిలికోపించి వాయుదేవునిపైకి పరుగెత్తారు. వాళ్ళువాయుదేవునిపై బాణాలు ప్రయోగించారు. ఏడుగురు రాక్షసులు వాయుదేవుని బాధింపసాగారు. వాయుదేవుడు వాటిని లెక్క చేయక ఆరక్కసుల తలల మీద చేతితోకొట్టాడు. వాళ్ళందరూ స్మృతిలేని వాళ్ళయ్యారు. రక్తంతోతడిసిన శరీరం కలవాళ్ళై నేలకొరిగారు. యుద్ధభూమిలో రక్తంనదిగా ప్రవహిస్తున్నది. పులోముని లెక్కలేని సైనికులు గద, రోకలి తీసుకొని వాయుదేవుని కొట్టారు. తరువాత వాయుదేవుడు తన పరాక్రమం చేత ఎనిమిది వందల దైత్యులను సంహరించాడు.

ఒకవైపు పరాక్రమవంతుడైన హయగ్రీవుడనే రాక్షసుడు 'పూష' దేవునితో యుద్ధంచేస్తూ సింహనాదం చేశాడు. హయగ్రీవుడు ధనుస్సు నెక్కుపెట్టి క్రోధంతో పూషవైపు బాణాలను వర్షం కురిపించాడు. హయగ్రీవుడు కూడ బాణవర్షంతో పూషనుముంచెత్తాడు. పూషదేవుని ధనుస్సునుండి వెడలిన బాణాలు ఆకాశాన్ని కప్పివేశాయి. కాని హయగ్రీవుని బాణాలచే ఆబాణాలు ఖండింపబడ్డాయి. సూర్యునితో సమానమైన బాణాలతో హయగ్రీవుని భయపెడుతూ పూషయుద్ధం చేశాడు. కాని హయగ్రీవుడు పూష ధ్వజాన్నీ ధనుస్సునూ గుర్రాలను కూడ సారథితో సహా మట్టుపెట్టాడు. రథంకూడ నేలకూలింది. అప్పుడు పూష ఇంద్రుని రథందగ్గరకు వచ్చాడు.

ఒకవైపు భగునకు శంబరాసురునకు యుద్ధం ఘోరంగా ప్రారంభమయింది. శంబరాసురుని కోపంచే ఎర్రనైన కన్నులుచూచి దేవతలు భయపడ్డారు. వాళ్ళిద్దరూ భయంకర బాణవర్షంతో కప్పబడ్డారు. శంబరాసురుడు కోపంతో ప్రయోగించిన బాణాలు ఆకాశంలో సర్పాల వలె గోచరించాయి. దేవశ్రేష్ఠుడైన భగుడు ఆకాశం లోనే బాణాలను ఖండించివేశాడు. చాలాసేపు ఇద్దరూసమానంగా యుద్ధంచేశారు. శంబరుడు మాయను విస్తరింప చేయగా ఆకాశంకూడ చూడశక్యం కాలేదు. ధనుస్సుయొక్క ధ్వనియే వినిపిస్తున్నది. భగుడు కొంచం తర్వాత శంబరుని భూమిపై పడిపోయినవానినిగా చూచాడు. కొంచంకాలంతర్వాత పర్వతాకారంగల కోట్లకొలది శంబరాసురులు యుద్ధం చేస్తున్నట్లు కనిపించారు. కొంచంతర్వాత దిగ్గజం పైకూర్చుని యుద్ధంచేస్తున్నట్లు కనపడ్డాడు. ఈవిధంగా అనేక వికృత రూపాలను చూచి దేవసైనికులు భయపడి మృగాలలాగా పారిపోయారు.

అప్పుడు శంబరుడు గర్జిస్తూ ఎగిరాడు. శంబరునకు భయపడి భగదేవుడు ఇంద్రుని శరణుజొచ్చాడు. తర్వాత శంబరుడు అగ్నిదేవుని వద్దకువెళ్ళాడు. నేను నీకు మృత్యుదేవతగా వచ్చానని పలుకుతూ అంతర్ధానం చెందాడు. ఆసమయంలో చంద్రుడు శీతాస్త్రమును పట్టుకొని యుద్ధానికి వచ్చాడు. రాక్షససైనికులను సంహరి స్తున్నాడు. అతని శీతాస్త్రంచేత శత్రువుల యొక్క గుర్రాలు అస్తవ్యస్తమయ్యాయి. దైత్యసైనికులను దావాగ్నిలా భస్మం చేయసాగాడు. అతని శస్త్రబలంచేత రథికులు రథాలనుండి కాళ్ళలం భూమిమీద, పడిపోయి త్రొక్కబడుతున్నారు. శత్రుపక్షానికి మూర్తీభవించిన యమునివలె చంద్రుని చూచి అసురులు ఆశ్చర్యపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
రాక్షస ప్రముఖుల పరాజయము అను ఏభైఐదవ అధ్యాయము

☆☆☆

# ఏభైఆరవ అధ్యాయము

## విరోచన కుజంభుల పరాక్రమము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసంకులయుద్ధంలో దేవతలూ దైత్యులూ మిక్కిలిరోషంతో బాణవర్షం కురిపిస్తున్నారు. బాణపుదెబ్బలకు ఏనుగులు ఘీంకారంచేస్తున్నాయి.

రౌతులు మరణించుటవల్ల గుర్రాలు ఇష్టానుసారం అన్నిదిక్కులకు పరిగిడు తున్నాయి. రెండు పక్షాలయోధుల యొక్క శస్త్రముల దెబ్బలను సహించలేక క్రింద పడిపోతున్నాయి. ధనుష్టంకారముల ధ్వనివల్ల ఏమీవినపడుటలేదు. అనేక విధాలైన ఆయుధాలతో ఒక పక్షంవాళ్ళు మరొక పక్షంవాళ్ళను యముణ్ణి చూడ టానికి పంపుతున్నారు. ప్రతిస్థలంలోను తెగిపడిన చేతులు తలకాయలు నేలను కప్పివేశాయి. రక్తనది ప్రవహిస్తున్నది. దేవసేనదైత్యులచే పీడింపబడి హాహాకారం చేస్తున్నది. విష్వక్సేన విరోచనులిద్దరూ సమానంగా యుద్ధం చేస్తున్నారు. విష్వ క్సేనుడు తనవైపు వస్తున్న విరోచనుని మూడుబాణాలతో కొట్టాడు. విరోచనుడు కోపంతో ప్రజ్వలించాడు. విష్వక్సేనునిపై ఏడుబాణాలు విరోచనడు ప్రయో గించాడు. విష్వక్సేనుడు మూర్ఛపోయి ధ్వజం కర్రకు జారపడ్డాడు. త్వరలో స్మృతి వచ్చింది. మళ్ళీ ధనుస్సునెత్తి రాక్షసులమధ్య వెళ్ళినిలిచాడు.

విరోచను ఓ దేవతలను బాధిస్తూ భయంకరమైన యుద్ధం చేశాడు. విష్వక్సేనుని సింహనాదాలు వినిపిస్తున్నాయి. విరోచనుని సింహనాదాలుకూడా అట్లే విని పిస్తున్నాయి. విరోచనుని బాణవర్షంతో దేవతలు పరుగుతీశారు. కొందరు ఇంద్రుని శరణుజొచ్చారు. మహాబలవంతుడైన విరోచనుడు పద్నాలుగు వేల కాల్బలమైన దేవసైనికులను బాణవర్షం ద్వారా నశింపచేశాడు. ఖడ్గంచేతబట్టి వేగంగా దేవవీరుల తలలను ధనుస్సులను ఖండించగా వాళ్ళు అరుస్తూ మరణించారు. ఇలా విరోచనుని భయంకరయుద్ధం జరుగుతుండగా కుజంభుడు 'అంశువు'తో యుద్ధంచేశాడు. వాళ్ళిద్దరూ తీవ్రంగా యుద్ధంచేశారు. పరాక్రమ వంతుడైన అంశువు. కుజంభరాక్షసుని పదివేల ఏనుగులను చంపివేశాడు. ఏనుగులు పారిపోవటంచూచి కుజంభుడు గద తీసుకొని అతనివైపు పరుగెత్తాడు. ఆగదతో ఏనుగులనుకొట్టుతూ యుద్ధభూమిలో తిరుగుతున్నాడు. ఈసమయంలో దేవశ్రేష్ఠుడైన అంశుని మదపుటేనుగుపై వచ్చుటచూచి కోపంతో దానిమీద ఒక బాణం విసిరాడు. ఆ ఏనుగు యుద్ధభూమిని విడిచి పారిపోయింది. ఇలా ఏనుగు లను మర్దించి ప్రధానసైనికులపై గదాప్రహారం ప్రారంభించాడు. దాన్ని సహించకే సైనికులు దుఃఖిస్తూ పారిపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో

విరోచన కుజంభుల పరాక్రమము అను ఏభైఆరవ అధ్యాయము

☆☆☆

# ఏభైఏడవ అధ్యాయము

## వృత్రాసురుని గొప్పతనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత ఇంద్రుని ఆజ్ఞచే అతనిసైనికులందరూ భయంకరంగా గర్జిస్తూ దానవసైన్యంవైపు పరుగెత్తారు. ఏనుగులు గుర్రాలు రథాలూ వీరులూ గల సైన్య సముద్రం శంఖదుందుభులధ్వనితో ముందుకు నడిచింది. దిక్కులు చీకటై పోయాయి. ఆసైన్యసమూహంచూచి జనులు ఆశ్చర్యపోయారు. కాని బలవంతుడైన కుజంభుడు తన పరాక్రమంతో సైన్యసముద్రాన్ని స్తంభింపచేసి మేరుపర్వతంలా కదలకుండా నిలిచాడు. తరువాత గదతో దేవసైన్యాన్ని కొడుతూంటే దేవసేన ముందుకు నడవలేకపోయింది. ఆరాక్షసుడు పెద్దపులివలె నిర్భయంగా యుద్ధభూమి లో నిలిచాడు.

అప్పుడు దానవరాజు అసిలోముడు యుద్ధభూమికి వచ్చాడు.అతడు దేవ సేనకు తోకచుక్కలా కనిపించాడు. అతడు బాణవర్షం కురిపించాడు. అతడు గజరథాశ్వాలను వీరులనూ యుద్ధసముద్రంలో ముంచివేశాడు. ఇదిచూచి దేవతలందరూ అసిలోముని మీద దృష్టిపెట్టారు. దేవసైనికులు అతన్ని కన్నెత్తి చూడలేకపోయారు. అసిలోముడు దేవసేనను భస్మం చేయసాగాడు. కొన్నిక్షణాల్లో రెండుపక్షాల సైనికులూ సింహనాదాలు చేశారు. వాళ్ళుఏమీతెలియక తమపక్షం వాళ్ళనే చంపుకున్నారు. ఘోరమైనయుద్ధం జరిగింది. దైత్యులు దేవతలపై విరుచుకు పడ్డారు. ఆయుద్ధంలో ఎందరో అవయవాలను కోల్పోయారు.

ఆసమయంలో విష్ణుభగవానుడు అసిలోమునిపై భల్లాస్త్రమును ప్రయో గించాడు. దానితో అతని ధనుస్సువిరిగి క్రిందపడింది. తరువాత అనేకబాణాల్ని అసిలోముని పై ప్రయోగించాడు. అతనిశరీరంనుండి రక్తధారలు ప్రవహించినాయి. విష్ణువు మళ్ళీ ఒకబాణం ప్రయోగించాడు దానితో అసిలోముడు మిక్కిలికోపించి మరొక ధనుస్సుతీసుకొని పదునైనబాణాలను వర్షింపసాగాడు. ఆబాణాలు విష్ణువు శరీరంలో దూరిపోయాయి. తరువాత ఒకబాణాన్ని విష్ణువుమీద ప్రయోగించాడు. దానితో భగవంతుడు మూర్ఛపోయి నేలపైపడ్డాడు.

అప్పుడు నలువైపులా హాహాకారాలు వినవచ్చాయి. ఆసమయంలో అసి లోముడు విష్ణువుయొక్క ముప్పైఒక్కవేల సైనికుల్ని చంపివేశాడు. అతడగ్నిశిఖలా ప్రకాశిస్తున్నాడు. అప్పుడారాక్షసుడు విశాలమైన ధనుస్సుపట్టుకొని ఇంద్రుని వైపు వెళ్ళాడు. ఆయుద్ధంలో అశ్వినీకుమారులిద్దరూ విస్తారమైన సైన్యంతో వృత్రా సురునిమీదికి వెళ్ళారు. వృత్రాసురుడు కూడా అనేకాయుధాలతో యుద్ధభూమికి వెళ్ళాడు. స్థిరంగా నిలిచాడు. అశ్వినీకుమారులిద్దరితో ప్రాణాలొడ్డి యుద్ధం చేయ సాగాడు. అతని శంఖధ్వని, ధనుష్టంకారమువిని జీవులందరూ భయపడ్డారు. మహాయోధులైన దేవతల శస్త్రాస్త్రాలను వృత్రాసురుడు తనభల్లాస్త్రంతో నివారించాడు.

తరువాత వృత్రాసురుడు భయంకర బాణవర్షంతో దేవతల శరీరాల్ని బాధించాడు. చాలామంది శరీరాలు శిరస్సులు తెగిపడినాయి. దేవతల శరీరాల నుండి రక్తపుధారభూమిని తడిపివేసింది. తరువాత దేవతలందరూ ఏకమై అతనిపై యుద్ధం చేయసాగారు. దేవతలు వృత్రాసురుని దెబ్బలకు భయపడి ఉత్తరదిశగా పారిపోయారు. వృత్రాసురుడు శూలము గదపట్టుకొని ప్రపంచాన్ని అంతనూ భయపెడుతూ యుద్ధరంగంలో తిరుగసాగాడు. అశ్వినీకుమారులు వృత్రాసురుని గదదెబ్బకు మిక్కిలి బాధపడి త్రిశూలాన్ని విడిచిపెట్టి పరుగెత్తారు. ఇంద్రుని శరణు వేడారు. ఈవిధంగా అశ్వినీకుమారులను ఓడించి వృత్రాసురుడు ఆనందంగా యుద్ధ రంగంలో జయలక్ష్మిచే సేవింపబడుతూ ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వృత్రాసురుని గొప్పతనము అను ఏభైఏడవ అధ్యాయము

☆☆☆

# ఏభైఎనిమిదవ అధ్యాయము

## సుధూమ్రాక్షుడు మొదలైన వారి యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆమహాయుద్ధంలోనే 'రణాజి' అనే ఒకదేవత 'ఏకచక్రకు'డను వానితో యుద్ధంచేస్తున్నాడు. ఏకచక్రకునిసేన అతని మార్గాన్ని అడ్డగించి బాణ వర్షాన్ని ప్రారంభించింది. పరాక్రమవంతులైన దైత్యసమూహం దేవతలమీద

భుశుండి మొదలైన ఆయుధాలను ప్రయోగించింది. దేవతలు దానవులు ఒకరి నొకరు ఎదుర్కొన్నారు. అతని బాణములుపడి చాలామంది దేవతలు మరణించారు. చిత్రములైన బాణాలతో ఆయుధాలతోకూడిన వందలకొలది వేలకొలది మందిని చంపివేశాడు. దేవతలచేత బాధింపబడి రథాలు ఏనుగులు గుర్రాలు కొందరు రాక్షసులు చంపబడ్డారు. దితిపుత్రులైన రాక్షసులు తమసైనికులు మరణించుట చూచి ఆసమయంలో 'రణాజి' దేవుడు అగ్నితోసమానమైన 'మథన' మనే ఒక ఆయుధాన్నీ మిక్కిలిపదునైన శూలాలను వర్షించాడు.

కాని ఏకచక్రుడు తన అస్త్రబలంతో అన్నిశూలాలను ఖండించివేశాడు. మరియు 'రణాజి' మీద పదునైన పదిబాణాల్ని ప్రయోగించాడు. రణాజి వాటిని వ్యర్థం చేశాడు. ఇతర శస్త్రములతో అతని వేలాదిసైనికులను బాధించాడు. ఆ అస్త్రపు దెబ్బకు రాక్షససైనికులయొక్క శరీరాలు గాయాలతోకూడినవి అయ్యాయి. రక్తంప్రవహిస్తూ ఉంది. తరువాత దేవతలు రాక్షసుల బాణాలచే కొట్టబడి భయపడి పోయారు. ఆసమయంలో ఏకచక్రుడు యుద్ధరంగంలో ఏనుగుల (సైన్యం) గుంపు నిలబడి ఉండటం చూచాడు. వాటిపై మావటివాళ్ళు ఉన్నారు. ఏకచక్రుడు ముందుకు నడిచి ఆ ఏనుగులన్నిటిమీదనే కొట్టనారంభించాడు. గదాయుద్ధ నిపుణుడగు చక్రకరాక్షసుడు యుద్ధరంగం నుంచి తొలగించాడు.

ఈవిధంగా ఏనుగుసేనను తొలగించి గుర్రపుసేనపై దృష్టి సారించాడు. ఆగుర్రాలు అనేకవిధాలైన రంగులలో ఉన్నాయి. ఏకచక్రుడు తనగదతో ఆగుర్రాల నన్నిటినీ పొడి (చూర్ణం) చేశాడు. 'రణాజ' రథంమీద కూర్చుని ఇంద్రునివద్దకు వెళ్లాడు. ఏకచక్రుడు లక్షసైనికులను వినాశంచేసి పొగలేని అగ్నివలె ప్రకాశింప సాగాడు ఆయుద్ధంలో గొప్పరాక్షసుడై 'బలుడు' మృగ వ్యాధునితో యుద్ధం సాగించాడు. మృగవ్యాధుని అనుచరులు (సహాయులు) బలుని చూడగానే అగ్నివలె మండిపడ్డారు. ఆసహచరులు అనేకవిధాలైన వాహనాల్లపై కూర్చుని తీక్ష్ణములైన శస్త్రాస్త్రములను తీసుకొని యుద్ధభూమికి వచ్చారు. రుద్రగణం మిక్కిలి ప్రకాశిస్తున్న రాక్షసుని చూచింది. రుద్రగణం అతన్నిచూడగానే భయంకరములలైన శస్త్రాస్త్రాలను వర్షింప్రారంభించిది.

మృగవ్యాధుడు బలుడనే రాక్షసుని పర్వతంవంటి తలపై తీక్ష్ణమైన శస్త్రాస్త్రాలను వర్షించసాగాడు. బలదానవుడు తనగర్జనచేత పదిదిక్కులనూ ప్రతిధ్వనింప

చేస్తూ ఎగిరి ఆకాశంలోకి వెళ్ళాడు. అప్పుడు మృగవ్యాధుడు ధనుస్సులో బాణం తొడిగి రథంమీద కూర్చొని అతన్ని అనుసరించి బాణవర్షం ప్రారంభించాడు. బలదైత్యుడు భయంకరంగా గర్జించాడు. కొంచెంసేపటి తరువాత అతడు వెంటనే పైకెగిరి పర్వతంలాగా వేగంగా మృగవ్యాధుని రథంమీదపడ్డాడు. ఆరథం చూర్ణం అయింది. అప్పుడు మృగవ్యాధుడు ఆరథాన్ని వదలి భూమిమీదికి దిగాడు. మరల ఆకాశానికి ఎగిరాడు. తరువాత రుద్రదేవుని సహచరులు అనేకాయుధాలతో యుద్ధం చేశారు. బలదానవుడు కూడా అతనివేగాన్ని అడ్డుకొంటూ మళ్ళీ భూమి మీదికి దిగాడు.

వెంటనే విశాలములైన కొమ్మలు గల మద్దిచెట్టును పెకలించి రుద్రగణంలో ఒక్కొక్కణ్ణి కొట్టనారంభించాడు. రుద్రగణాల దెబ్బలకు ఆరాక్షసుడుకూడా బాల సూర్యునివలె శోభించాడు. తరువాత విశాలములైన పర్వతశిఖరాన్ని పెరికి రుద్ర గణంలోని వాళ్ళనందరినీ కొట్టాడు. అతని దెబ్బకు రుద్రగణం భయపడగా మిగిలిన సైనికులనుకూడా సంహరించాడు. దైత్యరాజుబలుడు బలవంతుడైన మృగ వ్యాధుడూ భయంకరంగా యుద్ధం చేయసాగారు. మహారాజ! ఆసమయంలో అజైకపాదుడనే రుద్రుడు క్రోధంతో అసురశ్రేష్ఠుడైన రాహువుతో కలిశాడు. రుద్రుడు కోపంతో రాహువును కొట్టాడు. రథాన్ని గుర్రాలను సారథినీ ధ్వంసంచేశాడు.

అజైకపాదుని సహచరుడు బాణంతో రాహువు వక్షస్థలంపై కొట్టాడు. దానితో రాహువు శరీరంచీలిపోయింది. అతడు అరచేతితో అతని రథాన్ని చూర్ణంచేశాడు. తరువాత తీక్ష్ణమైన బాణంతో అజైకపాదరుద్రుని అనుచరులనూ తీవ్రంగా కొట్టసాగాడు. దానితో రుద్రదేవుని శరీరంచీలిపోయింది. రెండుపక్షాలవాళ్ళు ఘోర యుద్ధంచేశారు. నలువైపులనుండి రక్తంనదులు ప్రవహింపసాగాయి. నల్లని శరీరం గల రాహువు. తనతీక్ష్ణబాణవర్షంతో రుద్రదేవుని ముంచెత్తాడు. ఆభయంకర యుద్ధంలో అనేకాయుధాలు ధరించిన ఎంతమంది మరణించారో లెక్కలేదు. యుద్ధవాద్యధ్వనులతో సింహనాదాలతో యుద్ధభూమి నిండిపోయింది. అంతటా దేవతల యొక్క దానవులయొక్కయు శవాలు ఎగురుతున్నాయి.

అజైకపాదరాహువులమధ్య యుద్ధం భయంకరమైంది. ఒకప్రక్క కేశి అనే రాక్షసుడు గొప్పగా యుద్ధంచేస్తున్నాడు. ధూళిఆకాశాన్ని కప్పి వేసింది. ఏమీకన

పడుటలేదు. ఆస్థితిలో దేవతలను దేవతలే చంపుతున్నారు. అట్లే రాక్షసులు రాక్షసులనే చంపుతున్నారు. యుద్ధభూమి రక్తమయంఅయింది. ఈసమయంలో 'కేశి' రాక్షసుడు కోపించినవాడై తనసైనికులను సంతోషపెట్టుచూ వజ్రమనే ఆయుధంతో రుద్రపారిషదులనందరనూ కొట్టగా వాళ్ళు యుద్ధభూమి నుండి వెళ్ళిపోయారు. కేశిరుద్రదేవుల మధ్య యుద్ధం అద్భుతము భయంకరమూ అయింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సుధూమ్రాక్షుడు మొదలైన వారి యుద్ధము అను ఏభైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ఏభైతొమ్మిదవ అధ్యాయము

## కాలప్రహ్లాదుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత వృషపర్వుడనే రాక్షసేశ్వరుడు నిష్కుంభకుడను దేవవరునితో యుద్ధంచేయసాగాడు. వృషపర్వుడు శత్రుసేన చూడగానే ధనుష్టంకారం చేస్తూ సారధితో నీవురథాన్ని త్వరగా శత్రువుల సమూహానికి తీసుకు వెళ్ళు. అటు చూడు దేవతలు అందరూ కలిసి నా సైనికులను సంహరిస్తున్నారు. కాబట్టి వీళ్ళను నేను నాశంచెయ్యాలనుకుంటున్నాను. అనగానే సారధిరథాన్ని దేవతల దగ్గరకు తీసుకువెళ్ళాడు. అప్పుడు తేజశ్శాలియైన నిష్కుంభుడు తనరథాన్ని విడిచి కోపంతో ఒక పెద్దచెట్టును పెకలించి వృషపర్వునిమీదికి విసిరాడు. వృషపర్వుడు తేలికగా ఆచెట్టును ఒకచేతితో పట్టుకొని త్రిప్పి ఏనుగులను నిష్కుంభుని ఏనుగును రథికులను సంహరించాడు. దేవతలు ఆరాక్షసునిచూచి పారిపోయారు.

నిష్కుంభుడు కోపించి సింహగర్జనచేశాడు. మూడుబాణాలను వృషపర్వుడిపై ప్రయోగించాడు. ఆసమయంలో రాక్షసులుకూడా నలువైపులనుండీ బాణాలను వర్షించారు. నిష్కుంభదేవుని శరీరంనుండి రక్తంప్రవహించింది. అతనిసైనికులు వృషపర్వునికి భయపడి పారిపోయారు. వాళ్ళు శస్త్రాస్త్రాలను విడిచిపెట్టారు. పరిగెత్తు సమయంలో ఒకడిపైమరొకడు పడుతున్నారు ఆసమయంలో హిరణ్యకశిపుపుత్రుడు మహాబలపరాక్రమాలుగల ప్రహ్లాదుడుకాలునితో యుద్ధంచేయసాగాడు. శుక్రాచార్యుడు అతని విజయంకోసం అవసరమైనపనులు చేస్తున్నాడు. అతడు అగ్నిలో

ఆహుతి ఉంచి బ్రహ్మణులకు నమస్కారంచేశాడు. నేతి వాసనను వాయువు అంతటా వ్యాపింపచేశాడు. అనేకవిధాలైన జయమాలను శుక్రాచార్యుడు అతని తలపై కట్టాడు. స్వస్తి సూక్తంచదివాడు.

శుక్రాచార్యుని శిష్యులు ప్రహ్లాదుడు మొదలైన దానవలు క్షేమంకొరకు మంత్ర జపం అథర్వవేద పఠనమూ చేయటానికి శుక్రాచార్యశిష్యులు నియమింపబడ్డారు. యుద్ధయాత్రకు సంబంధించిన పనులన్నీ నియమంప్రకారం నెరవేరాయి. బల వంతులైన దానవులు కవచాలు ధరించి దైత్యరాజుబలికి పూజచేసి ప్రహ్లాదునకు నలువైపులా నిలబడి ఉన్నారు. 'కేశి' రథం మీదకూర్చుని యుద్ధం చేస్తున్నాడు. అతని రథంలో అనేకవిధాలైన ఆయుధాలున్నాయి. క్షణంలో యుద్ధకోలాహలం వ్యాపించింది. కేశి అనేకాయుధాలతో అందరికీ జయింప రాని వాడుగాఉన్నాడు. అతనికిముందు వేలాదిదైత్యులు యుద్ధభూమిలో నడుస్తున్నారు.

కాలనేమిఅనే రాక్షసుడు ధనుష్టంకారంచేస్తూ గర్జిస్తూ విరగబడినవ్వుతున్నాడు. ఆమహాతేజశ్శాలి ప్రహ్లాదుని ముందు లక్షలమంది సైనికులతో నడుస్తున్నాడు డెబ్బైవేల రథాలు నడుస్తున్నాయి. వాళ్ళశస్త్రాస్త్రాల సంఖ్యచెప్పనలవిగానిది. గదా పరిఘాది ఆయుధాలనుధరించి ఆదైత్యులు పర్వతాల్లా ఉన్నారు. శంఖభేరీదుందుభి మొదలగు వాద్యాలధ్వని వీరులగర్జనలధ్వని ఆకాశమంతటా వ్యాపించింది. సముద్రంలా విశాలమైన సైన్యంతో యుద్ధభూమిలో యమునివలె ప్రహ్లాదుడు యుద్ధంచేస్తున్నాడు. అంతటావ్యాపించిన వికృతధ్వనులనువిని సమస్తజనులూ హాహాకారం చేయసాగారు. మహాబలశాలియైన ప్రహ్లాదుడు నవ్వుతూ ఈనాడు నాభుజబలాన్ని ప్రదర్శిస్తాను. నాక్రూరబాణాలచే మరణించిన దేవతలను నేడు మీరుచూడగలరు. అమితమైనధూళిని శత్రువులరక్తంతో అణచివేస్తాను. యముణ్ణి కూడా అంతమొందిస్తా. నాయుద్ధనైపుణ్యం చూపి రాజైనబలిని సంతోషపెడతాను.

ఓదానవులారా! మీరు నిర్భయంగా యుద్ధ భూమిలో శత్రువులను చంపండి. ప్రహ్లాదుడు సైనికులకు ఇలాచెప్పి తోటిరథికులైన సైనికులతో యమునిసైన్యాన్ని మర్దింపసాగాడు. ప్రహ్లాదుని పుత్రులు సింహనాదాలు చేస్తూ ఉన్నారు. ఆమహాబల శాలురు యమునితో యుద్ధంచేయపూనారు. కాలదేవుడు ఆరాక్షస సైనికులపై ఎదుర్కొన్నాడు. మార్గాన్ని అడ్డగించి భయంకరంగా సంహరింప సాగాడు. వాళ్ళు ప్రహ్లాదునిపైకూడా కొట్టనారంభించారు. అతని సహచరులు అనేకా యుధాలను వర్షించారు. వ్యాధిసమూహం దానవుల శస్త్రాస్త్రములతో చీల్చబడింది. కొద్ది

క్షణాల్లోనే రక్తం నదిలా ప్రవహించింది. ప్రహ్లాదుడు యముడు ఒకరిపైఒకరు అస్త్రాలను ప్రయోగిస్తూ సైనికులను సంహరించారు. ప్రహ్లాదుని బాణాలను సహించ లేక యమునిసైన్యం వేగంగా పరుగెత్తింది. అప్పుడు ప్రహ్లాదుడు కాలుని దర్పం అణిగిందని ఇతరసైన్యాన్ని పీడింపసాగాడు. కాలప్రహ్లాదులయుద్ధం వంటిది ఎప్పుడూ జరగలేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
కాలప్రహ్లాదుల యుద్ధము అను ఓబైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# అరవైయవ అధ్యాయము

## అనుహ్లాద కుబేరుల సంకుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ప్రహ్లాదుని చిన్నతమ్ముడు బలవంతుడైన అనుహ్లాదుడు కుబేరుని సైన్యాన్ని కలవరపెడుతూ భయంకరమైన యుద్ధంచేయసాగాడు. అనుహ్లాదు తన సైన్యాన్ని వినాశంచేయటంచూచి కుబేరుడు మిక్కిలి కోపంగలవాడయ్యాడు. రాక్షస సైన్యాన్ని అస్తవ్యస్తంచేశాడు. అదిచూచి అనుహ్లాదుడు అతనివైపు వెళ్ళాడు. కుబేరునిపై తీవ్రమైన బాణవర్షం కురిపించాడు. కుబేరుడు అనుహ్లాదునిపై అగ్ని వంటి తీవ్ర బాణాలను ప్రయోగించాడు. యక్షరాజైన కుబేరుని బాణాలకు అను హ్లాదుడు కూడ మూర్ఛపోయాడు. చెట్లతో అనేకవిధాలైన ఆయుధాలతోనూ రెండుపక్షములూ భయంకరమైన యుద్ధంచేశాయి. బాణాలచే చీల్చబడిన శరీరాలు ఖడ్గంచే ఛేదించబడిన కవచాలూ గల రాక్షసులు రాళ్ళను చెట్లనూ పట్టుకొన్నారు. కుబేరుడు ధనుస్సును ధరించి దానవులను పదిదిక్కులకూ పారద్రోలాడు. అను హ్లాదుడు ఒకవిశాలమైన వృక్షాన్ని పెకలించి వేగంగా కుబురునిరథంపై విసిరాడు. కుబేరుడు గదతీసికొని అనుహ్లాదుని కొట్టాడు. అనుహ్లాదుడు యమధర్మరాజులా భయంకరరూపాన్ని ధరించాడు. కుబేరుడు అతన్నిచూచి భయపడిపారిపోయి ఇంద్రుని శరణుజొచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
అనుహ్లాద కుబేరుల సంకుల యుద్ధము అను అరవైవ అధ్యాయము

☆☆☆

# అరవై ఒకటవ అధ్యాయము

## వరుణ విప్రచిత్తుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! తర్వాత దానవరాజైన విప్రచిత్తి బాణవర్షం కురిస్తూ వరుణ దేవునితో యుద్ధం చేయనారంభించాడు. వరుణుడు క్షణకాలంలోనే ఏమి చెయ్యాలో తెలియనివాడయ్యాడు. విప్రచిత్తిముందు నిలువ లేకపోయాడు. రాక్షస సైన్యం వజ్రవ్యూహం పన్నింది. దానిమధ్యనిలిచి దేవసేనను సంహరించు చున్నది. విప్రచిత్తి పరిఘుఅనే ఆయుధాన్ని త్రిప్పుతూ సింహనాదంతో భయంకలిగించాడు. అతన్ని చూచి దేవతలూ వరుణుడూ కూడా కదలలేక పోయారు. ఇంద్రుడొక్కడే నిర్భయుడుగా నిలిచాడు. ఆపరిఘుఅనే ఆయుధాన్ని వరుణునిసేనపై వదిలాడు. దానిదెబ్బకు లక్షదేవసైనికులు నేలకూలారు. దేవ సైనికుల శరీరాలనుతాకి ఆపరిఘు కూడ వేలముక్కలైంది. ఆదెబ్బకు వరుణుడు ఏమీచలించలేదు. ఇంద్రుడు తన సైనికులతో మీరు నిర్భయంగా యుద్ధంచేసి దానవసైన్యాన్ని నశింప చేయండి నేనీవిప్రచిత్తి అసురుని సంహరించేస్తానుఅని సింహగర్జనచేస్తూ రాక్షసులపై కఠోరంగా కొట్ట మొదలుపెట్టాడు. విప్రచిత్తి రాక్షసుడు గరుడాస్త్రాన్ని ప్రయో గించాడు. దేవతలు మిక్కిలి సంతాపాన్ని పొందారు. వరుణ దేవుని దెబ్బలకు బయపడి దానవగణం పారిపోయింది. విప్రచిత్తి తనబాణాలతో వరుణుని సేనను మర్దించసాగాడు. వరుణుని సైనికులవద్ద శస్త్రాలు క్షీణింప సాగాయి. వాళ్ళ శరీరాలు చీలి రక్తంస్రవించగా భూమిపై ప్రవాహం ఏర్పడింది. విప్రచిత్తి వరుణుని గుర్రాలను చంపివేశాడు. విప్రచిత్తిచే బాధింపడి వరుణుడు ఇంద్రుని శరణువేడాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వరుణ విప్రచిత్తుల యుద్ధము అను అరవైఒకటవ అధ్యాయము

☆☆☆

# అరవై రెండవ అధ్యాయము

## అగ్నిదైత్యుల నోడించుట, అగ్నిస్తుతి

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! దేవతల పరాజయమునుచూచి బ్రహ్మర్షుల స్తోత్రం చేసిన మీదట దేవతలలో గొప్పవాడైన అగ్నిదేవుడు దైత్యులను సంహరించటానికి సంకల్పించాడు.

## బ్రహ్మర్షిస్తోత్రము

శ్లో॥ స్వయంప్రభాయాశ్శాండిల్యాయః పుత్రోహవ్యవాహనః।
హిరణ్యరేతాః పింగాక్షోదేవహుతోహుతాశనః॥
రోహితోలోహితగ్రీవో హర్తాదాతాహవిః కపిః।
పావకోవిశ్వభుగ్దేవస్సర్వదేవాసనః ప్రభుః॥
సుబ్రహ్మాత్మాసువర్చస్కః సహస్రార్చిః విభావసుః।
కృష్ణవర్త్మాచిత్రభానుర్దేవానామపి దేవరాట్॥
లోకసాక్షీ ద్విజహుతః సదర్చిష్మాన్ వషట్కృతః।
హవ్యభక్షశ్శమీగర్భస్స్వ యోనిస్సర్వకర్మకృత్॥
పావనస్సర్వభూతానాం త్రిదశానాంతపోనిధిః।
శమనస్సర్వ పాపానాం లేలిహానస్తపోమయః॥
ప్రదక్షిణావర్తశిఖః శుచిరోమా మఖాకృతిః।
హవ్యభుగ్భూత భవ్యేశో యజ్ఞభాగహరోహరిః॥
సోమపస్సు మహాతేజా భూతేశస్సు మహాతపాః।
అధృష్యః పావకోభూతిర్భూతాత్మావైస్వధాధిపః॥
స్వాహాపతిస్సామగీత సోమపూతాశనోఽద్రిధృక్।
దేవదేవోమహాక్రోధో రుద్రాత్మా బ్రహ్మసంభవః॥
లోహితాశ్వం వాయుచక్రంరథమాస్థాయ భూతధృతో।
ధూమకేతర్ధూమశిఖో నీలవాసాస్సురోత్తమః॥
ఉద్యమ్యదివ్యమాగ్నేయం శస్త్రందేవోరణేమహాన్।
దానవానాం సహస్రాణి ప్రయుతాన్యర్బుదానిచ॥
దదాహభగవాన్ వహ్ని స్సంక్రుద్ధః ప్రలయేయథా।
ప్రాణోయస్సర్వభూతానాం దేహేతిష్ఠతిపంచధా॥
యంతాయశ్చహుతాశశ్చ సఖాచప్రభురీశ్వరః।
ప్రభంజనోయోలోకానాం యుగాంతే సర్వనాశనః॥
సప్తస్వరగతాయస్య యోనిర్గీర్భికుదీర్యతే।
యోహ్యాకాశమ యోదేవో దూరగస్సర్వసంభవః॥

యశ్చకర్తా వికర్తాదగతిర్గతిమతాం ప్రభుః।
వేదకర్తా నమోలోకే బ్రహ్మణాయస్సనాతనః॥
అమూర్తిమంతంయం ప్రాహుర్మహో భూతంమహత్తరమ్।
సోగ్నింసమీరయామాసశమీ గర్భంసమీరణః॥
త్రిదివారోహిభిర్జ్వాలైర్జ్వలం భమాణోదిశోదశ।
దానవానామభావాయ యుగాంతాగ్ని రివోత్థితః॥

మెల్లమెల్లగా యుద్ధం ఉగ్రరూపంధరించింది. రక్తనది ప్రవహిస్తున్నది. ప్రహ్లాదుడు మొదలైన పెద్దపెద్దదానవులు మిక్కిలి భయపడి పరాజయాన్ని అనుభవింపసాగారు. అగ్నిదేవుడు దానవులను సంహరిస్తూ గర్జిస్తున్నాడు. దైత్యు లందరూ దీనధ్వని చేస్తున్నారు. యుద్ధభూమి మిక్కిలి భయంకరంగా ఉంది. ఆసమయంలో శంబరాసురుడు మయుడు అనే దానవులు వర్షం కురిసేటట్లు మాయను సృష్టించారు. నలువైపుల వర్షధారలు పడనారంభించాయి. మెల్లమెల్లగా అగ్ని వేడి తగ్గటం మొదలైంది. అపుడు కీర్తిశాలి దేవగురువు బృహస్పతి అగ్నిదేవునీ జ్వాలలు మిక్కిలి అంతమైనవి. నీవు మహాబలవంతుడవు. వాయువు నీకు ఆత్మ. జమ్మిచెట్టు నీకు శరీరం. నీటికి నీవు జన్మస్థానమైనట్లు నీవు నీటికి జన్మస్థాన మైనవాడవు.

నీజ్వాలలు అన్ని దిక్కులా వ్యాపిస్తాయి. నీవు సర్వస్వరూపుడవు. నీవు జీవులను బ్రతికిస్తూ పోషిస్తూ ఉన్నావు. ఓ అగ్నిదేవా నీవే హవిస్సును తీసుకువెళ్ళు వాడవు. ఈవేళ నీప్రతాపంచేతనే మాకు విజయం సిద్ధించింది. నీదచే సమస్త ప్రపంచమూ సంతోషిస్తున్నది. నీవే ముల్లోకాలను సృష్టించి లయింపచేస్తున్నావు. సూర్యమండలానికి నీవల్లనే వేడి ఏర్పడుతున్నది. నీవే కాంతిసమూహంచేత నీటిని సృష్టిస్తున్నావు. ఓషధులు వాటిరసమూనీవే. వేదాలు అన్నివస్తువుల పుట్టుకకు నీవేకారణమంటున్నాయి. దేవతల క్షేమంకొరకు ఈవేళ దైత్యులను సంహరించావు. ఓ సురసత్తమ! ఓ పింగాక్ష! ఓ లోహితగ్రీవ! ఓ కృష్ణవర్త్మా! ఓ హుతాశన! నీవు దేవతలను యుద్ధభూమిలో నేడు రక్షించావు అని స్తోత్రం చేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
అగ్నిదైత్యుల నోడించుట, అగ్నిస్తుతి అను అరవైరెండవ అధ్యాయము

☆☆☆

# అరవైమూడవ అధ్యాయము

## బలితో ప్రహ్లాదుని మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! అగ్నిదేవుడు బృహస్పతి సత్యమైన మాటలనువిని మహాయజ్ఞంలో వలె యుద్ధభూమిలో మళ్ళీ మండిపడ్డాడు. ప్రజ్వలించిన అగ్నిదేవుని తేజోబలంచేత దైత్యుల యొక్క మాయాజాలమంతా భస్మమైంది. ఈవిధంగా అగ్నిదేవుడు దైత్యులను ఓడించిన తర్వాత ప్రహ్లాదుడు దైత్యరాజైన బలితో రాజా! బ్రహ్మదేవుడు మీకు వరమిచ్చియున్నాడు. అగ్ని, వాయువు, అంతయూ మీరేకదా! అన్నిలోకాల మీద ప్రభుత్వమూ మహాయోగీశ్వరత్వమూ పొందబడిందికదా! అణిమాదిగుణాలు మీకు ప్రాప్తించాయి. బ్రహ్మ మాట తప్పదు. అందుచేత సహచరులతో కూడ కలిసి ఇంద్రాదిదేవతలను ఓడించండి అని చెప్పాడు. అది వినిబలి మిక్కిలి సంతోషించి ఇంద్రుని రథంవైపు ముందుకు నడిచాడు. ఆసమయంలో శ్రేష్ఠులైన బ్రాహ్మణుడు శుభకరములైన పశువులు వెళ్ళబోతున్న దైత్యరాజైన బలికి ప్రదక్షిణం చేశారు. తపశ్శాలురు యుద్ధానికి వెళ్ళేముందు మంగళకరములైన స్తోత్రాలు చదివారు. తర్వాత దైత్యరాజు కొంచం దూరం ముందుకువెళ్ళి అగ్నిచే పీడింపబడి తనసేన స్తంభించి నిలబడటం చూచాడు. బలిగర్జిస్తూ శూలం మొదలైన ఆయుధాలతో శత్రుసేనను సంహరిస్తున్నాడు. దైత్యరాజుయొక్క శస్త్రాస్త్రములు పొగచూరి పోయి భుజబలం గాలిగామారి పౌరుషం కర్రలా తయారైనాయి. అపడు బలి ప్రలయాగ్ని సమస్తాన్నీ భస్మం చేయటానికి బయల్దేరిందని భావించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలితో ప్రహ్లాదుని మాటలు అను అరవైమూడవ అధ్యాయము

☆☆☆

# అరవైనాల్గవ అధ్యాయము

## బలి దేవసేనను ఆక్రమించుట

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! ఆసమయంలో ఇంద్రుడుతప్ప తక్కినదేవతలంతా బలవంతుడైన బలిప్రయోగించిన వందవందబాణాలతో కొట్టబడి ఓడిపోయారు వాళ్ళు తమ సేనతో యుద్ధభూమినుండి తిరిగివెళ్ళిపోయారు. అప్పుడా దేవతలు దేవరాజైన ఇంద్రుని వద్దకువెళ్ళి దేవరాజా! నీవు ఇంద్రుడవు. మూడులోకాలకు రాజువు సాటిలే తేజస్సు గలవాడివి. దైత్యరాజైనబలి యుద్ధ

భూమిలో భయంకరపరిస్థితిని సృష్టించాడు. నీవు సైనికుల ఈదుస్థితిని చూచి ఎందుకు మాట్లాడుటలేదు? మేము నిన్ను శరణు జొచ్చాము. మీరు మమ్మల్ని రక్షించండి అన్నారు. ఇంద్రుడా మాటలు విని మిక్కలి కోపంతో దానవులను భస్మం చేయటానికి సిద్ధపడ్డాడు. వందభుజాలూ వెయ్యికళ్ళూ కలిగి వజ్రాయుధాన్నీ ధనుస్సును చేతపట్టుకొని యుద్ధానికి బయలుదేరాడు.

అప్పుడు వెయ్యిమంది దేవతలు గంధర్వులు యక్షసమూహమూ అతని వెనుక నడువసాగింది. సామవేదంచదివిన మహర్షులు మంత్రజపమూ స్వస్తి పాఠం చేస్తుండగా దేవరాజు ఇంద్రుడు యుద్ధానికి బయలుదేరాడు. వేలాదిదేవతలు గంధర్వులు యక్షులూ అతని వెనుక నడువసాగారు. సామవేదపండితులు మహర్షి సముదాయము మంత్ర జపమూ స్తోత్రపాఠము చేయసాగారు. తరువాత నూరు అంచులుగల వజ్రాయుధాన్ని ధరించి దైత్యులతో యుద్ధంప్రారంభించాడు. దేవరాజైన ఇంద్రుడు, బలి రెండు పక్షాలసేనలూ ఘోరయుద్ధంచేయసాగాయి. ప్రహ్లాదుడు విజయంచేకూర్చే స్తుతివాక్యాలతో బోధింపబడి అగ్నివలె మిక్కిలి ప్రకాశంకలవాడయ్యాడు. బలి దేవరాజులమధ్య ప్రబలయుద్ధంసాగింది. ఇతర దేవతలూ రాక్షసులూకూడ యుద్ధం ప్రారంభించారు.

ఇంద్రుడు దైత్యరాజుపై అనేక శస్త్రాస్త్రాలను ప్రయోగించాడు. కాని బలివాటి నన్నిటినీ ముక్కలుముక్కలుచేశాడు. ఇంద్రుడందుకు కోపించి ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడు బలి ఆకాశానికి ఎగిరి అక్కడనుండి వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు దానితో ఆగ్నేయాస్త్రం శాంతించింది. అప్పుడు ఇంద్రుడు వజ్రా యుధాన్ని చేతపట్టాడు. దాన్ని ప్రయోగించపోవుచుండగా ఆకాశవాణి దేవతల కానందం కలుగజేయు ఇంద్రా! శాంతించు నీవుబలిని ఏవిధంగానూ ఓడించలేవు. అతడు చాలవరాలు పొందియున్నాడు. నీకంటే మిక్కిలి బలంతుడు. ఇతరదేవతలు కూడ అతన్ని జయించలేరు. శంకచక్ర గదాధారియైన భగవంతుడే ఒంటరిగా అతన్ని ఓడించగలడు అని వినిపించింది. అప్పుడు ఇంద్రుడు దేవతలతోపాటు యుద్ధభూమి నుండి వెలుపలకు వెళ్ళిపోయాడు. దానవ సైన్యంలో సింహనాదాలు ఎక్కువయ్యాయి. దైత్యరాజు తనసేనతో బంధువులతో యుద్ధభూమినుండి బయటకు వచ్చి హిరణ్యకశిపువలె ప్రకాశించాడు. అతని మిత్రులు అతన్ని స్తోత్రాలు చేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలి దేవసేనను ఆక్రమించుట అను అరవైనొల్గవ అధ్యాయము

☆☆☆

# అరవై ఐదవ అధ్యాయము

## బలికి ఇంద్ర పదాభిషేకము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అప్పుడు దేవతలు నిరాశతో యుద్ధంమానివేశారు. మూడు లోకాలూ దైత్యులకు స్వాధీనమైనాయి. మయుడు శంబరుడు బలివిజయాన్ని చాటించారు. యుద్ధము ఆగిపోగానే ధర్మాలు సత్కర్మలూ ప్రారంభమయ్యాయి. ప్రహ్లాదుడు, శంబరుడు, మయుడు, అనుహ్లాదుడూ దిక్పాలకులయ్యారు. యజ్ఞాలలో దైత్యులకు యజ్ఞభాగాలు ప్రాప్తిసున్నాయి. ప్రజలందరూ ప్రశాంతంగా మంచి మార్గంలో నడువజొచ్చారు. పాపమనే పేరుకూడా వినపడలేదు. సిద్ధగణాలకు తపస్సుపై అభిరుచి ఏర్పడింది. ధర్మంనాల్గు పాదాలా ప్రవర్తిస్తున్నది. రాజులు ప్రజలను చక్కగా పాలిస్తున్నారు. ఆశ్రమవాసుల ధర్మాలకు ఆటంకాలులేవు. అప్పుడు దైత్యులందరూ ఏకమై బలిని దేవరాజపదవియందు పట్టాభిషిక్తుని చేశారు. అప్పుడు అసురల ఆనందానికి హద్దులేదు. అప్పుడు పద్మంచేతపట్టుకొని లక్ష్మిబలి వద్దకువచ్చి దైత్యరాజా! దేవతలను ఓడించినందుకు నేను సంతోషిస్తున్నాను. నీకు శుభమగుగాక. ఇంద్రుని ఓడించుట చూచి నేను నీవద్దకు వచ్చాను. మీతాత హిరణ్యకశిపుడు ముల్లోకాలకీ రాజయ్యాడు. విశేషమేమిటంటే నీవలన సమస్త ధర్మాలకీ రక్షణ ఏర్పడింది. ఇలా పలికి లక్ష్మి బలియింటిలో ప్రవేశించింది. ఇతరకీర్తి నీతి మొదలైనవి అప్సరసలు ఉత్సాహంతో ఇంద్ర పదవియందున్న బలిని ఉపాసిస్తున్నారు. ఈవిధంగా ప్రపంచమంతా దైత్యులకు దక్కింది. ముల్లోకాల ఐశ్వర్యంమీద బలిఅధికారి అయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలికి ఇంద్ర పదాభిషేకము అను అరవైఐదవ అధ్యాయము

☆☆☆

# అరవై ఆరవ అధ్యాయము

## దేవతలు బ్రహ్మలోకానికి వెళ్ళుట

జనమేజయుడు ఓడిపోయిన దేవతలు ఏంచేశారు? మళ్ళీ స్వర్గం ఎలా ప్రాప్తించింది. అనిఅడుగగా మహర్షియైన వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత ఇంద్రుడు దేవతలతో అదితి ఇంటికి వెళ్ళాడు. యుద్ధ రంగంలోవిన్న ఆకాశవాణి మొదలైన వృత్తాంతాన్నిఅంతనీ అదితికి వినిపించాడు. ఆకాశవాణి ఇలాచెప్పిందికనుక మీరందరూ ఏకమైనా బలిని నశింప చేయలేరు. కాబట్టి బ్రహ్మాదియైన మీతండ్రివద్దకు నడవండి. కశ్యపమహర్షిని ఉపాయం అడగవచ్చును. అనిచెప్పి అదితి పలుకగా దేవతలందరూ అదితోకూడా కశ్యప మహర్షివద్దకు వచ్చారు. వీరులైన అదితిపుత్రులు అదితి అందరూ నమస్కరించి యుద్ధరంగంలో ఇంద్రుడువిన్న ఆకాశవాణిదేవతలకు బలి జయింపశక్యము కానివాడులని విషయాన్ని కశ్యపమహర్షికి చెప్పారు. అయన పుత్రుల మాటలు విని బ్రహ్మలోకానికి వెళ్ళదలచాడు. బ్రహ్మవద్దకు మనమందరం వెళదాం అక్కడ మీరువిన్నది చెప్పండి అన్నాడు. తరువాత అదితోకూడా వెళ్ళే కశ్యపుని దేవతలను సరించ వెళ్ళారు. విశాలమైన బ్రహ్మసభకు చేరారు.

అక్కడ నిత్యము తుమ్మెదలయొక్క సామగానమయమైన మధురధ్వని వినిపిస్తుంది. అన్ని శాస్త్రములు, వేదములు తెలిసినవిద్వాంసుల ఆసభలో ఉన్నారు. మధురమైన బ్రాహ్మణుల వాక్కులతో విష్ణురుద్రుల సభలవలె ఉంది. దేవతలు అచట మధురధ్వనుల నన్నిటినీ విని తమశరీరం పవిత్రమైందని తలచారు. తరువాత మౌనంతో తమమనస్సును బ్రహ్మపై లగ్నంచేశారు. ఆశ్చర్యంతో వికసించిన కన్నులతో ఒకరినొకరు చూచు కొన్నారు. బ్రహ్మకు ఎదురుగా కశ్యపుడు దేవత లందరూ కశ్యపుని వెనుక నిలబడి మరల బ్రహ్మకు మనస్సులోనే నమస్కరించారు.

తరువాత దేవతలు అతి మధురమైన వేదధ్వనిని వినసాగారు. తరువాత జపహోమకార్యాలలో ఆసక్తిగల ఎందరో జితేంద్రియులు అక్కడ కనిపించారు. ఆసభలో లోకానికి పితామహుడైన బ్రహ్మ ప్రకాశిస్తున్నాడు. దక్షుడు మొదలగు ప్రజాపతులసమూహం అతన్ని ఉపాసిస్తున్నారు. పంచభూతాలు గుణాలు శుక్రాచార్య బృహస్పతి సంవర్తాదులు సావిత్రీ సరస్వతి మొదలగు దేవతలు అన్ని వేదాలూ అన్ని శాస్త్రాలూ ఋతుమాసాదులు కాలచక్రం సమస్తమూ బ్రహ్మను ఉపాసిస్తున్నది. అటువంటి దివ్యసభలో దేవతలతో ప్రవేశించి కశ్యపుడు శ్రేష్ఠమైన ఆసనంపై కూర్చున్నాడు బ్రహ్మకు నమస్కరించాడు. బ్రహ్మ పాదాలను శిరస్సుతో

తాకి నమస్కరించటంతో దేవతలపాపాలు నశించాయి. కశ్యపునితో వచ్చిన దేవతలను చూచి బ్రహ్మ మీరు వచ్చినపని నాకుబాగా తెలుసు. మీకోరిక తప్పక తీరుతుంది. దానవరాజైన బలిని ఓడించేవాడు సనాతనుడు పురుషోత్తముడు. ఆయన మిమ్ములను మమ్మును సమస్త ప్రపంచ వృత్తాంతమును ఎరుగును.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దేవతలు బ్రహ్మలోకానికి వెళ్ళుట అను అరవైఆరవ అధ్యాయము

★★★

# అరవై ఏడవ అధ్యాయము

## బ్రహ్మ ఆజ్ఞచే దేవతల తపస్సు చేయుట

ఆయన యిప్పుడు కఠినమైన తపస్సుచేస్తున్నాడు. ఉత్తరదిక్కున పాలముద్రం ఒడ్డున మిక్కిలి అందమైన 'అమృత'మనే స్థానముంది. మీరు అక్కడికివెళ్ళి మిక్కిలి కఠోరమైన తపస్సుచేయండి. అలాచేసిన మీదట మనోహరమైన భగవంతుని వాక్కును వినగలుగుతారు. ఆయన ఓదేవతలారా! మీకు స్వాగతం మీకేంకావాలని అడుగుతాడు. ఓకశ్యపమహర్షీ! అప్పుడు నువ్వు నీకు పుత్రుడవుగా అవతరించుమని కోరుకో, ఇలాకోరితే భగవంతుడు వెంటనే "తథాస్తు" అంటాడు. అప్పుడు దేవతలందరూ మాకు నీవు సోదరుడవుకావాలి. అని వరమడగండి, భగవంతుడు అందుకు కూడ 'తథాస్తు' అంటాడు. ఇలావరంపొంది మీస్థానాలకు మీరువెళ్ళండి.

అప్పుడు కశ్యపుడు, దేవతలూ ఆమాటలనంగీకరించి బ్రహ్మకినమస్కరించి ఉత్తర దిక్కుకువెళ్ళారు. క్షణకాలంలోనే 'అమృత' మనే ప్రదేశానికిచేరారు. అక్కడొక్క జీవుడుకూడా లేడు. సూర్యప్రకాశమూ లేదు. ఘోరమైన చీకటి అలుముకున్నది. అక్కడ మహర్షికశ్యపుడితోపాటు దేవతలు వెయ్యిసంవత్సరాల వ్రతదీక్ష తీసుకున్నారు. నారయణుని దయను పొందటమే వ్రతంయొక్క ముఖ్యమైన ఉద్దేశము. అందరూ మౌనంతో కఠోరమైన తపస్సు ప్రారంభించారు. కశ్యపమహర్షి పరమపురుషుని అనుగ్రహం పొందటానికి వేదంచెప్పిన ఈ పరమ పవిత్ర స్తోత్రాన్ని పఠించ నారంభించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బ్రహ్మ ఆజ్ఞచే దేవతల తపస్సు చేయుట అను అరవైఏడవ అధ్యాయము

★★★

# అరవైఎనిమిదవ అధ్యాయము

## కశ్యపుడు పరమాత్మను స్తుతించుట

శ్లో॥ నమోఽస్తుతేదేవదేవేశ! ఏకశృంగవృషార్చిష।
వృషసింధోవృషాకపే సురనిర్మిత అనిర్మిత॥
భద్రకపిలవిష్వక్సేన! ధ్రువధర్మ ధర్మరాజ।
వైకుంఠత్రేతావర్త అనాదినిమధ్య ధనధనంజచ శుచిశ్రవః అగ్నిజ!
వృష్ణిజ! అజఅజయ అమృతేశ। సనాతనవిధాతస్త్రికామ త్రి
ధామ త్రికకుత్కకుద్మిన్। దుందుభే మహానాభ లోకనాభ
విరించే వరిష్ఠ బహురూప విశ్వరూపాక్ష యాక్షర। హంసాక్షర।
హవ్యభుక్ఖండపరశో శుక్రముంజకేశ హంసమహాహంస।
మహదక్షర హృషీకేశ సూక్ష్మపరమ సూక్ష్మతురాషాట్ విశ్వమూర్తే
సురాగ్రజనీల నిస్తమో విరజస్తమోరజః సత్యధామ సర్వలోకప్రతి
ష్ఠశిపివిష్టసుతపస్తపోగ్ర అగ్రజధర్మనాభగభస్తినాభ।
ధర్మనేమిసత్యధామ సత్యాక్షరగ భస్తినేమేవిపాప్మక్ చంద్రరథ।
త్వమేవ సముద్రవాసాః అజైకపాత్ సహస్రసంమితమహాశీర్ష
సహస్రదృక్ సహస్రపాత్ అధోముఖ మహాపురుష పురుషోత్తమ।
సహస్రబాహో సహస్రమూర్తే। సహస్రాస్య సహస్రాక్ష సహస్రభుజ।
సహస్రభవ సహస్రశస్త్వా మాహుర్వేదాః విశ్వేదేవ విశ్వసం
భవ సర్వేషామేవదేవానాం సౌభగ। ఆదేగతిః విశ్వంత్వ మాహ్యాయ
నః విశ్వం త్వామాహుః। పుష్టహాసపరమపరదస్త్వమేవా త్వమేవ
వేషట్ ఓంకార వషట్కారం త్వామేక మాహురగ్ర్యం మఖభాగప్రాశినమ్।
శతధారసహస్రధార। భద్రభువర్ద స్వర్ద భూర్భువ స్వర్ద త్వమేవభూతం
భువనంత్వం స్వధాత్వమేవ బ్రహ్మేశయ బ్రహ్మమయ బ్రహ్మాదిస్త్వమే
వద్యౌరసి। పృథివ్యసి పూషా సిమాతరిశ్వా సిధర్మోసిమఘవాసి
హోతాపోతానే తాహన్తా మన్తా హోమ్యహోతా పరాత్పరస్త్వమ్।
హోమ్యస్త్వమేవ ఆపోసివిశ్వవార్। ధాత్రావరమేణ ధామ్నాత్వ

మేవ దిగ్భ్యః స్రుక్ స్రుగ్భాండ స్త్వం గణఇషోఽపి ఇజ్యోసి ఈదో్య

సిత్వష్టా త్వమసి సమిద్ధస్త్వ మేవమతిర్మతిమతామసి మోక్షోసి

యోగోసి గుహో్యసి సిదోసిధనో్యసిధాతాసి పరమోసి యజ్ఞోసి

సోమోసియూపోసి దక్షిణాసి దీక్షాసి విశ్వమసిస్థ విష్ఠస్థవిర

విశ్వతురాషాట్ హరిణ్యగర్భహిరణ్యనాభ హిరణ్యనారయణ

నారాయణాన్తర న్రణామయన ఆదిత్యవర్ణ ఆదిత్యతేజః మహాపురు

షపురుషోత్తమ ఆదేవపద్మనాభ పద్మేశయ పద్మాక్ష పద్మగర్భ

హిరణ్యాగ్రకేశ శుక్ల విశ్వేదేవవిశ్వలోముఖ విశ్వాక్ష విశ్వసంభవ

విశ్వభుక్త్వమేవ భూరివిక్రమ చక్రక్రమ త్రిభువనసువిక్రమ స్వర్వి

క్రమబభ్రుః సువిభుః, ప్రభాకరః శంభుః స్వయంభూశ్చభూతాదిర్భూ

తాత్మన్ మహాభూత! విశ్వభుక్ త్వమేవవిశ్వగోప్తాపి విశ్వంభర పవిత్ర

మసిహవిర్విశారద హవిఃకర్మా అమృతేంధన సురాసురగురో! మహదా

విదేవస్వదేవ ఊర్ధ్వకర్మన్ పూతాత్మన్ అమృతేశ దివః స్పృత్ విశ్వస్య

పతే! ఘృతార్చసి అనంతకర్మన్ ద్రుహిణవంశ స్వవంశవిశ్వ

పాస్త్వం త్వమేవ విశ్వం బభర్షి పరార్థినోనస్త్రాయస్వే తి॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో

కశ్యపుడు పరమాత్మను స్తుతించుట అను అరవైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# అరవైతొమ్మిదవ అధ్యాయము

## విష్ణువు దేవతలకు వరమిచ్చుట

బ్రహ్మజ్ఞాని ద్విజశ్రేష్ఠుడుఐన కశ్యపునిచే పలుకబడిన ఈగొప్పస్తోత్రమువిని భగవంతుడైన నారాయణుడు మేఘగంభీర మధురకంఠధ్వనితో ప్రేమపూర్వకంగా మంచిపదములు అక్షరాలుగల మాటను మహాత్ములైనదేవతలకు ఇలాచెప్పాడు. ఆమాట ఆకాశంనుండి వినిపించింది. దర్శనం మాత్రంకాలేదు. ఓదేవతోత్తము లారా! నేను వరమిచ్చేవాడను వరంకోరుకోండి నేను సంతోషించానుఅని విష్ణుమూర్తి పలికాడు.

అప్పుడు కశ్యపుడు ఓభగవంతుడా నీవు మాయెడల సంతోషంతో ఉంటే మేము మాపని పూర్తిచేసుకున్నట్లే. నీవే మాకుపరమగతివి. నీవు సంతోషిస్తే ఇంద్రునకు తమ్ముడవవుతూ అదితికి వామనుడవుగా జన్మించుము. దేవమాత అదితి కూడా భగవంతుని ఇదే వరంకోరింది. తరువాత విష్ణువు దేవతలను కశ్యపునీ కూర్చి ఇలాగే అగుగాక శభం మీయిష్టం నేరవేరుగాక. మీశత్రువులు క్షణంకూడా నాయెదుట నిలువలేరు. దేవతలకు శత్రువులైన అసురసమూహమును వధించి దేవతలు యజ్ఞంలో భాగాన్ని ముందుగా తీసుకొనేటట్లు చేస్తాను. మీరువచ్చినట్లు తిరిగి వెళ్ళవచ్చు అన్నాడు. భగవంతుడైన విష్ణువిట్లుపలుకగా దేవతలు సంతోషించి పూజించారు.

తరువాత విశ్వేదేవగణం, కశ్యపుడు, అదితి, సాధ్యగణం, దేవగణం మహా బలశాలియింద్రుడు వీళ్ళందరూ విష్ణుభగవానునకు నమస్కరించారు. తరువాత తూర్పుదిక్కునందున్న కశ్యపమహర్షి ఆశ్రమానికి వెళ్ళారు. దేవతలు కశ్యపమహర్షి ఆశ్రమంలో వేదం చదువుతూ అదితి గర్భాన్నికోరుతూ కాలం గడుపుతున్నాడు. అదితి వెయ్య సంవత్సరాలు తేజస్సుగల గర్భాన్ని ధరించింది. వెయ్యసంవత్సరాలు పూర్తయ్యాక ఒకపుత్రుడు జన్మించాడు. అతడు దైత్యుల వినాశానికి దేవతల రక్షణకు మూల కారణము. మూడులోకాలను సుఖ పెట్టేవాడు. దైత్యుల గర్వమణచే వాడు అగు భగవంతుడు భూమిమీద అవతరించగనే అంతటా ఆనందం వెల్లివిరిసింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
విష్ణువు దేవతలకు వరమిచ్చుట అను అరవైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# డెబ్బైయవ అధ్యాయము

## వామనావతారము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఏడుగురు ప్రజాపతులు సప్తమహర్షులూ ఆయనకు నమస్కారం చేశారు. భరద్వాజుడు మొదలగువాళ్ళు మరీచి మొదలగువాళ్ళునూ బాలకునికి నమస్కరించారు. ఇంకా చాలామంది మహర్షులు బాలునకి నమస్కరించారు.

అనేక విధాలైన అలంకారాలుధరించి అప్సరసలు నాట్యంచేశారు. గంధర్వుల వాద్యధ్వని ఆకాశంలో ప్రతిధ్వనించింది. ఇతరగంధర్వులతో కలిసి తుంబురుడు గానం చేశాడు. నారదుడు హాహా మొదలగువాళ్ళు కూడ భగవంతుని జన్మ సందర్భంగా గానంచేశారు. అందగత్తెలైన అప్సరసలు నృత్యంచేశారు. వేలాది అప్సరసలు నృత్య గీతాలలో పాల్గొన్నారు. ఆదిత్యగణం తొమ్మిదిమంది అప్పుడే పుట్టినబాలునికి నమస్కారం చేశారు. మరుద్గణము, అష్టవసువులు, సాధ్యగణం ఈ దేవతలందరూ చేతులు జోడించి ఆప్రదేశంలో నిలిచారు.

అప్పుడు లోకకర్తలలో పితామహుడు అయిన బ్రహ్మ మహాపురుషలందరితో అక్కడకుచేరి అన్నిలోకాలనూ సృష్టించు సనాతనపురుషుడు ఇక్కడజన్మించాడు. కనుక లోకేశ్వరుడైన భగవానునిక 'విష్ణు' వు అనేనామకరణం తగినదని దేవర్షులతో కలిసి బ్రహ్మదేవతలకు ప్రభువైన భగవంతునకు నమస్కరించి స్వర్గానికి వెళ్ళాడు. దేవాదిదేవుడైన భగవంతుడు విష్ణువు ఈవిధంగా కశ్యపమహర్షికి పుత్రుడుగా జన్మించాడు. చూడటానికి అతడు పొట్టిగాఉన్నాడు. శరీరకాంతి నీటితో నిండిన మేఘంకాంతిని పోలిఉన్నది. ఆయవక్షస్థలంమీద శ్రీవత్సమనే పుట్టుమచ్చ ప్రకాశిస్తున్నది. అప్సరసలు ఆశ్చర్యంతో రెప్పపాటులేకుండా అతన్ని చూస్తున్నారు. అతని వక్షస్థలము కంఠమూ విశాలంగా ఉన్నాయి. అతని శరీరమంతా మిక్కిలి సుందరంగా ఉంది. అతడు పుణ్యాత్ములకు గతియైనవాడు. అట్టి పరమాత్మ తన యోగబలంచేత బాలకరూపంతో ఓదేవతలారా మీకు ఏపనిచేయవలసిఉన్నది? నానుండి మీరు ఏవరంకోరుతున్నారు? అని అడిగాడు.

వామనుని మాటలువిని దేవతలు మిక్కిలి సంతోషించారు. మరియూ, చేతులుజోడించి పరమాత్మా! దైత్యరాజు బలిబ్రహ్మనుండి వరంపొంది మూడు లోకాల రాజ్యాన్నీ లాక్కున్నాడు. నీవుతప్ప ఎవడూ వానిని ఓడించేవాడు లేడు. కనుక మేము నిన్ను శరణుజొచ్చాము. హవిర్భాగాలకి మమ్మి మళ్ళీ అధి కారులనుగా చెయ్యి. ఇంద్రుని త్రిలోకరాజ్యానికి ప్రభువుగా చెయ్యి బలి యిప్పుడు అశ్వమేధయాగం చేస్తున్నాడు. ఈ సమయంలో తప్పక చేయదగిన పనిని నిర్ధారణ చేసి మమ్మి రక్షించవలసినదిగా కోరుతున్నాము అన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వామనావతారము అను డెబ్బైయవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఒకటవ అధ్యాయము

## బృహస్పతి వామనుని బలి యజ్ఞానికి తీసుకువెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! దేవతలమాటలు విని భగవంతుడైన వామనుడు వాళ్ళను సంతోష పెడుతూ మహర్షి అంగిరసుని పుత్రుడైన బృహస్పతి బలియొక్క యజ్ఞంలోకి నన్ను తీసుకువెళ్ళాలి. అక్కడకు వెళ్ళి ముల్లోకాల రాజ్యమూ తిరిగివచ్చే ఉపాయం ఆలోచిస్తాను అన్నాడు. తరువాత దేవగురువైన బృహస్పతి, వామనభగవానుని బలి యొక్క యజ్ఞభూమికి తీసుకు వెళ్ళాడు. ఆసమయంలో వామన భగవానుడు ముంజమేఖల, యజ్ఞపవీతం చేతిలో మోదుగదండము, కృష్ణాజినము, గొడుగు కలిగిఉన్నాడు. అతడు బాలకుడుగానే ఉన్నా బ్రహ్మాదిదేవతలు అతని వెనుక నడువ జొచ్చారు. ఇలా వామనుడు బలియజ్ఞశాలలో ప్రవేశించాడు. కోట్లాది దైత్యుల్ని బలి ద్వార రక్షణకు నియమించాడు. బలి పేక్షకులసమూహంవేచి ఉన్నప్పటికీ ఏబాధా లేకుండా వామనుడు అందరి మధ్య నుండి యజ్ఞశాలలో ప్రవేశించాడు.

అక్కడ ఋత్విక్కులు బలికి నలువైపులకూర్చొని ఉన్నారు. ఆసభ బ్రహర్షులతో నిండి ఉంది. ఆసభలో యజ్ఞసంబంధ విషయాలలో శుక్రాచార్యుడు మొదలగు ఋత్విక్కులను వామనుడు నోరు విప్పనివ్వలేదు. అందరూ ప్రతిభలేని వాళ్ళయ్యారు. వాదంలో అనేకులను వామనుడు ఓడించాడు. ఒకబాలుని ముందు అందరూ ఓడిపోవుట చూచిన బలి ఆశ్చర్యానికి హద్దులేదు. అప్పుడు బలితలపై చేతులజోడించి ఆదరంతో బాలక! నీవెవడవు? ఎవని కుమారుడవు? ఎక్కడనుండి వచ్చావు? ఇక్కడికేందుకు వచ్చావు? ఇటువంటి జ్ఞానంగల బ్రాహ్మణుని నేటి వరకూ నేను ఎప్పుడూ చూడలేదు. దేవతలలో ఎవని పుత్రుడూ ఇలా లేడు. నీవెవడవైనాకానీ నేనునీకు నమస్కరిస్తున్నాను. నీవుదయతో నేను మీకేం సేవ చెయ్యాలి. ఏఆజ్ఞను పాటించాలి? తెలియజేయగోరుతున్నా అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బృహస్పతి వామనుని బలి యజ్ఞానికి తీసుకువెళ్ళుట అను డెబ్బై ఒకటవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై రెండవ అధ్యాయము

## వామనుడు బలిని మూడడుగుల భూమిని కోరుట

రాజా! బలి యిలా మాట్లాడిన తరువాత అచింత్యాత్ముడు ఉపాయముల తత్త్వం తెలిసిన వామనదేవుడు కొంచంనవ్వి ఓ దైత్యరాజా! మీరు చాలా శ్రేష్ఠమైన యజ్ఞాన్ని ప్రారంభించారు. ఆహారపదార్థాలు బాగా సమకూర్చారు. పూర్వం బ్రహ్మ చేసినట్లు యజ్ఞం చేస్తున్నారు. ఇంద్రుడుగాని, యముడు లేక వరుణుడుగాని ఇలా యజ్ఞం చేయలేదు.

దానవరాజా! తమయజ్ఞం అన్నిటికంటే శ్రేష్ఠంగాఉంది. అన్ని యజ్ఞాలలోకీ శ్రేష్ఠమైన అశ్వమేధయాగం చేయటంచేత పాపం కొంచం కూడా మిగిలిఉండదు. స్వర్గం తేలికగా ప్రాప్తిస్తుంది. అశ్వమేధయాగంవల్ల కోరికలన్నీ తీరుతాయని వేదవేత్తలు చెపుతారు. అన్ని యజ్ఞాలకీ యిదిమూలం. అన్ని యాగాలలో అశ్వమేధం శ్రేష్ఠమైనట్లు దైత్యులందరిలో మీరు శ్రేష్ఠులు అన్నాడు. వామనదేవుని మాటలువిని బలి మిక్కిలి సంతోషించి బ్రాహ్మణోత్తమా! నీవెవరి కుమారుడవు? ఏంకోరుతున్నావు? నీవేదడిగినా ఇస్తా. సంకోచించక అడుగు. నీకోరిక తీర్చబడుతుంది అన్నాడు.

అప్పుడు వామనుడు దానవరాజా! నేను రాజ్యముగాని వాహనం లేక రత్నాలను సుందరస్త్రీనిగాని కోరుటలేదు. మీరు నాపై ప్రసన్నులైతే మీకు ధర్మం మీద అభిరుచి ఉంటే అగ్నిరక్షణకొరకు మూడడుగులు భూమిమాత్రమే దానం చేయండి అన్నాడు. దైత్యరాజు బలివక్తలలో శ్రేష్ఠవమైనవాడా! మూడడుగుల భూమితో నీకుఏంలాభం? ఒకకోటి అడుగులభూమి అడుగు. నేను నీకోరిక పూర్తి చేస్తాను అంటుండగా శుక్రాచార్యుడే మహారాజ! ఇలా భూదానం ఎప్పుడూ ఇవ్వ వద్దు. ఎందుకంటే మీరు ఈతన్ని బాగా ఎరుగరు. ఇతడు కపటవేషంధరించిన విష్ణువు. ఈతడు ఇంద్రునికి మేలుచేయుటకై మిమ్ము మోసగించటానికి వచ్చాడు అని బోధించాడు.

తరువాత చాలసేపు ఆలోచించి ఇతని కంటే యోగ్యుడెవడు దానానికి దొరుకుతాడు? అనే ఆలోచనరాగానే ఆతనిశరీరం గగుర్పొడిచింది వెంటనే బంగారు చెంబుపట్టుకొని బ్రాహ్మణోత్తమా! మీరు తూర్పు ముఖంగా కూర్చోండి.

మీకోరిక తీర్చటానికి సిద్ధంగా ఉన్నాను అన్నాడు. వామనుడు నేను కూర్చోనే ఉన్నానన్నాడు. బలి ఇప్పుడు అడుగు అన్నాడు. వామనుడు దానం చేయండి అన్నాడు. బలిదేనిని? అని ప్రశ్నిచాడు. వామనుడు భూమిని అన్నాడు. బలి ఎంత భూమి? అన్నాడు. వామనుడు మూడడుగులు మాత్రమే అన్నాడు. బలి ఇచ్చేశా అన్నాడు. వామన భగవానుడు అయితే నీళ్ళు తీసుకొని సంకల్పం చెయ్యండి నేను మాట తప్పను అని చెప్పండి అన్నాడు.

అప్పుడు శుక్రాచార్యుడు దైత్యరాజ! మీరుదానం ఈయవద్దు అన్నాడు. రాజు ఎందుకు? అని ప్రశ్నించాడు. శుక్రాచార్యుడు ఈయనను నేను బాగా ఎరుగుదును అన్నాడు. బలి ఎవరితడని ప్రశ్నించాడు శుక్రాచార్యుడు ఈతడు విష్ణువు అన్నాడు. అప్పుడు బలిఐతే సంతోషించదగినమాట అన్నాడు. శుక్రా చార్యులు మోసపోయానన్నాడు. నేను మోసపోలేదని బలి అన్నాడు. శుక్రాచార్యుడు ఎందుకు? అని ప్రశ్నించాడు. అప్పుడు బలి జగత్పతి విష్ణువు స్వయంగా నా యజ్ఞానికి వచ్చి అడిగిన దాన్ని దానంచేశాను. అతనికంటే దానానికి తగినవాడెవడు? అని పలికి బలి చక్రవర్తి నీటిని చేతిలో వేసుకొని విడిచిపెట్టాడు.

వామనభగవానుడు ఓపుణ్యాత్ముడా! మీరు నాకు మూడడుగులు భూమిని ఇవ్వాలి మాట తప్పకూడదు అన్నాడు. మహారాజా.బలి వామనుని మాటలు విని నీకోరిక పూర్తి అవుతుంది అని నీటిపాత్రను చేతపట్టుకొన్నాడు. వామనుడు చేయిచాచాడు. తూర్పుముఖంగా కూర్చుని రాజు సంతోషంతో వామన భగవానుని చేతితో నీటిని విడుచుటకు సిద్ధపడుచుండగా ప్రజ్ఞాశాలియైన ప్రహ్లాదుడు వామనుని దివ్యరూపాన్ని చూచి దానమును అడ్డుకొంటూ దైత్యరాజా! ఈ వామనుని చేతిలోనీళ్ళువిడువవద్దు. పూర్వం ఇతడు మీతాతఅయిన హిరణ్యకశిపుని చంపినవాడు. ఆవిష్ణుమూర్తే యితడు. ఇప్పుడు మిమ్ము మోసం చేయటానికి వచ్చాడు అని చెప్పాడు.

దైత్యరాజు నేనీతనికి తప్పక దానమిస్తా. బ్రహ్మకంటే శ్రేష్ఠుడు ఇతడుదానానికి ఇంతటి యోగ్యుడెక్కడ దొరుకుతాడు? విశేషంగా నేను ఇప్పుడు యజ్ఞదీక్షతో ఉన్నాను. కనుక ఇతనికి దానమివ్వటం నాకర్తవ్యం అని అసుర సమూదాయం మధ్యమాట్లాడి ఆదిదేవుడైన వామనభగవానునికి మూడడుగుల భూమిని దానం చేశాడు. అప్పుడు ప్రహ్లాదుడు దానవరాజా! ఇతనికి మీరు దాన మీయవద్దు. నృపింహ భగవానుడే మళ్ళీ ఇలా వచ్చాడు. అని పలుకగా బలిచక్రవర్తి అతన్ని

మందలిస్తూ ఇస్తానని పలికి ఇవ్వకపోతే పాపాత్ముడౌతాడు కాబట్టి తప్పక దానం చెయ్యాలి. ఇలాచేయటంచేత నామనస్సు శాంతిస్తుంది. నా జీవితంలో ఇలాంటి యాచకుణ్ణి పొందలేను. కనుక నీవు అర్థగించినా దానం చేస్తున్నాను.

అని పలికి మరల వామనునితో విస్తారమైన భూమిని నీకిస్తానన్నాడు. ఇంత మాత్రమే నాకు చాలన్నాడు వామనుడు. మూడడుగుల భూమినీ బలిదానం చేశాడు. దానజలంచేతిలో పడటంతోనే వామనుడు వామనుడుగా లేకుండాపోయాడు. ఒక్కసారిగా సమస్త దేవతా స్వరూపాన్ని ధరించాడు. అప్పుడు భూమి అతని పాదాలు ఆకాశంశిరస్సు సూర్యచంద్రులతని నేత్రాలు పిశాచాలు కాలివ్రేళ్ళు యక్షులు ఉంగరాలు విశ్వదేవతలు మోకాళ్ళు అశ్వినీకుమారులు చెవులు, వాయువు ముక్కు, ఇంద్రుడు తేజస్సు, వేదములు స్తనములు, ఇలా సర్వదేవమయమైన రూపాన్నిచూచి భగవంతునిపై వచ్చిపడ్డారు రాక్షసులు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వామనుడు బలిని మూడడుగుల భూమిని కోరుట అను డెబ్బై రెండవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై మూడవ అధ్యాయము

## వామనుడు మూడులోకాల నాక్రమించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలో ఏయే మహాత్ములైన దానవులున్నారో వాళ్ళపేర్లు రూపం ఆభరణాలు ప్రధాన శస్త్రాస్త్రములను చెపుతా విను.

విప్రచిత్తి, శిబి, శంకు, అయశ్శంకు, అయశ్శిరస్సు, అశ్వశిరస్సు, హయగ్రీవ, వేగవంత కేతుమంత అత్యుగ్ర, అగ్రవ్యగ్ర పుష్కర పుష్కల, అశ్వారూఢ, అశ్వపతి, ప్రహ్లాద, కుంభ, సంహ్లాద, అనుహ్లాద, హరి, హర, వరాహ, సంహర, రుజ మొదలగు వారు చాలామంది రాక్షసులు ఆ సమయంలో వామనరూపం ధరించిన విష్ణు భగవానుని ఎదుర్కొన్నారు. వాళ్ళు ప్రాస, శతఘ్ని, పరిఘ, మహాశని, రోకలి, చెట్టు, ధనస్సు, గద, భుశుండీ, కంపన, ఖడ్గం మొదలైన అనేకశస్త్రాస్త్రాలను ధరించి ప్రకాశిస్తున్నారు. వాళ్ళు అనేకవిధాలైన ఆకారాలు అనేకవిధాలైన వేషాలు కలిగిఉన్నారు. తాబేలు ముఖంవాళ్ళు, కోడిముఖం గలవాళ్ళు, ఏనుగుముఖం గాడిద ముఖం ఒంటెముఖం ఇలా అనేక విధాలైన ముఖాలుగల వాళ్లున్నారు.

చాలామంది ముఖాలు ఆవు, మేక ముఖాలను పోలిఉన్నాయి. లేడిచర్మం, నార వస్త్రం ధరించారు కొందరు వీరులు ధరించే వస్త్రాలు కొందరు ధరించారు. కొందరు కిరీటం ధరించారు. కుండలాలను కొందరు ధరించారు.

ఆరాక్షసులందరూ గొప్ప తేజశ్శాలురు. అనేకవిధాలైన వేషాలు పూల దండలుమై పూతలు ధరించారు. వీళ్ళందరూ వామనభగవానుని ఎదుర్కొన్నారు. అప్పుడు దేవాదిదేవుడైన వామనడు కాళ్ళతోతన్ని లెంపలు వాయించి ఆరాక్షసులను చంపి వేశాడు. తన రెండు పాదాలనూ పెంచి మూడులోకాల రాజ్యాన్ని హస్తగంతం చేసుకున్నాడు. ఆయన భూమిని ఆక్రమించేటప్పుడు సూర్యచంద్రులు వక్షస్థలం మీద ఆకాశంపొట్టలో, స్వర్గం కాళ్ళ క్రిందపడింది ఇలా వ్యాపించి త్రిలోకరాజ్యాన్ని మరల ఇంద్రునకు ఇచ్చాడు. భూమిక్రిందున్న పాతాళలోకాన్ని విష్ణుభగవానుడు బలికి ఇచ్చాడు రాక్షసరాజు అక్కడ నివసింపసాగాడు.

బలి నేనేమిచేయాలో చెప్పమని విష్ణువునడిగాడు. అప్పుడు విష్ణువు నీకు వరమిస్తాను కోరుకో ఇష్టప్రకారం కోరికను తీర్చుకోఅన్నాడు. ఇంద్రుని మాటను కాదనవద్దు. నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను ఈవిధంగా నీవు శ్రేయస్సును పొందు తావు. నీవు దానధారను నాచేతియందుంచావు కాబట్టి నీకు దేవతల వల్ల ఎప్పుడూ బయ ముండదు. సుతలమనే పాతాళలలోకంలో నీఅనుచరులతో నివసించుము. దైత్యగణములు నీతో ఉంటాయి. ఇది నా అనుగ్రహము. నాశాసనాన్ని మనస్సులో తలచుకొని ఇంద్రుని ఆజ్ఞనుకాదనవద్దు. ఓ మహాసుర! దేతలందరూ నీకు పూజింప దగినవారే. అనేకవిధాలైన భోగాలను కోరిన వాటిని పొందుతావు. దక్షిణలతో కూడిన యాజ్ఞలను చేస్తావు. నీ అనుగ్రహంవల్ల దైత్యులందరకు ప్రభువుగా ఉంటావు. నేను చెప్పిన హద్దునుమీరితే దేవతలు నిన్ను నాగపాశాలతో చంపుతారు. ఇంద్రుడు మొదలైన దేవతలు నిత్యమూ నమస్కరింపదగినవారు. నీకు అన్న అయిన ఇంద్రుని ఆజ్ఞ ఎల్లప్పుడూ అనుసరించుము అని బోధించాడు.

అప్పుడు బలిదేవదేవ! శుభాభాగ! శంఖచక్రగదాధర! మీరు నానివాసానికి పాతాళం నిశ్చయించారు. కాని అక్కడ నాజీవనం ఎలా? అక్కడుండే టప్పుడు తృప్తిగా ఉండటానికి తగినవిధానము ఏర్పరచండి అనిఅడిగాడు. భగవంతుడు అసురవార్య! శ్రోత్రియులు, శ్రద్ధ, దక్షిణాలేని యజ్ఞాలలో ఋత్విక్కు కాక ఇతరులు ఇచ్చేఆహుతులు. అశ్రద్ధగా ఈయబడిన దానము, సంస్కరింపబడని హవిస్సు, ఈ ఆరు ద్రవ్యాలు నీకు ఎప్పుడూ ప్రాప్తిస్తూ ఉంటాయి. శాస్త్రవిరుద్ధ కార్యములవల్ల

కలిగే పుణ్యంమీద నీవు అధికారివి. బలి ఈమాటలను శుభమని స్వీకరించాడు. అతని ఆజ్ఞను తలదాల్చి పాతాళానికి వెళ్ళాడు.

తరువాత భగవంతుడు రాజ్యాని ఇలావిభజించాడు. తూర్పుదిక్కు ఇంద్రుడికి, యముడికి దక్షిణదిక్కు, వరుణుడికి పడమరదిక్కు, ఉత్తరదిక్కు కుబేరుడికి, నాగరాజుకి భూమిక్రింద, చంద్రుడికి పైభాగాన రాజ్యమును విభజించి యిచ్చాడు. విష్ణుభగవానుడీవిధంగా మూడులోకాల రాజ్యాన్నీ విభజించిన తరువాత దేవతల ఆందోళన శాంతించింది. ఈ నిర్ణయప్రకారం ఇంద్రుడు మూడులోకాలకు రాజయ్యాడు. మహర్షులు భగవంతుని తగినట్లు సత్కరించారు. ఈ మహాకార్యాన్ని పూర్తి చేసి విష్ణువు తన నివాసస్థానానికి వెళ్ళాడు. అప్పుడు ఇంద్రాది దేవతల ఆనందానికి హద్దులేదు. తరువాత నాగబంధంచే దుఃఖపడుతున్న రాజు బలివద్దకు నారదుడువచ్చాడు.

ఏడుతలలు గల పాములతో బలినిబంధించి విష్ణువుభగవానుడు తనస్థానానికి వెళ్ళాడు. నాగపాశబంధంచేత భయపడుతూ మిక్కిలి కష్టపడుతున్న బలిని చూచి దయార్ద్ర చిత్తుడైన నారదుడు దైత్యరాజా! నీకీబంధంతెగిపోయే ఉపాయం చెప్పుతున్నాను విను! నీవు భగవంతునిపై మనస్సును లగ్నంచేసి వాసుదేవుని స్తోత్రం చెయ్యి. ఇలా చేస్తే త్వరగా బంధంనుండి విడవబడతావు. అని చెప్పి నారదుడు బలికి మంత్రం ఉపదేశించాడు. దైత్యరాజుకూడ ప్రశాన్తమనస్సుతో చేతులు జోడించి మంత్రదీక్షతీసుకున్నాడు విష్ణుభగవానుని స్తుతించి జపం చేయసాగాడు. నారదుడు చెప్పిన స్తోత్రం చదివి భూమిని ఉద్ధరించిన ఆభగవంతుని జపంచేశాడు.

## నారదుడు బలికి చెప్పిన విష్ణుభగవానుని స్తోత్రము

శ్లో॥ ఓం నమోஉస్త్వనం తపతయే అక్షయాయమహాత్మనే।
జలేశయాయ దేవాయ పద్మనాభాయవిష్ణవే॥
సప్తసూర్యవపుఃకృత్వా త్రీన్‌లోకాన్ క్రాన్తవానసి।
భగవాన్ కాలకాలస్త్వం తేనసత్యేనమోక్షయ॥
నష్టేచంద్రార్కగమనే క్షీణేయజ్ఞతపఃక్రియే।
పునశ్శ్రేష్ఠయసేలోకాన్ తేనసత్యేనమోక్షయ॥
బ్రహ్మారుద్రేంద్రవాయ్వగ్ని సరిద్భుజగపర్వతాః
త్వత్ స్థాద్పృష్టాద్విజేంద్రేణ తేన సత్యేనమోక్షయ॥

మార్కండేయేనతుపురా ప్రవిశ్యజఠరంతవ।
చరాచరగతందృష్టం తేనసత్యేనమోక్షయ॥
ఏ కోవిద్యానహోయస్త్వం యోగేయోగముపాగతః।
పునస్త్రైలోక్యముత్సృజ్య తేనసత్యేనమోక్షయ॥
జలశయ్యాముపాసీనో యోగనిద్రాముపాగతః।
లోకాంశ్చింతయసేభూయః తేనసత్యేనమోక్షయ॥
వారాహంరూపమాస్థాయ వేదయజ్ఞపురస్కృతమ్।
ధరాజలోద్ధృతాయేన తేనసత్యేనమోక్షయ॥
ఉద్ధృత్యదంష్ట్రయా యజ్ఞాం స్త్రీన్ పిండాన్కృతవానసి।
త్వంపితౄణామపిహరే తేనసత్యేన మోక్షయ॥
ప్రద్రుద్రువు స్సురాస్సర్వే హిరణ్యాక్షభయార్దితాః।
పరిత్రాతాస్త్వయా దేవతేనసత్యేన మోక్షయ॥
దీర్ఘవక్త్రేణ రూపేణ హిరణ్యాక్షస్యసంయుగే।
శిరోజహారచక్రేణ తేనసత్యేనమోక్షయ॥
భగ్నమూర్ధాస్థిమస్తిష్కో హిరణ్యకశిపుఃపురా।
హుంకారేణహతో దైత్య స్తేనసత్యేమోక్షయ॥
దానవాభ్యాం హృతావేదా బ్రహ్మణఃపశ్యతఃపురా।
పరిత్రా తాస్త్వయాదేవ! తేనసత్యేనమోక్షయ॥
కృత్వాహయ శిరోరూపం హత్వాతుమధుకైటభౌ।
బ్రహ్మణే తేఽర్పితావేదాస్తేన సత్యేనమోక్షయ॥
దేవదానవగంధర్వా యక్షసిద్ధమహోరగాః।
అంతంతవనపశ్యంతి తేనసత్యేనమోక్షయ॥
అపాన్తరతమానామ జాతోదేవస్య వైసుతః।
కృతాశ్చతేనవేదార్థాః తేనసత్యేనమోక్షయ॥
వేదయజ్ఞాగ్ని హోత్రాణి పితృయజ్ఞహవీంషిచ।
రహస్యం తవదేవస్య తేనసత్యేనమోక్షయ॥
ఋషిర్దీర్ఘతమానామ జాత్యం ధోగురుశాపతః।
త్వత్ప్రసాదాచ్చ చక్షుష్మాన్ తేనసత్యేనమోక్షయ॥

గ్రాహగ్రస్తంగ బేద్ధంచ దీనం మృత్యువశంగతమ్।
భక్తంమోక్షితవాంస్త్వంహి తేనసత్యేనమోక్షయ॥
అక్షయశ్చావ్యయశ్చత్వం బ్రహ్మణ్యో భక్తవత్సలః।
ఉచ్ఛ్రితానాం నియన్తాసి తేనసత్యేనమోక్షయ॥
శంఖం చక్రంగదాంపద్మం శార్ఙ్గంగరుడమేవచ।
ప్రసాదయామిశిరసా తేబంధాన్మోక్షయస్తుమామ్॥
శంఖచక్రగదాతూణ శార్ఙ్గంచగరుడాదయః।
హరింప్రసాదయామాసుః బలిమోక్షయబంధనాత్॥
తతః ప్రసన్నో భగవానాదిదేవః బాగేశ్వరమ్।
గరుడం నాగహన్తారం బలిం మోక్షయబన్ధనాత్॥
తతోవిక్షిప్య గరుడః పక్షావతుల విక్రమః।
జగామ వసుధామూలం యత్రాస్తే సంయతోబలిః॥
ఆగమంతస్య విజ్ఞాయ నాగాముక్త్వా మహాసురమ్।
యయుః పురీంభోగవతీం వైనతేయ భయార్దితాః॥
ముక్తం కృష్ణప్రసాదేన చింతయానమ ధోముఖమ్।
భ్రష్టశ్రియమువాచేదం గరుత్మాన్పన్నగాశనః॥
దానవేంద్ర మహాబాహో విష్ణుస్త్వామబ్రవీత్ప్రభుః।
ముక్తోనివసపాతాలే సపుత్రజనబాంధవః॥
ఇతస్త్వయానగన్తవ్యం గన్తవ్యమపిదానవ।
సమయంయదిభిన్ద్యాస్త్వం మూర్ధాతేశతధా భవేత్॥

ఈ స్తోత్రం చేత ప్రసన్నుడై విష్ణువు గరుత్మంతునితో బలిని బంధవిముక్తిని చేయమనగా అతడు బలివద్దకు వచ్చాడు. అతడు వస్తున్నాడని తెలిసి సర్పాలు రాక్షసరాజును విడిచి బోగవతీపురానిక వెళ్ళిపోయాయి. భగవంతుని అనుగ్రహం చేత బంధముక్తుడై తలవంచుకొని విచారిస్తున్న బలితో గరుత్మంతుడు దానవ రాజా! నీవు పాతాళంలోనే నివసించాలి ఎక్కడకూ వెళ్ళకూడదు. ఈశపథం తప్పి నడిస్తే నీతల నూరు ముక్కలౌతుందని భగవంతుడు నీకు చెప్పమన్నాడు. అని చెప్పాడు.

పక్షిరాజు మాటలువిని దైత్యరాజు నేను అనంతుని ఆజ్ఞను పరిపాలిస్తాను అన్నాడు. శ్రీ అనన్త భగవానుని సమస్తపాపములు నశింపజేయు ఈస్తోత్రాన్ని భక్తితో పఠించువాడు తన పాపములన్నీ నశించినవాడుకాగలడు. ఈస్తోత్రము పఠిస్తే గోహత్య బ్రహ్మహత్య పాపాల నుండి కూడ విముక్తుడౌతాడు. దీన్ని పఠించిన వాడు పుత్రవంతుడౌతాడు కన్య తనకిష్టమైన వరుని పొందుతుంది. స్త్రీకి ప్రసవబాధ ఉండదు. గర్భవతి పుత్రవతి అవుతుంది. సాంఖ్యయోగ మతాల నవలంబించిన వాళ్ళు శ్వేతద్వీపంలో నివసిస్తారు. ఏకోరికనైనా ఈస్తోత్రం తీర్చగలదు.

ప్రాతఃకాలమందు మనస్సును వశమందుంచుకొని దీన్ని పఠిస్తే కోరికలన్నీ తీరుతాయి. ఇందులో సందేహంలేదు. ఇదేభగవంతుడైన వామనుని అవతారకథ. వేదవేత్తలైన బ్రాహ్మణులు ఈకీర్తిని పొగడుతారు. పర్వదినమందు భక్తితో భగ వంతుని ఈకథ విన్నవాడు ఈలోకంలో విష్ణువుతో సమానుడై శత్రువుల జయించి పరలోకంలో ఉత్తమగతిని పొందుటకు సమర్థుడౌతాడు. నిర్మలమైనకీర్తిని పొందు తాడు. విశాలసంపదగల వాడౌతాడు. అందరికీ ఇష్టుడౌతాడు. పుత్రపౌత్ర ఆరోగ్య గుణసంపదలు వృద్ధిచెందుతాయి. అకథను చదివే వాడు చదివించేవాడు భగ వంతునికి ఇష్టుడౌతాడు. తనకోరికలన్నీ తీరినవాడౌతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
వామనుడు మూడులోకాల నాక్రమించుట అను డెబ్బై మూడవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై నాల్గవ అధ్యాయము

## కృష్ణుడు కైలాసానికి వెళ్ళగోరుట

ఇంతవరకు విని జనమేజయమహారాజు బ్రహ్మర్షీ! దేవదేవుడైన విష్ణువు అందరికీ ఉపాసింపదగినవాడు కదా! శంకరుని కైలాసపర్వతానికి ఎందుకు వెళ్ళాడు. నారదుడు మొదలగు ఋషిసమూహం కూడా ఆపర్వతంమీద శంకరునితో కలిశారు. పూర్వం విష్ణువు కూడ కఠోరమైన తపస్సు చేసి శంకరుని ఆరాధించాడని, ఇంద్రుడు మొదలగు దేవతలు కూడ ఆపర్వతంమీద జగన్నాథుడైన హరిని, దేవ దేవుడగు శంకరునితోపాటు ప్రత్యక్షంచేసికొన్నారనీ, ఈవృత్తాంతాన్ని పూర్వం

కృష్ణ ద్వైపాయనుని వల్ల వినియున్నాను. కైలాసపర్వతం మీద వాళ్ళిద్దరూ కలుసు కొన్న తరువాత ఏర్పడిన సంఘటన వారిద్దరినీ చూచి ఋషులు చెప్పిన వృత్తాంతం పూర్తిగా వినగోరుతున్నాను అన్నాడు. వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! ఏకాగ్రతతో విను. వేదవ్యాస భగవానుడు నాకు చెప్పినవిధంగా కేశవు నకు నమస్కరించి నాశక్తి కొలది జ్ఞానంకొలది చెపుతాను. ఈవిషయం వినగోరని వానికి, క్రూరునికి, తపస్సు చెయ్యనివానికి వేదంచదవనివానికి చెప్పకూడదు. ఈ వృత్తాంతము పుణ్యమునిచ్చునది. స్వర్గమును, కీర్తిని, ధనాన్ని, బుద్ధిని, శుద్ధిని కలుగచేసేది. పుణ్యాత్ములు నిత్యమూ ధ్యానించతగినది నారదాదిమునులు నిత్యము దీనిని సేవిస్తారు. లోకంలో అసురగణములు మరణించగా శత్రువులు కొద్దిమంది ఉండుగా జగన్నాథుడైన శ్రీకృష్ణుడు వృష్ణివంశీయులతో ద్వారకయందు రుక్మిణీదేవితో నివసిస్తూ ఒకనాడు రాత్రి ఆమెతో విహరించాడు. అప్పుడు రుక్మిణీ దేవి ఓదేవేశ నీవలన పుత్రుని కనవలెనని కోరుతున్నానన్నది. నీవు అందరికీ అన్నీ ఇస్తావు నీవేసమస్తానికి కర్తవుదాలవు, అనుభవించేవాడవు. నేను నీకు భక్తురాలనైతే నాపై అనుగ్రహండుంటే వీరుడైన కుమారుని ప్రసాదించమన్నది.

అప్పుడు శ్రీకృష్ణుడు నీవుకోరినట్టి పుత్రుని నీకు కలుగజేస్తాను. పుత్ అనగా నరకం దానినుండి రక్షించేవాడు పుత్రుడు. కాబట్టి పుత్రుని కోరుతారు. పుత్రులు లేనివాడు ఉత్తమలోకాలను పొందడు. చెడ్డబిడ్డలకన్న దానికంటే గొడ్రాలు శ్రేష్ఠ రాలు. కనుక సత్పుత్రుని కోరతాడు పండితుడు. కాబట్టి నీకు యోగ్యుడైన పుత్రుని కలుగచేస్తాను. ఇదిగో పుత్రసంతానం కోసం కైలాసానికి వెళ్తున్నాను. అక్కడ మహాదేవుని ఉపాసించి పుత్రుని పొందుతాను. తపస్సు చేత బ్రహ్మచర్యం చేత విరూపాక్షుని సంతోషపెట్టి కార్యం సాధిస్తాను. ఇప్పుడే శంకరుని చూడటానికి వెళ్తాను. అతడు నాకు పుత్రుని కలుగజేస్తాడు. అక్కడకు వెళ్ళి పార్వతిలో కలిసి యున్న శివునికి నమస్కరించి మునులు సేవించునట్టి బదరి కారణ్యానికి వెళ్ళాడు. అక్కడ మునులు, సిద్ధులు, ఇతిహాసపురాణాలు తెలిసినవాళ్లు సేవిస్తున్నట్టియు రేగుపండ్లు కల ఆప్రదేశానికి వెళ్ళి నిశ్చయించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
కృష్ణుడు కైలాసానికి వెళ్ళగోరుట అను డెబ్బైనాల్గవ అధ్యాయము

☆☆☆

# డెబ్భై ఐదవ అధ్యాయము

## బలరామాదులపై నగర రక్షణ బాధ్యత నుంచుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తెల్లవారగానే భగవంతుడైన కృష్ణుడు కైలాసానికి వెళ్ళాలనికోరికతో అగ్నిలో ఆహుతిఉంచి, ఇతర మంగళకృత్యాలను నెరవేర్చి బ్రాహణులకు దక్షిణ యిచ్చాడు. ఎంతోమంది బ్రాహ్మణులకు గోవులను కూడ దానంచేశాడు. తరువాత ఆ బ్రాహ్మణులకు నమస్కారం చేసి తన ఇంటి లోపలకు వెళ్ళాడు. అక్కడ ఆసనంపై కూర్చుని, బలదేవ, సారణ, ఉగ్రసేన ఉద్ధవాది మహాత్ములను ఇతర యాదవులనూ పిలిచి శ్రీకృష్ణుడు ఓ యాదవులారా! నేనిప్పుడు చెప్పేదాన్ని శ్రద్ధగా వినండి. చిన్నప్పటినుండి దుష్టులను అణచివేయుటకు ఎలా నేను ప్రయత్ని స్తున్నానో మీకు బాగా తెలుసు. అనేకమంది రాక్షసులను సంహరించాను. గోవర్ధన పర్వతమెత్తి గోకులాన్ని రక్షించాను. బలవంతులైన ఎంతమంది రాక్షసులనో సంహరించాను.

ఇప్పుడు నాకు ప్రబల శత్రువు పౌండ్రకుడు. సమయందొరికితే నాపట్టణాన్ని ఇబ్బంది పెట్ట చూస్తున్నాడు. అతడు సామాన్యుడుకాడు. కాబట్టి మీరెల్లప్పుడూ ధనుస్సులు ధరించి జాగరూకతతో ఉండాలి. నేను కొంచంపనిమీద కైలాస పర్వతానికి వెళ్తున్నాను. అక్కడ శంకరభగవానుని చూడాలనుకుంటున్నాను. నేను తిరిగివచ్చేవరకూ మీరు సావధానంగా ఉండండి. వాడు ఈ పట్టణాన్ని యాదవులు లేని దానిగా చేయగలడు. కనుక ఓరాజులారా! మీరు ఖడ్గపాశాది ఆయుధాలతో సిద్ధంగా ఉండండి. పట్టణం ద్వారాలన్నీ మూసివేయండి. అవసరానికి ఒక ద్వారం తెరిచి ఉంచండి. పట్టణం వెలుపలికి వెళ్ళేవాళ్ళు రాజముద్రను పొందాలి. నగరం లోకి వచ్చే పోయేవాళ్ళపై ఒకకన్ను వేసి ఉండండి. యాదవులకీవిధంగా చెప్పి శ్రీకృష్ణుడు సాత్యకితో ఇలా చెప్పాడు

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో

బలరామాదులపై నగర రక్షణ బాధ్యత నుంచుట అను డెబ్బై ఐదవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఆరవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు బదరికాశ్రమానికి వెళ్ళుట

సాత్యకీ! నీవు నామాటవిను. నీవు ఏమరపాటులేని యోధుడవుగా ఉండాలి. కవచం ధరించ ఖడ్గాది ఆయుధాలతో చాలమంది రాజులుగల ఈపట్టణాన్ని రక్షించాలి. ఓయదుశ్రేష్ఠా! రాత్రిపూట నిద్రపోవద్దు. శాస్త్రాలోచన నీకుబాగా ఇష్టమైనది. కొన్నిరోజులుపాటు శాస్త్రోపన్యాసాలు మధ్యలో వాదవివాదాలూ చేయవద్దు. నీవు బలవంతుడైన యోధుడవు. ధనుర్వేదంలో పండితుడివి. కనుక ఓవీరుడా! నా పట్టణం నవ్వులపాలు కాకుండునట్లు గట్టియేర్పాట్లుచెయ్యి. అనిచెప్పగా సాత్యకి, ఓజనార్దనా! నీవు చెప్పిన దానిని నాశక్తికొలది పాలిస్తాను. ఓజగన్నాథ! ప్రయత్న పూర్వకంగానీ ఆజ్ఞను శిరసావహిస్తాను. నీవు తిరిగి వచ్చేవరకూ సేవకుడిలాగా కాపలా కాస్తాను. నీదయఉంటే శత్రువులనణచటంలో సమర్థుడనే దేవతలు వచ్చినవాళ్ళను ఓడించుతాను. పౌండ్రకుడెంతవాడు? మీరు స్వేచ్ఛగా పనిసాధించుకొనిరండి. నేనెప్పుడూ ఆలోచిస్తూ ఉంటాను అన్నాడు

తరువాత ఉద్ధవుడితో నాయనా! ఉద్ధవా నామాట విని నీవు నీతినైపుణ్యంతో ద్వారకానగరాన్ని రక్షించు. నీవు జాగ్రత్తగా ఉండి రక్షణలో నాకు సహాయంచెయ్యి. నీకు చెప్పవలసిందేమీలేదు. ద్వారకానగరం బాగా రక్షింపడటమే చేయదగినపని. అని చెప్పగా ఉద్ధవుడు గోవిందా! నీవు సమస్త ప్రపంచానికే రక్షకుడవు భక్షకుడువు కూడ వేదవిద్వాంసులునీ గుణాల్నిగానం చేస్తారు. నీతిని నిర్ధారించుటలో నేర్పరివి. నీతిని సృష్టించినవాడవే నీవు. భేదనీతిని ఉపయోగంలోకి తెచ్చావు. ఇదియే నీతి తెలిసినవాళ్ళ సిద్ధాంతము. విద్వాంసులన్ని విషయాలలోనూ నిన్నే ప్రమాణంగా తీసుకొంటారు. సమస్తభారమూ నీపై ఉంది. ఏది చేయదగినదో దానిని చేయుము. నీతిశాస్త్రపండితుడైన ఉద్ధవుడు. ఇలా మాట్లాడి ఊరుకొన్నాడు.

తరువాత సభలో కృష్ణుడు బలరామ హార్దిక్యలకు ఉగ్రసేనునకూ ఈమాటలే చెప్పాడు. తరువాత బలరామునితో ఆర్యా! నీవు ఆలోచిస్తూ ఉంటావుకదా! నీవుండటచేత ప్రపంచంలో ఏవినాశం సంభవించటం లేదు. నీవు క్రీడాసక్తివిడిచి గదను ధరించి, ద్వారకానగరాన్ని రక్షించాలి. లేకపోతే మనంపరిహాసం పాలవుతాం,

సాధించాల్సిన పనిలో నిరుత్సాహము చూపవద్దు. అనిచెప్పగా బలరాముడు 'తథాస్తు' అన్నాడు. తరువాత సభసమాప్తి చెందింది. వృష్ణివంశయాదవులందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళారు. శ్రీకృష్ణుడు కైలాసానికి ప్రయాణమయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు బదరికాశ్రమానికి వెళ్ళుట అను డెబ్బై ఆరవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఏడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు ప్రయాణము

వైశంపాయనుడిలా చెప్పాడు.

తరువాత భగవంతుడైన విష్ణువు పక్షిరాజైన గరుడుని మనస్సులో తలచుకొని త్వరగా రమ్మన్నాడు. వేదస్వరూపుడైన గరుత్మంతుడు యజ్ఞరూపం ధరించి శ్రీకృష్ణునివద్దకు వచ్చాడు. అతని శిరస్సు సామవేదం, ఋగ్వేదం రెక్కలు అతని ముక్కుఎర్రగాఉంది. కళ్ళు కమలాల వలె ఉన్నాయి. అతడు సోమరసం తీసుకొనే వాడు. రాక్షసులను జయించువాడు. అతడు నమస్కరించుచూ ఓ దేవేశా! తమకు నమస్కారం అన్నాడు. తరువాత శ్రీకృష్ణుడు గరుడుని శరీరంపై చెతితో నిమురుచు పెట్టి స్వాగతం పలికి పక్షిరాజా! శుభాలను కలుగజేయు శంకరుని దర్శనంకొరకు కైలాసానికి వెళ్ళవలసి వచ్చింది అన్నాడు. గరుడుడు సరే బాగుంది అని అప్పుడు సిద్ధమయ్యాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు ప్రక్కనున్న యాదవులతో ఇప్పుడు మీరు జాగ్రత్తగా ఇక్కడ ఉండండి. నేను వెళ్తున్నాను. అని గరుడుని వీపుపై కూర్చుని ఉత్తరదిక్కుగా వెళ్ళాడు. గరుడుని ఎగిరే ప్రయత్నంవల్ల మూడులోకాలు కంపించాయి. ఆ సమయంలో దేవతలు గంధర్వులూ ఆకాశంలో నిలిచి శ్రీకృష్ణుని స్తోత్రం చేస్తూ ఓదేవ! జగన్నాథ! జయజయ మీకు నమస్కారం అనగా వేదవేత్తలగు మునులు కూడా రాగా కైలాస పర్వతానికి శ్రీకృష్ణుడు వెళ్ళాడు. సమస్తలోకాలనూ పోషించు విష్ణుభగవానుడు అక్కడ పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. కఠోరతపం పూర్తయిన పిమ్మట తనను రెండుగా విభజించుకొని నరనారాయణ రూపములలో అవతరించాడు.

అక్కడ పవిత్ర గంగానది నిత్యమూ మిక్కిలివేగంతో ప్రవహిస్తుంది. ఇంద్రుడు వృత్రాసురుని చంపి బ్రహ్మహత్యా పాపంపోగొట్టుకోటానికి అక్కడనే పదివేల సంవత్సరాలు తపస్సుచేశాడు. అనేక దేవతలు, మునులు, వ్రతసిద్ధిని అక్కడ పొందారు. సాక్షాత్తుగా జగన్నాధుడు నియమంగా అక్కడ నివసిస్తాడు. శ్రీరాముడు రావణుని వధించి అక్కడ ఘోరతపస్సు చేశాడు. ఆ ప్రదేశాన్ని స్మరిస్తే స్వర్గం పొంద గలుగుతారు. అక్కడ శత్రువులు మిత్రులౌతారు. ఋషులు దానిని సిద్ధక్షేత్ర మంటారు. సకలేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఆబదరీక్షేత్రం చూడటానికి దేవతలతో మునులతో కూడ అక్కడ ప్రవేశించాడు. బదరికాశ్రమ మధ్యభాగంలో ప్రవేశించి గరుత్మనినుండిదిగి రాత్రిపూట దీపాలవెలుగుతో కూడిన ప్రదేశమందు దేవతలతో పాటున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు ప్రయాణము అను డెబ్బై ఏడవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై ఎనిమిదవ అధ్యాయము

## ఋషులు శ్రీకృష్ణుని సత్కరించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! అదేసమయంలో మునిసమూహం అగ్నిహోత్రం అతిధిసేవ పూర్తి చేసుకొని అక్కడకువచ్చి సుఖంగా కూర్చున్న శ్రీకృష్ణభగవానుని వద్దకుచేరారు. ఆమునులు చాలాకాలం నుంచి తపస్సు చేస్తూ సామాదిస్థితిని పొందగోరుతు న్నారు. వాళ్ళలో వేదస్నాతులు వ్రతస్నాతులు, ఆహారాన్ని విడినచినవారు, విష్ణు భక్తులు, ముక్తిసమీపానికి వచ్చినవాళ్ళు విష్ణుసాక్షాత్కారం పొందినవాళ్ళు ఉన్నారు. భరద్వాజ గౌతమ, వాల్మీకి, మొదలైనవాళ్ళు ఇతరమునులు పూజా ద్రవ్యము తీసుకొని భగవంతుని దర్శనంకోసం తమకుటీరాలనుండి బయటకు వచ్చారు. తరువాత శ్రీకృష్ణభగవానుని వద్దకువచ్చి భక్తితోతలవంచి భక్తవత్సలుడైన భగవంతునకు నమస్కారంచేశారు. వాళ్ళు కొందరు మునులు ఓకృష్ణా! దేవదేవా! ప్రణవాత్మకా! నేను తలవంచి నమస్కరిస్తున్నాను అన్నారు.

హృషీకేశ కేశవ! అంటూకొందరు బ్రాహ్మణులు నమస్కరిస్తున్నామన్నారు మహాత్మా! మాపూజను స్వీకరించండి. మీరు సంతోసిస్తే మేము కృతార్థులం ఇప్పుడు మేమేంచెయ్యాలి చెప్పండి. అని కృష్ణునియెదుట వినయంతో నిలబడ్డారు

శ్రీకృష్ణుడు కూడా ఆమునులను ఆదరించి మీరందరూ మీకుతగిన పనిచేశారు. మీతపస్సు వృద్ధి పొందుతుంది. అని పలికి గరుత్మంతునితో వాళ్ళు కూర్చునుటకు ఆసనములు ఇప్పించాడు. ఆమునులు సుఖంగా కూర్చొన్నారు. భగవంతుడు వాళ్ళ కుశలం అడిగాడు. వాళ్ళు తమ క్షేమం చెప్పి భగవంతుని పూజించారు. శ్రీకృష్ణుడు మిక్కిలి ప్రసన్నుడయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఋషులు శ్రీకృష్ణుని సత్కరించుట అను డెబ్బై ఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# డెబ్బై తొమ్మిదవ అధ్యాయము

## మృగములు భయపడి శ్రీకృష్ణుని వద్దకు వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! భగవంతుని ఉద్దేశం ఎవరికి తెలుస్తుంది? తరువాత శ్రీకృష్ణుడు పూర్వంతాను తపస్సు చేసిన గంగానది ఉత్తరపుఒడ్డును చూచుటకు వెళ్ళాడు. అక్కడ అందమైన స్థానాన్ని చూచి అచటి ఆశ్రమంలో కూర్చుని ధ్యానంలో మునిగి పోయాడు. ఆప్రదేశంలో దీపంవెలిగింది. అదేసమయంలో నలువైపులా పెద్దధ్వని ఏర్పడింది. తీసుకో, దీన్ని తిను, తిని ఆనందించు అని, ఆమృగాలవెనుక వెళ్ళు. భగవంతుడైన విష్ణువు సంతోషంకోసం వాటిని ఇక్కడకు పంపు. ఈయన భగ వంతుడైన విష్ణువు అనిపెద్దధ్వని ఏర్పడింది. తరువాత భయపడిన ఎలుగుబంట్లు సింహాలధ్వని వినిపించింది. ఏనుగుల ఘీంకారము ఇతర జీవుల ధ్వని వినిపించింది. ఆధ్వని రాత్రిపూట బయల్దేరింది. సమాధిలోఉన్న శ్రీకృష్ణుడు కూడా ఆశబ్దం విన్నాడు.

ఇట్లు సమాధిభంగము కాగా శ్రీకృష్ణుడు ఇంత భయంకర కోలాహలం ఎందుకు బయల్దేరింది. అడవిలో తిరిగే కుక్కలయొక్క వేటధ్వని ఆశ్చర్యంగా ఉంది. అని చూచుచుండగానే శ్రీకృష్ణుడున్న చోటకు కుక్కలువచ్చాయి. వాటి ననుసరించి ఓగుంపు ఉంది. వందుల వేలాదిదీపాలు కనిపించాయి. తర్వాత భూతాలూ పిశాచాలు ధ్వనిచేస్తూ మాంసం తింటూ రక్తంత్రాగుతూ ఉన్నాయి. పిశాచాలు, మృగాలను వెంబడిస్తున్నాయి. మృగాలూ, ఏనుగులూ బాణాలచే కొట్టబడ్డాయి. పిశాచాలు కృష్ణుడున్నచోటికి వచ్చాయి. భగవంతుడు వాటితో

చుట్టబడ్డాడు. శ్రీకృష్ణుడు ఆశ్చర్యపడిచూస్తున్నాడు. వీళ్ళెవరికి సంబంధించినవాళ్లు? భక్తితో నన్నెవడోస్తోత్రం చేస్తున్నాడు. ఎవనికి ముక్తి సమీపించింది? అని ఆలోచిస్తూ సామాన్య మానవుని లాగా ఉండిపోయాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
మృగములు భయపడి శ్రీకృష్ణుని వద్దకు వచ్చుట అను డెబ్బై తొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# ఎనభైయవ అధ్యాయము

## శ్రీకృష్ణుని వద్దకు రెండు పిశాచాల రాకడ

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజా! తరువాత భయంకరాకారంగల రెండుపిశాచాలు అక్కడకు వచ్చాయి వాటినేత్రాలు భయంకరంగా ఉన్నాయి. వాళ్ళచేతిలోశూలం దానికి కంఠం గ్రుచ్చబడి ఉంది. శవాల్ని లాగుతూ నవ్వుతూ అనేకములైన పామరుల మాటలను పలుకుతూ ఎల్లప్పుడు కృష్ణా, కృష్ణా, మాధవా, అని పలుకుతూ విష్ణువు ఎప్పుడు కనిపిస్తాడు? అతడిప్పుడెక్కడ ఉన్నాడు? పరమ పురుషుడైన ఆవిష్ణువును చూడటానికి మేంబయల్దేరాం. ఆప్రభువును చూడటానికి ఇప్పుడు ప్రయత్నిస్తున్నాం. చాలాజన్మల నుండి పాపంచేశాం ఘోరమైన ఆపాపఫలం ఇంకా పూర్తి కాలేదు. గర్భవాసదుఃఖం మాటిమాటికీ అనుభవించటం కష్టమైనది. మూర్ఖులు ప్రాణులను పీడించి ధనం తీసుకుంటారు. దుఃఖానికి కారణమైన సంసారమునకు శ్రీహరి ఔషధం. ఆయన శంఖచక్రగదాధరుడు. మేము ఆతనిని అన్ని ప్రయత్నాల ద్వారా తప్పకచూస్తాం అని మాట్లాడుతూ రెండుపిశాచాలూ శ్రీకృష్ణుని ఎదుట కనిపించాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుని వద్దకు రెండు పిశాచాల రాకడ అను ఎనభైయవ అధ్యాయము

☆☆☆

# ఎనభైఒకటవ అధ్యాయము

## ఘంటా కర్ణునకు సమాధి లభించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత భగవంతుడైన శ్రీకృష్ణుడు భయంకరులై దీపాలను పట్టుకొన్న ఇద్దరురాక్షసులను చూచాడు. వాళ్ళిద్దరూ సుఖకరమైన ఆసనంమీద

కూర్చున్న భగవంతుడైన శ్రీకృష్ణుని చూచారు. ఒకక్షణం తరువాత వాళ్ళు శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చారు. ఆయనను విష్ణువుగా గుర్తించలేక నీవెవడవు? ఎవని పుత్రుడవు? ఎక్కడనుండి వచ్చావు. ఈ ఘోరరణ్యానికి ఏకారణంచేత వచ్చావు? సింహాలు, పెద్ద పులులుగల పిశాచాలతోనిండిన అడవిలో నిన్నుచూచి ఆశ్చర్యపోతున్నాం. నీతేజస్సు అందంగా ఉంది. రూపం మనస్సు నాకర్షిస్తున్నది. ఈభయంకరవనంలో ఒంటరిగా ధ్యానం చేయటానికి కారణం ఏమిటి? ఇందుకు కారణం తెలుసు కోవాలను కుంటున్నాను. నువ్వు యథార్థంగా నీవృత్తాంతం చెప్పు. అని అడిగారు.

అప్పుడు శ్రీకృష్ణుడు జనులు నన్ను క్షత్రియుడంటారు. యదువంశంలో పుట్టాను కాబటి క్షత్రియ ధర్మాన్ని పాలిస్తున్నాను. నేను ఎల్లపుడూ చెడ్డవాళ్ళను అణచివైచి మంచివాళ్ళను కాపాడుతూ ఉంటాను. ఇప్పుడు పార్వతీపతియైన శంకర భగవానుని దర్శనంకోసం కైలాసానికి వెళ్ళాలనికోరిక, ఇది నావృత్తాంతం. ఇప్పుడు చెప్పండి మీయిద్దరూఎవరు? ఈబ్రాహ్మణాశ్రమానికి ఎందుకు వచ్చారు? ఇది గొప్ప పవిత్రమైన ఆశ్రమం. దీనిపేరు బదరీవనం. ఇక్కడ నిత్యమూ బ్రాహ్మణులు నివసిస్తుంటారు. నీచులు ఇక్కడ ప్రవేశింపరాదు. కాబట్టి మాంసాహారులు, కిరాతులు, కుక్కలు పిశాచాలు ఇక్కడకురావు. ఇక్కడ మృగాలను చంపకూడదు. నాస్తికులకు ఇక్కడ ప్రవేశంలేదు. ఈప్రదేశాన్ని రక్షించేపని నామీద ఉంది. ఎవడైనా ఆశ్రమ నియమం పాటించకపోతే అతన్ని శిక్షిస్తాను. ఇప్పుడు చెప్పండి. మీరిద్దరరూ ఎవరు? ఇక్కడనుండి ఎక్కడికి వెళ్తారు? ఈసేన ఎవరిది? ఇక్కడ ఋషు లుంటారు. ఇక ఎప్పుడూ ఇక్కడకు రాకండి, మీరిక్కడ నిలబడి ఏం చెప్పదలచారో చెప్పండి. లేకపోతే నామాటలతో పరాక్రమంతోనూ మిమ్మల్ని నివారిస్తాను అన్నాడు.

అప్పుడా పిశాచాలిద్దరిలో ఘోరమైన ఆకారం గల పొడవైన చేతుగల ఒక పిశాచం ఆలోచించి జగన్నాధుడైన విష్ణుభగవానునకి నమస్కరించి వాస్తవమును చెపుతున్నా. కోరిక ఉంటే వినండి. నేనొక భయంకరమైన మాంసాహారి పిశాచాన్ని నాపేరు ఘంటా కర్ణుడు. నేను కుబేరుడి సేవకుడను యముడులా కనిపిస్తున్న వారెండవ పిశాచం నాసోదరుడు. విష్ణువును పూజించటానికి వేటాడుతున్నాం. ఈ విశాలసైన్యం కుక్కలూ నావే. నేపిప్పుడు భూతసమూహం సేవించే కైలాస పర్వతం నుండి వస్తున్నా. నేను గొప్ప పాపాత్ముడను. అందువల్ల ఈపిశాచ జన్మ వచ్చింది. నేను విష్ణువును మిక్కిలి ద్వేషించేవాణ్ణి. అతని పేరు నాచెవిలో పడకుండ టకు రెండు చెవులకూ గంటలు కట్టుకొని తిరుగుతున్నాను.

ఒకప్పుడు నేను కైలాసానికి వెళ్ళాను. అక్కడ శివుణ్ణి ఆరాధించి స్తోత్రం చేశాను. ఆయన సంతోషించి వరం కోరుకోమన్నాడు. నాకు మోక్షమిమ్మని కోరాను. అప్పుడు శివుడు విష్ణుభగవానుడొక్కడే ముక్తి నిచ్చేవాడు అని చెప్పాడు. మరియు నీవు బదరీవనానికి వెళ్ళి విష్ణువు నారాధించి నరనారాయణాశ్రమంలో ముక్తిని పొందు తావు అన్నాడు. అప్పుడు అందరికంటే శ్రేష్ఠుడు విష్ణువే అని తెలిసింది. ఇందువల్ల ముక్తిపొందాలని కోరికతో ఇక్కడకు వచ్చాను. నాకు ఇంకొక పని ఉంది. కావాలంటే అదికూడ వినండి.

భగవంతుడైన కృష్ణుడు ద్వారకానగరంలో నివసిస్తున్నాడు. ఇక్కడ నాకు ఆయన దర్శనం ప్రాప్తించకపోతే నాసహచరులతో ద్వారకకు వెళ్తాను. అక్కడే ఆయన దర్శనం చేస్తా. ఏమైనా నాకు ఆయనదర్శనం చేయదగియున్నది. ఆయనను చూడాలని గట్టికోరికతో ఉన్నాను. ఈప్రపంచమంతా ఎవనియందు ఇమిడిఉన్నదో లోకపితయైన అతన్ని చూడటానికి బయలుదేరాం ఇప్పుడింకేం చెప్పం? మేమొక చోటకుపోతాం నీవు నీయిష్టంవచ్చిన చోటికివెళ్ళు రాత్రిరెండు జాములు గడిచింది. ఇప్పుడింకా విచారణచేయటానికి సమయంలేదు.

ఇలా పలికి వికటాకారంగల ఆపిశాచం రక్తంత్రాగి ఎక్కువ మాంసాన్ని తిన్నాడు. అక్కడనే నీళ్ళుత్రాగి తన అస్త్రాలను ప్రేగులనుపెట్టి ప్రయత్న పూర్వకంగా కుక్కలను అక్కడ నుండి తోలేసి దర్భాసనంపై నీళ్ళు చల్లి దర్భాసనంపరిచి దానిపై కూర్చుని ఏకాగ్రమనస్సుతో భగవంతుడైన కృష్ణునకు నమస్కరించి అతడు ఓ భగవంతుడైన వాసుదేవా! చక్రగదాధర! నారాయణ! విష్ణో! నీకు నమస్కారం ఓకేశవ! నీనామాన్ని కీర్తిస్తే నామనస్సు శుద్ధమౌతుంది. ఓగోపతీ! నాకు ఘోరమైన ఇటువంటి పాపజన్మ రాకుండా ఉండాలి నీస్మరణంచేతనే నేను దేవ దూతనౌతాను.

ఓప్రభూ! నీచక్రాయుధం నీయీశరీరాన్ని నశింపచేయుగాక నాకు ఒకవేళ జన్మవస్తే ఎల్లప్పుడు నీవు నాహృదయంలో ప్రకాశిస్తూ ఉండాలి. నీవు కల్పవృక్షం వంటివాడవు గాన నాకోరిక నెరవేర్చుము. ఇందుకై నీకు మాటమాటికీ నమ స్కరిస్తున్నాను. మరణసమయంలో నాకు మతిభ్రమ లేకుండుగాక ప్రతిదినమూ క్షణమైనా నామనస్సు నీపాదములందు లగ్నమగుగాక. ఇతరులను పీడించ కుందును గాక, నా యింద్రియాలు విషయములపై విరక్తికలవి అగుగాక, నీదయ వల్ల భూమి నాముక్కును, నీరు నాలుకను, రక్షించుగాక, సూర్యనారాయణుడు

నేత్రాలను, గాలి చర్మాన్ని, ఆకాశం చెవులను, రక్షించుగాక, మనస్సు నిర్మలంగా ఉంటేనే ఇంద్రియాలు సరిగా పనిచేస్తాయి.

ఓజనార్దన! మీరు అన్నివిధాలా నామనస్సును రక్షించవలెను. వాయువు, ఆకాశం దుఃఖము నుండి నన్ను రక్షించుగాక. జనార్దనా! నామనస్సును మాటి మాటికీ రక్షించుము. ఓజగన్నాథ! నా వాక్కును నిందనుండి రక్షించుము. పరద్రవ్య పరదారల నుండి మనస్సునుమరల్చుము. కేశవ! నీదయవలన అన్నిప్రాణులందు ప్రేమ కలిగి ఉండునుగాక. పలుమాటలేల? సుఖదుఃఖములందు భోజనగమనము లందు, జాగ్రత్ స్వప్నములందు నీపైనే నామనస్సు విహరించుగాక. ఇలా పలుకుతూ భగవద్భక్తుడైన పిశాచము సమాధిని పొందాడు. ముక్కు చివరదృష్టిని లిపిఎల్లప్పుడూ ఓంకారాన్ని ఉచ్చరిస్తూ జపంచేస్తూ యోగియై సుఖంగా ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఘంటా కర్ణునకు సమాధి లభించుటఅను ఎనభైఒకటవ అధ్యాయము

☆☆☆

# ఎనభైరెండవ అధ్యాయము

## ఘంటాకర్ణునకు భగవత్సాక్షాత్కారము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత భగవంతుడైన విష్ణువు శుద్ధమైనబుద్ధితో తనను ధ్యానం చేస్తున్న ఆపిశాచాన్ని చూచాడు. అతని పుణ్యసమూహమే ఈమార్గలో ప్రవర్తించ టానికి ముఖ్యకారణమని తలచాడు. కుబేరుని ఉపదేశంవల్ల బ్రహ్మ మంత్రజపం చేస్తూ వాసుదేవ! కృష్ణ! మొదలగు భగవన్నామాలను అన్ని సమయము లందూ పలుకుతూ ఇతడు నన్నుతలుస్తున్నాడు. అని ప్రసన్నుడై భగవంతుడు ఆపిశాచం యొక్క నిర్మలాంతఃకరణంలో దర్శనమిచ్చాడు.

అప్పుడా ఘోరపిశాచి తనహృదయంలో పీతాంబరధారి, కమలలోచనుడు శ్యామశరీరుడు, శంఖచక్ర గదాధారి, వనమాలా భూషితుడు, కిరీటకౌస్తుభ శ్రీవత్సములచే అలంకరింపబడి నాల్గుభుజాలుగల కల్యాణమూర్తియైన విష్ణు మూర్తిని చూచి ఆనందాశ్రువులతో తనను కృతకృత్యునిగా భావించసాగాడు. భగవంతుడు తనపై ప్రసన్నుడైనాడని తన జన్మసార్థకముగా తలచాడు. అన్ని

ఇంద్రియాలూ తనవశమైనట్లు తలచాడు. ఈపిశాచాలనుండి విముక్తుడనయ్యాను, నాతమ్ముడు కూడ భక్తుడే, అతడు కూడా మోక్షంపొందుతాడు. ఇలాఆలోచించి ఘంటాకర్ణుడు ఆనందసముద్రంలో నిమగ్నుడయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఘంటాకర్ణునకు భగవత్సాక్షాత్కారము అను ఎనభైరెండవ అధ్యాయము

☆☆☆

# ఎనభైమూడవ అధ్యాయము

## ఘంటాకర్ణుడు భగవంతుని స్తుతించుట

మాంసాహారియైన పిశాచము సమాధిలో చూచిన రూపాన్నే భూమిపై కూడ చూచి ఇదుగోవిష్ణువు ఇదుగో విష్ణువు అన్నాడు నృత్యంచేస్తూ నవ్వుతూ ఇలా స్తోత్రంచేశాడు.

శ్లో॥ అయంసచక్రీ శకశార్ఙ్గ ధన్వాగదీరథీ సధ్వజతూణపాణిః।
సహస్రమూర్ధాసకలామరేశో జగత్ప్రసూతిర్జగతాం నివాసః॥
విష్ణుర్జిష్ణుర్జ గన్నాథః పురాణః పురుషోత్తమః।
విశ్వాత్మా విశ్వకర్తాయః సోయమేషసనాతనః॥
అస్మైవదేవస్యహరేస్తనాన్తరేదిరాజతే కౌస్తుభరత్నదీపః।
యస్యప్రసాదాజ్జగదేతదాదేవిరాజతే చంద్రమసేవరాత్రిః॥
యోఽసేవృధ్వీందధారాశు దంష్ట్రయాజలసంచయాత్।
సోయమేషహరిస్సాక్షాత్ వారాహంవపురాస్థితః॥
బద్ధ్వాతదా దానవముగ్ర పౌరుషం దదౌచశక్రాయతతోనురాజ్యం।
బలింబలాదేష హరిస్సవామనః స్తుతశ్చభక్త్యామునిభిపురాతనైః॥
దంష్ట్రా కరాలాన్ సుబహూన్ హ త్వాయోదానవాన్రణే।
నిశోకక మకిలంలోకం చకారాసౌ జనార్దనః॥
ఆదౌదధారైక భుజేన మందరం నిర్జిత్య సర్వానసురాన్మహోర్ణమే।
దదౌచశక్రాయ సుధామయం మహాన్సఏష సాక్షాదిహమామస్థితః॥
యశ్చైతేజలధౌ నాగేదేవ్యాలక్ష్మ్యా సుఖావాహే।
హత్వాతౌ దానవేవీరౌ మధుకైటభసంజ్ఞితౌ॥

యమాహురాద్యంవిబుధాజగత్పతిం, సర్వస్యధాతారమజంజనిత్రమ్।
అణోరణీయాంసమతి ప్రమాణం స్థూలాల్స్థవిష్ఠం హరిమేవవిష్ణుమ్॥
యత్రస్థితమిదం సర్వంప్రాప్తేలోకస్యనాశనే।
అదౌ యస్మాత్స ముత్పన్నం సోయం విష్ణురితిస్థితిః॥
యస్యేచ్ఛయా సర్వమిదం ప్రవృత్తం ప్రవర్తతేచాపిజనార్దనస్య।
అయంసవిష్ణుః పురుషోత్తమః శివః ప్రవర్తతేమామిహయాదవేశ్వరః॥
భృగోర్వం శేనముత్పన్నో జామదగ్న్య ఇతిశ్రుతః।
శిష్యత్వం సమవాప్యై నమృగవ్యాధన్యయః స్థితం॥
జఘాన వీర్యాద్బలినం మహారణే కఠోరశస్త్రేణ గిరీశశిష్యః।
సహస్రబాహుంకృత వీర్యసంభవంహాయైర్గజైశ్చైవరథైశ్చదిర్గతమ్॥
కురుక్షేత్రం సమాసాద్య యశ్చకారపితృక్రియామ్।
నిః క్షత్రియమిమంలోకంకృతనానేకధింశతిః॥
రఘోరథకులే జాతో రామోనామజనార్దనః।
సీతయాచశ్రియా యుక్తో లక్ష్మణానుచరః కృతీ॥
కృత్వానేసేతుంజలధౌ జనార్దనో హత్వాచరక్షః పతిమాశుగైశ్శరైః।
దత్వాచరాజ్యంసవిభీషణా యదశాశ్వమే ధైరయజచ్చయో-సౌ॥
వసుదేవకుకేజాతో వాసుదేవేతి శబ్దితః।
గోకులేక్రీడతేఽయోఽసౌసంకర్షణ సహాయవాన్॥
ఉత్తనశాయీ శిశురూపధారీ పీత్వాస్తనం పూతనయాప్రదత్తమ్।
వ్యసుంచకారాశు జనార్దనస్తుబాదనోసుసతాంతతామవసత్సుఖంహరిః॥
పయఃపానంతథాకుర్వన్ భక్షయన్ దధిపిండకమ్।
దామ్నాబద్ధోదరో విష్ణుర్మాత్రారుషితయాదృఢమ్॥
తతశ్చదామ్నాసుదృఢేనబద్ధో జఘానమోఽసౌ యమలార్జునేచ।
క్రీడన్హరిః గోకులవాసవాన్నే గోపీభి రాస్వాద్య ముఖంస్తనంచ॥
బృందావనే వసన్ విష్ణుర్గోపైర్గోకులవాసిభిః।
తత్రహత్వా హయంరాజన్ విరరాజాం శుమానివ॥
యః క్రీడతేనాగఫణౌ జనార్దనోనిక్షీవ్యమాణః సహగోపదారకైః।
మహాహ్రదేనాగపతింజగత్పతిర్మమర్ద వీర్యాతిశయం ప్రదర్శయన్॥

యోధౌనుకంతాలవనే తత్ఫలైః స్వమమచ్ఛినత్।
హత్వాదానవము గ్రంతం గోపాన్వహ్మాపయత్యనౌ॥
దధారయోగోధరము గ్రపౌరుషాన్ మహామతిర్మేఘ సమాగమేసతి।
విడంబయన్శక్రబలంప్రమోదయన్గోపాంశ్చగోపీశ్చసగోకులంహరిః॥
గోపీనాం స్తనమధ్యేతుక్రీడతే కాదుమీశ్వరః।
యో-సౌపిబంస్తదధకం మాయామానుషదేహవాన్॥
గోపీభిరాస్వాద్య ముఖం వివిక్తేశౌతేస్మరాత్రే సుఖమేవకేశవః॥
స్తనాన్తరేష్వేవతదాచతాసాం కామీదకాన్తాధరపల్లవంపిబన్॥
అక్రూరేణసమాహూతస్తేన గచ్ఛన్స్వయామునే।
జలేయోహ్యర్చితస్తేన నాగలోకేనవీవహి॥
తతశ్చ గచ్ఛన్చలవాన్జ నార్దనోహత్వాతము గ్రందజకంబలాత్పథా।
హృత్వాభవస్త్రాణియథేష్టమీశ్వరోయమేనరామోమధురాపురీంహరిః॥
లబ్ధ్వాచదామాని బహూనికామదోదత్వావరం మాల్యకృతేమహోన్తమ్।
లబ్ధ్వానులేపంసురభించయాదవః కుబ్జాంచకారాశుమహోర్జరూపామ్॥
యోసేచాపం సమాదాయ మధ్యేభిత్వా మహద్ధనుః।
సింహనాదం మహాంశ్చక్రే కల్పాన్తే జలదోయధా॥
హత్వాగజంఘోరముదగ్రము దగ్రరూపం విషాణమాదాయత తోనుకేశవః।
ననర్తరంగే బహురూపమీశ్వరః కంసస్యదత్వాభయముగ్రవీర్యః॥
యోసేహత్వామహామల్లంబాణూరం విహత ద్విషమ్।
యాదవేభ్యోదదౌ ప్రీతింకంసస్మై వతుపశ్యతః॥
జఘానకంసంరిపు పక్షఘాతినం పితృద్విషం యాదవనామధేయమ్॥
సంస్థాప్యరాజ్యే హరిరుగ్రసేనం సాందీపనింకాశ్యముపాగలోయః॥
విద్యామవాప్యస కలాం దత్వా పుత్రంమహామునేః।
సాగ్రజోథ జగామాశుమధురాం యాదవీంపురీమ్॥
హత్వానిశుంభం నరకంమహామతిః కృత్వాసఘోరంకదనుజనార్దనః।
రరక్షవిప్రాన్ మునివీరసంఘాన్ దేవాంశ్చ సర్వాజ్జగతో జగత్పతిః॥
సపేషభగవాన్విష్ణు రద్యదృష్టో జనార్దనః।
కృతకృత్యోస్మి సంజాతస్సాయుజ్యం ప్రాప్తవానహమ్॥

యేనదృష్టో హరిస్సాక్షాత్తస్యముక్తిః కరేస్థితా।
సోఽయమేషహరిస్సాక్షాత్ప్రత్యక మిహావర్తతే॥
మానంజన్మాన్తరే పూర్వం ధర్మస్సంచితఏవమే।
యస్సపాకస్సముత్పన్నో యేనాసౌదృశ్యతేమయా॥
సర్వథాపుణ్యావానస్మి నష్ట సంసారబంధనః।
కిమస్మై దీయతేవస్తు కింన్నువక్ష్యామి సాంప్రతత్॥
కరిష్యేకిమహంవిష్ణో వద స్వాద్యయథాప్సితమ్।
ఇత్యుక్త్వా విస్తరం నాదం ననర్దబహుశస్తదా॥
జహాసవి కృతం భూయో ననర్తపిశితాశనః।
నమోనమోహరే కృష్ణయాదవేశ్వరకేశవ।
ప్రత్యక్షంచహరేస్తత్ర ననర్త వివిధం నృప॥

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఘంటాకర్ణుడు భగవంతుని స్తుతించుట అను ఎనభైమూడవ అధ్యాయము

☆☆☆

# ఎనభైనాల్గవ అధ్యాయము

## ఘంటాకర్ణునకు ముక్తినిచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత ఆపిశాచం పెద్దగా నవ్వాడు. అతడు మిక్కిలివేగంతో వెళ్ళి బ్రాహ్మణశవాన్ని తెచ్చాడు. అతని శరీరాన్ని కోసి ముక్కలుచేశాడు. ఒక ముక్కను నీటితో కడిగిపాత్రలో ఉంచాడు. దానిని భగవంతునికి అర్పించి చేతులు జోడించి తలవంచి ఓజగన్నాథ! మీకు ఉపయోగించే ఆహారాన్ని సమర్పిస్తున్నా దీన్ని స్వీకరించండి. మీరు గొప్ప దేవత అయినా దీన్నితీసికోవచ్చు. మేము భక్తితో నమ్రులమైన జీవులం. కనుక దీన్ని తీసుకోవటానికి విచారవిమర్శ చేయవద్దు. ముక్తుడైన వాడిచ్చిన వస్తువును స్వామిస్వీకరించాలి. నేనీ ఉత్తమబ్రాహ్మణశవాన్ని బాగాసంస్కరించాను.

మాకిదే శాస్త్రంచెప్పిన ఆహారంకనుక పూజ్యుడా! దోషమెంచక దీన్ని స్వీక రించండి అని పలికి మళ్ళీ పెద్దగా నవితాకరానిశవఖండాన్ని భగవంతునికి

అర్పించేందుకు సిద్ధపడ్డాడు. అతనిమాటలకు భగవంతుడు సంతోషించాడు. కృష్ణుడు ఓపిశాచమా! నీగొప్పభక్తికి సంతోషించాను. మేము బ్రాహ్మణశవాన్ని తాకము. నీకు పనికి వస్తుంది. అని పలికి అతని శరీరాన్ని తాకి పాపవిముక్తుని చేశాడు. భగవంతుడు తాకటంచేత మన్మధునివలె ఆపిశాచం అందమైనరూపాన్ని పొందింది. దివ్యవస్త్ర దివ్యభూషణధారియై ఇంద్రునివలె శోభించాడు. భగవంతుని నామాన్ని పలుకుతూ జపంచేస్తూ ధ్యానం చేసేవాడికి పొందరానిది ఉండదు.

అట్టివాడు శుభాలకు నిలయమౌతాడు. శ్రీకృష్ణుడు బ్రాహ్మణ శవాన్ని లేవ నెత్తగా బ్రాహ్మణుడు లేచి స్తోత్రంచేశాడు. శ్రీకృష్ణుడు అతన్ని సత్కరించి శీడ్కొన్నాడు. ఘంటాకర్ణునితో నీవు స్వర్గానికి వెళ్ళు దేవరాజు నీకై ఎదురు చూస్తు న్నాడు. అని భగవంతుడన్నాడు. తరువాత భగవంతుడైన శ్రీకృష్ణుడు మునులు యజ్ఞం చేస్తున్న చోటికి వెళ్ళాడు. ఘంటాకర్ణుడు స్వర్గానికి వెళ్ళాడు. మహారాజ! మనస్సు శుద్ధం కావాలనుకుంటే భగవంతుడు పిశాచము కలుసుకొన్న వృత్తాంతం చదవండి వినండి. రాజా! ఈ కథ చదవంటంచేతనే మనస్సు పరిశుద్ధమౌతుంది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఘంటాకర్ణునకు ముక్తి నిచ్చుట అను ఎనభైనాల్గవ అధ్యాయము

☆☆☆

# ఎనభైఐదవ అధ్యాయము

## శ్రీకృష్ణుని కైలాసయాత్ర

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తర్వాత భగవంతుడైన కృష్ణుడు ఆమునులకు ఆపిశాచ వృత్తాంతాన్ని చెప్పగావిని వాళ్ళుమిక్కిలి ఆశ్చర్యపడ్డారు. నీదర్శనంచేతనే అతనికర్మ పరిపక్వమైంది అన్నారు. తరువాత మునులు సత్కరింపగా భగవంతుడైన కృష్ణుడు సంతోషించాడు. రాత్రి గడిచింది. ప్రాతఃకాలంలో సూర్యునివలె ప్రకాశిస్తూ భగ వంతుడు గరుడునిపై [illegible]ర్చుని ఆమునులతో నేనిప్పుడు కైలాసానికి వెళ్తున్నాను. మీరుకూడ అక్కడకు రావచ్చు అని చెప్పి కైలాసంవైపు వెళ్ళాడు. అక్కడ విశ్వే శ్వరుడు తపస్సు చేస్తుంటాడు. కుబేరుడు నిత్యమూ శంకరభగవానుని ఉపాసిస్తూ ఉంటాడు. అక్కడ మృగాలు పరస్పర విరోధంవదిలి ప్రవర్తిస్తాయి.

అక్కడ మానవసరోవరం ఉంది. అక్కడనే విశ్వేశ్వరుడు బ్రహ్మ ఐదవతలను ఖండించాడు. అక్కడ శివుడు పార్వతితో విహరిస్తాడు. అక్కడే మునులుకోరగా హిమవంతుడు తనకన్యను శివునికి ఇచ్చాడు. అక్కడనే శివుని ప్రార్థించి విష్ణువు చక్రాన్నిపొందాడు. అలాంటి కైలాసాన్నిఎక్కి మానవసరూవరం ఒడ్డుకువెళ్ళాడు. అక్కడ తపస్సు చేయటానికి కృష్ణుడు జడలుధరించి మానవుడుగా నారవస్త్రం ధరించాడు. తరువాత వేదమయుడైన గరుడునినుండి దిగి ఒక పవిత్ర స్థానమందు కూర్చున్నాడు. అక్కడ పన్నెండుసంవత్సరాలు తపస్సుచేయ్యటానికి నిశ్చయిం చాడు. ఆయన శాకాహారియై వాదాధ్యయనం చేస్తూ ఫాల్గుణమాసంలో తపస్సు ప్రారంభించాడు.

అతడెందుకు తపస్సుచేస్తున్నదీ ఇతరులకు తెలియదు. గరుడుడు కట్టెలు తెచ్చాడు. చక్రదేవుడు పూలుతెచ్చాడు. శంఖం కాపలాఉంది. ఖడ్గం దర్భలు తెచ్చింది. గద అతన్ని సేవిస్తూంది. ధనుస్సు రాక్షసులకు భయంకలిగిస్తూ ఎదుట నిలిచి సేవకునిలా ఉపచారం చేస్తున్నది. శ్రీకృష్ణుడు కట్టెలతో అగ్నిని మండించి నెయ్యిమొదలైన వాటితో ఆహుతులిస్తున్నాడు. ఇలా హోమం పూర్తిచేశాడు. ఆయన మొదటినెలలో ఒకేదినము, తరువాత సంవత్సరానికొక దినము భోజనంచేస్తూ హోమం చేశాడు. పన్నెండు సంవత్సరాలకూ ఒక నెలమిగిలి ఉండగా ఆయన పూర్ణాహు తి చేశాడు. అగ్నినిధ్యానించి ఆరణ్యకములు ఇతరములైన మంత్రాలను ప్రణవమును పఠించి శంకరభగవానుని ధ్యానించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుని కైలాసయాత్ర అను ఎనభైఐదవ అధ్యాయము

☆☆☆

# ఎనభై ఆరవ అధ్యాయము

## శ్రీకృష్ణుని వద్దకు శివుడు వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! అప్పుడు ఇంద్రుడు తపస్సుచేస్తున్న విష్ణువును చూడటానికి ఐరావతంమీద కైలాసపర్వతానికి వచ్చాడు. యముడు తనకింకరులతో భగవంతుని దర్శించటానికి వచ్చాడు. అట్లే వరుణుడు, ఆదిత్యరుద్రగణాలూ శ్రీకృష్ణుని చూడ వచ్చాయి. సిద్ధముని యక్షగంధర్వాదులు పర్వతనారదులు అప్సరసలూ కైలాస

శిఖరానికి వచ్చారు. అందరూ ఒకచోట చేరి ఎంత ఆశ్చర్యమో చూడండి. ఇంత వరకు ఎప్పుడూ ఇట్టి సంఘటనచూడలేదు. యోగులందరిచే ధ్యానింపబడు శ్రీకృష్ణుడు స్వయంగా తపస్సుచేస్తున్నాడు. అతడిలా చేయటానికి తప్పక ఏదో గొప్పకారణం ఉంటుంది. ఇంతలో విష్ణువు తపస్సు పూర్తయింది. శంకర భగ వానుడు తన భూతగణాలతో పార్వతితో కూడా కృష్ణుని దర్శించుటకు అతని సమీపానికి వచ్చాడు కుబేరుడూ, ఇతర యక్షులూ కూడా ఉన్నారు. శంకరునిదృష్టి పార్వతి స్తనాల పై పడింది. ఆమె శంకరుని కౌగలించి అధరామృతంపానం చేస్తున్నది. శిరస్సుపై గంగ ప్రకాశిస్తున్నది. ఇలా శంకరుడు శ్రీకృష్ణుని దర్శించుటకు అతని దగ్గరకు వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుని వద్దకు శివుడు వచ్చుట అను ఎనభైఆరవ అధ్యాయము

☆☆☆

# ఎనభైఏడవ అధ్యాయము

## శ్రీకృష్ణ శివసమాగమము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శంకరుడు బయలుదేరితే వేలాది భూతగణాలు అతని ముందుంటాయి. ఘంటాకర్ణుడు విరూపాక్షుడు మొదలగువాళ్ళు ఆయనతో కూడా ఉన్నారు. వాళ్ళలో కొందరు నాట్యంచేస్తున్నారు కొందరు పెద్దగా నవ్వుతు న్నారు. ప్రమధగణాలు డమరుకధ్వని చేయగా భూమండలమంతా ప్రతి ధ్వనించింది. మరొకవైపు మునిగణం వేదవేదాంగపఠనం ధ్యానముచూస్తూ నడుస్తున్నారు. ఒకచోట ముని గణములు మరొకచోట ప్రియూరాండ్రతో కూడిన సిద్ధులూ గంధర్వులూ నృత్యం చేస్తున్నారు. కన్యలుగానం చేస్తున్నారు. వేరొకచోట విద్యాధరులు శంకరుని స్తోత్రం చేస్తూ ఉన్నారు. అప్సరస్త్రీగణం నృత్యంచేశారు. ఈవిధంగా మహాఘోర పిశాచాలు మునులు, ప్రమధులు కూడా రాగా విష్ణువు తపస్సు చేస్తున్నచోటికి శివుడు వచ్చాడు.

ఇది శ్రీమహాభారతమున హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణ శివసమాగమము అను ఎనభైఏడవ అధ్యాయము

☆☆☆

# ఎనభైఎనిమిదవ అధ్యాయము
## శ్రీకృష్ణుడు శివుని స్తుతించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శంకరుడీవిధంగా చాలాభూతాలతో పిశాచాలతోవెళ్ళి పూర్తిగా తపస్సులో మునిగిఉన్నట్టియు అనేకవిధములైన సామగ్రితో హోమంచేస్తున్న భగవంతుడగు కృష్ణునిచూచాడు. గరుడుడు కర్రలు, చక్రం పుష్పాలు, ఖడ్గం దర్భలను, గదపరిచర్య అందిస్తున్నారు. ఆయన పొడవైనజడలు నారవస్త్రాలు ధరించి ఉన్నాడు. ఇంద్రాదిదేవతలు, మునిగణాలు, అతనికి నలువైపులా కూర్చొన్నారు. సమస్త ప్రాణులకు ధ్యానింపదగిన ఆ మహాప్రభువు కొంచం ఆలోచిస్తున్నాడు. ఆసమయంలో మహేశ్వరుడు ఎద్దునుండి క్రిందికిదిగి అచటిమంగళకరమైన వాతావరణం చూచాడు. చాలా సంతోషించాడు. అప్పుడు భూతపిశాచ రాక్షసులు మొదలగువారు యక్షముని గణములూ నలువైపులా జయజయధ్వని చేస్తూ ఇలా స్తోత్రంచేశారు.

శ్లో॥ జయదేవజగన్నాథ జయరుద్రజనార్దన।
జయవిష్ణో! హృషీకేశ నారాయణ పరాయణ॥
జయరుద్రపురాణాత్మన్ జయదేవహరేశ్వర।
ఆదిదేవజగన్నాథ జయశంకరభావన॥
జయకౌస్తుభ దీప్తాంగ జయభస్మవిరాజిత।
జయచక్రగదాపాణే జశూలిన్ త్రిలోచన॥
జయమేక్తిక దీపాఙ్గ జయనాగవిభూషణ।
ఇతితేమునయస్సర్వే ప్రణామంచక్రిరేహమ్॥
తతఉత్థాయ భగవాన్ దృష్ట్వా దేవమవస్థితమ్।
వృషధ్వజం విరూపాక్షం శంకరంనీలలోహితమ్॥
తతోహృష్టమనా విష్ణుస్తుష్టావ హరమీశ్వరమ్।
శ్రీభగవంతుడిలా అన్నాడు.

నమస్తేశోబిషే అస్తునమస్తే ఉపవాసినే।
నమస్తేమీడుషేచాస్తు నమస్తేగదినే హర॥
నమస్తే విశ్వతనవే వృషాయవృషరూపిణే।
అమూర్తాయచదేవాయ నమస్తేఽస్తుపినాకినే॥

నమఃకికుబ్జాయకూష్మాయ శివాయశివరూపిణే।
నమస్తుండాయతుష్టాయ నమస్తుటితుటాయచ॥
నమశ్శివాయశాన్తాయ గిరిశాయచతేనమః।
నమోహరాయ హిప్రాయనమోహరిహరాయచ॥
నమోఽఘోరాయఘోరాయ ఘోరఘోరప్రియాయచ।
నమోఽఘణ్టాయ ఘణ్టాయనమోఘటిఘటాయచ॥
నమశ్శివాయశాన్తాయ గిరిశాయచతేనమః।
నమోవిరూపరూపాయ పురాయపురహారిణే॥
నమఆద్యాయ బీజాయశుచయేఽష్ట స్వరూపిణే।
నమఃపినాక హస్తాయనమశ్శూలా సిధారిణే॥
నమఃఖట్వాల గహస్తాయనమస్తే కృత్తివాససే।
నమస్తే దేవదేవాయ నమఆకాశమూర్తయే॥
వంరాయ హరిరూపాయనమస్తే తిగ్మతేజసే।
భక్త ప్రియాయ భక్తాయభక్తానాం వరదాయినే॥
నమోఽస్తు మూర్తయేదేవా జగన్మూర్తిధరాయచ।
నమశ్చంద్రాయదేవాయ సూర్యాయచనమోనమః॥
నమః ప్రధానదేవాయ భూతానాంపతయేనమః।
కరాలాయచముండాయ వికృతాయకపర్తినే॥
అజాయచనమస్తుభ్యం భూతభావనభావన।
నమోఽస్తు హరికేశాయ పింగలాయనమోనమః॥
నమస్తేఽభీషుహస్తాయ భీరుభీరుహరాయచ।
హరాయభీతిరూపాయ ఘోరాణాంభీతిదాయినే॥
నమోదక్షమఖఘ్నాయభగనేత్రాపహారిణే।
ఉమాపతేనమస్తుభ్యం కైలాసనిలయాయచ॥
ఆదిదేవాయదేవాయ భవాయభవరూపిణే।
నమఃకపాలహస్తాయనమోఽజమథనాయచ॥
త్ర్యంబకాయనమస్తుభ్యం త్ర్యక్షాయచశివాయచ।
వరదాయవరేణ్యాయనమస్తే చంద్రశేఖర॥

నమఇథ్మాయమహావిషే ధ్రువాయచకీశాయచ।
నమస్తేశక్తియుక్తాయ నాగపాశప్రియాయచ॥
విరూపాయసురూపాయ మద్యపానప్రియాయచ।
శ్మశానరతయే నిత్యం జయశబ్దప్రియాయచ॥
స్వరప్రియాయస్వర్వాయ స్వరాయస్వరరూపిణే।
భద్రప్రియాయభద్రాయ భద్రరూపధరాయచ॥
విరూపాయసురూపాయమహాఘోరాయతేనమః।
ఘంటాయఘంటభూషాయ ఘంటభూషణభూషిణే॥
తీవ్రాయతీవ్రరూపాయ తీవ్రరూపప్రియాయచ।
నగ్నాయనగ్నరూపాయ నగ్నరూపప్రియాయచ॥
భూతావాసనమస్తుభ్యం సర్వావాసనమోనమః।
నమస్సర్వాత్మనేతుభ్యం నమస్తేభూతిదాయక॥
నమస్తే వామదేవాయ మహాదేవాయతేనమః।
కానువాక్స్తుతిరూపాతే కోనుస్తోతుం ప్రశక్నుయాత్॥
కస్యవాస్ఫురతేజిహ్వాస్తుతేస్తు మతాంవర।
క్షమస్వభగవన్‌దేవభక్తోహంత్రాహిమాంహర॥
సర్వాత్మన్సర్వభూతేశ త్రాహిమాంసంతతంహర।
రక్షదేవజగన్నాథ లోకాన్సర్వాత్మనాహర॥
త్రాహిభక్తాన్ సదాదేవభక్తప్రియసదాహర।

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు శివుని స్తుతించుట అను ఎనభైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# ఎనభైతొమ్మిదవ అధ్యాయము

## శివుడు శ్రీకృష్ణుని స్తుతించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత శంకరుడు దేవతలయొక్క మునులయొక్క సమక్షంలో విష్ణువుచేయిపట్టుకొని ఓదేవేశ చక్రపాణీ! నీవెందుకు తపస్సు చేస్తున్నావు? నీ

కోరికేమిటి? నీవు స్వయంగావిష్ణుమూర్తివి నీవు తపస్సులకు తపస్సువు. నీవు పుత్రునికై తపస్సు చేయనక్కరలేదు పూర్వమే నీకు పుత్రుని ఇచ్చి ఉన్నాను. పూర్వం ఏదో కారణంచేత నేనుతపస్సు చేస్తున్నాను. పార్వతి సేవచేస్తున్నది. ఇంద్రుడు నాతపస్సుకు భయపడి మన్మథుని పంపాడు. వసంతునితో కూడి ఆతడు నావద్దకు వచ్చాడు. అతడు నాపైబాణాన్ని గురిపెట్టాడు.

అప్పుడు నేనుకోపించి నేత్రాగ్నితో వానిని భస్మంచేశాను. ఇది ఇంద్రుని పని అని తెలుసుకొని అప్పటినుంచి మన్మథునిపై దయగలవాడనయ్యాను. బ్రహ్మ దేవుడు కూడ నన్ను ప్రోత్సహించగా నీకుఅతడు ప్రద్యుమ్నుడనే పేరుతో పుత్రుడుగా జన్మింపచేయనిశ్చయించాను. అతడు నీకు పెద్ద కొడుకుగా జన్మిస్తాడు. ఈ విషయంలో చింతించవలసిన అవసరంలేదు అనిచెప్పి శరణు వేడుటకు వచ్చిన మునులకు విష్ణువు యొక్క యధార్థస్థితిని తెలియజేయుటకు చేతులు జోడించి నిలబడ్డాడు.

ఆసమయంలో శంకరుడు నారాయణునితో జనార్దనా! సాంఖ్యమతం ప్రకారం నీవే అంతకూ కారణమైనవాడవు. పంచభూతాలు నీవే అంటారు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు నీవే. నీవు రజోగుణంతో కూడి ఉన్నప్పుడు సృష్టిస్తు న్నావు, సత్త్వగుణంతో పాలిస్తున్నావు. తమోగుణంతో కూడి ఉన్నప్పుడు నశింప చేస్తున్నావు. నీవు సమస్తమునూ వ్యాపించియుంటుటచే విష్ణువనబడుచున్నావు. నారములనగా నీళ్ళు ఆనీరు విశ్రామస్థానంగా కలవాడవగుటచే నారాయణు డువుగా చెప్పబడుతున్నావు. ప్రాణులదుఃఖాన్ని హరించేవాడవు గాన హరివయ్యావు. మధువను రాక్షసునిచంపుటచేత మధుసూదనుడవు. ఇంద్రియాలకు ప్రభుగాన హృషీకేశుడవు. బ్రహ్మ, శివుడు నీనుండి పుట్టుటవల్ల కేశవుడవు. మా అనగా విద్యదానికి ప్రభువైనందు నీమాధవుడవు. సరస్వతి నెరిగినవాడవగుటచే గోవిందు డని, మూడుపాదాలతో వ్యాపించి త్రివిక్రముడవయ్యావు. అక్షరాలలో అకారం నీవు వర్ణములనాశ్రయించిన స్ఫోటస్వరూపం నీవే, వసువులలో పావకుడవు, చెట్లలో రావిచెట్టు, పర్వతాలలో మేరువు, దేవర్షులలో నారదుడవు, దానవులలో ప్రహ్లాదు డవు, సర్పాలలో వాసుకివి, యక్షులలో కుబేరుడవు, వరుణుడవు, ఆదిత్యుడవు అన్ని ప్రాణులకు అది,మధ్య అంతమునీవు. దేవ! నీవునేనూ అంతటా ఉన్న వాళ్ళం.

ఓజనర్దనా! నీవేనేను మనిద్దరిలో తేడాలేదు. నీనామాలు నానామాలే. ఇందులో విమర్శించే పనిలేదు. నీఉపాసనే నాఉపాసన, నిన్ను ద్వేషిస్తే నన్ను

ద్వేషించినట్లు. జనార్దనా సర్వంనీవే దేవతలు నిన్నుస్తుతిస్తారు. ఋగ్య జుస్సామవేదాలు నీవే. సమస్తము నీవే. మాధవా! కేశవా! విష్ణో నమస్కారము. పద్మనాభుడవైన నీకు నమస్కారము.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శివుడు శ్రీకృష్ణుని స్తుతించుట అను ఎనభైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# తొంభైయవ అధ్యాయము

## శివుడు మునులకు శ్రీకృష్ణ తత్త్వమును చెప్పుట

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! శివుడు భగవంతుడైన విష్ణువును ఈవిధంగా స్తోత్రంచేసి అక్కడున్న మునులతో దర్శనంకొరకు ఇక్కడకు వచ్చిన ఓ బ్రాహ్మణ సంఘమా! ఈయనే అందరికంటే గొప్పవాడు. ఈయనయే మీరు తపస్సు, ధ్యానం చేయదగిన వ్యక్తి, ఈయనయే శ్రేయస్సు, గొప్పదనమూ కూడా. ఈతడే తపస్సుకు ఫలం. సనాతనధర్మం, మోక్షదాత, కర్మఫలదాతయు సాంఖ్యులు ఇతన్ని మెచ్చుకొంటారు వేదవాదులకు వేదస్వరూపుడు. ఈవిష్ణువే మీకు ధ్యానింప తగినవాడు. మీరువెల్లప్పుడు ఓంకారజపం, నారాయణ ధ్యానం చెయ్యండి. ఇలా చేస్తే మీకు తప్పకమోక్షం ప్రాప్తిస్తుంది. ఇతడే సంసారబంధాన్ని త్రెంచేవాడు. ఈతడే మీకు గురువు ఈతన్నే ధానించండి.ఈయనను ఉపాసించిన తరువాతనే నాఉపాసన పూర్తి అవుతుంది. బాగా ధ్యానం చేయటం వల్ల శ్రీకృష్ణభగవానుని జ్ఞానం పొందగలుగుతారు. నేను చెప్పిన దానిలో కొంచమైనా సందేహాలేదు. శంకరుడిలా చెప్పిన తర్వాత మునులాతని మాటలను మనస్సుకు పట్టించుకు న్నారు. తర్వాత ఆ మునులు చేతులు జోడించి ఓమహాదేవ! మాసందే హాలు తొలగిపోయాయి. సందేహం పొగొట్టుకొనటానికే ఈవేళ మేమిక్కడికి వచ్చాం. మహాపురుషులైన మీ యిరువురి కలియక వల్లనే మామోహాంధకారం నశించింది. నీమాటలవల్ల మాకు మిక్కిలి శుభం కలుగుతుంది. మీ ఉపదేశాన్నిబట్టి ఈనాటి నుండీ మేము నారయణుని ప్రసన్నుని చేసుకొనే ప్రయత్నం చేస్తాము. ఇలాపలికి మునులు మిక్కిలిశ్రద్ధతో భగవంతుడైన నారాయణునకు నమస్కరించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శివుడు మునులకు శ్రీకృష్ణ తత్త్వమును చెప్పుట అను తొంభైయవ అధ్యాయము

☆☆☆

# తొంబై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు బదరికాశ్రమానికి వచ్చుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలో భగవంతుడైన శంకరుడు ఆమునులెదుట వేదార్థంతో కూడిన అర్ధగాంభీర్యంగల వాక్యాలద్వారా జగత్పతియైన విష్ణుభగవానుని స్తుతిచేశాడు. అతని మిక్కిలి శ్రద్ధనుచూచి మునులు ఆశ్చర్యపడ్డారు- శివుడిలా స్తుతించాడు

శ్లో॥ నమోభగవతేతుభ్యం వాసుదేవాయధీమతే।
యస్యభాసాపర్వమిదం భాసతేనిత్యమచ్యుత॥
నమోభగవతేదేవ! నిత్యంసూర్యాత్మనేనమః।
యశ్శీతయతిశీతాంశ లోకాన్‌సర్వానిమాన్ వభుః॥
నమస్తే విష్ణవేదేవ! నిత్యం సోమాత్మనే నమః।
తుః ప్రజాః ప్రీణయత్యేకో విశ్వాత్మాభూతభావనః॥
నమస్సర్వాత్మనే దేవ! నమోవాయ్వాత్మనే హరే।
యోదధారకిరేణాసేకుశచీరాదియత్సదా॥
దధారవేదాన్సర్వాంశ్చ తుభ్యం బ్రహ్మాత్మనే నమః।
సర్వాన్సంహరతేయస్తు సంహారే విశ్వదృక్సదా॥
క్రోధాత్మాసివిరూపోసితుభ్యం రుద్రాత్మనే నమః।
స్రష్టా ప్రష్టా నమస్తానాం ప్రాణినాం ప్రాణదాయినే॥
అజాయవిష్ణవే తుభ్యం స్రష్టేవిశ్వ సృజేనమః।
ఆదౌ ప్రకృతిమూలాయ భూతానాంప్రభవాయచ॥
నమస్తే దేవదేవేశ! ప్రధానాయనమోనమః।
పృధివ్యాంగంధరూపేణ సంస్థితః ప్రాణినాంహరే॥
దృఢాయదృఢరూపాయ తుభ్యం గంధాత్మనే నమః।
అపాంరసాయ సర్వత్రప్రాణినాం సుఖహేతవే॥
నమస్తేవిశ్వరూపాయ రసాయచనమోనమః।
తేజసాభాస్కరోయస్తు ఘృణోజన్తుహితప్సదా॥

తస్మైదేవజగన్నాథనమో భాస్కరరూపిణే।
వాయోస్స్పర్శగుణో యత్ర శీతోష్ణసుఖదుఃఖదః॥
నమస్తే వాయురూపాయనమస్స్పర్శాత్మనే హరే।
ఆకాశేఽవస్థితశ్శబ్దః సర్వశ్రోత్రనివేశనః॥
నమస్తే భగవన్విష్ణో తుభ్యం శబ్దాత్మనేనమః।
యోదధారజగత్సర్వం మాయామానుషదేహవాన్॥
నమస్తుభ్యం జగన్నాథమాయినే మాయదాయినే।
నమఆద్యాయబీజాయ నిర్గుణా యగుణాత్మనే॥
అచిన్త్యాయసుచిన్త్యాయ తస్మైచింత్యాత్మనే నమః।
హరాయహరిరూపాయ బ్రహ్మణే బ్రహ్మదాయినే॥
నమోబ్రహ్మవిదేతుభ్యం బ్రహ్మబ్రహ్మాత్మనే నమః।
నమస్సహస్రశిరసే సహస్రకిరణాయచ॥
నమస్సహస్రవక్త్రాయ సహస్రనయనాయచ।
విశ్వాయవిశ్వరూపాయ విశ్వకర్త్రే నమోనమః॥
విశ్వవక్త్రే నమోనిత్యం భూతావాసనమోనమః।
ఇంద్రియాయేంద్రరూపాయ విషయాయసదాహరే॥
నమోఽశ్వ శిరసే తుభ్యం వేదాభరణ రూపిణే।
అగ్నయేఽగ్నివతే తుభ్యం జ్యోతిషాంపతయేనమః॥
సూర్యాయసూర్యపుత్రాయ తేజసాంపతియేనమః।
నమస్సోమాయసౌమ్యాయన మశ్శీతాత్మనే హరే॥
నమో యజ్ఞాయఇజ్యాయ హవిషేహవ్యసంస్కృతే।
నమః స్రువాయపాత్రాయ యజ్ఞాంగాయపరాయచ॥
నమః ప్రణవదేహాయక్షరాయాప్యక్షరాయచ।
వేదాయవేదరూపా... శస్త్రిణే శస్త్రరూపిణే॥
గదినేశంఖినేతుభ్యం ఖడ్గినే చక్రిణేనమః।
శూరినేచర్మిణేనిత్యం వరదాయనమోనమః॥
బుధప్రియాయబుద్ధాయ ప్రబుద్ధాయసుఖాయచ।
హరయేవిష్ణవేతుభయం నమస్సర్వాత్మనేగురో॥

నమస్తే సర్వలోకేశ సర్వకర్త్రే నమోనమః।
నమస్స్వభావ శుద్ధాయనమస్తే యజ్ఞసూకర॥
నమోవిష్ణోనమోవిష్ణో నమోవిష్ణో నమోహరే।
నమస్తే వాసుదేవాయ వాసుదేవాయ ధీమతే॥
నమః కృష్ణాయ కృష్ణాయ సర్వావాసనమోనమః।
నమోభూయోనమస్తేఽస్తు పాహిలోకాన్ జనార్దన॥

ఈవిధంగా జగన్నాథుడైన పరమాత్మను స్తోత్రంచేసి ఈస్తోత్రాన్ని నిత్యమూ పఠిస్తూ కేశవుని శరణువేడండి. ఆయన మేలుచేస్తాడు. పాపమును పోగొట్టునట్టి యీస్తోత్రాన్ని ధరించినవాళ్లు శ్రీహరికి ప్రియమైనవారై ఆయనవలన శ్రేయస్సును పొందుతారు. మనస్సులో కేశవుని తప్పకధ్యానించండి. అనిపలికి భగవంతుడైన రుద్రుడు అక్కడనే అంతర్ధానం చెందాడు. మునులతనికి నమస్కరించి మిక్కిలి సుఖించారు. నారాయణునే పరతత్త్వముగా తలచారు. మిక్కిలి ఆశ్చర్యపడి కృతార్థులము అయ్యామని భావించారు. దిక్పాలకులు విష్ణువునకు నమస్కరించి తమ ఇండ్లకు వెళ్ళారు. భగవంతుడైన విష్ణువు పక్షిరాజైనగరుడునిపై కూర్చుని శంఖచక్ర గదాఖడ్గధనుస్సులను అంబులపొదులను కవచమునూ ధరించి మరల బదరి కాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ మునులందరు పూజింపగా సుఖానముపై కూర్చున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు బదరికాశ్రమానికి వచ్చుటఅను తొంభైఒకటవ అధ్యాయము

☆☆☆

# తొంభై రెండవ అధ్యాయము

## పౌండ్రకుని గర్వవాక్కులు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! రాజశ్రేష్ఠుడు బలవంతుడు వీర్యవంతుడైన పౌండ్రకుడు యాదవులకు కృష్ణునకు శత్రువుగా ఒకనాడు తనరాజసభలో చాలామంది రాజులను పిలిచి నేను సమస్తభూమండలాన్నీ జయించాను. ఇప్పుడు రాజులందరూ నాపై ఆధారపడి ఉన్నారు. యాదవులు వృష్ణివంశీయులు కృష్ణునిసహాయంతో మిక్కిలి అభిమానవంతులుగా ఉన్నారు. వాళ్ళుతప్ప తక్కిన రాజులందరూ నన్ను గౌరవిస్తున్నారు.

నాకేపన్ను చెల్లిస్తున్నారు. కృష్ణుడొక్కడే తనచక్రంబలంతో పిచ్చెత్తి పోయి నన్ను అవమానిస్తున్నాడు. తనకే శంఖచక్రగదాయుధాలున్నాయని అతనికి గర్వం. నేనే శార్ఙ్గమనే ధనుస్సును ధరిస్తున్నానని అతనికి అహంకారం నాతో సమానుడైన ధనుర్బాణధారి ఎవ్వడూలేడు. అని, మదాంధుడై ఉన్నాడు. నాకు ప్రసిద్ధమైన వాసుదేవుడనే పేరును తానుగూడ పెట్టుకొన్నాడు. కాని అతని చక్రంకంటే వెయ్యి అంచులుగల నాచక్రం తీక్ష్ణమైనది. దాని ద్వారా వనచరుడైన వాసుదేవుని చక్రం యొక్క గర్వాన్ని తగ్గిస్తాను.

ఓరాజ సమూహమా! నావద్ద కూడా శార్ఙ్గమనే ఘోరమైన ధ్వనిచేసే ధనుస్సు ఉంది. కౌమోదకి అనే లోహమయమైన గద నావద్దకూడా ఉంది. నేను కూడ నందకమనే సుందరమైన ఖడ్గం ధరించి ఉన్నాను. ఈఖడ్గంతో వాని ఖడ్గాన్ని ముక్కలు చేస్తాను. అతనికున్న ఆయుధాలన్నీ నాకూ ఉన్నాయి. కాబట్టి యుద్ధ భూమిలో అతన్ని తప్పక చంపుతా ఇందులో సందేహం లేదు. ఓరాజసంఘమా! ఇప్పటినుండి నన్ను శంఖచక్రగదాధర వాసుదేవ అని పిలవండి. ఈ ప్రపంచంలోనే నేనే వాసుదేవుణ్ని. నాప్రియమిత్రుడైన నరకాసురుని చంపిన గొల్లవానిని చంపి వేస్తాను. మీరందరూ నన్ను వాసుదేవుడనుగా పిలవకపోతే ఎక్కువ పన్ను వసూలు చేస్తాను అన్నాడు. శ్రీకృష్ణుని పరాక్రమంతో పరిచయంకలవాళ్ళు కొందరు రాజులు సిగ్గుతో తలవంచుకున్నారు. తక్కిన రాజులు అలాగేనన్నారు. మరికొందరు రాజులు బలమదంచేత పిచ్చెక్కి మేంకృష్ణునియుద్ధంలో జయిస్తాం అంటూ అరిచారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పౌండ్రకుని గర్వోక్తులు అను తొంభైరెండవ అధ్యాయము

☆☆☆

# తొంభైమూడవ అధ్యాయము

## పౌండ్రక నారద సంవాదము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలోనే లోకస్థితి తెలిసిన నారదమహర్షి కైలాసము నుండి బయలుదేరి పౌండ్రకుడు పాలించే నగరానికి వెళ్ళాడు. అక్కడకుచేరి ఆకాశం నుండి క్రిందికిదిగాడు. తరువాత రాజద్వారంలో ద్వారపాలకుల అను మతితో రాజసభలోకి వెళ్ళాడు. రాజు వెంటనే అతన్ని పూజించి బాగా ప్రకాశిస్తున్న

ఆసనంమీద కూర్చొపెట్టాడు. పౌండ్రకుని నారదుడు క్షేమమడిగాడు. బలగర్వితు డైనరాజు బ్రాహ్మణోత్తమా! మీరు అన్నిచోట్లకు వెళ్తారు కనుక చెప్పండి. మీరు వెళ్ళిన ప్రతిచోటా నన్నులోకప్రసిద్ధ వాసుదేవునిగా తలుస్తున్నారా? నేను రాజు లనందరినీ ఓడించాను.

శంఖచక్రాదుల ధరించాను. ఎక్కువదానాలు చేస్తున్నాను. నేను అందరి కంటే బలవంతుడనైనరాజును నన్నెవడూ జయించలేడు. గోపాలబాలకుడైన కృష్ణుడు నా పేరును దొంగిలించి తనను వాసుదేవునిగా చెప్పుకుంటున్నాడు. అతనికి బలపరాక్రమం ఏమీలేదు. ఆగొల్లవాడు చిన్నతనంచేక నాపేరును ధరిస్తున్నాడు. ప్రపంచంలో నేనొక్కడనే వాసుదేవుడనని తెలుసుకోవాలి. నేను యదువంశీయుల్ని వృష్ణివంశీయుల్ని వెళ్ళగొట్టి ద్వారకానగరాన్ని ధ్వంసచేస్తా. నేను నా విశాలసైన్యంతో యుద్ధంలో తేలికగా నకిలీ వాసుదేవుణ్ణి చంపేస్తాను. ఈ విషయం అందరికీ చెప్పండి. మీకు నమస్కారం అన్నాడు.

నారదుడు రాజా! నేను ఎక్కడకైనా వెళ్తా కాని ఈమాటలు మాత్రంచెప్పే సాహసం చేయలేను. చక్రపాణియైన వాసుదేవుడు చెడ్డవాళ్ళను శిక్షిస్తూ రాజ్యపాలన చేస్తున్నాడు. అతనిఎదట మరొకడెవడు వాసుదేవుడనే పేరుపెట్టు కోగలడు? ఎవడూ ఇలాంటి సాహసంచేయలేడు ఎందుకంటే అతడు భగవంతుడు గొప్ప పరాక్రమశాలి శార్ఙ్గధారి గదాధరుడు ఆదిదేవుడు పుణ్యాత్ముడు. అతడు నీ అహంకారాన్ని అణచి వేస్తాడు. నీదగ్గరున్న ఆయుధాలతో అతన్ని ఎదిరించలేవు. నీవు నవ్వులపాలవుతావు అనిబోధించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పౌండ్రక నారద సంవాదము అను తొంభైమూడవ అధ్యాయము

☆☆☆

# తొంభైనాల్గవ అధ్యాయము

## పౌండ్రకుడు ద్వారక నాక్రమించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! బలగర్వితుడైన పౌండ్రకుడు నేనురాజును మీరుబ్రాహ్మణులు శాపమిస్తారేమోఅని భయపడుతున్నా, మంచిది మీరువెళ్ళదలుచుకున్న చోటికి వెళ్ళవచ్చు అన్నాడు. నారదుడు మౌనంగా ఆకాశమార్గాన కృష్ణచంద్రుని వద్దకు

బదరికాశ్రమం వచ్చి పౌండ్రకునివృత్తాంతం మొదటినుండి చివరవరకు విని పించాడు. అదివిని భగవంతుడు దేవర్షీ! ఈసమయంలో మీకోరికచెప్పండి. నేను రేపే వాడి గర్వాన్ని అణచివేస్తాఅని ఊరుకున్నాడు. ఇటు పౌండ్రకుడు లెక్కలేవన్ని ఏనుగులు, గుర్రాలు రథాలు కొన్నివేలమంది కాల్బలముతో సంసిద్ధంగాఉన్నాడు. ఏకలవ్యుడు మొదలైన రాజులు కూడ సిద్ధమయ్యారు. ఏనిమిదివేల రథాలు, పదివేలేనుగులు, లక్షకాల్బలము సిద్ధమయ్యారు. ఈ సమస్త సైన్యంతో పౌండ్రకుడు ఉదయకాలపు సూర్యుడులా ప్రకాశించాడు. అర్ధరాత్రిసమయంలో ద్వారకవైపు నడిచాడు.

రథికులు తమరథాలలో శస్త్రాస్త్రాలను అమర్చుకొన్నారు. నాలుగువైపులా జండాలు రెపరెప లాడుతున్నాయి. పౌండ్రకుడు కృష్ణుని తక్కిన వృష్ణివంశీయులను నశింప చేయటానికి ముందుకు నడిచాడు. అతని వెనక రాజులు గొప్ప విశాల సైన్యం వస్తున్నది. ద్వారకకువచ్చి శిబిరాలు వేసి రాజులతో ఓరాజులారా! ఇప్పుడు మీరు నాపేరు చెపుతూ బలవంతుడైన పౌండ్రక మహారాజు కృష్ణుని ఆశ్రయించిన ద్వారకావాసులను సంహరించటానికి వచ్చాడు. ఇపుడు యుద్ధానికిరండి లేదా రాజ్యం విడిచిపెట్టి వెళ్ళండి అని చాటించమన్నాడు. పౌండ్రకుని ఆజ్ఞచే రాజులు యాదవులకు సూచించారు. శస్త్రాస్త్రాలు తీసుకొని నగరద్వారందగ్గర సింహనాదాలు చేయసాగారు. అప్పుడు సాత్యకి బలరాముడు హార్దిక్యుడు యుద్ధం చేయటానికి ఏరి? అని నగరద్వారంవద్ద తిరుగసాగారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పౌండ్రకుడు ద్వారక నాక్రమించుటతొంభైనాల్గవ అధ్యాయము

☆☆☆

# తొంభైఐదవ అధ్యాయము

## యాదవసేన పౌండ్రక సేనను సంహరించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆ అర్ధరాత్రిసమయంలో శస్త్రాస్త్రాలతో కూడిన సైన్యాన్నిచూచి నలువైపులా దీపాలువెలిగించ నారంభించారు. కొన్నిక్షణాల్లోనే యాదవులు యుద్ధానికి తయారైయ్యారు. సాత్యకి, బలభద్రుడు మొదలైన యుద్ధనిపుణులు ఇతరయాదవులూ సిద్ధమయ్యారు. యద్ధనిమిత్తమై నగరం వెలుపలికివచ్చారు.

ఎక్కడ పౌండ్రకుడంటూ నలువైపులా పరుగెత్తారు. దీపాలవెల్తురికి చీకటిపోయింది తరువాత శత్రువులతో యాదవులకు భయంకరయుద్ధం జరిగింది. ఒకరికొకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. యుద్ధభయంకరధ్వని ప్రళయకాల సముద్ర ఘోష వలె ఉంది. ఎంతోమంది రాజులుమరణించి నేలకొరిగారు.

ఆసమయంలో యమునితో సమానుడైన ఏకలవ్యుడు ఒకభయంకర ధనువు చేతబట్టి తీక్ష్ణబాణాలను వర్షిస్తూ యాదవసేనను మర్దింపసాగాడు. అతడు బల వంతులైన క్షత్రియులకు భయం కలిగించేవాడే. ఇరవైఐదుబాణాలతో నిశరుని, పదిబాణాలతో సారణుని ఐదు బాణాలతో హార్దిక్యుని గాయపరచాడు. అతడు తొమ్మిదిబాణాలతో ఉగ్రసేనుని ఏడుబాణాలతో వసుదేవుని పదిబాణాలతో ఉద్ధవుని ఐదుబాణాలతో అక్రూరుణ్ణి బాధించాడు. ఒక్కొక్కని ఇలా భూమిపై పడవేస్తూ యాదవసేనను పారద్రోలాడు. పెద్ద యాదవవీరులను ఓడించే ఏకలవ్యుడను నేను అని అరిచాడు. ఒకరాజు సాత్యకి బలరాముడు నానుండి బ్రతికి ఎక్కడకు పోగలరు? అని సింహనాదంచేశాడు. వాడి అరుపుకు సింహాలుకూడా భయపడ్డాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
యాదవసేన పౌండ్రక సేనను సంహరించుట అను తొంభైఐదవ అధ్యాయము

☆☆☆

# తొంభైఆరవ అధ్యాయము

## పౌండ్రక సాత్యకి సంవాదము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! యాదవసేన వృష్ణిసేన పారిపోయిన తర్వాత దీపాలు ఆరిపోగా అంతటా నిశ్శబ్దమేర్పడింది. పౌండ్రకుడు వృష్ణిసేనను ఓడించానని తలచాడు. అతడు తన సైనికులతో మీరుత్వరగా వెళ్ళండి. సుత్తులతో గొడ్డళ్ళతో ఇంకా ఇతర శస్త్రాస్త్రాలతో ద్వారకాపురం యొక్క ప్రాకారాలను మేడలను పడగొట్టండి. కన్యలను దాసీలనూ పట్టుకోండి వాళ్ళ ముఖ్యమైన సంపదను గొప్పదనాన్ని స్వాధీనం చేసుకోండి. అని చెప్పాడు!

పౌండ్రకుని ఆజ్ఞచేత సామంతులు గొడ్డళ్ళు మొదలైన సాధనాలు తీసుకొని నగరంలోకి దూసుకుపోయారు. ఎత్తైన ప్రాకారాలనూ పెద్దమేడలనూ పడగొట్ట

సాగారు. నలుదిక్కులా పెద్దధ్వని ఏర్పడింది. పూర్వం నిశ్చయించిన విధంగా తూర్పున ఇంచుమించు మేడలన్నీ ధ్వంసమయ్యాయి. అభయంకర ధ్వనిని విని సాత్యకి శ్రీకృష్ణుడు చెప్పివెళ్ళిన మాటలను తలచుకొని ద్వారకాపుర రక్షణ నాపైనుంది అని భావించి ధనుస్సునెక్కుపెట్టాడు. దారుకుని కుమారుడు తెచ్చిన రథమెక్కి దీపాల వెల్తురున్న చోటికి వెళ్ళాడు. దృఢమైన కవచాన్ని ధరించాడు. అన్ని ఆయుధాలను తీసుకొని సాత్యకి యుద్ధానికి వెళ్ళాడు.

ఒకవైపు నుండి బలరాముడు గద బాణాలూతీసుకొని యుద్ధానికివచ్చాడు. అతడు భయంకరమైన సింహనాదాలు చేస్తున్నాడు. ఉద్ధవుడుకూడ ఏనుగుపై కూర్చుని యుద్ధానికి వచ్చాడు. హార్దిక్యుడు మొదలగు వాళ్ళుకూడ. శ్రీకృష్ణుని మాటలుతలచుకొని రథాలమీద ఏనుగులమీద సింహనాదాలు చేస్తూ యుద్ధో త్సాహంతో తూర్పుద్వారంవద్ద గుమికూడారు. అందరూ ఒకచోట చేరిన తరువాత సాత్యకి వాయవ్యాస్త్రాన్ని సంధించి శత్రుసేనపై ప్రయోగించాడు. శత్రు పక్షవీరు లందరూ ఓడిపోయి భయంతో పారిపోయి పౌండ్రకువద్దకు చేరారు. పౌండ్రక పక్షరాజులు ఆయస్త్రవేగానికి ఎగిరిపోయి పూర్వం పారిపోయిన రాజులు నిలిచిన చోట నిలబడ్డారు.

ఆసమయంలో సాత్యకి సర్పం పడగవంటి బాణాన్ని సంధించి నేనుయుద్ధానికి సిద్ధంగా ఉన్నాను. పౌండ్రకుడు ఎక్కడ ఉన్నాడు? అని పలికాడు. నేను భగవంతు డైన కృష్ణునకు సామాన్య సేవకుణ్ణి. పౌండ్రకునిచంపుటకు నిలిచిఉన్నాను. అతడు ఒక్కమారు కనిపిస్తే చంపివేస్తాను. ఈక్షత్రియులందరిముందు అతని శిరస్సు ఖండించి కుక్కలకు ఆహారంచేస్తాను. రాత్రిఅందరూ నిద్రపోయే సమయమందు దొంగలాగా ఏలా ఈవిధమైన చెడుపని చేస్తాడు? ఇతడు రాజుకాదు దొంగ. అతని భుజబలాన్ని నిందిస్తున్నాను. అని పలికి సాత్యకివానిపై బాణంతొడిగాడు. పౌండ్రకుడు సాత్యకి మాటలు విని ఈ సమయంలో అస్త్రీవధ పశువధ చేసినవాడు గొల్లవాడుఅయిన కృష్ణుడెక్కడు ఉన్నాడు? నావాసుదేవుడనే పేరును దొంగలించిన ఆదుష్టుడు ఎక్కడ దాగిఉన్నాడు? అతడు నామిత్రుడైన నరకాసురుని చంపాడు. ఇవేళ ఆదుష్టునిచంపి ఇంటికి తిరిగి వెళ్తా.

ఓసాత్యకీ! నీకిష్టమైనచోటికి వెళ్ళు నీవునాతో యుద్ధంచెయ్యలేవు. లేకపోతే ఒకక్షణం ఉండివెళ్ళిపో. నీవు నాపరాక్రమాన్ని ఇప్పుడు చూడదలిస్తే నీశిరస్సును ఖండిస్తాను. ఈగోపాలుడు నీసహాయంతో గర్విస్తున్నాడు. నీమరణవార్త విన్న

తరువాత అతని గర్వం నశిస్తుంది. నీమీద ద్వారకను రక్షించే భారంపెట్టి ఆగొల్లవాడు కైలాసానికి వెళ్ళాడని విన్నాను. యుద్ధంచేయగల సమర్థత ఉంటే బాణాన్ని ఎక్కుపెట్టు. అని సాత్యకితోపలికి పౌండ్రకుడు బాణంతీసుకొని యుద్ధానికి తయారయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పౌండ్రక సాత్యకి సంవాదము అను తొంభైఆరవ అధ్యాయము

☆☆☆

# తొంభై యేడవ అధ్యాయము

## సాత్యకి పౌండ్రకుల యుద్ధము-1

వైశంపాయనుడిలా చెప్పాడు.

తరువాత వృష్ణివంశశ్రేష్ఠుడైన సాత్యకికోపించి శ్రీకృష్ణచంద్రుని తలుచు కుంటూ ఓరిదుర్మార్గుడా! జీవించదలచినవాడు ఎవ్వడు జగత్పతియైన వాసుదేవుని గూర్చి ఇలా మాట్లాడగలుగుతాడు? ఇలా మాట్లాడినందుకు మృత్యువు నిన్ను సమీపిస్తున్నది. అలాంటి మాటలు మాట్లాడినందుకు నీ నాలుక నూరుముక్కలువు తుంది. ఓరి పౌండ్రకా! ఇదిగో శరీరంనుండి నీతలకాయను వేరుచేస్తున్నాను. వాసుదేవుడనేపేరు నీకుశిరస్సునేలపై పడేంతవరకే ఉంటుంది. నీవు రేపు ప్రపంచంలో కనిపించవు రేపటినుండి ఆతడు ఒక్కడే వాసుదేవుడు. సందేహం లేదు. ఇప్పుడు శ్రీకృష్ణభగవానుడు రాకపోతే నేనే నీతల నేలకూల్చుతాను. నీఅస్త్ర బలం శరీరబలం ఇప్పుడు చూపించు. ఇదిగో నిలిచి ఉన్నాను నీపరాక్రమమేమిటో చూపించు. ఈనగరకంలోకి వెళ్ళలేవు. వాసుదేవకుడవైన నిన్నుచూచుటచే కృతార్థుడనయ్యాను. నీశరీరాన్ని నువ్వు గింజలవలె చేసి కుక్కలకిస్తాను. అని పలికి బాణం తీసుకొని పౌండ్రకుని పై ప్రయోగించాడు.

ఆదెబ్బకు శరీరంనుండి కళ్ళనుండి రక్తంకారగా ప్రతాపవంతుడైన పౌండ్రకుడు కోపించి పందొమ్మిబాణాలతో సాత్యకినికొట్టి పెద్దగాఅరుస్తూండగా సాత్యకి రథమందే కదలలేనివాడయ్యాడు. తరువాత పౌండ్రకుడు పదిబాణాలతో సారథిని, ఇరవైబాణాలతో గుర్రాలనుకొట్టగా రక్తంతో అవి తడిసిపోయినాయి. వాసుదేవుడు రథంమీద సింహనాదం చేశాడు. ఆధ్వనికి సాత్యకి తెలివినొంది గుర్రాలను సారథినీ చూచి ఇపుడు నీపౌరుషం చూపించు అని ఒక బాణంతో

పౌండ్రకుని వక్షస్థలం మీద కొట్టాడు. దానితో రక్తంకారుతూ రథంమండే నిట్టూర్పు విడుస్తూ ఒరిగాడు. ఏం చేయవలసిందీ తెలియక కూర్చున్నాడు.

సాత్యకి పదిబాణాలతో రథాన్ని ధ్వజాన్ని గుర్రాలనుకూల్చి పౌండ్రకుడు చూస్తుండగానే సారథిశిరస్సును కూడ ఖండించాడు. అతన్నిచూచి పెద్దగానవ్వాడు. తరువాత డెబ్బైబాణాలతో నలువైపుల నుండి గ్రుచ్చుకొనేట్లునాటాడు. పౌండ్రకుడు దరిద్రుడులా కూర్చుని ఉన్నాడు. తరువాత అర్ధచంద్రాకార బాణంతో వాసుదేవుడు సాత్యకిని బాధించాడు. సాత్యకి కోపంతో అయిదుబాణాలతో పౌండ్రకుని ధనుస్సును ఖండించాడు. సింహనాదం చేశాడు. వాసుదేవుడు సాత్యకిపై గదను విసిరాడు. దానిని ఎడమచేతితోపట్టుకొని సాత్యకి ఒకబాణంతో పౌండ్రకుని నొప్పించాడు. వాసుదేవుడు పదిబాణాలతో సాత్యకినికొట్టాడు. సాత్యకి వేరేధనుస్సు పట్టుకొని కొట్టాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సాత్యకి పౌండ్రకుల యుద్ధము-1 అను తొంభైఏడవ అధ్యాయము

☆☆☆

# తొంభైఎనిమిదవ అధ్యాయము

## సాత్యకి పౌండ్రకుల యుద్ధము-2

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలో సాత్యకి మిక్కిలి కోపించి పౌండ్రకునిపై తీక్ష్ణమైన గదను ప్రయోగించాడు. బలవంతుడైన పౌండ్రకుడు కూడ గదను విసిరాడు. ఇద్దరూ గదా యుద్ధంచేస్తూ సింహాల్లాగా కనిపించారు. తరువాత సాత్యకి పౌండ్రకుని వక్షస్థలం మీద కొట్టాడు. దానితో అతడు క్రింద కూర్చున్నాడు. తరువాత కొంచం సేపటికి లేచి సాత్యకితలపై గదపెట్టికొట్టాడు. సాత్యకి బాధపడినా వెంటనేలేచి పౌండ్రకుని కూడ గదతోకొట్టాడు. తరువాత సాత్యకి పౌండ్రకుని గదనులాగుకొని రెండుముక్కలుచేసి సింహగర్జనచేశాడు. పౌండ్రకుడు లెక్కచేయక సాత్యకి రొమ్ముపై కొట్టాడు. కొంతసేపు ముష్టియుద్ధంచేశాడు. మోకాళ్ళతో పిడకిళ్ళతో బాహువులతో శిరస్సుతో వక్షస్థలంతోనూ కొట్టుకుంటూ యుద్ధంచేశారు. అద్వంద్వ యుద్ధంలో సాత్యకిచే పౌండ్రకుడు చస్తాడా లేక పౌండ్రకునిచేత సాత్యకి

మరణిస్తాడా అనిరెండుపక్షాలవాళ్ళు ఉత్కంఠతో చూడసాగారు. తరువాత పౌండ్రకుని సాత్యకి పదిగుద్దులుగుద్దాడు. పౌండ్రకుడు ఐదుగుద్దులు గుద్దాడు. అపుడుఏర్పడిన గొప్పధ్వని అందరినీ ఆశ్చర్యపరిచింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సాత్యకి పౌండ్రకుల యుద్ధము-2 అను తొంభైఎనిమిదవ అధ్యాయము

★★★

# తొంభైతొమ్మిదవ అధ్యాయము

## బలరాముడు ఏకలవ్య సేనను సంహరించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! నిషాదాధిపతియైన ఏకలవ్యుడు క్రోధంతో ధనుస్సు పట్టుకొని బలరామునివైపు వేగంగాపరుగెత్తాడు. అప్పుడు జగత్ప్రతివీరుడైన బలరాముడు పది బాణాలతో ఏకలవ్యునికొట్టి మరొక పదిబాణాలతో సారధినంతమొందించి మూడు బాణాలతో రథాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. తర్వాత భల్లాస్త్రంతో ఏకలవ్యుడు జండాను విరగగొట్టాడు. తరువాత బలవంతుడైననిషాదరాజు పెద్ద మరొక ధనుస్సు తీసుకొని అందరివిడిచి బలరాముని బాణాలతోకొట్టాడు. బలరాముడు నిట్టూర్పు విడిచి సర్పాలవంటి పదిబాణాలతో ఏకలవ్యుని ధనుస్సును మరల ఖండించాడు. తరువాత ఏకలవ్యుడు ఖడ్గందీసుకొని బలరామునిపై విసిరాడు.

బలరాముడుదాన్ని ఐదు బాణాలతో ఛేదించాడు. ఏకవ్యుడు మరోఖడ్గం తీయగా దానినికూడ పదిబాణాలతో ముక్కలుచేశాడు. తరువాత ఏకలవ్యుడు శక్తి అనే ఆయుధాన్ని బల దేవునిపై విసిరి సింహగర్జనచేశాడు. దానిని చేతితో పట్టుకొని శత్రువురొమ్ముపై విసిరాడు. అందరూ ఆశ్చర్యపోయారు. ఆదెబ్బకు ఏకలవ్యుడు నేలపైపడ్డాడు. అప్పుడు అతని వేలాదిసైనికులు అనేకవిధాలైన ఆయుధాలను బలరామునిపై ప్రయోగించారు. బలరాముడు ఒక్కొక్కని నాగలితో లాగిరోకలితో పొడిచిచంపాడు. బలరాముడు ఆసేనవంతనూ ధ్వంసంచేసి సింహగర్జనచేశాడు పిశాచాలు మాంసంతిని రక్తంత్రాగి ఆనందించాయి.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందు భవిష్యపర్వమున
బలరాముడు ఏకలవ్య సేనను సంహరించుట అను తొంభైతొమ్మిదవ అధ్యాయము

★★★

# నూరవ అధ్యాయము

## ఏకలవ్య బలరాముల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

రాజా! పచ్చిమాంసంతినే పిశాచాలు శవాలనుతిని పెద్దగానవ్వుతున్నాడు. వాటి నవ్వులధ్వని భూమినంతనూ వ్యాపించింది. రాక్షసులు బాగా రక్తంత్రాగి శవాల మాంసం తింటూ ఆనందంతో నాట్యంచేశారు. ఆసమయంలో ఏకలవ్యుడికి తెలివివచ్చింది. తనసైన్యం అటూఇటూపారిపోవుటంచూచి కోపించి ఏకలవ్యుడు గదనుఎత్తి బలరామునకు ఎదురుగా వెళ్ళాడు. దగ్గరకువెళ్ళి మెడపైగదతో వేగంగా కొట్టాడు. బలరాముడుకూడ అక్రూరునిపై గదతోకొట్టాడు. ఆగదలచప్పుడు ఆకాశమంతా వ్యాపించింది. ఈసమయంలో పౌండ్రకుడు సాత్యకిని గదతో కొట్టాడు. ఆకాశం ధూళితో కప్పబడింది. ప్రాతఃకాలం అయింది. సూర్యోదయం అయింది చంద్రుడు పడమటదిక్కున అస్తమిస్తున్నాడు. అనలుగురి యుద్ధం సాగుతూనేఉంది. దేవదానవ సంగ్రామంలో ఆయుద్ధం భయంకరముగా జరిగింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
ఏకలవ్య బలరాముల యుద్ధము అను నూరవ అధ్యాయము

☆☆☆

# నూట ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణ పౌండ్రకుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

తరువాత తెల్లవారగా భగవంతుడైన దేవకీసుతుడు బదరికాశ్రమంనుండి ద్వారకాపురానికి వెళ్ళాలని నిశ్చయించాడు. అక్కడ మునులకు నమస్కరించి వారిని వీడ్కొన్నాడు. తరువాత గరుడునిపై వేగంగా వెళ్ళాడు. ద్వారకకు వెళ్ళేటప్పుడు దారిలో ఘోరయుద్ధమునుగూర్చి విన్నాడు. ఈమహాధ్వని ఎక్కడ నుండి వస్తున్నది? అని ఆలోచించాడు. సాత్యకి యొక్క యుద్ధధ్వని వినిపిస్తున్నది. పౌండ్రకుడు ద్వారకుక వచ్చి ఉంటాడని ఊహించాడు. సాత్యకి పౌండ్రకుల యుద్ధమే జరుగుతున్నదని నిశ్చయించాడు. వృష్ణివీరులానందంకొరకు గొప్ప

ధ్వనితో కూడిన తనపాంచజన్య శంఖాన్ని పూరించాడు. ఆధ్వని సమస్త ఆకాశాన్ని వ్యాపించింది. ఇది పాంచజన్య ధ్వనియే అని నమ్మారు. భగవంతుడు వస్తున్నాడని తెలుసుకొన్నారు.

యాదవుల మనస్సులలో క్రొత్త ఉత్సాహసాహసాలు కనిపించాయి. వాళ్ళు నిర్భయులయ్యారు. ఆసమయంలోనే పక్షిరాజుపై వస్తున్న కృష్ణుని జనులుచూచారు. వందిమాగధులు కృష్ణభగవానుని స్తుతించారు. ఆసమయంలో నలువైపుల నుండియాదవులు శ్రీకృష్ణుని వద్దకు వచ్చారు. కృష్ణుడు గరుత్మంతునిపైనుండి గరుత్మండా! నీవు ఇక్కడ నుండి స్వర్గానికి వెళ్ళు. అని గరుడుని వీడ్కొని, దారకుని త్వరగా నారథం తెమ్మని చెప్పగా మంచిదని అతడు రథాన్ని తెచ్చాడు. మహాత్మా ఇదిగోరథం ఏంచెయ్యాలో చెప్పండి అన్నాడు.

శ్రీకృష్ణుడు రథంపైకూర్చుని యుద్ధజరుగుతున్న చోటికి త్వరగావెళ్ళాడు. యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు తన పాచజన్యశంఖాన్ని పూరించాడు. పౌండ్రకుడు సాత్యకిని విడిచి యుద్ధానికి సిద్ధంగా ఉన్న శ్రీకృష్ణునికి ఎదురుగావచ్చాడు. కోపించిన సాత్యకి పౌండ్రకునితో నేను యుద్ధమందు ఉత్సాహం కలిగిఉండగా నన్ను విడిచి మరొకనిమీదికి వెళ్ళటంతగదని అడ్డగించాడు. ఈమాటలు కృష్ణుని సమక్షంలోనే జరుగుతున్నాయి. కాని పౌండ్రకుడు సాత్యకి మాటలను లెక్కచేయక కృష్ణునివైపే నడువసాగాడు. అప్పుడు సంపూర్ణశక్తితో భగవంతుని యెదుటే పౌండ్రకుని గదతో కొట్టాడు. భగవంతుడు సాత్యకి యొక్క వీరత్వాన్నిచూచి అతన్ని మెచ్చుకొన్నాడు.

తరువాత శ్రీకృష్ణుడు అతన్ని అడ్డగిస్తూ సాత్యకీ! అతనికి ఇష్టమైనట్లే చేయనిమ్ము. అనిసాత్యకిని శాంతింపచేశాడు. తరువాత పౌండ్రకుడు శ్రీకృష్ణునితో ఓయాదవా! గోపాల! ఇప్పటిదాకా ఎక్కడున్నావు? నేనూ వాసుదేవణ్ణే నీదర్శనం కోసం వచ్చాను. నిన్ను నేసేనుచంపి ఓకే వాసుదేవుడనుగా ఉంటాను. నీచక్రా యుధము నన్ను బాధించింది. ఇపుడు క్షత్రియుల ఎదుట నీచక్రబలాన్ని నశింప చేస్తాను. నీదగ్గరేకాదు నావద్దకూడా శారఙ్గమనే ధనుస్సు ఉంది. నీశంఖగర్వం కూడ ఇక ఉండదు. నేనుకూడ శంఖచక్రగదలను ధరించినవాడను. నీవుచిన్నప్పుడు బలహీనులను ముసలివాళ్ళను, అజ్ఞానులను, స్త్రీలను సంహరించావు. నీవు గోహత్య కూడా చేశావు. అందువల్ల గర్వించావు. ఇవేళ నీగర్వాన్ని అణచివేస్తాను.

యుద్ధంలో వెన్నుచూపి పారిపోరాదు. గోవిన్ద! నాతో యుద్ధం చెయ్యాలని కోరికుంటే ఆయుధం పట్టుకో. అని పలికి పౌండ్రకుడు ధనుర్బాణాలను చేతబట్టాడు.

కృష్ణుడు చిరునవ్వుతో రాజా! నేను పాతకిని, బాలఘాతి అఘాస్త్రేఘాతి అనేమైన అనురూపంలోనూ రంగులోనూ నీచక్రం నాచక్రంతో సమానమైనా బలంతో మాత్రంకాదు. నీతక్కిన ఆయుధాలుకూడ పేరులో మాత్రమే పోలికకలవి. గుణంలో కాదు. నేను గోపాలుడనే అయినా అందరికీ ఎల్లప్పుడూ జీవనదాతనై యున్నాను. ఈప్రపంచంలో అందరినీరక్షిస్తూ చెడ్డవాళ్ళను శిక్షిస్తూఉన్నాను. నీకుశక్తిఉంటే నన్నుచంపిన తర్వాత ఇలాంటి మాటలుమాట్లాడు. నేఅన్ని ఆయుధాలనూ ధరించి రథంపై కూర్చున్నాను. నిన్నే ఎదురుచూస్తున్నాను. ఇప్పుడు నీవుకూడా సిద్ధంకమ్ము అనిపలికి శ్రీకృష్ణుడు సింహగర్జన చేశాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
శ్రీకృష్ణ పౌండ్రకుల యుద్ధమనను నూటఒకటవ అధ్యాయము

☆☆☆

# నూటరెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు పౌండ్రకుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత వాసుదేవుడు పౌండ్రకునిపై బాణంప్రయోగించాడు. పౌండ్రుడు పదిబాణాలతో వాసుదేవుని కొట్టాడు. ఇరవైఐదు బాణాలను దారుకునిపై గుర్రాలను పదిబాణాలతో శ్రీకృష్ణుని డెబ్బైబాణాలతో కొట్టాడు. కేశవుడొకబాణంతో ధ్వజాన్ని ఛేదించాడు. సారథిశిరస్సును ఖండించి నాలుగు గుర్రాలను చంపి రథచక్రాన్ని చూర్ణంచేసి నవ్వుతూ నిలిచాడు. పౌండ్రకుడు రథం నుండి దూకి ఖడ్గాన్ని తీసుకొని కేశవునిపై విసిరాడు. ఆఖడ్గాన్ని కూడ ఖండించి శ్రీకృష్ణుడు నిశ్శబ్దంగా లిచాడు. తరువాత పరమప్రతాపవంతుడు పౌండ్రుకుడు యమునివలె భయంకరమైన పరిఘను రాజులు చూస్తుండగా కృష్ణునిపై ప్రయోగించాడు.

జగత్పతి కృష్ణుడు దాన్నికూడ ముక్కలుచేశాడు తరువాత పౌండ్రకుడు వెయ్యి అంచులుగల చక్రాన్ని పట్టుకొని కృష్ణునితో నీచక్రాన్ని నాశంచే నా ఈ

చక్రాన్ని చూడు. ఈచక్రంతో ఈ రాజులందరి సమక్షంలో నీగర్వమును ఈ చక్రంతో దూరంచేస్తాను. ఓకృష్ణా! నీకుశక్తి ఉంటే దీన్నినాశంచెయ్యి. అని త్రిప్పి త్రిప్పి ఆచక్రాన్ని భగవంతునిపై విసిరాడు. ఘోరమైన సింహగర్జనచేశాడు. భగవంతుడు అతనివీరత్వానికి ఆశ్చర్యపడ్డాడు. ఆయన పౌండ్రకుని పరాక్రమాన్ని ధైర్యాన్ని మిక్కిలి మెచ్చుకుంటూ రథంమీద నిలుచున్నాడు. తరువాత పౌండ్రకుడు ఒక విశాలమైన రాతిబండను భగవంతుని మీద విసిరివేశాడు. శ్రీకృష్ణుడు దాన్ని చేతితో పట్టుకొని మరల అతనిపైనే విసిరివేశాడు.

ఈవిధంగా భగవంతుడు పౌండ్రకునితో చాలాసేపు ఆటఆడి వినోదించాడు. తరువాత రాక్షసులను చంపునట్టి బంగారంతో నిర్మించిన వెయ్యిఅంచులుగల చక్రాయుధాన్ని ప్రయోగించాడు. దాన్ని చూచి రాక్షసులు భయపడతూ ఉంటారు దేవతలు పూజిస్తూఉంటారు. ఆచక్రాయుధం మహిమ సామాన్యమైనదిగాదు. భగవంతుడైన శ్రీకృష్ణునివద్ద ఆచక్రం ఎప్పుడూ ఉంటుంది. భగవంతుడిట్టి చక్రాయుధం పౌండ్రకుని శరీరాన్నిచీల్చి మరల భగవంతుని చేతిలోనికివచ్చి చేరింది. రాజైన పౌండ్రకుడు మరణించి నేలమీదకూలాడు. ఈవిధంగా పౌండ్రకవధ జరిగింది. యాదవగణము భగవంతుడైన శ్రీకృష్ణుని పూజింపసాగింది. అక్కడ నుండి తెలియరాని నడకగల శ్రీకృష్ణభగవానుడు తనను ధర్మఅనే సభకు వచ్చాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు పౌండ్రకుని చంపుట అను నూటరెండవ అధ్యాయము

☆☆☆

# నూటమూడవ అధ్యాయము

## పౌండ్రక వధ సమాప్తి

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! మహాబలవంతుడు పరాక్రమవంతుడైన బలరాముడు ఏకలవ్యుని రొమ్ముపై మాయావినియైన శక్తియనే ఆయుధాన్ని ప్రయోగించాడు. సింహగర్జన చేశాడు. ఏకలవ్యుడు మిక్కిలి కోపించి బలదేవుని వక్షస్థలంమీద గదతో కొట్టాడు. తరువాత బలరాముడు ప్రాణవినాశినియైన గదను రెండుచేతులలతో పట్టుకొన్నాడు.

దాన్నిచూచి ఏకలవ్యుడుమిక్కిలి భయపడి యుద్ధభూమినుండి తిన్నగా సముద్రంవైపు పరుగెత్తాడు. బలదేవుడు గదపట్టుకొని వాడివెనకనే పరిగెత్తాడు. ఏకలవ్యుడు సముద్రంలో ఐదు యోజనాలు పోయి భయపడుతూనే మరొక దీవికి వెళ్ళి నివసించాడు. అందువల్ల బలరాముడు ఏకలవ్యుని జయించాడు. తరువాత బలరాముడు మణిరత్న శోభితమైన యాదవసభలో ప్రవేశించాడు.

అప్పుడు సాత్యకికూడ ఆసభలో ప్రవేశించాడు. కొంతసేపైన తరువాత ఇతర యాదవులు కూడ సభకువచ్చారు. అప్పుడు భగవంతుడైన కృష్ణుడు వాళ్ళకు తగినట్లు సమ్మానంచేసి ఇలా చెప్పాడు. కైలాసపర్వతం చాలా అందమైనది. అక్కడ శంకరుని కూడ చూచాను. నాకుప్రసన్నుడై వరంకూడా ఇచ్చాడు. అక్కడకు చాలమంది దేవతలు, మునులు కూడ వచ్చారు. అప్పుడు మహాదేవుడు కూడా వచ్చి నన్ను స్తోత్రంచేస్తూ కలుసుకున్నాడు. అక్కడనేనొక ఆశ్చర్యంచూచాను. ఒకరోజు రాత్రి రెండు పిశాచాలు వేటాడుతూ నన్నుగురించి మాట్లాడుకుంటు న్నారు. మెల్లమెల్లగా నాదగ్గరికి వచ్చారు. నన్నుచూచివాళ్ళు మిక్కిలి సంతోషించారు. శ్రద్ధగా నాకు నమస్కరించారు. తరువాత తపస్సు ప్రారంభించారు. వాళ్ళ గొప్ప భక్తిని చూచి నేనువాళ్ళకు స్వర్గమును ఇచ్చాను. తరువాత శంకరుని ప్రసన్నుని చేసుకొని నేను ఈనాడే అక్కడనుండి వచ్చాను.

తరువాత యాదవు లందరూ శ్రీకృష్ణుని పొగడుతూ నీఆశ్రయంలోఉండి మేముకృతార్థులమయ్యాము. అనిపలికి వారివారి ఇళ్ళకు వెళ్ళారు. శ్రీకృష్ణుడుకూడ తనభవనానికి వెళ్ళాడు. అక్కడ రుక్మిణీ సత్యభామ మొదలగు రాణులకు కైలాస యాత్రా వృత్తాంతాన్నంతనూ చెప్పాడు. ఆరాణులు సంతోషించారు. మహారాజ! ఈవిధంగా శ్రీకృష్ణుని చరిత్రనంతనూ వినిపించాను. భగవంతుడీ విధంగా దుష్టు లనువధించి భూమి నంతను పరిపాలించాడు. తరువాత అతడు బ్రాహ్మణులకు గోదానము అధికమైన ధనదానముచేశాడు. ఆయన బ్రాహ్మణులను, మునులను, దేవతలను, పితృదేవతలను, తృప్తిపరుస్తూ ఉన్నాడు. అతనిపాలనకాలంలో ఆటంకములు లేకుండ అందరూ ఆనందంతో జీవనంసాగించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
పౌండ్రక వధ సమాప్తి అను నూటమూడవ అధ్యాయము

☆☆☆

# నూటనాల్గవ అధ్యాయము

## హంసడింభకోపాఖ్యానము

జనమేజయుడు ఓతపోధనా! శంఖచక్రగదాధరుడైన భగవానునిచరిత్ర మాటి మాటికీ విన్నప్పటికీ తృప్తికలుగుటలేదు. కనుక విస్తరంగా అతని పవిత్ర చరిత్ర వినిపించండి. భగవంతుని కథ ఒకసాటిలేని పురుషార్థము. భగవంతుడైన కృష్ణుని తోపాటు హంసడింభకులకు లోకోత్తరయుద్ధము ఎందుకు జరిగింది? దైత్య శ్రేష్ఠుడైన విచక్రదానవునితో ఆయనయుద్ధానికి కారణమేమిటి? విచిత్రునితో అతనికి స్నేహంకలదని విన్నాను. ఆహంసడింభకులు గొప్పబలవంతులు, అన్ని శాస్త్రాలలో నేర్పరులు, భార్గవుని శిష్యులు, వాళ్ళిద్దరూ విష్ణువునుండి వరంకూడా పొందారు. వాళ్ళిద్దరూ ఎవరిపుత్రులు? వాళ్ళతో యుద్ధమెందుకు జరిగింది? విచక్రకుని వద్ద ఎనభైవేల దానవసైన్యముంది. వాళ్ళందరూ తీక్ష్ణమైన శూలాలు ధరించినవాళ్ళు. వాళ్ళందరూ రాక్షసరాజైన విచక్రకుని జయంకోరుతున్నారు. వాళ్ళు ఎల్లప్పుడూ యుద్ధం కోరుతూ యాదవులరంధ్రాలను వెతుకుతున్నారు. ఒకమారు దేవదానవయుద్ధంలో అతడు దేవతలను ఓడించాడు. శ్రీకృష్ణుడుకూడా అతన్ని వశింపచేయటానికి ఎల్లప్పుడు ప్రయత్నిస్తున్నాడు. కనుక ఈవిషయాన్ని బాగా వినాలనికోరుతున్నాను.- అన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభకోపాఖ్యానము అను నూటనాల్గవ అధ్యాయము

☆☆☆

# నూటఐదవ అధ్యాయము

## హంసడింభకుల పుట్టుక

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శాల్వనగరంలో మిక్కిలి శుద్ధస్వభావుడైన బ్రహ్మదత్తుడనే దయాళువైన ఒకరాజున్నాడు. అతడు ఎల్లప్పుడూ పంచయజ్ఞములందు ఆసక్తి కలవాడు. జితేంద్రియుడు వేదవేత్త. శుభమైన ఆలోచనకలవాడు. అతనికి రూప వతులు గుణవతులైన ఇద్దరుభార్యలు ఉన్నారు. ఏభార్యయందూ పుత్రులు కలుగలేదు. దేవలోకంలో ఇంద్రుడువలె బ్రహ్మదత్తుడు తన యిద్దరుభార్యలతో

సుఖంగా కాలం గడుపుతున్నాడు. మిత్రసహుడనే బ్రాహ్మణుడు ఆరాజుకు మిత్రుడు. మిత్రసహుడు వేదవేదాన్తాల అంతుచూచినవాడు గొప్పయోగికూడ రాజైన బ్రహ్మదత్తునిలాగే అతడు కూడ సతానంలేనివాడైయాడు. పుత్రసంతానం కొరకు బ్రహ్మదత్తుడు తన రాణులతో శంకరుని ఆరాధించాడు. మిత్రసహుడు పుత్రప్రాప్తికొరకు వైష్ణవయజ్ఞం ప్రారంభించాడు.

రాజురాణీ ఆరాధనకు సంతోషించి శంకరుడు ఒకరోజు స్వప్నంలో ప్రత్యక్ష మయ్యాడు. నేను ప్రసన్నుడయ్యాను, వరమడుగు అన్నాడు. బ్రహ్మదత్తుడు పరమాత్మా నాకిద్దరుపుత్రులు కావాలి అని అడిగాడు. శంకరుడు 'తథాస్తు' అని అంతర్ధానంచెందాడు. అప్పుడేరాజుకు నిద్రకూడ పూర్తయింది. మిత్రసహుడు ఐదు సంవత్సరాలవరకు విష్ణువు నారాధించాడు. విష్ణువు ప్రసన్నుడై మంచి గుణాలుగల పుత్రుని వరంగాఇచ్చాడు. రాజుభార్యలిద్దరిలో ఒక్కొకరికి ఒక్క పుత్రుడు జన్మించాడు. రాజు ఆనందంతో నామకరణాది సంస్కారాలు పూర్తి చేశాడు. బ్రాహ్మణులతకు బాగాధనమిచ్చాడు. మిత్రసహుడికి నారయణుడువంటి పుత్రుడుకలిగాడు. బ్రాహ్మణుడు కూడ ఉత్సాహంతో పిల్లవానికి జాతకర్మాది సంస్కారాలు నెరవేర్చాడు. ఈముగ్గురూ వేదధ్యయనంచేసి, నీతిశాస్త్రం నేర్చు కున్నారు. కొద్దికాలంలోనే ధనుర్విద్యలో నిపుణులయ్యారు. ఇద్దరు రాజపుత్రులలో పెద్దవాడిపేరు హంసుడు రెండవవాడు డింభకుడు. మిత్రసహుని పుత్రుని పేరు జనార్దనుడు ముగ్గురు మిక్కిలి పరస్పరం స్నేహం కలగి ఉన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశకుందలి భవిష్యపర్వములో
హంసడింభకుల పుట్టుక అను నూటఐదవ అధ్యాయము

☆☆☆

# నూటఆరవ అధ్యాయము

## హంసడింభకుల వేట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శంకరుని అంశలైన హంసడింభకులిద్దరూ తపస్సుచేయటానికి ఉమాపతియైన శంకరురుని ప్రసన్నుని చేసుకోవాలని హిమాలయపర్వతంమీదికి వెళ్ళారు. అక్కడ తపస్సుచేయసాగారు. పరాక్రమం అస్త్రబలం అన్నిటికంటే గొప్పవని వాళ్ళ ఉద్దేశం. ఆఇద్దరు రాజపుత్రులు నీటిని వాయువును మాత్రమే

ఆహారంగా తీసుకొని తపస్సుచేస్తూ ఓదేవాదిదేవ! శంకర! మీకునమస్కారం. హరుడు, శర్వుడు, నీలగ్రీవుడు మొదలగు నామాలను నోటపలుకుతూ రాత్రిం బవళ్ళూ మహాదేవుని స్తోత్రం చేస్తున్నారు. వాళ్ళు తమ హృదకమలంలో స్థిరమైన ఆసనమిచ్చి తన్మయత్వంతో తపస్సు చేస్తున్నారు. అహంకర మమకారాలు వాళ్ళ హృదయంనుడి దూరమయ్యాయి. మౌనమవలంబించి ఐదుసంవత్సరాలు పూర్తిగా కఠోరమైన తపస్సుచేశారు. మహాదేవుడు ప్రసన్నుడయ్యాడు, హంపడింభకులిద్దరూ చంద్రశేఖరుడైన భగవంతునికి నమస్కరించారు. మీకోరికను చెప్పమన్నాడు శంకరుడు.

ఓపరమాత్మా! మేము దేవయక్షగంధర్వాదులచే జయింపబడకుండాలి అనికోరారు. శివుడు 'తథాస్తు' అనిపలికి, కుండోదర, విరూపాక్ష అనే రెండు గణాలు వీళ్ళిద్దరూ యుద్ధానికివెళ్తే మీరువాళ్ళకు సహాయంచెయ్యాలి అనిపలికి శివుడు అంతర్ధానంచెందాడు. తరువాత హంసుడు డింభకుడు ఎవరికీ జయింప రానివాళ్ళు అయ్యారు. ఇప్పటికీ వాళ్ళు పరమశివభక్తులే. మహాదేవ! నీకునమస్కారం అంటూ ఉంటారు. తరువాత వాళ్ళిద్దరూ తమయింటికి వెళ్ళారు. తల్లిదండ్రు లిద్దరికీ పాదాలకు నమస్కారంచేశారు. జనార్దనుడు కూడా విష్ణుభగవానుని ఆరాధించి వేదం నేర్చుకున్నాడు. విష్ణుభగవానుని ఉపాసనలో తన్మయుడై యున్నాడు. తరువాత ముగ్గురికీ వివాహంఅయింది. ముగ్గురూ పంచయజ్ఞాలను చేయుటలో ఆసక్తి కలవారై ఏకపత్నీవ్రతులై పెద్దలసేవయందు మనస్సును లగ్నం చేసేవాళ్ళు. ధర్మాన్ని పాటించటమే వాళ్ళ ప్రధానమైనపని.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభకుల వేట అను నూటఆరవ అధ్యాయము

☆☆☆

# నూటఏడవ అధ్యాయము

## వేట- వర్ణనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఒకరోజున జనార్దనునితోపాటు హంసడింభుకులు రథాలు గుర్రాలు ఏనుగులుతో వేటకువెళ్ళారు. అక్కడహంసుడు డింభకుడు సింహాలను పెద్దపులులను తీక్ష్ణములైన బాణాలతో వేటాడుతున్నారు. చాలా మృగాలను

సింహాలను పెద్దపులులనూ చంపి మధ్యాహ్నానికి అలిసిపోయారు. ఇకవేటచాలు మనం అలిసిపోయాం అనిపలికి పుష్కరసరస్సుకు వెళ్ళారు. మనులు సిద్ధులు నివసించే సరస్సుయొక్క సమీపాన చల్లగాలిని సేవిస్తూ సుఖంగాఉన్నారు. ఆసరస్సులో దిగి తామరతూడులను చిగురు టాకులను తిన్నారు. ఆసరస్సుఒడ్డున అలసట తీర్చుకొని రాజపుత్రులిద్దరూ సుఖంగా ఉన్నారు. అప్పుడు మునులయొక్క మధ్యాహ్న కాలమందలి మధురవేద ధ్వని వినపడింది. ఆవేదధ్వనివిని ముగ్గురూ మిక్కిలి ఆనందించారు. ఆసమయంలో మనుల యజ్ఞాన్ని చూడాలని ముగ్గురికీ కోరిక కలిగింది. వాళ్ళుసేనను మృగాలను ఆపుష్కసరస్సు ఒడ్డున వదిలేసి విశాల మైన ధనుస్సులను బాణాలనూతీసుకొని కాలినడకన ఆశ్రమం వైపు నడిచారు. కొంచం దూరంవెళ్ళగా జపహోమపరాయణులైన మునులతో మహర్షి కశ్యపుడు వైష్ణవ యజ్ఞంచేస్తూ కనిపించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
వేట- వర్ణనము అను నూటఏడవ అధ్యాయము

☆☆☆

# నూటఎనిమిదవ అధ్యాయము

## హంసడింభక దుర్వాసుల కలయిక

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ధర్మాత్ముడైన జనార్దనుడు హంసడింభకులూ యజ్ఞం దగ్గరకు వెళ్ళి మునులకు నమస్కారంచేశారు. శిష్యులతో కూడిన కశ్యపుడు ఇతర మునులూ ఆముగ్గురునీ పూజించారు. ఆసనాల పైకూర్చుని ఉన్నారు. మిత భాషియైన జనార్దనుడు మునులతో తపశ్శాలులారా! మాతండ్రి అన్ని సాధనాలతో యజ్ఞం చెయ్యాలను కొంటున్నాడు. మీరు ఈయజ్ఞం పూర్తికాగానే మీరు మావద్దకు రండి. మేము ద్విగ్విజయం చేసి మాతండ్రి ద్వారా రాజసూయయజ్ఞం చేయించా లని కోరుతున్నాం. మీరు శిష్యులతో సమస్తయజ్ఞ సాధనాలతోనూ రండి. మేము ఈరోజునే దిగ్విజయయాత్ర చేయబోతున్నాం. మాదగ్గరున్నన సేనతో మా పని పూర్తి చేసుకోగలం. భగవంతునివరంవల్ల మాకు అంతటా జయమే ప్రాప్తిస్తుంది. అని బలగర్వితుడైన సహంసుడు ఊరకున్నాడు.

అప్పుడు మునులు రాజసూయయజ్ఞం జరిగేఎడల శిష్యులతోకూడా మేమంతావస్తాం. లేకపోతే ఇక్కడే ఉంటాం అన్నారు. తరువాత హంసడింబకు లిద్దరూ దుర్వాసుడు తపస్సుచేస్తున్న పుష్కరస్సు ఉత్తరపు ఒడ్డుకు వెళ్ళారు. హంసుడు డింభకుడూ ఎర్రనిగోచీని ధరించియున్న దుర్వాసునిచూచి ఈ మహా పురుషుడెవడని ఆలోచించారు. అన్ని ఆశ్రమాలలోనూ గృహస్థాశ్రమం శ్రేష్ఠమైనది అట్టిదాన్ని విడిచి ఇతరమైన ఆశ్రమం తీసుకొనటం పిచ్చివాడిపనిఅని నిశ్చయించి ఆదుర్వాసుని ధర్మమార్గంలో పెట్టి తర్వాతే మేము ఇంటికి వెళ్తాం అనుకున్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభక దుర్వాసుల కలయిక అను నూటఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# నూటతొమ్మిదవ అధ్యాయము

## హంసడింభకులు దుర్వాసుని నిందించుట

తరువాత రాజపుత్రులిద్దరూ దుర్వాసుని తక్కినయతులనుగూర్చి కోపంతో ఓబ్రాహ్మణులారా! మీకు కుంచమైనా జ్ఞానండున్నట్లు కనపడటంలేదు. మీరు ఆశ్రమధర్మాలను పాలిస్తున్నారు? గృహస్థాశ్రమాన్ని విడచి ఏదో సాధన చేస్తున్నారు. ఇదివట్టి ఆడంబరం మాత్రమే. జనులను నాశంచేస్తున్నారు. దుర్వాసుని చూచి నీవు ఈబ్రాహ్మణులకు మార్గదర్శకుడవయ్యావు. ఈఅనాచారంవల్ల బ్రాహ్మణు లందరూ నరకానికి పోతారు. నీవెలాగూ నష్టపోయావు ఇతరులనుకూడ నష్టానికి గురిచేస్తున్నావు. ఓదుర్బద్ధీ! నిన్ను శాసించేవాడెవుడూ లేడా? నిన్ను శాసించనివాడు పాపాత్ముడు. ఈ ఆడంబర ఆశ్రమంవిడిచిపెట్టి గృహస్థుడవు కమ్ము. మనో నిగ్రహంకలిగి పంచమహాయజ్ఞాలను అచరించు. ఇలాచేస్తే నీవుస్వర్గం పొందు తావు. ఇష్టమైన సుఖాన్ని పొందుతావు. ఓబ్రాహ్మణులారా! మీకు ఇదే శుభమైన మార్గం అనిబోధించారు.

హంస డింభకుల మాటలువిని జనార్దనుడు భయపడి దుర్వాసుడికి నమ స్కారంచేశాడు. ఆ ఇద్దరురాజులతో మీరు చెడుబుద్ధి గలవాళ్ళు. ఇటువంటి మాటలువినదగినవికావు. ఈమాటలు మీయిద్దరికీ యమధర్మరాజువంటివి. మీకు అయుష్షు పూర్తి అయినట్లు తోస్తోంది. ఇపుడు మీరుబ్రహ్మదండంద్వారా మరణిస్తారు. మీరు శుద్ధమైన మనస్సుకల యతులను చూస్తున్నారు. వీళ్ళ

హృదయాలలో జ్ఞానప్రకాశము నిండిఉంది. అజ్ఞానాగ్ని ప్రభావంచే వీళ్ళ కర్మ సమూహమంతా భస్మమైపోయింది. వీళ్ళ ప్రాణాలను ఆహుతిచేస్తున్నారు. మీరు తప్పమరొకడెవ్వడూ ఇలా చెప్పాడు.

మీకు జీవంనం పూర్తయినట్టుతోస్తోంది. నాలుగు ఆశ్రమాల్లో సన్యాసాశ్రమం గొప్పది. ఈఆశ్రమంలో జీవించేవాడే పుణ్యాత్ముడు. మీరు వినయంతో పెద్దలను సేవంచలేదు. రాజా! నేను జీవించకోరుతున్నాను. కనుక నాచెవులతో ఇట్టి మాటలు వినకోరుటలేదు. కాని ఏం చెయ్యను? మీతోమైత్రివల్ల ఇలాంటి మాటలువినవలసి వచ్చింది. మీకు ధర్మజ్ఞానం పాపానికి కారణమయింది. ఇటువంటి మీమాటలు వినవలసివస్తే మిమల్ని విడిచివెళ్ళిపోతాను. మీరెపుడూ మాట్లాడవద్దని జనార్దనుడు ఏడుస్తూ పలికాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభకులు దుర్వాసుని నిందించుట అను నూటతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూటపదవ అధ్యాయము

## దుర్వాసుడు హంసుని మందలించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! తరువాత ఋషిశ్రేష్ఠుడైన దుర్వాసుడుకోపించి ఒకకంటితో వాళ్ళను భస్మంచేస్తున్నట్లుచూచాడు. రోషంతో శరీరంఅంతా వేడిక్కిపోయింది. లోకాల నన్నింటినీ భస్మంచేసేట్లు కనిపించాడు. రెండవ నేత్రంతో ప్రేమపూర్వకంగా జనార్దనుని చూస్తున్నాడు. తరువాత హంసడింభకులతో మీరిద్దరూ త్వరగా పారిపోండి. మిరిపుడే ఇక్కడ నుండి వెళ్ళిపోండి. కోపంతో నేను మీరాజులనందరినీ భస్మంచేయగలను. భగవంతుడైన నారాయణుడే మీగర్వాన్ని అణచివేస్తాడు. అని ధర్మాత్ముడైన దుర్వాసుడు పలికి అక్కడనుండి వెళ్ళిపోయాడు. ఆయనను ఆపటానికి హంసుడు చేయిపట్టుకున్నాడు. అతని గోచీని కోసివేశాడు. ఆసమయంలో అక్కడిమునులు భయపడి అక్కడనుండి పారిపోయారు. బ్రాహ్మణుడైన జనార్దనుడు స్నేహభావంతో ఇది చాలాకష్టము మీరు ఇట్టి దుస్సాహసం ఎలా చేస్తున్నారు? అని వాళ్ళను ఆపటానికి ప్రయత్నించాడు.

దుర్వాసుడు నాశనంచేయడానికి సమర్థుడైనా మృదువైన కంఠస్వరంతో హంసడింభకులను ఓరి రాజకులంలో నీచులారా! నేనిపుడే మిమ్మల్ని శపించి చంపగలను, మేము యతులంగనుక అలాచేయటంలేదు. యాదవేశ్వరుడైన శ్రీకృష్ణుడు మీగర్వాన్ని అణచివేస్తాడు. నారాయణుని పరిపాలనకాలంలో జీవించి ఉండటం మీఅదృష్టము. జరాసంధుడు మీకుబంధువే అయినా మీలా చెడు మాట్లాడడు. అతడు ధార్మికుడు. అనిపలికి దుర్వాసుడు హంసుడిని అక్కడనుండి వెళ్ళమన్నాడు. జనార్దమనితో నీకుశుభమగుగాక జనార్దనునిపై భక్తి కలుగుగాక, నీవు సత్పురుషుడవు భగవంతుని పాదపద్మముల పై స్థిరమైనభక్తి కలుగుగాక భగవంతుని సాక్షాత్కారం పొందుతావు. నీవు ఇంటికివెళ్ళి మీతండ్రికి ఈ వృత్తాంతం అంతా వినిపించు. అని పలికాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దుర్వాసుడు హంసుని మందలించుట అను నూటపదవ అధ్యాయము

☆☆☆

# నూటపదకొండవ అధ్యాయము

## దుర్వాసుడు యతులతో ద్వారకకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత హంసడింభకులిద్దరూ కోపించి కాలందగ్గరపడి ఆమునుల యొక్క కమండలవు దండము ఇతరపాత్రలు ఛిన్నాభిన్నం చేసి అక్కడనే కిరాతులచే మాంసంవండించి తిన్నారు. తరువాత వాళ్ళపట్టణానికి వెళ్ళిపోయారు. జనార్దనుడక్కడ స్నేహంవలన వాళ్ళ వెనక వెళ్ళాడు. ఈ ప్రయాణంలో రాజకుమారు లిద్దరికీ నష్టం ప్రాప్తించిందని చింతించాడు. అందరూ వెళ్ళిన తర్వాత యతీశ్వరుడైన దుర్వాసుడు ఇతరయతులను పిలిచి నడవండి మనం పుష్కరతీర్థాన్నివడిచి దారిలో విశ్రాంతి తీసుకుంటూ ద్వారకానగరానికి వెళదాం. అక్కడభగవంతునికి వృత్తాంతమంతా చెపుదాం.

ఆయనే ప్రపంచాన్ని శాసిస్తూ ధర్మమార్గంలో ప్రవర్తింప చేస్తున్నాడు. ఆయన అన్నిటికీ మూలకారణం అందరికీ గురువు. జ్ఞానులకు మిక్కిలి ప్రియమైనవాడు. అతడే పాపాత్ములను శిక్షించి మనల్ని రక్షిస్తాడు. ఇవాళనే మనమిక్కడ నుండి బయల్దేరదాం. ఆదుష్టులు పారవేసిన పాత్రలు మొదలగువాటిని ఆయనకు

చూపించ వచ్చు, జ్ఞాననేత్రంగల ఆయుతులువాళ్ళు పొడుచేసినపాత్రలు మొదలగు వస్తువులను తీసుకొని ద్వారకకు వెళ్ళారు. దుర్వాసునివెనక ఐదువేలమంది యతులు నడిచారు. ద్వారకలో ప్రొద్దునస్నానంచేసి సంధ్యావందనాదులు పూర్తిచేసుకొని ఆమునులందరూ అందమైనరూపంతో సుధర్మసభలో ప్రకాశిస్తూ దుష్టులను శిక్షించు శ్రీకృష్ణుని దర్శించుటకు ప్రయత్నించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దుర్వాసుడు యతులతో ద్వారకకు వెళ్ళుట అను నూటపదకొండవ అధ్యాయము

☆☆☆

# నూటపన్నెండవ అధ్యాయము

## దుర్వాసుడు శ్రీకృష్ణునితో మాట్లాడుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలో సర్వేశ్వరుడైన విష్ణువు శ్రీకృష్ణుడు సాత్యకి మొదలైన యాదవకుమారులలో సభయందు ప్రకాశిస్తున్నాడు. శ్రీకృష్ణుడు సాత్యకితో బంతి ఆట మొదలుపెట్టాడు. మొదటనేను విసురుతాను. తరువాత నీవంతు వస్తుంది అన్నాడు. వసుదేవుడు ఉద్ధవుడు మొదలైన యాదవులు కృష్ణునికి ఒకవైపు కూర్చున్నారు. అలా ఆడుతూ ఉండగా మధ్యాహ్నం అయింది. మునులు ద్వారంవద్దకుచేరి ఉన్నారు. కాని ద్వారపాలకుడు వాళ్ళను అడ్డగించాడు. కనుక లోపలికి వెళ్ళకుండా బయటనే ఎదురు చూస్తున్నారు. ఈసమయంలో దుర్వాసుడు మొదలైన యతులు రాజసభలో ప్రవేశించారు. బంతిఆటఆటాడుతూ ఒకచేత బంతిపట్టుకొనిఉన్న శ్రీకృష్ణుని చూచారు.

అప్పుడు శ్రీకృష్ణుని ఒకకన్ను బంతిమీద రెండవకన్ను వచ్చిన యతులమీద పడింది. శ్రీకృష్ణుడు సాత్యకి ,బలభద్రుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు, ఇంకా ఇతరయాదవులూ దుర్వాసునిచూచి ఇదేమిటి? అనిలేచి ఆశ్చర్యంతో చూడ సాగారు. ఆసమయంలో దుర్వాసునిఆకారం మూడులోకాల్నీ భస్మం చేసేట్లుంది. ఆయన సగం గోచీని ధరించి ఉన్నాడు. చేతిలో దండం విరిగిపోయిఉన్నది. రాజ కుమారుని అవమానంచేత మండి పడుతున్నాడు. కళ్ళనుండి నిప్పులు రాలు తున్నట్లు శ్రీకృష్ణునివైపు చూచాడు. యాదవులందరూ అతన్ని చూచి భయపడ్డారు. ఈముని కోపంతో ఏమి ఆపద కలుగ చేస్తాడో అని మనప్రభువు దీనికి సమాధానం

ఏంచెప్తాడో అని చేతులుజోడించి నిలబడ్డారు. వాళ్ళు మహాత్మా ఇదిగో ఆసనం, దీనిమీద కూర్చొనండి, అన్నారు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడులేచి మునులువద్దకువెళ్ళి మునివరా! ఈ ఆసనం పై ఆనందంగా కూర్చొనండి. నేను మీసేవకుణ్ణి, ఆజ్ఞాపించండి. అని పలికాడు. తరువాత యతిశ్రేష్ఠుడైన దుర్వాసుడు ఆసనంమీద కూర్చున్నాడు. కూడా వచ్చిన యతులు కూడ కూర్చున్నారు. వాళ్ళనుపూజించి బ్రాహ్మణశ్రేష్ఠుడా! మీరే ప్రయోజనం కోసం వచ్చారు? మీరు సన్యాసధర్మాన్ని అవలంచిన బ్రాహ్మణులు, ఎంత ఆలోచించినా మీరాకకు కారణం తెలియలేదు. కనుక ఇప్పుడిక్కడ మనస్సు వాకులత చెందుతున్నది. కనుక రాకకు కారణంచెప్పండి అనిశ్రీకృష్ణుడు కోరాడు.

దానిమీద దుర్వాసునికోపం వెనుకంటికంటే కొన్నిరెట్లుహెచ్చింది. దుర్వాసుడు ఎర్రబడిన కన్నులతో నవ్వి యాదవేశ్వరా! నేను మీ ఈశ్వరసంబంధ మైన స్వరూపాన్ని బాగాఎరుగుదును, కనుక నాకుతెలియదని నీవుఅనవద్దు. ఆటమీది ఆసక్తితో మాకష్టంమీద కొంచంకూడా దృష్టిపెట్టలేదు. మేము చాలా దుఃఖపడి మీవద్దకువచ్చాం. కాని మీరు కొంచమైనా మాకష్టంగూర్చి దృష్టి పెట్ట లేదు. మేము చాలా దురదృష్టవంతులం నీవు మమ్మల్ని తలచటంలేదు. ఓ పరమాత్మా! ఎవరో ఇద్దరు క్షత్రియులు ఒకడు హంసుడు రెండవవాడు డింభుడు. వాళ్ళిద్దరూ మహాదేవుని వరంవల్ల గర్వించి మమ్మల్ని ఎక్కువగా బాధిస్తున్నారు. కేశవ! వాళ్ళు గృహస్థాశ్రమమే తక్కిన ఆశ్రమాలకంటే శ్రేష్ఠమైనని అనరాని మాటలు అని మమ్మల్ని మిక్కిలి అవమానించారు.

మాపాత్రలను వెదురు దండాన్నీ ముక్కలుచేశారు. మాకున్నధనమే గోచీ దాన్ని కూడ కోసివేశారు. ఓజగత్ప్రభూ! ఇప్పుడు నాకు కమండలువు కూడా లేదు. మమ్మల్ని రక్షించవలసిన క్షత్రియులు ఇలా ప్రవర్తించటం ఆశ్చర్యకరంగా ఉంది. ఏంచెయ్యం మేముమిక్కిలి అభాగ్యులం. ఇపుడు మారక్షణకు ఉపాయం ఏమిటి? వాళ్ళు బ్రతికిఉంటే మూడులోకాలనూ నాశంచేస్తారు. వాళ్ళుబలవంతులు. స్వామీ! ఏంచెప్పను? నీవువాళ్ళను త్వరగాచంపి మూడు లోకాలనూ రక్షించుము. లేకపోతే రక్షకుడనే పేరు నీకు వ్యర్థమౌతుంది. ఎక్కువ ఏంచెప్పం, మూడు లోకా లనూ రక్షించుమని కోపంతో చికాకుతో కూడిన మనస్సు గలవాడయ్యాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
దుర్వాసుడు శ్రీకృష్ణునితో మాట్లాడుట అను నూటపన్నెండవ అధ్యాయము

☆☆☆

# నూటపదమూడవ అధ్యాయము

## భగవంతుని వద్ద యతుల భోజనం

వైశంపాయనుడిలా చెప్పాడు. మహారాజ! యతివరుడైన దుర్వాసుడు పలికిన మాటలువిని నిట్టూర్పు విడిచి యాదవేశ్వరుడు అతనివైపు చూస్తూ బ్రాహ్మణోత్తమా! ఇదంతా మాతప్పే. నేను చెప్పేదివిని మీరు నాతప్పును క్షమించండి, శివుడుగాని బ్రహ్మని ఎవరైనా వరమివ్వకుండా ఎందుకు ఉండలేదు. నేను శపథం చేసి చెపుతున్నాను. యుద్ధభూమిలో క్షత్రియాధముడైన హంసుని డింభకునిచంపి మీకురక్షణకల్పిస్తాను. ఆదుష్టులు ప్రజలను మిక్కిలి దుఃఖపెట్టారని విన్నాను. శివుని వరంవల్ల మదించి ఉన్నారు. వాళ్ళు జరాసంధునికి మిత్రులు. జరాసంధుడు వాళ్ళకు సహాయం చేయలేని స్థితిలో వాళ్ళను వధిస్తాను. ఇలా అయితే మనకు విజయం ప్రాప్తిస్తుంది. వాళ్ళు ఎక్కడకువెళ్ళనా సంహరించే ఉపాయంచుస్తాను. ఇక ఇప్పుడు మీరువెళ్ళి మీపనిచూచుకోండి. నేను త్వరగా వాళ్ళను వధిస్తాను. ఇందులో సందేహంలేదు. భగవంతుని మాటలు విని దుర్వాసుడు మిక్కిలి సంతోషించాడు. ఓశ్రీకృష్ణా నీవల్లనే లోకాని కల్యాణం ఏర్పడుతూన్నది. ఓకేశవ! నీకు సాధ్యంకానిపనిలేదు. నీవుదేవతలకు కూడా ప్రభువు. అంతటా సమబుద్ధి కలవాడవు. ఓవిష్ణూ! దేవ! హరీ! చక్రపాణీ! నీకు నమస్కారం. నీవునిత్యుడవు శుద్ధుడవు భక్తవత్సలుడవు కనుక నీకునమస్కారం. నేను తగనిమాటలనేమైన పలికితే క్షమించు అన్నాడు.నేనెప్పుడూ ఓర్పుతో ఉంటాను. ఇప్పుడు మీరు నన్ను క్షమించండి. సన్యాసులకు ఓర్పేబలం. తత్త్వజ్ఞానంతో సమానంగా ఓర్పుబలంచేత కూడ మోక్షం ప్రాప్తిస్తుంది. కాబట్టి అన్నివిధాల ప్రయత్నించి ఓర్పును రక్షించుకోండి. ఈనాడు ఇక్కడకువచ్చిన యతులందరికీ పూజచేస్తాను. మీరందరూ మాయింట్లో భోజనం చెయ్యాలి, అనికోరగా మునులందరూ అందుకు అంగీకరించారు. అప్పుడు భగవంతుడు తనఇంట్లోకి వెళ్ళి నాలువిధాలైన భోజనం తయారుచే శాస్త్రప్రకారం వాళ్ళకుభోజనం పెట్టాడు. తరువాత మిక్కిలి మెత్తనైన వస్త్రంచింపి ఒక్కొక్కముక్క ఒక్కొకరికి ఇచ్చాడు. భగవంతుని సత్కారానికి ఆమునులు మిక్కిలి సంతోషించారు. ఆయన గుణాల్నిగానం చేస్తూ తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
భగవంతుని వద్ద యతుల భోజనం అను నూటపదమూడవ అధ్యాయము

☆☆☆

# నూటపధ్నాల్గవ అధ్యాయము

## హంసుడు శ్రీకృష్ణుని వద్దకు దూతను పంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత బ్రాహ్మణశ్రేష్ఠుడు దుర్వాసుడు నారదునితోపాటు ద్వారకానగరంలోనే బ్రహ్మతత్త్వ విచారంచేస్తూ ఆనందంగా విహరించారు. భగవంతుడు శ్రీకృష్ణుడు వాళ్ళిద్దరినీ అక్కడ ఉండమని కోరాడు. అదేసమయంలో హంసుడు డింభకుడు తండ్రీ! మీరు రాజసూయయాగం చెయ్యటానికి సిద్ధగా ఉండండి. మేము ఈనెలలోనే యజ్ఞంపూర్తిచేసే పనిలోఉంటాం. మేము ఈనాడే దిగ్విజయ కార్యంలో ప్రవేశిస్తున్నాం. ఓరాజోత్తమా! యజ్ఞానికి కావలసిన సామగ్రిని సిద్ధంచేయాలి అన్నాడు. బ్రహ్మదత్తుడు మీయిష్టంప్రకారం చేయండి అన్నాడు.

అప్పుడు బ్రాహ్మణశ్రేష్ఠుడైన జనార్దనుడు హంసడింభకుల దుస్సాహసాన్ని చూచి వాళ్ళపనిసాధ్యంకానిదని తలచి మిత్రుడైన హంసునితో స్నేహితుడా! నామాటవిని అవసరమైన పనిని నిర్ధారణచేయండి. మీరు దుస్సాహసమైన పని చేస్తున్నారని నాఅభిప్రాయం. భీష్మబాహ్లిక యాదవాది మహావీరులుండగా ఈ కార్యాన్ని ప్రారంభించటం బాగాలేదు. భీష్ముడు పరశురాముని ఓడించాడు. యాదవులు సామాన్యులుకారు. వారిలో శ్రీకృష్ణుడు అనేక శత్రువులను జయించాడు. యుద్ధంలో మిక్కిలి నేర్పుకలవాడు. అతడు మూడులోకాలను నశింపచేయగలడు. వీరుడైన సాత్యకి కూడ శత్రువులనోడించగలవాడే. శ్రీకృష్ణుడు లెక్కలేనంతమంది శత్రువులను జయించాడు. అతని ఎదుట ఎవడూ నిలువలేడు. ఇవేళ భోజనానికి వచ్చిన బ్రాహ్మణులద్వారా పూర్వం అవమానింపబడిన మునులచే శ్రీకృష్ణుడు కలుసుకొనబడ్డాడు. కాబట్టి రాజసూయయాగం చేయదలిస్తే ముందు మంత్రులతో సంప్రదించి రాబోయే ఆపదకు ప్రతీకారం చేయగలగాలి. అనిచెప్పాడు.

హంసుడు భీష్ముడు దుర్బుద్ధి, వృద్ధుడూ దుర్బలుడూ కనుక మాయెదుట యుద్ధంలో నిలబడలేడు. యాదవులలో సాత్యకి బలరాముడు శ్రీకృష్ణుడూ ఎవ్వరూ మాయెదుట నిలువలేరనిపలికి మిత్రమా! నీవు ఇప్పుడే కృష్ణునివద్దకువెళ్ళి రాజసూయయాగానికి అధికమైనపన్నును తీసుకొనిరండి ఆలస్యంచేయవద్దని చెప్పు. అనిపలికి ఈవిషయంలో ఆలోచించవద్దు. అని జనార్దనునితో చెప్పాడు. జనార్దనుడు ఏమీ సమాధానం చెప్పలేదు. ఆనాడు మొదలుకొని ప్రతిదినమూ

ద్వారకకువెళ్ళే కోరికతో ఉండి నేను ద్వారకకు వెళ్ళి అక్కడ భగవంతుని దర్శిస్తాను అని తలచుకొంటూ ఒకనాడు ఒంటరిగా చాలాచీకటితో గుర్రంమీదఎక్కి ద్వారకా నగరానికి వెళ్ళాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసుడు శ్రీకృష్ణుని వద్దకు దూతను పంపుట అను నూటపద్నెల్గువ అధ్యాయము

☆☆☆

# నూటపదిహేనవ అధ్యాయము

## జనార్ధనుడు ద్వారకకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! జనార్ధనుడు కృష్ణునిచూడాలనే ఆసక్తితో గుర్రంమీద వేగంగా వెళ్ళాడు. వెళ్ళుతూ హంసుడు మిత్రుడు కనుక నాకు ఉపకారంచేశాడు. అతడు పంపకపోతే కృష్ణుణ్ణి నేనెలా చూడగలుగుతాను? శ్రీహరి దర్శనానికి వెళ్తున్న నన్ను చూచి నాతల్లికూడా ధన్యురాలౌతుంది. నేడు చక్రపాణియైన శ్యామసుందర మూర్తిని చూస్తాను. ఆమహాప్రభువు నన్ను సౌమ్యనేత్రాలతో చూస్తాడా? నాతో ప్రేమగా మాట్లాడతాడా? ఆయనమాట్లాడే శుభవాక్కులను వినగలనా? మాటి మాటికీ ఆయనను చూస్తాను. ఆయనరూపాన్ని తలుచుకుంటే గగుర్పాటు కలుగు తోంది. ఆయనవద్దకు వెళ్ళి మీరు హంసమహారాజుకు పన్నుచెల్లించండి. అని ఎలా చెప్పగలగుతాను? నేలజ్జలేనివాడును, మూర్ఖుడును. భగవంతునికి ఇలా చెప్పటం మంచిదికాదు. కాని హంసుని స్నేహంవల్ల భయంకరమైన మాటలను చెప్పవలసివస్తున్నది. అయినా భగవంతుడు అన్నీ తెలిసినవాడు. అందరి హృదయంలో భావాలు అతనికి తెలుస్తాయి. స్నేహకారణంగా ఇలా చెప్పవలసి వచ్చిందని ఆయన బాగా గ్రహించగలడు. నేనీవేళ భగవంతుడైన కృష్ణున్ని తనివి తీరచూస్తాను. ఆయన సౌందర్యమనే అమృతాన్ని త్రాగుతాను. ఆయన పాదాన్ని నాతలపై ధరిస్తా. లోకంలో నాకంటే ధన్యుడెవడున్నాడు? అని తలుచుకుంటూ ద్వారకానగరంచేరాడు. జనార్ధనుడు ద్వారపాలకులతో తనరాకను భగవంతునికి తెలియజేశాడు. ద్వారపాలకులు లోపలికి వెళ్ళారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
జనార్ధనుడు ద్వారకకు వెళ్ళుట అను నూటపదిహేనవ అధ్యాయము

☆☆☆

# నూటపదహారవ అధ్యాయము

## విప్రదూత భగవంతుని కలియుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ద్వారపాలకులు భగవంతుని అనుమతితో బ్రాహ్మణుని రాజ సభలో ప్రవేశపెట్టారు. అక్కడ శ్రీకృష్ణుడు బలదేవునితో ఒకే ఆసనంమీద ప్రకాశిస్తున్నాడు. ముందు సాత్యకి ప్రక్కన నారదుడు కూర్చునిఉన్నారు. గంధర్వులు గానం చేస్తుంటే అప్సరసలు నాట్యంచేస్తున్నారు. సూత, మాగధ, వంది జనం ఆయన యశస్సును గానంచేస్తున్నారు. బ్రాహ్మణులు సామగానం చేస్తున్నారు అట్టి శ్రీమహావిష్ణువునుచూచి నాపేరు జనార్దనుడని భగవంతుని పాదాలకు నమస్కరించాడు. తరువాత తలవంచి బలరామునకు నమస్కరించాడు. దేవదేవ! నేను హంసడింభకల దూతనుఅని పలుకుచుండగానే మాధవుడు, ముందీ ఆసనంపై కూర్చో తరువాత విషయం చెప్పు అన్నాడు.

జనార్దనుడు కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు బ్రహ్మదత్తుడు, హంసుడు, డింభకుడు కుశలమా? అని ప్రశ్నించాడు. నేను హంసడింభకుల వీరత్వాన్ని పూర్వమే విని ఉన్నాను. ఓబ్రాహ్మణా! మీతండ్రి క్షేమమేనా? అని అడిగాడు. జనార్దనుడు జగన్నాథా! రాజు బ్రహ్మదత్తుడు, హంసడింభకులు మాతండ్రి అందరూ క్షేమమే అన్నాడు. తరువాత భగవంతుడు హంసడింభకులు ఏంచెప్పారు? మీరేమీ సందేహించక అన్నిమాటలనూ చక్కగా చెప్పండి. మీమాటలు విన్న తర్వాత చేయ దగిన పనినిగూర్చి విచారణ చేస్తా. బ్రాహ్మణోత్తమా! నీవు దూతవుకదా! ఇది చెప్ప దగును ఇది చెప్పరాదనే వివేచన చేయవద్దు. రాజు ఆజ్ఞాపించిన దాన్ని చెప్పటం దూతధర్మం. అని పలికాడు.

పరమాత్మా! నీకు తెలియందిలేదు. ఏమితెలియనివాడివలె మాట్లా తున్నారేమి? మీదగ్గర దాచవలసినదేదీలేదు. మీకు అంతాతెలిసినా నన్ను చెప్ప మంటున్నారు కనుక చెపుతున్నాను వినండి. ఇప్పుడు బ్రహ్మదత్తమహారాజు రాజసూయయాగంచేయాలని సిద్ధపడుతున్నాడు. అందువల్ల హంసడింభకుడు నన్ను మీవద్దకు పంపారు. యాదవులు నన్ను తీసుకురావాలనీ మిమ్మల్ని ఆహ్వానించాలనీ నన్ను పంపుటలో ముఖ్యోద్దేశము. కాబట్టి ఈసమయంలో మీరు పన్ను ఎక్కువగా తెచ్చి యజ్ఞశాలలో ఉండాలి ఇదే వాళ్ళిద్దరి ఆజ్ఞ. జనార్దనుని

మాటలువిని శ్రీకృష్ణుడు చాలాసేపు నవ్వాడు. తరవాత దూతతో నువ్వు చెప్పవలసింది చెప్పావు. ఇప్పుడు నేనుచెప్పేది విను.

నేను మీరాజుకు కప్పం చెల్లించే వాణ్ణి. కనుక పన్ను తప్పక ఇస్తా. కాని బ్రాహ్మణా! నన్ను పన్నడగటం సాహసము. పొగరబోతుతనమూ నేటివరకు నన్నెవడూ పన్ను అడిగినట్లు వినలేదు. దూతతో ఇలా చెప్పి అక్కడున్న యాదవులతో ఓయాదవులారా! ఎంత ఆశ్చర్యకరమైన మాట యిది. బ్రహ్మదత్తుడు రాజసూయయాగంచేస్తూ నన్ను పన్నడగుతున్నాడు. ఎంత పరిహసింపదగిన మాట యిది? హంసడింభకులు ఆతనిచే యజ్ఞంచే యిస్తారు. నేను పన్ను చెల్లించే వాడినయ్యాను. మిక్కిలి నవ్వదగినవిషయం యాదవులారా! వినండి అన్నాడు.

అప్పుడు బలరాముడు మొదలగు యాదవులందరూ నవ్వమొదలెట్టారు,. శ్రీకృష్ణుడు పన్నుచెల్లించేవాడు అని పలుకుతూ చప్పట్లుచరుస్తూ అందరూ పెద్దగా నవ్వారు. ఆనవ్వుల ధ్వని, చప్పట్లధ్వని భూమ్యాకాశలను నింపివేసింది. ఆ బ్రాహ్మణుడు తనమిత్రుని నిందిస్తూ నేను చేసిన దూతపని ఎంత కష్టమైనది సిగ్గుపడి అని తలవంచుకొన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
విప్రదూత భగవంతుని కలియుట అను నూటపదహారవ అధ్యాయము

☆☆☆

# నూటపదిహేడవ అధ్యాయము

## శ్రీకృష్ణుని అభిప్రాయము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! అందరూ నవ్వుతుండగా కేశవుడు ఓదూత! బ్రాహ్మణా! వెళ్ళు. ఆహంసడింభకులకు ఇలా చెప్పు. "శారఙ్గమనే ధనుస్సునుండి విడుబడిన బాణాలతో లేదా పదునైన ఖడ్గంతో, నీశిరస్సును చేదించే నాచే ప్రయోగింపబడు చక్రంగాని మహాత్ములైన, వాళ్ళకు పన్నుచెల్లిస్తుంది అని" మీకువరాలిచ్చిన రుద్రుడు మిమ్మల్ని రక్షిస్తాడు. అతన్ని జయించి మిమ్ము చంపుతాను. ఎక్కడయుద్ధంజరిగేదీ నిర్ణయించాలి. అక్కడకు నేను వాహనాలతో సైన్యంతో వెళ్తాను. మీరిద్దరూ సైన్యంతో నిర్భయంగా వెళ్ళండి. పుష్కర సరస్సువద్ద లేక ప్రయాగయందు లేక మధురయందైనా అక్కడకు సైన్యంతో వెళ్తాను. ఆలోచించే పనిలేదు. స్నేహంవల్ల

నీవుఇలా చెప్పలేకపోతే సాత్యకి చెపుతాడు. నీవుకూడ అక్కడకు వెళ్ళి సాక్షివిగా ఉండు. బ్రాహ్మణోత్తమ! నీపై నాకు మిక్కిలి ప్రేమఉన్నది. కనుక నీవుసంసారాన్ని జయించి నా భక్తునిగా చెప్పుకుంటూ ఆనందంగా జీవనంచేస్తావు. అన్నాడు.-

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
శ్రీకృష్ణుని అభిప్రాయములను నూటపదిహేడవ అధ్యాయము

☆☆☆

# నూటపద్దెనిమిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు సాత్యకికి చెప్పిన మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! శ్రీకృష్ణుడు బ్రాహ్మణునికీ విధంగా చెప్పి సాత్యకితో ఈ బ్రాహ్మణునితో కూడా వెళ్ళి నేను చెప్పినదంతావాళ్ళ ఎదుట నామాటగాచెప్పు. నీవు ధనుస్సు తీసుకొని వెళ్ళు. ఒకగుర్రం మీద ఒక్కడ వెళ్ళిరా అనిపలికాడు. అట్లే వెళ్ళుటకు సాత్యకి ఇష్టపడ్డాడు. జనార్దనుని విడిచి త్వరగా అసహాయుడుగా వెళ్ళాడు. జనార్దనుడు ఆహా! ఏమి పొగరు బోతుదనము? అని పలికాడు.

దూత మాధవునకు నమస్కరించి సాత్యకితో శాల్వనగరం వెళ్ళాడు. అక్కడ జనార్దనుడు సాత్యకితో బ్రహ్మదత్తుని ఇంటిలోకివెళ్ళి సాత్యకికి ఎత్తైన ఆసనమిచ్చి తానుకూడకూర్చున్నాడు. తరువాత హంసడింభకులను పిలిచి పరిచయం చేస్తూ ఇతడు సాత్యకి శ్రీకృష్ణునికి కుడిభుజంవంటివాడు, ఆయన దూతగా ఇక్కడకు వచ్చాడు అనిచెప్పాడు. జనార్దనుని మాటవిని నవ్వుతూ నేను ఆతనిరాకసంగతి ముందే విని ఉన్నాను. ఇప్పుడు ప్రత్యక్షమయ్యాడు కూడా. ఇతడుకు ధనుర్విద్యలో మిక్కిలి నేర్పరి అనివిన్నాను. ఇతన్ని కలవటంచేత నాకు మికిలి సంతోషంకలిగింది. ఇప్పుడు శ్రీకృష్ణబలరాములు ఉగ్రసేనుడుమొదలగు యాదవులూ క్షేమమా అని అడిగాడు. సాత్యకి కొంచం తలఊచి వాళ్ళంతా ఆనందంగా ఉన్నారు. అన్నాడు. నవ్వుతూ జనార్దనుని హంసుడు చక్రధరుడైన కృష్ణుని కలిశావా? మనపని నెరవేరిందా? సంగతి అంతాచెప్పు కాలంవృథాగాగడపకు అనిఅడిగాడు

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
శ్రీకృష్ణుడు సాత్యకికి చెప్పిన మాటలు నూటపద్దెనిమిదవ అధ్యాయము

☆☆☆

# నూటపంతొమ్మిదవ అధ్యాయము

## హంసుని యెదుట సాత్యకి మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! హంసుడిలా చెప్పిన తరువాత ధర్మాత్ముడైన జనార్దనుడు భగవంతుడైన కృష్ణుని స్తోత్రం చేస్తూ సంతోషంతో ఓమిత్రమా! నేను అక్కడ శంఖచక్రధారియైన కృష్ణుని కూర్చుని ఉండగా చూచాను. ఆయన అవయవములన్నీ బంగారు అలంకారలతో దేదీప్యమానములై యున్నాయి. రత్నంకాంతులతో అతని శరీరం ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది. పూర్వపు యతిసమూహం ముఖ్యులైన మునులూ నలువైపులా అతన్ని సేవిస్తున్నారు. వందిమాగధులు స్తోత్రం చేస్తున్నారు. భగవంతుడు చిగురుటాకుతో సమానమైన ఎర్రనిపెదవిపై మెల్లమెల్లగా నవ్వు వ్యాపిస్తున్నది. పురాతనకవులు వేర్వేరు దేవగణములూ, ధ్యానంలో నిమగ్నులై తత్త్వనిర్ణయంలో లీనమై ఉన్నారు. వికసించిన నీలకమలంవంటి ముఖకాంతిపొట్టపై ప్రకాశిస్తోంది. ఆయన మధురములైన మాటలతో యాదవులను ఆనందింపచేస్తున్నాడు.

పురాతనమునులు వేదంలోని రహస్యమైన తత్త్వాన్ని వివరిస్తున్నారు. నేను జగన్మయుడైన శ్రీకృష్ణభగవానుని మాటిమాటికి చూస్తున్నా. సమస్తశత్రువులను జయించి ప్రపంచకల్యాణం కొరకు మాత్రమే ప్రకాశిస్తున్నాడని తలచాను. విహార సమయంకాగానే ముఖ్యయాదవులతో క్రీడిస్తున్నట్లు చూచాను. కమలములవంటి కన్నులుగల భగవంతుడైన శ్రీకృష్ణుడు రుక్మిణితో విహరిస్తున్నాడు. అతన్ని చూడగానే మిక్కిలి ఆనందంతో నాకన్నులు వికసించాయి. నేను మాటిమాటికీ అతిని సౌందర్యామృతాన్ని పానంచేయసాగాను. నాజన్మ సఫలమైందని భావించాను.

తేజశ్శాలియైన శ్రీకృష్ణుని మాటిమాటికీ తలుచుకొంటూ అంతులేని ఆనందాన్ని పొందాను. అతని వక్షస్థలంమీద కౌస్తుభమణి ప్రకాశిస్తున్నది. లక్షల కొలది చామరములతో వీస్తున్నారు. నేను వన్ను సంగతిచెప్పగానే ఆయన హృదయంలో ద్వేషబుద్ధిపొడసూపింది. ఆదుష్టులెక్కడున్నారు? ఎక్కడవాళ్ళను కలుసుకొంటాను హంసుడు నన్ను పన్ను అడుగుతాడా? అనేటప్పటికి దుర్వాసుడు నారదుడూ పకపకానవ్వసాగారు. నేను దుర్వాసుని భగవంతుని మాటిమాటికీ

చూచి నామిత్రులైన హంసడింభకులు కూడనిపని ప్రారంభించారని మనస్సులో ఆలోచింప సాగాను. ఇప్పటికైనా ఈపనినుండి మానుకొనుట తప్పనిసరి.

మిత్రామా! మనుస్సులో భగవంతుడు దర్శనమిచ్చుటవలన నీకు చెప్పిన మాటలనన్నిటినీ వినిపించలేకపోయాను. ఈసాత్యకి మహాత్ముడు ఉన్నాడు. అతడు మీకుబాగా అన్ని మాటలనూ తెలియ చెపుతాడు. జనార్దనుని మాటలు విని హంసుడు మిక్కిలి కోపంగలవాడయ్యాడు. మరియు బ్రాహ్మణపుత్ర! మేమిద్దరమూ మూడులోకాలనూ జయించుటకు సిద్ధంగా ఉన్నాము. ఇలాంటి సమయంలో మావద్ద ఎవడిలా మాట్లాడగలడు? అనేకలీలా విధానాలు తెలిసిన కృష్ణుడు మాయతో నిన్ను భ్రమపెట్టాడు. అతన్ని చూచి నీవు భ్రమపడ్డావు. దుష్టుడైన కృష్ణుని ఐంద్రజాలిమాయచే భ్రాన్తిఏర్పడి మాట్లాడుతున్నావు.

సాధారణంగా బ్రాహ్మణులకు ఉండే చపలత్వం కారణంగా నీవుభ్రమలో పడ్డావు. ఆఅధమురితో నన్ను పోల్చుట ఏమి సంజసము? నీవు నాకు మిత్రుడవు. కనుక ఇటువంటి నీమాటలను ఓర్చుకొన్నాను. ఓమూఢబుద్ధీ! నీకిష్టమైన చోటికి వెళ్ళు. ఆగోపాలకృష్ణుని అతనికి సహాయంచేసే యాదవులనూ చంపి విజయం పొందుతాను. చిరకాలం నాతోభోజనంచేసి ఇప్పుడు నీవు నాశత్రువు గుణాల్ని పొగడుతున్నావు. గొప్పకష్టం వచ్చినా బ్రాహ్మణుని చంపను. నీకిష్టమైన చోటికిపో అని పలికి హంసుడు సాత్యకితో ఓరీ యాదవజ్ఞాతీ! నీవిక్కడికి ఎందుకు వచ్చావు? కృష్ణుడేమన్నాడు? అతడు నీకు పన్ను ఇచ్చాడా? లేదా? అని అడిగాడు.

అప్పుడు సాత్యకి ఓంహంసా! శంఖ చక్రగదా ధారియైన కృష్ణభగవానుడు. తీక్ష్ణములైన బాణాలూ పదునైనఖడ్గమూ నీ శిరస్సును ఖండించిన తరువాతనే పన్ను చెల్లిస్తాను. ఓక్షత్రియాధమా! జగన్నాథుడైన కృష్ణునిపన్ను అడగటంకంటే పొగరుబోతుదనం ఏముంటుంది? ఓరి మానవాధమా! ఇలా మాట్లాడిన వాడి నాలుకతెగ్గొయ్యాలి. నువ్వు ఒకసాధారణ వ్యక్తివి. అతని శంఖధ్వని విని ఎవడు జీవించగలడు? బలరాముడు మొదలైన మేమందరమూ అతనికి సహాయులము. వాళ్ళలో బలరాముడు మొదటివాడు, నేను రెండవవాడను, కృతవర్మ మూడవ వాడు, విశరుడు నాల్గవవాడు. బభ్రువు ఐదవవాడు. ఉత్కలుడు ఆరవవాడు. బుద్ధిమంతుడు శస్త్రాస్త్ర విశారదుడైన తారణుడు ఏడవవాడు, సారంగుడు ఎని మిదవవాడు, విపృథువు తొమ్మిదవవాడు. ఉద్ధవుడు పదవవాడు. మేమందరమూ

అతని ప్రక్కనుండేవాళ్ళం. యుద్ధసమయంలో కూడా మేము రాత్రింబవళ్ళూ అతనితో కూడా ఉంటాము.

అశ్వనీకుమారుల వలె సుందరులైన బలవంతులు శ్రీకృష్ణుడు బలరాముడూ వీరిద్దరే శత్రువులైన మిమ్మందరినీ మట్టుపెట్టగలరు. శంకరుడు సహాయంగా వచ్చినా మూడులోకాలనూ రక్షించే శ్రీకృష్ణుడు తీక్ష్ణబాణవర్షంతో మీఅందరినీ చంపివేస్తాడు. యుద్ధభూమిలోకి మేంరానే అక్కరలేదు. మీకు ఇష్టమైన ప్రదేశంలోకి వచ్చి మాయెదుట బలం ప్రదర్శించవచ్చు అని ఆయన సందేశం పంపాడు. జగత్పాలకుడు శంఖచక్రధారి భగవంతుడైన కృష్ణుడు ఉండగా ఎవడు రాజసూయ యాగం చేయగలుగుతాడు? ఓరిమూర్ఖుడా! నీవిలాకోరితే ప్రపంచంలో మిక్కిలి నవ్వులపాలవుతావు. అని నవ్వుతూ సాత్యకి విరమించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసుని యెదుట సాత్యకి మాటలు అను నూటపందొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవైవ అధ్యాయము

## హంసడింభకుల గర్వపు మాటలు

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత హంసుడూ డింభకుడూ మిక్కిలి కోపించారు. వాళ్ళు సాత్యకిని అక్కడున్నరాజులను కళ్ళెర్రచేసి చూశారు. శ్రీకృష్ణునితలచి నంద గోపాలుని కొడుకు కృష్ణుడూ మదించిన బలరాముడూ ఎక్కడున్నారు? అని సాత్యకితో ఓరి యాదవబంధూ! నువ్వు నాయెదట ఎలాంటామాటలు మాట్లాడు తున్నావు? ఓదురాత్ముడా! ఈప్రదేశంనుండి పారిపో ఏంచెప్పను? దూతవై పోయావు. ఇంకొకడిలా మాట్లాడి బ్రతకలేడు. నీవు పూర్తిగా సిగ్గులేనివాడవు. ఇప్పుడు మేం ఇద్దరు సోదరులమే ప్రపంచాన్ని శాసిస్తున్నాం.

కాబట్టి మాకు పన్నుకట్టకుండా జీవించలేడు. ఈవేళనేను గోపాలకులందర్నీ చంపి యాదవులను బంధించి వాళ్ళసొత్తునంతా అపహరిస్తాను. దూతను చంప కూడదుగదా అని నీవు సంబంధంలేనిమాటలను పలుకుతున్నావు. భగవంతుడైన శివుడు మాకువరాలిచ్చి శస్త్రాస్త్రాలనిచ్చి రక్షకుడుగా ఉన్నాడని మీకు తెలుసా?

ఈవేళ మేమిద్దరం గోపాలకులనుచంపి మాతండ్రిని రాజసూయ యాగమునకు దీక్ష తీసుకొనేట్లు చేస్తాం. యాదవులు యుద్ధానికి భయపడేవాళ్లు. కనుక ముందు భయపడేవాళ్ళని జయించి తరువాత కృష్ణుని ఓడిస్తాం. వాళ్ళు ఎంత పెద్దసేననైనా సమకూర్చుకోవచ్చు. ఆసైన్యం అనేకవిధాలైన ఆయుధాలు తెచ్చుకోవచ్చు. వాళ్ళ పెద్దపెద్దనాయకులు సైన్యాన్ని నడుపవచ్చు. నీవు దూతవగుటచే చంపరాని వాడివయ్యావు. కనుక నీఇష్టం వచ్చినచోటికివెళ్ళిపో. రేపో ఎల్లుండో పుష్కరక్షేత్రంలో యుద్ధం ప్రారంభమవుతుంది.

అప్పుడు నువ్వులెక్కపెట్టిన కృష్ణబలరామాది నాయకుల బలాబలాలు తెలుస్తాయి. దానితో పాటు నీకు మాశక్తి ఎంతటిదోకూడా తెలుస్తుంది అన్నాడు. అప్పుడు సాత్యకి ఓహంసా! మిమ్మల్ని చంపటానికి రేపోయెల్లుండో మావాళ్ళు వస్తారు. నేనుదూతగా రాకపోతే మిమ్మల్ని ఇవేళనే చంపేవాణ్ని మీరుపలికిన అనరాని మాటలకు రెపటెల్లుండ్లవరకు అవకాశమివ్వనక్కరలేదు. దూతను కాకుంటే నేడే నాబలాన్నిచూపించి మిమ్మల్నందరినీ చంపేవాణ్ణి. మిమ్మల్నిచంపేవరకూ ఈ మనస్సుకు శాంతిలేదు. సృష్టిస్థితిలయకారకుడైన ఆ జగన్నాథుడే తీక్ష్ణమైన బాణ వర్షంతో మీదర్పాన్ని అణచివేస్తాడు అని పలికాడు. వెంటనే గుర్రంఎక్కి వెళ్లిపోయాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభకుల గర్వపు మాటలు అను నూటయిరవైవ అధ్యాయము

☆☆☆

## నూట యిరవై ఒకటవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు పుష్కర తీర్థమునకు వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తరువాత సాత్యకి ద్వారకలోప్రవేశించి శ్రీకృష్ణునివద్దకువెళ్ళాడు. విషయమంతా చక్కగావినిపించాడు. రెండవరోజు ప్రొద్దున భగవంతుడైన కృష్ణుడు నిత్య కృత్యములుతీర్చి తనసేనానాయకులతో మీరు చతురంగసైన్యాన్ని సిద్ధం చెయ్యండి. భేరీపణవాది యుద్ధవాద్యాలతో, ప్రాసపరిఘాది ఆయుధాలతో, జండాలు అలంకారం మొదలైనవాటితో లోపంలేకుండా చేయండి. సేనా నాయకులు భగవంతుని ఆజ్ఞను శిరసావహించారు.

—

కొంచంసేపటి తర్వాత ధనుస్సులను తీసికొని రథాల మీద యాదవులలో ముఖ్యయోధులు సేనముందు నడువసాగారు. వీరసాత్యకి కూడా ధనుస్సుచే కొని కోపంతో సేనకుముందు నడిచాడు. ఇతర యాదవవీరులు కూడా పెద్దపెద్ద ఆయుధాలుధరించి సింహనాదాలు చేస్తూ కదిలారు. అప్పుడు పీతాంబరధారి భగవంతుడైన కృష్ణుడు కూడ దారుకుడు సారథిగా గల రథంపై కూర్చొని బయ ల్దేరాడు. అతనిచేతుల్లో శంఖచక్రగదా శార్ఙ్గది ఆయుధాలు ప్రకాశిస్తున్నాయి. కమలముల మాలవక్షస్థలంపై వ్రేలాడుతున్నది. బ్రాహ్మణులు ప్రయాణ సమయమున ఆనందంతో అతన్ని స్తోత్రం చేశారు. సూతమాగధవందిగణం అతని గుణాలను గానంచేశారు. సైన్యమంతా ఒకచోటికి వచ్చాక ఉత్తరదిశగా ముందుకు నడిచింది.

ఆ సమయంలో భగవంతుడు శత్రుభయంకరమైన తన పాంచజన్యశంఖాన్ని పెదవిపైపెట్టి గట్టిగా పూరించాడు. ఆకాశమంతా ప్రతిధ్వనించింది. భేరీమృదంగాది వాద్యధ్వనులు మిన్నుముట్టాయి. ఆసమయంలో చాలామంది రాజులు పుష్కర తీర్థానికచేరి సమీపంలో సేనాశిబిరాలు స్థాపించి హంసడింభకుల రాకకు ఎదురు చూస్తున్నారు. ఆసమయంలోనే భగవంతుడు కృష్ణుడు కూడ అందమైన పుష్కర సరోవరంచేరాడు. సరోవరతీర్థజలాన్ని ఆచమనం చేశాడు. తరువాత అక్కడ నివసిస్తున్న మునులకు నమస్కరించాడు. హంసడింభకులను నిరీక్షిస్తూవేదధ్వని వింటూ ఉన్నాడు. ఇతర యాదవులు కూడా అక్కడనే శిబిరాలువేసి సిద్ధంగా ఉన్నారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుడు పుష్కర తీర్థమునకు వెళ్ళుట అను నూటఇరవైఒకటవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవై రెండవ అధ్యాయము

## హంసడింభకులు కూడ పుష్కరమును చేరుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! హంసడింభకులు కూడ గొప్ప ధనుస్సులను ధరించి జండాతో అలంకరింపబడిన రథంపైకూర్చుని పుష్కరతీర్థానికి వెళ్ళారు. భయంకరమైన ఆకారంగల రెండు భూతాలు సింహగర్జన చేస్తూ వాళ్ళముందు నడుస్తున్నాయి.

వాళ్ళు త్రిపుండ్రాన్ని రుద్రాక్షలనూ ధరించారు. తరువాత పది అక్షౌహిణీల సైన్యం వాళ్ళ వెనక నడుస్తున్నది. వాళ్ళకు మిత్రుడైన విచక్రుడు ఇంద్రుని ఓడించినవాడు హంసడింభకులకు సహాయంగా వెళ్ళాడు. విచక్రుడిమిత్రుడు హిడింబుడు కూడ యుద్ధసమాచారంవిని సహాయంగా వచ్చాడు. అతనితోపాటు పెద్దసైన్యం కూడా వచ్చింది. ఎనభైవేల సైన్యం అతని వెనుకనడిచింది. ఆసేనల సమూహం మూడు లోకాలకు భయం కలిగిస్తున్నది.

యుద్ధం కోసం వచ్చిన రాజులు సింహనాదంచేస్తూ కృష్ణునితో నేను ముందు యుద్ధంచేస్తానంటూ ప్రవాడుముందుకొచ్చాడు. లక్షలాదిరాజులు పుష్కర తీర్థం వద్దకు చేరారు. అక్కడ పెద్దపెద్ద తపశ్శాలురు సామవేదం చదివినవాళ్ళు మునులూ పుష్కరతీర్థాన్నీ పుండరీకాక్షునీ ఉపాసిస్తున్నారు. తరువాత క్షత్రియులు దైత్యులు రాక్షససమూహమూ భేరీ, పణవ, ఝర్ఝర మొదలైనవాటిని మ్రోగించి గొప్ప కోలాహలంచేస్తూ రోషంతో పుష్కరతీర్థాన్ని చేరేసరికి భగవంతుడైన శ్రీకృష్ణుడు యుద్ధానికి తయారైవాళ్ళందరిరాకకూ ఎదురుచూస్తూ ఉన్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసడింభకులు కూడ పుష్కరమును చేరుట అను నూటఇరవైరెండవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవైమూడవ అధ్యాయము

## హంసడింభకులు యాదవసేనతో పోరుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ధ్వజములతో జెండాలతో పరిఘగదాది ఆయుధాలతో భేరీ ఝర్ఝరీ మొదలైన వాద్యాలతో రెండు పక్షాలసేనలూ అక్కడకురాగానే గొప్ప ఉత్సాహంతో భయంకరమైన యుద్ధం ప్రారంభమయింది. వీరుల ధనుస్సులు విరిగిపోతున్నాయి యుద్ధంచేసేవాళ్ళశరీరాలు చీల్చబడి దూరంగాపోయి పడు తున్నాయి. తలలు తెగిపోతున్నాయి, శరీరాలుముక్కలుముక్కలవుతన్నాయి. సైనికులు భయంకరంగా గర్జిస్తున్నారు. దైత్యులు, రాక్షసులు, క్షత్రియులు అన్ని వైపులనుండీ ధనుస్సులతో బాణాలతో ఒకరితో మరొకరు యుద్ధం చేయసాగారు. ఏనుగులతో ఏనుగులు గుర్రాలతో గుర్రాలు రథాలతో రథాలు ధ్వంసమవు తున్నాయి. ఆయుధాల దెబ్బలకు సైనికులశరీరాలు ఛిన్నాభిన్నము లౌతున్నాయి.

కొందర ఖడ్గపుదెబ్బలకూ మరికొందరు గదలదెబ్బలకూ తలలుపగిలి నేలకూలు తున్నాయి. కొందరు యముని పట్టణానికి మరికొందరు స్వర్గానికి వెళ్ళారు. కొందరు వీరులనుచంపి పిచ్చివాళ్ళవలె అటూ ఇటూ తిరుగుతున్నారు.

మధ్యాహ్న సూర్యుడు ఘోరమైన తాపాన్ని కలుగచేస్తున్నాడు. ఆసమయంలో నలువైపులనుండి వేలా శంఖ భేరీమృదంగాదులు ఒక్కమారుగా మ్రోగాయి. పిశాచ సమూహము, రాక్షససమూహము ఆనందంతో రక్తంత్రాగుతూ మాంసంతింటూ గంతులేస్తున్నాయి. డేగలు కాకులు గ్రద్దలూ శవాలనులాగుతూ మాంసం తింటు న్నాయి. ఆయుద్ధంలో డెబ్బైవేల ఏనుగులు, నలభైవేలగుర్రాలూ రథికులతో కూడ లక్షరథాలూ ముప్పైకోట్లకాల్బలం మరణించారు. యుద్ధానికి వెళ్ళినవాడు మధ్యాహ్న సమయంలో తిరిగిరాలేదు. కొందరు చచ్చిపుష్కర సరోవరజలంలో పడ్డారు. కొందరూ నేలపైపడ్డారు. కొందరు రథాలనుండి మరణించి క్రిందపడ్డారు. పూర్వము దేవదానవులయుద్ధంవలె ఘోరమూ ఆశ్చర్యకరమూఐన యుద్ధంజరిగింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
హంసడింభకులు యాదవసేనతో పోరుట అను నూటఇరవైమూడవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవైనాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణుని గొప్పదనము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! తర్వాత రెండుపక్షాలకూ ద్వంద్వయుద్ధంమొదలైంది. శ్రీకృష్ణుడు విచక్రకునితో బలరాముడు హంసునితో సాత్యకి డింభకునితో వసుదేవుడు ఉగ్రసేనుడూ హిడింబునితో యుద్ధంచేశారు. ఇతరయాదవసంఘం ఇతరవీరులతో యుద్ధంచేయసాగారు. మొదట శ్రీకృష్ణుడు విచక్రకుని వక్షస్థలం మీద తీక్ష్ణములైన బాణాల్ని ప్రయోగించాడు. విచక్రకుడు పదునైనబాణాలతో శ్రీకృష్ణుని కొట్టాడు. వాళ్ళయుద్ధం చూచి అందరూ ఆశ్చర్యపోయారు. తరువాత నారిని చెవివరకులాగి ఇంద్రునియెదుట శ్రీకృష్ణుని వక్షస్థలంమీద మరొక బాణంప్రయోగించాడు. ఆదెబ్బకు నోటినుండి రక్తంధారగా వచ్చింది.

శ్రీకృష్ణుడు మిక్కిలికోపించి ఒకక్షురప్రమనే బాణంతో విచక్రకుని రథంమీది ధ్వజాన్ని ఖండించి నాల్గుగుర్రాలను చంపి సారథినికూడ మూడు బాణాలతో

చంపివేశాడు. శంఖధ్వని చేశాడు. అప్పుడు విచక్రకుడుకోపించి రథంమీది నుంచి క్రిందికి ఉరికాడు. ఒకమహాభయంకర గదతో కృష్ణునికిరీటంమీదా నుదురు మీదా కొట్టి సింహనాదంచేశాడు. వాడుపెద్దరాయినియెత్తాడు దాన్ని త్రిప్పిత్రిప్పి భగవంతుని వక్షస్థలంమీద కొట్టాడు. భగవంతుడారాతిని త్రిప్పివేయుటచే విచక్రకుడు పెద్దనిట్టూర్పువిడిచి మరణించినవాడివలె నేలపైపడ్డాడు.

స్మృతివచ్చిన తరువాత ఒక పరిఘను చేతపట్టుకొని శ్రీకృష్ణుని ఓగోవిందా! ఈపరిఘతో నీగర్వాన్ని నశింపచేస్తాను. దేవాసురయుద్ధంలో నాపరాక్రమాన్ని బాగాచూచియున్నావు. అయినా మళ్ళీ నాతో యుద్ధంచేయ్యటానికి సాహసిస్తున్నావు. ఓమహాబాహూ ఈపరిఘనునీపై ప్రయోగిస్తున్నాను. శక్తిఉంటే దీన్ని నివారించు. అని పలికి విచక్రుడు అందరి సమక్షంలో భగవంతునిమీద పరిఘను ప్రయోగించాడు. భగవంతుడా పరిఘను చేతితోపట్టుకొని ఒరేదురాత్మా "చచ్చావు" అని తనఖడ్గంతో ఆపరిఘను ముక్కలుముక్కలు చేశాడు. తరువాత విచక్రుడు విశాలమైన ఒకచెట్టును పెకలించి భగవంతునిపై విసిరాడు. భగవంతుడు దానిని కూడ ముక్కలు చేశాడు. భగవంతుడైన కృష్ణుడీవిధంగా క్రీడించి చివరకు అతన్ని చంపాలని భయం కరమైన ఆగ్నేయాస్త్రాన్ని విచక్రుకునిపై ప్రయో గించాడు. ఆఆగ్నేయాస్త్రం అందరి యెదుటా విచక్రుని శరీరాన్ని అంతనూ భస్మంచేసి తిరిగి భగవంతునిచేతిలోకివచ్చి ప్రకాశించింది. దైత్యులు మిగిలినవారు నలువైపులకూ పారిపోయారు. వాళ్ళు సముద్రంలోపడి దాక్కున్నారు. అప్పటినుండి మళ్ళీవాళ్ళు తిరిగిరాలేదు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణుని గొప్పదనము అను నూటఇరవైనాల్గవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవై ఐదవ అధ్యాయము

## బలరామ - హంసుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! ఆసమయంలోనే గొప్ప ధనుర్ధారియైన బలరాముడు ధనుస్సు నెత్తి పదిబాణాలతో హంసునికొట్టాడు. హంసుడు కూడ ఐదుబాణాలను

బలరామునిపై ప్రయోగించాడు. కాని బలరాముడు వాటిని మధ్యలో నరికివేశాడు. మరియు హంసుని వక్షస్థలంపై పదిబాణాలు ప్రయోగించాడు. ఒకబాణంతో నుదుటిమీద కొట్టాడు. ఆదెబ్బతో హంసుడు మూర్ఛపోయి క్రిందపడిపోయాడు. చాలాసేపురథంమీద స్మృతి లేకుండా ఉండి తెలివిరాగానే ఒకబాణంతీసి బలరామునికొట్టాడు. సింహగర్జన కూడ చేశాడు. అతని సాహసంచూచి దేవతలు కూడ ఆశ్చర్యపోయారు. పెద్దదెబ్బ తగులుటచే బలరాముని నోటినుండి రక్తం స్రవించింది. అతనిశరీరమంతా రక్తంతో తడిసింది. తరువాత హంసునిపై బలరాముడు వెయ్యిబాణాలను వర్షించాడు. ఆబాణాలు రథంమీద ధ్వజంమీద, ధనుస్సుమీద అంబులపొదులమీద అంతటాపడి చాలబాధకలిగించాయి.

అప్పుడు బలగర్వితుడైన హంసుడు మిక్కిలికోపించి ఒక బాణంతో బలరాముని కొట్టి, రెండవబాణంతో అతనిధ్వజం ఖండించాడు. తరువాత నాలుగు బాణాలతో అతని నాలుగు గుర్రాలనూ సారథినికూడ యమపురానికి పంపాడు. అంతబలరాముడు మిక్కిలికోపించి హంసునిపై గదతోకొట్టాడు. ఆగదదెబ్బకు రథచక్రధ్వజాలు విరిగిపోయాయి. తరువాత హంసుని మీద గదను ప్రయోగించాడు. హంసుడుకూడ గదతీసుకుని రథంనుండి క్రిందికిదూకాడు. వాళ్ళ ఇద్దరికీ గదాయుద్ధంజరిగింది కొంతసేపటికి ఇద్దరూ అలిసిపోయారు. వాళ్ళ ఇద్దరియుద్ధమూ దేవాసురయుద్ధంలా కనిపించింది.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలరామ - హంసుల యుద్ధము అను నూటఇరవైఐదవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవైఆరవ అధ్యాయము

## సాత్యకి డింభకుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! బలవంతుడు ప్రసిద్ధమైన పరాక్రమంగలవాడగు సాత్యకి డింభకునితో ఘోరయుద్ధం ప్రారంభించాడు. మొదట సాత్యకి వేదపండితుడైన డింభునిముఖంమీద రొమ్ముమీద పదిపదునైనబాణాలను ప్రయోగించాడు. డింభకుడు కూడా సాత్యకిమీద వెయ్యిబాణాలను ప్రయోగించి బాణవర్షం

కురిపించాడు. సాత్యకి ఆబాణాలను వ్యర్థంచేసి సింహనాదంచేశాడు. తరువాత కోపించి డింభకుడు వెయ్యిబాణాలతో సాత్యకిని గాయపరచాడు. అప్పుడు మహావీరుడు సాత్యకి అర్ధచంద్రాకారబాణంతో అతని ధనుస్సును ఖండించాడు. డింభకుడు దానిని విసిరివేసి రెండవ ధనుస్సు పట్టుకొన్నాడు. తర్వాత అతిభయం కరమైన క్షురప్రమనే బాణాన్ని ప్రయోగించాడు. ఆబాణందెబ్బకు సాత్యకి రక్తం క్రక్కుకున్నాడు. కాని సాత్యకి అతని ధనుస్సును ముక్కలు చేశాడు. ఈవిధంగా సాత్యకి డింభునియొక్క ఐదువందల ఐదుధనుస్సులను రాజులందరి యెదుట ఖండించి సింహగర్జన చేశాడు. అప్పుడు వాళ్ళిద్దరూ ధనుస్సులు విడిచిపెట్టి భయం కరమైన ఖడ్గయుద్ధం చేశారు. అనేకపద్ధతులతో ఖడ్గ యుద్ధకళను ప్రదర్శిస్తూ ఆయిద్దరు వీరులూ యుద్ధంచేయసాగారు. ఎవరూ అలసటచెందలేదు. వాళ్ళిద్దరిలో ఒకడు శంకరునిశిష్యుడు రెండవాడు ద్రోణాచార్యశిష్యుడు. ఆకాశంలోనిల్చి చూస్తున్న దేవతలు గంధర్వులు ఆయుద్ధాన్ని పొగడసాగారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
సాత్యకి డింభకుల యుద్ధము అను నూటఇరవైఆరవ అధ్యాయము

☆☆☆

# నూట ఇరవైఏడవ అధ్యాయము

## బలరాముడు హిడింబకుని చంపుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! వృద్ధుడు యుద్ధనిపుడు ముసలితనంచేత సత్వంతగ్గిన శరీరంగల మహాత్ముడైన వసుదేవుడు, ఉగ్రసేనుడూ వీళ్ళిద్దరూ ఆమహాయుద్ధంలో దుష్ట రాక్షసుడైన హిడింబునితో యుద్ధం చేయసాగారు. వాళ్ళు అనేకబాణముల వేలాదిగా వర్షించి దురాత్ముడైన హిడింబునికి భయంకలిగించారు. అప్పుడు హిడింబుడు మనుష్య మాంసంభక్షిస్తూ యుద్ధభూమిలో ఇటూఅటూ తిరుగుతున్నాడు. వాడు చూడటానికి భయంకరుడుగా ఉన్నాడు. వాడుమాంసపుముద్దలను తింటూ రక్తం త్రాగుతూ ఉన్నాడు. వాడు ఏనుగును ఏనుగుతో గుర్రాన్ని, గుర్రంతో రథాన్ని రథంతో కొట్టి నుగ్గుచేస్తున్నాడు. రాక్షసుడైన హిడింబుడు యాదవ సైనికులను నమిలి వేస్తున్నాడు. ఆపరిస్థితిలో చాలామంది యాదవులు పారిపోయారు. పట్టు

బడినవాళ్ళు అతనికి ఆహారమయ్యారు. కొంచంసేపట్లో యాదసేన స్తంభించి పోయింది.

అప్పుడు వృద్ధులైన వసుదేవుడు ఉగ్రసేనుడు కోపంతో ధనుస్సులనెక్కుపెట్టి ఆభయానక రాక్షసుని యెదుట నిలిచారు. రాక్షసుడు వాళ్ళను చూడగానే వేగంగా పరుగెత్తాడు. దారిలోకనిపించినవాళ్ళను మేస్తూ వృద్ధులైన వాళ్ళవైపు సాగాడు. అప్పుడు ఉగ్రసేనుడు వసుదేవుడూ ఎడతెరిపి లేకుండా బాణాలను వర్షించి రాక్షసుని నోటినిండా బాణాలు నింపారు. ఆబాణాలను తింటూ పరిగెడుతున్నాడు హిడింబుడు. అతడు వీరుల వద్దకు వెళ్ళి వాళ్ళ ధనుస్సులను విరిచేశాడు. ఆరాక్షసుడు తనచేతులు బాగాచాచి రాజులందరిఎదుట ఆయిద్దరు వృద్ధులనూ పట్టుకోటానికి ముందుకుసాగాడు. అతడు వసుదేవుని రాజాధమా! నేనిప్పుడు మీయిద్దరినీ తింటాను.

ఓఉగ్రసేనా! ఈస్థితిలో కూడ నీవు నాయెదుట నిలబడతావేమి? భగ వంతుడు మిమ్మల్ని నాకు ఆహారంగా ఇచ్చాడు. రండి నానోట్లోపడండి. నేను యుద్ధం చేసి అలసిపోయాను. నాకుబాగా ఆకలవుతోంది. మీరు నన్ను తప్పించు కొని వెళ్ళలేకపోతే నానోట్లో దూరండి. మీరక్తం త్రాగి తృప్తిపడతాను. తరువాత ఆనందంగా మీమాంసంతింటాను. అని తననోటిని పెద్దది చేసి రాక్షసుడువేగంగా వాళ్ళిద్దరివైపుకు పరుగెత్తాడు. ఉగ్రసేన, వసుదేవుల వద్ద అస్త్రాలు లేవు. ఆ వికట రాక్షసుని చూచి మిక్కిలి భయపడ్డారు. అటూఇటూ పరిగెత్తారు. అప్పుడు పరమ ప్రతాపశాలి బలరాముడు ఆస్థితిలో ఉన్న వృద్ధులనిద్దరినీ చూచి యుద్ధభారాన్ని కృష్ణునికి వప్పచెప్పి హిడింబునికి ఎదురుగా వెళ్ళాడు.

ఒరే దుష్టరాక్షసా! వాళ్ళనివిడిచి పెట్టు. శత్రుసంహారానికి నేనుసిద్ధంగా ఉన్నాను. నీవు నాతోయుద్ధంచెయ్యి. నేను వశింపచేస్తాను అన్నాడు. బలరాముని మాటలువిని రాక్షసుడు వృద్ధులను విడిచి బలరామునివైపు పరుగెత్తాడు. హిడింబుడు భయంకరమైన పిడికిలితో బలరాముని రొమ్ముపైగుద్దాడు. బల రాముడు అట్లేపిడికిలితో రాక్షసిరొమ్ముపై కొట్టాడు. వాళ్ళిద్దరికి ముష్టియుద్ధం కొనసాగింది. తరువాత బలభద్రుడు రాక్షసునిముఖం మీద కొట్టాడు. దానితో రాక్షసుడు మరణించినట్లు నేలపైబడ్డాడు. అప్పుడు బలరాముడు వాళ్ళనిద్దరినీ చేతులతో లేవనెత్తి అక్కడనే కొంచంసేపు నిలిచాడు. రాక్షసుడు బలరామునికి భయపడి నలుదిక్కులకూ పారిపోసాగాడు. అప్పుడు సూర్యాస్తమయమైంది. తర్వాత

చంద్రుడు దయించాడు. యుద్ధభూమిలో ఉన్నరాజులు 'రేపు కిన్నరులగానంచే ప్రతిధ్వనించే గోవర్ధనపర్వతంమీద యుద్ధం జరుగుతుంది' అనిపలికి ఆనాటి యుద్ధం ముగించారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
బలరాముడు హిడింబుకుని చంపుట అను నూటఇరవైఏడవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవైఎనిమిదవ అధ్యాయము

## శ్రీకృష్ణ- హంసుల యుద్ధము

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! రాత్రిఅయిన పిమ్మట హంసడింభకులిద్దరూ కలిసి గోవర్ధన పర్వతం వైపు వెళ్ళారు. రెండవరోజు సూర్యోదయమైన తర్వాత భగవంతుడైన శ్రీకృష్ణుడుకూడ గోవర్ధన పర్వతం మీదికి వెళ్ళాడు. సాత్యకి బలభద్రుడు సారణుడు, మొదలైన యాదవులు కూడ గంధర్వులచే అప్సరసలచేతను ప్రతి ధ్వనిస్తున్న గోవర్ధనగిరిమీదికి వచ్చారు. గోవర్ధనపర్వతానికి ఒకవైపున యమున ఒడ్డుమీద మళ్ళీ యుద్ధంప్రారంభమైంది. మొట్టమొదట వసుదేవుడు హంసునితో డింభకునితోనూ యుద్ధంచేశాడు. హంస డింభకులపై వసుదేవుడు ఏడుబాణాలు ప్రయోగించాడు. తరువాత సారణుడు ఇరవై ఐదుబాణాలతో కంకుడు పది బాణాలతో ఉగ్రసేన డెబ్బైమూడుబాణాలతో, విరాటుడు ముప్పైబాణాలతో, సాత్యకి ఏడుతో, విపృథువు ఎనభైతో, ఉద్ధవుడు పది, ప్రద్యుమ్నుడు ముప్పై, సాంబుడు ఏడు, అనావృష్టి అరవైఒకటి బాణాలతో హంసడింభకులను కొట్టారు.

ఇలా యాదవులందరూ కలిసి ఉత్సాహంతో ఘోరయుద్ధంచేశారు. భగ వంతుడైన కృష్ణుడునిలుచుని వాళ్ళయుద్ధంచూస్తున్నాడు. అపుడు హంసడింభకులు పదిపది బాణాలచొప్పున యాదవులనందరునూ బాధించారు. ఆదెబ్బలకు యాదవులు నోటినుండి రక్తంకక్కారు. యాదవులు భయపడి యుద్ధభూమి నుండి పారిపోసాగారు. అస్థితిచూచి భగవంతుడు బలభద్రుడు. వాళ్ళయిద్దరి ఎదుటకు వెళ్ళి యుద్ధం చేయసాగారు. ఆసమయంలో మహాదేవుడు పంపిన ఇద్దరుభూతేశ్వరులు హంసడింభకుల రక్షణకొరకు అక్కడ ప్రత్యక్షమయ్యారు.

ఆసమయాన శ్రీకృష్ణహంసులకు బలరామ డింభకులకూ భయంకరయుద్ధం జరుగున్నది.

అప్పుడు వీరులందరూ తమతమ రథాలపై కూర్చుని విడవిడిగా శంఖధ్వని చేయసాగారు. భగవంతుడైన శ్రీకృష్ణుడు అందరినీ ఆశ్చర్యపరుస్తూ తన పాంచజన్య శంఖాన్ని ఊదాడు. తరువాత శంకరుడు పంపిన రెండు భూతాలూ త్రిశూలం పట్టుకొని శ్రీకృష్ణునివైపు వెళ్ళారు. దగ్గరకు వెళ్ళి భగవంతునిమీద త్రిశూలాన్ని ప్రయోగించారు. ఆదెబ్బకు శ్రీకృష్ణుడు రథంనుండి క్రిందకు దూకాడు. కొంచం నవ్వుతూ వాళ్ళిద్దరినీ చేతితోపట్టుకొని నూరుమార్లు త్రిప్పి కైలాసపర్వతం మీదికి విసిరాడు. కైలాసపర్వత శిఖరంపైపడి వాళ్ళు ఆశ్చర్యపోయారు. హంసుడు కృష్ణుని పరాక్రమంచూచి కోపంతో దేవతలందరిఎదుట కేశవా! నీవు మారాజసూయ యజ్ఞానికి ఎందుకు విఘ్నంచేస్తున్నావు? బ్రహ్మదత్త మహారాజు తప్పకయజ్ఞాన్ని పూర్తిచేస్తాడు. ప్రాణాలను కాపాడుకోదలచితే పన్ను చెల్లించుము. లేకపోతే ఒక క్షణంఉండు తరువాత తెలుసుకొని చాలాపన్ను ఇస్తావు.

తరువాత మాతండ్రి యాగంచేస్తాడు. రాజులకు దేవతలకు కూడా నేను ప్రభువును. యుద్ధంలో నీపరాక్రమాన్నంతనూ నశింపచేస్తాను. అని ధనుర్బాణాలు తీసుకొని బాణంతో బలం కొలది కేశవునినుదిటి పై కొట్టాడు. అది తిలకమైంది. అప్పుడు శ్రీకృష్ణుడు సాత్యకిని రథం నడపమనికోరాడు. దారుకుని రథంవెనక కూర్చోబెట్టాడు. భగవంతుని ఆజ్ఞప్రకారం అతడు రథంతోలనారంభించాడు. తరువాత భగవంతుడు రాక్షసుని దెబ్బకు బాధచెంది ఆగ్నేయుస్త్రాన్ని సంధించి ఓదురాత్మా! ఇక పెద్దగా యుద్ధం చేయవలసిన అవసరంలేదు. ఈఅస్త్రంతో నిన్ను భస్మంచేస్తాను. నీవు సమర్థుడవైతే నా యీ అస్త్రాన్ని నివారించు వాదగ్గర నుండి పన్ను తీసుకోదలిస్తే పరాక్రమం చూపించు. పుష్కరతీర్థమందు నివసించే యతులకు నీవు మిక్కిలి కష్టం కలిగించావు. నేనుండగా నీవు బ్రాహ్మణులను శాసిస్తావా? దుష్టులైన క్షత్రియులను శాసించువాడను నేను.

ఓరి నీచమానవుడా! యతీంద్రుల యొక్క శాపంచేతనే మరణించావు. నిన్ను మృత్యువుకు వప్పచెప్పి బ్రాహ్మణులను రక్షిస్తాను. అని ఆఅస్త్రాన్ని కేశవుడు ప్రయోగించాడు. ఆఅస్త్రాన్ని హంసుడు వారుణాస్త్రంతో నివారించాడు. తరువాత గోవిందుడు వాయవ్యాస్త్రాని ప్రయోగించాడు. దానిని మహేంద్రాస్త్రంతో హంసుడు

అడ్డగించాడు. తర్వాత కృష్ణుడు మాహేశ్వరాస్త్రాన్ని ప్రయోగించగా హంసుడు రౌద్రాస్త్రంతో నివారించాడు. తరువాత బ్రహ్మాస్త్రంతోసహా అనేకాస్త్రాలను శ్రీకృష్ణుడు ప్రయోగించగా వాటినన్నిటినీ హంసుడు వ్యర్థంచేశాడు. తన శస్త్రాస్త్రాలను ప్రయోగించటం మొదలుపెట్టాడు. అన్నిశస్త్రాస్త్రాలనీ నివారించే బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించాడు భగవంతుడైన శ్రీకృష్ణుడు హంసుడు తనబ్రహ్మశిరోనామకాస్త్రంతో దాన్నికూడా వ్యర్థంచేశాడు. అప్పుడు భగవంతుడు శ్రీకృష్ణుడు యమునాజలాన్ని ఆచమనంచేసి హంసుని చంపటానికి వైష్ణవాస్త్రాన్ని సంధించాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
శ్రీకృష్ణ- హంసుల యుద్ధము అను నూటఇరవైఎనిమిదవ అధ్యాయము

☆☆☆

# నూటఇరవై తొమ్మిదవ అధ్యాయము

## హంసుని వధ

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! అభయకరమైన అస్త్రాన్ని చూచి హంసుడు మిక్కిలి భయపడి స్తంభించిపోయాడు. తరువాత రథంనుండి దూకి పారిపోయాడు. వెళ్ళి వెళ్ళి కాళియ హ్రదంలో పడ్డాడు. జగన్నాథుడైన కృష్ణుడు రథంనుంచిదిగి అతని వెనువెనకనే పరుగెత్తి కాలియహ్రదంలో హంసునిమీద దూకిపడ్డాడు. శ్రీకృష్ణుని ఈ సాహసం చూచి అందరూ ఆశ్చర్యపోయారు. శ్రీకృష్ణుడు హంసునికాళ్ళతో కొట్టాడు. కాలి దెబ్బలకు హంసుడు మరణించాడు. అనికొందరు మరికొందరు పాతాళానికిపోయి అక్కడ సర్పాలచే తినబడ్డాడని చెపుతారు. జగన్నాథుడైన తన రథంవద్దకు వచ్చాడు. వాడు చనిపోయినపిమ్మట మీ తాతయైన ధర్మరాజ రాజసూయయాగంచేశాడు. అతడు బ్రతికి ఉంటే ఆయజ్ఞం ఎవడు చేయగలుగుతాడు? క్షణకాలంలో అతని మరణవార్త భూమండలమంతావ్యాపించింది. శత్రుమర్దనుడైన శ్రీకృష్ణుడు యమునాహ్రదంలో హంసునిచంపివేశాడు. ఈకథను గంధర్వులు దేవసభలో అహర్నిశమూ గానంచేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హంసుని వధ అను నూటఇరవైతొమ్మిదవ అధ్యాయము

☆☆☆

# నూట ముప్పైయవ అధ్యాయము

## డింభకుని ఆత్మహత్య

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! కృష్ణుడు హంసునిచంపాడనే వార్తవినగానే యుద్ధంచేస్తున్న బలరాముని విడిచి పరాక్రమవంతుడైన డింభకుడు యమునవద్దకు వెళ్లాడు. బలభద్రుడతన్ని వేగంగా అనుసరించి పరిగెత్తాడు. హంసుడుపడినచోట తాను కూడా పడి డింభకుడు ఆనీటిలో మునుగుతూ లేస్తూ వెతికాడు. కానిఎక్కడా కనపడలేదు. అప్పుడుకోపించి వాసుదేవునిచూచి ఓరీగోపకబంధువా? హంసు డెక్కడ ఉన్నాడు అని నిలుచున్నాడు. ధర్మాత్ముడైన వాసుదేవుడు యమునను అడుగుఅన్నాడు. అప్పుడు మళ్ళీయమున నీటిలోమునిగి అనేకవిధాలవెతికి కనకపడ మనస్సుచలించి ఏడ్చాడు. ఓరాజేంద్రా నన్నువిడిచి ఎక్కడకువెళ్ళావు? అని దుఃఖించి యమునాజలంలో నేనుకూడ మరణిస్తానని మాటిమాటికి దుఃఖించాడు. నాలుకను సాహసంతో మొదటినుండి లాగుకొని నీటిలోనే డింభకుడు మరణించాడు. ఈవిధంగా హంసడింభకులు మరణించిన తరువాత అందరినీ ఆశ్చర్యపరుస్తూ ప్రతాపవంతుడైన వాసుదేవుడు వెళ్ళిపోయాడు. గోవర్ధన పర్వతంమీద విశ్రాంతితీసుకొని కొంతసేపు బలరామునితో కూడనున్నాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
డింభకుని ఆత్మహత్య అను నూటముప్పైవ అధ్యాయము

☆☆☆

# నూటముప్పై ఒకటవ అధ్యాయము

## యశోదానందులు బలరామ శ్రీకృష్ణులను దర్శించుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! నందగోపుడు యశోద ఇద్దరూ వెన్న, పెరుగు, పాయసం, పులగం, అడవి పువ్వులు, నెమలిపింఛము, భుజకీర్తులు కానుకగా తీసుకొని గోవర్ధన పర్వతానికి వెళ్ళారు. ఇతర గోపగోపీజనం కూడ వాళ్లతోపాటు వెళ్ళారు. అక్కడకు వెళ్ళి బలరామునితో కూడా ఉన్న శ్రీకృష్ణుని చూచారు. ఆమహాబలవంతులను చూచి సంతోషించారు. అందరూ ఇద్దరుసోదరలకు నమస్కారంచేశారు. తాము

తెచ్చిన పాయసం, వెన్న మొదలగువస్తువులను అన్నిటినీ వాళ్ళముందు ఉంచారు. భగవంతుడైన శ్రీకృష్ణుడు నందయశోదలనుచూచి మిక్కిలి గద్గదస్వరంతో తండ్రీ! తల్లీ! గొల్లపల్లెలో మన గోధనముకుశలమా? ఆవులు వెనుకటిలా బాగా పాల నిస్తున్నాయా? దూడలు ఇప్పుడు పెద్దవై ఉంటాయి. ఆవులు వెనకటిలా చూడ టానికి అందంగా ఉన్నాయా? అనేక విధాలైన గడ్డిబాగా దొరుకుతున్నదా? సుగంధం తో నిండిన బండ్లు అదేసంఖ్యలో ఉన్నాయా! సంతానవంతులైన గోపికలు ఏయే పిల్లలను ఎంతమందిని కన్నారు? నెయ్యి, పాలు, పెరుగు మొదలైన వస్తువులు బాగా దొరుకుతున్నాయా? అచటిగోధనమంతా ఆరోగ్యం గలిగి ఉన్నదా? అని ప్రశ్నించాడు.

నందుడామాటలు విని ఓయదుశ్రేష్ఠుడా! నీవడిగిన సమస్తమూ క్షేమమే. గోధన మంతా ఆరోగ్యంకలిగిఉంది. నిన్ను చూడలేకపోతున్నామనే మేము ఎల్లప్పుడూ దుఃఖపడుతూన్నాము. ఈ ఒక్కదుఃఖంచేతనే మాబుద్ధిక్షీణించి పోతున్నది. అని నందుడు దుఃఖపడుచుండగా భగవంతుడైన కృష్ణుడు ఓదార్చాడు. తల్లినీ తండ్రినీ ఇంటికి వెళ్ళండిఅని లోకంలో ప్రజలు మీనామసంకీర్తనం చేస్తూ నమస్కరిస్తారు. వాళ్ళకు స్వర్గం ప్రాప్తిస్తుంది. వాళ్ళు నాకు మిక్కిలి ప్రియమైనవాళ్ళు. వాళ్ళెల్లప్పుడూ నాకుభక్తులౌతారు. సనాతధనుడైన పరమపురుషుడు శ్రీకృష్ణుడిట్లుపలికి తల్లి దండ్రులను గట్టిగా కౌగలించుకొని సెలవుతీసుకొన్నారు. అప్పుడు నందగోపుడు యశోదింటికి తిరిగి వచ్చారు. తరువాత భగవంతుడైన హృషీకేశుడు యాదవవృష్ణి వంశీయులతో ద్వారకానగరానికి వెళ్ళదలచాడు. ఈకథనువిన్నవాళ్ళు చదివిన వాళ్ళు, ప్రపంచంలో పుత్రవంతులై జీవనంగడుపుతూ చివరకు మోక్షంపొందుతారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో యశోదానందులు బలరామ శ్రీకృష్ణులను దర్శించుట అను నూటముప్పైఒకటవ అధ్యాయము

★★★

# నూటముప్పై రెండవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు ద్వారకకు తిరిగి వెళ్ళుట

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! భగవంతుడైన శ్రీకృష్ణుడు యాదవులతో పుష్కరతీర్థానికి చేరాడు. అక్కడున్న మునిశ్రేష్ఠులను చూచాడు. ఆమహర్షులందరూకలిసి మహాదేవుని

పూజించి, విశ్వేశ్వరుడైన విష్ణువుతో ఓజనార్దన! నీపరాక్రమం మిక్కిలి ఆశ్చర్య కరము. హంస డింభకులను చంపావు. దేవతలకు కూడ కొరుకుపడని విచక్రుడు యుద్ధంలో నీచే చంపబడ్డాడు. ఉత్తమమైన తపస్సు చేయుచున్న మాకుక్షేమమే. ఓహరీ! నిన్ను తలుచుకొని పాపరహితులమవుతాం. నిన్ను ధ్యానించేవారి దుః ఖాలను పోగట్టేవాడవు. నిన్ను తలుచుకుంటే పుణ్యం ప్రాప్తిస్తుంది. ఓంకార వషట్కా రములు, యజ్ఞములు, జ్యోతిస్సు బ్రహ్మ, రుద్రుడు నీవే. ప్రాణులకు ఆత్మరాత్మవు నీవు. యజ్ఞములచే దానాలచేతనూ ఉపాసింపదగినవాడవు నీవే. సృష్టికర్తవు నీవు. విశ్వస్వరూపమునీవే. ఓదేవ! బ్రహ్మ ద్వేషులను సంహరించి ఈలోకాన్నిరక్షించు. అని ప్రార్థించారు. ఆశ్రీహరి విష్ణువు అట్లేయని ద్వారకానగరానికి వెళ్లాడు. అక్కడ వృష్ణివంశీయులచేత వందిమాగధుల చేతను స్తోత్రం చేయబడుతూ ఆందంగా నివసింపసాగాడు. ఓ జనమేజయమహారాజా! దేవదేవుడైన విష్ణువు విషయం తెలుసు కొనగోరినది నీకుచెప్పి వినిపించాను. నీవిప్పుడేమి వినగోరుతున్నావు? చెప్పు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వమున
శ్రీకృష్ణుడు ద్వారకకు తిరిగి వెళ్ళుట అను నూటముప్పైరెండవ అధ్యాయము

☆☆☆

# నూటముప్పై మూడవ అధ్యాయము

## హరివంశం వినే పద్ధతి- ప్రయోజనము

జనమేజయుడు మహాత్మా మహాభారతాన్ని ఏవిధంగావినాలి? దాన్ని విన్నందు వల్ల ఫలమేమిటి? మహాభారతపారాయణ సమయమున ఏదేవతను పూజించాలి? పర్వం పూర్తయినప్పుడు ఏందానమివ్వాలి? వినిపించేవాడెలా ఉండాలి? ఎలా పూజ చేయాలి? ఈవిషయాన్ని స్పష్టంగా వర్ణించండి అని అడిగాడు.

వైశంపాయనుడిలా చెప్పాడు!

మహారాజా! నేనిప్పుడు మహాభారతపారాయణ విధానం, దాన్నివినేవిధానం దాని వల్ల ఫలంచెపుతున్నాను విను. నీవు శ్రద్ధగావిను.

మహారాజ! స్వర్గంలోని దేవతా సమూహం క్రీడగా భూమండలంపై అవతరించి ఈపని చేసి మళ్ళీ స్వర్గానికి వెళ్ళారు. నేనిప్పుడు భూమిమీద ఋషులు దేవతలు అవతరించిన వృత్తాంతం చెపుతున్నాను. విను!

రుద్రగణం, సిద్ధగణం, విశ్వేదేవ, ఆదిత్య , అశ్వినీకుమార, లోకపాల, పరమర్షిగణ, యక్ష, గంధర్వనాగ, విద్యాధర, సిద్ధ, ధర్మ, స్వయంభుమునివర, కాత్యాయన, పర్వతగణ, సముద్రగణ, నదులు, అప్సరసలు, గ్రహ, సంవత్సర, అయన ఋతువులు స్థావర, జంగమ, సుర, అసురమయమైన జగత్తునంతనూ వెతకాలనుకుంటే ఆవిషయమంతా ఈమహాభారతంలో నీకుదొరుకుతుంది. పైనచెప్పబడిన మహాత్ములస్థానాలు పేర్లు, పనులు, కీర్తిస్తే తత్క్షణమే మిక్కిలి ఘోరమైన పాపాలనుండి కూడ విముక్తి కలుగుతుంది. శుద్ధమైన మనస్సుతో మొదటి నుండీ చివరివరకు, వినేవాళ్ళు ఉద్ధరింపబడతారు.

భారతంవిన్నాక ఏందానం చెయ్యాలి? మహాభారతంవినే సమయంలో సంపూర్ణభక్తితో తన శక్త్యనుసారం దానమివ్వటం అవసరం. శ్రద్ధతో దానం చెయ్యటంవల్ల దాతసమస్త వాంఛలు తీరుతాయి. అలాంటివాడు ఎల్లప్పుడు ప్రసన్నుడై సేవాపరాయణుడుగా ధైర్యశాలిగా అవుతాడు. శుచియై జితేంద్రియుడుగా మహాభారతం విన్నందుకు ఏఫలంలభిస్తుందో చెప్పుతున్నాను. మహాభారతం చెప్పేవాడు సత్యం పలుకువాడు, ఉదారుడు, జితేంద్రియుడూ కావాలి. ఉచ్చారణ వ్యాకరణబద్ధంగా ఉండాలి, ఆనందంగా కూర్చుని ఈకథచెప్పాలి. పౌరాణికుడు మొట్టమొదట నర, నారాయణ, సరస్వతులకు నమస్కరించి మహాభారతకథ ప్రారంభించాలి. వినేవాడు శుచియై పైనచెప్పినట్లు వక్తవద్దకూర్చుని భారతకథనువిని కోరినఫలితం పొందగలుగుతాడు.

మొదటిపర్యాయం విని బ్రాహ్మణులను తృప్తి పరచినవాడు, అగ్నిష్టోమ యాగం చేసిన ఫలాన్ని పొందుతాడు. రెండవమారు విన్నవాడు అతిరాత్రయాగ ఫలం పొందుతాడు. మూడవమారు విన్నవాడు ద్వాదశాహయజ్ఞఫలం పొందుతాడు. నాల్గమారు విన్నవాడు వాజిరుయాగంయొక్క/ఐదవసారి విన్నవాడు రెట్టింపు ఫలాన్ని, ఆరవమారు రెండురెట్లు, ఏడవమారు మూడురెట్లు, ఎనిమిదవమారు రాజసూయ పారణఫలం, తొమ్మిదవమారు అశ్వమేధయాగఫలం. పదవమారు రత్నమయవిమానంలో దివ్యలోకసంచారం చేస్తాడు. స్వర్గలో ఇంద్రునితో ఆనందిస్తూ ఉంటాడు. సూర్యచంద్రుల భవనాలతో శివుని భవనంలో నివసిస్తాడు. విష్ణులోకం పొందుతాడు. ఇందులో విచారించవలసినదిలేదు. శ్రద్ధగా వినాలని మాగురువు చెప్పాడు. వక్తకు కోరనదీయవలెను. దేవతలాగా పూజించాలి. అలాచేస్తే విష్ణులోకం లభిస్తుంది. ఇకమీదట ఈయవలసినవస్తువులను చెపుతాను.

ప్రతిపర్వం పూర్తయ్యాక బ్రాహ్మణులను శక్తికొలది తృప్తిపరచాలి. మొదట పౌరాణికుని భోజనంచేయించాలి పాయసంనెయ్యి, తేనె శర్కరపొంగలి భోజనంలో పెట్టాలి. సభా పర్వంచి వరబ్రాహ్మణులకు హవిష్యం భోజనంపెట్టాలి, అరణ్యాపర్వం నీటిపాత్రనివ్వాలి. తర్పణాలు అడవిలోని కందమూలఫలాలు ముఖ్యమైనవి. సమృద్ధిగా బ్రాహ్మణులకు అన్నదానం చెయ్యాలి. అరణ్యపర్వం పూర్తయ్యాక నీటితోనిండిన పాత్రనుదానంచేసి ఫలమూలతోకూడిన భోజనంపెట్టాలి. విరాట పర్వం చివర అనేకవిధాలైన వస్త్రాలను దానంచెయ్యాలి. ఉద్యోగపర్వానికి బ్రాహ్మణు లకు వస్త్రములు పూలదండలుఇచ్చి మంచిపదార్థాలతో భోజనంపెట్టాలి. ద్రోణ పర్వానికి బ్రాహ్మణులకు భోజనంపెట్టి ధనుర్బాణాలు ఖడ్గమూ దానంచేయాలి.

కర్ణపర్వానికి బ్రాహ్మణులకు భోజనంపెట్టి తృప్తిపరచాలి. శల్యపర్వానికి బెల్లంతో కూడిన అన్నాన్ని, లడ్డూలనూపెట్టి తృప్తిగా భోజనం చేయించాలి. ఉద్యోగ పర్వానికి పెసరపప్పుతో కూడిన పులగం, భీష్మపర్వానికి వాహనదానం. స్త్రీపర్వానికి రత్నాలిచ్చి బ్రాహ్మణులను తృప్తిపరచాలి. శాంతిపర్వానికి, హవిష్యం భోజనం పెట్టాలి. అశ్వమేధికపర్వానికి అన్ని ఉపకారణాలతో మరిచి అన్నాన్ని, స్వర్గా రోహణానికి ఉత్కృష్టమైన ఆహారం ఆశ్రమవాసిపర్వానికి, హవిష్యాన్నం, మౌసలానికి గంధము పూలమాలలు, హరివంశసమాప్తిలో వెయ్యిమంది బ్రాహ్మణులకు పెట్టాలి.

కథచెప్పిన వానికి బంగారుముద్రికతో సహా ఒకగోవును దానంచెయ్యాలి. వినేవాడు డబ్బులేనివాడైతే ఐదువందలమంది బ్రాహ్మణులకు భోజనంపెట్టాలి. ప్రతిపర్వంచివరలో కథచెప్పేవానికి బంగారంతోపాటు పుస్తకదానంచెయ్యాలి. హరివంశ సమాప్తిలో పాయసం తినిపించాలి. శ్లోకం, లేదా ఒక అక్షరమైనా ఏకాగ్రమైన మనస్సుతో విన్నవాడు విష్ణుభగవానునకు ఇష్టుడౌతాడు. గ్రంథం పూర్తయిన తర్వాత భార్యతోసహా వ్యాసునికి భగవంతుడైన లక్ష్మీ నారాయణునికీ పూజ చేయాలి, విన్నవాడు కథచెప్పిన వాడికి భూదాన గోదానములు చేసి పూజ చెయ్యాలి. ఆపూజ భగవంతుడైన కృష్ణునిపూజ అవుతుంది.

పారణఅయిన తర్వాత పుస్తకాన్ని పవిత్రస్థానమందుంచి గంధపుష్పాదులతో పూజించాలి. తరువాత బ్రాహ్మణులకు గోదానం దక్షిణగా ఇవ్వాలి. మూడుపలాల బంగారం దానంచేయాలి. శ్రోతదరిద్రుడైతే కొంచమైన బంగారంఇవ్వాలి. ఇంకాఏదైనా దానంచేయదలిస్తే చేయావచ్చు. కథ చెప్పినవాణ్ణి గురువుగా భావించి భక్తితో సంతోషపెట్టాలి. దేవతలందరకూ నమస్కరించి, నరనారాయణ

నామసంకీర్తన కూడా చెయ్యాలి, గంధమాల్యాదులచే బ్రాహ్మణుని సంతోష పెట్టితే అతిరాత్రయాగ ఫలం లభిస్తుంది. మహాభారతం చదివిచెప్పేవాడి కంఠం మధురంగా స్పష్టంగా ఉండాలి. కథ చెప్పినవాణ్ణి భోజనంపెట్టి పూజించాలి. కథచెప్పి బ్రాహ్మణుడు సంతోషిస్తే దేవతలందరూ సంతోషిస్తారు.

మహారాజ! నీవడిగిన భారతకథ వినే పద్ధతిని చెప్పాను. శుభాలనుకోరే వాళ్ళు ఈవిధంగా మహాభారతాన్ని వినాలి. మహాభారతం చదవటం చెప్పటం నిత్యమూ చేయవలసిన పని. మహాభారతం ఉన్న ఇంట్లోవాళ్ళకు విజయం లభిస్తుంది. మహా భారతం ఉత్తమశాస్త్రం. మహాభారతం మోక్షాన్నికూడా ఇస్తుంది. మహాభారతం చదివేటప్పుడు వినేటప్పుడు మొదటమధ్యలో చివరలో భగవన్నామ సంకీర్తనం చెయ్యాలి. మహర్షి ద్వైపాయనుడు స్వయంగా చెప్పినది భారతం. హరివంశం వినుటవల్లకూడ భారతంవిన్న ఫలం లభిస్తుంది. లక్షలాది వాజపేయాగాలఫలం హరివంశంవినటంవల్ల కలుగుతుంది. ఓజగద్గురూ! నీవు ముసలితనమూ మరణం లేనివాడవు. నీకు మొదలు చివరలేవు. నీవు సగుణనిర్గుణ స్థూలసూక్ష్మస్వరూపడవు. యోగులకుజ్ఞానంచే తెలియదగినవాడవు. అందుకే ఓపరమేశ్వరా! నేను నీకు శరణాగతుడను.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
హరివంశం వినే పద్ధతి- ప్రయోజనము అను నూటముప్పైమూడవ అధ్యాయము

☆☆☆

# నూటముప్పైనాల్గవ అధ్యాయము

## త్రిపుర వధ వృత్తాన్తము

జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! శంకరునియొక్క త్రిపురాసురవధవృత్తాం వినగోరుచున్నాను. దానినిమీరు విస్తరంగా వినిపించగోరుచున్నాననగా వైశం పాయనుడిలా చెప్పాడు. మహారాజ! మహాబలశాలియైన త్రిపురుడు మేఘంలాగా ఆకాశంలో స్వేచ్ఛగా సంచరిస్తాడు. అతనిపట్టణంలో మేడలు మిక్కిలిఎత్తైనవి, బంగారంతో తయారైనవి. ఆమేడల్లో ప్రతిప్రదేశంలోనూ మణులు పొదగబడి ఉన్నాయి. వాటిద్వారాలు అనేక విధాలైన రత్నాలతో విచిత్రంగా ఉంటాయి. గంధర్వ పట్టణంలా ఆకాశంలో దానిశోభ ఆశ్చర్యకరంగా ఉంటుంది. మనోవేగంగల బల గర్వం గల రెక్కలుగల గుర్రాలు ఆపట్టణాన్ని మోస్తూ ఉంటాయి. ఆగుర్రాలు వాయువేగంతో పరిగెత్తుత్తాయి. ఆనగరంలో బంగారు మేడలెన్నో ఉన్నాయి.

ప్రతిస్థలంలోనూ జెండాలు ఎగురుతూ ఉంటాయి. సూర్యుడు చంద్రుడు అనేపేర్లు గల బలవంతుడలైన ఇద్దరు రాక్షసులు ఇతర దైత్యగణాలు బ్రహ్మయిచ్చిన వరాలతో గర్వించి బలమోహంతో దేవలోక పితృలోకాలకు వెళ్ళే మార్గాల్ని మర్దించి ఛిన్నాభిన్నంచేశారు. వాళ్లుతమశక్తిచేత అందరినీ బాధించగా దేవతలు వాడినముఖాలతో బ్రహ్మవద్దకు వెళ్ళారు.

అక్కడ భయపడుతూ ఓబ్రహ్మా! శత్రువులు మాయజ్ఞభాగాలను అపహరించారు. కనుక మేము చచ్చినవాళ్ళవలె ఉన్నాము. కాబట్టి ఇప్పుడు వాళ్ళను నశింప చేసే ఉపాయంచూడండి అని అడిగారు. అప్పుడు బ్రహ్మ ఓదార్చుతూ ఓదేవతలారా! శంకరుడుతప్ప అతన్ని నశింపచేయగలవాడులేడు. ఆమాటవిని దేవతలు రుద్రగణాలూ భులోకానికి వచ్చి శంకరునిచూచారు. భగవంతుడైన శంకరుడు మృగచర్మంధరించి ధర్మాసనంమీద ప్రకాశిస్తున్నాడు. అప్పుడు అందరు దేవతలు అయనకు నమస్కారంచేసి ఓపరమాత్మా! బ్రహ్మదేవుడు చెప్పినట్లు చేయ వలసిందిగా ప్రార్థించారు.

శంకరుడు తప్పక జరుగవలసినకార్యమునుబట్టి శస్త్రాస్త్రాలతో సిద్ధమై దేవతలను కూడా త్వరగా మారమని చెప్పాడు. దేతలు, కవచాలు ధరించి రథాలపై కూర్చుని ప్రజ్వలిస్తున్న అగ్నులవలె ప్రకాశించారు. రుద్రగణంకూడా శస్త్రాస్త్రములను కిరీటమును ధరించారు. కావలసినరూపం ధరించగల విశ్వేదేవ గణముకూడా శస్త్రాస్త్రములను ధరించారు. భగవంతుడు దేవసేనతో చుట్టబడి ధనుర్బాణాలు ధరించి త్రిపురాసురునితో యుద్ధంచేయటానికి సిద్ధమయ్యాడు. శంకరుని బాణవర్షంచేత మిక్కిలి దెబ్బతిని దైత్యగణం క్రిందపడుతోంది. ఆసమయంలో దేవతలలో ఒక ఖడ్గంతో, మరొకడు చక్రంతో బాణాలతో గొడ్డలితో రక్షసులను బాధిస్తున్నారు. శస్త్రాస్త్రముల దెబ్బలకు రాక్షసులు పర్వతాల్లా నేలమీద పడసాగారు. దేవతల తేజస్సుచే దైత్యులు ఒక్కసారిగా స్మృతిలేని వాళ్ళయ్యారు. మెల్లమెల్లగా సంధ్యాకాలమయింది. దేవతలలో ఒకడిముఖం ఛేదింపబడింది ఇంకొకనికి శరీరం చీల్చబడింది. రాత్రికాగానే దైత్యగణం విజయం పొందుతూ జయధ్వని చేయ మొదలుపెట్టారు. అప్పుడు రాక్షసులు "మనపరాక్రమానికి మనఅస్త్రబలానికీ దేవతలు భయపడ్డారు" అనుకొన్నారు.

శంకరుడు రథమెక్కి దేవతలతో కూడా గర్వించిన రాక్షసులను తగలబెట్టుచూ ప్రళయకాల సూర్యునివలె ప్రకాశించాడు. ఆకాశమందలి పిడుగులు శంకరుని ప్రోత్సం

చేశారు. తరువాత దైత్యులుదానవులు శివునిపై బాణవర్షం కురిపించారు. శతఘ్నులు మొదలైన ఆయుధాలతో దానవులు గొప్పయుద్ధంచేవారు. గదను గదలతో, బాణాలను బాణాలతో భేదించారు. అస్త్రాలను అస్త్రాలతో మాయను మాయలతోనూ ఖండించారు. బాణవర్షంచేత బాధింపబడి దేవతలు నిశ్చేష్టులుగా నిలిచారు. శివుని విశాలమైన రథము కదలలేదు. ఇంద్రుడు ఒక్కడే శస్త్రాస్త్రాలతో యుద్ధభూమి యందున్నాడు. శివునిఎదుట ఇంద్రునిరథం కదలకుండా పిలిచి పోయింది. అని ఋషులముఖంనుండి పలుకబడింది. చెట్లుపడిపోయాయి, సముద్రాలు కల్లోలమయ్యాయి. అప్పుడు మహాయోగి విష్ణుభగవానుడు వృషభరూపాన్ని ధరించి దేవతలతో కూడి రథాన్ని కదలించాడు. పెద్దగా ధ్వనిచేశాడు. ఆధ్వనికి రాక్షసులు భయపడి మరలయుద్ధానికి సిద్ధమయ్యారు. వాళ్ళు దేవసేనమమర్దిస్తూ ధనుస్సుల నెక్కుపెట్టారు. శంకరుడు తనధనుస్సుపై బ్రహ్మాస్త్రాన్ని, అగ్నిబాణాన్ని బ్రహ్మదండాన్ని సంధించి దైత్యపురంమీది విడిచిపెట్టాడు. ఆమూడుబాణాలు తగలటంతో త్రిపురం కోటిముక్కలైపోయింది. మూడునగరాలతో పాటు గోపురాలు శిథిలమయ్యాయి. శంకరుని బ్రహ్మాస్త్రంచేత అన్నీ తగులబడి పోయాయి. త్రిపురములు నశించగా దేవతలు సంతోషంతో పొంగిపోయారు. బ్రహ్మతో సమానులైన ఋషులు శంకరుడూ విష్ణువే మహాయోగిఅని స్తోత్రంచేశారు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో
త్రిపుర కథ కృత్తివ్రతము అను నూటముప్పైనాల్గవ అధ్యాయము

☆☆☆

# నూటముప్పై ఐదవ అధ్యాయము

## హరివంశానుక్రమణిక

వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజా! ఈహరివంశంలో వర్ణించబడిన వృత్తాంతాలక్రమము చెపుతున్నా విను! మొట్టమొదట ఆదిసృష్టి, తరువాత భూతసృష్టి, తరువాత పృథూ పాఖ్యానము, చతుర్దశమనువులు, వైవస్వతకులోత్పత్తి, ధుంధుమారకథ వర్ణింపబడ్డాయి.తరువాత గాలవోత్పత్తి, ఇక్ష్వాకు వంశవర్ణన, పితృకల్పము, చంద్రబుధులపుట్టుక, అమావసు, క్షత్రవృద్ధుల వంశవర్ణన, ఇంద్రమాహాత్మ్యం, దివోదాసత్రిశంకువులస్థితి, యయాతి చరిత పురువంశాలవర్ణన, తరువాత కృష్ణజన్మ, స్యమంతకమణి ఉత్పత్తి, విష్ణు భగవానుని అంశావతార సంక్షిప్తకథ, తరువాత తారకామయయుద్ధం, బ్రహ్మలోక

వర్ణన, భగవంతుడైన విష్ణువు యోగనిద్ర నుండి లేచుట, విష్ణుబ్రహ్మల సంభాషణ, దేవతల అంశావతారము, భూదేవి దుఃఖం, నారదుని మాట, స్వప్నంలో గర్భవిధాన, వృత్తాంతం చెప్పుట.

ఆర్యాస్తవము, విశేషించి కృష్ణునిజన్మనుచెప్పుట, శ్రీకృష్ణుడు వ్రజమునకు వెళ్ళుట, శకటభంగం, పూతనావధ, యమలార్జున భంజనం, వృకసందర్శనం, బృందావనంలో నివాసము, వర్షావర్ణన, యమునాహ్రాద దర్శనం, కాళీయమర్దనం, ధేనుకాసురవధ, ప్రలంబవధ, శరద్వర్ణనం గోవర్ధనపూజ, గోవర్ధనధారణ, గోవిందునికి అభిషేకము, గోపికలతోక్రీడ, అరిష్టాసురవధ, అక్రూరప్రేరణ, అంధ కవచనము, కేశివధ, అక్రూరుడు తిరిగివచ్చుట, నాగలోక దర్శనవర్ణన, ధనుర్భంగం, కంసవాక్యం, కువలయాపీడవధ, బాణూరాంధ్రక వినాశము, కంసవధ, కంసపత్నీ విలాపము, ఉగ్రసేనాభిషేకము, యాదవులనూరడించుట కృష్ణబలరాములు గురు కులమునుండి వచ్చుట, జరాసంధుడు మధురాపురాన్ని ఆక్రమించుట తిరిగి వెళ్ళుట, తరువాత విక్రదునిమాట, గోమంతారోహణ, బలరామదర్శనము, జరా సందుడువెళ్ళుట, గోమంతపర్వతము తగలబడుట కరవీరపురగమనము, శృగాల వధ, మధురనుండి ప్రయాణం యమున నాకర్షించుట, కాలయవనవినాశం, ద్వారకాపురనిర్మాణం, రుక్మిణీహరణము, రుక్మిణీవివాహం, రుక్మివధ, బల దేవ దినచర్య, బలదేవమహాత్మ్యం, నరకవధ, పాంజాతాపహరణం, ద్వారకాపుర నిర్మాణం, భగవంతుడు ద్వారకసుధర్మసలభలో ప్రవేశించుట. నారదవచనము, వృష్ణివంశవర్ణన, షట్పురవధ, అంధకాసురవధ, శ్రీకృష్ణుని సముద్రయాత్ర, అయవ జలవిహారం, యాదవులమద్యపానం, శ్రీకృష్ణుడు ఛాతిగాంధర్వ గీతముల వర్ణించుట భానుమతి నపహరించుట, శంబరసురవినాశము, ధవ్యోపాఖ్యానం, వాసుదేవమాహాత్మ్యం, బాణాసురయుద్ధం, భవిష్యమునుచెప్పుట, పుష్కరవృత్తాంత వర్ణనం, వారహ, నృసింహ, వామనావతారములకథ, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, పౌండ్రక వధ, హంసండింభకులవధ, త్రిపురసంహారకథ, మహారాజా! ఎవడు ఏకాగ్రమైన మనస్సుతో సాయంప్రాతఃకాలాలతో ధన్యములు, యశస్కరములు భోగమోక్షప్రదములైన ఈవిషయాలనువింటాడో, అతని ఇహలోకవాంఛలన్నీ పూర్తవుతాయి, చివరకు విష్ణుభగవానుని వైకుంఠస్థానాన్ని పొందుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యపర్వములో

హరివంశానుక్రమణిక అనుమున్నైదవ అధ్యాయం

☆☆☆

# నూటముప్పైఆరవ అధ్యాయము

## ఈ గ్రంథం వినుటవలని ఫలితము

జనమేజయుడు బ్రాహ్మణోత్తమా! హరివంశపురాణాన్ని విన్నందువల్ల ఫల మేమిటి? ఎందానంచెయ్యాలి, చెప్పవలసిందని అడిగాడు. వైశంపాయనుడిలా చెప్పాడు.

మహారాజ! సూర్యోదయం వల్ల మంచు నశించినట్లు హరివంశం విన్నందు వల్ల శారీరకవాచిక మానసికములైన సమస్తపాపాలూ ఒక్కసారిగా నశించిపోతాయి. పద్దెనిమిది పురాణాలు విన్నందువల్ల కలిగేఫలము హరివంశం వినటంవల్ల కలుగు తుంది. శ్లోకపాదం, శ్లోకార్ధమైనా హరివంశంలోనిది వింటే విష్ణువుస్థానం ప్రాప్తిస్తుంది. కలియుగంలో యధార్థమైన వినేవాడు దొరకటంకష్టము. పుత్రుడుకావాలనుకునే వాళ్ళు హరివంశం తప్పకవినాలి, ఏదైనాకోరిక పూర్తికావాలంటే హరివంశం విన్న తర్వాత కథ చెప్పినవారికి మూడుబంగారు ముద్రలూ లేదా యధాశక్తిగా ధనదానం చెయ్యాలి. వస్త్రంతోకప్పి బంగారు కొమ్ములతో శోభించే కపిలగోవును దూడతో కూడ చివరకథ చెప్పినవాడికి ఇవ్వటం అవసరం. ఇలాచేస్తే వినేవాడికి శుభం కలుగుతుంది. హరివంశ పారాయణచివర చెవులకుండలాలు తప్పకఇయ్యాలి. హస్తభూషణము వస్త్రదానం శుభప్రదమైనది. హరివంశంవిన్న తరువాత భూదానం చేయటంకూడ ప్రశంసింపదగినది. హరి వంశకథను విన్నవాడు పాపవిముక్తుడై చివర విష్ణులోకాన్ని పొందుతాడు. అతని సంతానం మనుమలుకూడ మోక్షాన్ని పొందుతారు. విన్నవాడు పదవవంతు హోమం చెయ్యాలి. మహారాజ! ఈవిధంగా నీకుసమస్తమూ చెప్పాను, దీన్నివినటంవల్ల పాపాలన్నీ పోతాయి, పుత్రులులేనివాడైతే పుత్రవంతుడు ధనహీనుడు ధనవంతుడుకాగలడు. అశ్వమేధయాగఫలం ప్రాప్తిస్తుంది. బ్రహహత్య భ్రూణహత్య, మద్యపానం, గోహత్య గురుపత్నీసంగమం, వంటిపాపాలుకూడా నిశ్చలమనస్సుతో హరివంశపురాణం వినటంవల్లనశిస్తాయి, మహారాజ! ఈవిధంగా నేను మీకు మిక్కిలి ఆశ్చర్యకరమైన మిక్కిగొప్పదైన శ్రీకృష్ణునిమాహాత్మ్యం చెప్పాను. దీన్ని చదవటంవల్ల వినడంవల్ల సంసారి దేనిచేతనూ పొందరానివస్తువునుకూడా శ్రమలేకుండా పొందగలుగుతాడు.

ఇది శ్రీమహాభారతంలో హరివంశమందలి భవిష్యత్పర్వములో
ఈ గ్రంథం వినుటవలని ఫలితము అనునూటముప్పైఆరవ అధ్యాయము

☆☆☆

గ్రంథం పూర్తియైనది.